శ్రీ

# వేణీసంహారనాటకము.

1895 వ సం॥ ప్రథమశాస్త్రపరీక్షకును, 1901 వ సం॥ పట్టపరీక్షకును

పఠనీయముగా నిర్ణయింపఁబడినది.

ఇది

భట్టనారాయణకవికృతమైనసంస్కృతనాటకమునుండి

రాజమహేంద్రవరమునందలి రాజకీయ కళాశాలయందు

నాంధ్రపండితు లగు


వడ్డాది సుబ్బారాయకవిచేఁ


తెలిఁగింపఁబడినది.


రాజమహేంద్రవరము

వడ్డాది సుబ్బారాయఁడుగారి యుత్తరువు ప్రకారము,

రాజమండ్రి బుక్కుసెల్లరు,

కర్రా అచ్చయ్య అండ్ సన్సువారిచే

ప్రకటింపఁబడినది.

అయిదవ కూర్పు 2000 ప్రతులు.

రాజమహేంద్రవరము

నిడమర్తి వెంకటకృష్ణమూర్తి అండు బ్రదరు వారిచే

శ్రీ కృష్ణాముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1924.




[వెల రు ౧—౦—౦.

# వడ్డాది సుబ్బారాయకవివికృతగ్రంథమాల.

పుస్తకభాండాగారములను స్థాపించినవారల కెల్లరకు మాయొద్దనుండిన గ్రంథము లన్నియు ఒకసారి పుచ్చుకొన్నయెడల సగమువెలకే ఇయ్యఁబడును. కొన్ని మాత్రమే కావలసినయెడల వెలపూర్తిగా నియ్యవలెను.

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| 1. అభిజ్ఞానశాకుంతలము. (లఘుటీకాతాత్పర్యవిమర్శసహితము) | 1 | 0 | 0 |
| 2. వేణీసంహారనాటకము. (F. A. text for 1895 and B. A. text 1901) | 1 | 0 | 0 |
| 3. మల్లికామారుతప్రకరణము. (శృంగారరసప్రధాననాటకము M. A. text for 1912) | 1 | 0 | 0 |
| 4. ప్రబోధచంద్రోదయనాటకము. (శాంతరసప్రధానము) | 0 | 10 | 0 |
| 5. చండకౌశికనాటకము. (హరిశ్చంద్రకథ) (B. A. text for 1903) | 0 | 8 | 0 |
| 6. విక్రమోర్వశీయనాటకము. (శృంగారరసప్రధానము) | 0 | 8 | 0 |
| 7. సూక్తిసుప్రకాశకము. లోకదృష్టాంతసమన్వితనీతిపద్యగ్రంథము) | 0 | 12 | 0 |
| 8. సుగుణప్రదర్శకము. (నీతిపద్యగ్రంథము) | 0 | 4 | 0 |
| 9. భక్తచింతామణి. (పండితభక్తమనోహరము) | 0 | 5 | 0 |
| డిటో (క్యాలికోబైండు) | 0 | 10 | 0 |
| డిటో (అట్టబైండు) | 0 | 8 | 0 |
| 10. భగవత్కీర్తనలు. (కొత్తకూర్పు, భక్తజనమనోహరము) | 0 | 1 | 0 |
| 11. నందనందనశతకము. (రెండవకూర్పు, విష్ణుభక్తానందకరము) | 0 | 2 | 0 |
| 12. దైవభక్త్యుపన్యాసము. ... ... ... | 0 | 3 | 0 |
| 13. ఆంధ్రమేఘసందేశము. (విప్రలంభశృంగారవర్ణనము) | 0 | 5 | 0 |
| 14. సూర్యశతకము. మయూరకవివిరచితమునకుఁ దెలుఁగుమూలసహితము | 0 | 6 | 0 |
| 15. భామినీవిలాసము. (పండితరాయవిరచితమునకుఁ దెలుఁగు) | 0 | 10 | 0 |
| 16. సుమనోమనోజ్ఞము. 3 భాగములు కలసి యున్నది. | 1 | 0 | 0 |
| 17. సతీస్మృతి. (కరుణరసభూయిష్ఠము) | 0 | 4 | 0 |
| 18. సుతస్మృతి. కృష్ణాయాపదుద్ధారకా యనుశతకపద్యములతో. | 0 | 4 | 0 |
| 19. గౌతమీమహాజలమహిమానువర్ణనము (రెండవకూర్పు) | 0 | 2 | 0 |
| 20. విశ్వరూప. నృసింహ. స్తవద్వయము. | 0 | 2 | 0 |

శ్రీ

# వేణీసంహారనాటకము.





## ఇష్టదేవతాప్రశంసనాదికము.

శ్రీలీలాపరతంత్రుఁడై, గ్రహావిరాజివ్యోమ మణీకాచదీ
పాళీదీప్తవితానమై పొసఁగువిశ్వాగారరంగంబునన్,
హేలిం జంగమపాత్రవర్గములు నానావేషనానారసో
ద్వేలస్ఫూర్తి నటింప హేతు వగు సేవే, ల్పాతనిం గొల్చెదన్.

ఉ. భౌతిక మైనయట్టిక్షణభంగురకాయము హేయ మంచు, సం
ప్రీతిని వాఙ్మయాక్షరశరీరముతోడ నశేషదేశముల్
ఖ్యాతిఁ జరించుచున్, వివిధకల్పనలన్ హితబోధ సేయుచున్,
నీతికి మూల మై వసుధ నిల్చినసత్కవులం దలంచెదన్. ౨

చ. వినియెడువారికే కనెడువేడ్క యొనర్చెడుభారతార్థముల్,
గనుఁగొన నబ్బెనేని మదిఁ గల్గెడుప్రీతికి మేర యున్నదే?
యని తలపోసి తచ్చరిత మచ్చుపడంగను నాటకంబుగాఁ
బొనరిచి నేఁ గృతార్థతను బొందెదఁ గాకని యున్నయత్తఱిన్. ౩

వ. మదీయసహకారుం డగుచేవలి సోమయార్యుం డేగుదెంచి.

ఉ. భారత మన్న నీకుఁ గడుపక్షము; ము న్వచనంపుఁగావ్యముం
గా రచియించినాఁడ; వది క్రమ్మఱ నిప్పుడు నాటకంబుగాఁ
గూరుతు నంటి మే; లయినఁ, గ్రొత్తగఁ జేయుటకంటె వేణిసం
హారము తెల్గుసేయు మది నైకరసాస్పద మేఁ బఠించితిన్. ౪

క. అనుటయు నాజతనంబున
కనుకూలమె యిది 'యటంచు, నాగ్రంథంబుం
దెలిఁగింపఁ దలఁచి యుండం
గను. నాకస్మికము రాజకార్యముమీఁదన్. ౫

సీ. శ్రీమహాలక్ష్మీపరిగ్రహవత్ముండు వాడ్రేవుకులపయోవార్ధివిష్ణుఁ,
డమలకస్తూరివంశాంభోధిచంద్రుండు దర్పితపరచక్రతాపకరుఁడు,
పటుతరాజ్ఞారూఢిభాస్కరతనయుండు పరనిజకార్యనిర్వాహణధుర్యుఁ,
డాశ్రితపోషణాయత్తచిత్తాబ్జుండు ప్రాంచితనారసింహాహ్వయుండు,

సరససంగీతసాహిత్యభరతనిరతుఁ,
డర్థిజనకల్పవల్లి రంగాంబయల్లుఁ,
డఖిలవిద్యానిధిస్థాన మైనరాణ్మ
హేంద్రిపురి వచ్చి నన్ను వీక్షింప వచ్చి. ౭

వ. సముచితసత్కారంబు లంగీకరించి మదీయమనోగతం బెఱింగించిన సంతసించి.

ఉ. చిన్నటనాఁటనుండి మనచేసెడు నెయ్యముదోసమో, నిజం
బున్నదొ యిందు నే నెఱుఁగ; నోప్రియమిత్రుఁడ ! సుబ్బరాయ ! నీ
వున్నతిఁ జేయుకావ్యము లనూనసుధాలహరీసమంబు లౌ
చున్నవి నామనంబునకు; నొప్పులకుప్పలు నీదుకబ్బముల్. ౮

శా. మాతోడల్లుఁడు సుందరావ్యయుఁడు యుష్మన్మేఘసందేశముల్
జేతోమోద మెలర్ప ముద్రితముగాఁ జేసెం గదా ముల్ ; భవ
చ్ఛాతుర్యంబున నిష్టానర్పఁగలదృశ్యంపుంబ్రిబంధం బెటుల్
ద్యోతింపం, బనిపూని హెచ్చరిక నచ్చొత్తింతు నే మిత్రిమా. ౯

తే. గీ. మఱియు దీనిప్రయోగంబు తెలుఁగుఁ జూడ
నాకు వేడుక పొడముచున్నది వయస్య !
త్వరగ రచియింపు; దానికి వలయు తెరలు
మొదలుగా సిద్ధపఱుచు చుండెదను నేను. ౯

తే. గీ. కొంచెమైనను నాకుఁ దెల్గునను గావ్య
పరిచయముకల్మి నీశిక్షపటిమఁ గాదె?
బంధుగురుమిత్రిభావముల్ పొదుకొన్న
వసతి వీ, విట నానెన రసదె? సఖుఁడ ! ౧౦

వ. అని యనేకప్రికారంబుల నపారస్నేహపారవశ్యంబు నౌదార్యంబు నాత్మస్యం
బునుం దేటపడం బలికి వేగిరించిన.

ఆ. వె. అదన గురియువాన కారంభమట్లు, నా
యనుఁగువచనములకు నంతరంగ
మందుఁ గోర్కి పొదల, నానందమునఁ దేలి
గ్రింథరచన కేను గడఁగినాఁడ. ౧౧

వడ్డాది-సుబ్బారాయఁడు.

# పీఠిక.

వేణీసంహారమను నీనాటకము భారతకథ ననుసరించి భట్టనారాయణుఁ డనుకవి గీర్వాణభాషయందు రచియించినాఁడు. ఇది రౌద్రరసప్రధానంబైనను అద్భుతరసాశ్రయం బని చెప్పఁదగి యున్నది. దీనికిఁ గథానాయకుఁడు పార్థమధ్యముఁడు భీమసేనుఁడు. ఆదిపంచక యుద్ధపంచకములకథ యీనాటకమందలి యాఱంకములలోను సంగ్రహముగాఁ దెలియవచ్చును. భారతకథాపరిచయము కొంచెమయిన నుండకపోయిన దీనియందలి కథాసందర్భములు చక్కఁగా బోధపడవు. ధృతరాష్ట్రుఁడుఁ బాండురాజు నని యిద్దఱన్నదమ్ములు. వీరిలోఁ బ్రథముఁ డంధుఁడు. అతనికి గాంధారి యనుభార్యయందు నూర్వురు కొమరులు నొక కొమార్తెయుఁ గలిగిరి. అందగ్రజుఁడు దుర్యోధనుఁడు; ద్వితీయుఁడు దుశ్శాసనుఁడు; కొమార్తె దుస్సలం పాండురాజునకుఁ గుంతియు మాద్రియు నని యిరువురు భార్యలు. యుధిష్ఠిరుఁడు భీముఁడు నర్జునుఁడు నని కుంతికి మువ్వురును, నకులుఁడు సహదేవుఁడు నని మాద్రికి నిద్దఱును గుమారులు. వీరేవ్వురును దేవతాంశసంభూతులు. ఇందుఁ గనిష్ఠు లిరువురును గవలు.

ఒక కాలమునఁ బాండురాజు వేటకుఁబోయి, యయ్యడవిలో లేడులయి క్రీడించెడుమునిదంపతుల, నెఱుంగక తనయమ్మునకుం గుఱి యొనర్చుటంజేసి, యుసురు దొఱఁగుచు నందు ఋషి యొసంగినశాపంబున మరల నింటికిఁ బోక, యక్కడనే వానప్రస్థుం డయి యుండి. కొండొకకాలంబునకు మరణించినఁ, జిన్నభార్య యగుమాద్రి యాతనితో సహగమనముఁ జేసెను. అనంతరము కుంతిని గుమారుల నేవ్వరను నచ్చటిమునిశ్రేష్ఠులు హస్తిపురంబునకుఁ దీసికొని వచ్చి, ధృతరాష్ట్రున కప్పగించి పోయిరి. ఆధృతరాష్ట్రుండును దన కరణ్యంబునుండి నూడిద దెచ్చినసింహడింభకంబులుం బోలె నున్నతనతమ్మునిబిడ్డల నత్యాదరంబునం బోషించుచుండ, దుష్టుండగు దుర్యోధనుం డోర్వలేక, రాజ్యలోభంబున వారి నెట్లయిన రహస్యంబుగాఁ జంప వలయు నని బహువిధంబులఁ బ్రయత్నించి, యాప్రయత్నము లేవియుఁ గొనసాగ నందున, ధృతరాష్ట్రునిచే యౌవరాజ్యాభిషిక్తుం డయి రాజసూయయాగంబుఁ జేసి యింద్రప్రస్థపురంబున నింద్రభోగంబుతో సుఖం బున్నధర్మరాజు ననుజసహితు, నుపాయాంతరంబునఁ జెఱుపవలయు నని, తనతండ్రిచే హస్తిపురంబునకుఁ బిలిపించి, యాతనిం దనతో జూదమాడం బురికొలిపి, తన మేనమామ శకుని గొనితెచ్చిన మాయపాచికలతోఁ దదీయసర్వస్వంబు నోడుచుకొనుటయ కాక పాండవపత్ని యగుద్రౌపదిని తనతమ్ముఁ డయినదుశ్శాసనునిచే నీడ్పించి కొలువులోనికిఁ దెప్పించి, యచ్చో నామెకట్టుబట్టను విప్పించెను.

ఇట్టు లవమానకరముగాఁ బాండవులను వారి సర్వధనములతోడను గెలుచుకొని, యంతతో నయినఁ దృప్తి నొందక, దుర్యోధనుఁడు ధర్మరాజున కింకను జూదంబునం దాస పుట్టునట్లు "అన్నా! మన మింకొక పందెము వేయుదము. అది నీవు గెలిచితివేని నే నీవఱలో గెలుచుకొన్న దంతయు నీకు వదలి వేసెదను. ఓడితివేని ద్రౌపదితోడను దమ్ములతోడను నీవు పండ్రెండేఁడులు వనవాసంబు నొక్కయేఁ డజ్ఞాతవాసంబుఁ జేయవలయును." అని చెప్పి యొప్పించి, మాయజూదమున నాపందెమును దానె గెలుచుకొని, పాండవుల నేవుర భార్యాసహితంబుగాఁ బురంబు వెడల నడిచెను. అమాయికులగు నప్పాండవులును బలుబాధలకు లోనయి, దైవసాహాయ్యమునఁ దత్సమయంబును నిర్వహించి మరల వచ్చిరి.

ప్రథమాంకములోఁ "గౌరవులు స్వప్నస్థు లయ్యెదరు" మని సూత్రధారుఁడు పలికిన నప్పుడును, "అన్నయ్యా! మీ రీలాగునఁ దీండ్రపడుచుండిన మనయన్నగారు ఖేదపడుదురు గదా!" యని సహదేవుఁడు తన్ననునయించునప్పుడును, వరుసగా భీమసేనుఁడు చదివెడు నీక్రింది రెండుపద్యములవలనను బూర్వోక్త మగు దుర్యోధన దౌర్జన్య మంతయు వెల్లడి యగును.—

చ. ఖలు లయి నాఁడు లక్కయిలు గాల్చి, విషాన్నము పెట్టి, జూదపుం
గొలువు ప్రవేశపెట్టి, మముఁ గ్రూరత జీవధనంబులందుఁ బే
దల నొనరించి, చాల కది, ద్రౌపదిఁ గొప్పును బట్టి యీడ్చి, చీ
రలు సభ నొల్చినట్టిధృతరాష్ట్రజు లేఁ గలుగంగ స్వప్నస్థులే? ౧.

చ. అలసభ నట్టులైన ద్రుపదాత్మజఁ గాంచి, యరణ్యమందు వ
ల్కలధరులై కిరాతులబలంగముతోఁ జరకాల ముండి, య
న్యుల నతిహీనతన్ విరటుపాల వసించియు నేఁ గృశింపఁగాఁ,
గలుగదు ఖేద మాయనకుఁ; గౌరవు లన్నను గల్గు నిప్పుడున్. ౨.

ద్రౌపదిని దుశ్శాసనుఁడు సభ కీడ్చుకొని వచ్చినప్పు డామె కొప్పంతయు విడిపోయి నందునఁ, దన్నట్టు లవమానపఱచినఖలులు గడతేఱువఱకును దాను మరలఁ గొప్పు పెట్టుకో నని యామానిని ప్రతిజ్ఞ పట్టెను. సభలోఁ దన కన్నులయెదుర ద్రౌపదికి మానభంగము గావించినదుశ్శాసనుని వానిబంధువులు చూచుచుండ గుండెలు ప్రీల్చి నెత్తురు ద్రావెద ననియు, నాసమయమున విలాసముగాఁ గరతలంబున నూరువు నఱచుకొనుచు నామె యవమానమునకు సంతసించిన సుయోధనునిఁ దనగదచే నూరువుల విఱుగఁగొట్టి [illegible] ధనసోదరుల నెల్ల

యుద్ధములోఁ దా నొక్కరుండ సంహరించెద ననియు నప్పటికోపావేశంబున భీమసేనుండును బ్రతిజ్ఞ చేసెను.

ఈసంగతి యిట్లుండఁగా, నట్లు పదుమూఁడేఁడులును సమయపరిపాలనము చేసి వచ్చినయుధిష్ఠిరుండు గ్రాసవాసోదైన్యంబు రాకుండునట్లు తమసోదరు లేవురకు నేనూళు లిమ్మని శ్రీకృష్ణునిచే దుర్యోధను నడిగించెను. కాని యీసంధివచనము భీమసేనునికిఁ గేవల మసమ్మతము. ఈక్రింది భీమునిపద్యమువలన నయ్యంశము స్పష్టపడుచున్నది.

ఉ. తల్లడ మందఁ గౌరవశతంబును బట్టి యనిన్ మథింపనా?
ప్రల్లదు దుస్ససేనురుధిరంబు నురంబును వ్రచ్చి త్రావనా?
పెల్లు మనన్ సుయోధనుని పెందొడలం గద నుగ్గు సేయనా?
యూళ్ళయిదింటితో నపతి యొప్పఁగఁ జేసెడుఁ గాక సంధులన్. ౧౫

కృష్ణునిరాయబారము జరుగుదినములలో నొకనాఁడు దుర్యోధనపత్ని యయిన భానుమతి ద్రౌపదిని జూచి "యోసీ! నీమగ లయిదుగురు నయిదూళ్లు తమ కిమ్మని నమ్మడుగుకొనుచున్నారు. నీ వీపాటికిఁ గొప్పు వెట్టుకో వచ్చు" నని మహాగర్వమున నుల్లస మాడెను. ఆమాట తనకు హృదయశల్య మయి బాధించినందున దుఃఖించుచుఁ, బాంచాలి భీమసేనున కాసంగతి నెఱింగించిన, నతఁడు మండిపడి "నీవు సంధి యగు నని బెంగపెట్టుకొనకుము. సుయోధనుని వధించి, వానిరక్తమునఁ దడిసినచేతులతో నీకురులు ముడిచి కొప్పు వెట్టెద" నని ప్రతిజ్ఞాపూర్వకముగ ద్రౌపది నాశ్వాసించెను. దానంజేసియే దీనికి వేణీసంహార మని పేరు గలిగినది. ఈపేరికి జడ ముడుచుట యని యర్థము. అట్లు ద్రౌపది నాశ్వాసించిన భీమసేనుండు, తనప్రతినకుఁ దోడు కృష్ణుండు సుయోధనుచేఁ దిరస్కృతుం డయి చక్కవచ్చె నని తెలియవచ్చినందున, బుజాలు మూఁడుగాఁ బొంగి, సంగరరంగంబునకుఁ బోవ ద్రోపదిని వీడుకొనియెను.

ఇట్లు పాండవులు యుద్ధసన్నద్ధు లయినట్లు మొదటియంకములోఁ దెలిపి, రెండవ యంకమున ముఖ్యముగా దుర్యోధనపరాజయసూచకము లగుదుర్నిమిత్తములను గవి వర్ణించినాఁడు. ఆదుర్నిమిత్తములలో మొట్టమొదటిది భానుమతీస్వప్నము. నూఱు పాముల నొకముంగిస సంహరించినట్లు కలలో నామె చూచినందున, భీమునిప్రతిజ్ఞ స్మరణకు వచ్చి, యక్కీడు పరిహరించుకొనుటకు నుదయకాలమున భానుమతి భాస్కరాది దేవతల నారాధించుచుండ, దుర్యోధనుండు కామాతురుం డయి వచ్చి బలవంతముగా నామెనీమమునకు భంగము గలిగించినాఁడు, ఈపట్టునఁ బరిహాసాస్పదము లగుసుయోధనునయోగ్యగుణము గూడఁ దేటపడి, వాఁడిఁక రాజ్యలక్ష్మీకటాక్షవీక్షణమునకు

లేశమును శాస్త్రుఁడు కాఁడనునంశము దృఢపఱుచును. అనంతర మొకమహావాయువు వీచినందున, దానిబాధకుఁ దప్పుకొన దుర్యోధనుఁడు భార్యాసహితముగా నొకదారుపర్వతప్రాసాదము నారోహించి, యక్కడ ననాస్తరణమైనకఱకుఱాతి సేలను గూరుచుండఁబోవుభానుమతితో మహానురాగమున నిట్లు పలికెను.

తే. జిలుఁగుఁబుట్టంబు గాలికిఁ జెదర, నాకుఁ। గనులపండువు సేయు నీఘనజఘనము*
వలపదే గారవింప నావలువ యెగయ। నువిద! నీచూపుఁదనుపునాయూరుయుగము‡

అనునప్పు డాకస్మికముగా నొకకంచుకి వచ్చి పైమాటతోఁ గలిసిపోవునట్లుగా "దేవా! భగ్నమైనది. భగ్నమైనది" యని వచియించెను. ఆకంచుకి యప్పుడు వీచిన పెనుగాలిచే రథధ్వజము భగ్నమైన దని సుయోధనుతోఁ జెప్పవచ్చినవాఁడు. అయినను నీవాక్యసందర్భమున, ఊరుయుగము భగ్నమయినది యను నొక యమంగళార్థము శ్రోతలకు స్ఫురించుచున్నది. మేలుగాని కీడుగాని రాఁబోవునప్పుడు మానవులకు దైవికముగా నిన్నివిధములఁ దత్తత్సూచన మగు ననుటయే యిందలియాశయము. అట్లువాఁడు దారుపర్వతప్రాసాదమున నుండఁగా దుస్సలయును దానియత్తయును రోదనము చేయుచు వచ్చి కురునాథా! రక్షింపుము రక్షింపు మని వానికాళ్లమీఁదఁ బడిరి. తాను దగ్గఱ లేనప్పుడు తన పుత్త్రుఁ డభిమన్యుఁడు ద్రోణాచార్యులు పన్నినపద్మవ్యూహములో సాహసంబునం బ్రవేశింప. వానికి సహాయులుగాఁ బోయెడుభీమాదుల సేనాముఖంబున నాఁగి, తన్మూలముగా నాతనిమృతికి హేతువైన సైంధవుని "నెల్లి ప్రొద్దు గ్రుఁకకమున్న సంహరించెద" నని నాఁటిరేయి యర్జునుఁడు పట్టినబెట్టిదపుఁ బ్రతిన వలన వారి కట్టియార్తి పుట్టినది. ఈసింధురాజు దుస్సలకుఁ బెనిమిటి; కాఁబట్టి సోదరీమాంగల్యసంరక్షణార్థము భానుమతిని వీడుకొని, సుయోధనుఁ డాయోధనంబునకుఁ బోయెను, ఇంతటితో ద్వితీయాంకము ముగియును.

మూఁడవది యశ్వత్థామాంకము. ఇందు ముందుగాఁ బ్రవేశించెడు రాక్షసదంపతుల సంభాషణమువలన. యుద్ధములో నంతకముందు చనిపోయిన రాజులపేరులును, రణరంగము బీభత్సస్థితియును దెలియవచ్చును. తరువాత సేనలోఁ బొడమిన మహాకలకలమునకుఁ గారణ మారయుచు నశ్వత్థామ యాహవమునఁ బ్రవేశించును. అతనితండ్రియు నప్పటికౌరవసేనానియు నగుద్రోణుం 'డశ్వత్థామ చచ్చె నేనుఁ'' గని కారణాంతరమున యుధిష్ఠిరుఁడు పలికినమాటలో, నేనుఁ గన్నది వినక, శేషవాక్యశ్రవణమువలనఁ దన కుమారుఁడు చచ్చెనని భావించి, పుత్త్రవాత్సల్యమున నస్త్రపరిత్యాగముఁ జేసి, ప్రాయోపవేశమున దేహంబుఁ జాలించువాఁడై యుండఁ, బాండవ

* ఇది కర్తృపదము. ‡ ఇది కర్మపదము.

సేనాధిపతి యగుధృష్టద్యుమ్నుఁడు జుట్టుఁ బట్టుకొని యవమానకరముగాఁ దదీయ కంఠనాళ ఖండనంబు గావించెను. ముందు నడిచిన సేనాక్షోభమున కిదియె కారణము. ఈసమాచార మామూలాగ్రముగాఁ దనతండ్రిగారి సూతునివలనను, దన మేనమామ యగు కృపాచార్యులవలనను. గ్రమక్రమముగాఁ దెలిసికొని, బహువిధముల విలపించి, యనేకము లగుప్రతాపోక్తులు పలికి, తుదకు మాతులప్రార్థనంబున "సేనాధిపత్యము నొంది పగదీర్చుకొందు" నని, కృపాచార్యసహితముగా దుర్యోధను సన్నిధికి బయలుదేరెను. అప్పుడా రారాజుతోఁ, బ్రియమిత్రుఁ డగు కర్ణుఁడు లేనిపోనిమాటలు కల్పించి చెప్పి, యాతనిమదిలోని ద్రోణపక్షపాతమును బోఁగొట్టుచుండెను. ఈసమయములో నశ్వత్థామయుఁ గలిసికొని. యప్పుడు ప్రాసంగికప్రసంగమును బట్టి రాధేయునితోఁ దనకు మహాకలహము సంభవించినందున, వాఁడు చచ్చువఱకును యుద్ధము చేయకుండునట్లు శపథముచేసి, తా నస్త్రంబును బరిత్యజించెను. ఇట్లస్త్రపరిత్యాగము భీష్మునిమీఁదికోపమునఁ గర్ణుఁడు గావించినట్లు మహాభారతమున నున్నది. కౌరవయోధుల యైకమత్యాభావము సూచించుట ముఖ్యోద్దేశమయి ప్రస్తుత కథకు సందర్భపడఁ గవి దాని నిట్లు మార్చినాఁడు. మొదటియంకములోని భానుమతీ పరిహాసోక్తియు. రెండవయంకములోని భానుమతీస్వప్నదర్శనాది వృత్తాంతమును గేవలము కవికల్పితములు. మూలగ్రంథమున లేకపోయినను రసపుష్టిని గలిగించుటకు నాటకమున నిట్టికల్పనలు సేయఁ గవులకు నిరంకుశాధికారము గలదు. అనంతరము దుశ్శాసనుఁడు తనచేతికి దొరకెనని వృకోదరుఁ డఱవఁగా, సోదరప్రాణరక్షణ పరాయణత్వంబున మిత్రసహితుఁడయి సుయోధనుఁ డనికిఁ బోయెను. ఈయంకము మిక్కిలి రసవంతము.

నాలవయంకములో, భీమునికి సాయము సేయ వచ్చి సవ్యసాచి యేసినసాయకంబులు నాఁటి, తేరిమీఁద మూర్ఛవోయినతన్నుం బొలికలనికిఁ దొలఁగించి, యాదురవస్థలం దలంచి దుఃఖించుచు సూతుఁడు గావించినశీతలోపచారంబులచేఁ దెప్పిఱిలి, దుశ్శాసన మరణంబు విని విలపించెడు తనకడకు యుద్ధములోనుండి కర్ణసేవకుండు వచ్చి వాని ప్రభుపుత్రుఁ డగువృషసేనుని మరణప్రకారం బభివర్ణింప నందుకుఁ బరిదేవనంబుచేసి, యాసేవకుఁ డిచ్చిన కర్ణునిజాబుఁ జదువుకొని, మరలఁ గర్ణునకుఁ దాను జెప్పవలసిన మాటలు వానికిం జెప్పిపుచ్చి. నిరుత్సాహుఁడయి కుందుచున్నతన్నుఁ బరామర్శింపఁ దనతల్లిదండ్రులు యుద్ధభూమికి రాఁగా, వారిని గారవింప రారాజు వోయె ననుకథ చెప్పఁబడియె. దుర్యోధనుఁడు జీవించి యుండఁగా గాంధారీధృతరాష్ట్రులు యుద్ధభూమికి వచ్చినట్లు భారతమునఁ గనఁబడదు. తదనంతరము వచ్చినట్లు స్త్రీపర్వములో నున్నది. ద్రోణపర్వములో నభిమన్యునిపరాక్రమము వర్ణింపఁబడినట్లు లిందు వృషసేనుని పరాక్రమము వర్ణింపఁబడినది.

లేశమును బాధ్యుఁడు కాఁడనునంశము దృఢపఱుచును. అనంతర మొకమహావాయువు వీచినందున, దానిబాధకుఁ దప్పుకొన దుర్యోధనుఁడు భార్యాసహితముగా నొక దారుపర్వతప్రాసాదము నారోహించి, యక్కడ ననాస్తరణ మైనకఱకుటాతి శేలను గూరుచుండఁబోవుభానుమతితో మహానురాగమున నిట్లు పలికెను.

తే. జిలుఁగుఁబుట్టంబు గాలికిఁ జెదర, నాకుఁ। గనులపండువు సేయు నీఘనజఘనము*
వలపదే గారవింప నావలువ యెగయ। నువిద! నీచూపుఁదనుపునాయూరుయుగము‡

అనునప్పు డాకస్మికముగా నొకకంచుకి వచ్చి సైమాటతోఁ గలిసిపోవునట్లుగా ''దేవా! భగ్న మైనది. భగ్న మైనది'' యని వచియించెను. ఆకంచుకి యప్పుడు వీచిన పెనుగాలిచే రథధ్వజము భగ్న మైన దని సుయోధనుతోఁ జెప్పవచ్చినవాఁడు. అయినను నీవాక్యసందర్భమున, యూరుయుగము భగ్నమయినది యను నొక యమంగళార్థము శ్రోతలకు స్ఫురించుచున్నది. మేలుగాని కీడుగాని రాఁబోవునప్పుడు మానవులకు దైవికముగా నిన్నివిధములఁ దత్తత్సూచన మగు ననుటయే యిందలియాశయము. అట్లుండఁగా దారుపర్వతప్రాసాదమునఁ నుండఁగా దుస్సలయును దానియత్తయును రోదనము చేయుచు వచ్చి కురునాథా ! రక్షింపుము రక్షింపు మని వానికాళ్లమీఁదఁ బడిరి. తాను దగ్గఱ లేనప్పుడు తన పుత్త్రుఁ డభిమన్యుఁడు ద్రోణాచార్యులు పన్నినపద్మవ్యూహములో సాహసంబునం బ్రవేశింప. వానికి సహాయులుగాఁ బోయెడుభీమాదుల సేనాముఖంబున నాఁగి, తన్మూలముగా నాతనిమృతికి హేతువైన సైంధవుని ''నెల్లి ప్రొద్దు గ్రుంకకమున్న సంహరించెద'' నని నాఁటిరేయి యర్జునుఁడు పట్టినబెట్టిదపుఁ బ్రతినవలన వారి కట్టియార్తిపుట్టినది. ఈసింధురాజు దుస్సలకుఁ బెనిమిటి; కాఁబట్టి సోదరీమాంగల్యసంరక్షణార్థము భానుమతిని వీడుకొని, సుయోధనుఁ డాయోధనంబునకుఁ బోయెను, ఇంతటితో ద్వితీయాంకము ముగియును.

మూఁడవది యశ్వత్థామాంకము. ఇందు ముందుగాఁ బ్రవేశించెడు రాక్షసదంపతుల సంభాషణమువలన. యుద్ధములో నంతకముందు చనిపోయిన రాజులపేరులును, రణరంగము బీభత్సస్థితియును దెలియవచ్చును. తరువాత సేనలోఁ బొడమిన మహాకలకలమునకుఁ గారణ మారయుచు నశ్వత్థామ యాహవమునఁ బ్రవేశించును. అతనితండ్రియు నప్పటికౌరవసేనానియు నగుద్రోణుం ''డశ్వత్థామ చచ్చె నేనుఁ'' గని కారణాంతరమున యుధిష్ఠిరుఁడు పలికినమాటలో, నేనుఁ గన్నది వినక, శేషవాక్యశ్రవణమువలనఁ దన కుమారుఁడు చచ్చెనని భావించి, పుత్త్రవాత్సల్యమున నస్త్రపరిత్యాగముఁజేసి, ప్రాయోపవేశమున దేహంబుఁ జాలించువాఁడై యుండఁ, బాండవ

---

* ఇది కర్తృపదము.  ‡ ఇది కర్మపదము.

సేనాధిపతి యగుధృష్టద్యుమ్నుఁడు జుట్టుఁ బట్టుకొని యవమానకరముగాఁ దదీయ కంఠనాళ ఖండనంబు గావించెను. ముందు నుడివిన సేనాక్షోభమున కిదియె కారణము. ఈసమాచార మామూలాగ్రముగాఁ దనతండ్రిగారి సూతునివలనను, దన మేనమామ యగు కృపాచార్యులవలనను. క్రమక్రమముగాఁ దెలిసికొని, బహువిధముల విలపించి, యనేకము లగుప్రతాపోక్తులు వలికి, తుదకు మాతులప్రార్థనంబున "సేనాధిపత్యమును బొంది పగదీర్చుకొందు" నని, కృపాచార్యసహితముగా దుర్యోధను సన్నిధికి బయలుదేరెను. అప్పు డారాజుతోఁ, బ్రియమిత్రుఁ డగు కర్ణుఁడు లేనిపోనిమాటలు కల్పించి చెప్పి, యాతనిమదిలోని ద్రోణపక్షపాతమును బోఁగొట్టుచుండెను. ఈసమయములో నశ్వత్థామయుఁ గలిసికొని. యప్పుడు పొసంగినప్రసంగమును బట్టి రాధేయునితోఁ దనకు మహాకలహము సంభవించినందున, వాఁడు చచ్చువఱకును యుద్ధము చేయకుండునట్లు శపథముచేసి, తా నస్త్రంబును బరిత్యజించెను. ఇట్లస్త్రపరిత్యాగము భీష్మునిమీఁదికోపమునఁ గర్ణుఁడు గావించినట్లు మహాభారతమున నున్నది. కౌరవయోధుల యైకమత్యాభావము సూచించుట ముఖ్యోద్దేశమయి ప్రస్తుతకథకు సందర్భపడఁ గవి దాని నిట్లు మార్చినాఁడు. మొదటియంకములోని భానుమతీ పరిహాసోక్తియు. రెండవయంకములోని భానుమతీస్వప్నదర్శనాది వృత్తాంతమును కేవలము కవికల్పితములు. మూలగ్రంథమున లేకపోయినను రసపుష్టిని గలిగించుటకు నాటకమున నిట్టికల్పనలు సేయఁ గవులకు నిరంకుశాధికారము గలదు. అనంతరము దుశ్శాసనుఁడు తనచేతికి దొరకెనని వృకోదరుఁ డెలవఁగా, సోదరప్రాణరక్షణ పరాయణత్వంబున మిత్రసహితుఁ డయి సుయోధనుఁ డనికిఁ బోయెను. ఈయంకము మిక్కిలి రసవంతము.

నాలవయంకములో, భీమునికి సాయము సేయ వచ్చి సవ్యసాచి యేసినసాయకంబులు నాఁటి, తేరిమీఁద మూర్ఛవోయినతన్నుం బొలికలనికిఁ దొలఁగించి, యాదురవస్థలం దలంచి దుఃఖించుచు సూతుఁడు గావించినశీతలోపచారంబులచేఁ దెప్పిరిలి, దుశ్శాసన మరణంబు విని విలపించెడు తనకడకు యుద్ధములోనుండి కర్ణసేవకుండు వచ్చి వాని ప్రభుపుత్రుఁ డగువృషసేనుని మరణప్రకారం బభివర్ణింప నందుకుఁ బరిదేవనంబు చేసి, యాసేవకుఁ డిచ్చిన కర్ణునిజాబుఁ జదువుకొని, మరలఁ గర్ణునకుఁ దాను జెప్పవలసిన మాటలు వానికిం జెప్పిపుచ్చి. నిరుత్సాహుఁడయి యుండుచున్నతన్నుఁ బరామర్శింపఁ దనతల్లిదండ్రులు యుద్ధభూమికి రాఁగా, వారిని గారవింప రారాజు వోయె ననుకథ చెప్పఁబడియె. దుర్యోధనుఁడు జీవించి యుండఁగా గాంధారీధృతరాష్ట్రులు యుద్ధభూమికి వచ్చినట్లు భారతమునఁ గనఁబడదు. తదనంతరము వచ్చినట్లు స్త్రీపర్వములో నున్నది. ద్రోణపర్వములో నభిమన్యునిపరాక్రమము వర్ణింపఁబడినట్లు లిందు వృషసేనుని పరాక్రమము వర్ణింపఁబడినది.

మేమియు దొరకలేదు. ఆ ౧౮౭౩ వ సంవత్సరములో నీనాటకము తెలిఁగించి. ౧౮౭౬ వ సంవత్సరమున మొదటిపర్యాయము ముద్రింపించినాఁడను. పలుకారణములచే నక్కూర్పున స్ఖాలిత్యములు మెండుగ నగపడినందున రెండవకూర్పులో శక్తికొలఁది వానిని సవరించి నాఁడను. ప్రప్రథమమున నీనాటకము గోదావరీమండలములోని దాక్షారామమునకు సమీపమున నున్నవేగాయమ్మపేట యను మాపూర్వనివాసగ్రామమున శ్రీవాడ్రేవు రంగనాయకాంబారాజ్ఞిగారి మందిరమునఁ బ్రయుక్తంబయినది. అప్పుడు తత్ప్రయోగమున కానందించిన సాహితీచక్రవర్తులు మద్గురువరులు భాగవతి వాసుదేవదీక్షితులుగా రాంధ్రగీర్వాణముల నొసంగిన యభిప్రాయమును మాత్ర మిట వ్రాసి యీయంశమును ముగించుచున్నాను.

తే. గీ. క్షీరవారాశి వేణిసంహారనాట
కంబు, మందరాహార్యము కలిత సుబ్బ
రాయ ధైర్యము, సుధ తదర్థంబు, విష్ణుఁ
డీనృసింహరావు, విబుధు లిచటిజనులు.

శ్లో. వడ్డాదిసుబ్బరాయగ్రథితం నాటకవిచిత్రమాల్య మిదమ్
తర్పయతి రసలహర్యా సభ్యమనశ్చంచరీకనికురుంబమ్.

వడ్డాది-సుబ్బారాయఁడు

| | |
|---|---|
| మొల్లరామాయణము గ్లేజు. | 0—10—0 |
| డిటో క్యాలికో | 1—0—0 |
| వైజయంతీ విలాసమగు విప్రనారాయణచరిత్ర గ్లేజు | 0—8—0 |
| డిటో క్యాలికో | 0—12—0 |
| బాలవితంతు విలాపము గ్లేజు. | 0—5—0 |
| డిటో క్యాలికో | 0—8—0 |

వలయువారు.

కర్రా అచ్చయ్య అండ్ సన్సు

రాజమండ్రి.

పంచమాంకములో—గాంధారీధృతరాష్ట్రులు యుద్ధము మాను మని సుయోధనుని బతిమాలుటయు, నతఁ డందున కంగీకరింపమియుఁ, గర్ణునిమరణంబువిని సుయోధనుఁడు విలపించుటయు, నట్టిదురవస్థలో భీముఁ డుల్లసమాడుచు నర్జునసహితుఁ డయి యతనిఁ జూడ వచ్చుటయు, నచ్చో వారికి నతనికి వాక్కలహము సంభవించుటయు, నందుమీఁద మహాకోపమున "నెల్లి తప్పక సుయోధనుఁ జంపుదు" నని భీముండు ప్రతిన పట్టుటయు, వాసమయమున నస్త్రధరుఁ డయి సుయోధనుకడకు నశ్వత్థామ వచ్చుటయుఁ, గర్ణపక్షపాతిమానసంబున సుయోధనుఁడతనిసాహాయ్యము నిరాకరించుటయు, ధృతరాష్ట్రుం డందుకు దుఃఖపడి కొడుకుం గినిసి యశ్వత్థామం బ్రార్థింప సంజయుం బుచ్చి తాను దుర్యోధనునకు మాయోపాయ ముపదేశించి పోవుటయుఁ, జెప్పంబడియె. దుర్యోధనుఁడు స్వబుద్ధి నే ద్వైపాయనహ్రదమునందుఁ బ్రవేశించినట్లు భారతమున నున్నది. ధృతరాష్ట్రుని కౌటిల్యమును వెల్లడించుటకు నీకవి యిట్లు మార్చినాఁడు.

ఆఱవయంకములో—దుర్యోధనుని వెదకుటకయి ధర్మరాజు తనపరిజనమున కాజ్ఞాపించుటయుఁ, గృష్ణప్రేషితుం డయి యుద్ధములోనుండి వచ్చి పాంచాలకుం డనువాఁడు. "సుయోధనుఁ డగపడి భీమునితో గదాయుద్ధముఁ జేయుచున్నాఁ" డని యెఱింగించుటయు, భీముఁడే యోడు నేమో యని విచారించుచున్న ద్రౌపదీయుధిష్ఠిరుల కడకు దుర్యోధనమిత్రుఁ డగుచార్వాకుఁ డనురక్కసుఁడు మునివేషమున వచ్చి, భీమార్జునులు దుర్యోధనునిచేఁ జచ్చి రని నచ్చఁ జెప్పుటయు, నందుకుఁ బనవి పనవి, యాదంపతు లగ్నిప్రవేశము సేయఁ దలఁచి, తమపరిజనులకుఁ జెప్పవలసినమాటలు చెప్పిపుచ్చి, భీమాదుల కుదకదానంబు సేయుటయు, నంతలో సుయోధను వధించి తద్రక్తసిక్తము లయినహస్తములతో వృకోదరుండు ద్రౌపదికి జడ ముడువవచ్చుటయు, సుయోధనుఁ డనుభ్రాంతిచేత ధర్మరాజు వానిని సత్తువకొలఁదిఁ బట్టుకొని బిగ్గన మండుచున్న యగ్నిహోత్రములోఁ బడవేయఁ జూచుటయుఁ, దద్భ్రాంతిం దెలిసికొని భీముఁ డాతనికిఁ దన్నెఱింగించుకొనుటయు, ద్రౌపదీ వేణీసంహారమహోత్సవంబుతో ధర్మరాజునకుఁ బట్టాభిషేకంబు జరుగుటయుఁ దెలుపఁబడియె. పైని జెప్పఁబడిన చార్వాకుఁడు యుధిష్ఠిర పట్టాభిషేకసమయమున విప్రవేషముతో బ్రాహ్మణమధ్యమునఁ జేరి, కొన్ని కాఱులఱచి యచ్చోఁ జంపఁబడినట్లు శాంతిపర్వమున నున్నది. దానినే రసపుష్టికయి కవి యిట్లు మార్చినాఁడు.

ఇష్టప్రకారము కథ మార్చుటకుఁ దనకు స్వాతంత్ర్యము గలిగియున్నను, పాత్రముల స్వభావమునకు భిన్నముగా మాత్ర మీకవి యెక్కడను వాక్యరచన చేయలేదు. అది దీనికి మిక్కిలి వన్నె దెచ్చుచున్నది. ఈనాటకమును గడుఁ బురాతనముగాఁ జెప్పుదురు గాని కాలనిర్ణయమున కయినను స్థలనిర్ణయమున కయినను నాధార

# ఈ నాటకమునందువచ్చు పాత్రములు



పురుషులు.

భీముఁడు—కథానాయకుఁడు. పాండవులలో రెండవవాఁడు
సహదేవుఁడు—భీమునికనిష్ఠసోదరుఁడు.
వినయంధరుఁడు—దుర్యోధనునికంచుకి; మైత్రేయుఁడు—పాండవులకంచుకి.
దుర్యోధనుఁడు—పాండవులకు ముఖ్యశత్రువు. మఱియు వారిపెత్తండ్రికొడుకు.
రుధిరప్రియుఁడు—యుద్ధభూమియందునాహారముకొఱకుఁదిరుగులాడునొకరాక్షసుఁడు.
అశ్వత్థామ—దుర్యోధనునిపక్షమువాఁడు, ద్రోణునికొడుకు.
అశ్వసేనుఁడు—ద్రోణినిసారథి.
కృపుఁడు—దుర్యోధనునిపక్షమువాఁడు, అశ్వత్థామకు మేనమామ.
కర్ణుఁడు—దుర్యోధనుని ప్రాణస్నేహితుఁడు.
సుందరకుఁడు—యుద్ధరంగములోనుండి దుర్యోధనునకు జాబు తెచ్చినకర్ణసేవకుఁడు.
ధృతరాష్ట్రుఁడు—దుర్యోధనునితండ్రి, జాత్యంధుఁడు.
సంజయుఁడు—ధృతరాష్ట్రునిసూతుఁడు.
అర్జునుఁడు—భీమునితరువాతివాఁడు.
ధర్మరాజు—పాండవాగ్రజుఁడు.
బుధకుఁడు—ధర్మరాజుపరిచారకుఁడు.
పాంచాలకుఁడు—యుద్ధరంగమునుండి ధర్మరాజునొద్దకుఁ గృష్ణుని చేఁబంపఁబడ్డవాఁడు.
జయంధరుఁడు—ధర్మరాజుకంచుకి.
చార్వాకుఁడు—మునివేషముతో ధర్మరాజునువంచింపవచ్చినరాక్షసుఁడు,దుర్యోధనుని స్నేహితుఁడు.
కృష్ణుఁడు—మనుష్యావతారమెత్తిన విష్ణుఁడు. పాండవులకు మేనబావ.

స్త్రీలు.

ద్రౌపది—పాండవులభార్య; బుద్ధిమతిక—ద్రౌపదిపరిచారిక.
భానుమతి—దుర్యోధనునిభార్య; సువదన—భానుమతిచెలికత్తె.
తరళిక—భానుమతిపరిచారిక,
ప్రతీహారి—దుర్యోధనుని యంతఃపురపరిచారకురాలు.
దుస్సల—దుర్యోధనుని చెల్లెలు. సైంధవునిభార్య.
జయద్రథమాత—దుస్సలయత్తగారు.
రుధిరప్రియ—రుధిరప్రియుని పెండ్లము, రాక్షసి.
గాంధారి—ధృతరాష్ట్రునిభార్య, భర్తయంధుఁడని కన్నులకుగంతులు కట్టుకొన్న పతివ్రత.



శ్రీ రస్తు.

శ్రీపరమాత్మనేనమః



# ప్రథమాంకము.



## నాంది.

చ. పొరిఁబొరిఁ దోలిసన్ మధుపములన్ పరిదేరె గలంప, లో సుధా
కరకరలిప్త మైనటులు గాంచఁగనై, వికసించి మించునీ
హరిచరణప్రకీర్ణకుసుమాంజలి, సభ్యులకు న్విలోకనుం
దర మగుకావ్యసిద్ధిని నొసర్చెదుఁగావుత మాకు నిర్వ్యాడన్. ౧.

శా. కాళిందీపులినంబునందుఁ బొలయల్కన్ రాసము న్మానని, రా
ధాలోలాక్షి సబాష్పయై మరలఁ, దత్పాదాంకముల్ మెట్టుచుం,
జాలిన్ మై గరుపార వెంటఁ జని, తద్భామాప్రసన్నావలో
కాళిన్ ధన్యత గన్నకంసరిపునూరార్పుల్ మిముం బ్రోచుతన్. ౨.

మ. ఇది యే మంచు భవాని పేర్మిమను, భయోద్వృత్తి న్నిశాటాంగనల్,
త్రిదశుల్ మోదమునం, దపోధనులు జాలిన్, నవ్వున న్వెన్నుఁ, డు
న్మదలీలం దనుజుల్ గనన్, మయపురోద్యద్దాహవేళం జయా
స్పద మస్త్రిం బరివోయుధూర్జటి యజస్త్రింబున్ మిముం బ్రోచుతన్. ౩.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—అతివిస్తర మెందుకు ?

తే. గీ. వీనుఁజేరల జుఱ్ఱంగ విబుధు లెల్ల
భారతం బనునమృత మెవ్వాఁడు చేసె,
రాగకృష్ణవిహీనుఁ డేయోగివర్యుఁ,
డట్టిసాత్యవతేయు నాయాత్మఁ దలఁతు. ౪.



C. M. V. Sharma
Nalgonda

పూజ్యు లైనయీసభాసదులారా! మీయందఱకు నేను నమస్కారము చేసికొనుచున్నాను.

క. మరలను నొకపుష్పాంజలి
వరుసను నెరపెదము కావ్యబంధము నిచటన్;
సరసాళులు మధువును బలె
నిరళపుగుణలేశములను వెదకి కొనుండీ. ౨.

అది పూర్వము గీర్వాణభాషయందు మృగరాజలక్ష్మణాం కగుభట్టనారాయణకవిచే విరచితం బయి, యిప్పు డభినవముగా వడ్డాది సుబ్బరాయకవిచే నాంధ్రీకృతంబయిన వేణీసంహార మనునాటకము, దాని నిప్పుడిచ్చో నుపయోగింప నుద్యోగించుచున్నాము; కావునఁ గవిపరిశ్రమానురోధమున నయినను, నుదాత్త కథావస్తుగౌరవమున నయినను, నవనాటకకుతూహలమున నయినను మీరు సావధానముగా దీని నవధరింపవలయును. (తెరలో) అయ్యా! త్వరపడు, త్వరపడు. మహానుభావు లయిన పారాశర్యనారదతుంబురుజామదగ్న్య ప్రముఖు లయినముని బృందారకులతో, భరతకులహితకాంక్షను స్వయముగా దూతకృత్యమును నడుపఁ దలఁచి, భగవంతుండును జనార్దనుండును నగు దేవకీనందనుండు దుర్యోధన మహారాజుశిబిరమునఁ బ్రవేశించునవసరముగదా! కావున నిప్పుడు వాద్యములను మేళము చేయుండని విద్వాంసులయనుమతి నీపురుషులు నాటకులతోఁ జెప్పుచున్నారు.

సూత్రి—(సంతోషముతో) ఓహోహో! జగదుత్పత్తిస్థితినిరోధప్రభవిష్ణుం డయినవిష్ణుండు కురుపాండవరాజపుత్రుల మహాహవప్రళయానలంబును జల్లార్పం దలంచి, సంధి చేయుటకు స్వయముగా దూత యగుటచేత నీభరతకులంబును, సమస్తరాజలోకంబును గూడ నమ్మహాత్మునిచేత ననుగ్రహింపఁబడినది గదా! కావునఁ బారిపార్శ్వికా! కుశీలవులతో సంగీతము నారంభింపకున్నావేమి?

[పారిపార్శ్వికుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పారి—ఆలాగే యారంభించెదను గాని యేఋతువు నాశ్రయించి?

సూత్రి—ఓయీ! చంద్రాతపనక్షత్ర క్రౌంచహంసకుల సప్తచ్ఛదకుముద పుండరీకకాశకుసుమపరాగ ధవళితగగనదిఙ్మండలంబును, స్వాదుజలజలాశయంబును నగు నీశరత్సమయము నే యాశ్రయించి గానము సేయుము. చూడుము. ఈశరదృతువునందు.

తే. గీ. చారువచము, ప్రసాధితాళము, మదోద్ధ
తప్రయత్నము, విపులసత్పక్షమైన
ధార్తరాష్ట్రశతంబు భూతలమునందు
వ్రాలెడును జితశ్రముగఁ గాలవశముచేత. ౬.

పారి—(తొట్రుపాటుతో) హరిహరీ! ఎంతమాటవింటిని?

సూత్ర—(తెలతెలఁబోయి నవ్వి) మారిషా! నేను శరత్సమయమును వర్ణించుచుండఁగా నీవు "హరిహరీ" యనియెద వేమి?

పారి—అవు నది నిజమే. ధార్తరాష్ట్రశత మనఁగా హంసలగుం పని మీయభిప్రాయము; అయినను దద్వచనమందలి యమంగళశంసనమున నాహృదయము చెదరిపోయినది.

సూత్ర—మారిషా! ఇంక నిశ్చయముగా నన్నియమంగళములును గొట్టఁబడి పోవును. కంససంహారణుం డగు శ్రీకృష్ణుండు తానుగ దూత యయి సంధిసేయం జూచుచున్నాఁడుగదా! ఆహేతువుచేత.

తే. గీ. పగలు సాధించి నిర్వాణవైరదహను
లయి సుఖించుతఁ బాండవుల్ హరిని గూడి;
స్వస్థు లయ్యెదు రక్తప్రసాధితోర్వు
లగుచుఁ గౌరవుల్ క్షతవిగ్రహతను జెంది. ౭.

(తెరలోపలఁ దిరస్కారముగా) ఆ! దురాత్మ! వృథామంగళపాఠక! శైలూషాధమ!

చ. ఖలు లయి నాఁడు లక్కయిలు గాల్చి, విషాన్నము వెట్టి, జూదపుం
గొలువు ప్రవేశపెట్టి, మముఁ గ్రూరత జీవధనంబులందుఁ జే
దల నొనరించి, చాల కది, ద్రౌపదిఁ గొప్పును బట్టి యీడ్చి, చీ
రల సభ నొల్చినట్టి ధృతరాష్ట్రజు లేఁ గలుగంగ స్వస్థులే? ౮.

సూత్ర—(ఆలకించి భయముతోఁ దెరవంకఁ జూచుచున్నాఁడు.)

పారి—ఆ! ఇది యేమి?

సూత్ర—(వెనుకఁ జూచి) అహో! కృష్ణుఁడు కౌరవులతో సంధిసేయఁ బోవుట కిష్టపడక, భీమసేనుఁడు నిటలతటఘటితకుటిలభ్రుకుటి యయి మనలనందఱఁ జూచునంతన మ్రింగివేయునట్లు మహాకోపముతో సహదేవానుగమ్యమానుం డయి యిదిగో! నీలాగున వచ్చుచున్నాఁడు; కావున నతనియెదుర మనము నిలువరాదు. వేగముగా వేఱొకచోటికిఁ బోవుదము రా.

(నిష్క్రమించుచున్నారు.) ప్రస్తావన.

[ తర్వాతఁ గుపితుఁడైన భీమసేనుఁడు సహదేవునితోఁ బ్రవేశించుచున్నాఁడు. ]

భీము—ఆ ! పాప ! దురాత్మ ! వృథామంగళపాఠక ! శైలూషాధమ !

"చ. ఖిలులయి నాఁడు లక్కయిలు" అను మునుపటిపద్యమును మరలఁ జదువుచున్నాఁడు.

సహ—అన్నయ్యా ! శాంతింపుఁడు. శాంతింపుఁడు. ఈభరతపుత్రుల వచనము మనకు సమ్మతమే. చూడుఁడు.

తే. గీ. పగఱ సాధించి నిర్వాణవైరదహను
లయి సుఖించుతఁ బాండవుల్ హరిని గూడి;

అనువాక్యము మీకిష్టమే గదా!

స్వస్థులయ్యెడు రక్తప్రసాధితోర్వ
లగుచుఁ గౌరవుల్ క్షతవిగ్రహతను జెంది. ౯.

అను నీవాక్యమును మన కనుకూలముగానే యున్నది. చిత్తగింపుఁడు. క్షతవిగ్రహతను = కొట్టఁబడిన దేహములు గలుగుటను; చెంది = పొంది, రక్తప్రసాధితోర్వులగుచున్ = రక్త = నెత్తుటిచేత; ప్రసాధిత = అలంకరింపఁబడిన; ఉర్వీ = భూమిగలవారు; అగుచు; కౌరవులు; స్వస్థులు = (స్వర్ స్థ) స్వర్గస్థులు అయ్యెడున్ = అగుదురుగాక; అని యర్థ మిచ్చుచున్నది.

భీము—(నిందాగర్భముగా) వద్దువద్దు. మీరు కౌరవుల కమంగళములను దలంపఁగూడదు. వారు మీకు సోదరులు గావున సంధిసేయం దగినవారు.

సహ—(రోషముతో) అయ్యా !

క. పలుమా ఱెగ్గులు సేసిన
యలధృతరాష్ట్రజులయందు నలుగక యుండం
గలఁ డెవఁడు నీదుతమ్ముఁడు,
వల దని మనరాజుగారు వారింపనిచోన్ ? ౧౦

భీము—(రోషముతో) ఔనోయి ! యది నిజమే. అందుచేతనే యింతట నుండి నేను మీయందఱినుండి వే ఱయ్యెదను. వినుము.

ఉ. సింధురసింహసామ్యులము చిన్నటనుండియు వార నేను; మా
బంధురవైరకారణములు భర్తయుఁ బార్థుఁడు మీరునా ? జరా
సంధునురంబువోలెఁ గురుసంధి ఘటిల్లిన త్రెంచి, సద్భుజా
గంధుఁడు భీమసేనుఁడు పెకల్చును! గూర్పుఁడు మీర లందఱున్. ౧౧.

సహ—(అనునయముతో) అన్నయ్యా! మీ రీలాగునఁ దీండ్రపడుచుండిన మనయన్నగారు ఖేదపడుదురు గదా!

భీము—(నవ్వుచు) ఏమిది? నావిషయమయి యన్నగారు ఖేదపడుదురా? ఆయన ఖేదముకూడ నెఱుంగుదురా? చూడు.

చ. అలసభ నట్టు లైనద్రుపదాత్మజఁ గాంచి, యరణ్యమందు వ
ల్కలధరు లౌకిరాతులబలంగముతోఁ జిరకాల ముండి, య
ప్పల నతిహీనత న్విరటుపాల వసించియు, నేఁ గృశింపఁగాఁ,
గలుగదు ఖేద మాయనకుఁ; గౌరవు లన్నను గల్గు నిప్పుడున్. ౧౨

కావున సహదేవా! నీవు పోయి యతిచిరప్రవర్ధితక్రోధకృశానుం డగు భీమ సేనుం డిట్లు పల్కెనని మహారాజుగారితో విన్నవింపుము.

సహ—అన్నయ్యా! ఎట్లు?

భీము—ఇదిగో నిట్లు.

శా. భవదాజ్ఞాపరిలంఘనాంబువుల భూపా! మున్గి యుంటిం గదా;
యవనిం బ్రస్తుతి గన్ననీయనుజులం దఖ్యాతిఁ గంటి న్గదా;
బవరంబం దిదె కౌరవక్షతజశోభన్ సల్పెదన్ మద్గదో
త్సవమున్; నేఁటికి మీరు గారు గురువుల్; తమ్ముండఁగా నేనునున్. ౧౩.

(అహంకారముతో నడుచుచున్నాఁడు.)

సహ—(అతని ననుసరించి నడుచుచుఁ దనలో) ఓహో! ఎందుకోగాని యీయన పాంచాలీచతుశ్శాలభవనమునఁ బ్రవేశించుచున్నాఁడు. కానీ నే నిక్కడ నిలిచెదను. (అట్లు చేయుచున్నాఁడు.)

భీము—(మరలి చూచి)సహదేవా! నీవు పోయి యన్నగారి ననుసరించి యుండుము. నే నీయాయుధాగారమునఁ బ్రవేశించి యాయుధసహాయుఁడ నయ్యెదను.

సహ—అన్నయ్యా! ఇది యాయుధాగారము గాదు; పాంచాలీచతుశ్శాల భవనము.

భీము—(సవితర్కముగా) ఏమీ? ఇది యాయుధాగారము గాదా? పాంచాలీచతుశ్శాలభవనమా? (ఆలోచించి) పాంచాలితో మాటలాడ వలసియున్నది. (ప్రేమతో సహదేవునిచేయి పట్టుకొని) తమ్ముఁడా! ఇటురమ్ము.

సహ—అన్నయ్యా! ఆజ్ఞాపింపుఁడు.

భీము—తమ్ముఁడా; అన్నగారు కౌరవులతో సంధికి నిచ్చగించి మనల నెట్లు పీడించుచున్నారో చూడుము.

(నడచి యిద్దఱును గృహము ప్రవేశించుచున్నారు.)

భీము—(కోపముతో వట్టిచేలను జలికిలఁబడుచున్నాఁడు.)

సహ—(తొట్రుపాటుతో) అన్నయ్యా! ఇదిగో! నిక్కడ నాసనము వేయఁబడియున్నది. మహార్హమాలిగ్రి మీఁదు విశ్రమించి కృష్ణాగమనముఁ బ్రతీక్షింపుఁడు.

భీము—తమ్ముఁడా! నీవు కృష్ణాగమన మనుటచేతఁ దలఁపు వచ్చినది. మహానుభావుఁ డయిన శ్రీకృష్ణుం డేపరికారము సంధిచేయుటకు సుయోధనునొద్దకుఁ బంపఁబడెను.

సహ—అయిదూళ్ళు మన కిచ్చునట్లు.

భీము—(చెవులు మూసికొని) అన్నన్నా! ఎంతకష్టము! అన్నగా రజాతశత్రు లయినను, నీదృశతేజోహీను లగుటచేత నిజముగా నాహృదయము చలించుచున్నది. తమ్ముఁడా! ఇది నీ వనను లేదు. నేను వినను లేదు. (పెడ మొగము పెట్టుకొని)

తే. గీ. ఊర్జితం బగుక్షాత్రింపుటుగ్రితేజ
మీమహారాజునకు నాఁటనే తొలంగె,
దాయతోఁ డుత నెపుడు జూదంబు నాఁడఁ
బాచికలఁ దనచేతను బట్టినాఁడొ. ౧౪.

(తెరలో) దేవీ! ఊఱడిల్లు మూఱడిల్లుము. కౌరవులతో నిరతబద్ధవైరుం డగు భీమసేనకుమారుఁడు నీదుఃఖము నపనయింపఁగలఁడు.

సహ—(చెవియొగ్గి తెరవంకఁజూచి తనలో) అయ్యో! ఏమిది? యాజ్ఞసేని కన్నుల బాష్పబిందువులు గ్రమ్ముకొన నన్నగారిసన్నిధి కిటు వచ్చుచున్నది. ఇందువలన నేదో గొప్పయుపద్రవము సంభవించును గదా!

తే. గీ. సంభృతం బయ్యె నీఘనుజృంభణమున
నురుతరేరమ్మదమురీతి నొక్కజ్యోతి;
వర్షఋతువట్లు వచ్చి సంవర్ధనంబు
సేయు నిజముగ నియాజ్ఞసేని దాని. ౧౫.

(తర్వాత ముందుచెప్పినరీతిని ద్రౌపదియుఁ జేటియుఁ బ్రవేశించుచున్నారు.)

ద్రౌప—కన్నీరుజాఱ నిట్టూర్పుపుచ్చుచున్నది.)

చేటి—దేవి! ఊఱడిల్లు మూఱడిల్లుము. కౌరవులతో నిరతబద్ధవైరుం-డగు భీమసేనకుమారుండు నీదుఃఖము నపనయింపఁగలఁడు.

ద్రౌప—(నిట్టూర్చి) మహారాజిందుకుఁ (బలికినాలుఁడు నాకపోయిన, నీ వనిన

లాగున జరుగఁగలదు; నాథునిఁ జూచుటకు నాహృదయము వేగిరపడుచున్నది. చేటీ! బుద్ధిమలికా! ప్రాణేశునివాసభవనమునకు నన్నుఁ గొనిపొమ్ము.

చేటి—దేవీ! ఇటు, ఇటు, (నడుచుచున్నారు.)

చేటి—దేవీ! ఇదే వాసభవనము. ఇందుఁ బ్రవేశింపుము.

ద్రౌప—చేటీ! నాథునితో నారాక నెఱింగింపవే

చేటి—చిత్తము. (నడిచి మరలవచ్చి) దేవీ! ఇదిగో యువరాజుగా రిక్కడనె కూరుచున్నారు. సన్నిధి కరుగుము.

ద్రౌప—అలాగే చేయుదము. (ఇద్దఱును నడుచుచున్నారు.)

చేటి—జయము జయము కుమార!

భీము—(వినకయే క్రోధముతో)

"తే. గీ. ఊర్జితంబగు క్షాత్రింపుటుగ్రతేజ। మీమహారాజునకు నాఁటనే తొలంగె"

(అను పద్యమును మరలఁ జదువుచున్నాఁడు.)

చేటి—(ద్రౌపదిని జేరి) దేవీ! నీకుఁ బ్రియముఁ జెప్పెదను. అబ్బాయిగారు కోపగించియున్నట్లు లగపడుచున్నారు.

ద్రౌప—చేటీ! అలాగయిన నన్నీతిరస్కారమే యాఅడించుచున్నది. కావున నే నిక్కడనే కూరుచుండి ప్రాణేశునిప్రయత్న మేమో తెలిసికొనియెదను. (అట్లు చేయుచున్నారు.)

భీము—(క్రోధముతో సహదేవు నుద్దేశించి) ఏమీ! అయిదూళ్ళకా సంధి?

ఉ. తల్లడ మందఁ గౌరవశతంబును బట్టి యని మ్రథింపనా?
ప్రల్లదు దుస్ససేనురుధిరంబు నురంబును వ్రచ్చి త్రావనా?
పెల్లు మనల్ సుయోధనుని పెందొడలన్ గద నుగ్గు సేయనా?
యూళ్ళయిదింటితో నృపతి యొప్పఁగఁ జేసెడుఁగాక సంధులన్. ౧౬

ద్రౌప—(సంతోషముతో రహస్యముగా) ప్రాణేశ్వరా! ఇట్టిమాట నీవఱ కెన్నఁడును వినలేదు. దానిని మరల నింకొక్కమాఱు వచియింపుము.

భీము—(అది వినకయే) సహదేవా! చూడు.

"ఉ. తల్లడ మందఁ గౌరవశతంబును" అను పూర్వోక్తపద్యమును మరలఁ జదువుచున్నాఁడు.

సహ—అన్నయ్యా! మహారాజు పంపినసందేశ మంతయవ్యుత్పన్నముగా నున్నట్లు మీ రూహించుచున్నారా?

భీము—కాక మఱి యం దేమి వ్యుత్పత్తి యున్నది?

సహ—మహారాజు పంపిన సందేశ మిది.

భీము—ఎవరికి ?

సహ—దుర్యోధనునికి,

క. క్రమమున మాకింద్రప్ర
స్థమును వృకప్రస్థమును నొసంగునది, జయం
తము వారణావతం బన
నమరెడునాల్గూళ్లు; కడమయది యే దైనన్. ౧౭.

భీము—అందులో నేమి యున్నది ?

సహ—ఇట్లు నాలు గూళ్ళను మాత్రము పేరుపెట్టికోరి, యయిదవ దట్లు వక్కాణింపక పోవుటచేత విషభోజనము, లాక్షాగృహదహనము, ద్యూతసభాప్రవేశము మొదలుగాఁగల యపకారముల నెత్తిపొడుచుటగా మే మూహించుచున్నాము.

భీము—తమ్ముఁడా ! ఈలాగయినమాత్ర మేమిలాభము?

సహ—అన్నయ్యా ! ఇందువలన మహారాజుహృదయము స్వకులక్షయంబునకు జంకుచున్న దనియు, దుర్యోధనుఁడు సంధికి యోగ్యుఁడు కాఁడనియు లోకమునందు వెల్లడి యగును.

భీము—ఇది యంతయు ననర్థమే. మన మందఱ మీలా గడవులపాలయి వచ్చుచుండి, కురుకులక్షయంబు గావింప నెప్పుడు ప్రతిజ్ఞ చేసికొంటిమో యప్పుడే కౌరవులతో సంధి సేయఁ గూడమి వెల్లడి యయినది. మఱియు ధార్తరాష్ట్రులకులము నిర్మూల మగునని యీవఱకే లోకమందుఁ బ్రసిద్ధ మయినది.

సహ—(సిగ్గుపడుచున్నాఁడు.)

భీము—ఏమీ ? మీకు సిగ్గగుచున్నదా? అట్లయిన నోరిమూర్ఖా !

తే. గీ. కోపమున శత్రుకోటిని రూపుమాప,
లోకములలోన మీకు లజ్జాకరంబు;
కూళ యొక్కఁడు రచ్చలోఁ గొప్పు వట్టి,
చేడె నీడ్వంగఁ జూచుట సిగ్గు గాదు. ౧౮.

దౌ—(రహస్యముగా) నాథా! వీరు సిగ్గులేనివారే; నీ వయిన నాపరాభవమును మఱచి పోకుము.

భీము—తమ్ముఁడా! ఏమిది పాంచాలి యాలస్యము చేయుచున్నది? నా హృదయము సంగ్రామావతరణమునకుఁ దత్తఱపడుచున్నదే.

సహ—అన్నయ్యా! ఆమె వచ్చి యెంత సే పయినది? మీరు రోషావేశమునఁ జూడరయితిరి.

భీము—(సాభిప్రాయాదరముతో) దేవి! [illegible] సమక్షమున

నున్నను నిన్ను వీక్షింపనయితిని; కోపగించుకోకుము.

ద్రౌప—ప్రాణేశ్వరా ! మీ రుదాసీను లయి యూర కున్నం గోపము గాని కుపితు లయినం గాదు.

భీము—దేవీ ! అటు లయిన నింక నీపరాభవము పోయిన దని నిశ్చయము గాఁ దలఁచుకొమ్ము.

ద్రౌప—(విచారముతో నిట్టూర్పు పుచ్చుచున్నది.)

భీము—(చేయి పట్టుకొని ప్రక్కను గూరుచుండఁ బెట్టుకొని మోము చూచి) ఏమిది ? దేవి యెందుకో విచారగ్రస్తురాలుగా నున్నట్టున్నది.

ద్రౌప—నాథా ! మీరు సన్నిహితు లయి యుండఁగా నాకు విచారకారణ మేమి యుండును ?

భీము—ఏమిడి, తెలుపవు? (తలవెంట్రుకలుచూచి) సరే, తెలుపవలసినదేమి?

తే. గీ. పాండురాజకుమారులు బ్రతికియుండి
సన్నిధిని బాయ కున్నను, సకలసౌఖ్య
భాజనం బగుపాంచాలరాజతనయ
యీదృశావస్థఁ బొందెడు నేమి చెప్ప ? ౧౯

ద్రౌప—బుద్ధిమతికా ! నాథునితో సకలంబును విన్నవింపవే; నాపరాభవ మునకు మఱి యెవ్వరు ఖేదపడువారు ?

చేటి—చిత్తము. (భీమునితో) కుమార ! దేవిగారికి నింతకన్నను నధికమయిన వేఱొక కోపకారణము గలిగినది.

భీము—ఇంతకన్నను నధిక మయినదా ? అ దేమి ? చెప్పు చెప్పు.

ఆ. వె. ముక్తవేణి. యయినముదిత సీకృష్ణను
ధూమశిఖనుబోలెఁ దోడరి యంటి,
కౌరవాన్వయంపుఁగారుచిచ్చునకును
శలభ మగుట కెవఁడు సాహసించె ? ౨౦

చేటి—కుమారా ! చిత్తగింపుము. ఇంతకుమున్దు దేవి యమ్మగారితోఁ గూడ సుభద్రాప్రముఖసపత్నీవర్గపరివృత యయి పూజ్యురా లగు గాంధారీదేవికిఁ బాదాభివందనము సేయఁ బోయెను.

భీము—మంచిపని, అట్లు చేయ వలసినదే. గురుజన మభివందనీయము గదా! తరువాత ?

చేటి—తరువాత మరలి వచ్చుచుండఁగా భానుమతి యీ మెను జూచినది.

భీము—(క్రోధముతో) ఆ! శత్రుభార్యకంటను బడెను గదా! ఎంతకష్టము! అట్లయిన దేవికిఁ గ్రోధస్థానమే. తరువాతఁ దరువాత?

చేటి—అట్లు దేవిగారిని జూచి భానుమతి తనచెలికత్తెమోమునఁ జూపు నిలిపి గర్వముతో నవ్వి యొకవాక్యము పలికెను.

భీము—ఆహా! కంటఁ బడుటయే కాక, మాట కూడఁ బడినదిగదా! ఓహో! ఏమి సేయుదుము? చెప్పు చెప్పు. ఏ మని?

చెటి—"ఓసి! యాజ్ఞసేనీ! మీ రేమో యయిదూళ్ళు నడుగుకొను చున్నారఁట. ఇది యేమే? ఇంకను నీతలవెండ్రుకల ముడుచుకొన కున్నావు!' అని.

భీము—సహదేవా! వినుచున్నావుగదా!

సహ—అన్నయ్యా! చెప్పెడిదేమి? అది దుర్యోధనునిభార్య గదా! చూడుఁడు.

క. వనితలకును సహవాసం
బున మనములు భర్తృసదృశములయయ్యెడు; నె
ట్లన మధుర మయ్యు విషకుజ
మున నల్లినవల్లి మూర్ఛపుచ్చుట లేదే?

భీము—బుద్ధిమతికా! అందుకు దేవి యే మన్నది?

చేటి—కుమార! పరిజనము లేనియెడల దేవిగారు పలుకుదురు.

భీము—అట్లయిన నీ వేమంటివి?

చేటి—"ఓ భానుమతీ! మీతలవెండ్రుకలు విడిపోకుండ మా దేవిగారితల వెండ్రుక లెల్లఁ ముడివేయఁబడు"' నంటివి.

భీము—(సంతోషముతో) బాగు! బుద్ధిమతికా! బాగు! మాపరిజనమునకుఁ దగినపలుకులు పలికితివి. (ఆభరణములు దానికి బహుమానమిచ్చి వెంటనే యాసనమునుండి లేచి) ఓపాంచాలరాజపుత్రీ! విచారింపకు. పెక్కుమాటలేల? శీఘ్రకాలములోనే నేను జేయునది చెప్పెద వినుము.

చం. భిఱభిఱఁ ద్రిప్పుకొంచు గద, బిట్టు సుయోధనుఁ గిట్టి, పెందొడల్
విఱుగఁగఁ గొట్టి, చేతులను వెచ్చని నెత్తుట నద్ది, నీకురుల్
మెఱుఁ గిడి, భీమసేనుఁ డవలీలను జి క్కడలించి కూర్చెదుం;
గొఱకొఱ యేల? దేవి! యిదిగో ముద మందెదు చూడు నీమదిన్. ౨౨

ద్రౌప—ప్రాణేశ్వరా! మీకుఁ గోపము వచ్చిన దుష్కర మేమియున్నది? మీసోదరులు గూడ మీయభిప్రాయమును సమ్మతించి వలయును

సహ—ఇది మాకును ననుమతమే.

(తెరలోపల మహాకలకలము)

అందఱు—(విస్మయనుతో నాలకించుచున్నారు.)

భీము—మ. తతఘూర్ణద్ఘటవార్ధిమధ్యవిలుఠన్మంథాచలధ్వానధీ
రతఁ గోణాహత మై జగత్ప్రళయగర్జన్మేఘసంఘట్టచం
డతఁ గృష్ణాగ్రిరుపాగ్రిమాత కురురాణ్ణాశంకరోత్పాతమై
సతి! మత్సింహరవానుకారి రణనిస్సాణం బదే మ్రోఁగెడిన్.

(తొందరగాఁ గంచుకి ప్రవేశించుచున్నాఁడు.)

కంచు—కుమార! ఇదిగో! భగవంతుఁడు కృష్ణుఁడు—

(అందఱును దోసిలి పట్టి నిలుచున్నారు.)

భీము—ఏఁడీ, ఏఁడి! భగవంతుఁడు?

కంచు—పాండవపక్షపాతామర్షంబున సుయోధనునిచేత బద్ధుండు గాఁబోయెను.

భీము—ఏమి! బద్ధుఁ డయ్యెనా?

కంచు—లేదులేదు. తద్విషయక ప్రయత్నములు జరిగినవి.

భీము—అప్పుడు స్వామి యేమి చేసెను?

కంచు—పిమ్మట నమ్మహాత్ముం డాత్మీయవిశ్వరూపనిరుపమానదివ్య తేజోదర్శనంబునం గురుకులంబును సమ్మూర్ఛితంబు గావించి నిరాకరించి మనశిబిరంబునకుఁ జక్కవచ్చెను. దేవరవారిని శీఘ్రముగాఁ జూడఁగోరుచున్నారు.

భీము—(నవ్వుకొనుచు) ఏమి? దురాత్ముఁడు దుర్యోధనుఁడు భగవంతునే కట్టివేయుటకుఁ దలంచినాఁడు గా! (ఆకాశమువంకఁ జూచి) ఆ! దురాత్మ! కురుకులపాంసన! ఇట్టు లతిక్రాంతమర్యాదుఁడ వయిననీనాశనమునకయి పాండవక్రోధానలంబు నిమిత్తమాత్రమే సుమీ.

సహ—అన్నయ్యా! దురాత్ముఁ డాదుర్యోధనుఁడు వాసుదేవుని భగవంతునిఁ గాఁ దద్విశ్వరూపదర్శనమున నయినఁ దెలిసికొన లేదు గాఁబోలు?

భీము—తమ్ముఁడా! ఆదురాత్ముఁడు కేవలము మూఢుఁడుగదా! ఆయన నెట్లు తెలిసికోఁజాలును! చూడు.

శా. ధీరత్వంబున నిర్వికల్పకసమాధిం జిత్తముల్ నిల్పి, దు
ర్వారం బైనతమంబు జ్ఞానమున విధ్వస్తంబు గావించి, యా
త్మారామున్ దిలకించువెన్వెలుఁగు మోహాంధుండు దుర్యోధనుం
డేరీతిం, గని తాఁ బరాత్పరునిఁ గా నెంచంగ శక్తుం డగున్? ౨౮

భీము—అయ్యా! మైత్రేయ! ఇప్పుడు పెద్ద లేమిచేయ నుద్యోగించు చున్నారు?

కంచు—కుమార! మహారాజుగారియుద్యమమును మీరే వచ్చి తెలిసికొన వలయును. (నిష్క్రమించుచున్నాఁడు.)

(తెరలోపలఁగలకలానంతరము) ఓహో! దుపదవిరాటవృష్ణ్యంధకసహదేవ పరిభృతిభూతలాధినాథులార! అస్మదక్షౌహిణీపతులార! కౌరవచమూపరిధానయోధులార! మీరందఱు విన వలయును.

మ. మది సత్యవ్రతభంగసాధ్వసమునన్ మందీకృతం బయ్యె నె
య్యది, లాక్షాగృహకాంతి గోరి యొకచో యత్నంబు విస్మృతం బయ్యె నె
య్యది, ద్యూతారణి ద్రౌపదీవసన కేశాకర్షణం బుట్టె నె
య్యది, యాధిష్ఠిర మాకుద్రాగ్ని కురువన్యాసీను జృంభించెదున్. ౨౫

భీము—(ఆలకించి సంతోషముతోడను రోషముతోడను) విజృంభించుఁగాక! విజృంభించుఁగాక! ఆర్యక్రోధానలం బప్రతిహతప్రసారం బయ్యెడును.

(మరలఁ దెరలోపలఁ గలకలము.)

ద్రౌప—(విస్మయముతో) నాథా! విలయవలాహకనిర్ఘోషభీషణక్వణనంబగు రణదుందుభి యిప్పు డనుక్షణమును మ్రోయుచున్నది. ఎందుచేత?

భీము—సుందరీ! మఱేమియు లేదు; యజ్ఞము జరుగుచున్నది.

ద్రౌప—(ఆశ్చర్యముతో) హా! అది యేమి యజ్ఞము?

భీము—ప్రాణేశ్వరీ! రణయజ్ఞము.

మ. విను ఋత్విక్కుల మేము నల్వురము; నావెన్నుం డుపద్రష్ట; యీ
యనుఁడే యాజియు; సోమిదమ్మ వగు దీవే; కౌరవుల్ తత్పశుల్;
వనితాదుఃఖము నీఁగులే ఫలము గా వర్తిల్లునయ్యధ్వరం
బునకున్ రాజుల నందఱం బిలువఁగా మ్రోఁగింతు రాదుందుభిన్. ౨౬

సహ—అన్నయ్యా! అటు లయిన గురుజనానుజ్ఞ వడసి మనము గూడఁ బరాక్రమానురూపమున నాచరింపఁ బోవుదము.

భీము—తమ్ముఁడా! ఇదిగో నన్నగారియాజ్ఞపరికాగ మాచరించుటకు సిద్ధముగానే యున్నాను. (లేచి) దేవీ! మేము కురుకులంబు నున్మూలించుటకుఁ బోయి వత్తుమా?

ద్రౌప—(కంటఁ దడి పెట్టుకొనుచు) నాథా! అసురసమరాభిముఖుం డగు హరికిఁ బోలె మీకు శుభం బయ్యెడును.

చేటి—కుమార! దేవిగారింకొక్కటి పలుకఁ దోఁచుచున్నారు. "మీరు

నెండియు భండనంబునుండి చనుదెంచి తన్ను నూఱడింపవలయు'' నని.

భీము—దేవీ! ఈకల్లబొల్లూఱడింపులతో నేమి ప్రయోజనము!

తే. గీ. పరిభవక్లాంతిలజ్జావిధురితవదనుఁ
గా, ననిశ్శేషిత కూరకౌరవుని౯గ
నింకను వృకోదరునిఁ జూడ విడి నిజంబు,
చారుశారదపూర్ణిమాచంద్రవదన! —౨౭

ద్రౌప—నాథా! ద్రౌపదీపరాభవోద్దీపితక్రోధానలంబున, నాలంబున నన వేక్షిత శరీరులయి సంచరింపకుఁడు. రిపుబలము లప్రమత్తసంచారము లని విను చుందుము గదా!

భీము—ఓసుక్షత్రియురాలా! యుద్ధరంగమున సంచరించుటకు మేము సమర్థులము నుమీ విను.

స్రగ్ధర. ఒండొంటి స్త్రైవ నుగ్గై యొఱగుకరులరక్తాఘమేదంపురొంపి౯
మెండౌ తేరుల్ మునుంగ౯, మెఱసి పయిపయి౯ మెట్టి మట్టాడజోదుల్,
మొండెంబుల్ పానగోష్ఠి న్మరయువఁజడు లన్నోర్చుగుతూర్యాళి నాద౯,
జండం బౌభండనాబ్ధిం జడియరు తిరుగ౯ శౌండులౌ పాండుపుత్రుల్.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

గద్య. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది సాధువంశక్షీర నీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హారితసగోత్ర పవిత్రగుణకదంబ లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధ విధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీకృత వేణీసంహార నాటకంబునందుఁ బ్రథమాంకము.



శ్రీరస్తు.

శ్రీపరమాత్మనేనమః

# వేణీసంహారనాటకము.



## ద్వితీయాంకము.

—:o:—

(తరువాతఁగంచుకి ప్రవేశించుచున్నాఁడు.)

కంచు— "వినయంధర! భానుమతీదేవి యమ్మగారికిఁ బాదాభివందన మాచరించి వచ్చిన దేమో చూచి రా. నే నామెను సందర్శించి యభిమన్యువధ ప్రధాన ధౌరేయు లగురాధేయజయద్రథప్రముఖులను బహూకరించుటకయి సత్వరముగా సమరతలమున కరుగ వలయు'' నని దుర్యోధనమహారాజుగారు నాకాజ్ఞాపించినారు గదా! కావున నే నాలస్యము చేయరాదు. అన్నా! దుర్యోధనమహారాజుగారియాజ్ఞాబలము! ముసలితనము చేత నిట్లు కదలలేక మర్యాదామాత్రమునకు నంతఃపురమున వసించుచున్న నాచేతను గూడఁ బూర్ణముగాఁ బనిసేయించుచున్నది! సరి, నిష్కారణము నాముదిమిని నిందింప నేల? అంతఃపురికు లయి విహరించు నెల్లవారికిని వేషంబును జెప్పలు నిటులనే యుండును గదా! సందేహ మేమి?

మ. కనరా దిరతలు కన్నులున్న; వినినం గారాదు విన్నట్లు; శ
క్తును కైనర్ విధి కట్టిఁ జేకొనుట యుద్యోగంబుచే; నెల్లనో
మనమం దెప్పుడు జంకె యాట, నడకల్ మందంబు లౌఁ; గాన నే
ననజీవుం డగునాకు నన్ని మునుపే వచ్చెన్; జరం గల్గెనే?

(నడచి యాకాశమువంకఁజూచి) విహంగికా! భానుమతీదేవి యత్తమామలకుఁ బాదవందన మాచరించి వచ్చినదా? (చెవియొగ్గి) ఏమంటివి? ఇప్పుడే నివర్తిత గురుదేవతాచరణాభివాదన యయి యాపు దన పెనిమిటికి జయము గలుగ వలెనని నేఁడు మొదలు నియమముతో బాలోద్యానమందలి దేవళమునఁ బ్రవేశించి యున్న - ? సరే, కల్యాణీ! నీవు నీపనిలో నుండుము. నేనును దేవి యిక్కడ నున్నసమాచారము మహారాజునకు నివేదించెదను. (నడచి) మేలు! పతివ్రతా! మేలు! అఁడుదాన వయినను నీవే నయము గాని మహారాజు కాఁడు; ఏమనఁగాఁ బ్రబలులలో దుర్బలులో వాను దేవసహాయు లగుపాండవేయు లెట్టి వారు నుండ నిప్పుడు గూడ నీమహారాజుగారంతః

పురవిహార మనుభవింపఁ గోరుచున్నారు. (ఆలోచించి) ఈయనగారిచేష్ట లేమియు బాగున్నవి కావు.

చ. అడిదము పట్టనేర్చినది యాది. యశుంతకుతారుఁ డౌమునిం
గడిమిని గెల్చుభీష్ము నొఱగంగ నొనర్చిరి పాండునందనుల్;
మిడుకఁడు దానికిన్; మగఁటిమిం బలువీరుల నోర్చి శాంతుఁ డా
బుడుతని నొక్కనిన్ ధనువు వోయినవాని వధించి ప్రీతుఁ డా. ౨

సర్వథా మాకు దైవమే మేలు చేయవలెను. ఇఁక నేను మహారాజునొద్దకుఁ బోయి దేవి యిక్కడ నున్న దని విన్నవించెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

(విష్కంభము.)

(తరువాత నాసనస్థురా లగుదేవియు సఖియుఁ జేటియుఁ బ్రవేశించుచున్నారు.)

సఖి—సఖీ! భానుమతీ! అభిమానధనుం డగుదుర్యోధనమహారాజునకుఁ బట్టపుదేవి వయియుండియుఁ. గలగన్నంతమాత్రమున కింత జేలవై చింతపడియెద వేమి ?

చేటి—దేవీ! సువదన యథార్థము వచించినది. నిద్రపోయినవారి కేదయినఁ గలవరింత రాకయుండునా ?

భాను—చేటీ! ఇది యటువంటిది కాదు. నిజముగా నీస్వప్నము నాకు నశుభమును సూచించుచున్నది.

సఖి—ప్రియసఖీ! అటు లయిన నాస్వప్న మేమో చెప్పు. మే మది సాంగముగా విని దానధర్మములచేతను దేవతాకీర్తనములచేతను దూర్వాదిసంగ్రహణముచేతను దద్దోషము పరిహరించెదము.

చేటి—సువదన లెస్సగాఁ బలికినది. అకుశలదర్శనము లగుకలలు దేవతాప్రశంసవలనఁ గుశలపరిణామము లయ్యెడు నని వినుచుందుము గదా ?

భాను—అట్లయిన దానిని జెప్పెదను ; సావధానవు గమ్ము.

సఖి—అ! సావధానను గానే యున్నాను; చెప్పుము ప్రియసఖీ !

భాను—సఖీ! ప్రాణములు చెదిరి పోయి పరాకు పడినదానను. మెల్లమెల్లగాఁ జ్ఞప్తికిఁ దెచ్చుకొని యంతయు నీకుఁ జెప్పెద నుండు. (విచారముతో నాలోచించుచున్నది.)

(తరువాత దుర్యోధనుఁడు కంచుకియుఁ బ్రవేశించుచున్నారు.)

దుర్యో—ఎవ్వఁడు చెప్పెనో కాని యిది గడు లెస్సయినమాట.

క. వినిగూఢమొ, బహిరంగమొ,
ఘనమో, స్వల్పంబొ, తానొ, కా కితరుండో,

పోనరించుట యపకారం
బును నపకారులకు, నది ప్రమోదము సేయున్. 3

నిజమే గదా! సైంధవద్రోణకర్ణాదులచేత నభిమన్యుఁడు చచ్చుట విని, నాహృదయ మూపిరి పుచ్చినట్లే యున్నది.

కంచు—దేవా! ఆచార్యశస్త్రప్రభావమున కిది దుష్కరము గాదు. కర్ణజయద్రథులకు మాత్రమిది యేమి గొప్ప?

దుర్యో—వినయంధర! కృష్ణుఁ డేమన్నాఁడు? విల్లు విఱిగి పోయినకుఱ్ఱవాని నొంటిగానిఁ జేసి పలువురు గూడుకొని చంపినారనిగదా! చూడుఁ.

క. ఎదుట శిఖండిని బెట్టుక
ముదుకం డగు భీష్ము నాలమునఁ జంపుటచే
నెదరికి నేమి యశంబో
యదియే మాకును ఘటిల్లు నట్లగు నేనిన్. ౪

కంచు—(తెల్లఁబోయి) దేవా! దేవర యీలాగున సరిపెట్టుకొనఁ గూడదు. దేవరవారిపౌరుషము మొక్క వోవు నని ముం దెన్నఁడయినఁ దలంచుకొంటిమా? అందుచేత నట్లు మనవి చేసికొన్నాఁడను.

దుర్యో—అవు నది నిజమే.

తే. గీ. సేవకులతోడ బాంధవశ్రేణితోడ
హితులతోడఁ గుమారసంతతులతోడఁ
దమ్ముగమితోడఁ దా నుయోధనునిఁ గూల్చఁ
దనబలంబున రణమందు ధర్మసుతుఁడు. ౫

కంచు—(చెవులు మూసికొని భయముతో) హరి హరీ!

దుర్యో—వినయంధర! నే నేమన్నాఁడను.

కంచు—"తే. గీ. సేవకులతోడ" (అనుపద్యముచదివి) దేవర యిట్లు విపరీతముగా ధర్మసుతుఁడు నుయోధను నని వచించితిరి

దుర్యో—వినయంధర! ఎప్పటివలె నాతోఁ జెప్పక, భానుమతి కేళికాగృహంబునుండి నేఁ డుదయము చక్కఁబోయినది. అందుచేత నామనస్సు కలఁతపడి యున్నది. ఆమె యెక్కడ నున్నదో చూపుము;

కంచు—దేవా! ఇటు విజయము చేయుఁడు.

ఇద్దఱు—(నడచుచున్నారు)

కంచు—(ముందు చూచి యంతటఁ బరిమళ మాఘ్రాణించి) దేవా! చిత్తగింపుఁడు. ఇదిగో! మంచుబిందువులచేత శీతలంబు లయినయీప్రభాతవాతపోతంబులు వీతెంచుటంబట్టియుఁ, గూలాయకూలంబులమేలుకొని కర్ణరసాయనంబుగాఁగలకలధ్వనులు సేయుచుఁ బిట్టలు తమచట్టుపలను విదుర్చుటంబట్టియు, నట్టిట్టు గదలి, తోడిమలపట్టుసడలి, దళములమీఁదుగాఁ బరులనుండి యూరలు విరులు, పఱచినట్టు లెల్లయెడలను దఱచుగాఁగాఁ, జూడ వేడ్క పుట్టించుచు, గమ్మగమ్మని కమ్మతావులు వెదచల్లుచున్న యీబాలోద్యానంబును దేవర యవలోకింప వలయును. చూడుఁడు,

ఉ. రాతిరి విచ్చి, మంచును మరందము లోపల సేకమానుమ
వ్రాతముతోడఁ దాము వఱువాతను నేలనురాలి, బాలసూ
ర్యాతపయోగభిన్నముకుళాంతరవాసన లాస గొల్పఁగా,
నీతఱిఁ దమ్మిమొగ్గలకు నేగెడు జుమ్మని గండుఁదుమ్మెదల్ ౭

దుర్యో—(పాఱఁజూచి) వినయంధర! ఈప్రభాతమున నీవనశ్రీయు రమణీయముగా నున్నది. చూడుము.

ఉ. అల్లన విచ్చుచో దళదళాంతరజాలగభానుహస్తముల్
మెల్ల నొడళ్లు సోఁక, నెకిమీండ్రను బోలెను నాండ్రతోడ రా
గిల్లుచు మేలుకాంచి, వలపించుక మైకలపంబు దెల్ప, ను
త్ఫుల్లసరోజగర్భమృదుమోహనశయ్యల వీడుఁ దుమ్మెదల్. ౮

కంచు—దేవా! ఇదిగో! భానుమతీదేవి సువదనచేతను దరళికచేతను సేవింపఁబడుచున్నది. దేవర యచ్చోటికి విచ్చేయుఁడు.

దుర్యో—(చూచి) ఓయీ! వినయంధర! ఇదిగో! దేవిని సందర్శించి నేనును నీవెనువెంటనే వచ్చేదను. నీవు పోయి పోరితంబునకుఁ దే రాయితంబు సేయుము.

కంచు—చిత్తము! ఇదిగో! సిద్ధపఱిచితిని. (నిష్క్రమించుచున్నాఁడు.)

సఖి—ప్రియసఖీ! జ్ఞప్తికి వచ్చినదా?

భాను—ఆ, వచ్చినది. సఖీ! విను. నే నీపరిమదవనంబునఁ గూరుచుండియుండఁగా, సమధికదివ్యరూపము గల యొకముంగిస యపురూపముగా నాయెదురను నూఱుపాముల రూపు మాపెను.

ఇద్దఱు—(వెనుకఁ దిరిగి తమలో) హరిహరీ! (ప్రకాశముగా) తరువాతఁ దరువాత?

భాను—అయ్యో! నాహృదయము సంతాపసదన మయి క్రిమ్ముఱ మఱచి పోయెనుగదా!

దుర్యో—(చూచి) ఓహో! దేవి భానుమతి సువదనాతరళికలతోడ నేమేమొ మంతన మాడుచున్నది. కానీ. దట్టముగా నల్లుకొనినయీతీఁగలగుంపుమాటునఁ బొంచి యుండి, వీరివిస్రంభసంభాషణముల నాలకించెదను. (అట్లు చేయుచున్నాఁడు)

సఖి—సంతాపము శాంతిపఱుచుకొని ప్రియసఖీ! చెప్పవమ్మా.

దుర్యో—ఏమి చెపుమా యీమెకు సంతాపకారణము? సరే. నేఁడు వాస భవనంబునుండి నాతోఁ జెప్పకుండ లేచి వచ్చినది గదా! కనుక నీమెకు నామీఁదఁ గోపము వచ్చినట్లు స్పష్టమగుచునే యున్నది. ఓభానుమతీ! దుర్యోధనుఁడు నీకోపమునకుఁ దగనివాఁడు సుమీ.

మ. అలుగన్ సల్పితినో ప్రమాదమునఁ గంఠాశ్లేషశైథిల్య, మా
వలమో మైతినొ నిద్ర నొత్తిగిలి, నావై పీవు పన్నుండఁగాఁ?
గలలోఁ బేరిలితినో పరాంగనకథల్? గావించినా నేదియో;
చెలి, యిం తేటికి? నన్ను దానునిబలెన్ జీవాట్లు పెట్టం దగున్. ౮

(ఆలోచించి) అటు గాక పోయినను.

తే. గీ. మిగులఁ జిత్తంబు నాయందె తగులుఁ గాన,
సంతతప్రేమబద్ధమత్సరము చేత,
లేమ నామీఁద నపరాధలేశ మేదొ
మోపి కోపించె నిండుఁబేర్మిమడిని; నిజము. ౯

అయిన నేమి చెప్పనోవిందము.

భాను—సఖీ! తరువాత నే నాసుందరనకులసందర్శనంబున మనంబున నానందంబు నొందితిని.

దుర్యో—ఏమిది! సుందరనకులసందర్శనంబున మనంబున నానందంబు నొందితివి గా! హా! మాద్రీసుతానురక్తురాలగుదీనిచేత మేము నిష్కారణము మోసపోయితిమి. (ముం దనినమాట స్మృతికి వచ్చి)

తే.గీ. “మిగులఁ జిత్తంబు నాయందె తగులుఁ గాన”

(అనుపద్యము చదివి) మూఢదుర్యోధన! అంకులాఁడిచేత వంచితుఁడ వగుట యెఱుంగక నిన్నెన్నివిధములనో మన్నించుకొన్నాఁడవు. మఱియిప్పు డేమనియెదవు?

“మ. అలుగన్ సల్పితినో”

(అను పైపద్యము చదివి దిక్కులు చూచి) ఔరా! ఇందుకా దీనికిఁ బ్రొద్దుటనే నిర్జనస్థలమును, సఖీజనసల్లాపములును? మోహవశంబున దుర్యోధనుం డీఅంకులాఁడిలో గుట్టును దెలియలేక యేమేమొ భ్రాంతిపొందెను. ఆ! ఓసిపాపాత్మురాలా! ఓసి కళత్రపాంసుల

ఉ. సన్నిధి వంత నీ కడలు, సాహసము ల్గన నింతలేసి; న
న్నెన్నుట లట్టు, నీవినయ మేదిన ప్రేమము లిట్టు; నాకు నీ
మన్నన యావిధంబు, కొలమాలినవర్తన మీవిధంబు; నీ
తిన్ననివంగసం బదియుఁ, దెచ్చినమచ్చ యి దయ్యో; జారిణీ! ౧౦

సఖి—తరువాతఁ దరువాత?

భాను—తరువాత నే నిప్పుడు గూరుచున్న యీలతామంటపము ప్రవేశించితిని. తోడనే యానకులకుమారుండు నన్ననుసరించి యీపూవుటీరముఁ జేరవచ్చెను.

దుర్యో—అహో! ఈపాపాత్మురాలికి సిగ్గు లేకున్నది! ఇది కులటల కుచితమేగదా,

తే. గీ. చిరతరాబాల్యవర్ధితస్నేహ యయ్యుఁ
జెప్ప లజ్జించు నారతిచిన్నె లెవరి
కట్టిచెలికత్తెలకు అంకులాఁడితనమె
చెప్పుచున్నది కాసంత సిగ్గు లేక. ౧౧

ఇద్దఱు—తరువాతఁ దరువాత?

భాను—ఆవెనుక నానకులకుమారుండు గర్వముతో మీఁదిమీఁదికి వచ్చి తనచేతితో నాపయిఁటకొంగును దొలంగించెను.

దుర్యో—(క్రోధముతో) సరే. ఇఁకఁ బయిసంగతి విన నక్కఱలేదు. కానీ, పరవనితాహరణప్రగల్భుం డైన యామాద్రీసుతాధముజీవితమును నే నపహరించెదను. (కొంచెము నడచి యాలోచించి) అటుగాదు. ఇదియే మిగులం బాపాత్మరాలు. దీని నే ముందుగా సంహరింపవలయును. (అని మరలుచున్నాఁడు.)

ఇద్దఱు—తరువాతఁ దరువాత?

భాను—సఖీ! అటుమీఁదట మహారాజుగారి ప్రాభాతికశోభాకరమంగళమృదంగాదివాద్యంబులచేతను, వారవిలాసినీసరససంగీతభంగీతరంగంబులచేతను మేలుకొంటిని.

దుర్యో—(సవితర్కముగా) ఏమిది? మేలుకొంటి ననుచున్నదే. స్వప్నదర్శనవృత్తాంతము చెప్పుచున్నదా యేమి చెపుమా? (ఆలోచించి) కానీ. సఖీవచనంబున స్పష్ట మగును.

ఇద్దఱు—(విషాదముతో నొండొరులను జూచుకొని)

సువదన—ఇందలి యమంగళమును బవిత్రము లగుభాగీరథీప్రముఖపుణ్యనదీతోయములచేత, నమోఘము లగుబ్రాహ్మణాశీర్వాదములచేతను బ్రజ్వలితహుతాశనహోమములచేతను బరిహరింతము.

దుర్యో—చాలు నాచిత్తక్షోభకల్పము. నిశ్చయముగా నీసెః స్వప్నదర్శనమే వర్ణించుచున్నది. నేనే మందబుద్ధి నయి యన్యథా తలంచితిని.

చ. అరసగ మూలకించి చనసైతిని గోగ్రహముతో, నదృష్టమే;
పరుసను లాడనైతిఁ గొలుపల్కుల కల్క జనించి, పుణ్యమే;
సరి యని నేను నమ్మఁగ వెసం గథయుం దుద ముట్టె, దిష్టమే;
తరుణి నిరాపనిందఁ బడి ధాత్రికిఁ బాయుటఁ దప్పె, భాగ్యమే. ౧౩

భాను—సఖీ! ఇందేమి శుభసూచక మున్నదో చెప్పుము.

ఇద్దఱు—(ఒండొరులను జూచుకొని వెనుకఁ దిరిగి) ఇందుఁ గొంచెమైనను శుభసూచకము లేదు. అసత్యము చెప్పుట మిసుల నపరాధముగదా ? సఖుల నడిగి నప్పుడు కఠినముగా నున్నను హితము నే చెప్పవలయును. (ప్రకాశముగా) సఖీ! ఇది యంతయు నశుభమునే సూచించుచున్నది. కాఁబట్టి దూర్వాదిసరిగ్రహంబు చేత, దేవతాప్రణామంబు చేత, నిది పరిహరింపఁబడును. నకులమునుగాని మఱి దేనినిగాని కోఱలు గలజంతువును గలయందుఁ జూడఁ గూడదు. మఱియు నూఱు పాములను వధించుటగూడ స్వప్నమందుఁ జూడ రానిదే.

దుర్యో—సువదన యథార్థము పలికినది. నకులముచేతఁ బన్నగశతవధంబును స్తనాంశుకహరణంబును నిశ్చయముగా మా కరిష్టోదర్కమునుగా నూహించుచున్నాను.

తే. గీ. చూడఁ బర్యాయమున శుభాశుభము లైన
స్వప్నములు రాక యుండవు జనులకెల్ల;
నూ ఱనెడులెక్కచే నూహపాఱె మదిని
దమ్ముఁగమితోడ నాకిది దగిలినట్లు.

(ఎడమక న్నదరుట సూచించి) ఆ! దుర్యోధనుఁడ నయిననాకుఁ గూడ నిమిత్తములు చిత్తవిక్షోభమును గావించుచున్నవి! (గర్వముతో) ఇది యెట్లు! భీరుజన హృదయప్రకంపనము లయిన యిట్టివానియెడల దుర్యోధనున కేమి లక్ష్యము? ఈయర్థమున నంగిరసుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

తే. గీ. కాకతాళీయముగ మూఁడు గల్గుచుండు.
స్వప్నశకునంబులును గ్రహచారములును;
బిఱికివారలు వానికి బెదరుచుండ్రు;
ప్రాజ్ఞు లాచందమున భయపడరు మదిని, ౧౪

కాఁబట్టి స్త్రీస్వభావముచేతఁ జులుకనగాఁ గలిగిన యీభానుమతిమనసులోని వెఱ్ఱిభయమును దేను బోగొట్టెదను.

భాను—సఖీ! సువదనా! ఉదయపర్వతశిఖరంబుమాటుననుండి తనయరదంబు బయలుదేఱ, సంధ్యారాగంబు పోయి ప్రసన్నం బైనదురాలోకతేజోమండలంబు తోడ మార్తాండుం డదె యుదయించుచున్నవాఁడు. చూడుము.

సఖి—సఖీ! రోషాన్వితకర్ణకాంతిసశ్రీకం బయినతనకిరణసహస్రంబును, నిబిడముగా నల్లుకొనినయావల్లికావృతులసందులనుండి వ్యాపింపఁజేసి, యుద్యానవనాంగణంబునకు బంగారునీరు వోయుచు, దాయలకుం జూడ నలవికాకుండునట్లు, వేఁడి వెలుంగు నింగి నలంకరించుచున్నవాఁడు. ఇమ్మహానుహునకు లోహితచందన కుసుమగర్భం బగునర్ఘ్యంబు నొసంగ నిది మంచిసమయము.

భాను—చేటీ! తరళికా! అర్ఘ్యపాత్రము నిటు తే. భగవానుఁ డయిన యీ యుదయభానునిపూజ నిర్వర్తించెదను.

చేటి—దేవీ! చిత్తము. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) దేవీ! ఇదిగో నర్ఘ్యభాజనము. ఈబాలభానునిసపర్య నిర్వర్తింపుము.

దుర్యో—ప్రేయసీసమీపమునకుఁ బోవ నిదియే మంచిసమయము. (పోవుచున్నాఁడు.)

సఖి—(చూచి తనలో) ఎందుకో మహారాజు వచ్చుచున్నాఁడు. అయ్యో! ఈ మౌనమునకు భంగము గలుగును గదా!

భాను—(సూర్యున కభిముఖి యయి) దేవా! గగనసరోవరవిరాజమానవికచారుణసహస్రపత్రశోభాకరా! పురందరహరిత్సుందరీవదనారవిందసందీపితసిందూర తిలకా! సకలభువనైకరత్నప్రదీపా! కృపాయత్తచిత్తంబున నావందనంబుఁ జేకొని, నేఁడు నాకుఁ గలిగినయీస్వప్నమందు నేమికీ డున్నను నదియంతయు సభ్రాతృకుం డగునాప్రాణనాయకునకుఁ గుశలముగాఁ బరిణమింపం జేయుదువుగాక! (అర్ఘ్యమిచ్చి) ఓసీ! తరళికా! ఇతరదేవతలఁ గూడఁ బూజించుటకుఁ బుష్పముల నిటు లందిమ్ము. (చేతులు సాఁచుచున్నది.)

దుర్యో—(చేసన్న చేతఁ బరిజనమును దొలఁగించి, తానే పువ్వుల నందియ్యఁ బోయి స్పర్శసుఖము నభినయించుచుఁ, బరవశమునఁ బుష్పముల నేల జాఱవిడిచినాఁడు.)

భాను—(కోపముతో) ఏమీ! పరిజనమున కింత మయిమఱపా? (మరలి రాజును జూచి భయపడి సిగ్గుపడుచున్నది.)

దుర్యో—దేవీ! ఇటువంటిసేవావకాశమందు నీపరిజనుఁడు మిక్కిలి చేతఁగానివాఁడు; దేవిగారు వీనిని శిక్షించి దిద్దుకొన వలయును. ఓ ప్రియురాలా!

తే. గీ. కలికి! నీసోగ తెలిమోరగంటిచూపుఁ,
బడయ నాసించు లెంకచో భయము దగునె?
మందహాసాంకురము మోవి మఱయఁ బలుకు;
మూడిగము సేయ దోసిలి యొగ్గి యుంటి.

భాను—మహారాజా! నాకుఁ గొండొకనియమమం దభిలాష గలదు. దేవర యనుగ్రహించి యభ్యనుజ్ఞ నీయ వలయును.

దుర్యో—దేవీ! నీస్వప్నవృత్తాంతము నంతయు నాలకించినాఁడను. ప్రకృతి సుకుమార మయినయీశరీరము నేల యిట్లు గాసిల్లఁ జేసెదవు?

భాను—ప్రాణేశ్వరా! నాహృదయము నతిశయముగా సంశయము బాధించుచున్నది. దేవర నా కనుజ్ఞ నీయ వలయును.

దుర్యో—(గర్వముతో) దేవీ! చాలు నీశంక. చూడు,

మ. ధర గుర్వింగం దెస లన్ని నిండుటలు వ్యర్థంబె మదక్షౌహిణుల్?
గురుతో నేమిఁకఁ? గర్ణుఁ డేపనికి నోర్కొనీయెడల్ గాసిలన్?
తరుణీ! భ్రాతృశతాస్మదీయభుజకాంతారాంతరస్వైరసం
చరదుర్యోధనకేసరీంద్రగృహిణీ! శంకింప నీ కేటికిన్? ౧౮.

భాను—ప్రాణేశ్వరా! మీరు సన్నిహితులై యుండఁగా నాకు శంక యేమి? మఱేమన్న దేవరకే మనోరథసిద్ధి గావింప నభిలషించుచున్నాను.

దుర్యో—ఓసుందరీ! మాకిదే మనోరథము. ఎల్లప్పుడును స్వేచ్ఛను నీతోఁ గూడి విహరింప వలయును. చూడు,

ఉ. కూరిమి నిశ్చలంబు లగుగొప్పకను ల్వాలితమ్ముల న్నగన్,
దోరపుసిగ్గునం బలుకు దొట్రిల, లోఁ జిఱున వ్వెలర్ప, లా
క్షారసరక్త మౌపెదవి చక్కెర చిమ్మఁగ, ముద్దు గాఱుసిం
గారపునీము ఖేందురుచికన్నను దుర్లభ మేది నా కిలన్? ౧౯.

(తెరలోఁ బెద్దకలకలము. అందఱు నాలకించుచున్నారు.)

భాను—(రాజును గౌఁగిలించుకొని) ప్రాణేశ్వరా! రక్షింపు రక్షింపుము.

దుర్యో—(పాఱఁజూచి) ప్రియురాల! భయపడకు భయపడకు.

శా. ప్రాఁకుల్ పెల్లగిలంగ, స్కంధకశతల్ గ్రమ్మంగ ధూమంబు, దం
డాకారభ్రమధూళి రేఁగఁగఁ దృణవ్యాప్తిం దివిన్, శర్కరా
వ్యాకీర్ణం బయి, పెద్దచప్పు డెగయం బ్రాసాదగర్భంబులన్,
లోకం బాకుల మొంద, గాలి విసరెన్; లోలాక్షి! జం కేటికిన్? ౨౦.

సఖి—మహారాజ! మేఘము గ్రమ్మినట్టు కఱకుదుమ్ము భూమినుండి యెగసి కన్నులు దెఱవ కుండఁ జేయుచున్నది. పెళపెళారావముతోఁ బెద్దపెద్ద

చెట్లు విఱిగి పడియెడుచప్పుడులు విని బెదరి, లాయముల నున్నయుత్తమతురంగంబులు కట్లు దెంచుకొని యట్టిట్టుఁ బరుగెత్తుచున్నవి. పనివాండ్రందఱుఁ దమతమ పనులు నిలిపి వేసికొని యూరకుండిరి. అహో! ఈదారుణసమీరణాసారంబు సర్వవిధంబులఁ జెఱుపు చేయుచున్నదిగదా! దేవర యింక నిక్కడ లేచి యీదారుపర్వతప్రాసాదము ప్రవేశించుట యనుకూలము.

దుర్యో—ఈసురకరువలి దుర్యోధనునకు మహోపకారి గాని మాఱుతుండు గాఁడు సుమీ. ఈతనిపుణ్యంబునం గాదె యీదేవి తననిమమును మాని నామనోరథము దీర్చినది.

మ. కనుబొమ్మల్ ముడి వేయ లేదు; కనులం గ్రమ్మంగ లే దశ్రులుᳲ;
గినుకᳲ మోమటు చేయ లేదు; శపథోక్తిం బల్కి వారింపలే;
దనుఁగుంజన్నులురమ్ము గాఁడఁ జెలి గాఢాలింగనం బిచ్చె. హా
యని సౌఖ్యాబ్ధిని దేల నామనసు వాత్యాచక్రభీతాత్మయై. ౧౯.

కావున సంపూర్ణమనోరథుండ నగునాకు స్వేచ్ఛావిహారము గావలసినదే దారుపర్వతమునకుఁ బోవుదము. (అందఱు నోరుగాలిబాధను నిరూపించుచుఁ గష్టముగా నడచుచున్నారు.)

దుర్యో—క. అడుగులు మెలమెల్లగ నిడు;
నడఁకుచు నడుపంగఁ బోకు; పడెదవు సుమ్మీ
పడఁతీ! భుజలతికలు నా
మెడకును బెనవేయు మురము మెఱమఁగఁ జన్నుల్. ౨౦

(పరివేశము నిరూపించి) ప్రియురాలా! ఈగర్భగృహము సంవృతమగుటవలన వాయు వెందుఁ బ్రవేశింప నేరదు; నలుసులు దుడుచుకొని కన్నులు చక్కఁగాఁ దెఱువుము.

భాను—(సంతోషముతో) అమ్మయ్యా! అదృష్టముచేత నీపరిశ్రయవాయువునకుఁ దప్పితిమి.

సఖి—మహారాజ! ఈదారుపర్వతారోహణశ్రమమును మాప్రియసఖియూరుయుగళము సహింపఁ జాలకున్నది. దేవరవారు వేదికాసనము నింకను నలంకరింప కున్నారేమీ?

దుర్యో—(దేవిని జూచి) దేవీ! వాత్యాసంభ్రమమున నీకుఁ గలిగినయపకార మల్పమే. అయినను.

చ. కనుఁగవ పెద్ద దొట, నధికశ్రమ సల్పెడు నల్పరేణువుల్;
ఘనకుచ ఘాటలో, మ్మలఁతికంపముచేతనె ధూతహారమాఁ;

బెనుచును గంపముల జఘనవిస్తృతి యూరుల కల్ల నేగినల;
గనుఁగొన నీళుభాంగములు గాలికిఁ దోడ్పడె బాధ సేయుటల. ౨౧

(అందఱును గూరుచున్నారు.)

దుర్యో—అహో! ఏమిది! దేవి యనాస్తరణ మైనకఱకురాతిసేలను గూరుచున్నది.

తే. గీ. జిలుఁగుఁబుట్టంబు గాలికిఁ జెదర, నాకుఁ
గనులపండువు సేయునీఘనజఘనము,
వలవదే గారపింప, నావలువ యెగయ,
నువిద! నీ చూపుఁ దనువునాయూరుయుగము? ౨౨

[తెరను జిమ్ముకొని తత్తరపాటుతోఁ గంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—దేవా! భగ్నమయినది, భగ్నమయినది.

(అందఱుఁ దెల్లఁబోయి చూచుచున్నారు.)

దుర్యో—ఎవనిచే?

కంచు—స్వామీ! భీముచే.

దుర్యో—ఆ! ఏమిరా పేర్శిలెదవు?

భాను—ఓయీ! ఏమి చెఱుపు చెప్పుచున్నావు?

కంచు—(భయముతో) ఇదిగో! సర్వము మనవిచేసెదను.

తే. గీ. భగ్నమయినది భీముచేఁ బవనుచేత
నూతనం బైనమీరథకేతనంబు;
కింకిణీక్వాణమున నది క్రిందఁ బడియె,
రోదనము చేయునది వోలె మేదినీశ. ౨౩

దుర్యో—బల మయినగాలి కొట్టినందున లోకమే వ్యాకుల మయినది. ఇక రథమున కెత్తినజెండా విఱిగి పడుట యేమి వింత? అంతమాత్రమున కింత ప్రళయముగా "భగ్న మయినది భగ్న మైనది" యని ప్రలపించెద వేమి?

కంచు—దేవా! మ ఱేమి లేదు గాని, యీయనిమిత్తము నుపశాంతిచేయుట కయి దేవరవారితో విన్నవింపు మని స్వామిభక్తి న న్నిట్లు పలికించినది.

భాను—ప్రాణేశ్వరా! ప్రసన్నబ్రాహ్మణవేదానుఘోషమునను, హోమమునను, నీయనిమిత్తము పరిహరింప వలయును.

దుర్యో—సరే, నీవు పోయి పురోహితుఁ డయినసుమిత్రునితోఁ జెప్పుము.

కంచు—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు.)

(ప్రతీహారి ప్రవేశించి, ... ...)

ప్రతీ—జయముజయము మహారాజా! దేవా! అల్లుఁడయినసింధురాజుగారి తల్లియు, నమ్మగారు దుస్సలయును వచ్చి ద్వారముకడ నిలిచి యున్నారు.

దుర్యో—(తనలో) ఏమి? జయద్రథమాతయును, దుస్సలయునా? అభిమన్యువధామర్షితులైనపాండుసుతులచే నేదేని మహోపద్రవము సంభవిల్లినది కాదు గదా? (ప్రకాశముగా) పోయి వారిని వేగముగాఁ దీసికొని రా.

ప్రతీ—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నది.)

(తరువాతఁ దొట్రుపడుచు సైంధవునితల్లియు దుస్సలయుఁ బ్రవేశించుచున్నారు.)

ఇద్దఱు—(ఏడ్చుచు దుర్యోధనునిపాదములమీఁదఁ బడుచున్నారు.)

మాత—కురునాథా! రక్షింపుము రక్షింపుము.

దుస్సల—(రోదనము చేయుచున్నది.)

దుర్యో—(తొందరపడి లేచి) అమ్మా! ఊఱడిల్లు మూఱడిల్లుము. ఏమి యుపద్రవము వచ్చినది? యుద్ధరంగమున నప్రతిహతరథుండగుజయద్రథునకుఁ గుశలమే కదా?

మాత—ఏమి కుశల మోయితండ్రి!

దుర్యో—ఎందువలన?

మాత—(భయముతో) పుత్త్రవధసంజాతక్రోధంబున మండి పడుచు గాండీవి సూర్యుం డస్తమింపక మున్న యతనిని వధించుటకుఁ బ్రతిజ్ఞ పట్టినాఁడు

దుర్యో—(చిఱునవ్వుతో) ఇదా యంబకును దుస్సలకును పెద్దదుఃఖకారణము? పుత్త్రశోకముచేతఁ గాల్పఁబడుచుఁ గ్రేలినకిరీటిమాటలచేతనిట్టియవస్థను బొందుచున్నారు. ఆహా! అబలలపేలతనము! అమ్మా! ఇంక విచారము చాలింపుము. అమ్మాయీ! దుస్సలా! కంటఁ దడి పెట్టకుము. దుర్యోధనబాహుపరిఘసంరక్షితుండును మహారథుండు నగుజయద్రథుని ధనంజయుఁడు ప్రధనంబున నెట్లు నిధనంబునొందింపఁగలఁడు?

మాత—కుమార! బంధువధచేతఁ గలిగినదుఃఖమునఁ గోపాగ్నులు ప్రజ్వలింప వీరావేశంబున వారు శరీరంబు లాలింపక తిరుగుచున్నారు.

దుర్యో—(పక్కున నవ్వి) అది నిజమే. పాండవు క్రోధము జగత్ప్రసిద్ధమే కదా! చూడు,

ఉ. ముంగలఁ బట్టి యీడ్చుచుఁ బుట్టము లొల్వఁగ దుస్ససేనుఁ, డే
నందఱిలోన నోసిపశువా! పశువా, యని కృష్ణ నంటి; నాఁ
డందున లేఁడె గాండివి? యహో! విను, క్షత్త్రియవంశమందుఁ బు
ట్టొందినపిన్నవాని కిఁక నున్నదె యెక్కుడుక్రోధహేతువుల్? ౨౮

మాత—అయ్యో! యీప్రతిజ్ఞ నెఱవేఱకపోయినఁ దాను జచ్చిపోవుటకుఁ గూడఁ బ్రతిజ్ఞఁ జేసికొనె నోయితండ్రి!

దుర్యో—అట్లయిన మఱియు మేలే. మోదము నొందుటకు బదులు ఖేదము నొందుచున్నా రేమి? తమ్ములతోఁ గూడ ధర్మరాజు రూపు మాసె నని తలఁచి సంతోషింపుఁడు. అమ్మా! కురుకుమారశతపరివారవర్ధితమహిముండును, కృపద్రోణాశ్వత్థామాదిమహారథద్విగుణీకృత నిర్వ్యక్రవిక్రముండును నగునీకుమారుని పై నెదలపెట్టుటకుఁ గవ్వడి గాని మఱి యెవ్వఁడు గాని సమర్థుండు గాఁడు. నమ్మును. ఓసి కొడుకుశక్తి తెలియనిదానా!

తే. గీ. భీముబలమును, విన్వచ్చువిక్రమంబుఁ
దలఁచి ధర్మజుఁ గవలను దలఁప రాదు;
వారిలో నైన నెదిరించువాఁ డెవండు,
చేత విలు పూని నిలిచినసింధురాజు?

భాను—దేవా! అది నిజమే. అయినను గురుకృతప్రతిజ్ఞాభరుం డగుభీభత్సుండు భయనిదానుండె గదా!

సూత—అమ్మాయీ! బాగున్నది. కాలమునకుఁ దగినట్లు లాలోచించితివి.

దుర్యో—ఆ! దుర్యోధనుఁడ నైననాకుఁ గూడఁ బాండవులా భయనిదానులా? చూడుము,

స్రగ్ధర. కోదండజ్యాకిణాంకుల్ కుటిలరిపుజనక్షోభు లాముక్తవర్మల్
సైదోడుల్ నూర్వు రచ్చాభ్జవన మనుకొనన్ ఛత్రముల్ దాల్చి రాఁ, బె
ల్లొదు మ్మాదిత్యుతేజ మ్మడఁప నసివిభావ్యాప్తిఁ జూడంగ రాకె
చ్చోఁ దా మై నాదుసేనల్ సారిది రణమునం జొచ్చు మాత్సర్య మొప్పన్.

ఓభానుమతీ! పాండవపరిభావము తెలిసినదానా! నీవు కూడ నిట్లు భయపడెద వేమి? చూడు,

తే. గీ. దుస్ససేనునురమ్ము నెత్తురులు గ్రోల,
గద సుయోధనుతొడలు భగ్నముగఁ జేయఁ,
జేయరే వారు ప్రతినలు? సింధురాజుఁ
జంపుశపథంబు నట్టిదే; జంక నేల? ౨౭

ఓరీ! యెవడురా అక్కడ? శీఘ్రముగా మాజయరథమును దీసికొని రా. ఇప్పుడే యాప్రల్లదుని మిథ్యాప్రతిజ్ఞునిఁ గావించి, వానికిఁ బవిత్ర మైనశస్త్రమరణము లేకుండఁ జేసెదను.

(కంచుకి ప్రవేశించుచున్నాఁడు.)

కంచు—దేవ!

తే. గీ. జాళువాచిఱుగంటలు శ్రావ్యముగను
మెఱయఁ, బాగ్గలించు సరంబులు వెలుంగ,

వల్గితాకులహయములఁ బన్ని తెచ్చె
రథము. తే. పితారిహృన్మనోరథము, దేవ! ౨౧

దుర్యో — దేవీ! నీ వంతిపురమున కేగుము. నేను నాప్రల్లదుని మిథ్యాప్రతిజ్ఞునిఁ గావించి తెల్లఁబుచ్చి వానికిఁ బవిత్ర మయినశస్త్రమరణము లేకుండఁజేసెదను.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

గద్య. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది సాధువంశక్షీర
నీరాకరరాకాసుధాకర రాచ్చనామాత్యపౌత్ర హారితసగోత్ర పవిత్రగుణకదంబ
లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధ
విధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీకృత వేణీసంహార
నాటకంబునందుఁ ద్వితీయాంకము.



శ్రీ రస్తు.

శ్రీపరమాత్మనే నమః

# వేణీసంహారనాటకము.



## తృతీయాంకము.

---:o:---

రంగము—యుద్ధభూమి.

(తరువాత వికృతవేషముతో నొకరాక్షసి ప్రవేశించుచున్నది.)

రాక్షసి—(వికృతముగా నవ్వి సంతోషముతో) చచ్చిపోయిన మనుష్యుల మాంసముతోడను వసతోడను వేయికడవలరక్తము సంపాదించి యుంచితిని. ప్రతిదినము దృష్టిదీక్షఁ దాఁగెదను. ఈ యుద్ధము నూ ఱేండ్లు వర్ధిల్లుఁ గాక. (సంతోషమున గంతులు వేయుచు) సైంధవవధ జరిగించిననాఁడు వోలెఁ బ్రతిదినము నర్జునుఁడు యుద్ధకర్మమును సలిపె నేని, నాయింటికొట్లన్నియు రక్తమాంసములతో నిండియుండును గదా! (నడిచి దిక్కులుచూచి) అయ్యో! నామగఁడు రుధిరప్రియుఁ డెక్కడ నున్నాఁడో? వానిని వెదకెదను. (నడిచి) పోనీ పిలిచెదను. ఓరుధిరప్రియా! ఓరుధిరప్రియా! ఇటురా. ఇటురా.

(తరువాత నట్టిరాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రాక్షసు—(ఆయాసపడుచు) ఇప్పుడు క్రొత్తగాఁ జంపఁబడినమనుష్యుల మాంసమును వెచ్చవెచ్చనిపచ్చినెత్తురును లభించె నేని నాయాయాసము నిముసములో నుపశమిల్లును గదా!

రాక్షసి—(తిరుగఁ బిలుచుచున్నది.)

రాక్షసు—ఓరీ! ఎవతెరా నన్నుఁ బిలుచుచున్నది? (చూచి) ఓహో వసాగంధా? (సమీపించి) వసాగంధా! న న్నెందుకే పిలుచుచున్నావు!

రాక్షసి—ఇదిగో! రుధిరప్రియా! ఇప్పుడే హతుఁడైనయొకానొకరాజఋషిశరీరావయవములనుండి ప్రవహించి వసాస్నేహము చేతఁ జిక్కనై గోరువెచ్చగా నున్న యీక్రొత్తనెత్తురు హృదయమాంసముతోఁగూడ నీనిమిత్తము కొనివచ్చినదానను. ఈమాంసము నంజుకొనుచు రక్తమున దప్పి తీర్చుకో.

రాక్షసు—(సంతోషముతో) బాగు! వసాగంధా! బాగు! కడు మేలయిన పని చేసితివి. నేను మిక్కిలి వడ గొట్టి "యెక్కడనైనను వెచ్చవెచ్చనినెత్తురు దాహమువకు దొరకునా?" యని కనుపెట్టుకొని యున్నాను

రాక్షసి—రుధిరప్రియ ! మనుష్యులు, ఏనుఁగులు, గుఱ్ఱములు, మొదలగువాని రక్తప్రవాహములచేతఁ బెద్దసముద్రములాగున నున్నయిటువంటియుద్ధరంగమునఁదిరుగుచుండియు దప్పిగొన్నానఁడ నని చెప్పుచున్నావు. నాకుఁ జాల వింతగానున్నది.

రాక్షసు—(క్రోధముతో) ఓసి వసాగంధా ! పుత్రశోకముచేతఁ బరితపించుచున్న మనరాణి హిడింబాదేవిని జూచి వచ్చుటకు వెళ్ళినానఁడనే.

రాక్షసి—రుధిరప్రియా ! మనరాణి హిడింబాదేవి ఘటోత్కచకుమారుని మరణమున కింకను నేడ్చుచునే యున్నదా ?

రాక్షసు—ఓసీ! ఆమెదుఃఖ మెట్లు చల్లాఱును? అయినను నభిమన్యునిచావు వలన సమానదుఃఖురా లయినసుభద్రాదేవియు, ద్రౌపదీదేవియు నామె నూఱడించుచున్నారు.

రాక్షసి—రుధిరప్రియ! ఇదిగో నేనుఁగుఁబుఱ్ఱెలోఁ బట్టి తీసికొని వచ్చిన దానను. ఈవెచ్చవెచ్చనికొ్రత్తనెత్తురు గుండెలయూరఁగాయను జప్పరించుచు దాహము పుచ్చుకో.

రాక్షసు—(అలాగుచేసి) వసాగంధా! నీవు రక్తమును హృదయమాంసమును గూడ నేపాటి సంగ్రహించి యుంచితివే?

రాక్షసి—రుధిరప్రియ! మునుపు నేను దాఁచిపెట్టిన దెంతో నీ వెఱుఁగనే యెఱుఁగుదువు. క్రొత్తగాఁ గూర్చి పెట్టినది చెప్పెద వినుము. భగదత్తుని నెత్తురు బానెఁడు. సైంధవునివస రెండు కడవలు. విరాటరాజు భూరిశ్రవస్సు సోమదత్తుఁడు బాహ్లీకుఁడు మొదలగు పెద్దపెద్దరాజులయుఁ, దక్కినముక్కిడిమానుసులయు రుధిర వసామాంసములు వేలకొలఁది బానలనిండఁ బట్టి, వాసెనలు గట్టి, యింటిలోఁ బదిలముచేసి యుంచినదానను.

రాక్షసు—(సంతోషముతోఁ గౌఁగిలించుకొని) వహవా ! వహవా ! నీవు మిక్కిలి మంచిపెండ్లామవే. నీవంటిమంచిపెండ్లాము దొరకుటచేతను. హిడింబాదేవి ప్రసాదముచేతను నాదారిద్ర్యము బొత్తిగ వదలిపోయినది.

రాక్షసి—రుధిరప్రియ! హిడింబాదేవిప్రసాద మెట్టిది?

రాక్షసు—ఇంతకుముందే హిడింబాదేవి నన్ను గౌరవముతోఁ బిలిచి "రుధిర ప్రియ! నీవు నేఁడు మొదలు యుద్ధములో భర్తగారివెనువెంటను దిరుగుచుండునది" యని యాజ్ఞాపించినది. కాఁబట్టి భీమసేనుఁడుగారితోఁ దిరుగుచుండు నాకు నేమి కొదవ? రక్తము మాఁసము మెదడు క్రొవ్వు మొదలుగా నేమి గావలసిన నదియెల్లను సులభముగా లభించును గనుక, నాఁకలి యెట్టిదో దప్పిక యెట్టిదో యెఱుంగక భూలోకస్వర్గ మనుభవించెదను. నీవును జాగరూకురాల వయి మఱి శేయికడవల రక్తము సంపాదించి యుంపుము.

రాక్షసి—రుధిరప్రియా! నిన్ను భీమసేనుఁడుగారితో నుండు మన్నదియెందుకు?

రాక్షసు—వసాగంధా! మనదొర భీమసేనుఁడుగారు దుశ్శాసనునిగుండెలు బద్దలు చేసి రక్తము త్రాగుటకుఁ బ్రతిజ్ఞ పట్టినారు. కావున రాక్షసుల మయిన మనము గూడ నాయనతో రక్తపానము చేయ వలె నని.

రాక్షసి—(సంతోషముతో) దేవీ! బాగు! బాగు! నీయనుగ్రహమున నా మగనికి మంచియుద్యోగము దొరకినది.

[తెరలోపలఁ బెద్దకలకలము]

ఇద్దఱు—(ఆలకించుచున్నారు.)

రాక్షసి—ఓరుధిరప్రియా! ఏమిది? పెద్దకలకలధ్వని వినఁబడుచున్నది.

రాక్షసు—ఓసీ! వసాగంధా! ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిజుట్టుఁ బట్టుకొని కత్తితోఁ గుత్తుకఁ గోయుచున్నాఁడు.

రాక్షసి—(సంతోషముతో) రుధిరప్రియా! మనము గూడఁ బోయి ద్రోణుని రక్తము త్రావుదము.

రాక్షసు—(భయముతో) వసాగంధా! అది బ్రాహ్మణరక్తమే; గొంతుదగులఁ బెట్టుచు లోపలఁ బ్రవేశించును. అయ్యో! మన కది యెందుకే?

[తెరలో మరలఁ గలకలము.]

రాక్షసి—రుధిరప్రియా! ఇదిగో! మరలఁ బెద్దకలకలధ్వని వినఁబడుచున్నది.

రాక్షసు—(తెరవంకఁ జూచి) వసాగంధా! ఇదిగో! ఖడ్గము చేతఁ బట్టుకొని యశ్వత్థామ యిటు వచ్చుచున్నాఁడు. ఒకవేళ ధృష్టద్యుమ్నునిమీఁది కోపమున మనలను గూడఁ బట్టి వధించు నేమో! లేచి రా. మనరాణి హిడింబాదేవి యాజ్ఞాపించినట్లు చేయుదము. (నిష్క్రమించుచున్నారు, ప్రవేశకము.)

[తరువాత నుత్తాలఖడ్గుఁ డయి కలకల మాలకించుచు నశ్వత్థామ ప్రవేశించుచున్నాఁడు]

మ. బహులోద్యత్ప్రళయానిలక్షుభితశుంభత్పుష్కలావర్తమే
ఘహాటాద్భైరవగర్జితారవసదృక్షం బై, విశీర్ణశ్రవః
కుహరం బై, తతరోదసీభరిత మై, క్షుభ్యత్కులక్షోణిభృ
ద్గుహ మై, యుద్భవ మయ్యె యుద్ధభువి నీకోలాహలం బే మొకో? ౧.

(ఆలోచించి) అర్జునుఁడో సాత్యకియో వృకోదరుఁడో పడుచుఁదనపుగర్వముచేత మర్యాద నతిక్రమించి ప్రవర్తించినారు. అందుచేత మాతండ్రిగారు మహాకోపమున శిష్యవాత్సల్యము నొకమూలను ద్రోసి, నిజ మయినతపఃపరాక్రమమునకుఁ దగినంత పని చేయ నారంభించి యుందురు. ఇది నిశ్చయము.

మ. అని దుర్యోధనపక్షపాతసదృశం బ్రహ్మాగ్నిహోత్రోచితం
బనఘశ్రీభృగురామలబ్ధబహుదివ్యాస్త్రానురూపంబు స
ద్ధనురాచార్యరుషానురూప మగుచేతల్ చేసెం గాంభోలు మ
జ్జనకుం డారిపుఘస్మరు న్మొనయఁగా శక్తుం డెవం డాయెనన్? ౨.

(వెనుకకుఁ దిరిగి చూచి) ఇంకను నేను రథము నెందుకుఁ బ్రతీక్షింప వలెను? నీలమేఘచ్ఛాయను గేరుచు బంగారుఁబిడియును దట్ట మయినపట్టుఁదాళ్లును గలిగి యున్న యీఖడ్గమే నాకుసకలశస్త్రములును; శీఘ్రముగా యుద్ధరంగమున నుఱికెదను. (నడచి యెడమకన్ను నదరుట నూహించి) ఏ మిది? ఆహవమహోత్సవప్రమోదనిర్భరుండ నయి తండ్రిగారిపరాక్రమము చూడ వేడుకపడుచున్న యశ్వత్థామ ననునాకుఁ గూడ నీ యనిమిత్తములు సమరగమనవిఘ్నమును గలిగించుచున్నవి. కానీ. పోయెదను. (గర్వముతో నడిచి ముందు చూచి) అహో! ఏమిది? అవధీరితసకలక్షత్రధర్ములయి, యుత్సృష్టసత్పురుషోచితలజ్జావమంతను లయి, విస్మృతస్వామిసత్కారలఘుచేతసు లయి, యాగణితకులవచస్సదృశపరాక్రములయి. యీరథికులు హస్తిపకులు నాశ్వికులుఁ బదాతులును మూఁ దిరిగి చూడక వెన్నిచ్చి పఱచుచున్నారు. ఏమీ! యీబలములమహాక్షోభము! (నిరూపించి) ఆహా! ఎంతకష్టము! కర్ణాదు లయిన మహారథులు గూడ సమరపరాఙ్ముఖు లగుచున్నవారే! (భయముతో) మాతండ్రిగారిచేత సంరక్షింపఁబడుచున్నను బలములకు నిట్టియవస్థ సంభవించిన దేమి చెపుమా? ఏమో కానిమ్ము. ఓయీ కౌరవసముద్రవేలాపరిపాలనమహామహీధరమూర్ధాభిషిక్తులారా! ఏల యీలాగున యుద్ధరంగమునుండి పాఱిపోవ సాహసించితిరి? చాలుఁ జాలు. నిలు నిలుండు.

తే.గీ. సమరమునకుఁ దొలంగినఁ జావ లేని,
యిచటు వాసి మ ఱొక్కెడ కేగఁ దగును;
జంతువుల కెల్ల మృత్యువు సహజ; మూర
కిట్లు మీకీర్తి నలుపు గావింప నేల? ౩.

మఱియు,

చ. పరబలవార్ధిహేతియుతబాడబుఁ, డుగ్రధనుర్ధరాధిరా
డ్గురుఁడు, భవచ్చమూపతి, యకుంఠితతేజుఁడు నాదుతండ్రి, సం
గరభర మూన, మీకు భయకారణ మేమి? కృపుండ! నిల్వుమీ;
పరుగిడి పోకు కర్ణ! కృతవర్మ్మఁడ! ధైర్యము చిక్కఁ బట్టుమీ. ౪.

(తెరలోపల) ఇంకను మాతండ్రి యెక్కడ?

అశ్వ— (విని) ఏ మనుచున్నారు? ఇంకను మాతండ్రి యెక్కడనా? ఓరి క్షుద్రులారా! పాఱుఁబోతులారా! ఇట్లు పేల్చుచున్నమీనాలికలు వేయిచీలికలు గావలదా?

మ. పటుతేజంబున ద్వాదశార్కు లుదయింపన్ లేదు విశ్వంబు గా
ల్చుటకున్; వీచుట లేదు వాయువులు నేడున్ సప్తధా భిన్నమై;
జటిలంబై కనుపట్టదంబరము గర్జత్పుష్కలావర్తక
చ్ఛటలం; బాపము లాడి రేల జనకున్ శౌర్యాబ్ధిఁ బాపాత్మకుల్? ౫

(తత్తఱపాటుతో దెబ్బలు తిని సూతుఁడు ప్రవేశించుచున్నాఁడు)

సూతు—కుమారా! రక్షింపు రక్షింపు. (కాళ్ళమీఁదఁ బడుచున్నాఁడు.)

అశ్వ—(చూచి) ఏమిది! తండ్రిగారిసారథి యశ్వసేనుఁడా? ముల్లోకములు రక్షింపఁ జాలినతండ్రిగారిసారథివై యుండియుఁ జిన్నవాఁడ నగు నావలన రక్షణము గోరుచున్నా వేమి?

సూతు—(లేచి దుఃఖముతో) ఇంకను మీతండ్రి యెక్కడ?

అశ్వ—(తత్తఱపడి) ఏమి? తండ్రిగారే లేరా?

సూతు—మ ఱేమి?

అశ్వ—హా! తండ్రీ! (మూర్ఛిల్లుచున్నాఁడు.)

సూతు—కుమార! ఊఱడిల్లు మూఱడిల్లుము.

అశ్వ—(తెలివి వచ్చి, కన్నీళ్ళతో) హా! పుత్రవత్సల! హా! లోకత్రయైక ధనుర్ధర! హా! పరశురామాస్త్రసర్వస్వప్రతిగ్రహప్రవీణ! హా! తండ్రీ!

సూతు—కుమారా! ఇంతకడుపుపగిలి దుఃఖింపఁగూడదు. మీతండ్రిగారు వీరపురుషోచిత మయినమరణము నొందినవారు. నీవును దదనురూపమయినభుజపరాక్రమమునఁ విజృంభించి యీదుఃఖసాగరమును దరించి సుఖింప వలయును.

అశ్వ—(కన్నీరు జాఱ) అయ్యా! అశ్వసేనా! అంత భుజపరాక్రమసముద్రు లయినతండ్రిగారు తా మేతీరున నస్తమించిరో చెప్పుము.

చ. తనగదచేతఁ బెద్దగురుదక్షిణ యిచ్చెనొ భీముఁ డోజ్జకున్?

సూతు—రామ! రామ!

అశ్వ—ఘనతరశిష్యవత్సలుని గాండివి యమ్ములఁ బూజ చేసెనో?

సూతు—కుమారా! అలా గేల జరుగును?

అశ్వ—వినిశితచక్రధారకును వెన్నుఁడె తా నెర చేసెనో గురున్?

సూతు—అదియును సంభవింప లేదు కుమార!

అశ్వ—మనమున నాకు నాలుగవమానిసి తోపఁడు వీరు మువ్వురే. ౬

సూతు—కుమార!

ఉ. వీ రన నెంత యుద్ధమున విల్లు కరంబున నున్న రుద్రునా
కారము దాల్చునగ్గురుమగంటిమి? కాయన కొండ్లు సాటియే?

దారుణశోకభారమునఁ దానుగ శస్త్రము నుజ్జగింపఁగాఁ,
గ్రూరరిపుండు చేరి యతిఘోరము చేసె; నిఁ కేమి దెల్పుదున్? ౭.

అశ్వ—అయ్యా! శోకమునకుఁ గాని యస్త్రపరిత్యాగమునకుఁ గాని యేమికారణము?

సూతు—కుమారుఁడే కారణము.

అశ్వ—అయ్యో! నే నెట్లుగాను?

సూతు—(కన్నీళ్ళతో) ఆలకింపుము.

మ. పడిగా, స్పష్టముగాఁ, బృథాతనయుఁ డశ్వత్థామ దోరింపఁగాఁ
బడె నంచు న్వచియించి, మెల్లఁ జనలోఁ బల్కెన్ గజం బంచు; నా
నుడు వాలించి, కుమారవత్సలుఁడు ద్రోణుం డట్టె కన్నీళ్ళతో
విడిచెన్ శస్త్రములన్, యుధిష్ఠిరవచోవిశ్వాసమూలంబునన్. ౮.

అశ్వ—హా! సుతవత్సల! హా! వృథామదర్థపరిత్యక్తజీవిత! హా! శౌర్యరాశి! హా! శిష్యప్రియ! హా! యుధిష్ఠిరపక్షపాతీ! హా! తండ్రీ! (రోదనను చేయుచున్నాఁడు)

సూతు—కుమార! ఊరక యేల యిట్లు వాపిడిచి దైన్యంబు నొందెదవు? ఊఅడిల్లు మూఅడిల్లుము.

అశ్వ— తే.గీ. తండ్రి! నీ వస్మదనృతవధంబు వినుచు,
విడిచి తను అస్త్రములతోడఁ గొడుకుఁదీపి;
నీగునిక్కంపువధ విని నేను మనెద;
నిట్టిఖలునెడఁ జేసిమ నీ కేల పుట్టె? ౯.

(మూర్ఛిల్లుచున్నాఁడు.)

సూతు—ఊఁఅడిల్లు మూఅడిల్లుము కుమార!

[తరువాత నుద్వేగముతోఁ గృపుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కృప—చ. అనుజులతోడికౌరవధరాధవుఁ డేటికి? నేల ధర్మనం
దనుఁడు? వృథాగ నస్త్రములు దాల్చినరాజులు నేను నేల? మా
తనువులుఁ గాల్పనా? యపుడు ద్రౌపది, యిప్పుడు ద్రోణుఁడీవిధం
బునఁ దలపట్టుకోఁబడినముచ్చట గంటివి చిత్రవైఖరిన్. ౧౦.

కట్టా! ఎంతపని పుట్టెను? పిల్లవాఁ డయినమా యశ్వత్థామమొగము నే నెట్టుగాఁ జూతును? అయినను వాఁడు హిమవంతునివంటిధైర్యసారము గల వాఁడును, లోకవృత్తములు బాగుగ నెఱింగినవాఁడును, గాన నంతగా దుఃఖింప కుండు నని తోఁచెడును; కాని యసదృశ మయినయీపితృపరాభవము వినిన, నేమి చేసెడునో యది మాత్రము పాలుపోవఁ జాల కున్నాను.

మఱియు,

క. మనుపటిరియొకదానిఫలం
బనుభూతం బగుచు నున్న దతిదారుణ మై;
జన మీ కేశగ్రహణం
బున నిక్షేపంబ యగును బో రూఢముగన్. ౧౫.

(చూచి) ఇదిగోఁ! గుఱ్ఱివాఁడిక్కడనే కూరుచున్నాఁడు. దగ్గఱకుఁబోయెదను. (సమీపించి తొట్రుపాటుతో) వత్సా! ఊఱడిల్లు మాఱడిల్లుము.

అశ్వ—(మూర్ఛ దెలిసి కన్నీళ్ళతో) హా! సకలభువనైకగురూ! హా! తండ్రీ! (ఆకాశము చూచి) యుధిష్ఠిర! యుధిష్ఠిర!

ఉ. బొంకి రొయిలుంగ వెన్నఁడును బుట్టి; యజాతవిరోధి వైతి వే
వంకను భూజనంబునకు బాధ యొనర్పమి; నాయభాగ్యతన్
గొంకక సర్వముం జెఱుచుకొంటివి నీ వొకమాటలో; నృపా!
పంకిలచిత్త! మజ్జనకు బ్రాహ్మణుఁ డొజ్జ యటంచు నెంచవో? ౧౬.

సూతు—కుమార! ఇదిగో! మీ మేనమామ కృపాచార్యులవారు వచ్చి నీప్రక్కను గూరుచున్నారు.

అశ్వ—(పార్శ్వమునకుఁ దిరిగి చూచి కన్నీళ్ళతో) మామా! మామ!

ఉ. ఎవ్వనితోడ నిప్పు డని కేగితివో, వరశూరరాజికిన్
జివ్వగులం దొలంప రణసీమల రాపిడికంబ మెవ్వఁడో,
యెవ్వనితోడ నీ కగునొ యెప్పుడుఁ జిత్రపునఫ్యటా లతం
డెవ్వల నేగె నీమఱఁది? యేర్పడఁ జెప్పఁగదయ్య మాతులా! ౧౭.

కృపు—అబ్బాయీ! తెలుప వలసిన దంతయు నీకే తెలియును; కావున యిఁక నీలాగున నీ వతిశోకమున మునుంగఁ దగదు.

అశ్వ—మామా! నేను దుఃఖము విడిచిపెట్టినాఁడ. ఇదిగో! సుతవత్సలుఁడయిన నాతండ్రియొద్దకే పోయెదను.

కృపు—నాయనా! ఇది నీబోఁటులకుఁ దగినది కాదు.

సూతు—కుమార! అతిసాహసము చేయకుము.

అశ్వ—అయ్యా! ఏమిచెప్పుదును?

తే. నన్ను నెడఁబాయఁ జాలక నాదుతండ్రి
సరగఁ బరలోకమునకుఁ దా నరిగెఁ గాద?
యంత ప్రేమడి గలిగినయట్టితండ్రి ౧౮.
కెట్లు [illegible] నేను [illegible]స్తు?

కృపు—వత్సా! పుత్రులకు లోకద్వయమునందును దండ్రి లనువర్త నీయులు ; కావున సంసార మున్నంతవఱకు దేహయాత్ర తప్పనిదే.

ఆ. వె. ఉదకదానమునను, యోగ్యనిమంత్రణం
బునను, శ్రాద్ధకర్మమునను, దండ్రి
కుపకరింతు బ్రతికి యుండిన నిహమున ;
నితరవిధమె యైన నేమి చెప్ప ? ౧౫.

సూతు—ఆయుష్మంతుఁడా ! ఈశారద్వతునియాజ్ఞ మీఱకుము.

అశ్వ—అయ్యా ! ఇదియంతయు సత్యమే ; అయినను బితృవియోగి నగునేను దుస్సహ మయినయీశోకభారముచేత క్షణ మైన నీ ప్రాణముల భరింపఁజాల కున్నాను ; కాఁబట్టి తండ్రిగారిని జూచుట కాయన పడియున్నయెడకేని పోయెదను. (లేచి ఖడ్గముఁజూచి యాలోచించి) ఇంక నీశస్త్రగ్రహణవిద్యతో నేమి ప్రయోజనము ? (దోసిలిపట్టి కన్నీళ్ళతో) పూజ్య మయిన యోశస్త్రమా !

చ. అనుచిత మైన, నోటమిభయంబున నెవ్వఁడు నిన్నుఁ దాల్చె, నె
వ్వనిమహిమంబుచేతను బ్రపంచమునం దెదు రేది లేదు నీ,
కనుపమపుత్రశోకమున నాయన నిన్నుఁ బరిత్యజించెఁ ; గా
వున నిఁక నేను నిన్విడుతుఁ ; బొమ్ము శుభ మ్మగు నీకు శస్త్రమా ! ౧౬
(విడువఁబోవుచున్నాఁడు.)

(తెరలో) ఓహో ! రాజులారా ! ఏమిది పూజ్యుఁ డయినభారద్వాజు నీ సూతుకుఁ డిట్లు పరాభవించు చుండఁగా మీ రందఱు నుపేక్షించుచున్నారు.

అశ్వ—(విని మెల్లమెల్లగా శస్త్రమును స్పృశించుచు) ఏమీ ! మాతండ్రి గా రగుభారద్వాజునకే పరాభవమా ?

(మరలఁ దెరలో)

మ. పదనం జత్రములఁ దొప్పదోఁగ, వసట వ్వర్జించి శస్త్రంబు, లా
పదలో నుండఁగఁ. దజ్జరాపలితభావళ్యస్ఫురత్కేశముల్
సదసచ్ఛాన్యతఁ జేతఁ బట్టుకొని, ధృష్టద్యుమ్నుఁ డాచార్యుగొం
తు దెగం గోసి చనంగ, నంద ఱిటు లీదుష్టాత్ము సైరింతురే ? ౧౭.

అశ్వ—(క్రోధముతోడను దుఃఖముతోడను గృపసూతులను జూచి)ఇ దేమి?

చ. కనులను మూసి ప్రాయమునఁ గాయముఁ బాయఁ దలంచి, శస్త్రముల్
మునుపె పరిత్యజించి. రణభూమిని నాజనకుండు నిల్వ, సా
యసపలితో త్తమాంగమున హస్తము వైచియు గొంతు గోసెనే
చెనఁటి యొకండు, విండు తమచేతులఁ బూని నృపుల్ గనుంగొనన్ ? ౧౮.

కృపు—వత్సా ! జను లీలాగుననే చెప్పుకొనుచున్నారు.

అశ్వ—ఏమి? నాతండ్రిశిరస్సే యొకదుర్మార్గుఁడు ముట్టుకొనెనా ?

సూతు—(భయముతో) కుమార తేజోరాశి యగునమ్మహాత్మునకుఁ గ్రొత్తగా నిట్టిపరాభవము సంభవించినది.

అశ్వ—హా! పుత్రవత్సల హా! తండ్రీ! అదృష్టహీనుఁడ నయిననానిమిత్తము నీశస్త్రమును బరిత్యజించి యటువంటిక్షుద్రునిచేతఁ బరాభూతుఁడ వయితివి గదా? కానీ.

ఉ. శోకముతో ననిన్ గళదనుం డగుమద్గురునుత్తమాంగమున్,
గాకియొ, కుక్కయో, ద్రుపదనందనుఁడో, స్పృశియించుఁగాక, ద
ర్వీకరభీకరాస్త్రధనవిస్ఫురితి మత్తిలుశత్రునెత్తిపై,
నాకడకాలు నే నునిచినా నిదిగో, మతి కేలు గాదు సూ. ౧౯

ఆ! దురాత్మ ! పాంచాలాపసద !

శా. మో మళూర్ద్గతిఁ దోఁగ నాజనకుఁ డమ్మోల్ విల్లు వర్జింప, నీ
వామై మెల్లఁగ జేరి, తచ్ఛిరముపై హస్తం బిడం జాలినా
నా మూర్ఖా! మది నప్డు డేమతిలి నశ్వత్థామ యే మయ్యెరా?
మీమీమాఁకలు దూదిబుంగ లగుఁ జుమ్మీ నాదుబాణాగ్నికిన్. ౨౦.

హా! యుధిష్ఠిర ! యుధిష్ఠిర ! అజాతశత్రూ ! అమిథ్యావాదీ ! ధర్మపుత్ర! నీ తమ్ములకుఁ గాని నీకుఁగాని నాతండ్రి యేమియపకారము గావించెను రాజా ? పోనీ. అసత్యపరిధానవక్రచేతస్కుం డగువీనితో నేమి ? అర్జునా! సాత్యకీ! బాహుశాలివృకోదరా ! మాధవా! సురాసురమనుజులలో నైకధనుర్ధరుండును, బ్రాహ్మణుండును, వయోవృద్ధుండును. సర్వజనధనురాచార్యుండును, విశేషించి నాకుఁ దండ్రియు నగుభారద్వాజునియుత్తమాంగమును బాంచాలకులకలంకుఁ డగునరపశువు తనకరంబున స్పృశియించుచుండ, మీ రెల్లరు చూచి యూరకుండుట యుచితమేగదా ? ఛీ; పీఁడ్రతో నేమి? వీం డ్రిందఱుఁ బాపాత్ములే.

తే. గీ. వీతమర్యాదు లై గురుపాతకంబు
సలిపి సహియించి చూచినసకలమనుజ
పశుల మిమ్మెల్ల, నేఁ గృష్ణపార్థభీమ
యుక్తముగ భూతబలి యిత్తు రక్తమునను. ౨౧

కృపు—అబ్బాయీ! దివ్యాస్త్రకోవిదుండ వయి పితృసమానుండ వగు బాహుశాలిక నీ కట్లు చేయుట యేమి యసాధ్యము?

అశ్వ—ఓరోరి పాండవమత్స్యసోమకమాగధాదిక్షత్రియాపసదులారా !

చ. గురునిశిరంబు ముట్టె రనుకోపమునన్ ; జ్వలదగ్నితుల్య మా
పరశున జామదగ్న్యుఁడు నృపాలుర నెమ్మెయిఁ జేసె వింటిరే ?
నరపతులార ! దారుణరణంబున రోషకషాయితాత్ముఁడై
యరిరుధిరప్రవాహముల నట్టులు క్రౌణి యొనర్ప లేఁడొకో. ౨౨

సూతుఁడా! నీవు శీఘ్రముగాఁ బోయి మహాహవలక్షణ మనుమదీయరథంబును సమస్తయుద్ధోపకరణములతోడను దీసికొని రా.

సూతు—చిత్తము కుమారా (నిష్క్రమించుచున్నాఁడు.)

కృపు—వత్సా! అవశ్యము ప్రతిక్రియ చేయఁ గాఁ దగినయీదారుణపరాభవానలంబును నీవు గాక మాబోఁటులు చల్లార్ప నేర్తురా ?

అశ్వ—అట్లయిన నే నిఁక నేమి చేయ వలెను.

కృపు—సేనాధిపత్యమున కభిషిక్తుండ వయి నీవు యుద్ధభూమికిఁ బోవలయు నని నా తాత్పర్యము.

అశ్వ—మామా ! ఇది పరాధీనము, నపరిగణనంబును.

కృపు—నాయనా ! ఇది పరాధీనమును గాదు; అపరిగణనంబును గాదు. చూడు.

తే. గీ. భీష్ముఁడును ద్రోణుఁడును లేని పెద్దకొఱఁత,
పాయు నెట్టులు ధృతరాష్ట్రబలములకును,
వారితోఁ దులఁదూఁగెడుబాహుశాలి
వీవు సేనాధిపతివి గా వేని వత్స ? ౨౩

విలువిద్యయందు సాటి లేనినినుబోఁటిశూరునికి ముల్లోకములు నొప వన, నిఁక యుధిష్ఠిరబల మెంతపాటిది ? కాఁబట్టి కౌరవనాయకుం డభిషేకోపకరణంబులను గూర్చుకొని, నీనిమిత్త మిప్పు డెదురు చూచు చుండు నని నేను దలంచెదను.

అశ్వ—అలాగయిన, మామా ! పరాభవాగ్నిచేత దగ్ధమగుచున్న నా హృదయంబు, తత్ప్రతీకార మగునభిషేకమునకుఁ దత్తఱపడుచున్నది; కాఁబట్టి నే నిప్పుడు పోయి నాతండ్రి యస్తమించుటకు విచారగ్రస్తుఁడయియున్న దుర్యోధనుని సేనాధిపతి నయి కౌఁగిలించికొని, నెయ్యంబున నూఱడించి, సంతాపశాంతి గావించెదను.

కృపు—అబ్బాయి ! ఇది బాగున్నది. మన మతనియొద్దకే పోవుదము.

(నడుచుచున్నారు.)

(తరువాతఁ గర్ణదుర్యోధనులు ప్రవేశించుచున్నారు.)

దుర్యో—అంగరాజా!

తే. గీ. చుట్టముల శిష్యులు సంవ, శోకజలధి
శస్త్ర మను తెప్ప నీఁదుఁ దేజస్వి యెలందుఁ;
గొడుకుచావును విని ఘోరఁ గుంభభవుఁడు,
శస్త్రమును దాల్ప కేటికి సన్యసించె? ౨౪

అవును. ఎట్టివానికిఁ గాని నైజగుణంబు పోదని చెప్పెడు పెద్దలమాట యబద్ధ మగునా? శోకాంధచేతస్కుఁ డయి యాద్రోణుండు క్షత్రియధర్మమయినకార్శ్యము విడిచిపెట్టి, బ్రాహ్మణసులభ మయినమార్దవమును బరిగ్రహించినాఁడు.

కర్ణ—రాజా! కౌరవేశ్వర! ఇది యట్లు కాదు సుమీ.

దుర్యో—మఱి యెట్లు?

కర్ణ—ఆయనయభిప్రాయ మిది. అతఁడీభూమండలం బంతయు నశ్వత్థామ నభిషేకింపవలె నని జూచు చుండువాఁడు; కాఁబట్టి యాకోరిక వ్యర్థ మయినందున బ్రాహ్మణుండను వృద్ధుండను నయిననా కీవృథాశస్త్రగ్రహణ మెందు కని యట్లు చేసినవాఁడు.

దుర్యో—(తలపంకించి) ఇది యాలాగే కావచ్చును.

కర్ణ—ఇందుచేత నే, కౌరవపాండవసత్త్వపాతమున రాజు లందఱుఁ దమలోఁ దారు పోరాడి చావఁగోరి, యీతండు మనలోని ప్రధానపురుషుల కపాయము వచ్చునప్పుడు చూచి చూడనట్టు లూరకుండుచు వచ్చినాఁడు.

దుర్యో—ఇదియును ముందు చెప్పినదాని కనుకూలముగ నే యున్నది.

కర్ణ—ఇం తే కాదు. రాజా! ద్రుపదరాజితనికి బాల్యస్నేహితుఁ డయినను జిన్నప్పటినుండి యితనియభిప్రాయ మెఱింగ యుండుటచేత నే యీమహాత్మునికిఁ దనరాష్ట్రములో నిలువ నింత నీడ నైన నిచ్చినాఁడు కాఁడు.

దుర్యో—సెబాసు అంగరాజా! లెస్సగా నాలోచించితివి.

కర్ణ—మిత్రమా! ఇది నాయొక్కనియభిప్రాయమే కాదు. ఎఱిఁగినవా రెవ్వరును దీనిని వేఱుగాఁ దలంచుకొనరు.

దుర్యో—అవును. ఇది నిశ్చయమే. ఏమి సందేహము?

తే. గీ. అతిరథుఁడు తాను ముందుగా నభయ మిచ్చి
సైంధవున, కర్జునుఁడు వానిఁ జంపు చుండ
నితఁడు తదరిక్షణమున నుపేక్ష చేసె;
నిట్టె కా కున్న దానికి నేమి కతము? ౨౫

కృపు—(చూచి) అబ్బాయీ! ఇదిగో దుర్యోధనుఁడు సూతపుత్రునితోఁగూడ నీమఱ్ఱిచెట్టునీడను గూర్చుండియున్నాఁడు. మనము వాని కడకుఁ బోదము. (అట్లుచేసి)

ఇద్దఱును—విజయతాం విజయతాం రాజన్.

దుర్యో—(చూచి) ఓహో కృపాచార్యులవారు నశ్వత్థామయు నా? (ఆసనమునుండి లేచి) గురువర్యా! నమస్కరించుచున్నాను. (అశ్వత్థామను గూర్చి) ఆచార్యపుత్రా!

ఉ. దగ్గఱ రమ్ము; నాకతనఁ దండ్రికిఁ బాసినబిడ్డ వైతె? నన్
బిగ్గఁ గవుంగిలింపు సఖ! నీకడు మెత్తనిమేను హత్తఁగా;
నగ్గురుబాహులట్టిభవదాయతబాహులు మేను సోఁకినన్,
గగ్గురుపాటు సంభవము గాదెటు లారట మొందు చుండినన్? ౩౬

(కాఁగలించుకొని పక్కను గూరుచుండఁబెట్టుకొనుచున్నాఁడు.)

అశ్వ—(కన్నీరు విడుచుచున్నాఁడు.)

కర్ణు—ద్రోణాయనీ! తీవ్రమయినశోకానలమున నేల పరితపించెదవు?

దుర్యో—ఆచార్యపుత్ర! ఈదుఃఖసాగరమునందు మనకిరువురకును భేదమేమి?

ఆ. వె. తండ్రి నీకుఁ; జూడఁ దండ్రినెచ్చెలి నాకు;
నీకు గురువు, వింట నాకు గురువు;
అతఁడు మేను దొఱఁగ. నార్తి చెప్పఁ బరంబె?
మఱుఁగుచున్ననీదుమదికె యెఱుక. ౩౭

కృపు—వత్సా! ఈకురుపతి చెప్పిన దంతయు యథార్థము.

అశ్వ—రాజా! నీవు కూడ నిట్లు పంచుకొనుటచేత నాశోకభారము గొంత చులుకపడినది. కాని.

ఆ. వె. నేను బ్రదికి యుండఁగానె నాజనకుని
జుట్టు దుష్టరిపుఁడు పట్టుకొనియె;
నింక లోకమందు నితరు లౌతండ్రులు
కొడుకులకును నాస పడుదురయ్య? ౩౮

కర్ణు—ద్రోణజా! అందుకుఁ జేయునది యేమి? ఎల్లవారలపరాభవమును బోఁగొట్టఁ జాలినతాను, బుద్ధిపూర్వకముగా శస్త్రమును బరిత్యజించి యంతటిదురవస్థ దెచ్చుకొన్నాఁడు.

అశ్వ—అంగరాజా! నీ వేమనియెదవు? అందుకుఁ జేయునది యేమా? అయిన నాచేయునది యేమో చెప్పెద వినుము.

* శా. వాలుం బూనుమలాఢ్యుఁ డేఁ డెవఁడొ శుంభత్పాండవానీకినిన్,
బాలుండున్, ముది, చూలు, నెవ్వఁ డెవఁడో పాంచాలురం, దేఁడెవం
డాలోకించెఁ దదుగ్రకర్మ, మెవఁ డేఁ డడ్డం బనిన్ నాకుఁ, ద
త్కాలుం డైనను, వానివానికి మహాకాలుండ నే నయ్యెదన్. ౨౮

మఱియు నోజామదగ్న్యశిష్య ! కర్ణ !

చ. మడువు లొనర్చె నిక్కడనె మార్తురనెత్తుటితోడ రాముఁ, డి
ప్పుడు నదియే పరాభవము, భూపుఁడు మత్పితృమౌళి ముట్టె; నా
కడ వెలుఁ గొందుచున్నరిపుఘస్మరశస్త్రము లవ్వియే సుమీ;
యడిగితి గాన లెస్స విను, మాపనియే యిపు డేను జేసెదన్. ౨౯

దుర్యో—ఆచార్యపుత్ర ! అనన్యసాధారణ మై తథావిధ మైననీబాహుపరాక్రమమునకు సాటి యున్నదా ?

కృపు—రాజా ! అశ్వత్థామ మహాసమరభారము వయి వేసికొన్నాఁడుగదా! ఇతఁడు ధనుర్ధరుఁ డయిన ముజ్జగంబులును జయింప సమర్థుఁ, డేఁక యుధిష్ఠిరబల మెంతపాటిది? కాఁబట్టి యీతని సేనాధిపత్యమున కభిషేకించుట సముచితం బని నే నూహించెదను.

దుర్యో—మీరు లెస్సగా నాలోచించి చెప్పితిరి. అయిన నిది పూర్వమంకే యంగరాజునకుఁ జెంది పోయినది.

కృప—రాజా ! అసదృశ మయినపితృపరాభవశోకసముద్రమున మునిఁగి యున్నయితని, నంగరాజునిమిత్త ముపేక్షించుట యుక్తముగాదు. అశత్రుద్రిపలము నే సంహరింపఁ దలఁచి యున్నయితనికి నీ విట్లు చేసినఁ గష్టముగా నుండదా ?

అశ్వ—రాజా ! ఇంక యుక్తాయుక్తవిచార మెందుకు ?

మ. ఎదఁ జే యుంచుక నిద్రపో దధిప ! నీ వీరేయి నజ్ఞామలున్;
దఱనంపుంగథ నేఁటితో ముగియు; నిష్కృంసారి, నిష్పాండవం,
బిది నిస్సోమక, మయ్యెడుం జగము; నేనే యీధరాభార మం
త దొలంగించెద, దుష్టరాజకులకాంతారంబు ఖండించుచున్. ౩౦

కర్ణ—ద్రోణాత్మజా ! ఇది చెప్పుట సుకరమే గాని చేయుట దుష్కరము. ఈపనికిఁ గౌరవసేనలో ననేకులు సమర్థులు.

---

పాఠాంతరము. *ఉ. వాలును గేలఁ బూనుబలవంతులఁ బాండవసేనలందుఁ, బాం
చాలకులంబునందు ముదుసళ్ళను బిల్లలఁ జూలులన్, మహో
కాలుఁ డనంగ నప్పు డది కాంచిన వైరుల నెల్లఁ దున్మింతు నే
నాలములోన ద్రోణుని ... కృపై ... యెల్లఁ దీఱఁగన్.

అశ్వ—అంగరాజా! ఈపనికిఁ గౌరవసేనలో ననేకులు సమర్థులు; నిజమే; అయినను నాదుఃఖముకొలఁది నే నిట్లు పలికితిని గాని వీరపురుషుల నాక్షేపింప వలయు నని కాదు.

కర్ణ—మూఢుఁడా! దుఃఖ ముండినఁ గన్నీళ్ళు విడువ వలయును; క్రోధ ముండిన నాయుధసహాయుఁడ వయి యుద్ధములో నుఱుక వలయును. అంతేకాని యిట్లు పరితాపములు గొట్టుట యెందుకు?

అశ్వ—(క్రోధముతో) ఓరోరి! రాధాగర్భభారభూత! సూతాపసద! ఇదేమిరా నన్నాక్షేపించెదవు?

కర్ణ—క. సూతుఁడనో సూతసుతుఁడనో
యీతప్పున కేమి లేర; యెవఁడో యొకఁడన్;
జాతము దైవాధీనము;
ఖ్యాతం బగుపౌరుషము మదాయత్త మగున్. ౩౨

అశ్వ—ఓరి కర్ణా! నీ వే మనియెదవు; నాదుఃఖమును గన్నీళ్ళతో నా దీర్చ కొమ్మనియెదవు? ఖడ్గముతోఁ గా దేమి? చూడు,

మ. భవదస్త్రంబులు వోలె నావి, గురుశాపప్రాప్తి వ మ్మయ్యెనో?
బవరంబు న్విడ నాడి వచ్చితినొ నీభంగిన్ భయం బొందుచున్?
స్తవముల్ చేసెదుసూతవంశమున సంజాతుండనో నీవలెన్?
బవ యసృంబునఁ గాని యస్త్రమునఁ దీర్పన్ లేను రా? బాలిశా? 33

కర్ణ—(క్రోధముతో) ఓరివాచాటా! ఓరివృథాశస్త్రగ్రహణదుర్విదగ్ధ! ఓరి బ్రహ్మచారీ!

క. వ మ్మయ్యెనో సా మ్మయ్యెనో
యమ్ముల నే విడిచి పెట్ట నాలములోనన్,
నెమ్మనమునపాంచాలభ
యమ్మున నీబాహుశాలి యగుతండ్రివలెన్. ౩౪

అశ్వ—(క్రోధముతో) ఓరిరథకారకులకళంక! రాధాగర్భభారభూత! ఓరి యాయుధానభిజ్ఞ! తండ్రిగారిని గూడ నాక్షేపించుచున్నావటరా?

చ. విదితజగత్త్రయైకభుజవిక్రముఁ డాయన భీరుఁడో జయా
స్పదుఁ డగుశూరుఁడో యెఱుఁగుఁ బ్రత్యహ మీభువి తద్రణక్రియన్;
వదలెను శస్త్ర మెట్లొ తెలుపంగను ధర్మసుతుండె సాక్షి; నీ
వదరెదు పాఱుఁబోత! తులువా! యపు డచ్చట నీవు లేవురా? ౩౫

కర్ణ—(నవ్వి) ఓహో! నేను పాఱుఁబోతను; నీవు పోటుమానిసివి; నీ తండ్రిని దలఁచుకొన్న నాకు మిక్కిలి సందియము గలుగుచున్నది. ఓరిమూఢ!

తే. గీ. శస్త్ర ముడిగిన నేమి? యశస్త్రపాణి
నాయుధము నెత్తురిపుదర్ప మడఁప లేర?
రాజచక్రంబు నెదుర శిరంబు గోయ,
నువిదలాగున నీతండ్రి యోర్చెఁ గాక. 36

అశ్వ—(క్రోధముతో దేహము వడఁకు చుండ) దురాత్మా! రాజవల్లభ ప్రగల్భ! అసంబద్ధప్రలాప! సూతకులసంభవ!

ఆ. వె. భయము పడియొ, దుఃఖభారంబుననొ, నాదు
తండ్రి దుష్పదనుతు నదల్పఁ డయ్యె;
నడిచి పడెడునిన్ను నాదల నాకడ
కాలఁ దన్నుచుంటిఁ; గాచుకోర.

(అట్లు చేయుటకు లేచుచున్నాఁడు.)

కృప దుర్యోధనులు—గురుపుత్ర! శాంతింపుము శాంతింపుము.

(వారించుచున్నారు)

అశ్వ—(తన్నుట నభినయించుచున్నాఁడు)

కర్ణ—(క్రోధముతో లేచి కత్తిదూసి) ఓరిదురాత్మ! బ్రహ్మబంధుఁడా! ఆత్మశ్లాఘీ!

తే. గీ. బ్రాహ్మణుండవు గాఁబట్టి బ్రతికిపోయి;
తయిన నీ విప్పు డెత్తినయట్టికాలు
కఱకుఁగరవాలమునను నే నఱకి వైతు,
దునిసి పడె నని తలఁచుకో మనసునందు. 37

అశ్వ—ఓరిమూఢుఁడా! నేను బ్రాహ్మణుండను గనుక నా బ్రతికిపోయితిని? ఇదిగోఁ! జూడు నా బ్రాహ్మణ్యమును విడిచిపెట్టినాఁడను (యజ్ఞోపవీతమును ఛేదించివేసి మరలఁ గ్రోధముతో)

తే. గీ. ఇపుడె మిథ్యాప్రతిజ్ఞఁ గావింతుఁ జూడు
మల్లగాండీవి, నీ వింక నడిచి పడిన;
శస్త్రమును దాల్చి రార; రాఁ జాల వేని
క్రింద నస్త్రంబు నిడి మోడ్పుఁ గేలు వట్టు. 38

ఇద్దఱును (కత్తులనుదూసి యొండొరుల నఱుకుకొన నుద్యోగించుచున్నారు.)

కృపదుర్యోధనులు—(వారించుచున్నారు.)

దుర్యో—ఆచార్యపుత్ర! ఆయుధమును దూయ నేటికి?

కృప—వత్సా! సూతపుత్ర! కత్తి యెత్త నేటికి?

అశ్వ—మామా! మామా! నీ వెందు కడ్డగించెదవు? తండ్రిగారిని నిందించు చున్న యీసూతాపసదుఁడును గేవలము ధృష్టద్యుమ్నపక్షపాతి.

కర్ణ—రాజా! నన్ను నీ విప్పుడు వారింపఁ గూడదు.

ఆ. వె. క్రోధ మెంతయున్నఁ గుత్తుక దిగ మ్రింగి,
వీరుఁ డధము నిట్లు పేక్షు సేయ,
దుర్మదంబు హెచ్చి, తుదకు నీలాగునఁ
బొగడుకొనును దనదుమగతనంబు. ౪౦

అశ్వ—రాజా! వీనిని వదలు వదలు. రానీ. నాభుజములసందున నిటికి సులభముగాఁ దుద ముట్టించెదను. మఱియును గౌరవేశ్వరా! గురువుగారి నధిక్షేపించినయీదురాత్ముని స్నేహముచేతనో కార్యముచేతనో గాని నాబారివలన రక్షింపఁ గోరుచున్నావు. నీ కివి రెండును వ్యర్థములే. చూడు.

ఆ. వె. ప్రథితగుణుఁడ వీవు, పాపప్రియుఁడు వీఁడు;
విభుకులుండ వీవు, వీఁడు సూతుఁ;
డేటిమైత్రి? కూల్చునే వీఁడు నరు? వీఁడు;
జగ మకర్ణ పార్థ మగును నేఁడు. ౪౧

(నఱుకఁ దలఁచుచున్నాఁడు.)

కర్ణ—(కత్తియెత్తి) ఓరిపేరిలరీ! బ్రాహ్మణాధమ! ఇదిగో! నీవు చచ్చితివిరా! రాజా! విడువిడు. నన్ను వారింపకు. (చంపఁ దలఁచుచున్నాఁడు.)

కృపదుర్యోధనులు—(అడ్డగించుచున్నారు.)

దుర్యో—కర్ణ! గురుపుత్త్ర! ఇప్పుడు మీ కీ వెఱ్ఱి యేమి?

కృపు—అబ్బాయీ! ప్రస్తుత మొకటి, నీతొందర మఱియొకటి. ఇది యేమివెఱ్ఱి? ఇపు డీరాజకులమునకు స్వబలవ్యసనము నీవలననే గలుగుచున్నది. ఇది పెడత్రోవ గాదా?

అశ్వ—మామా! పరుషప్రలాపి యగు నీరథకారకులకలంకుని మదము సదనుదము సేయుట సంభవింప దయ్యెను.

కృపు—నాయనా! స్వబలప్రధానవిరోధమున కిది సమయము కా దోయి.

అశ్వ—మామా! అలాగయిన—

తే. గీ. రణముఖంబున వీఁడు శాత్రవులచేతఁ
జచ్చునందాఁక విడిచితి శస్త్ర మేను;
పార్థభీముల కీదళవాయి జడియ,
నపుడె రారాజు సఖుని నన్నరసికొనును. ౪౨

(ఖడ్గము విడుచుచున్నాఁడు.)

కర్ణు—(నవ్వి) నీవంటివాఁ డాయుధమును జేతఁ బట్టుకొన్నను నది కాలముక్రిందనే విడిచిపెట్టినట్టు. ఏ మనఁగా వ్యర్థ మగుటవలన.

క. నాకరమునఁ గరవాలము
గైకొని యుండంగ లాఁతిఖడ్గం బేలా?
నాకైదువు దీర్పనిపని
యేకైదువు దీర్పఁ జాలు నీలోకమునన్?

(తెరలో) హా! దురాత్మా! ద్రౌపదీకేశాంబరాకర్షణ! మహాపాతకీ! ధార్తరాష్ట్రాపసదా! చిరకాలమునకు నాయెదురఁ బడితివి గదరా! ఓరిక్షుద్రపశువా! ఇప్పు డెందుఁ బోయెదవురా? ఓరోరికర్ణ! ఓరిదుర్యోధన! ఓరిశకునీ! ఓరోరి పాండవవిద్వేషులార! ధనుర్ధరు లయినమానధనులు మీరెల్లరు నాలకింపుఁడు.

ఉ. ఏనృపశుండు ద్రౌపదిని నేడ్తెఱఁ గొప్పును బట్టి యీడ్చెనో,
మానధనుల్ గనుంగొనఁగ మానినిపుట్టము లెవ్వఁ డొల్చెనో,
యేనియురస్స్థలక్షతజ మేఁ జవి చూడఁ బ్రతిజ్ఞ గొంటినో,
యానయహీనుఁ గాచికొనుఁడా; పడె నాభుజపంజరంబునన్. ౪౮

అందఱు—(ఆకర్ణించుచున్నారు.)

అశ్వ—అంగరాజ! సేనాధిపతీ! జామదగ్న్యశిష్య! ద్రోణాపహాసీ! భుజబలపరిరక్షితసకలలోక!

"క. నాకరమునఁ గరవాలము
గైకొని యుండంగ లాఁతిఖడ్గం బేలా?
నాకైదువు దీర్పనిపని
యేకైదువు దీర్పఁ జాలు నీలోకమునన్?"

అని బీరములు పలికినాఁడవు గదా? సరే. ఇదిగో! దానికిఁ దగినయవసరము వెంటనే సంప్రాప్త మయినది. చూతము. ఇప్పుడు భీమునిబారిఁ బడ కుండ దుశ్శాసనుని సంరక్షింపుము.

కర్ణు—ఆ! నేను జీవించియుండఁగా యువరాజునీడనయినను స్పృశించుటకు వృకోదరుఁడు శక్తుఁ డగునా? యువరాజా! వెఱవకు వెఱవకు. ఇదిగో! నేను వచ్చితిని. (నిష్క్రమించుచున్నాఁడు.)

అశ్వ—రాజా! కౌరవేశ్వరా! భీష్మద్రోణులు లేరు గదా యని భీమార్జునులు విచ్చలవిడిగాఁ గౌరవబలమును గలగుండు పడఁ జేయుచున్నారు. అట్టివారల నీవిధ మయినరాధేయుఁడు గాని గిధేయుఁడు గాని నివారింపఁ జాలఁడు. కాఁబట్టి నీవే పోయి సయిన్యోద్యోగము... సంరక్షింపుము.

దుర్యో—ఆయుధహస్తుఁడ నయి నేను జీవించి యుండఁగా, దురాత్ముఁ డైనభీముఁడు గాని గీముఁడు గాని నాతమ్మునినీడ నయినఁ ద్రొక్కఁగలఁడా? తమ్ముఁడా! భయపడకు భయపడకు. ఓరీ యెవఁడురా అక్కడ? రథము రథము.

(నిష్క్రమించుచున్నాఁడు.)

[తెరలోపలఁ గలకలము.]

అశ్వ—(ముందు చూచి) మామా! మామా! అయ్యయ్యో! ఎంతకష్టము! తనయన్నగారిప్రతిజ్ఞ కెక్కడ భంగము గలుగునో యనుభయముతోడ గాండీవి కర్ణదుర్యోధనుల నిద్దఱను దుర్వార మైనశరధారావర్షమున ముంచుచు నెదురుకొనుటకుఁ బరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు. హా! హా! యెంతగష్ట మెంతకష్టము! పాపము! దుశ్శాసనునిరక్తము భీముఁడు నిశ్శంకముగాఁ ద్రాగుచున్నాఁడు. అబ్బబ్బా! దుర్యోధనునితమ్మునికి సంభవించెడి యిట్టియాపదను నేను జూచి సహింపఁ జాలను. అనృత మయినను సరే. మామా! శస్త్రము శస్త్రము.

ఆ. వె. సూనృతంబుకన్న శుభ మగు నన్నృతంబె;
నరకమునకె పోదు; నాక మేల?
పవనతనయువలన యువరాజుఁ గావంగ,
విడిచినను గృపాణి విడువ నేను. ౪౫

(ఖడ్గము గ్రహింపఁబోవుచున్నాఁడు.)

(తెరలో) మహాత్మా! భారద్వాజతనూజ! ఈవఱ కెన్నఁడు నతిక్రమించని సత్యవాక్యము నిప్పు డేల యతిక్రమించెదవు?

కృపు—అబ్బాయీ! అశరీరవాణి నిన్నసత్యమువలనఁ గాపాడుచున్నది.

అశ్వ—ఏమిది! దైవాజ్ఞయు నాయుద్ధగమనమునకు వ్యతిరిక్తముగానే యున్నది. అన్నన్నా! ఎంతపాపము! దేవతలుగూడఁ బాండవపక్షపాతు లయి ప్రవర్తించుచున్నారే. ఆహా! భీముఁడు దుశ్శాసనునిరక్తము సర్వథా గ్రోలుచున్నాఁడు.

ఆ. వె. దుస్ససేను పేరురస్సు భీముఁడు వ్రచ్చి
రుధిరపూర మిట్లు గ్రోలుచుండ,
నూర కుంటి, నింక యుద్ధంబులోఁ బ్రియ
మేమి గూర్తుఁ గౌరవేశ్వరునకు? ౪౬

మామా! కర్ణునిమీఁదికోపమున నే ననార్య మయినకార్యమును జేసితిని. నీవిఁ రారాజునకుఁ దోడుపడుము.

కృపు—ఈవిషయమున నేను బోయి ప్రతీకారముఁ జేసెదను. నీవ శిబిరమునకుఁ బోయి యుండుము.

(నిష్క్రమించిరి.)

గద్య. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది సాధువంశక్షీ
నీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హారితసగోత్ర పవిత్రగుణకదంబ
లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధ
విధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీకృత వేణీసంహార
నాటకంబునందుఁ దృతీయాంకము.



శ్రీ ర స్తు.

శ్రీపరమాత్మనేనమః

# వేణీ సం హా ర నా ట క ము.



## చ తు ర్థాం క ము.

——:o:——

[తెరువాతఁ బ్రహారమూర్ఛితుండును రథస్థుండు నగుదుర్యోధనుని యుద్ధరంగమునకుఁ దోలఁగించుచు సూతుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సూతు—(తొందరగాఁ బోవుచున్నాఁడు.)

(తెరలో) కౌరవపక్షపాతమునఁ బాణిగ్రహణంబులు పిడికిలించుకొని భుజబలదర్పమున మహాసమరదోహలు లయి తిరుగుచున్న యీ రాజన్యులారా! మీరు పాఱిపోక ధైర్యము తెచ్చుకొని నిలువఁబడుఁడు. దుశ్శాసనునివక్షస్స్థలమును వ్రక్కలించి త్రాగఁగా మిగిలినరక్తమును, స్నానము చేసినట్లు శరీర మంతటఁ బూసికొని, భీమసేనుఁడు మహాబీభత్సవేషముతో నుండుట విలోకించి, సేనలన్నియు విషాదమునఁ దమతమయాయుధములను విడిచిపెట్టి తిరిగి చూడక పలాయనము నొందుచున్నవి.

సూతు—(చూచి) ఆహా! ఇదిగో! గాలిచేఁ గదలుచామరము హేమకమండలువు దాఁక, మనుజమాతంగతురంగసంఘంబులకళేబరంబులచేత మిట్టపల్లంబుగా నున్నపొలికలనఁ బఱవు చుండుటంజేసి గణగణ యని చిఱుగంటలు మొరయుచుండఁ, గొట్టకొనను బంధించిన బెడఁగుపడగ యడియాలంబుగాఁ గ్రాలుచున్నయరద మెక్కి, పరబలపరాక్రమప్రసరంబును శరవర్షమున నడఁచివేయుచుఁ గృపాచార్యుండు మాసేనల కూఁటగా నతిత్వరితముగాఁ బోయి యర్జునునితో నెక్కటికయ్యంబు సేయుచున్నరాధేయునకుఁ దోడుపడియె. అమ్మయ్య! ఇప్పటి ముట్టునకు మాబలములకుఁ గొంతయాధారము గలిగినది.

[తెరలోఁ గలకలానంతరము.]

భీము—ఓహో! కౌరవచమూయోధులార! ఓహో! పాండవవరూథినీయోధులార! నన్నుఁ జూచిన భయంబున ధనువులు, ఖడ్గములు, శక్తులుఁ, దోమరములుఁ, గిరిండ్ల జాఱ విడిచి పాఱిపోయెద రేల? నేనవరు నెఱవకుఁడు.

నేను మఱి యెవ్వఁడను గాను. దుశ్శాసనునిగుండెలు బద్దలుజేసి త్రాగినరుధిరా
వంబున మత్తిల్లి, కించి దవశిష్టప్రతిజ్ఞామహోత్సవంబునకుఁ దత్తఱ పడుచున్న పార్థమధ్యముఁడను, భీమసేనుండను, దుర్యోధనద్యూతనిర్జితదాసుండను. వినుండు మీ రందఱు సాక్షులు.

ఉ. మానధనుండు కార్ముకసమంచితుఁడై కురురాజు సూడ, వా
డేనిసఖుండు కర్ణుఁడు, మఱిం గురుబంధులు, శల్యుఁడుం గనన్,
బానము చేసినా నిపుడె, పాండువధూకచవస్త్రకర్షణా
ప్రాణము లుండ గొల్ల నెద వ్రచ్చి, కవోష్ణపుఁబచ్చినెత్తుటిన్ ౧

సూతు—(విని భయముతో) అరెరె! కౌరవరాజకుమారమహారణ్యమున కుత్పాతమారుతుఁ డయినదురాత్ముఁడు భీముఁ డిదిగో! సమీపించుచున్నాఁడు. ఈరాజు మూర్ఛ దేఱునంతకును దేరు దూరముగాఁ దోలుకొని పోయి నిలిపెదను. ఒకవేళ దుశ్శాసను నెడఁ బోలె నితనియెడఁ గూడ నీక్రూరుఁడు దుర్మార్గము చేయునేమో? (త్వరితముగాఁ బోయి చూచి) ఆహా! ఈచెరువులోని తామర పువ్వులమీఁదనుండి పరిమళముతో వీచెడుచల్లగాలిచేతఁ బల్లవంబులు గదల, నుల్లసిల్లుచున్న దదిగోఁ బెద్దమఱ్ఱిచెట్టు; యుద్ధవ్యాపారముచేత శరీరము సొలసిన వీరపురుషున కిది విశ్రమింపఁ దగినపట్టుగదా! ఇక్కడ నప్రయత్నోపవీజి తాలవృంతశీతలంబును హరిచందనచ్ఛటాశీతలంబును సహజపరిమళమిళితంబును నయి ప్రాణము లేచి వచ్చినట్టు వీచుచున్న యీతమ్మికొలనిమీఁది చల్లగాలి మేన సోఁకుటచేత నీమహారాజు మూర్ఛదేఱును శత్రువుచేతఁ గేతనము నఱికివేయఁ బడినది గావున నీరథమును నిర్నిరోధముగాఁ జెట్టుక్రిందికిఁ బోఁగలదు. (అక్కడఁ బ్రవేశించి) ఎవ రక్కడ? (తాఱఁజూచి) ఏఁడీ? సేవకుఁ డొక్కఁడును లేఁడు. ఆవిధముగానున్న భీమసేనునిఁ జూచియు, నీవిధముగానున్న మహారాజును జూచియు వాండ్రందఱు నిశ్చయముగా శిబిరమునకే పాఱిపోయిరి. అహా! ఎంతకష్టము!

చ. దొరఁకొని సింధురాజుతలఁ ద్రుంచెఁ గిరీటి, గురుండు గాచినన్;
హరిణమునట్లు చీరె నిపు డక్కట! భీముఁడు, దుస్ససేను; దు
ష్కరపుఁబ్రతిజ్ఞలున్ సుళువుగాఁ బగవారికి నెగ్గఁ జేసెదున్;
గురుకులమందు నింక విధి క్రూరతఁ బాయఁడ యంచు నెంచెదన్. ౨

(రాజును జూచి) ఏమిది! మహారా జిప్పటికిని దెప్పిఱిల కున్నాఁడు! అయ్యో! ఎంత కష్టము! (నిట్టూర్పువిడిచి)

తే. గీ. మదపుటేనిక యన్నికొమ్మలను విఱువఁ
జివర కొకకొమ్మతో నున్న చెట్టుబోలె,

గొమరు లందఱుఁ దెగినయీకులము, కట్ట!
దైవకృప నీవె మిగులుటఁ దప్పి దారి. 3.

హా! హతవిధీ! భరతకులవిముఖ!

తే. గీ. చెక్కు చెదరక పెనుగదచేతఁ బూని
సందియం బించు కంతయుఁ బొంద కున్న
పవనతనయునియీకొలపద్రితిన గూడ
నీబలంబున నెఱవేఱు నిశ్చయంబు. ౪.

దుర్యో—(తెలివివచ్చి ధీరముగా) ఆ! దుర్యోధనుఁడను నేను జీవించియుండఁగా దురాత్ముఁ డయిన పవనతనయునిప్రతిజ్ఞ యెట్లు నెఱవేఱును? తమ్ముఁడా! దుశ్శాసనా! జడియకు జడియకు. ఇదిగో! నేను వచ్చితిని. సూతుఁడా! దుశ్శాసనుఁ డున్నయెడకు రథముఁ బో నిమ్ము.

సూతు—ఆయుష్మంతుఁడా! గుఱ్ఱములు రథమును వహింప లేవు. (వెనుకఁ జరిగి) నీమనోరథమును మేమును.

దుర్యో—(రథమునుండి దిగ గర్వముతో) ఈరథగమనాలస్యముతో నేమి?

సూతు—(తెల్లఁబోయి సకరుణముగా) దేవా! శాంతింపు శాంతింపుము.

దుర్యో—ఇస్సిరో? సూతుఁడా! రథం బేటికి? నేను కేవల మరాతిసమ్మర్ద సంఘట్టసంచారి నగుదుర్యోధనుండను గదా! గదామాత్ర సహాయుఁడ నయి యుద్ధరంగమునఁ బ్రవేశించెదను.

సూతు—దేవా! అది నిజమే. ఏమి సందేహము?

దుర్యో—అలా గయిన నీ విట్లు పలికెద వేమి? చూడు.

తే. గీ. ప్రకృతిదుర్లలితుం డగుబాలు ననుజుఁ
బాపి హింసింపఁ గాంచి, యాపనికిఁ బోవు
నన్ను వారణ సేయుచున్నావు; నీకు
లేదొ క్రోధంబు? దయ లేదొ? లేదొ సిగ్గు? ౫.

సూతు—(దుఃఖముతోఁ గాళ్ళమీఁదఁబడి) దేవా! ఇంతకు నాపాపపుఫ్ఫకో దరుండు సంపూర్ణ ప్రతిజ్ఞుండయి పోయియుండును గాఁబట్టి యిట్లు విన్నవించెదను.

దుర్యో—(వెంటనే భూమిపయిఁబడి) హా! తమ్ముఁడా! దుశ్శాసన! హా! మదాజ్ఞావిరోధితపాండవ! హా! వికీమైకరస! హా! మదంకదుర్లలిత! హా! విద్విషత్ప్రకర మదద్విరదకంఠీరవ! హా! యువరాజ! పలుకవేమి? (నిట్టూర్పువిడిచి)

ఉ. ఒప్పెదునాదుప్రాపునకు యోగ్యుఁడ వైనను, భోగసౌఖ్య మొ
క్కప్పుడు నే ఘటింపను; వృథాగ్రజుఁడం గద నీకుఁ దమ్ముఁడా!

యిప్పుడు సంభవం బయినయీపెనుముప్పున కేన కారణం;
బప్పుడు పంచినా నవినయంబునకుఁ౯ నిను; గావ నిర్యోధ౯. ౬.
(మూర్ఛిల్లుచున్నాఁడు.)

సూతు—రాజా! ఊఁఅడిల్లి మూఁఅడిల్లుము.

దుర్యో—(తెలివి వచ్చి) ఇస్సీ! సూత! ఏమి పని చేసితివి?

తే. గీ. దుష్టమృగమున కెర యిచ్చి తోలఁగి నట్టు,
బాలు, నాజ్ఞానువర్తి, గాపంగఁ దగిన
యనుజు దుశ్శాసనుని నరి కప్పగించి,
కటకటా! నాదుప్రాణను గాచికొంటి. ౭.

సూతు—మహారాజ! మర్మభేదు లయినయలుఁగులచేతను, శక్తితోమర ప్రాసాదులచేతను మహారథు లందఱుఁ దెలివి దప్పి పడి పోవుటవలనను, దేవరయుఁ జేష్టలుదక్కి వ్రాలుటవలనను రథమిట్లు మరలించితిని.

దుర్యో—సూతుఁడా! ఎంతవిరుద్ధము చేసితివి?

క. ఆపాండవపశువ్రుగడా
వ్యాపారవుధ్వనులఁ దెలివి నందమి గద్దె౯;
బాపని సెత్తుటిసెజ్జను
నాపాపియొ సేనొ యెఱగమా? యది తప్పెౕ. ౮.

(నిట్టూర్పువిడిచి యాకాశము చూచి) హా? హతవిధీ! కృపావిరహిత! భరతకుల విముఖ!

తే. గీ. చంపుకొని పొమ్మ న న్నెటో సరగ నీవె,
పాపపువృకోదరునిబారిఁ బడఁగ నొల్ల;

సూతు—హరి! హరీ! ఏ మిది మహారాజా!

దుర్యో—సకల మనుబంధువర్గంబుఁ జంపుకొన్న
భ్రష్టునకు నాకు జయ మేల? రాజ్య మేల? ౯.

(సపరివారం డయి యొకపురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

పురు—అయ్యా! సారథిద్వితీయుం డగుదుర్యోధనమహారాజు నిచ్చోట మీరు చూచినారా? ఏ మిది! ఒక్కఁడును మాట లాడఁడు! కానీ. ఇదిగోఁ బరికరములను ధరించినకొందఱుపురుషు లక్కడ గుంపుగా నగపడుచున్నారు. అక్కడకుఁ బోయి యడిగెదను. (చూచి) ఏ మది వా రందఱు గాఢముగా డెబ్బలు దగిలినతమ యేనిహృద యమునఁ జిక్కుకొన్నఘనసన్నాహజాలదుశ్ఛేద్యముఖంబు లయినశిశిముఖంబులనుగంక ముఖంబులతోడ ... తెలియదు. పోనీ

మఱియొకచోటఁ గనుఁగొనియెదను. ఇదిగోఁ! కొందఱు వీరపురుషు లిక్కడఁ జేరి యున్నారు. ఇయ్యెడకుఁ బోయి యడిగెదను. (చేరి) అయ్యలారా! కురునాథుఁ డెం దున్నాఁడో యెఱుఁగుదురా? ఏమిది! వీరు నన్నుఁజూచి పెద్దపెట్టున నేడ్చు చున్నారు! (చూచి) వీరికిని దెలియదు. ఆహా! ఇక్కడ నెంతదుష్కరము జరుగుచు న్నది! ఇదిగో! నీ వీరమాత తనకుమారుఁడు యుద్ధములోఁ జనిపోవుట నాలకించి, రక్తాంబరధారిణియు సమగ్రభూషణయు నయినతనకోడలితోఁ గూడఁ జిచ్చుఱుకు చున్నది. (సశ్లాఘముగా) బాగు! వీరమాతా! బాగు! నీ వింకొకజన్మమునఁ బుత్రి శోకము లేనిదాన వయ్యెదవు. కానీ. వేఱొకచోట నరసెదను. (మఱియొకవైపుచూచి) ఇదిగోఁ! గాయములనిండ గాయములు పడినను, వానికిఁ జికిత్స చేసికొనక యీజో దులు, పట్టిసల్లముతో నిలిచియున్న యీగుజ్జమును జూచి యేడ్చుచున్నారు. దీని నారోహించి యుద్ధమునకుఁ బోయినవీరియేలిక చచ్చియుండును. ఇది నిశ్చయము. కాఁబట్టి వీరికి నెఱుక లేదు. పోనీ. కొండొకయెడకుఁబోయి విచారించెదను. (పాఱఁ జూచి) ఏమిది! సర్వజనులును దమతమయవస్థకుఁ దగినదుఃఖము ననుభవించుచు నదృష్ట హీనులై తిరుగులాడుచున్నారు. ఇం దెవని నడుగుదును? ఎవని నిందింతును? పోనీ. నేనే విచారించుకొనెదను. (నడిచి) కాదు. దైవమును నిందించెదను. ఓహో! దైవమా! పదునొకం డక్షోహిణులసేనలకు నధినాథుఁడు, నూఱుగురు సోదరులకునన్నగారు, భీష్మ ద్రోణకర్ణాశ్వత్థామశల్యకృపకృతవర్మప్రముఖు లయినదొరలకును దక్కినరాజ చక్రంబునకును నియామకుఁడు, సకలపృథివీమండలమునకు నిరంకుశప్రభుఁడు, నయిన దుర్యోధనమహారాజు నిప్పుడు వెదకించుచున్నావు. అతఁ డెచ్చట నుండెనో తెలియఁ జాలకున్నాను. (ఆలోచించి నిట్టూర్పువిడిచి) దైవమును దూఱ నేల? ఇదియంతయు దీనివికృతియే గదా! విదురనీతినిరాకరణవీజంబును, భీష్మహితోపదేశతిరస్కారాం కురంబును, శకునిహతకప్రోత్సాహనాది నిరూఢమూలంబును, జిరకాలసంబద్ధవైరా లవాలంబును నగులాక్షాగృహద్యూతవిషవృక్షంబు ద్రౌపదీకేశాంబరాకర్షణమిషంబునఁ బువ్వుపూచి, తుద కీచందంబున ఫలించినది. (ఒండువలను చూచి) ఇదిగో! వివిధరత్న ప్రభామిశ్రితం బయి తరణికిరణవారంబునుం బోలె దిగంతముల నింద్రచాపములను బుట్టించుచు నొకయరదంబు ఖండితధ్వజవేణుదండం బయి కానంబడుచున్నది. దీనిం బట్టి నిశ్చయముగా దుర్యోధనమహారా జక్కడ విశ్రమించి యుండు నని నేను దలంచెదను. (పోయి చూచి) జయము జయము మహారాజా!

సూతు—(చూచి) దేవా! సమరములోనుండి సుందరకుఁడు వచ్చినాఁడు.

దుర్యో—(చూచి) ఓరీ! సుందరకా! [illegible] గదా?

సుంద—దేవా! కేవలశరీరమాత్రంబున

దుర్యో—(తొందరగా) సుందరకా! ఏమి! అర్జునుఁ డతనిగుఱ్ఱములఁ జంపెనా? సారథిని వధించెనా? రథమును భగ్నము చేసెనా?

సుంద—దేవా! అతనిరథమునే కాదు; మనోరథమును గూడ భగ్నము చేసెను.

దుర్యో—(రోషముతో) ఓరీ! ఏమిరా యిది? ఉరిసినపుండుల నుప్పు జల్లినట్లు లీవలఁకే వ్యాకులపడుచున్న నామనస్సును నీసందిగ్ధపుమాటలచేత మఱింతవ్యాకులపఱుచుచున్నావు. అ దేమో స్పష్టముగాఁ జెప్పఁగదర!

సుంద—అయ్యా! చిత్తము. దేవరవారిమకుటమణిప్రభావముచేత నాగాయముల వేదన యుపశమిల్లినది. (గర్వముతో నడిచి) దేవా! చిత్తగింపుఁడు. ఇదిగో! దుశ్శాసనకుమారునివధ—

(ఇట్లుసగము చెప్పి నోరుమూసికొనుచున్నాఁడు.)

సూతు—సుందరకా! చెప్పుచెప్పు. అది రాజుగా రీవలఁకే విన్నారు.

దుర్యో—సుందరకా! చెప్పుము. అది విన్నాము.

సుంద—దేవా! చిత్తగింపుఁడు, ఇదిగో! దుశ్శాసనకుమారునివధ నిరీక్షించి క్రోధావేశంబునఁ బ్రభునశేణ్యుం డయినకర్ణుండు భీషణమ్ముగా నెమ్మొగమ్మునఁ గను బొమ్మలుముడివయిచి, హుమ్మని యతిలాఘవమ్మున సంధానమోక్షణమ్ములు తెలియనలవి గాకుండ, నఖండబాణవర్షము గురియించుచు దురాచారుం డగునాభీమసేనహతకుని నెదురుకొనెను.

ఇద్దఱు—తరువాతఁ దరువాత?

సుంద—అనంతర మోదేవా! ఇరువీడులందును గ్రందుకొనుచున్నకరితురగపదాతి సముదయంబులపదఘట్టనముల నెగసినధరాపరాగంబుచేతను, నటునిటు నడగొండలవలెఁ, దిరుగులాడెడు వేదండతండములచేతను,సంభవించి కాఱుగ్రమ్మిన చిమ్మచీకటికతమ్మున నుభయబలమ్ములు నంధీభూతంబులయి భూతలంబును జూడలేక పోయెను.

ఇద్దఱు—తరువాతఁ దరువాత?

సుంద—తరువాత నోస్వామీ! ఆకర్ణాంతము పూర్ణముగా నారి నాకర్షించి విడుచుటవలనఁ గలిగినభీషణధనుష్టంకారంబులు, ప్రళయధారాధరగంభీరగర్జారవానుకారంబు లయి, శ్రవణపుటంబులు వ్రక్కలించు చుండెను.

దుర్యో—తరువాత?

సుంద—తరువాత నోమహాప్రభూ! వా రిరువురకును బ్రవర్తిల్లినదారుణరణంబునఁ బరస్పరసింహనాదంబు లనియెడునుఱుములును, నన్యోన్యపరిముక్తవివిధాయుధసంఘట్టనంబున నుండెడుమెఱుపు లనియెడు నుఱుములును, బహుళ రుధిరబిందువు

లనియెడుఖద్యోతబృందములును గలిగి, నిరంతరస్తనితఘనగర్జలధరప్రసృతశరధారావర్షంబున దుర్దర్శనం బయి, దుర్దినంబు సంభూతం బయ్యె.

దుర్యో—తరువాత ?

సుంద—పిమ్మట నో దేవా ! ఇంతలోఁ దనయన్నగారికిఁ బరాభవ మగు నని భీతి యొత్తి. వజ్రనిర్ఘాతనిర్ఘోషసదృశం బగుచక్రనేమిసంఘట్టనధ్వానంబు ఘోటకహేషారవంబుల నినుమడింప, శిఖరావబద్ధకపిధ్వజప్రభలు కన్నుల మిఱుమిట్లు గొలుప, శంఖచక్రగదాఖడ్గలాంఛితచతుర్భుజుం డగుకృష్ణుండు యుగ్యంబులపగ్గంబులు నడల విడిచి నొగలపయిం గూరుచుండఁ, బిట్టపిడుగులుం బోలె బిట్టొత్తిన పాంచజన్యదేవదత్తంబులపెద్దయెలివు దిఙ్మండలంబు చెవుడు పఱుపఁ, జూపఱకు భీతి కొలిపెడు తనయరదంబును బర నెత్తించుకొని కడురయంబునఁ గిరీటి యటకుఁ జనుదెంచె.

దుర్యో—తరువాతఁ దరువాత ?

సుంద—దేవా ! అటుతరువాత నీవిధమున భీమార్జును లిద్దఱును దన తండ్రిని దాఁకుట యాలోకించి, తత్తఱపాటుతోఁ దలనుండి జాఱినరతనాలకుళ్ళాయి నైన గణియింపక, చెవియంట వింటినారిని దివిచి, లస్త్యలాఘవంబులు దీపింపఁ, బుంఖానుపుంఖంబులుగాఁ బఱపి, యంపవానల నరిబలంబుల ముంచివేయుచుఁ, బదపదమని సారథిని దొరపెట్టుచుఁ, దత్క్షణంబ వృషసేనకుమారుం డచ్చోటికి విచ్చేసెను.

దుర్యో—(గర్వముతో) తరువాతఁ దరువాత ?

సుంద—తరువాత దేవా ! అట్లు వచ్చి వెంటనే యావృషసేనకుమారుండు, నూటినకాటుకతీరున నునుపుదేరి నిగనిగ లాడుచుండెడుపుంఖములయందు సోగనుగాగ్రిద్దఱెక్కలు బిగియించి కట్టి, క్రొత్తగా సానఁబట్టినమెఱుఁగారువెడఁదవాతిదొడ్డనారసంబులు గుప్పఁగూరలుగాఁ బఱపి, ముహూర్తమాత్రములోపల నాకవ్వడియరదంబును బువ్వులు పూచినచెట్టులాగున నలుఁగులతోఁ గప్పివేసెను.

ఇద్దఱు—(సంతోషముతో) తరువాతఁ దరువాత ?

సుంద—అటుపిమ్మట దేవా! అయ్యర్జునుండు తీవ్రముగా బల్లెములవంటివాఁడికోలలు వేనవేలు పఱపి చిఱునవ్వు నవ్వి యాతని కిట్లనియె. ఓరోరివృషసేన ! నీతండ్రి యట్టివాఁడే నాయెదుర దురమున నిలువలేక యున్నాఁడు. నీ వెంతరా పిల్లవాఁడవు? వేల్పులోకమునకుఁ బోయి నీయీడుకుమారులతోఁ బోరు సలుపుము. అనవుడు నానుడువు లాలించి తనజనకునినధిక్షేపించినాఁడనుకోపంబున మొగమంతయుఁ జేవుఱింప, బొమ్మముడితో హుమ్మని యపుడు కఱచి, వృషసేనకుమారుండు గాండీవికి నాకర్ణాకృష్ట

ముక్తంబు లయి మర్మంబులు భేదించుతీవ్రనారాచపరంపరలఁ బ్రత్యుత్తరం బిచ్చె గాని పరుషవచనంబుల నీయఁ డయ్యె.

దుర్యో—వహవా! వృషసేనుఁడా! వహవా! తరువాతఁ దరువాత?

సుంద— దేవా! అనంతరము శాతశరాభిఘాతవేదనా పరిభూతక్రోధావేశుండును, శరవర్షతిరోహితుండును నగునయ్యర్జునుండు గాండీవజ్యాశబ్దనిర్ఘోషతారవుం డయి యెల్లవారు మెచ్చ వడునట్లు తనయస్త్రశిక్షాపాండిత్యంబునకు, బాహుబలంబునకు ననురూపం బయినవ్యాపారము చేయఁజాగెను.

దుర్యో—(అభిప్రాయగర్భముగా) తరువాతఁ దరువాత?

సుంద—మహాప్రభూ! అటువిమ్మట నట్లు మహాశ్చర్యంబుగా నమ చాతుర్యంబును జూపుచున్న తనశత్రువును జూచి వృషసేనకుమారుండును దూణీముసఁ బాణి యుంచుటయు, నారి తివియుటయు నలుఁగు దొడుగుటయు, నేయుటయు సహస్రాక్షున కయినఁ దెలియ నలవి గా కుండ నతివిచిత్రంబుగాఁ దనకులాఘవశరలాఘవంబులు చూపఁ దొడఁగెను.

దుర్యో—తరువాతఁ దరువాత?

సుంద—స్వామీ! అనంతర మేమి చెప్పుదు? అప్పు డెల్లవారును దమతమ యుద్ధంబులు నిలిపివేసి, చిరకాలము నుండి మనంబులరగులుకొనుచున్న క్రోధానలంబును జల్లార్చుకొని యాయుభయవీరులు నేయుచిత్రసమరంబును మహాశ్చర్యంబుతోఁ జూచుచుండి యిరువాగువారు నొక్కమాటుగా "వృషసేనుఁడా! బళి బళి!" యని మిన్ను ముట్ట మహాకలకలంబు గావించిరి.

దుర్యో—(ఆశ్చర్యముతో) తరువాతఁ దరువాత?

సుంద—తరువాత దేవా! ఇట్లు మేటివిలుకాండ్ర నందఱ నతిక్రమించి యాకుమారుఁడు బాహుపరాక్రమంబు చూపుచుండినతఱి స్వామి యైనకర్ణుండు పార్థకోపకరుణాశంకాసంకులమానసుం డయి భీమసేనునిపయి సహస్రంబులు తూపులును, వృషసేనునిపై సాస్రంబులు చూపులును బ్రసరింపఁ జేయుచుండెను.

దుర్యో—(భయముతో) తరువాతఁ దరువాత?

సుంద— దేవా! తరువాత నట్లావృషసేనకుమారుని నిరుపేడులవారును బళిబళి యని ప్రశంసించుటచేత గాండీవి మండిపడి మెఱుఁగులు గ్రక్కుచున్న కఱకుటమ్ముల నొక్కమొగి నక్కుమారుని తేరిమీఁదను, సారథిమీఁదను, గుఱ్ఱములమీఁదను, వింటిమీఁదను, నారిమీఁదను, రాజలాంఛన మగువెల్లగొడుగుమీఁదను వీరావేశంబున వర్షధారలవలె లెక్క లేక కురియించెను.

దుర్యో—(భయముతో) తరువాతఁ దరువాత ?

సుంద—దేవా! తరువాతవృషసేనకుమారుండు భగ్నరథుండు ఖండితకోదం డుండునయి గుభాలున భూతలంబునకు లంఘించి తనశత్రువు ప్రయోగించెడు వాలు టమ్ములను జక్రిమువోలె గిఱ్ఱునఁ దిగిరి తప్పించుకొనుచుండెను.

దుర్యో—(ఆడలుతో) తరువాతఁ దరువాత ?

సుంద—ఆటుపిమ్మట దేవా! తననందనునిస్యందనము చక్కు చేసె నను నక్కనుసం బ్రభు వైనకర్ణుండు భీమసేనునితాఁకుడు నొకగణన నేయక వాఁడిసాయ కంబుల నర్జునునిపయి నిగిడింపఁ జాగెను. ఇంతలోఁ దనపరిజనుండు కొనివచ్చిన వేఱొకతేరి నారోహించి వృషసేనకుమారుండు వెండియు గాండివిసే తెలపడి, రోరోరి మదీయజనకాధిక్షేపవాచాట! మధ్యమపాండవా! నాశరంబులు నీశరీరం బును విడిచిపెట్టి వేఱొకరొడకుఁ బోవ నిష్టపడకున్నవి. ఇదిగోఁ! గాచుకొమ్మని వేనవేలు వాలుటమ్ము లతని పెమ్మేను గ్రిమ్మకొనం బ్రయోగించి యులు ముతిమి నట్లు పెద్ద సింహనాదంబు గావించెను.

దుర్యో—(విస్మయముతో) ఔరా! ఆతి తేతినవాఁడు గాకపోయినను గుఱ్ఱ వాఁ డెంతపరాక్రమము చూపెను! తరువాతఁ దరువాత ?

సుంద—పిమ్మట దేవా! ధనంజయుడు తనమీఁదికి వచ్చుబాణములనెల్ల నింత లింతలు తునియలు గావించి రోషావేశంబునఁ గనత్కనకకింకిణీజాలఝుంకారవిరా విణియు, మేఘావగోధము క్తనభోమండలనిర్మలాకారిణియు, నిశితశ్యామలస్నిగ్ధము ఖియు, వివిధరత్నప్రభాభాసురభీషణస్వరూపిణియు, రమణీయదర్శనయు నయి తన యరపంబునఁ బ్రజ్వలించుచున్నశక్తి నట్టె యంద పుచ్చుకొవి నవ్వుచు నక్కుమారున కభిముఖముగా విడిచిపెట్టెను.

దుర్యో—(విషాదముతో) అయ్యయ్యో! తరువాతఁ దరువాత ?

సుంద—అటుపిమ్మట దేవా! నింగి యంతయు మ్రింగివేయునట్లు బగ్గుబగ్గున మండుచుఁ గుమారునిదెసకు వచ్చుచున్నయాశక్తిని జూచినతోడనే స్వామి యయిన కర్ణునికిఁ జేతినుండి ధనుర్బాణంబులును, హృదయంబునుండి వీరసులభోత్సా హంబును, గన్నులనుండి బాష్పబిందుసందోహంబును, వదనంబునుండి వికాసంబును నొక్కమాఱుగా జాఱిపోయెను. అర్జునుండు హసించెను. భీమసేనుండు సింహనాదంబు చేసెను. అతిదారుణ మతిదుష్కర మని మనబలంబులు హాహాకార మొనరించెను.

దుర్యో—(విచారముతో) తరువాతఁ దరువాత ?

సుంద—అటుపిమ్మట నోస్వామీ! వృషసేనకుమారుఁడు దానికి లేశ మైన భయం బొందక వాఁడి యయినయొకయర్ధచంద్రబాణమును వింటఁ దొడిగి, గుఱివెట్టి

చెవి యంట గొనయంబు లాగి, యాశక్తికి సూటిగా దానిని విడిచిపెట్టి ఫాలాక్షునిచేత భాగీరథియుంబోలె మధ్యభాగముననే యది ముక్కనియగాఁ జేయ బడియె.

దుర్యో—సెబాసు! వృషసేనుఁడా! సెబాసు! తరువాతఁ దరువాత!

సుంద—తరువాత నో దేవా! హల్లకల్లోలం బగుసహువర్ణంబులాగునఁ గో హలంబు గావించెడువీరవాఁబులసాధువాదంబులకలకలంబునఁ దూర్యారావంబులు బడ వర్యెను. అంతరిక్షమున వీక్షించెడుగరుడగంధర్వసిద్ధసాధ్యాది వియచ్చరు గురిసిన పుష్పవర్షంబున సమరాంగణంబు సంఛన్నం బయ్యె.

దుర్యో—ఆహా! బాలకునిపరాక్రమము! తరువాతఁ దరువాత?

సుంద—తరువాత దేవా! సామి యయినకర్ణుం డిట్లు వధంబునం బలికె. ఓప్ప దరా! నీకు నాకును యుద్ధ మింకను ముగియలేదు; అయినను ముహూర్త మాత్ర న న్ననుమతింపుము. కొంచెముసేపు నాకుమారునియు నీతమ్మునియు. ధనుర్వేద నైపుణ్యము చూడ వేడుక పొడముచున్నది. ఇది నీవును జూడఁ దగినదే గదా? కర్ణుఁడును భీమసేనుండును రణవ్యాపారనిర్బంధము నుండి విముక్తు లయి, మహూ మాత్రము పరస్పరవైరముల నూఁచివేసికొని, వృషసేనధనంజయులు సలుపుద్వం యుద్ధంబు నిరీక్షించుచుండిరి.

దుర్యో—(సాభిప్రాయముగా) తరువాతఁ దరువాత!

సుంద—తరువాత దేవా! శక్తినిఖండించినాఁడనురోసమున నాసమయమ గాండీవి యిట్లనియె. ఓరోరిదుర్యోధనాది—(సగము చెప్పి సిగ్గుపడుచున్నాఁడు.)

దుర్యో—సుందరకా! చెప్పుము. అది పరుఁ డన్నమాట గదా!

సుంద—దేవా! యవధారు. ఓరోరిదుర్యోధనాదికౌరవసేనా ప్రభువులా ఓరియవినయార్ణవకర్ణధార! కర్ణ! మీరు నేను దగ్గఱలేనియప్పుడు నాకొడు నభిమన్యుని నధర్మముగా నేకాకిని జేసి, చంపితిరి గదా! ఇదిగో! నేను రందఱుఁ జూచుచుండఁగా ధర్మయుద్ధమున నీవృషసేనకుమారుని నామైకశేష గావించెదను. అని పలికి దర్పాతిరేకంబున నిర్ఘాతఘోషభీషణమౌర్వీచండనా బగుగాండీవంబు సారించిన, సామియైనకర్ణుండును గాలపృష్ఠం బనునిజకార్ముక నెక్కు వెట్టె.

దుర్యో—(సావహిత్థముగా) తరువాతఁ దరువాత?

సుంద—తరువాత నో దేవా! కర్ణునితో వెండియు యుద్ధంబు నేయఁబూని భీమసేనుని వారించి, అర్జునుండు తా నొక్కరుండ కర్ణవృషసేనుల లేర లో

కూలముల నోరసికొనునట్లు బాణౌఘద్వయంబును బ్రవహింపఁజేసెను. అంత వారిరువురును బరస్పరస్నేహంబునఁ దమధనుర్విద్యాపాండిత్యవిశేషంబును జూపుచు నయ్యర్జునుం దలపడిరి.

దుర్యో—తరువాతఁ దరువాత ?

సుంద—తరువాత నేమిచెప్పుదు దేవా! పాండవమధ్యమునందు చండగాండీవమౌర్వీనిర్ఘోషమాత్రవిజ్ఞాతం బగుశరవర్షంబు సమస్తంబునఁ గురియించుడు, దానికతన భూమియు నాకసంబును, గర్ణుండుఁ గుమారుండును. వారువంబులు వీరవారంబును, దేరును సారథియును, కేతనంబు నాతపత్రంబును, దిక్కులు గిక్కులును గన్నులకగోచరంబు లయ్యె.

దుర్యో—(విస్మయముతో) తరువాతఁ దరువాత ?

సుంద—దేవా! పిమ్మట నొకక్షణమాత్రములో నాయంపవాన వెలిసెను. అంతలోఁ బాండవసైన్యంబునందు హర్షముతోఁ బెద్దసింహనాదంబులును, గౌరవసైన్యంబున వృషసేనుఁడు చచ్చెఁజచ్చె ననుహాహాకారంబులును, నొక్కపెట్ట యెగసెను.

దుర్యో—(సబాష్పరోషం డయి) తరువాతఁ దరువాత ?

సుంద—తరువాత దేవా! హతసారథితురంగముండును, ఖండితచ్ఛత్రచామరచాపకేతనుండును నయి. హృదయమర్మభేదక మ్మగు నొకవాలుటమ్మున మేను వీఱి, స్వర్గభ్రష్టుం డయినసురకుమారుండునుం బోలెఁ దేరిమీఁదఁ బడియున్నయావృషసేనకుమారునిఁ జూచి వచ్చితిని.

దుర్యో—అహహా! వృషసేనకుమార! అటుపిమ్మట వినుట చాలును. హా! వత్స! హా! వృషసేన! హా! మదంకదుర్లలిత! హా! మదాజ్ఞానుసారి! హా! గదాయుద్ధప్రియశిష్య! హా! శౌర్యసాగర! హా! రాధేయకులప్రరోహ! హా! ప్రియదర్శన! హా! దుశ్శాసననిర్విశేష! హా! సర్వగురువత్సల! పలుకవేమిరా కుమార.

తే. గీ. కొలిచినను జేరలకు మీఱు గొప్పకనులు,
మోను లెత్తెడునూనూఁగుమీసములును,
గలిగి శశిఁ బోలునీముఖకమల మకట!
కర్ణుఁ డెటు గాంచె, నీవు మ్రగ్గన్న వెట్ట? ౧౦

సూతు—దేవా! దుఃఖసాగరమున మునుంగకుము.

దుర్యో—సూతుఁడా! దుఃఖవంతులును బుణ్యాత్ములే సుమీ. ౩౯
మాకో—

తే. గీ. కనులయెదుర బంధుగణ మెల్ల హత మయ్యె,
ననెడుపరిభవపు దవానలమున
హృదయ మెప్పుడును దహించుక పోయెడు;
నేటిదుఃఖ మింక నేటిబాధ? (మూర్ఛిల్లుచున్నాఁడు.) ౧౧

సూతు—ఊఱడిల్లు మూఱడిల్లుము. (చేలచెఱంగున విసరుచు) దేవా! అతిదుఃఖమును బొందకుము.

దుర్యో—(తెలివి వచ్చి) సుందరకా! నాచెలికాఁడు కర్ణుఁ డప్పు డేమి చేసెను?

సుంద—తరువాత దేవా! ఆర్తిఱంగున జీవంబులు విడిచినకొడుకును జూచి, యంగరాజు, కాలువలు గట్టుకన్నీరు చేతులతోఁ దుడుచుకొనుచుఁ, దనశరవేదనను గణియింపక వెండియు గాండీవిని దలపడియె. అట్లు పుత్రవధామర్షంబున జీవితంబుపై నాస రోసి పరాక్రమింపవచ్చినయాకర్ణునిఁ జూచి, భీమసేననకులసహదేవులును బాంచాలప్రముఖబంధుగణంబును నయ్యర్జునురదంబును బొదివికొనియె.

దుర్యో—తరువాతఁ దరువాత?

సుంద—దేవా! తరువాత నయ్యర్జునుచేతిగాండీవం బనుమహాప్రళయపయోధరంబు, తెఱపి యీకుండ నఖండశరధారావర్షంబున దశదిశలును ముంచుచుండఁ, గనుంగొని యంగరాజుతో శల్యుం డి ట్లనియె. అంగరాజా! గుఱ్ఱంబులు చచ్చినవి. నొగలుఁ జక్రనేమియు విఱిగినవి. ఇట్టిరథ మెక్కి నీవు భీమార్జునుల నెదురుకొనుట మేలు కాదు. అని చెప్పి మరలించి యాయనను రథమునుండి దింపి పలుదెఱఁగుల నూఱడించెను.

దుర్యో—తరువాతఁ దరువాత?

సుంద—దేవా! గొండొకతడ వాలసించి తరువాతఁ దనపరిజనునిఁ జూచి యంగరాజు, నీవు త్వరితముగా వేఱొకయరదము గొనితెమ్మని సెలవిచ్చిన, వాఁడు నట్లు కావించె. అప్పు డాయన నావైపు చూచి, సుందరకా! ఇటురమ్మని పిలిచిన, నేను వినయముతో సమీపమునకుఁ బోయి నిలిచితిని. అంతటఁ దనముఖపట్టమును దీసి చేతఁ బట్టుకొని, నెత్తుటితో నిండి యున్నగాయములయందు బాణాగ్రమును ముంచి దేవరవారి కీజాబును వ్రాసి పంపెను. (పట్టిక సమర్పించుచున్నాఁడు.)

దుర్యో—(పుచ్చుకొని చదువుచున్నాఁడు.)

స్వస్తిశ్రీ మహారాజదుర్యోధన!

ఈగడియవఱకు గాఢముగాఁ గంఠాశ్లేషము గావించుకొని యుద్ధరంగము నుండి కర్ణుండు సలుపువిజ్ఞాపనము.

మ. వరదివ్యాస్త్రవిశారదుం డితని కెవ్వండీ డనిన్? నాకు నా
గ్రజుసైదోడులకంటె నెక్కు, డితఁడే కూల్చుం బృథానూనులన్,
దురమం దంచు, బహూకరింతు నను; నే దుశ్శాసనారిన్ భయా
తురతం గూలుపనైతి; నీఁగు వగ నీదోశ్శ్రీనొ కన్నీటనో. ౧౨

దుర్యో—వయస్యా! కర్ణుఁడా! ఏమిది! నూఱుగురుతమ్ములను జచ్చి దుఃఖపడుచున్న నన్ను నీవచోభల్లఘాతములచేత మఱింత దుఃఖ పెట్టుచున్నావు. సుందరకా! సరే. ఇప్పు డంగరాజు ప్రయత్న మేమి?

సుంద—దేవా! ఆయన యిప్పు డాత్మవధయందుఁ గృతనిశ్చయుఁ డయి కవచవిసర్జనంబు గావించి యుద్ధమునకుఁ బోవ నుండెను.

దుర్యో—(విని యదరిపడి లేచి) సుందరకా! నీవు త్వరితముగాఁబోయి మిత్త్రుఁ డైనయంగరాజుతో నావచనంబులుగా నిట్లు పలుకుము. "మిత్త్రమా! నీ విప్పుడు జయకాంక్షను వదలుకొనుము. మనయిరువురసంకల్పము నొకటియేగదా!

ఉ. పాండవులన్ వధించి, హతబంధుల కిచ్చి నివాపవారి, చా
కుండినవాండ్రితోఁ గలసి యొక్కమ ఱేడిచి, యింక మీఁద నె
న్నండును లేదు గావున ఘనంబుగ నొండొరుఁ గౌఁగిలించి, యీ
మొండిశరీరముల్ విడిచి పోదము, దుఃఖమొ సౌఖ్యమో తుదిన్. ౧౩

ఇంక దుఃఖమును గుఱించి నిన్ను నే నేమని యూఱడింతును?

క. సూనుఁడు గాఁ డనుకో వృష
సేనుఁడు నీ; కట్ల దుస్ససేనుఁడు నాకున్
దా నను జన్ముఁడు గాఁ; డిఁక
నే ని న్నేమందు? నన్ను నే మనె దీవున్?". అని ౧౪

సుంద—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు.)

దుర్యో—ఓయీ! బండికండ్లచప్పుడులా గున్నది.

సూతు—(ఆలకించి) దేవా! అది యిప్పు డధిక మగుచున్నది.

దుర్యో—సరే, పరిజనుఁడు రథమును దోలుకొని వచ్చుచున్నాఁడు. నీవు పోయి దాని నాయితంబు సేయుము.

సూతు—చిత్తము దేవా! (నిష్క్రమించి మరలఁ బ్రవేశించుచున్నాఁడు.)

దుర్యో—ఏమిది రథ మెక్కి రావయితివి ?

సూతు—దేవ ! ఇదిగో ! అమ్మగారును నాయనగారును సంజయునితో రథారూఢు లయి తమయొద్దకె వచ్చుచున్నారు.

దుర్యో—హాహా ! దైవ మెంతబీభత్సము చేసెను ! సూతుఁడా ! నీవు త్వరితముగా రథము నాయితంబు చేసికొని రమ్ము. నేనును నాయనగారి కగపడకుండ దాఁగి యుండెదను.

సూతు—దేవా ! వారికి నీవుతప్ప మఱి యెవ్వరుఁ జుట్టంబులు లేరుగదా. దేవర కూడ వారి నూఱడింపక పోవుట యుచిత మగునా ?

దుర్యో—సూతుఁడా ! అదృష్టహీనుఁడను నేను వారి నేమనియూఱడింతును ! చూడుము,

చ. అని కిటు వచ్చుచుండ, మము నమ్మయుఁ దండ్రియు, బాష్పబిందువుల్
గనులను రాల మూర్ధములఁ ఘ్రాణము చేసిక యంపె; రిప్వ ఁడే
మనుదు నొకండ డగ్గతి ? కటాకట ! మిగ్ఁగిలి దుస్ససేను; న
త్తనయుని యట్టిదారుణవధ న్విని, యామదియందు లోర్తురే ? ౧౫

వినను దల్లిందండ్రు లవశ్యము వందనీయులు గదా ! (నిష్క్రమించుచున్నారు.)

గద్య. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది సాంపంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్రగుణకదంబ లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజపుత్రీధానతనూభవ విబుధవిధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీకృత వేణీసంహార నాటకంబునందుఁ జతుర్థాంకము.



శ్రీ రస్తు.

శ్రీపరమాత్మనేనమః

# వేణీసంహారనాటకము.



## పంచమాంకము.



[తరువాత రథమెక్కి గాంధారియు సంజయుఁడును ధృతరాష్ట్రుఁడును ప్రవేశించుచున్నారు.]

ధృత—వత్స! సంజయ! కురుకులవనంబున నొక్కయాకులాగున మిగిలియున్న నాకొడుకు దుర్యోధనుఁ డేమయిన బ్రతికి యున్నాఁడా? లేదా?

గాంధా—సంజయా! నిజముగా బ్రతికి యుండెనేని యెక్కడనున్నాఁడో చెప్పుము.

సంజ—ఇదిగో! మహారాజొక్కఁడు నీమఱ్ఱిచెట్టునీడను గూరుచున్నాఁడు.

గాంధా—కుమారా! డొక్కఁడే యని చెప్పుచున్నావు. ఇపుడు నూఱుగురు తమ్ములును వానిపార్శ్వభాగమున లేరా?

సంజ—నాయనా; అమ్మా! రథము నిమ్మళముగా దిగుండి.

ఇద్దఱు—(దిగుచున్నారు.)

[తరువాత దుర్యోధనుఁడు ప్రవేశించి సిగ్గుతోఁ గూర్చున్నాఁడు]

సంజ—(దగ్గఱఁ బోయి) జయము జయము మహారాజ! ఇదిగో! నాయనగా రమ్మగారితోఁగూడ వేంచేసినారు. వారిని జూడ వేమి మహారాజా?

దుర్యో—(తెలతెలఁబోవుచున్నాఁడు.)

ధృత—చ. ఘనకవచంబు దీయఁగనె, కంకముఖంబున నల్గు లూడ్చి, వే
గను వ్రణపట్టికల్ వయిచి కట్టుడు, దిండున నత్తమిల్లి, ద
వ్వున జితశత్రులన్ నృపులఁ బుత్రక! నీవు ప్రియంబునం గనుం
గొనఁ, జెవిఁ జేరి వేదనను గూరిచి నిన్నడుగన్ దురాత్ముఁడన్.

(ధృతరాష్ట్రుఁడు గాంధారియుఁ దడవి చూచి కౌఁగిలించుకొనుచున్నారు.)

గాంధా—కుమారా! తీవ్రమయిన గాయముల వేదనచేత క్షోభపడుచు మాతోఁగూడ మాటలాడఁ జాలకున్నావా? తండ్రీ.

ధృత—వత్స! దుర్యోధన! ఏ మిది? మును పెప్పుడు నిట్లు కావే! మాతోఁ గూడఁ బలుక వేమి?

గాంధా—కుఱ్ఱా! నీవే మాతో మాట లాడకపోయిన, నిఁక దుశ్శాసనుఁడును దుర్మర్షణుఁడును దక్కినకొడుకులు నిప్పుడు మాట లాడుదురా యన్నా?

(రోదనము చేయుచున్నది.)

దుర్యో—ఉ. తమ్ములచావు చూచితిని దత్ప్రతికారము సేయ లేక; నే
నమ్మరో! నీకు నయ్యకును నాఱనిదుఃఖము దెచ్చినాను; స్వ
చ్ఛ మ్మగుచున్న యీభరతసంతతి మాపఁగఁ బుట్టుపాతకిన్;
నమ్మఁడి మీకు నేను సుతనాముఁడఁ గాని సుతుండఁ గాఁ జుఁడీ.

గాంధా—బిడ్డా! ఏలయిట్లు పరిదేవనంబు చేసెదవు? నీ వయిన నీయంధుల కిద్దఱకును దారిఁ జూపుటకుఁ జిరంజీవి వయి బ్రదుకుము. నాకు రాజ్యముతో నేమి? వైరముతో నేమి? (రోదనము చేయుచున్నది.)

దుర్యో—తే. గీ. అమ్మరో! యిట్టివెడమాట లాడఁ దగునె?
పుట్టినది రాచపుట్టువు పొగలె దేల?
సుతశతము రూపు మాయుట చూడ; వెంత
కఠినురాలవో తలు నన్నుఁ గావఁ దలఁతు. 3

ఇది నిశ్చయముగాఁ బుత్రశోకమువలనివికారము.

సంజ—మహారాజా! చేఁద నూతఁ బడినఁ ద్రాడు కూడ నక్కఱఁ బాఱవేయఁ గూడ దనులోకోక్తి యబద్ధమా యేమి?

దుర్యో—ఈయుక్తి చాల దోయి. ఉపక్రియప్రమాణము లేనియప్పు డుప కరణముతో నేమి ప్రయోజనము? (రోదనము చేయుచున్నాఁడు.)

ధృత—(దుర్యోధనునిఁ గౌఁగిలించుకొని) అబ్బాయీ! ఊఱడిల్లుము. మిక్కిలి దీనుల మయినతలిదండ్రులను మ మ్మూఱడింపుము.

దుర్యో—తండ్రీ! ఇప్పుడు మి మ్మూఱడించుటకు దుష్కరము; కాని—

ఆ. వె. కుంతి నిప్పు డేను గొడుకులు సచ్చిన
దానిఁగా నొనర్తుఁ దథ్యముగను;
మీరు దానితోఁ గుమారులకొఱ కేడ్చి,
యూఱడించుకొనెద రొకరి నొకరు. ౪

గాంధా—బిడ్డా! నీ వొక్కఁడ వయిన బ్రతికిన నంతె చాలును; నే నెవరిని గూర్చి శోకింతును? కొడుకా! ఇది యుద్ధమునకు సమయము గాదు. శాంతింపుము.

ఇదిగో! దోసిలి పట్టి బతిమాలుకొనుచున్నాను. సమరవ్యాపారము విడిచిపెట్టుము. నామాటలు పెడచెవిని బెట్టకు తండ్రీ!

ధృత—వత్సా! ఎల్లచుట్టములును జచ్చిపోయి దుఃఖించుచున్న మీయమ్మ మాటను నామాటను విను. తండ్రీ! చూడు.

ఉ. ఏరిబలాన దాయలను నెంచవొ లేరల ద్రోణభీష్మ, లా
తీరునఁ గర్ణపుత్రుని వధించినక్రీడికి జంకు లోకముల్;
వైరి వధించె నూఱుగురు వత్సల; నీనె మిగుల్ ప్రతిజ్ఞకుఁ;
బోరికమాను తండ్రి! మముఁ బ్రోవుము కన్నులు లేని దీనులఁ. 2.

దుర్యో—యుద్ధము మాని నేను జేయునది యేమి?

గాంధా—పుత్రికా! మీతండ్రిగారును విదురుఁడును జెప్పినట్లు చేయుము.

సంజ—రాజా! ఇది సత్యము.

దుర్యో—సంజయా! ఇంకను నుపదేశింపఁ దగినయంశ మున్నదా?

సంజ—రాజా! జయము గోరువారికిఁ బ్రాణమున్నంతవఱకుఁ బ్రజ్ఞావంతు లుపదేశింప వలసినదే.

దుర్యో—(క్రోధముతో) అట్లయినఁ బ్రజ్ఞావంతుల రగుమీహితోపదేశ మేమో యిప్పుడు తెస్సగా విందము.

ధృత—కొడుకా! యుక్తముగాఁబలికినయీసంజయునిమీఁదఁ గోపపడియెద వేమి? నీవు శాంతించితివేని దానిని నేనే చెప్పెదను. విను.

దుర్యో—నాయనా! సెల విమ్ము.

ధృత—వత్సా! పెక్కుమాట లేల? ఇప్పుడు యుధిష్ఠిరునకుఁ గోరిన పణంబు నిచ్చి సంధి చేసికొనుము.

దుర్యో—తండ్రీ! పుత్రులయందలి ప్రేమవలనిభయమునంజేసి యంబయును, బాలిశత్వమునంజేసి సంజయుండును నట్లు పలికినఁ బలికిరి గాక, మీకుఁ గూడ నిది యేమి వెఱ్ఱి? కాకపోయినఁ బుత్రశోకజ్వర మెంతకుఁ జాలదు. నాయనా! నూఱుగురుతమ్ములతో నిండియున్నప్పుడు, నాఁడన్నివిధంబుల సామవాక్యముల చేతఁ గృష్ణుండు నన్నుఁబతిమాలుకొనిన నిరాకరించి, యిప్పుడు భీష్ముండును ద్రోణుండును దమ్ములును సకలరాజచక్రంబును బేరుమాయుట చూచి, కేవల మీతుచ్ఛశరీరము మీఁదియపేక్షచేత, నుదాత్తపురుషలజ్జాకరంబును, ననుభావహంబును నయిన పాండవులతోడిసంధికి, దుర్యోధనుఁడెట్టు లంగీకరించును? ఇంక నొకటి చెప్పెద. నయకో విదుఁడా! సంజయా!

ఆ. వె. హీను లయినరిపులతో నెట్లు రాజులు
సంధి చేసికొండ్రు చక్కఁ జెపుమ;

నేను భ్రాతృశతము లేనివాఁడను గద!
పాండుసుతులు కొఱఁత పడనివారు.

ధృత—వత్సా! ఇట్టియవస్థయందుఁబనను నాప్రార్థనమును ధర్మరా ఛాకరింపఁ డిది నిశ్చయము. ఇంకొకటి. యుధిష్ఠిరుఁడుఁ నిన్ను హీనునిఁగా నని నీ తాత్పర్యము. అది సరి కాదు. అతఁడు సర్వదా తన్ను నీకంటెఁ దక్కు వానిఁగానే తలంచుకొనుచుండును.

దుర్యో—అది యెట్లు?

ధృత—ఇదిగో! విను. తనతమ్ములలో నొక్కనికేని కీడు మూఁడినఁ, ప్రాణములఁ బాయువాఁడుగా యుధిష్ఠిరుఁడు శపథముఁ జేసినాఁడు. అందుచే యుద్ధమునం దెల్లప్పుడు నొక్కతీరున సాగి రాదు గావునఁ దమ్ములదెస శేమి పుట్టునో యనుభయంబున నీ కనుకూల మయినతెఱంగుననే యతఁడు స నేయుట కిచ్చగించును.

సంజ—ఇది యథార్థము.

గాంధా—బిడ్డా! యుక్తియుక్తముగా నున్న మీతండ్రిగారిమాట దా నడుచుకొనుము.

దుర్యో—నాయనా! అమ్మా! సంజయా!

చ. అనుజుఁ డొకండు చచ్చినను నాతఁడు సావఁ బ్రతిజ్ఞ పట్టె; నా
యనుజులు నూర్వురుం దెగిన, నక్కట! ప్రాణముఁ బాయనైతి; నే
నని మొన దుస్ససేనుహృదయంబున నెత్తురు ద్రావుభీము, నా
పెనుగద నుగ్గు నేయ కటు బేలనె సంధిని జేసికొంటకున్?

గాంధా—హా! దుశ్శాసనకుమార! దుర్మర్షణ! హా! వికర్ణ! అహో! వీరశతమును గన్నగాంధారీ! దుఃఖశతము నే గాని సుతశతమును గన లేదా! అయ్యో! మందభాగ్యురాల నయిన నాయిట్టియాపద లోకమునందుఁ గన్నదా! విన్నదా? (అందఱు రోదనము చేయుచున్నారు.)

సంజ—(కన్నీరు దుడుచుకొని) నాయనా! అమ్మా! మహారాజును దుఃఖశాంతి చేయుట కయి మీ రిక్కడకుఁ వచ్చితిరి. మీఁదు మిక్కిలి మీరు కూ నధైర్యపడియెద రేమి? ఊఱడిల్లుఁడు.

ధృత—కుమారా! మనయదృష్టము లిట్లుండెను. నీవు వైరులయెడ రోషమును విడిచి పెట్టవయితివి. నీబ్రతుకునే యాధారము చేసికొని యు పొక్కుచున్న మీయమ్మకును నాకును మఱియెవరు దిక్కు? ఎట్లు బ్రదుకుదుము!

దుర్యో—నాయనా! వినుండు.

ఆ. వె. విరివిసిరుల ననుభవించి, యనేకరా
జన్యమకుటదీప్తచరణు లగుచు,
సుతులు నూర్వు రరుల సోలించి వ్రాలిరి;
బ్రతుకుఁ జీరు సగరుపగిదిఁ, దండ్రి!

ఒంటుదెలం గయిన నాకు రాచపాడి తప్పుట సంభవించును గదా?

(తెరలోపలఁ బెద్దకలకలము.)

గాంధా—(విని భయముతో) సంజయా! ఏమిది? హాహాకారముతోఁ దూర్యధ్వను లెగయుచున్నవి!

సంజ—అమ్మా! మీవంటిభీరుజనమున కిది నిలువ వలసినచోటు గాదు.

ధృత—వత్సా! సంజయ! ఈహాహాకార మంత కంతకు నెక్కువ యయి భయము పుట్టించుచున్నది. అది యేమో తెలిసికొనుము. దీని కేదో గొప్పకారణ ముండక పోదు.

దుర్యో—తండ్రీ! అనుగ్రహింపుము. మనయెడల దైవము పరాఙ్ముఖ మయ్యెను గదా! మరల నేదేని మహోపద్రవము చెవిని బడక మునుపే, నాకు యుద్ధమునకుఁ బోవ ననుజ్ఞ యిండు.

గాంధా—బిడ్డా! మందభాగ్యురాల నయిననన్ను మహార్తమాత్ర మూఱడింపవోయి తండ్రీ!

ధృత—అబ్బాయీ! నీవు యుద్ధమునందే కృతనిశ్చయుఁడ వయితివేని, శత్రువులను రహస్యముగాఁ గడతేర్చునుపాయ మాలోచింపుము.

దుర్యో— ఉ. ఏఁ గన నాదుబంధువుల నెల్ల వధించినవారిఁ, జాటుగా
బాగె వధింప? యుద్ధమున వైరులు మెచ్చనిచంపు చంపొకో?

గాంధా—బిడ్డా! నీ వేకాకి వయితివి గదా! ఎవ్వరు నీకుఁ దోడుపడు వారు?

దుర్యో— ఈగతి నేన నీసుతుల నెక్కటి చంపనె? వైరు లెంత? య
వ్వా! గను మిప్పుడే జగ మపాండవమా; నిఁకఁ దోడు దైవమే.

(తెరలోఁ గలకలానంతరమున)

ఓహో! యోధులార! ఇప్పుడు జరిగినమహాయుద్ధమును గౌరవేశ్వరునకు విన్నవింపుఁడు. అప్రియము వినఁ జాల కున్నఁ దప్పి పోవునా? ఇప్పుడు కాలాను రూపముగా నేమి ప్రతివిధానము చేసికో వలసి యుండునో?

మ. మునికోల న్విడి; యర్జునాంకపుశరంబుల్ సర్వాంగముం గాఁడ, వ
చ్చినజాడన్ రథ మీడ్చుకొంచుఁ జన దేజీల్, మెల్ల శల్యుండు, లో
చనబాష్పంబులె కర్ణవార్త పరిజనున్ స్పష్టంబుగాఁ దెల్పఁ, జొ
చ్చె నిదే శూన్యరథంబుతో శిబిరమున్, జింతిల్లఁగాఁ గౌరవుల్. ౧౮

దుర్యో—(భయముతో) సూతుఁడా! పిడుగువలె వినఁబడుచున్న యీనుడు లెవఁడు వలికెనో తెలిసికో వలయును. ఓరీ! యెవఁడురా అక్కడ?

(తత్తఱపాటుతో సూతుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

సూతు—హా! చచ్చితిఁగద! (భూమిమీఁదఁ బడుచున్నాఁడు.)

దుర్యో—చెప్పు చెప్పు.

సూతు—దేవా! మఱి యేమున్నది?

ఆ. వె. అలమనోరథంబువలె శూన్యభావంబు
నెనయుకర్ణరథము నెక్కి వచ్చి,
శల్యరూపమునను శల్యుండు చొరఁబడి,
జనము నెల్ల మూర్ఛ మునుఁగఁ జేసె. ౧౯

దుర్యో—హా! వయస్య! కర్ణ! (మూర్ఛిల్లుచున్నాఁడు.)

గాంధా—బిడ్డా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

సంజ—ఊఱడిల్లు మూఱడిల్లు మహారాజ!

ధృత—అయ్యో! ఎంతకష్ట మెంతకష్టము!

క. ఆలమున ద్రోణభీష్ములు
గూలుటనే పారిపు దక్కెఁ గురుసైన్యంబుల్;
మే లయినసఖుఁడు కర్ణుఁడు
నీలీలను నిహతుఁ డయ్యె; నిఁక నెట్లొక్కొ. ౨౦

కుమారా! ఊఱడిల్లు మూఱడిల్లుము. ఓమాయదైవమా!

ఉ. కన్నులు లేవు; పుత్రశతకం బనిఁ జచ్చె; నగాధశోకవా
రాన్నిధి నింతితోడుతఁ గరంబు మునింగితి; నయ్యయో! యిఁ కే
మున్నది? బందుగుల్ చెలులు నొజ్జలు నాదిగ శూన్య మైరి నీ
వన్నగడన్; సుయోధనునిపట్టునఁ గూడను నాస వీడితిన్. ౨౧

వత్సా! దుర్యోధన! దీనురా లయినమీయమ్మ నూఱడింపుము.

దుర్యో—(మూర్ఛ దెలిసి)

తే. గీ. కర్ణుఁడా! నీకు నామీఁదఁ గలుగుప్రేమ
పయికిఁ బొరలంక, నింపుగఁ బలుకఁ వేమి?

పాయ నెన్నఁడు; నీ కెగ్గు సేయ; నైన,
మిత్రు విడిచితె వృషసేనుమీఁది ప్రేమ? ౧౪

(మరల మూర్ఛిల్లుచున్నాఁడు.)

అందఱు—(ఊఱడించుచున్నారు.)

దుర్యో—(ఊఱడిల్లి)

తే. గీ. అకట! నాప్రాణములకంటె నధికుఁ డయిన
యంగరాజ్ఞు గూల్చి, ప్రాణములను
విడువనందుకె, కడు సిగ్గుపడుచు నుంటి:
నింక నే నూఱడిల్లుట యెట్లు తండ్రి? ౧౫

మఱియు—

తే. గీ. పగవ వలసిన పగవ, నే బాలుఁ డైన
దుస్ససేనునివధకు, బంధువులమృతికి;
నాకు నత్యుపకార మొనర్చినట్టి
కర్ణుకుల మెల్ల, మాపితిఁ గాన పగతు. ౧౬

గాంధా—బిడ్డా! క్షణమాత్రము కంటఁ దడి పెట్టకుము.

ధృత—కుమారా! నీ వొక్కమాఱు కన్నీరు దుడుచుకొనుము.

దుర్యో— తే. గీ. నానిమిత్తము తనదుప్రాణములు విడిచె,
నెంత లెంతలచేతను నీడఁబోక;
యట్టికర్ణునికొఱకు, నే ననద నగుచు
నశ్రుజలమును విడువ, న న్నాఁగఁ దగునె? ౧౭

సూతుఁడా! నే నెన్నఁడుఁ దలఁచుకొనినదియు, నాకులమున కంటక మయినదియు
నగుసీఘోరకర్మ మెవఁడు చేసెనో?

సూతు—దేవా! జను లీలాగునఁ జెప్పుకొనుచున్నారు.

"ఆ. వె. తేరికల్లొకింత ధారుణిఁ గ్రుంగ, రా
ధేయుఁ డెత్తికొనెడితెఱపిలోన,
మనబలంబు రూపు మాపినయర్జును
నలుఁగు లతనియసువు లపహరించె. ౧౮

దుర్యో—క. అలకర్ణుమోముచందురుఁ
దలఁచిన, శోకాబ్ధి పొంగుఁ; దత్క్షణ మది, నా
యలుక యనుతీవ్రబడబా
నలశిఖలను మరల శోషణంబును జెందుః. ౧౯

తండ్రీ! అమ్మా! మీ రూఁబడిల్లుఁడు.

ఆ. వె. శోకమునను బట్టి, చుఱచుఱ నిపుడు నా
యుల్ల మేర్చుచుంట కోర్వఁ జాల;
సమవిపత్తులందు శంక మీ కేల? నా
కాలమునకుఁ బోవ నాన తిండు.

ధృత—(దుర్యోధనునిఁ గౌఁగిలించుకొని)

ఆ. వె. సాహసంబులందు శంక నాకు నిజంబె;
తల్లడిల్లు గుండె తలఁప భీము;
మానశౌండ! నీకు మాయ గిట్టదు; కూట
సమర మరుల; డెట్లు చత్తు నేను?

గాంధా—బిడ్డా! నూఱుగురుబిడ్డల నంటఁ గలిపినయాభీమునితోనే మఱ
నిప్పుడు యుద్ధము సేయఁ జూచుచున్నావా!

దుర్యో—అమ్మా! భీమునిమాట య టుండనీ,

ఆ. వె. నాఁడునోరథంబు, నా మేనిగందంపుఁ
జర్చ, నాదుకనులచందమామఁ,
దల్లి! నీకుమారుఁ, దండ్రి! నీనయశిష్యుఁ
గర్ణుఁ జంపినట్టిఖలు వధింతు.

సూతుఁడా! ఇంక నిప్పు డాలస్య మెందుకు? నారథమును సన్నద్ధముచేసి తీసికొ
రా. నీవును బాండవులకు భయపడితివేని నిలిచి పో. గదామాత్రసహాయుఁడ నయి
నే నొక్కఁడన యుద్ధమునకుఁ బోయెదను.

సూతు—దేవ! నీ వన్యథా తలంపకుము. ఇదిగో! నేను వచ్చుచున్నాను.
(నిష్క్రమించుచున్నాఁడు)

ధృత—నాయనా! దుర్యోధన! మమ్ము మండఁ బెట్టుటకే నీవు నిశ్చయించు
కొంటివేని, యున్నపాటివీరులలో సేనానిఁగా నెవ్వని నయిన నభిషేకింపుము.

దుర్యో—అభిషిక్తుఁ డయి యున్నాఁడే.

గాంధా—బిడ్డా! హతాశురాలిని నన్ను మరల సావలంబననుగాఁ జేయఁ
గలిగినయతఁ డెవ్వఁడో చెప్పుము.

ధృత—అబ్బాయీ! శల్యుఁడో? అశ్వత్థామయో?

సంజ—క. కూలఁగ భీష్ముఁడు, ద్రోణుఁడు
కాలము సేయంగఁ, గెడయఁ గర్ణుండును, భూ
పాలా! బలవతి యాశ. యిఁ
కాలములో శల్యుఁ డోర్చు నపాండవులన్.

దుర్యో—నాయనా ! శల్యుఁ డెందుకు ? అశ్వత్థామ యెందుకు ?

ఆ. వె. కర్ణుఁ గౌఁగిలింపఁ గలిగెడునో, పార్థు
జీవములు హరింపఁ జేకు రెడునో;
కాల్వ లగుచుఁ దొరఁగుకన్నీటిచే నభి
షేచనంబు నాకె చేసికొంటి. ౨౪

(తెరలోఁ గలకలధ్వని చేసి) ఓహో ! కౌరవబలప్రధానయోధులార ! మమ్ముఁ జూచి భయపడి యట్టిటు పాఱిపోయెద రేమి ? దుర్యోధనుఁ డెక్కడ నున్నాఁడో చెప్పుఁడు. (అందఱు నదరిపడి యాలకించుచుండఁగా సూతుఁడు తత్తఱపాటుతోఁ బ్రవేశించుచున్నాఁడు.)

సూతు—దేవా !

తే. గీ. ఇరువు రొక్కరథం బెక్కి, యిందు నందు
నిన్ను వెదకుచు వచ్చుచు నున్నవారు;

అందఱు ఎవ రెవరు ?

సూతు—కర్ణుప్రాణంబుఁ బాపినఘాతుకుండు,
సుగ్రీవృకకర్ముఁ డయిన వృకోదరుండు. ౨౫

గాంధా—(భయముతో) బిడ్డా ! ఇందుకుఁ జేయునది యేమి ?

దుర్యో—అమ్మా ! ఇదిగో ! గద నాదగ్గఱనే యున్నదిగద !

గాంధా—హా ! అదృష్టహీనురాలను నేను జచ్చితినిరా బిడ్డా !

దుర్యో—అమ్మా! నీ విప్పుడు దైన్యపడకు. సంజయ! సంజయ! నాదుఃఖమును బోఁగొట్టు చెలికాండ్రు వచ్చినారు. ఈతల్లిదండ్రులను రథ మెక్కించుకొని పోయి, శిబిరమునఁ బ్రవేశపెట్టుము.

ధృత—నాయనా! వీరిభావ మేమో తెలిసికొనియెద; క్షణమాత్రము నిలువ నిమ్ము.

దుర్యో—ఈతెలిసికొనుట కేమి ? తండ్రీ ! పొండి.

ధృత & గాంధా—(కొంచెము నడచి కూరుచున్నారు.)

[తరువాత రథారూఢు లయినభీమార్జునులు ప్రవేశించుచున్నారు.]

భీమ—ఓదుర్యోధనపరిజనులారా ! మీరు తొట్రుపాటుతో వెలవెలఁ బోవుచుఁ దిరిగెద రేల ? మావలన వెఱపకుఁడు.

సీ. కపటంపుజూదంబు కల్పించినఖలుండు, లక్కయిల్లార్చిన మొక్కలీఁడు,
పాంచాలికొప్పును బైఁట దూల్చినగాలి, యట్టిట్టు గాని మహాభిమాని,
పాండుసుతులఁ గొనుపాపి, దుశ్శాసనప్రభృతులకు రాజు,
కులుప శౌనూర్గురు తోఁబుట్టువులయన్న, యంగరాజునకును బ్రాణసఖుఁడు,

నగుమహారాజుగారు మీయధిపు లిప్పు
డెందుఁ గొలు వున్నవారొ మా కెఱుఁగఁ జెపుఁడ;
మేము పగచేత రా లేదు; మిన్న కతని
వదనమును జూచి పోవంగ వచ్చినాము.

ధృత—సంజయ! ఈక్రూరుని యెత్తిపొడుపు మహాదారుణముగానున్నదిగదా!

సంజ—తండ్రీ! వా రీవఱకే పనిచేత మిగులులేకుండఁ దమయప్రియమంతయుఁ దీర్చుకొన్నారు. ఇప్పుడు మాటలచేత మనకు మరలఁ జేయుచున్నారు.

దుర్యో—సూతుఁడా! నే నీయిద్దఱియొద్దఁ గూరుచున్నా నని చెప్పు.

సూతు—చిత్తము (పోయి) ఓభీమార్జునులారా! మహారా జిదిగో నాయన గారితోడను నమ్మగారితోడను, నీమఱ్ఱిచెట్టునీడను గూరుచున్నాఁడు.

అర్జు—అన్నయ్యా! పుత్రశోకపీడితు లయినతల్లిదండ్రులను మనదర్శనముచేత మఱింత యడలఁ బెట్టుట బా గుండదు. పోవుద మనుగ్రహింపుము.

భీము—మూఢుఁడా! సదాచారము దాఁటఁ గూడునా? తల్లిదండ్రులు వంద నీయు లన్నమాట నీచెవి నెప్పుడుఁ బడ లేదా యేమి? (దగ్గఱఁబోయి) సంజయ. వాతాపితలకు మానమస్కారము దెలుపుము. కా దుండు. మేమే తెలిపెదము! (తేరు దిగినారు.)

భీము—తమ్ముఁడా! నామకర్మములను దెలుపుకొనుచు గురులకు నమస్కరింప వలయును జుమీ!

అర్జు—(దగ్గఱఁబోయి) నాయనా! అమ్మా!

చ. అరులను నందఱం గెలుచు నంచును మీనుతు లేని నమ్మిరో,
గరువముచేత నెవ్వఁడు జగం బఖిలంబు తృణీకరించెనో,
దురమున నట్టికర్ణుపసఁ దూల్చినపాండవమధ్యముండుఁ, మీ
యిరువురు తల్లిదండ్రుల కిదే ప్రణమిల్లెడు భక్తితోడుతన్. ౨౭

భీము—తే. గీ. కురుకుమారుల నెల్ల నుగ్గుగ నొనర్చి,
దుస్ససేనునిఱొమ్ము నెత్తుటను బలిసి,
యిఁక సుయోధనుతొడలు ఛేదింప నున్న
భీముఁ డిదె మ్రొక్కుచున్నాఁడు పితల కిపుడు. ౨౮

ధృత—దురాత్మా! వృకోదరా! శత్రువుల కపకారముఁ జేసినవాఁడవు నీవు మాత్రమే కావురా. క్షత్రకులంబు పుట్టిన దాదిగా వీరులు సమరమున జయాపజయంబులఁ బొందుచునే యున్నారు. ఎందు కీ్రసతాపోక్తులచేత మ మ్మడలఁ బెట్టెదవు!

భీము—తండ్రీ! కోపపడకుము.

ఉ. పాండవపత్నిఁ గృష్ణను భవత్సభ కీడిచి తెచ్చి, యామెయా
ద్దండరుషాగ్ని మ్రిగ్గ మిడుతల్ బలె రాఢ్గణ మంటి గాని, నా
దండితనంబు మెప్పునకు దర్పముచేతను జెప్పఁ; దండ్రి! నీ
వుండవె పుత్రిపాతుకీలు మహోద్ధతిఁ జేసెడి వెల్లఁ జూచుచున్. 31

దుర్యో—ఓరోరిమరుత్తనయ! ఏమిరా యిది? నింద్యమయిననీకర్మమును వృద్ధ
రాజునొద్దఁ బొగడుకొనుచున్నావు?

మహాస్రగ్ధర. పసరంబుల్ నీకు, నీ, కప్పతికిఁ, గవలకున్, భార్య యాద్యూతదాసిన్,
బొసఁగన్ రారాజ నా నాముదల, కొని సభన్ ముందలం బట్టినా; రీ
యసదృగ్వైరంబునం డాహతు లగున్నృపు లేయఃపిరియుల్ చెప్పు రా; నీ
పసఁ జూతున్, భూరిబాహాబలధనమదదుర్వారు, నన్ గెల్వ మాజిన్.

ఆ! దురాత్మ! ఇదిగో నీవు లేవురా. (క్రోధమునఁ జంపఁ బోవుచున్నాఁడు.)

ధృత—(పట్టుకొని కూరుచుండఁ బెట్టుచున్నాఁడు.)

భీము—(క్రోధము నభినయించుచున్నాఁడు.)

అర్జు—అన్నయ్యా! ఇప్పుడు క్రోధమున కేమి కారణము?

తే. గీ. శైద్యముల నప్రియం బేమి సేయ లేక,
వీఁడు మాటలఁ జేయుచున్నాఁడు నుమ్మి;
యైనతమ్ములు నూర్గురు నడవిఁ గలిసి,
దుఃఖమునఁ జేరులుకొనుపీనితోడి దేమి?

భీము—ఓరోరి భరతకులకలంక!

తే. గీ. ఇప్పుడే పట్టి వధియించి, యేను దుస్స
సేనునొద్దకు నినుఁ బంప లేనె, తులువ!
మద్గదాకోటినిర్భిద్యమానయుష్మ
దస్థిశబ్దంబు విని గురు లడలరేని? 32

మఱియు నోరిమూఢా!

ఉ. ఆఁడుది వోలె నీవు నెగు లశ్రుజలంబులఁ దీర్చుకొంట, సై
దోడునురంబు వ్రిచ్చుతఱి, దూరముగా నిలుచుండి చూచుటన్,
కాడునృపుండ వీ వునుటు పాయవు, మీకుల మన్నతమ్ములేఁ
దూఁడుల కేనుఁ గైనపటుదోర్బలభీముఁడు భీముఁ డల్గినన్. 33

దుర్యో—దురాత్మా! భరతకులాధమ! ద్యూతదాస! పాండవపశువా!
నీవలె నేను వ్యర్థప్రలాపములను వచియింపఁ జాలనురా. మఱేమన్న—

తే. గీ. నాగదాదండమునను భిన్నంబు లైన
యొమ్ము నెమ్ములు వెలిభూషణమ్ము లుగను,
యుద్ధమునఁ బెద్దనిద్దుర నొందునునిన్ను
నిపుడె నీసోదరులు చూచి యేడ్వఁ గలరు.

భీము—(నవ్వి) అటు లయిన నీవిషయమున మే మశ్రద్ధతో నుండ రాదు.
ఇదిగో! విను నాపత్రిజ్ఞ.

మహాస్రగ్ధర. బెడిదం బౌ కేలుదోయిన్ బిఱబిఱను గదం బెట్టుగాఁ ద్రిప్పి, యూరుల్
పొడిగా నిన్నొంచి, పాదంబును దల నిడుదుం బ్రొద్దుటం, జూడ శ్రీకేశుల్;
కడిమిం ద్వన్మృత్యువ్యాలం జక్కడఁచి గలదసృక్చందనం బానఖాగ్రం
బొడల న్వేఁ బూసికొం చభ్యుదయభయదభూపోజ్జ్వలన్మూర్తి నౌదున్.

(తెరలో) ఓహో! భీమార్జునులారా! ఇదిగో! నిహతాశేషవిపక్షచక్రుండును
నాక్రాంతపరశురామాభిరామయశోవిశాలుండును, ప్రతాపసంతాపితదిఙ్మండలస్థాక్షి
స్వజనుండును, నజాతశత్రుండును నగు దేవర యుధిష్ఠిరమహారాజుగారిట్లు లాజ్ఞాపించు
చున్నారు.

ఇద్దఱు—మహారాజుగా రే మని యాజ్ఞాపించుచున్నారు?

(మరలఁ దెరలో)

చ. అనిఁ దెగువారియంగముల కాపు లొసంగుఁడి యగ్నిసంస్కృతుల్;
కనుఁగవనీళ్ళతోడ నుదకంబును బంధుల కిందు బాంధవుల్;
కనుఁడి హతపత్రిజాతవిని జ్ఞాతులకంకవిఖండితాంగముల్;
గొనకొని, ప్రొద్దుతో రిపులుఁ గుప్పింకిరి; సైన్యములన్ మరల్పుఁడీ.

ఇద్దఱు—మహారాజునాజ్ఞ నెఱవేఱుఁ గాక. (నిష్క్రమించుచున్నారు.)

(తెరలో) ఓగోరిగాండీవాకర్షణబాహుశాలీ! అర్జునా! అర్జునా! ఇప్పు డెట
బోయెదవురా.

కవిరాజవిరాజితము. పిడిచితి నీవలుకు న్నిముఁ గెల్చెదువి ల్లిది, కర్ణుని పైపగచే;
నడవిని బోలె విశూరరణంబునఁ బౌరుషపరాక్రము మయ్యెను మీ;
కడిదను వీడినమద్గురుమూర్ధము నంటుట నెంచుచు వచ్చితి; ని
ప్పుడు దుపదాన్వయధుస్మరుఁ డౌగురుపుత్రుఁను త్రుంపఁడె పాండవులన్!

ధృత—(విని సంతోషముతో) అబ్బాయీ! దుర్యోధన! ద్రోణవధశ్రవ
భవోద్దీపితకోపధానలుండును, దండిప్రకంపెను బరాక్రమవంతుండును, శిక్ష
వంతుండును, సమరసమానుండును నగునశ్వత్థామ యిదిగో! వచ్చుచున్నాడు;
నీ వీవీరున కెదురు వోయి సంభావింపుము.

గాంధా—కుమారా! ఈమహాభాగున కెదురు పొమ్ము.

దుర్యో—నాయనా! అమ్మా! కర్ణునిచావు గోరినయీవృథాయౌవన శస్త్రబలభరునితో నేమి ప్రయోజనము?

ధృత—కొడుకా! ఈసమయములో నిటువంటిపరాక్రమవంతులకు వెగటుగా మాటలాడఁ గూడదు.

(అశ్వత్థామ ప్రవేశించుచున్నాఁడు.)

అశ్వ—జయతుజయతు కౌరవేశ్వరః.

దుర్యో—(లేచి) గురుపుత్రా! ఇటు కూరుచుండుము. (కూరుచుండఁ బెట్టుకొనుచున్నాఁడు.)

అశ్వ—రాజా! కౌరవేశ్వర!

తే. గీ. కర్ణముల కింపుగాఁ బల్కు, కర్ణుఁ డాజి
యందుఁ జేసినపని, తెల్ల మయ్యెఁ గాదె?
ద్రౌణి యిప్పు డధిజ్యశరాసుఁ డగుచు
వచ్చెఁ; నీవైరులను డాఁకు? వగవ కింక. ౩౭

దుర్యో—(అసూయతో) ఆచార్యపుత్రా!

ఆ. వె. అంగరాజు చచ్చినంతట గద, నీవు
యుద్ధ మొనరఁ జేయ నుండినావు;
నేను జచ్చువఱకు నీవు ప్రతీక్షింపు;
కర్ణునకును నాకుఁ గలదె వేఱు? ౩౮

అశ్వ—ఏమి? ఇప్పటికిని గర్ణునియందుఁ బక్షపాతమును, మాయెడలఁ దిరస్కారమునా? రాజా! కౌరవేశ్వరా! తథాస్తు. (నిష్క్రమించెను.)

ధృత—కుఱ్ఱా! నీ కిది యేమి వెఱ్ఱి? ఈసమయములో నంతమహాభాగుఁడయినయశ్వత్థామకు, నీవు పుల్లవిఱుపుమాటలచేత మనను విఱుగఁ జేసితివి.

దుర్యో—ఇతని కేమి యప్రియము? నే నసత్యము పలికినాఁడనా? ఇది నాకుఁ గ్రోధస్థానము గా దేమి? చూడు,

చ. ధనువులు పూను రాజులకుఁ దల్ప నశక్యపుఁ బేర్మివాని, నీ
కొనరినభాగ్యదోషమున యుద్ధమునం దెగినట్టివాని, నిం
దన మొనరించె, నాయెదుర, నాప్రియమిత్త్రుని, నంగరాజు; న
ర్జునునకు ద్రోణపుత్త్రునకుఁ, జూడ విశేష మదేమొ చెప్పుమా. ౪౦

ధృత—నాయనా! నిన్ననవలసిన దేమి? భరతకులమున కిది యు...
సమయము. గాంధారీ! మందభాగ్యుఁడను నే నిప్పు డేమి చేయుదును?
(ఆలోచించి) కానీ. సంజయా! భారద్వాజుఁడయినయశ్వత్థామతో నాపలుకు...
నిట్లు పలుకుము.

చ. తడవుగ వీనితోఁ గుడుచు స్తన్యము నేమఱినాఁడవయ్య? నీ
వొడలను ద్రాఁక, నావలువయుఁ బుర దర్యెను నీదుబాల్యము
దుడుగనిభ్రాతృదుఃఖమున నో, చిరమైత్రినో, వ్యత్యయంబుగా
నుడివినవీనిచో, గురుతనూభవ! పెంపకుమయ్య క్రోధముఁ.

సంజ—చిత్తము. (లేచుచున్నాఁడు.)

ధృత—మఱియు నిట్లని కూడ వచియింపుము.

చ. అనృతము వించు నీజనకుఁ డట్టులు శస్త్రము నుజ్జగించుటఁ,
గనుఁగొన నంతవానికిని గల్గినతాదృశ మానవజ్ఞయుఁ,
దనయుఁడ వైననీదుబలదర్పములుం, దలపోసితే, నుయో
ధనుపలు కెంతువా? ప్రతివిధానము సేయుదు గాక ద్రోణజా!

సంజ—చిత్తము. (నిష్క్రమించుచున్నా...)

దుర్యో—సూతుఁడా! మాయుద్ధరథమును సన్నద్ధము సేయుము.

సూతు—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు.)

ధృత—గాంధారీ! మన మీలాగున మద్రాధిపతి యయినశల్యునిఁ...
బోవుదము. అబ్బాయీ! నీవు నిట్లు చేయుము. (చెవిలో) ఈలా గీలాగు (అం...
నిష్క్రమించుచున్నారు.)

గద్య. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది సాధువం...
నీరాకరరాకానుధాకరాచ్ఛనామాత్యపౌత్త్ర హారితసగోత్ర పవిత్రగుణకదం...
లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల నూరపరాజపుత్రధానతనూభవ విబుధ
విధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీకృత వేణీసంహార
నాటకంబునందుఁ బంచమాంకము.



శ్రీ ర స్తు.

శ్రీపరమాత్మనే నమః

# వేణీసంహారనాటకము.



## షష్ఠాంకము.

—:o:—

[తరువాత నాసనస్థుఁ డయి ధర్మరాజును, ద్రౌపదియుఁ, జేటియుఁ, బురుషుఁడును బ్రవేశించుచున్నారు.]

యుధిష్ఠిరుఁడు—(విచారముతో నిట్టూర్పు విడిచి)

ఉ. ఎట్టెటొ భీష్మసాగరము నీఁదియు, ద్రోణమహాగ్ని నార్చియున్,
గట్టిఁడికర్ణపన్నగము గాసిలఁ జేసియు, శల్యుఁ గూల్చియున్,
గట్ట! యొకింత తక్కువగఁ గాంచుజయంబున, మాకు నెల్ల ని
ప్పట్టున, భీముసాహసపుఁబల్కున జీవితశంక పుట్టెఁగా! ౧

ద్రౌపది—(కన్నీళ్ళతో) మహారాజా! పాంచాలిచేత నని యెందు కనరు?

యుధి—ద్రౌపదీ! నాచేత నే నుమీ! (పురుషునిఁ జూచి) బుధక!

పురు—దేవా! ఆజ్ఞాపింపుఁడు.

యుధి—నీవు పోయి సహదేవునితో నిట్టు చెప్పుము. భీమసేనుండు క్రోధావేశంబున "నే నీదినంబునఁ దప్పక సుయోధనుని వధించెదను; లేకున్న నేను జచ్చెద" నని చేసినదారుణప్రతిజ్ఞను దెలిసికొని, మహాభిమాని యయిన దుర్యోధనుఁడు మాయ మయ్యెను. కావున వానిజాడ నెఱింగి వచ్చుటకు, మిక్కిలి నిపుణ మయినబుద్ధి గలిగినట్టియు, నయ్యాయికందువల నెఱింగినట్టియు, భక్తివిశ్వాసములు గలిగినట్టియు సచివులు, తప్పటలతోడఁ జాటించుచు, శమంతపంచకమునఁ జరింపవలయును; దుర్యోధనుజాడఁ దెలిసి వచ్చినవారికి, ధనము మొదలుగాఁ గలపసదనంబు లీయఁబడు నని, స్పష్టముగాఁ దెలుప వలయును.

మఱియు—

సీ. నీళ్ళజాడలు దీయ నేర్చుజాలరు లూబి నేలలం దినుకల నెమక వలయు;
నల్లిబిల్లిగఁ దీఁగ లల్లుడొంక లెఱుంగుగొల్లలు పొదలఁ గన్గొనఁగ వలయు;
నిజపరచరణాంకనిపుణు లౌ నెఱుకులు వ్యాఘ్రాటవులయందు నరయవలయు;
రంధ్రజ్ఞు లైనవేగులవారిదులు జడదారివేషాల మునులొద్ద వెదుక వలయు;

పుర—దేవా! చిత్తము.

యుధి—మఱియు నిట్లని కూడఁ జెప్పుము.

తే. గీ. అలుకుచు రహస్యమున మాట లాడువారి,
సుప్తులను, రోగులను గూడఁ, జూడ వలయుఁ;
బులుఁగులయెలుంగు, మృగములకలఁత, రాచ
గులుతునడుగులు, నడవిలో నెఱుఁగ వలయు.

పుర—చిత్తము దేవా! (నిష్క్రమించి మరల వచ్చి సంతోషముతో) దేవా! పాంచాలకుఁడు వచ్చినాఁడు.

యుధి—శీఘ్రముగాఁ దీసికొని రా.

పుర—(నిష్క్రమించి పాంచాలకునితో మరల వచ్చి) ఇదిగో! రాజుగారి సన్నిధికిం బొమ్ము.

పాంచా—(సమీపించి) దేవా! జయముజయము. దేవరకును దేవేరికి బ్రియముఁ దెలుప వచ్చితిని.

యుధి—భద్ర! పాంచాలక! దురాత్మూఁ డయినయాకౌరవాధమునిజాడ యే మయినఁ దెలిసినదా యేమి?

పాంచా—దేవా! జాడ మాత్రమే గాదు; దేవీకేశాంబరాకర్షణమహాపాప హేతుభూతుం డగునాదురాత్ముఁడే తెలిసికొఁబడెను.

యుధి—(సంతోషముతోఁ బాంచాలకునిఁ గౌఁగిలించుకొని) భద్ర! మేలు మేలు! ప్రియ మెఱింగించితివి. మఱి కంటఁ గగపడినాఁడా?

పాంచా—దేవా! యుద్ధమున కగపడినాఁడా యనుండు.

ద్రౌప—(భయముతో) ఏమి నానాథుఁడు సమరగోచరుఁడై యున్నాఁడా

యుధి—(సంశయముతో) నిజముగా మాతమ్ముఁడు యుద్ధములో యున్నాఁడా?

పాంచా—మహారాజుగారితో నేను మఱియొకలాగు మనవి చేసికొందునా

యుధి—తే. గీ. కారణము లేకయే మది కలఁతపడుచు,
నూరక వివేకహీనత నొందు చుండె;
గదను ధరియించుభీమువిక్రమ మెఱఁగియు,
సందియము బొందుచున్నాను జయమునందు.

(ద్రౌపదివంకఁ జూచి యామెమోమునుండి కన్నీళ్ళు దుడిచివేయుచు) ఓసుక్షత్రియురాలా!

చ. గురువులు బంధువుల్ నృపతికోట్లు గనక్, మన కైననాఁటిదు
ష్పరిభవ ముత్తరింప నిరుపద్ధతు లున్నవి; యెవ్వి యన్న, సుం
దరి! మన మైన వందఱముఁ, దప్పక ప్రాణము పాయఁగా వలెన్;
గురుకులపాంసనుం డయిన, గొబ్బునఁ జావ వలెక్ రణంబునక్. ౪

అయినను సందేహ మెందుకు?

తే. గీ. ప్రతినచెడు నేమొ యని, భయపడుచు నున్న
యమ్మహావీరుచే నిశ్చయముగఁ జచ్చి,
నిండుఁగొలువున నీతలవెండ్రుకలను
బట్టి, ని న్నీడిపించినపాపపశువు. ౫

పాంచాలకా! చెప్పుచెప్పు. ఆదురాత్ముఁ డెట్లు లగపడెను? ఇప్పు డెక్కడ నేమి జరుగుచున్నది?

పాంచా—దేవా! దేవీ! చిత్తగింపుఁడు. దేవగవారిచేత నట్లు మద్రేశుం డయినశల్యుండు దెగుటయు, శకునిశలభంబు సహదేవానలంబునం బడి మ్రగ్గుటయుఁ, దక్కినకొలఁదిపాటిజోదులు, తమదళవాయిచావును జనములయాక్రందనమును జూచి, రణరంగమునకుఁ దొలంగిపోవుటయు, మనసైన్యంబులు శత్రుపరాజయంబు గాంచి పొంగుచు, విచిత్రపరాక్రమంబున ధృష్టద్యుమ్నాధిష్ఠితంబు లయి యుండుటయుఁ, గృపకృతవర్మాశ్వత్థామలు విచ్చుమొ గ్గవుటయు నాలోకించి, దురాత్ముఁ డక్కౌరవాధముఁడు బెంగగొని, భీమసేనునిదారుణప్రతిజ్ఞకు నడలి యెక్కడనో యడఁగి పోయెను.

యుధి—చీ! యేమి పని చేసెను? తరువాతఁదరువాత?

ద్రౌప—ముందుసంగతి చెప్పు.

పాంచా—దేవా! దేవీ! అవధరింపుఁడు. తరువాత భీమార్జును లిద్దఱును, వాసుదేవాధిష్ఠితం బయినరథం బెక్కి, శమంతపంచక మంతటను వెదకిరి; గాని వానిజాడ కొంచె మయినను దెలియ రాదయ్యెను. పిమ్మట మాబోఁటిభృత్యులు దైవమును దలంచి శోకించు చుండిరి. అర్జునుం డున్సు రని వేఁడినిట్టూర్పులు పుచ్చుచుండె. వర్షకాలమున నంధకారబంధుర మగురాత్రివేళఁ, దళతళ మనియెడు మెఱుంగులతెఱంగున వెలింగెడుపింగళేక్షణంబుల, భీమసేనుండు నిజగదాదండంబును బ్రజ్వలింపం జేయుచుండె. భగవంతుఁ డయినకృష్ణుండు విధిచెయ్వుల దూఱుచుండె. అట్టిసమయంబున నొకానొకపురుషుండు, తనచేత మాంసభారమును బట్టుకొని, క్రొత్తగాఁ జంపిన మృగమునెత్తుటం జొత్తిల్లినకాళ్ళతోడను, గట్టుఁబట్టతోడను, బరుగుపరుగున వగర్చు

కొనుచు భీమసేనునిసన్నిధికి వచ్చి, నిట్టూర్పులసందడిని సగముసగము వినఁబడిన నక్షరములచేత నూహింపఁ దగిన మాటలతో, నిట్లు విన్నవించెను. దేవా! ఈ నోకమహాహ్రదంబుతీరంబున మడుఁగులో దిగినయడుగులజాడలు రెండు గన చున్నవి. అం దొకటి నీళ్లనుండి వెడలి వచ్చినట్లున్నది. రెండవది యట్లు గాదు. దేవరచిత్తము. అనుటయు మే మందఱముఁ దొందరగా బయలుదేఱి యామ జాపుటకు నప్పురుషుని ముం దుంచుకొని పోయితిమి. అనంతర మా రెండపద దుర్యోధనుని దగుట నిరూపించి భగవంతుండు కృష్ణుం డిట్లనియె. ఓవృకో దుర్యోధనుఁడు జలస్తంభవిద్య నెఱుంగును గదా. దానంజేసి నిశ్చయముగా జడిసి, వాఁ డీమడువున దాఁగి యున్నవాఁడు. అనిన నబ్బలానుజునిమాట విని య దిక్కు లెల్లం బూరటిల్ల. మొసళ్లు మొద లయినజలజంతువులు తల్లడిల్ల, మడువం గలఁగి పోవ, భీమసేనుండు భీకరంబుగాఁ బెద్దబొబ్బ వెట్టి యిట్లనియె. ఓరో పరిఖ్యాపితాలీకపౌరుషాభిమానీ! పాంచాలరాజతనయాకేశాంబరాకర్షణమహా ధారరాష్ట్రాపసదా!

చ. పొడమితి విందువంశమునఁ; బూనితి విప్పటికి న్మహాగదన్;
విడువక దుస్ససేనునుల వెచ్చనినెత్తురు ద్రావుళతున్ నన్
గడునిరసించి; తట్టు మధుకైటభవైరిని ధిక్కరించి; తి
ప్పుడు పసరంబ! పంకమున మున్గి యడఁగితి నాకు జంకుచున్.

మఱియునోరిమానధనా! కౌరవాధమా!

ఉ. కౌరవనిష్కుటంబు లొగిఁ గాంతులు చచ్చి. విముక్తకేశవి
స్తారము లౌట, నాకతన ద్రౌపదిక్రోధమహానలంబు చ
ల్లారెను; దుస్ససేనుహృదయంబున నెత్తురు ద్రావఁ జూచి, యీ
మారుతి నేమి చేసి? తిది మానము చంపుకొనంగ వేళయే?

ద్రౌప—నాథా! నీవు మరల వచ్చి నాకంటఁ బడితివేని నాకోపము తీఱెన్!

యుధి—ద్రౌపదీ! యీసమయమున నమంగళములను నోట రానీయఁగూ భద్రి! తరువాతఁదరువాత?

పాంచా—దేవా! తరువాత నివ్విధంబునం బలుకుచు, వృకోదరుండు వీర్య ధోద్ధతుం డయి, భీషణగదాదండంబును బిఱబిఱం ద్రిప్పుచు, నువ్వెత్తుగ లోన యుల్లంఘితతీరంబు, నుత్సన్ననలినంబు, నున్మూర్ఛితగ్రాహంబును, నుద్భ్రాంతసమ శకుంతంబును నయి యమ్మహాహ్రదం బంతట నుడిగుండములు పడునట్లు భయం గా నీ రంతయుఁ గలిపి వేసెను.

యుధి—భద్రి! అట్లయినను వెలువడ లేదుగదా?

పాంచా—దేవా! యెట్లు వెలువడ కుండును?

చ. వెలుచ భుజంబులం జఱచి, భీముఁడు పెన్మ్రఁపుం గలంచినన్,
బలుఁదతికొండకవ్వమునఁ బాల్కడలి న్మను కాలకూటముం
బలె, నొకమూలనుండి కురుపాంసనుఁ డుత్కటకోపపావకో
జ్జ్వలితమవిస్ఫులింగముల సత్వరుఁడై వెడలెన్ హ్రదంబునన్. ౧

యుధి—సుక్షత్రియా! మేలు మేలు!

ద్రౌప—యుద్ధమునకు వచ్చినాఁడా లేదా?

పాంచా—అట్లు లాజలాశయంబునుండి పయికి లేచి, యిరుగరంబులఁ బెనుగదను భీఱభిఱం ద్రిప్పుచు, దుర్యోధనుం డిట్లనియె. వృకోదరా! నీభయంబున నేను డాఁగితి నని సమర్థి చుకొనుచున్నావా? మూఢుఁడా! పాఁడుపుత్రులను జంప కుడఁ బరులకంటం బడుటకు సిగ్గుపడుచు, బడలిక దీర్చుకొనుటకై పాతాళమునకుఁ బోయి యుంటిని. అను చుండునంతలోఁ, గృష్ణార్జును లిద్దఱునుం బోయి, నీళ్లలో గదాయుద్ధము సేయఁగూడ దని, భీమదుర్యోధనుల నొడ్డునకుఁ దీసికొని వచ్చిరి.

అప్పుడు కౌరవనాథుండు గూరుచుండి, తనచేతిగదను గ్రిఁదఁ బెట్టి, వచ్చి పోయిననూఱుగురుతమ్ములయు, వాజివారణవీరభటులయుఁ, గళేబరంబులను, గాకులను గ్రద్దలును రాపులుఁగులును నక్కలును గుక్కలును బీఁకికొనితినుచుండుటచేత బీభత్సం బైనదియు, దుర్యోధనబలంబు పేరు మాసినదయు, మనవీరులసింహనాదమ్ములకతమ్మున నిమ్మడిగా మొరసెడురణతూర్యములచేత సంకుల మయినదియుఁ, దనచుట్టములందొక్కఁ డైన లేనిదియుఁ బగవారిబంధువులతో నిండియున్నదియు, నగుకౌరవయుద్ధరంగంబును దేటి పాఱఁ జూచి యారారా జున్నరని వేఁడినిట్టూర్పులు పుచ్చుచుండె.

యుధి—తరువాతఁ దరువాత?

పాంచా—దేవా! అయ్యవసరంబున వృకోదరుం డిట్లనియె. ఓయికౌరవ రాజా! బంధుజనమునుగూర్చి దైన్యపడుటచే నేమి ప్రయోజనము? పాండవులు సమర్థులు, నే నసహాయుఁడ నని. విషాదంబు నొందకుము.

తే. గీ. నీవు యుద్ధంబు సేయ, మాయేవురందు
నిచ్చ వచ్చినవానిని నేలుకొనుము;
కవచము ధరించి, వలయుకైదువులు గొంచు,
సలుపు మాతనితో రణోత్సవము నేఁడు. ౨

అనుపలుకు లాలించి యాకురురాజు, కొంచెము గన్నీటితోఁ గూడున్న చూపును భీమార్జునులమీఁద నిలిపి యిట్లనియె.

ఆ. వె. కర్ణు, దుస్ససేను, గడ తేర్చినట్టిమీ
యిరువ్వురును, సమాన్ను లిపుడు నాకు;
నప్రియుండ వయిన, నతిసాహసుండ వౌ
నీవ, ప్రియతముండ వెంచ ననికి.

అని లేచి పరస్పరక్రోధాక్షేపపరుషవాక్కులహాప్రసారితఘోరసంగ్రామ భీమదుర్యోధనులు, నిజభుజాదండంబుల ప్రేరితగదాపరిఘుంబులు శోభిల్ల, మండ పరిచారంబుల విహరించుటకు నారంభించిరి. అంత నేనును భగవంతుం డయినచక్ర యుధునిచే దేవరయొద్దకుఁ బంపఁబడితిని. మహానుభావుం డయిన దేవకీనందనుఁ మీతో నిట్లు మనవిచేయు మనియె. భీమసేనుం డపర్యాప్తప్రతిజ్ఞుం డగుటయు దుర్యో ధనుండు విచ్చుమొగ్గగుటయుఁ జూడ, మాకు మిక్కిలి విషాదంబు గలిగినది. ఇ నిప్పుడో, భీమసేనుచేత సుయోధనుండు చిక్కినాఁడు గావున, నిష్కంటకం బయి యీభూతలం బంతయు నీ వేలుకొమ్ము. అభ్యుదయోచితంబు లగునవరతమంగళసమా రంభంబులు సమకట్టింపుము. సందేహము వలదు.

మ. తగ నింప న్వలె రత్నకుంభములు త్వద్రాజ్యాభిషేకార్థమై;
మిగులం బండువు సేయఁగా వలెను బేర్మిం ద్రౌపదీవేణికిన్!
జగతిన్ క్షత్రరుచ్ఛిదాపరశుభాస్వత్పాణి యారాముఁడున్,
మొగిఁ గ్రుద్ధుం డగుభీముఁడున్, సమరమున్ బూనంగ జం కేటికిన్?

ద్రౌప—త్రిభువననాథనాథుం డగుదేవుం డిట్టు లానతిచ్చుచుండ, మఱియొక గేల జరుగును?

పాంచా—ఇది కేవల మయ్యసురాంతకునియాశీర్వచనము కాదు. ఆదేశ

యుధి—భగవంతుం డగునమ్మహాత్మునిసందేశమున కెవ్వఁడు సంశయించు ఎవఁడురా అక్కడ?

[కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—దేవా! ఆజ్ఞాపింపుఁడు.

యుధి—దేవకీనందనుం డయినదేవునిప్రసాదంబున, భీమునివిజయమంగ శంసార్థంబుగాఁ, దదుచితసమారంభములు సమకట్ట వలయును.

కంచు—చిత్తము దేవా! (ఉత్సాహముతో నడచి) ఓహో! సంవిధా పురస్సరు లగునంతఃపురద్వారికులారా! యథాప్రధానంబుగా మీ రందఱు వినుం

భుజబలపరితేషోత్తీర్ణకౌరవపరిభవసాగరుండును, నిర్వ్యాఘదుర్ధరప్రతిజ్ఞాభరుఁడును, సుయోధనానుజశతోద్ధూననప్రభంజనుండును బ్రిభంజనతనయుండును, బలవంతుం డును, దుశ్శాసనోరస్థ్సలవిదళనసింహుండును, దుర్యోధనోరుస్తంభభంగవినిశ్చిత విజయుండును నగువృకోదరునికి, విజయమంగళంబుల సమకట్టవలయు నని, స్నేహపక్ష పాతిమానసంబున నిదిగో! దేవరయుధిష్ఠిరమహారాజుగా రాజ్ఞాపించుచున్నారు.

(ఆకాశమందు)—ఏ మంటిరి? అంతట నధికతరముగా సమకట్టియున్నామేఁ; నీవు చూడవా యేమి యనుచున్నారా?

కంచు— నాయనలారా! మేలుమేలు! చెప్పకయే మేలు చేయుట మనోగ తంబయినస్వామిభక్తిని వెల్లడించును గదా!

యుధి— ఓయిజయంధర!

కంచు— దేవా! ఆజ్ఞాపింపుఁడు.

యుధి— నీవు పోయి, మాకు మేలువార్తను దెచ్చినయీపాంచాలకునిఁ బస దనంబులఁ బరితోషపెట్టుము.

కంచు— చిత్తము దేవా! (పాంచాలకునితో నిష్క్రమించుచున్నాఁడు.)

ద్రౌప— మహారాజా! హృదయేశుఁ డయినభీమసేనుఁడు మరల నద్దురాత్ముని తోడ "మాయేపురయందు నిచ్చవచ్చినవానిని నేఱుకొను'' మని యెందునిమిత్త మనెను? ఒకవేళ వాఁడు మాదీనుతు లిద్దఱలో నొకనిఁ గోరుకొని, యాతనితో సమరంబు సేయఁ బూనిన, మహోపద్రవంబు సంభవిల్లును గదా?

యుధి— ద్రౌపదీ! ఆజరాసంధపరిపంథితాత్పర్య మిది; సకలబంధువులును, వీరభటులును జచ్చిపోయి, పదునొకం డక్షౌహిణులసేనలకుఁ, గృపకృతవర్మాశ్వ త్థామలు ముగ్గురు మాత్రమే మిగిలిరి; కావున, దుర్యోధనుం డిప్పుడు బంధు రహితుండును, శరీరమాత్రవిభవుండునునయి, యున్నవాఁడు. అందుచేత నొకవేళ, నభిమానమును వదలిపెట్టి వీఁ డస్త్రసన్యాసము పుచ్చుకొనినను, దపోవనము ప్రవేశించినను, బితృముఖంబున సంధిని గోరినను, సకలరిపులను జయింతు నని, పూనినతనప్రతిజ్ఞ నెఱవేఱ కుండు నని యెంచి, వానికిఁ గొంచె మాస పుట్ట, నట్లు వచియించెను. పాండవు లయిదుగురలో, నొకనితోడ నయిన యుద్ధము సేయుటకు, దుర్యోధనుఁడు చాలఁడు సుమీ. అయినను వృకోదరునకే వీనితోడ గదాయుద్ధము కావలయు నని నేను తలంచుచున్నాను. ఓనుత్తుతి్రయురాలా! చూడు.

మ. అలుకన్ బెన్గదఁ బూనుభీమునికి సత్యం బీ డెవం డాజిలోఁ;
జలరామోపముఁ డాసుయోధనుఁ డనిన్, బాలించద్గదాకౌశలిన్;
గలుగున్ భద్రము ధార్తరాష్ట్రినళినీగంధేభుఁ డౌకుజ్జికున్;
దలఁతున్ భీమునికే సుయోధనునిలోఁ; దర్కింప నే నొండ్లకున్.

(తెరలో) ఓహో! దప్పి గొంటిని. దప్పిగొంటిని. కొంచెము నీళ్ళను, నీడయుఁ నన్ను సంభావింప వలయును.

యుధి — (విని) ఓరీ! యెవఁడురా అక్కడ?

[కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు — దేవా! ఆజ్ఞాపింపుఁడు.

యుధి — అ దేమో తెలిసికొని రా.

కంచు — చిత్తము దేవా! (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి)

కంచు — దేవా! వడగొట్టి యొకయతిథి వచ్చియున్నాఁడు.

యుధి — శీఘ్రముగాఁ దీసికొని రా.

కంచు — చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు.)

[తరువాత మునివేషధారి యయినచార్వాకుఁ డనెడురాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

రాక్ష — (తనలో) నేను దుర్యోధనునిమిత్రుఁడ నయినందుకుఁ శాం... నెట్లయిన వంచింప వలయును. (ప్రకాశముగా) దప్పిగొంటిని దప్పిగొం... కొంచెము నీళ్ళను నీడయు నిచ్చి నన్ను సంభావింప వలయును. (రాజు... చున్నాఁడు) (అందఱు లేచి నిలువఁబడుచున్నారు.)

యుధి — మునీంద్రా! నమస్కరించుచున్నాను.

రాక్ష — ఇది సముదాచారమునకు వేళ గాదు. కొంచెము జల మిచ్చి న... సంభావింపుము.

యుధి — మునీంద్రా! మీ రీయాసనమునఁ గూరుచుండుఁడు.

రాక్ష — (కూరుచుండి) మీరు కూడ మీమీస్థలములఁ గూరుచుండుఁడు.

యుధి — ఓరీ! యెవఁడురా అక్కడ?

[బంగారుగిండి చేతఁ బట్టుకొని కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు — దేవా! ఇదిగోఁ! జల్లనిపరిమళోదకము చేతఁ బూర్ణ మయిన భృం... రము. ఇది దాహము పుచ్చుకొనుటకుఁ బంచపాత్రము.

యుధి — మునీంద్రా! నియమస్థుఁ దీర్చుకొండి.

రాక్ష—(కాళ్ళు గడుగుకొని యాలోచించి) ఓహో! నీవు క్షత్రియుని లాగున నున్నావు.

యుధి—దేవరవారు చక్కఁగా నెఱింగితిరి; నేను క్షత్రియుండనే.

రాక్ష—ప్రతిదినము నూరక పోరాడుచు, స్వజనవినాశము చేసికొనెడు మీ నీళ్ళు మొద లగునవి, పరిగ్రహింపఁ గూడదు. కానీ, ఈనీడచేతను, సరస్వతీ నది లోనితరంగములను స్పృశించి వీతెంచెడుచల్లగాలిచేతను, నేను శ్రమము దీర్చుకొనియెదను.

ద్రౌప—బుద్ధిమతికా! విసనకఱ్ఱతో మహర్షికి విసరవే.

చేటి—(అట్లు చేయుచున్నది.)

రాక్ష—పూజ్యురాలా! మాయెడల నిట్టియుపచారము లనుచితములుగదా!

యుధి—మునీంద్రా! మీ కెందుచేత నింతయలసట గలిగినది?

రాక్ష—ఓయీ! వటుజనసులభ మయినవేడుకచేతఁ, బూజ్యు లయిన క్షత్రియోత్తములద్వంద్వయుద్ధము జూచుట కయి, శమంతపంచకమునఁ దిరుగుచుండి, యర్జునసుయోధనుల కగుగదాయుద్ధము నవలోకించి, బలవత్తర మయిన యాశరదాత ప్రత్యక్షంబున కోర్వ లేక, యుద్ధము ముగియ కుండనే చక్కఁ వచ్చితిని.

అందఱు—(విషాదమును బొందుచున్నారు.)

కంచు—మునీంద్రా! ఆలాగు కాదు. భీమసుయోధనుల కని చెప్పుఁడు.

రాక్ష—(అసూయతో) ఆ! సంగతి తెలియనివాఁడవు, న న్నెట్లు లాక్షేపించెదవు?

యుధి—మునీంద్రా! చెప్పుండి చెప్పుండి.

రాక్ష—క్షణమాత్రము విశ్రమించి నీ కంతయుఁ జెప్పెదను; కాని యీ ముసలివానికిఁ జెప్పను.

యుధి—చెప్పుండు. ఏమి? అర్జునసుయోధనులకే?

రాక్ష—అర్జునసుయోధనుల కగుగదాయుద్ధ మని నే నీ వఱకే చెప్పియుంటిని.

యుధి—భీమసుయోధనులకుఁ గాదా?

రాక్ష—అది యంతకు మునుపే జరిగి పోయినది.

[యుధిష్ఠిరుఁడును, ద్రౌపదియు మూర్ఛిల్లుచున్నారు.]

కంచు—(నీళ్లు చల్లి) దేవా! దేవీ! ఊఱడిల్లుఁడు.

చేటి—దేవీ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

ఇద్దఱు—(తెలివిని బొందుచున్నారు.)

యుధి—మునీంద్రా! ఏమి చెప్పితిరి? భీమసుయోధనులకు గదాయు
ద్ధమంతకు మునుపే జరిగి పోయిన దేమి?

ద్రౌప—స్వామీ! ఏమో చెప్పండి అంతకు మునుపే జరిగి పోయినదా!

రాక్ష—కంచుకీ! వీ రిద్దఱు నెవరు?

కంచు—బ్రాహ్మణోత్తమా! ఈయన యుధిష్ఠిరమహారాజు. ఈమె
ద్రౌపదీదేవి.

రాక్ష—హా! ఘాతుకుఁడనైన నేను దారుణమైనసంగతి నుపక్రమించితినిగదా!

ద్రౌప—హా! ప్రాణేశ్వరా! భీమసేన! (మూర్ఛిల్లు చున్నది.)

కంచు—ఇప్పుడు చెప్పిన దేమున్నది?

చేటి—దేవీ! ఊఱడిల్లు మూఱడిల్లుము.

యుధి—(కన్నీళ్లతో) బ్రాహ్మణోత్తమా!

తే. గీ. పదము సందిగ్ధముగ నుంటఁబట్టి, యిట్లు
తీవ్రదుఃఖంబుఁ బొందు యుధిష్ఠిరుండు;
భీమునిశ్చితవార్తను విననపిదపఁ,
బ్రాణములఁ బాసి సౌఖ్యంబు పడఁగలండు.

రాక్ష—(సంతోషముతోఁదనలో) ఇదే నాప్రయత్నమును. (ప్రకాశముగా)
అలాగయిన, నవశ్యము చెప్పవలసినసంగతులను. సంగ్రహముగాఁ జెప్పెదను. బంధు
వ్యసనమును విస్తరించి చెప్పి, మఱింతచింత కలిగింపఁ గూడదు.

యుధి—(కన్నీరొలుకుచుండ)

తే. గీ. ప్రణతి గావింతు వరగఁ జెప్పంగదయ్య,
సంగ్రహంబుగనో సవిస్తరముగానో;
యనుజుఁడెస నేమి మూఁడెనో వినుట కేను,
సావధానత నుంటి, వాచంయమీంద్ర!

రాక్ష—రాజా! వినుము.

చ. కరము గదాధ్వనుల్ నిగుడఁ, గౌరవభీములు పోరుచోటికిన్,

ద్రౌప—(హఠాత్తుగా లేచి) తరువాతఁ దరువాత?

రాక్ష—(తనలో) వీ రిద్దఱకు మరలఁ దెలివియన్నది రాకుండుటకు నే నేమి
చేయుదును? (ప్రకాశముగా)

సరగ బలుండు రా, నతనిసన్నిధిఁ బోరిరి చాలసే; పనం
తర మతిశిష్యవత్సలతఁ, దద్బలరాముఁడు సంజ్ఞసేయ, న
క్కురుపతి, దానికి లజ్జగి, కూల్చె వృకోదరు నొక్కపెట్టునన్.

యుధి—హా! తమ్ముఁడా! వృకోదరా! (మూర్ఛిల్లుచున్నాఁడు.)

ద్రౌప—హా! ప్రాణేశ్వరా! హా! భీమసేన! నాకుఁ గలిగినపరాభవమును సహింప లేక, నీజీవమును విడిచి పెట్టితివా? నాథా! హా! జటాసురబకహిడింబకిమ్మీరకీచకజరాసంధనిషూదన! హా! సౌగంధికాహరణచాటుకార! హా! పలుక వేమి? ప్రాణేశ్వరా! (మూర్ఛిల్లుచున్నది.)

కంచు—(కన్నీళ్ళతో) హా! భీమసేనకుమార! హా! ధార్తరాష్ట్రకులకమలినీప్రాలేయవర్ష! మహారాజా! ఊఱడిల్లుము. బుద్ధిమతికా! దేవిగారి నూఱడింపవే. మునీంద్రా! మీరు కూడ మహారాజుగారి నూఱడింపుఁడు.

రాక్ష—(తనలో) ఆ! ప్రాణత్యాగము చేయ నూఱడించెదను. (ప్రకాశముగా) ఓయిభీమాగ్రజ! ఇంకను జెప్పవలసిన సంగతి యున్నది. ఒక్కక్షణ మూఱడిల్లుము.

యుధి—(మూర్ఛదేఱి) మునీంద్రా! ఇంకను జెప్ప వలసిన దున్నదా?

రాక్ష—అట్టు లానుక్షత్రియుండు నిహతుం డై, వీరసులభం బైనపుణ్యగతిం బొందిన, భ్రాతృవధను జూచుటచేతఁ బొరలి పొరలి వచ్చుదుఃఖంబునఁ గన్నీరు కాలువలై పాఱ, నర్జునుండు, గాండీవంబు విడిచి పెట్టి, క్రొన్నెత్తుటం జొత్తిల్లి యున్న భీమునిగదను, బిగిసికొని పోయినయతనిచేతనుండి బలవంతముగా నూడఁదీసికొని, తన్నుఁ గృష్ణుండు సంధి సేయం దలంచి వారించుచున్నను, భ్రామితగదాఝుంకారమూర్ఛిత గంభీరవచనస్వనుం డై, చిఱునవ్వుతోఁ గౌరవేశ్వరుండు రా రమ్మని పిలుచుచుంటం జేసి, నీమూఁడవసోదరుఁడు వెనుకదీయక, యాతనితోడ యుద్ధంబున కుపక్రమించెను. అప్పుడు మిక్కిలి లాఘవంబు గలిగిన యానుయోధనునిగదాఘాతంబున వివ్వచ్చుఁడు చచ్చున కా నిశ్చయించి, బలరాముం డర్జునపక్షపాతి యయినకృష్ణుని బలవంతముగాఁ దనరథ మెక్కించుకొని, ద్వారకానగరంబునకుఁ గొంపోయెను.

యుధి—మేలు మే లర్జునా! గాండీవమును విడిచి పెట్టుటచేత, వెంటనే నీవు భీమునిమార్గమును బొందఁ గలవు. ఇఁక నే నేయుపాయమునఁ బ్రాణత్యాగమహోత్సవము చేసికోఁ గలను?

ద్రౌప—హా! నాథా! భ్రాతృవత్సల! గదాయుద్ధమున నేర్పు చాలని నీతమ్ముఁడు, నీచేతిలోనిగదను బలవంతముగాఁ బుచ్చుకొని పగవాని కభిముఖముగాఁ బోవుచుండ, నీ వుపేక్షించుట యుక్త మగునా? (మూర్ఛిల్లుచున్నది.)

రాక్ష—తరువాత నేను—

యుధి—సరే..మునీంద్రా! అటుపయిని వినుట యెందుకు? హా! భీమసేన! హా! జతుగృహసముద్రితరణయానపాత్ర! హా! కిమ్మీరహిడింబాసురజరాసంధ జయమల్ల! హా! కీచకసుయోధనానుజకమలినీమదకుంజర! హా! ద్యూతపణప్రిణయ! హా! మామకశరీరస్థితిపరిఖేదశంకానిషూదన! హా! మదాజ్ఞాసంపాదక! హా! కౌరవవనదావానల!

ఉ. సుంతయు సిగ్గు లేక టులు జూదరి నైనపు డేవు భక్తిమై
దంతిసహస్రసత్త్వుఁడవు దాసుఁడ వైతివిగా! కృశించి; నీ
కంతకు నిప్పు డెక్కు డగునాపదఁ జేసితినయ్య? తమ్ముఁడా!
యెంతయు దిక్కు మాలి విలపించెదున న్నెడఁబాపి తయ్యయో! ౧౬

ద్రౌప—(మూర్ఛ దెలిసి లేచి) మహారాజా! ఏ మయినది?

యుధి—ద్రౌపదీ! మ తే మున్నది?

మ. బకకిమ్మీరహిడింబసూదనుఁడు, దృప్యత్కీచకప్రాణఘా
తుకుఁడు, న్మాగధగంధసింధురభిదాదుర్వారనిర్ఘాతుఁడున్,
బ్రకటస్ఫారగదోగ్రదీర్ఘభుజుఁడు, న్నాతమ్ముఁడు, న్నీదునా
యకుఁ డౌదుర్జయు డర్జునాగ్రజుఁడు, కట్టా! యస్తమించెన్ గదా! ౧౭

ద్రౌ—(ఆకాశమునఁ జూపు నిలిపి) ప్రాణేశ్వరా! నీవు స్వయముగా నాకురులను ముడుతు నంటివి. వీరుఁ డయినక్షత్రియునకుఁ బలికిన దప్పు యుక్తము గాదు; కావున నిదిగో! నేను వచ్చుచున్నా నుండుము. (వెండియు మూర్ఛిల్లినున్నది)

యుధి—(ఆకాశమువంకఁ జూచి) అమ్మా! కుంతీ! విన్నావు గదా నీపుత్రునిసమాచారము! అసద నయి విలపించుచున్న న న్నొంటరిగా విడిచిపెట్టి తా నెక్కడకో పోయినాఁడు తండ్రీ! జరాసంధశత్రూ! నీ కింతలోనే నా యందు నిండుటకు, నీయందులోకు లేమివైపరీత్యము నాలోకించిరి? వారు గాదు. నేనే యనేకములు పొడ గాంచితిని.

చ. నృపు లరిగాఁపు లౌవసుధ యెల్లను నా కిడి సిగ్గు గొంట, నేఁ
గపటపుజూదపుంబణముగా నిడ, నల్గక యొప్పుకొంట, నే
నెపుడు సుఖింప, నవ్విరటునింటను వంటలవాఁడ వౌట, తే
టపటిచె, నీకు నాయు వకటా! కడు నల్ప మటంచుఁ, తమ్ముఁడా! ౧౮

మునీంద్రా! ఏ మన్నారు?

౹౹చ. కరము గదాధ్వనుల్ నిగుడఁ గౌరవభీతులు పోరుచోటికిన్,
సరగ బ... నిలిపి ... వచ్చు ...

తర మతిశిష్యవత్సలతఁ దద్బలరాముఁడు సంజ్ఞఁ జేయ, వ
క్కురుపతి దానికీ లెత్తిఁగి, కూల్చె వృకోదరు నొక్కి పెట్టునన్.'' ౧౯.

రాక్ష—అవును. అది యాలాగే.

యుధి—ఛీ! నాయదృష్టము. (ఆకాశమువంకఁ జూచి) భగవానుఁడా! కామపాల! కృష్ణాగ్రజా! సుభద్రాభ్రాత!

మ. ఎద మేన త్తకుమారు లన్ ప్రియము నీ కేదీ? నృపన్యాయమా
యది? నాతమ్మునితోడినీయనుజునెయ్యం బైన నూహింపవై;
తిది యేమీ? ప్రియశిష్యు లిద్దఱును, నీ కీపక్షపాతంబు గూ
డదు; మాచో దయమాలి తేమననుగ? గట్టా! నేను నిర్భాగ్యుఁడన్. ౨౦

(ద్రౌపదిని జేరి) ఓపాంచాలీ! లేలెమ్మ. మన మిరువురమును సమానదుఃఖము గలవారమే. నీవు మాటిమాటికి మూర్ఛిల్లుచు, మీఁదుమిక్కిలి న న్నేల దహించెదవు.

ద్రౌప—(మూర్ఛదెలిసి) దుశ్శాసనుఁడు పట్టి యీడ్చుటచేత విడి పోయిన నా కేశపాశమును. దుర్యోధనర క్తమునఁ దడిసినచేతులతో, నానాథుఁడు ముడువ వలయును. చేటీ! బుద్ధిమతికా! నీయెదుటనే గదా నాథుఁడు ప్రతిజ్ఞ చేసెను? నాకు వేణీమహోత్సవంబు నారంభింప వలసిన దని దేవకీనందనుండును సందేశము పంపెను గదా? కావున నుత్ఫుల్లకుసుమదామంబులం గొని తెచ్చి, నా వేణి నలంకరింపుము. భగవంతుం డగునప్పురుషోత్తమునివచనప్రకార మాచరింపవే. ఆయనయాలోచన కల్ల గాఁగూడదుగదా! అయ్యో! శోకజ్వరంబున నే నిట్లు పలవరించెద నేల? ఇంకను గడుదూర మరుగనిప్రాణనాయకు నే యనుగమించెదను. మహారాజా! నాకుఁ గాష్ఠములం బేర్చి. చితిని బ్రజ్వలింపం జేయుఁడు. మీరును క్షత్రియధర్మము ననుసరించి, నాథునిజీవిత మపహరించినశత్రువున కభిముఖు లయి పొండి.

యుధి—పాంచాలి బాగుగఁ జెప్పినది. కంచుకీ! దుఃఖమున మఱుఁగుచున్న యీద్రౌపదికిం జితిని బేర్చి యాశాటం బుడుపుము. నాకును సజ్యం బయినవిల్లు తీసికొని రమ్ము. అయినను వి ల్లెందుకు?

తే. గీ. భ్రాతృవాత్సల్యమున గాండివంబు విడిచి,
యతని నెత్తుటఁ దడిసినయరుణగదను
గొనుచు నర్జునుఁ డరిగెఁ; గావునను నాకు
నదియ మే; లింకఁ జాలు జయాభిలాష. ౨౧.

రాక్ష—రాజా! నీచిత్తంబు రిపుజయవిముఖం బయినయెడల, నెక్కడ యొక్కెడఁ బ్రాణపరిత్యాగము చేసికొనుము. వృథాగ నక్కడకుం బోవ

కంచు—(రోషముతో) ఛీ! మునిజనము పలుకఁ గూడనిరాక్షస వచనమును వచించితివి.

రా—(తనలో) నన్ను వీఁడు తెలిసికొనెనా యేమి చెప్పుమా? (ప్రకాశము) ఓకంచుకీ! ఇదిగో నిటు విను. ఇప్పుడచట నర్జునసుయోధనులకు గదాయుద్ధము జ చున్నదిగదా! గదాయుద్ధమున వా రిరువురభుజసారమునుగూడ నే నెఱుంగుదు కావున నీవఱకేదుఃఖపడుచున్న యీరాజర్షికి, మరల నేనిదుర్వార్త వినవలసినది యని, యట్లు పలికితిని.

యుధి—(కన్నీరు విడుచుచు) మునీంద్రా! మేలుమేలు? నాకు హి నెఱింగించితిరి.

కంచు—మహారాజా! దేవసమాను లగుదేవరవారు శోకాంధు లయి ప్రా జనునివలె క్షాత్రధర్మమును బరిత్యజింతురా?

యుధి—అయ్యా! జయంధర!

తే. గీ. ఘనదవారిపురదర్శితోద్గాఢశౌర్య
పరిఘపీవరభుజభీమపార్థు లిపుడు,
పుడమిఁ బడి యుండ, వారి నుక్కడఁచి చెంత
శాత్రవుఁడు నిల్వఁ, జూడ నాశక్య మగునె?

ఓపాంచాలరాజపుత్రీ! నాదుర్నయంబునఁ గదా నీ కీదుర్దశ సంప్రాప్త మయ్యె కానీ, ఎంతవేగముగా నగ్ని ప్రజ్వలించిన, నంతవేగముగా మనబంధుజనుల గలిసికొనఁగలము.

ద్రౌప—అయ్యా! చిదుగులం బేర్పుము, ఏమిది? మహారాజుగారివచ నొక్కఁడైనను చేయ కున్నాఁడు! హా! ప్రాణేశ్వరా! నీవు లేకుండుటచే యిప్పుడు మహారాజు పరిజనులచేతఁ గూడఁ దిరస్కృతిని బొందుచున్నాఁడు.

రాక్ష—భరతవంశమునకొండొరు కిట్లు పత్యనుసరణము శ్లాఘనీయమే గ

యుధి—మునీంద్రా! మామాట నొకఁడును వినిపించు కొనకున్నాఁడు. రయిన నింధనప్రదానమున మమ్ముఁ గటాక్షింపుఁడు.

రాక్ష—రాజా! ఇది మునిజనవిరుద్ధము. (తనలో) నామనోరథము పూర్ణముగా ఫలించినవి; కావున వీరికిఁ గనఁబడ కుండ నిక్కడనే యుండి, చిత ప్రోవును బ్రజ్వలింపఁ జేసెదను. (ప్రకాశముగా) రాజా! ఇట్టిపో మేము నిలుచు శక్తులము గాము.

(నిష్క్రమించుచున్నా

యుధి—ద్రౌపదీ! మనమాట యెవ్వఁడును వినకున్నాఁడు. కానీ. నేనే స్వయముగా దారుసంచయమును బ్రోవు చేసి చితి నంటించెదను.

ద్రౌప—త్వరపడు మహారాజ!

[తెరలోపలఁ గలకలము.]

ద్రౌప—(భయముతో విని) మహారాజ ! ఇది యొకానొక తేజోబలదర్పితుని నిర్ఘోషమువలె వినఁబడుచున్నది. మరల నేదో యప్రియము వినవలసివచ్చును. అందుకే మన మాలస్యము చేయుచున్నాము,

యుధి—ఆలస్యము లేదు. రమ్మా. (అందఱును నడచుచున్నారు.)

యుధి—ఓపాంచాలీ ! అమ్మగారికిని, నీసవతులకును, జెప్పవలసిన దేమో చెప్పి, నీపరిజనమును బంపివేయుము.

ద్రౌప—మహారాజా ! బకహిడింబకిమ్మీరజరాసంధజయమల్లుఁ డయిన మీ మధ్యమపుత్రుఁడు పాతాళచరాల నయిననాయందలి ప్రేమచేతఁ బరలోకమున కేగినాఁ డని యత్తగారికి సందేశ మంపెదను.

యుధి—కల్యాణీ ! బుద్ధిమతికా ! అమ్మగారితో నాపలుకులుగా నిట్లు పలుకుము,

అ. వె. అంటుకొన్నలక్కయింట. బిడ్డలు నీవు
బైటఁబడితి రెవనిబాహుశక్తి,
నట్టియూరుబలాఢ్యుఁ డైననీప్రియపుత్రు
చావు నెట్లు వినుతు జనని! నీకు?

ఓయిజయంధర ! నీవును సహదేవునొద్దకుంబోయి, పూజ్యునిఁ బాండుకులబృహస్పతిని వైమాత్రేయు నాతనిం గాంచి, సకలకురుకులకమలాకరదావానలుండగుయుధిష్ఠిరుండు పరలోకంబునకుంబోవుచుండి,యనుకూలునాశంసనీయునతిప్రాజ్ఞునాపత్సంపత్సమాన ధీరు ననుఁగుఁదమ్ముని నిన్ను బిగ్గఁ గౌఁగిలించుకొని, శిరము మూర్కొని, యిట్లు ప్రార్థించె నని చెప్పుము.

"ఉ. ఏండ్లకుఁ జిన్న వయ్యు, నిజ మీవు సముండవు నాకుఁ దెల్వి; జ్యే
ష్ఠుండను నేను సోదరతఁ; జూడ గురుండవు నీవు బుద్ధి, న
ట్లుండుటఁ జేసి, మౌళిఁ గరయుగ్మముఁ జేరిచి వేఁడుకొందు నీ
కొండిక ! వీడు నాయెడలఁ గూర్మి; విదుర్పము నీళ్లు దండ్రికిన్. ౨౮.

మఱియు బాల్యంబున నాచేతఁ బెంపఁబడ్డవాఁడు, నిరతాభిమాని, మేరుసమానహృదయ సారుండు. నకులుండును, నామాటమీఁద నిలువఁ దగినవాఁడు గావున, నాతనిలోఁ గూడ నాపలుకులుగా నిట్లు పలుకుము. "వత్సా! నీవు మా మార్గ మనుసరింపఁ దగిన వాఁడవు గావు సుమీ.

మ. మము నీయన్నల నిద్దఱన్ మఱచి పొమ్మా తెల్విమైఁ; బాండుసం
శము క్షీణించుడు, నళుగర్భజల మిమ్మా; నీవు దాయాదగే
హమునం దైనను, యాదవాన్వయమునం దైన, న్మహారణ్యమ
ధ్యమునం దైన వసించి, పోషించుకొనవయ్యా నీయొడల్ తమ్ముఁడా!
జయంధర! నాతోడే సుఖీ. ఈసమాచారము నీవు శీఘ్రముగాఁ బోఁ
వలయును.

ద్రౌప—చేటి! బుద్ధిమతికా! నీవు ప్రియసఖి యయినసుభద్రయొద్ద
నాపలుకుగా నిట్లు పలుకుము. "చెల్లెలా! మనకోడ లయినయుత్తరకు
నాలుగవమాసము; కావున మనకులమును నిలువఁబెట్టఁ దగినదానిగర్భమును
జాగ్రత్తతోఁ గాపాడ వలయును. పరలోకమునకుఁ బోయిన మేనమా
మాకును గూడ, నెప్పు డయిన నీళ్లనుక్కలు విడిచి పెట్టుట కాధార

యుధి—(కన్నీళ్ళతో) హా! ఎంతకష్ట మెంతకష్టము!

ఉ. వాలిరిఁ గొమ్మలన్ దెసలఁ బ్రాకి. మహీతల మావరించియున్,
లావుగ మ్రాను గట్టి, విపులం బగుపాదున నున్నవృక్షమే
దైవవశంబునం గరము దగ్ధము గాఁగను, దానిమొక్కయం
దీ వడియాస నొందె దిది యిచ్చును నీడ యటంచుఁ గోమలీ!
(కంచుకిని జూచి) అయ్యా! జయంధర! నామీఁద నొట్టుఁ బెట్టుకొన్నను
కున్నావు గదా!

కంచు—(రోదనము చేయుచు) హా! దేవా! పాండురాజా! నీకుమారు లయిన
రభీమార్జుననకులసహదేవుల కెంతదారుణ మయినయవస్థ సంభవించెను! హా!
భోజరాజభవనపతాక!

ఉ. అన్న నుశుండు నీకు, హరి కన్న, కిరీటికి బావ, కౌరవా
ఖ్యాన్నతకంజకుంజరవృకోదరునొజ్జ, హలాయుధుం డయో!
యెన్నక, యీజగంబునకు నెల్లను జల్లనినీడ నిచ్చునీ
కన్నకుమారు లన్నబలః గాన దహించెను, మృత్యు వెఱ్ఱియో.

(రోదనము చేయుచు నిష్క్రమించుచున్నాఁడు.)

యుధి—జయంధర ! జయంధర!

[కంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—దేవా! ఆజ్ఞాపింపుఁడు.

యుధి—మీయదృష్టములు చూడ నీపాటివిగా నున్నవి; అయినను
నొకమాట చెప్పఁగోరుచున్నాను. ఒకవేళ మాతమ్ముఁ డర్జునుఁడే జయించె
తనితో నాపలుకులుగా నిట్లు పలుకుము.

చ. అరయఁగ నాదుతమ్ముమృతి కాబలరాముఁడె హేతు వైన, నీ
పరమహితుండు కృష్ణునకుఁ బార్థుఁడ! యన్న గదా యతండు! తీ
వరపడఁ బోకుమీ యతనిపట్టున; నాపయి ప్రేమ వీడు; ని
ష్కరుణపుదుష్టత్రిము స్మరలఁ గైకొన; కేగు మరణ్యసీమకున్. —అర

కంచు—చిత్తము. దేవా! (నిష్క్రమించుచున్నాఁడు)

యుధి—(అగ్నిని జూచి సంతోషముతో) ఓహో! నావంటిదుఃఖము గలజనులను, బ్రజ్వలించుచున్నతనశిఖ లనియెడుహస్తములచేతఁ బిలుచుచు, భగవానుఁ డయినహుతాశనుఁడు, చక్కఁగ వెలుంగుచున్నవాఁడు. కావున నాశరీర మిఁక నీయన కింధనముగా సమర్పించుకొనెదను

ద్రౌప—మహారాజా! నాథునికి నాయం దధికప్రేమ గావున, ముందుగా నేను బోయెదను. ప్రసాదింపుఁడు.

యుధి—అట్లయిన నీమహోత్సవ మిరువురమును గలిసియే యనుభవింతము.

చేటి—ఓహో! లోకపాలురార! మీరయిన నడ్డుపడి వీరిని రక్షింపుఁడు. ఈయనచంద్రవంశపురాజర్షి, రాజసూయాధ్వరంబునహుతవహునిఁదృప్తిఁబొందించిన రాజశ్రేష్ఠుఁడు, ఖాండవవనసంతర్పితహుతాశనుం డగునర్జునునకు జ్యేష్ఠభ్రాత, ప్రసిద్ధనామధేయుఁడు, యుధిష్ఠిరమహారాజు. ఈదేవి పాంచాలరాజకులదేవత, యజ్ఞవేదిమధ్యసముద్భవ, యాజ్ఞసేని; ఇట్టివీ రిద్దఱును విష్కరుణుఁ డయినయీకాలానలునకుఁ దమశరీరములను గట్టెపుడుకలనుగాఁ జేయుచున్నారు; అయ్యో! రక్షింపుఁడు రక్షింపుఁడు. (వారిముందఱఁ బడి) దేవా! దేవీ! ఏమి చేసెదరు?

యుధి—ఓసీ! బుద్ధిమతికా! ప్రాణసమానుఁ డయినతమ్ముఁడు, ప్రాణనాథుఁడును, బోయి నప్పుడు చేయఁ దగిన దేమో యది చేసెదము. కల్యాణి! లెమ్ము లెమ్ము. ఉదకమును దీసికొని రమ్ము.

చేటి—దేవా! చిత్తము (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) జయముజయము మహారాజా! ఇదిగో! జలపూర్ణ మయినభృంగారము.

యుధి—పాంచాలీ! నీవును నీయందుఁ బక్షపాతము గలభీమునికిని, బ్రియుఁ డయినయర్జునునికిని, శీఘ్రముగా నుదకక్రియ నాచరింపుము.

ద్రౌప—మహారాజా, మీరే యట్లు గావింపుఁడు. నే నగ్నిహోత్రమునఁ బ్రవేశించెదను,

యుధి—లోకాచార మతిక్రమింప రాదు గదా! బుద్ధిమతికా! ఉదక మిటు తే.

చేటి—(అట్లు చేయుచున్నది)

యుధి—(పాదప్రక్షాళనము చేసికొని యాచమించి ప్రాచీనావీతి దేవభాషతో) ఏష తావత్సలిలాంజలి ర్గాంగేయాయ భీష్మాయ గురవే, ప్రపితామహాయ శాంతనవాయ; అయ మపి పితామహాయ విచిత్రవీర్యాయ. (కంట నీరు పెట్టుకొని) తండ్రీ! ఇప్పుడు నీవంతు వచ్చినది. (మరల దేవభాషతో) అయ మపి తత్రభవతే స్వర్గస్థాయ గురవే నుగృహీతనామ్నే పిత్రే పాండవే.

ఆ. వె. తర్పణములు మీకుఁ దండ్రి! యింతటనుండి
యేను విడువ సంభపింప దెపుడుఁ;
గాన నిప్పు డేను గన్నీళ్ళతో నిచ్చు
సలిల మంబతోడఁ గలిసి క్రోలు.

ఆ. వె. తండ్రి! జలజనయన! తమ్ముఁడా! భీమన్న!
యీజలంబు మనకు నిద్దఱకును;
దప్పిగొనిన నీవు త్రాగకుమీ ముందు;
నేను నిదిగో! క్షణములోనె వత్తు.

ఏమి నావెఱ్ఱి! యుద్ధములోఁ జచ్చుటచేత నుత్తమక్షత్రియులలోకము బొంది యున్ననాతమ్మని, నే నీవిధమునఁ బ్రాణత్యాగముఁ జేసికొని చూడ గలనా? చూడ లేను. తమ్ముఁడా! భీమసేన!

చ. కుడిచితి వీవు నేఁ గుడుచుకొన్నయనంతర మమ్మచన్ను; పే
ర్మిడిఁ గొనవైతి వన్నరసముల్ మును నేఁ గొనకుండ నెన్నఁడున్;
నడిపితి వన్న! యిట్టె సవనంబులయందును సోమపాన; మి
ప్పుడు తగునా నివాపజలముల్ మును ద్రావఁగ నీవు తమ్ముఁడా? 30.

ద్రౌపదీ! పూజ్యుఁ డయినభీమునికి దోసెఁడునీళ్ళు విడిచి పెట్టుము.

ద్రౌప— చేటీ! బుద్ధిమతికా! ఉదక మిటు తే.

చేటి—(అట్లు చేయుచున్నది.)

ద్రౌప—(సమీపించి, దోసిలి నిండ నీళ్ళు పోసికొని) ఈనీళ్ళెవరికొఱకు విడిచి పెట్టుదును?

యుధి—ఆ. వె. కన్నతల్లి నిపుడు గాంధారితోడ స
మానదుఃఖురాలిఁ గా నొనర్చి,
స్వర్గమునకు నెవఁడు చనియెనో ముందుగా,
వానికొఱకు విడువ వలయు నెలఁది! 31.

ద్రౌప—ప్రాణేశ్వరా! స్వర్గస్థుఁడవయిననీకుఁ బరిజనోపనీత మిది పాదోదకమయ్యెడును.

యుధి—ఓయర్జునాగ్రజ!

తే. గీ. వ్రితవ నెఱవేర్చుకొనకయే పరమగతికిఁ
బోయితివి గానఁ, దమ్ముఁడా! పొలఁతి నీకుఁ
దల విరియఁ బోసికొని జలాంజలి నొసంగుఁ,
గొలుకులను వేఁడికన్నీరు లొలుకు చుండ. 33.

ద్రౌప—లేలెండు మహారాజా! ఈపాటికి మీసోదరుఁడు చాల దూరము పోవును గదా!

యుధి—(కుడిక న్నదరుట సూచించి) పాంచాలీ! భీమునిఁ ద్వరగఁ గలిసికొనియెద నని శకునములు సాకుఁ జెప్పుచున్నవి. కానీ. శీఘ్రముగా నగ్నిని సమీపింతము.

ద్రౌప—అహో! భగవానుఁడు హుతాశనుఁ డెంతచక్కఁగా వెలుఁగుచున్నాఁడు.

[తెరలోఁ బెద్దకలకలము]

[తత్తరపాటుతోఁ గంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—రక్షింపురక్షింపుమహారాజ! ఇదిగో! దురాత్ముఁ డయినదుర్యోధనుఁడు నెత్తుటితో స్నానము చేసి, రక్తాంబరుండును, రక్తాభిషేకభీషణగదాపాణియు నయి, యుద్ధశకాలదండుం డగుయముండునుం బోలెఁ బూజ్యురా లయిన పాంచాలి నిందు నందు వెదకుచు, నీలాగున నే వచ్చుచున్నాఁడు.

యుధి—హా! దైవమా! నీనిర్ణయము జరుగుచున్నది. హా! గాండీవధన్వీ! (మూర్ఛిల్లుచున్నాఁడు.)

ద్రౌప—హా! ప్రాణేశ్వరా! మామకస్వయంవరస్వయంగ్రాహకుటుంబీ! ధనంజయ! నీప్రియసోదరునిఁ గలసికొని మహారాజును నన్నును విడిచి పెట్టితివిగదా నాథా! (మూర్ఛిల్లుచున్నది.)

కంచు—దేవా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

యుధి—(మూర్ఛదేఱి) హా! వత్స! హా! సవ్యసాచీ! హా! త్రిధత్రిలోచనాంగనిచ్ఛేపసాహసదృశమల్ల! హా! నివాతకవచోద్ధరణ నిష్కంటకీకృతామరలోక! హా! బదర్యాశ్రమమునిద్వితీయతాపస! హా! ద్రోణాచార్యప్రియశిష్య! హా! అస్త్రశిక్షాబలపరితోషితగాంగేయ! హా! రాధేయకులకమలినీప్రాలేయసారశరనిచయ! హా! గంధర్వనిర్వాసితసుయోధన! హా! పాండవకులకమలినీరాజహంస!

తే. గీ. అనుఁగుదల్లికి మ్రొక్కక, వినయమునను
గౌఁగిలించక నాయాజ్ఞఁ గాంచ కకట!
యీస్వయంవరవధువు నీక్షింప కీవు
దవ్వుఁబయనంబు వోనేలొ తమ్ముసుజ్జి.

కంచు—అయ్యయ్యో! ఎంతకష్టము! దురాత్ముఁ డయినదుర్యోధనుఁడు విచ్చలవిడి నీలాగే వచ్చుచున్నాఁడు.

యుధి—అయినచో సర్వథా యిప్పు డిదే కాలోచిత మయిన ప్రతీకారము. బుద్ధిమతికా! పూజ్యురా లగునీపాంచాలిని జితియొద్దకుఁ దీసికొని పో. నేను నీవె ననుసరించెదను.

చేటి—అయ్యో! రక్షింపుఁడు రక్షింపుఁడు.

కంచు—కల్యాణి! నీ మొఱ్ఱ నకులసహదేవులకా? దేవిగారియన్న యగు ధృష్టద్యుమ్నునకా? ఇపుడు వారికంటె మఱిరక్షకు లెవ్వరు? మహారాజునవస్థ యీలాగుండెను. అయినభీమార్జును లిద్దఱు నస్తమించిరి.

[తెరలోఁ గలకలానంతరము.]

ఓహో! శమంతపంచకసంచారులార ! రుధిరాస్వాదమత్తయాతుధానసపిశాచభూతబేతాళకంకగృధ్రజంబుకోలూకవాయసభూయిష్ఠావశిష్టవీరళయోధులార! నన్నుఁ జూచి యడలి పోకుఁడు. ద్రౌపది యెక్కడ నున్నదో చెప్పుఁడు. ఇదిగో! నావాలు గంటి కానవాలు చెప్పుచున్నాను. వినుండు.

చ. కుఱు వొక చేతితోఁ జఱచుకొంచు సుయోధనుఁ డోరఁ జూడ, నం
బర మొలువంబడెఁ; మఱియుఁ బల్వురలోపల దుస్ససేనుఁ డు
ద్ధురతను బట్టియాడ్చుటను, దొయ్యలిముంగురు లన్ని డొల్లె; నీ
వరుసఁ బరాభవంపడినపైదలి, యెక్కడ నుండుఁ జెప్పుఁడీ;

కంచు—ఓదేవీ! యాజ్ఞసేని! నీ విప్పుడు గూడ ననాథ వయి కురుకులకళంకునిచేతఁ బరాభవము నొందుచున్నావు గదా!

యుధి—(దిగ్గునలేచి)పాంచాలీ! జడియకు జడియకు. నాకు సజ్యం బయిన ధనువు దెప్పింపుము. దురాత్మా! దుర్యోధనహతక! రా. రా. నాబాణవర్షమున గదాకౌశలసంభూతభుజబలపరాగ మణఁచి వేసెదను. ఓరీకురుకులాంగార!

తే. గీ. అలజరాసంధుఁ జంపినయట్టితమ్ము,
హరకిరాతుని గెలిచినయట్టితమ్ముఁ
దలఁచి, నీలాగు తాయి నై నిలువ నైన,
నిన్ను వధియింప నైనను, నేర నేను.

(తరువాత గదాపాణియు రక్తసిక్తాంగుఁడు నగుభీమసేనుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

భీము—(వడిగా నడచుచు) ఓహో ! శమంతపంచకసంచారు లయిన సైనికులారా! ఏమి తల్లడము?

శా. ఏ రక్షస్సను గాను, భూతమనుగా; నేలా మృతేభాశ్వవి
స్తారాంగంబులక్రింద దాఁగెఁ? హతశేషక్ష్మాప్రపులారా! ద్విష
చ్ఛారీరక్షతజాభిషిక్తతనుఁడన్, సంలంఘితోరుప్రతి
జ్ఞారత్నాకరుఁడైనక్షత్రియుఁడనే; శంకింప మీ కేటికిన్? ౨౯.

కంచు—దేవీ! పాంచున్నషా! లెమ్ము లెమ్ము. ఇప్పుడు హాతాత్తుగాఁ జిచ్చుఱుకుటయే శ్రేయంబు.

ద్రౌప—(వెంటనే లేచి) నే నిప్పుడు గూడఁ జితిని సమీపింపకుందునా? (చితి కభిముఖి యయియున్నది.)

యుధి—యెవడురా అక్కడ? అస్మల్లసాచితయును ఁల్లను దీసికొనిరా. ఏమిది పరిజనుఁ డెవ్వఁడును లేఁడయ్యెను? పోనీ. బాహుయుద్ధముచేతనే యీ దురాత్ముని గట్టిగ నాసందిటను బట్టి, ముందున్న యీ యగ్నిహోత్రమునఁ బడవేసెదను. [నడుమునుగట్టుచున్నాఁడు.]

కంచు—దేవీ! దుశ్శాసనాకర్షితంబు లయి కన్నుల కడ్డు పడుచున్న నీకురులను, నీవే యిప్పుడు ముడుఁచుకొనుము. ప్రతీకారము నెడ నాస యింక వదలి పోయెను గదా! వేవేగఁ జితియొద్దకుఁ బోవలయును.

యుధి—వలదువలదు. దుర్యోధనహాతకుఁడు చావకుండ, నీతలవెండ్రుకలు ముడువఁ గూడదు.

భీము—పాంచాలీ! నేను జీవించియుండఁగా, దుశ్శాసనుఁడు చిక్కువఱచిన నీకురులను నీచేతులతో ముడుఁచుకో రాదు. ఉండు. నేను ముడిఁచెదను.

ద్రౌప—(భయపడి పరుగెత్తుచున్నది.)

భీము— నిలునిలు. భీరురాలా! ఇప్పు డెందుఁ బోయెదవు?

(కేశపాశమును బట్టుకొనఁ దలఁచుచున్నాఁడు.)

యుధి—(సత్తువకొలఁది భీముని సందిటం బట్టి) దురాత్మా! భీమార్జునవైరీ! దుర్యోధనహతక! ఇప్పుడు నీ వెందుఁ బోయెదవురా?

ఉ. చిన్నతనంబునుండియును జేసితి వెగ్గులు మాకుఁ; బ్రత్యహం
బు న్నిజబాహుదర్పమునఁ బొంగెదు; చంపితి రాజపుత్రులన్;
బన్నుగ నస్మదీయభుజపంజరమం దిటు చిక్కినావురా
చెన్నఁటి! యింక నీతరమె జీవముతో నడుగైనఁ బోవఁగన్? ౩౦

భీము—అహో! నన్ను దుర్యోధనుఁ డనుకొని కాఁబోలు, నీమహారాజు నాయెముకలు చూర్ణ మగునట్లు, నిర్దయముగాఁ గౌఁగిలించుకొను చున్నాఁడు. అన్నయ్యా! అనుగ్రహింపుఁ డనుగ్రహింపుఁడు.

కంచు—(పోల్చి చూచి సంతోషముతో) ఏమీ! భీమసేనకుమారు, నాయనా! అదృష్టవశమున బ్రతికి వచ్చితివి. మహారాజ! ఇతఁ డాయుష్మ, డగుమనభీమసేనుఁడే సుండీ. దుర్యోధనరక్తముచేత నొడలును బట్టలును, రొట్టుపడుటచేత, రూపు మాటి పోల్ప రాఁ డయ్యెను. ఇంకను శంకింపవలదు.

చేటి—(ద్రౌపదిని గౌఁగిలించుకొని) దేవీ! ఇదిగోఁ! దనప్రతిజ్ఞను నెఱ వేర్చు కొని వచ్చి, నీప్రాణనాథుఁడు నీకు వేణీసంహారమహోత్సవము సేయఁగోరి, నిన్ను వెదకుచున్నాఁడు.

ద్రౌప—చేటీ! నన్నుఁ గల్లమాటలతో నూఱడించెదవా?

యుధి—జయంధర! నిజమే గదా? వీఁడు నావైరి యయినదుర్యోధనుఁడు గాఁడు గదా?

భీమ—దేవా! అజాతశత్రూ! భీమార్జునాగ్రజ! ఇంకను దుర్యోధనుఁ డెక్కడ? నాచేతఁ బాండుకులపరిభావి యయినయాదురాత్ముని—

లయగ్రాహి. కాయ మిలఁ గూలెను నపాయమును బొందె; మఱిఁ

బాయఁబడెఁ జందనముచాయ రుధిరంబుల్;

దోయధితటప్లపరిఖాయతధరాజయర

మాయువతి నిల్చె భవదీయభుజపీఠిన్;

దోయములు సైనికనికాయములు నాదిమహా

నీయసమరాగ్ని శలభాయితము లయ్యెన్;

మీయనినపే రొకటియే యిపుడు దక్క మిగు

లేయదియు లే దరి కమేయమహిమాఢ్యా!

యుధి—(భీముని జూచుచుఁ గన్నీళ్లు దుడుచుకొనుచున్నాఁడు.)

భీమ—(కాళ్ళమీఁదఁ బడి) అన్నయ్యా! జయము జయము.

యుధి—తమ్ముఁడా! బాష్పజలపూరితలోచనుండ నయి, నీముఖము జూడలేక పోయితిని. అర్జునునితోఁ గూడ నీవు జీవించి యున్నావా? చెప్పు.

భీమ—నిహతాశేషశత్రుపక్షు లయి దేవరవారు సుఖించి యుండఁగా భీమార్జునుల కేమి కొఱఁత?

యుధి—(మరలఁ బ్రేమతో గాఢాలింగనము చేసికొని)

చ. అరివధ యుండని మ్మటు, రయంబున ముందిది చెప్పవేమి, బకా

సురుఁ గడ తేర్చినట్టిప్రియసోదరుఁ డైనవృకోదరుండవే?

భీమ—అన్నయ్యా నేనే.

యుధి—

కరమును నోలలాడితివిగా! మును మాగధుపీనవక్షు మర్
సరసునఁ జల్లు లాడుచును సంభరితక్షతజాంబుమండలిన్. ౪౦.

భీము—అవు నన్నయ్యా! మీ రొక్కక్షణము నన్ను విడిచి పెట్టుఁడు.

యుధి— ఇంకను వశిష్ట మేమి?

భీము—అన్నయ్యా! గొప్పయవశిష్టమే యున్నది! ఇదిగో! దుర్యోధన దుశ్శా సలరక్తము చేతఁ దడిసినయీ చేతులతోడ, దుశ్శాసనాకృష్టము లగు పాంచాలికురులు డిఁచి వచ్చెదను.

యుధి—అటు లయిన శీఘ్రముగా నరుగుము దీనురాలయినద్రౌపది వేణీసం రమహోత్సవ మనుభవించుఁ గాక.

భీము—పూజ్యురాలా! ద్రౌపదీ! అదృష్టవశంబున రిపుకులక్షయంబయ్యెఁ వున, నీ వింక సుఖం బుండుము.

ద్రౌప—(సమీపించి) నాథా! జయ మవుఁగాక! జయ మవుఁగాక!
(భయముచే వెనుదీయుచున్నది.)

భీము—రాజపుత్రీ! నన్నుఁ జూచి భయపడియెద వేమి? ఇదిగో నిది—

ఉ. ఏవృషలుండు రాజసభ నీడ్చెనొ ముందఁటఁ బట్టి నిన్ను, నా
హీనునిశోణితంబు; స్పృశియింపుము చేతుల నంటెఁ ద్రౌగుచోఁ;
జానరో! కౌరవేశుక్షతజం బిది; మద్గదఁ జూర్ణితోరువుం
గా నొనరించి, మై నలఁదఁ గంటెఁ, బరాభవవహ్ని యాఱఁగన్. ౪౩.

బుద్ధిమతికా! పాండవదార నపహసించినభానుమతి యిప్పు డెక్కడ నున్నదే?

సీ. వేదిసంభవులారా! యాజ్ఞసేనీ!

ద్రౌప—ప్రాణేశ్వరా! ఆజ్ఞాపింపుము.

భీము—నాఁడు నే నన్నయీమాట తలంపునకు వచ్చినదా?

చ, బిఱబిఱఁ ద్రిప్పుకొంచు గద; బిట్టు సుయోధనుఁ గిట్టి, పెందొడల్
విఱుగఁగఁ గొట్టి. చేతులను వెచ్చనినెత్తుట నద్ది, నీకురుల్
మెఱుఁ గిడి, భీమసేనుఁ డవలీలను జిక్కడలించి కూర్చెడున్;
గొఱకొఱ యేల? దేవి! యిదిగో! ముద మందెదు చూడు నీమదిన్.''

ఈపూర్వోక్తపద్యమును జదువుచున్నాఁడు)

ద్రౌప—ప్రాణేశ్వరా! తలఁపునకే కాదు, అనుభవమునకును వచ్చినది.

భీము—(ఆమెవేణిని ముడుఁచుచు) దేవీ! దుశ్శాసనవిలులితంబయి ధార్తరాష్ట్ర కాలరాత్రి యయిననీవేణి, నింక నీవు ముడుఁచుకొనుము.

ద్రౌప—నాథా! ఈవ్యాపారము నాకీవఅలో నలవాటు దప్పెను. త్వ
దీయప్రసాదంబున మరల నేర్చుకొనవలెను.

చేటి—(వేణిని ముడుచుచున్నది.)

మహాస్రగ్ధర. కురునాథుల్ క్రుద్ధచిత్తుల్ గురుభుజబలులౌ కుంతిపుత్రుల్, స్వ
పురముల్ నిర్ముక్త కేశంబులుగ సలుప యన్మోక్షమే మూల
ద్వారికృష్ణా వేణి, క్రోధోద్ధతయమసఖముల్, ధార్తరాష్ట్రాంతః
బరిబద్ధబం ధ్యెయ; జావుల్ ప్రజలకుడిగెడుల్, స్వస్తియాకేంద్ర

యుధి—దేవీ! ఇదిగో! అంతరిక్షసంచారు లగుసిద్ధజనంబులు నీవేణీ
మహోత్సవంబునకు సంతసించుచున్నారు.

[తెరువాతఁ గృష్ణానులు ప్రవేశించుచున్నారు]

కృష్ణ—విజయతామ్ నిహతసకలారాతిమండల స్సానుజః పాండవకుల
మా మహారాజో యుధిష్ఠిరః.

అర్జు—విజయతా మార్యః

యుధి—(చూచి)ఓహో!భగవంతుఁడు పుండరీకాక్షుఁడును జిరంజీ
నుఁడు నా? (కృష్ణుని) దేవా! నమస్కరించుచున్నాను. (అర్జునుని) తమ్ముఁడ
రా. నన్ను గట్టిగాఁ గౌఁగిలించుకో.

అర్జు—(నమస్కరించుచున్నాఁడు)

యుధి—(కృష్ణునితో) దేవా! భగవంతుండును బురాణపురుషుఁడు
శ్రీమన్నారాయణుండు స్వయముగా మంగళములను గోరువానికి విజయముగా
యేమి యగును ?

చ. గురుమహదాదివృత్తి నొనగూడినరూపమువాని, సృష్టిసం
భరణవినాశహేతు వగువానినిఁ, బుట్టువు లేనివాని, ని
ర్జరుని, నచింత్యునిం, గుణపరాజితు, నిన్నుఁ దలంచునంతనే,
నరులకు దుఃఖముల్ దొలఁగు నాఁ, గనువారికిఁ జెప్ప నేటికిన్?

(అర్జునుఁ గౌఁగిలించుకొని) వత్సా! నన్నుఁ గౌఁగిలించుకో.

అర్జు—(గౌఁగిలించుకొనుచున్నాఁడు)

కృష్ణ—ఇదిగో! మహాత్ము లయినవ్యాసవాల్మీకిజామదగ్న్యజాబాలి
మహర్షులు కల్పితాశేషమంగళసమారంభు లయి వచ్చి యున్నారు. మఱియు
సహదేవధృష్టద్యుమ్న సాత్యకిప్రముఖసేనానాయకులును, స్కంధోత్తంభిత
కలశు లయి యభిషేకము సేయఁ గోరుచున్నవారు. నేనును జార్వాకుఁడు

వంచించుటవ్యాసమహర్షి వలనఁ దెలిసికొని, యతిత్వరితముగా నర్జునునితో భవత్సకాశమునకుఁ జనుదెంచితిని.

యుధి—ఏమీ? మమ్ముఁ జార్వాకుఁడు మోసపుచ్చెనా? (కోపముతో) దుర్యోధనసఖుఁడు వాఁడెక్కడ నున్నాఁడు? ఆరాక్షసాధముఁడు నాచిత్తముచాల నుత్తలపఱిచెను.

కృష్ణు—ఆదురాత్ముఁడు నకులునిచేతఁ జిక్కినాఁడు. మహారాజా! నీ కింతకంటెఁ గోరఁ దగినది యేమున్నదో చెప్పుము.

యుధి—భగవంతుఁ డగు దేవర ప్రసన్నత నొందిన, నీయశాని ,దేమి గలదు, మానవమాత్రుఁ డనుబుద్ధితో నీతోఁ గ్రీడ లాడుచుంటిని. నాకింతకంటెఁ గోరఁదగిన దే మున్నది? దేవా! చూడుము.

ఉ. చెక్కు డెమర్ప దేవురకుఁ; జెండితి మొంటనివారిఁ; గృష్ణయుం
దక్కక నాదుదుర్నయమునం బడి దాఁటెఁ బరాభవాంబుధిన్;
మక్కువ మాట లాడెద వనంత! కృతార్థుఁడఁ గానె నేను? ని
న్నక్కఱతోడఁ గోర, నిఁక నన్యము లుండు నటయ్య కోరికల్? ౪౪

అయినను దేవా! నీవు ప్రసన్నుండ వయితివి గాన నిట్లగుఁగాక.

మానిని. లోకులు దీనత లేక శతాబ్దములుం బ్రదుక న్వలె సౌఖ్యమునన్;
శ్రీకటతావకభక్తియు నద్వయభంగి లభింప వలె; న్నరహరీ!
లోకహితుండును, బండితబాంధవుఁడున్, గుణభూరివివేకుఁడు. న
స్తోకశుభంకరుఁ డౌచును రాజు, వసుంధర నెమ్మది నేల వలెన్.

కృష్ణు—తథాస్తు! (అందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్యము. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది
సాధువంశక్షీరనీరాకరరాకాసుధాకర రాచ్చనామాత్యపౌత్త్ర హరి
తసగోత్ర-పవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల
సూరపరాజపుత్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బ
రాయనామధేయాంధ్రీకృత వేణీసంహార
నాటకంబునందు సర్వంబును,
ష ష్ఠాం క ము,
సంపూర్ణము.

——

# విక్రమోర్వశీయము.

రెండవకూర్పు. చక్కనిఅచ్చు.

ఇది కాళిదాసమహాకవివిరచితమునకుఁ దెలుఁగు. అప్సరస యగు నూర్వశిని రాక్షసుఁ డొకరుఁ డపహరించి యంతరిక్షమార్గమునఁ గొనిపోవుచుండఁగా, నామెతోడిచెలికత్తెల మొఱ్ఱ విని యాకాశగమనమునఁ బ్రావీణ్యముగలపురూరవశ్చక్రవర్తి యారక్కసు నుక్కడంచి యామెను విడిపించిన కారణమునఁ బరస్పరానురాగ మంకురించి వారిరువురును వివాహముచేసికొనిరి. ఈవిషయమే బహువిధచమత్కారములు గలుగునట్లుగా రసపోషణము చేసి యైదంకముల నాటకముగాఁ గవి రచియించినాఁడు. శృంగారరసప్రధాన మయినట్టి యీ నాటకమునందలి భావములు మిక్కిలి పేశలములు. రసగ్రహణలాలసుల కిది యవశ్యము పఠనీయము. ఏతన్నాటకమునందలి పద్యములు మచ్చునకిట నొకటి రెండు చూపఁబడుచున్నవి.

దీనివెల రు. 0—8—0 అణాలు మాత్రమే!

ఉ. అందనిమ్రానిపండుగొన నఱ్ఱు నిగుడ్చుచుఁ ద్రిప్ప రానినా
డెందముఁ గొందలంపఱచెడిన్ ముఱుపే విషమాస్త్రుఁ; డిప్పుడే
మందును? మందమందమలయానిలపాతితపాండుపత్రమా
కందము లిందుఁ బ్రోదొడిమగంటులఁ జూపెడు నంకురావళుల్.

తే. గీ. స్యందనక్షోభమునఁ జేసి యిందువదన
యంస మంసముతోడ రాపాడెఁ గానఁ
దలఁప నీభుజ మొక్కటే ధన్య; మితర
మైనమే నెల్ల భూమికి నతిభరంబు॥ తృతీయాంకము.

చ. తొలకరినీలమేఘ మిది, దుష్టనిశాటుఁడు గాఁడు; దాన ను
జ్జ్వల మగునింద్రచాప మిది, సజ్యము దానవువిల్లు గాదు; కే
వలమును వర్షధార లివి, బాణపరంపర గాదు; పైఁడిగీ
టిలఁ దలఁపించుమిం చిది హృదీశ్వరి యూర్వశి గాదు రూఢిగా॥ చ. అం.

చ. కొడుకుమొగంబుఁ జూచి మదిఁ గుందకయూటఁ జెందియుండఁగా
బడఁతుక నీ వియోగ మనివార్యత నిప్పుడ సంభవించెఁగా
మిడిమిడిగ్రీష్మతాపము శమింప నవాంబునవృష్టిఁ గాంచి యొ
ప్పెడుతటిఁ జెట్టుపైఁ బిడుగు భీకరభంగిని బడ్డకైవడిన్. పం. అం.

వలయువారు గ్రంథకర్తగారి కిట్లు వ్రాసికొనుడు:—

వడ్డాది సుబ్బారాయకవిగారు
రాజకీయకళాశాలాంధ్రపండితులు, రాజమహేంద్రవరము.

శ్రీ

# ఆంధ్రాభిజ్ఞాన శాకుంతలము.

మహాకవి శ్రీకాళిదాసకృతికి
అనువాదము.

వేదము - వేంకటరాయశాస్త్రిచే
విరచితము.



SECOND EDITION.

MADRAS,
THE INDIA PRINTING WORKS.

1923

 [దీనివెల రు. 1—0—0.

# పెద్దలకై విజ్ఞప్తి.

---

1921 సం॥ తుదను నేను మదరాసులో నివాసము చాలించి నెల్లూరు చేరితిని. మదరాసులోనుండిన కడపటి మూఁడు వర్షములలో శ్రీమతులు గుఱ్ఱము - సుబ్బరామయ్యగారు, (ఇప్పుడు బి. ఏ., హానర్సు) ఆంధ్రగైర్వాణకావ్యనాటకవాఙ్మయమందు తనకుంగల రసజ్ఞతావిశేషము కతంబున నాకు ప్రియమిత్త్రులయినారు. అనంతరము తన్మూలమున వారి తండ్రిగారును తదనుజులును పూర్వము హైకోర్టుపండితులై కులపతులుగా జగద్విఖ్యాతి గాంచిన గుఱ్ఱము-అప్పన్న శాస్త్రులవారి వంశభవులును, విద్యాతపోనిధానమయిన గుఱ్ఱము-వెంకటేశయ్యగారి తనూభవులును, అగు శ్రీయుతులు,

గుఱ్ఱము-వేంకటసుబ్బయ్యగారు,
,, వెంకయ్యగారు,
,, వేంకటకృష్ణయ్యగారు,

సుజనాగ్రగణ్యులు పెక్కువర్షములనుండి మదీయ శాకుంతలమును అభినందించుచుండువారు నాకుం బరమమిత్త్రులయినారు.

సాభిత్రభూషితులును ధర్మప్రవణులును రసలుబ్ధులును అగు నీసుజనులలో ద్వితీయులు బ్రహ్మశ్రీ, వెంకయ్యగారు తాము ఈనడుమ కావించుచుండిన ధర్మోపనయన సమయంబున గోష్ఠీవశంబున నన్ను-మదీయశాకుంతలము ముద్రితమై చిరకాలమైనను పుస్తకములు విచటను అలవడకయున్నను ఏల పునర్ముద్రణము చేయింపలేదు?-అని ప్రశ్నించిరి. నేను ప్రస్తుతము కాళిదాసీయాభిజ్ఞానశాకుంతలాంధ్రానువాదములు పలువురు గావించినవి దీపించుచు లభ్యములుగానుండుటయు వాని

నడుమ మదీయ మొకటి యున్నను లేకపోయినను విశేషమేమియు యును పునర్ముద్రణ ప్రయత్నములు లేమికి కారణములుగా తెలుప టిని. కాని వారు నాచెప్పిన కారణములను సరకుచేయక చెప్పని కల్పించుకొని తమకుపరిచితపూర్వము మదీయము యను కారణ ముఖ్యముగాఁగొని నన్ను పునర్ముద్రణమునకు సోత్సాహుం గా వారై తదర్థమై పర్యాప్తమయిన ధనము న అత్యంతహర్షోత్కర్ష నా కొసంగిరి. నాకుం దపఃక్లేశమును వరప్రార్థనమును లేకయే వే ప్రత్యక్షమై బలవంతపెట్టి వర మిచ్చి న ట్లయి యత్యంతకృతజ్ఞతా కముగా ఆధనముతో ఈ ద్వితీయముద్రణమును నెఱవేర్చికొంటిని.

వా రిట్లొసంగిన ద్వితీయ ముద్రణప్రసక్తిలో యథామతి సవరణలును మార్పులును గ్రంథములో కావించితిని. ఇట్లు ఆర్థ తికి వరివస్యంగావించిన శ్రీ వెంకయ్యగారికిని, కర్తాకారయితాచై వేల న్యాయంబున పూర్వోక్తులైన తదీయభ్రాతృభ్రాతృవ్యులకును శ్రే బుల నొసంగుఁగాక యని పరమేశ్వరుం బ్రార్థించుచున్నాఁడను.

ఆగస్టు, 1923.
నెల్లూరు.

వే. వేంకటరాయశాస్త్రి



# పాత్రములు.

## పురుషులు.

---

సూత్రధారుఁడు.
దుష్యంతుఁడు.—కథానాయకుఁడు.
సూతుఁడు.
వైఖానసుఁడు
4 శిష్యులు
మాఢవ్యుఁడు.—విదూషకుఁడు.
రైవతకుఁడు.—దౌవారికుఁడు.
సేనాపతి.
4 ఋషికుమారులు.
కరభకుఁడు.—రాజుతల్లి పంపిన భటుఁడు.
కణ్వమహర్షి.—శకుంతల పెంపుడు తండ్రి.
శార్ఙ్గరవుఁడు } .—కణ్వశిష్యులు.
శారద్వతుఁడు }
వాతాయనుఁడు.—కంచుకి.
సోమరాతుఁడు.—దుష్యంత పురోహితుఁడు.
కావలినాయకుఁడు.
జానుకుఁడు } .—కావలివాండ్రు.
సూచకుఁడు }
ధీవరుఁడు (అభిజ్ఞానాంగుళీయకమును దెచ్చినవాఁడు).
మాతలి.—ఇంద్రసారథి.
భరతుఁడు.—దుష్యంతుని కుమారుఁడు, బాలుఁడు.
కశ్యపుఁడు.—మరీచిపుత్త్రుఁడు, సురాసురుల తండ్రి.
గాలవుఁడు.—కశ్యపశిష్యుఁడు.

# స్త్రీలు.

---

నటి.

శకుంతల.—కథానాయిక.

అనసూయ
ప్రియంవద } .—శకుంతల చెలికత్తెలు.

గౌతమి.—వృద్ధతాపసి.

3 మునిపత్నులు.

వేత్రవతి.—ప్రతీహారి.

సానుమతి.—అప్సరస, మేనకసఖి.

మధుకరిక
పరభృతిక } .—ఉద్యానపాలికలు.

చతురిక.—దుష్యంతుని పరిచారిక.

2 తాపసపురంధ్రులు.

అదితి.—కశ్యపుని భార్య.

స్థలము ప్రాయికముగా ధర్మారణ్యమందు, హస్తినాపురమునందు, మారీచాశ్రమమునందును ఉండును.



శ్రీ

# ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము.

C. M. V. Sharma
Nalgonda

శా. శ్రీకిం బుట్టు వొసంగె నేది, యెది వాసి న్వేల్పు మోచెన్ హవిన్,
లోకశ్రవ్యగుణాంక మేది, యెది కొల్చున్ గాలముల్ రెండునున్,
లోకుల్ ప్రాణులు దేన, భూతతతి గల్గున్ దేనఁ, బ్రత్యక్షుఁడౌ
నీకాయంబుల నెవ్వఁ డెన్మిదిట నాయీశుండు మి మ్మోముతన్. 1

## ప్రస్తావన.

[నాంద్యంతమున సూత్రధారుఁడు తెరవైపు చూచి]:—ఆర్యా, ప్రసాధన విధానము ముగిసినయెడల నిటు రమ్ము.

[నటి ప్రవేశించును.]

నటి:—ఆర్యపుత్త్రా, ఇదిగో వచ్చితిని.

సూత్ర:—ఆర్యా, ఈసభ పండితభూయిష్ఠగా నున్నది. ఇప్పుడు దీనిని శ్రీమత్కాళిదాస ప్రణీతాభిజ్ఞాన శాకుంతలమునకు శ్రీమద్వేదాన్వవాయ ప్రభవులు వేంకటరాయశాస్త్రిగారు ఆంధ్రమున రచించిన యనువాదముచే ఆరాధింపవలయును. కావునఁ బాత్త్రవర్గము నెల్ల జాగరూకతతో సిద్ధపఱుపుము.

నటి:—ప్రయోగ మెల్ల చక్కఁగా శిక్షితమై యున్నదిగావున ఆర్యపుత్త్రునికేమియుఁ గొఱఁత గలుగదు.

సూత్ర:—ఆర్యా, వాస్తవమును జెప్పెదను వినుము.

---

శ్రీకిం బుట్టు వొసంగె నేది—మహాలక్ష్మి నీటఁ బుట్టినదనుటకుం బ్రమాణము.

'స్యా దేవ తోయ మమృతప్రకృతి ర్యది స్యా
న్నైక కాన్తతో ఒద్భుత మిదం పునరద్భుతం నః
లక్ష్మీ తుషారకర కౌస్తుభ పారిజాత
ధన్వన్తరి ప్రభృతయో య దపాం వివర్త్తాః.' (అనర్ఘ రాఘవము 7-13)
'నీచప్రవణతా లక్ష్మీ ర్జలజాయా స్తవోచితా.' (చంద్రాలోకము)

ఇట నీపాఠాంతరముం గలదు:—"శ్రీకిన్ గీమికు సృష్టి యేది?"—గీము=ఇల్లు, శ్రీయొక్కయిల్లు కమలము, కమలము=అంభోరుహము. "బిసప్రసూన రాజీవ పుష్కరాంభోరుహాణి చ" అమ. "సృష్టి" యనుటచే పంక, సరః, ప్రభృతులు నివర్తిల్లును.

తే. పెద్దలకుఁ బరితోషంబు నెలయుదాఁక
నాప్రయోగంబు సరి యని నమ్మఁజాలఁ;
బూని యెంతయు నేర్చినవానికేని
తనమనము గాదు తార్కాణ తన తెలివికి.

నటి:—అది వాస్తవమే; ఇఁక నిప్పుడు చేయవలసినదేమో ఆనతిమ్ము ఆర్య
సూత్ర:—ఈసభకు శ్రవణోత్సవము చేయుటకన్న మఱి యేమున్నది?
నటి:—ఆర్యపుత్రా, ఏ ఋతువునుగూర్చి గానముచేయుదును?
సూత్ర:—వేఁడిల, ఇప్పుడిప్పుడే యవతరించి యుపభోగక్షమమై యున్న గ్రీష్మర్తువు నధికరించి గానము గావింపుము. ఇప్పుడుగదా!

క. జలకేళి యింపగు, వనా
నిలముల్ పాటలముతావి నెఱి బుగులుకొనున్,
సులభంబు నిద్ర నీడల,
బలురమణీయములు దివస పరిణామంబుల్.

నటి:—సరియే. [అని పా

క. కోమ రాండ్రవతంసింతురు
తమకంబున భ్రమరరాజదరచుంబితముల్
సుమృదుల కేసరశిఖముల్
సుమనోలలితలు శిరీషసుమరాజంబుల్.

సూత్ర:—ఆర్యా, చక్కఁగాఁ బాడితివి. ఆహా చిత్తవృత్తులు రాగమునందే నంతటను సభ చిత్తరువో యన నిశ్చేష్టముగా నున్నది. చెప్పుము ఏరూపకముచే గించి యిప్పుడీసభ నారాధింపుదము?

నటి:—వెదకనేల? మొదలనే యార్యమిశ్రు లానతిచ్చిరిగదా, శ్రీమద్ వేంకటరాయశాస్త్రులవారి యాంధ్రాభిజ్ఞానశాకుంతలనాటకమును బ్రయోగింపు

సూత్ర:—ఆర్యా, చక్కఁగా జ్ఞప్తిచేసితివి. ఏతత్క్షణమున దానినెల్ల నేమఱ తిని జుమా, ఏలయన,—

ఆ. రమణి, నీదుగీతరాగంబు హరియింప
నెటకో పోయి యుంటి నెఱుకమాని,
రయము మీఱ నితఁడె రాజు దుష్యంతుండు
హరిణ మపహరింప నరుగుకరణి.

[నిష్క్రమి

## ప్ర థ మా ం క ము.

---

స్థలము I. హిమాలయము నడివారము, అరణ్యము.

[అంత, మృగమును వెంటఁదఱుముచు సారథితోఁగూడ రాజు రథస్థుఁడై ప్రవేశించును.]

సూతుఁడు:—[రాజును జూచి] ఆయుష్మంతుఁడా,

ఆ. జడిసి పఱచు కృష్ణసారంబుఁ జూడంగ,
వన్నెమీఱుధన్వి నిన్నుఁ జూడ,
సవనహరిణకానుసారిఁ బినాకిని
గనులఁ గాంచుచున్నకరణి నైతి. 6

రాజు:—సూతుఁడా, మమ్ము నీసారంగము కడు దూర మాకర్షించినది! ఇది యిపుడును,

(స్రగ్ధర)

శ్రీ మీఱం ద్రిప్పి గ్రీవం జెదరక కనుచుం జేరుపౌ తేరు సారెౕ,
భూమ న్పశ్చార్ధకాయంబు శరభయమునం బూర్వకాయంబుఁదూఱున్,
సామిగ్రస్తాగ్రదర్భల్ శ్రమవివృతముఖస్రస్తముల్ దారి రాలన్,
స్థామోదగ్రప్లుతాప్తిం జదల నధికముౕ స్వల్ప ముర్విం జరించున్. 7

[ఆశ్చర్యపడుచు] ఏమి, నేను వెంబడించుచునే యున్నను నీమృగము నాకంటి కగపడుటయే దుర్ఘట మగుచున్నది!

సూతుఁడు:—ఆయుష్మంతుఁడా, భూమి యెగుడుదిగుడుగా నున్నదని నేను కళ్లెముల బిగియఁబట్టి రథవేగమును మందీకరించితిని. అందువలన మృగము దూరమయినది. ఇదిగో సమభూమికి వచ్చినారము, ఇఁక నీకది దొరకకపోదు.

రాజు:—అటయినఁ గళ్లెములను వదలుము.

సూతుఁడు:—ఆయుష్మంతుని యాజ్ఞ. [రథవేగము నభినయించి] ఆయుష్మంతుఁడా, చూడుము చూడుము, ఇదిగో నిపుడు,

క. వాగె సడలఁగనె, మున్మొయి
సాఁగఁ, జెవులు నిక్క, జల్లిచలనం బుడుగన్,
రేఁగురజము సోఁకక యే,
యీగోడా ల్పఱచు జింకనే దాఁట నరన్. 8

రాజు:—[హర్షముతో] అవును, ఈ గుఱ్ఱములు సూర్యాశ్వములను గూడ
చున్నవి. చూడవా యేమి!

ఉ. చిన్నదివోలెఁ దోఁచు నెది చెచ్చెరఁ గ్రాలు నదే విశాలమై,
పన్నుగ వంకరైనదియె భాసిలు నెంతయుఁ దీరి తిన్ననై,
ఛిన్నము తెంపు వోయి సరిఁ జేరినయట్లగుఁ జేరివేగమం
దెన్నఁగ దవ్వు పజ్జయును నేర్పడ వౌర నిమేషమేనియున్

సూతుఁడా, చూడుము, ఇదిగో దీనిని గూల్చుచున్నాను. [అని బాణమును సంధి

[తెరలో]

ఓహో రాజా, ఆశ్రమమృగ మిది! కొట్టఁగూడదు కొట్టఁగూడదు!

సూతుఁడు:—[ఆలించియు, చూచియు] ఆయుష్మంతుఁడా, నీకును
తాఁకుదూరములో నున్న యీ కృష్ణమృగమునకును నడుమఁ దాపసులు వచ్చుచు

రాజు:—[ఆదరముతో] అట్లయిన గుఱ్ఱములను బిగియఁబట్టుము.

సూతుఁడు:—అట్లే. [అని రథము నా

[అంత, మఱి యిరువురతో వైఖానసుఁడు ప్రవేశించును.]

వైఖా:—[చేయెత్తి] రాజా,

మాలి. వలదు వలదు కోల నైవ ఈ చిన్ని జింకన్,
జెలువపుఁబుష్ప రాశిం జిచ్చు పూరించురీతిన్,
గలఁచిననె విపత్తిం గ్రాఁగులేజింకలా నీ
కులిశనిశితధారాఘోరనారాచ మేయన్!

కావున,

క. తొడిగిన బాణంబును వే
యడఁగింపు మహాత్మ, సేమ మయ్యెడు నీకున్;
అడ లుడుపఁగ మీ శస్త్రము,
పుడమిపతీ, కాదు సాధువుల బాధింపన్.

రాజు:—ఇదిగో, అడఁగించితిని. [అని చెప్పినట్లు చేయు

వైఖా:—బళి, సరిగానున్నది యిది పురువంశ ప్రదీపకునికి నీకు.

క. పురువంశంబునఁ బుట్టిన
నరపతికి దొడ్డతనము న్యాయము నీకున్,

గరుణాకర, నినుఁ బోలెడు
వరగుణునిం బడయు చక్రవర్తిం బుత్త్రున్. 12

ఇతరు లిరువురును:— [చేయెత్తి] తప్పక, పుత్త్రుని చక్రవర్తి కాఁగలవానిని బడయుము.

రాజు:— [ప్రణమిల్లి] పరిగ్రహించితిని బ్రాహ్మణవచనమును.

వైఖా:—రాజా, సమిధలకొఱకు మేము వెడలివచ్చినారము. ఇదిగోఁజూడుము మాలినీతీరమున కులపతి కణ్వమహర్షి యాశ్రమము, కార్యభంగము గాదేని యచటికిఁ బోయి యతిథిసత్కారమును గ్రహింపుము. మఱియు,

క. తాపసులపావనక్రియ
లేపుగ విఘ్నంబు లేక యొసఁగుటఁ జూచున్
గాపాడును గుణకిణధర
మీపాటిగ నీభుజ మని యెఱుఁగుదు వధిపా. 13

రాజు:—కులపతులవా రచట నున్నారా?

వైఖా:— ఇప్పుడే యతిథిసత్కారముకొఱకుఁ గుమారిని శకుంతలను నియమించి వారామెకుఁ బ్రతికూలముగానున్న దైవము ననుకూలపఱుచుటకై సోమతీర్థమునకు విజయంచేసినారు.

రాజు:— కానిండు, ఆమెను సందర్శించెదను. ఆమెయే నాభక్తిని మహర్షికిఁ దెలియఁజేయును.

వైఖా:—మేము పోయెదము. [అని శిష్యులతో నిష్క్రమించును.

రాజు:—సూతుఁడా, గుఱ్ఱములను దోలుము. పుణ్యాశ్రమదర్శనము చేసికొని పవిత్రుల మయ్యెదము.

సూతుఁడు:—ఆయుష్మంతుని యాజ్ఞ. [అని మరల రథవేగము నభినయించును.

రాజు:—[కలయఁ జూచి] సూతుఁడా, చెప్పకయే తెలియుచున్నది తపోవనాభోగ మని.

సూతుఁడు:—ఎట్లు తెలియుచున్నది?

రాజు:—ఏమి, చూడవా? ఇచట,

(స్రగ్ధర)

రాలు న్నీవారము ల్కీరగృహ బిల ముఖస్రస్తముల్ చెట్లక్రిందన్,
రాలున్ బ్రస్నిగ్ధముల్ గారఫలముల నిటన్ వచ్చినారంచుఁ దెల్పున్,
జాల న్విశ్వాస మొప్పన్ సరణి మలఁపకే శబ్దమున్ లేళ్లు సైఁచున్,
గాలు న్వస్త్రాంతాంబుమ ధ్వాల్క జలకణ సరాంకంబులన్ రేవుదారుల్.

మఱియు,

ఉ. కాలువనీ రిటం బవనకంపిత మై కడుగుర్ద ద్రుమాంఘ్రుల్
దూలెను గెంపుసొంపు ఘృతధూమసముద్గతిఁ బల్లవావళుల్,
నాలిగనాలిగా నుపవనంబునఁ గృత్తకుశాంకురంబునన్
లీల నివే చరించు వెఱ లేక యదృచ్ఛఁగురంగశాబముల్.

సూతుఁడు:—సర్వము నుపపన్నముగా నున్నది.

రాజు:—[కొంచెము దూరము పోయి] సూతుఁడా, తపోవనవాసుల కు బాధము కూడదు. ఈదూరముననే రథమును నిలుపుము. నేను దిగియెదను.

సూతుఁడు:—కళ్లెములను బిగియఁబట్టితిని, దిగు మాయుష్మంతుఁడా.

రాజు:—[దిగి] వినీతవేషంబునఁగదా తపోవనములఁ బ్రవేశింపవలయును కైకొనుము. [అని ధనుస్సు నాభరణములను సూతునిచేతి కిచ్చి] నే నాశ్రమ దర్శనము చేసికొని మరలి వచ్చునప్పటికి గుఱ్ఱములవీఁపులను దడుపుము.

సూతుఁడు:—అట్లే చేసెదను. [అని నిష్క్రమిం

[స్థలము II. అచటనే, కణ్వాశ్రమము.]

రాజు:—[పరిక్రమించి చూచి] ఇదె యాశ్రమద్వారము, ప్రవేశించెదను. [ మభినయించుచు, నిమిత్తమును సూచించి.]

ఆ. ఆశ్రమంబు శాంత, మదరెడిని భుజంబు,
ఫలము దీని కిచటఁ గలుగు టెట్లు?
సందియం బి దేల? సమకూడుదానికి
నెసఁగు చుండు దారు లెల్లయెడల.

[తెరలో]

ఇటురండి చెలులారా ఇటురండి.

రాజు:—[చెవి యొగ్గి] ఆహా! ఈవృక్షవాటికకు దక్షిణముగా నెవరో వలె వినఁబడుచున్నవి! అచటికిఁ బోయెదను. [పరిక్రమించి చూచి] ఓహో! మునిక తమతమ ప్రమాణమునకుఁ దగిన కలశములతో గున్న చెట్టులకు నీరుపోయుటకై చున్నారు. [నిరూపించి] ఆహా! వీ రెంత రూపవతులుగా నున్నారు!

క. నానాశుద్ధాంతంబులఁ
గానని యీపన్న ఘాసికన్నల కున్నన్,

హీనగుణము లని త్రోయవె
కాననలత లింకఁ బ్రమదకాననలతలఁ ! 17

ఈచెట్టునీడను నిలిచి వీరిం గనుపెట్టెదను. [అని చూచుచుండును.

[అంత, పైఁజెప్పిన వ్యాపారమున శకుంతల సఖులతోఁ
ప్రవేశించును.]

శకుంతల:—ఇటురండి, చెలులారా, ఇటురండి.

అనసూయ:—సఖీ శకుంతలా, కాశ్యపులు నాయనగారికి నీకన్న నాశ్రమవృక్షమే ప్రియమని నేఁ దలంచెదను సుమా; ఏల యనఁగా, విరజాజిపువ్వవంటి కోమలాంగిని నిన్నుఁగూడ వీనిపాదులకు నీళ్లుపోయ నియోగించినారు.

శకుంత:—నాయనగారి యాజ్ఞయని మాత్రమా ? నాకుఁగూడ వీనిమీఁద సోదరప్రేమ లేదా ? [అని చెట్లకు నీళ్లుపోయుట నభినయించును.

రాజు:—ఏమీ ! ఈకోమలియా కణ్వులవారికుమారిక ! ఆహా ! కాశ్యపులు చక్కని యాలోచన చేయరైరిగదా ! ఈమెనేమి యాశ్రమధర్మమునఁ బెట్టినారు !

ఆ. ఈవపువును సహజలావణ్య రమ్యంబుఁ
దపము సైఁపఁ జేయఁ దలఁచుమాని
జోక నల్లగలువ రేకు లేయంచుతోఁ
సమిధకోయ్యఁ గోయ సంభ్రమించు. 18

కానీ, చెట్లచాటునుండి యీకన్నియం గన్నారఁ జూచెదను.

[అని యట్లె చేయును.

శకుంత:—అనసూయా, ప్రియంవద నిర్దయముగా నాకంచెలవల్కలమును బిగించి ముడివేసినది, నా కిది మిక్కిలి యొత్తుకొనుచున్నది. నీవు కొంచెము సడలింపుము.

అనసూ:—అట్లే. [అని సడలించును.

ప్రియంవద:—[నవ్వుచు] కంచెల యొత్తుకొన్న దని నన్ను దూఱెద వేమి ? నీ పాలిండ్లను విరివిసేయుచున్న నీయౌవనమును దూఱుము.

రాజు:—ఈమె చక్కఁగానే చెప్పినది.

తే. మొల్కముడి యంసమునఁ గ్రాలు వల్కలమ్ము
స్తనయుగళ పరిణాహమ్ముఁ జక్కఁ గప్పఁ
జెలువము నిజంబు లేమేచు వెలుపదాయెఁ
బండుటాకున మఱుఁగు పుష్పంబువోలె. 19

అట్లుగాదు, ఈతరుణిమేనికి వల్కలము కేవల మనుచితమ యయ్యును నలంకారలక్ష్మిని గల్పించుచునేయున్నది. ఏలన,—

చ. కమలము శైవలావృతికిఁ గాంతి దొలంగక తేజమే గన్కు,
హిమకరమండలంబు సిరినే పొరయు న్మలినాంకయుక్తిచేఁ,
రమణను మించు నీయువతి రత్నము వల్కలమే ధరించియు
సుమధురమోహనాంగులకుఁ జొక్కపుభూషణ మేని గాదె

శకుంత:—[ఎదుటఁ జూచి] ఇదిగో ఈపొగడనున్న తెమ్మెరకుఁ గదలు ప్రేళులతో నన్నుఁ ద్వరగా రమ్మని సంజ్ఞ చేయుచున్నది. దీనిని సంభావించెదను.

[అని పరిక్రమించును.

ప్రియం:—సఖి శకుంతలా, ఇచటనే క్షణ ముండుము, నీవు చెంతఁ దీవియతోఁ గూడినదివోలె ఈపొగడ భాసిల్లుచున్నది.

శకుంత:— కావుననేగదా నీవు ప్రియంవదవు.

రాజు:— కేవల ప్రియంవద గాదు, ప్రియ మయినను నిజమే చెప్పినది. ఈ నీతరుణికి,

క. మోవి కిసలయారుణ మిది,
లేవిటపంబులను దొరయుఁ లేనుభుజంబుల్,
పూవుఁబలె లోభనీయము
యౌవనపు న్మోహర మిది యంగములంతన్.

అనసూ:---సఖి శకుంతలా, ఇది బాలసహకారుని స్వయంవరవధూటి, జ్యోత్స్నయని నీవు పేరుపెట్టుకొంటివి ; దీనిని మఱచితివిగదా.

శకుంత:—అట్లయిన నన్నే మఱతును. [లతకడకు పోయి చూచి] సఖీ, రమణీయమైనసమయములో నీలతాపాదపమిథునమునకు వివాహమయినది ; ఎట్లన్న, నవకుసుమయౌవన వనజ్యోత్స్న, స్నిగ్ధపల్లవతచే నుపభోగక్షముఁడీబాలసహకారుడు.

[అని చూచును.

ప్రియం:—[చిఱునవ్వుతో] సఖీ అనసూయా, నీ వెఱుఁగుదువా, ఎందుకు శకుంతల వనజ్యోత్స్న నతిమాత్రముగాఁ జూచుచున్నదో ?

అనసూ:— నే నెఱుఁగను, నీవు చెప్పుము.

ప్రియం:—ఎట్లు వనజ్యోత్స్న యనురూపమైన వృక్షమును బొందినదో తాను ననురూపుఁడయిన వరునిఁ బొందుదునా యని.

శకుంత:—[అనూయతో] నిశ్చయముగా నిది నీమనస్సులోని కోరిక.

[అని కలశమును వంచును.

రాజు:—[ఆత్మగతము] ఈకోరిక దుర్లభముగదా. ఒకవేళ ఈతరుణి నసవర్ణ క్షేత్రజాత యగునా? ఏల సందేహము?

ఆ. సందియంబు లేదు, క్షత్త్రార్హ; తారాక్షణ—
మార్య మీమానంబ యభిలషించె,
సజ్జనులకు వస్తుసందేహములయందుఁ
దమమనఃప్రవృత్తిఁ దన్నివృత్తి. 22

అయినను వాస్తవముం దెలిసికొనియెద.

శకుంత:—[తొట్రుపాటుతో] సఖీ, నీటిసోఁకునఁ గలఁగుచుపడి విరజాజిని విడిచి గండుఁదుమ్మెద నాముఖమువీఁదికి వచ్చుచున్నది.

రాజు:—[సాభిలాషముగాఁజూచి] బళి! బాధనముగూడ నీతరుణియందు రమణీయముగానే యున్నది!

క. ఎందెందుఁ దేఁటి పైకొను
నందందే బెదరి కనుచు నలుకున నేర్చెన్
సుందరి బొమలాటమొదల్
కందర్పుఁడు నేరుపనిమె కనువిభ్రమముల్ 23

[అసూయతోనుం బోలె] మఱియు,—

ఉ. లోలకటాక్షదృష్టమవు, లోఁగక తాఁకెదు వేపథూత్తరన్,
హాళి మృదుస్వనంబున రహస్యము వల్కెదు కర్ణసంగివై,
క్రోలెదు కై విదుర్ప మరుకోత్తలసారము మోవిబింబమున్,
యేల నిజంబుకై చెడితి మేము! కృతార్థమ వీవె భృంగమా!

శకుంత:—సఖులారా, కావుఁడు కావుఁడు, ఈపొగరుఁబోతు తుమ్మెద నన్ను వేధించుచున్నది!

ఇరువురును:—[చిఱునవ్వుతో] మే మెవరము కాచుటకు? దుష్యంతుని బిలువుము. రాజుగదా తపోవనములను రక్షించువాఁడు.

రాజు:—ఇది సమయము నేను వీరి కగపడుటకు. ఎవఁడురా అక్కడ? [అని సగముమాటలో నాలోచించుకొని] నారాజభావము వీరికిం దెలిసిపోవును. మంచిది, యిట్లు పలికెదను.

శకుంత:—ఈపాడుఁదుమ్మెద ఇంకను వదలలేదు. కావున నవలికిఁ బోయెదను. [మఱియొకచోట నిలిచి చూడ్కి నిగిడించి] ఏమి యిది! ఇచటికిని నన్ను వెంబడించుచున్నది!

[అని భ్రమరబాధ నభినయించును

రాజు:—[త్వరగా చెంతకు వచ్చి]

క. ఎవఁడుర వాఁ? డెక్కడరా?
భువిఁ బౌరవుభుజము దుష్టమొత్తున మేలన్,

అవియనిగుంఁజియతోఁ జెన
క వచ్చె ముగ్ధలను మానికన్యామణులార !

[అందఱు రాజును జూచి కొంచెము వెఱఁగ

అనసూ:—ఆర్యా, ఏటి యేమియు లేదు. ఈమాప్రియసఖి, తుమ్మె
పెట్టఁగా, బెదరినది. [అని శకుంతలను

రాజు:—[శకుంతల కభిముఖుఁడై] తపస్సు వర్ధిల్లుచున్నదా ?

[శకుంతల సాధ్వసము చేత బదులు వలుకక

అనసూ:—ఇప్పుడు, అతిథివిశేషలాభముచేత. స్వాగత మార్యునికి. సఖి
పర్ణశాలకుఁ బోయి ఫలములతోడియర్ఘ్యమును గొని రమ్ము. పాద్యార్థ మీజల

రాజు:—ఏల? మీప్రియవచనములచేతనే యాతిథ్య మయినది.

ప్రియం:—అటయిన నార్యా, ఈదట్టంపుఁజెట్లనీడలో నేడాకులయ
మీఁద కూర్చుండి విశ్రామము పొందుము.

రాజు:—కల్యాణులారా, మీరు నీపనిచే బడలియున్నారు.

అనసూ:—సఖి శకుంతలా, అతిథిపర్యుపాసనము మన కుచితము
నికటఁ గూర్చుందము. [అందఱును గూ

శకుం:—[విమర్శతోఁ దనలో] ఏమి యిది ? ఇతనిం గని తపోవన
వికారమునకు పాలగుచున్నాను ?

రాజు:—[అందఱిం గలయఁ జూచి] ఆహా! మీచెలిమి సమవయోరూప
రమణీయముగానున్నది.

ప్రియం:—[జనాంతికము] అనసూయా, ఎవరే యితఁడు, చతురగంభీర
ప్రియమధురభాషణుఁడు ప్రభువుగా నగపడుచున్నాఁడు ?

అనసూ:—[జనాంతికము] సఖీ, నాకును గుతూహలముగా నున్నది
నితనిని. [ప్రకాశము] ఆర్యా, నీమధురభాషణములవలని విశ్వాసము నన్ను
చున్నది. ఆర్యుఁ డలంకరించు రాజర్షివంశ మేది? ఏదేశ మార్యునిఁ బాసి
చున్నది? ఎందుకొఱ కీసుకుమారమూర్తి తపోవనపరిశ్రమమునకుఁ బాత్రీకృత

శకుం:—[ఆత్మగతము] హృదయమా, ఉత్తలపడకుము ఉత్తలపడకు
కోరినదానినే యనసూయ యడుగుచున్నది.

రాజు:—[ఆత్మగతము] నన్ను నే నెట్లు తెలుపుకొందును? ఎట్లు
దును? కానీ, ఈమెతో నిట్లు పలికెదను. [ప్రకాశము] కల్యాణీ, పౌరవ
నన్ను ధర్మాధికారినిగా నియోగించినాఁడు, నే నాశ్రమవాసులనిర్విఘ్నక్రియ
విచారించుకొనుటకై ధర్మారణ్యమునకు వచ్చితిని.

అనసూ:—ఇప్పుడు ధర్మచారులు సనాథులు.

[శకుంతల శృంగారలజ్జ నభినయించును.

సఖులు:—[ఇరువుర యాకారమునుం గని, జనాంతికము] సఖీ శకుంతలా, నాయన యిపు డిచట నుండిన?

శకుంత:—[రోషముతో] ఉండిన నేమి?

సఖులు:—జీవితసరస్వ మేని యిచ్చి యీయతిథిని కృతార్థునిఁ జేయును.

శకుంత:—సఖులారా, పొండి పొండి. మనస్సులో నేమో యుంచుకొని పలుకు మన్నారు. మీమాటలు నేను వినను.

రాజు:—మేమును మీ సఖినిగూర్చి కొంచె మడిగెదము.

అనసూ:—ఆర్యా, అడుగుట యనుగ్రహము గదా

రాజు:—కాశ్యపమహర్షి శాశ్వతబ్రహ్మనిష్ఠు లని ప్రసిద్ధి. ఈ మీసఖి వారి యాత్మజ యెట్లు?

అనసూ:—విను మార్యా: కౌశికుఁ డని గోత్రనామాంకితుఁడు మహాప్రభావుఁడు రాజర్షి కలఁడు.

రాజు:—కలఁడు, వినియున్నాము. పిమ్మట?

అనసూ:—అతఁడు మాచెలిని గన్నతండ్రి. అతఁడు వదలిన యీ మాచెలికి కాశ్యపులు నాయన పెంచుటచేత పెంపుడుతండ్రి.

రాజు:—'వదలిన' అనుటచే నాకుఁ గుతూహల మగుచున్నది. ఆ మూలముగా వినఁగోరెదను.

అనసూ:—విను మార్యా! పూర్వ మారాజర్షి యుగ్రతపంబున నుండ శంకితులై దేవతలు తపోవిఘ్నకారిణిని మేనక యనునప్సరసను బంపిరి.

రాజు:—కలదిట్లు దేవతల న్యులతపస్సునకు వెఱచుట. పిమ్మట, పిమ్మట?

అనసూ:—పిమ్మట వసంతావతారసమయమున నామెయొక్క యున్మాదకారి రూపమును గాంచి, [అని సగము పలికి లజ్జచే విరమించును.

రాజు:—పైది తెలియుచునే యున్నది. నిశ్చయముగా నీచెలి యప్సరస్సంభవ.

అనసూ:—అవును.

రాజు:—యుక్తముగా నున్నది.

ఆ. మానుషీప్రసూత మత్తకాశినియందు
రూపలక్ష్మి యిట్టిసొంపు గనునె!
పరమభవ్యకాంతితరళితం బగుజ్యోతి
మొలచు నెట్లు ధరణి తలమునుండి! 26

[శకుంతల మొగము వాంచి యుండును.

రాజు:—[ఆత్మగతము] నామనోరథమున కవకాశము దొరకినది. కాని, సు సార్థము సఖి పలికిన యీసుందరాంగి వరప్రార్థనను విని నామనంబు ద్వైధీభావ తంబై యున్నది.

ప్రియం:—[చిఱునగవుతో, శకుంతలం జూచి, నాయకుని కభిముఖియై] ఆ మరల నేమో పలుకఁగోరిన ట్లగపడుచున్నావు.

[శకుంతల సఖిని వ్రేలితో బెదరించు

రాజు:—చక్కఁగా గ్రహించితివి. కల్యాణీ, సచ్చరిత్ర శ్రవణలోభముచే యొకటికూడ నడుగఁ గోరుచున్నాను.

అనసూ:—సంకోచ మేల? తపస్విజను లనఁగా అసంకోచముగా నడుగ వారు గారా?

రాజు:—మీ సఖినిగూర్చి యీమాట యడుగనున్నాను?

ఆ. ఈలతాంగి మరుని కెడ మీయక తపంబు
నరుని కిచ్చువఱకె జరుపు నొక్కొ?
మాన కెపుడు నిల్లె మదిరేక్షణాప్తల
హరిణసతులఁ గూడి యలరు నొక్కొ?

ప్రియం:—ఆర్యా, ఈమె ధర్మాచరణమందును స్వతంత్రురాలు గాదు, ఈ దగినవరుని కీయవలయునని కాశ్యపులు నాయనకోరిక.

రాజు:—ఈకోరిక సులభముగా నెఱవేఱఁగలది గాదు. [ఆత్మగతము]

క. డెందమ, కోరుము కోర్కుల,
సందియ మిపు డెడలె; దేని శంకించితి వా
సందీప్తానల మని, తాఁ
కం దగురవణ మది రత్నకందళిక సుమా.

శకుంత:—[రోషముతోనుం బోలె] అనసూయా, నేను బోయెదను.

అనసూ:—ఎందులకు?

శకుంత:—దీని యసంబద్ధప్రలాపముల నార్యగౌతమికిఁ దెలుపుటకు.

అనసూ:—సఖీ, గొప్పయతిథిని సత్కరింపక వదలి స్వచ్ఛందముగాఁ యాశ్రమజనుల కుచితముగాదు.

[శకుంతల ఏమియుఁ బదులాడక బయలు వెడ

రాజు:—[ఆత్మగతము] ఆహా! ఏమి! పోవుచునే యున్నదే! [పట్టుకో రియుఁ, తన్నుఁ దా నాఁపుకొని, స్వగతము] ఆహా కాముకజనచిత్తవృత్తి చేష్టాప్ర ముగా నున్నది! ఎట్లనఁగా, నేను,

ఆ. మునితనూజ నంటి చనఁ దెంపుమై నుంటి,
వినయ మాఁకవెట్ట వెడల కుంటిఁ,
దాఁపుఁ దలఁగ కుంటి, లేనకయే యుంటిఁ,
బోయివచ్చినట్టిపోఁడిఁ గంటి. 29

ప్రియం:—[శకుంతలను బోనీయక నిరోధించి] సఖీ, నీవు పోవుట యుచితము గాదు.

శకుంత:—[బొమలు చిటిలించుచు] ఎందుచేత ?

ప్రియం:—రెండు వృక్షసేచనములు నాకు నప్పుపడియున్నావు. కావున రమ్మా, తీర్చి మఱి పోదువుగాని. [అని యామెను బోనీయక బలాత్కారముగా మరల్చును.

రాజు:—కల్యాణీ, ఈ యబలామణి వృక్షసేచనముచేతనే యలసియున్నది. అట్లే గదా,—

ఉ. కెం పిదె మించె గిండిఁ గొనఁ గేల, వినమ్రము లయ్యె నంసముల్,
కంపిలుచున్న వింకఁ జనుఁగందుకము, లడుదొడ్డ లూరుపుల్,
పొంపిరిఁ గూడెఁ గ్రొంజెమరు మోమునఁ గర్ణశిరీషరోధియై,
సొంపుగ నొంటికేల నిదె సుందరి దిద్దెడు వీఁగుఁగ్రొమ్ముడిన్. 30

కావున, ఈచెలియప్పు నేను దీర్చెదను. [అని యుంగరము నీయ నుంకించును.

[సఖులు నామముద్రాక్షరములను జదువుకొని యొండొరులఁ జూచుకొనుదురు.

రాజు:—నేలుగాఁ దలంపకుఁడు, రాజపరిగ్రహ మిది. నన్ను రాజపురుషుంగా నెఱుంగుఁడు.

ప్రియం:—అట్లయిన నీయుంగర మార్యునివ్రేలిని బాయుట యుచితము గాదు. ఆర్యునిమాటచేతనే యీ మెయప్పు తీఱినది. [కొంచెము ప్రక్కకుఁ దిరిగి] సఖీ శకుంతలా, దయఁగొని యార్యుఁడు, అనఁగా మహారాజే, నీ యప్పు దీర్చి నిన్ను విడిపించినాఁడులే. ఇప్పుడు నీవు పోవచ్చును.

శకుంత:—[ఆత్మగతము] నేను నావశమనయేని. [ప్రకాశము] నీ వెవరవు నన్ను నదలుటకుఁగాని నిరోధించుటకుఁగాని ?

రాజు:—[శకుంతలను జూచుచు ఆత్మగతము] ఈరమణిపై నామన స్సెట్లున్నదో నాపై నీరమణికిని మన స్సట్లేయుండునా ? ఉండ కేమి, నాకోరికఫలించుట కవకాశము కలదు. ఎట్లన,

చ. కలుపదుగాని నాదునుడికారముతోఁ దనచిల్కపల్కులన్,
బలికితినేని నావలనిఁ బాయక వీను లొసంగి తా వినున్ ;
నెలకొనదేనియుం జెలువ నిప్పొలి మన్ముఖ సమ్ముఖీనయై,
కలికిమిటారిచూపులను గానద లాతి నొకించుకేనియున్. 31

[తెరలో]

ఓతాపసులారా తాపసులారా తపోవనజంతురక్షార్థము జాగరూకులరగుఁడు. దుష్యంతమహారాజు వేటకు వచ్చియున్నాఁడు.

ఉ. సందియ మేఁ? మదే తురగశాత ఖురాంకురటంకనిష్పత
త్సాంద్రపరాగపాళి కడసావిరవిప్రభఁ గ్రోలి సేయుచుర్
గ్రందుగఁ గ్రమ్మెడి న్మిడుతలాణునకైవడి బంధురత్నుపా
స్కందితసార్ద్రవల్కలదళంబుల నాశ్రమభూరుహంబులన్.

మఱియు,

శా. గాఢాఘాతపరాహతాన నిరుహస్కంధైకదంతార్థమై,
బాధాకృష్టలతాప్రతానవలయప్రాగ్భార పాదాంధుడై,
ప్రౌఢాకారతపోంతరాయ మన సంభగ్నైణయూథం బిదె
రూఢిం దేని గాంచి భీతిఁ గరి పర్వు ల్వాఱు ధర్మాటవిన్.

[స్త్రీలందఱును చెవియొగ్గి విని, కొంచెము వెఱఁగుపడుదురు

రాజు:—[ఆత్మగతము] అహో, ఇసీ, సైనికులు, నన్ను వెదకుచుఁ దపోవనము నరికట్టుచున్నారు. కానీ, పోయెదనుగాక.

అనసూ:—ఆర్యా! ఈయడవియేనుఁగువృత్తాంతముచే భయ మగుచున్నది. పర్ణశాలకుఁ బోవ మాకు సెలవిమ్ము.

రాజు:—[ససంభ్రమము] కల్యాణులారా, పొండు, మేము నాశ్రమబాధ కలుగకుండునట్లు యత్నించెదము.

[అందఱు లేతురు

సఖులు:—ఆర్యుని సత్కరింపని మేము మరల దర్శన మిమ్మని విన్నవించుకొన లజ్జించుచున్నాము.

రాజు:—కాదు కాదు, మీదర్శనముచేతనే సత్కృతుండ నయితిని.

[శకుంతల మిష పెట్టి తామసించి చెలులతోఁగూడ నిష్క్రమించును

రాజు:—నాకు నగరమునకు మరలుట కుత్సాహము తగ్గినది. అనుచరులం గలిసికొని తపోవనమునకు మిగుల దూరముగాకుండ విడియించెదను. శకుంతలమీఁదినుండి మనస్సును ద్రిప్పుటకు శక్తుఁడనుగాను గదా. ఏలయన,...

తే. నడచు ముందఱ దెసకు నాయొడలు, మదియొ
యపరిచిత మన వెన్కకు నట్టె పఱచు,
శాతవాతాభిముఖనీత కేతనంబు
కరణిని దదీయచీనాంశుకంబుకరణి.

[అందఱు నిష్క్రమింతురు

## ద్వితీయాంకము.

### స్థలము: అడవి, గుడారములయెదుట.

### ప్రవేశకము.

[అంత విషణ్ణుఁడు విదూషకుఁడు ప్రవేశించును.]

విదూ:—[నిట్టూర్పు విడిచి] హా! చెడితినిరా యీరాజునకు మృగయాశీలునికి వయస్యుఁడనై. 'అదిగో లేడి' 'అదిగో నొంటరి' 'అదిగోఁ బులి' అనుచు వేసవిచే చెట్ల నీడలుసున్నయయిన వనశ్రేణులలో మట్టమధ్యాహ్నమందును చెడఁదిరుగుట;... ఆకులు ఊరి కషాయములైన గోరువెచ్చని సెలయేళ్లనీళ్లు త్రాగుట;... కాలనియమము లేక విస్తారము కలుకుపట్లతో తిండి తినుటయు.... ఏమిగ్రహచారము వచ్చినదిరా! రాజువెంట గుఱ్ఱపుదౌడు సేయుటచే నాకీళ్లు గ్రక్కదలి రాత్రి యెల్ల చక్కఁగా నిద్రలేదు. ఇంతలో మిక్కిలి పెందలకడనే లంజాకొడుకులు కుక్కవేటకాండ్రు అడవి నరికట్టు కోలాహలముచే నిద్ర చెడఁగొట్టినారు. ఇంతటితో నయినఁ గష్టము నివర్తింపదాయెను. పుంటిమీఁద బొబ్బ లేచినది! నిన్నఁగదా మేము వెనుకఁ జిక్కియుండఁగా నీ మహానుభావుఁడు లేడిని దఱుముకొని యాశ్రమము సొచ్చి అందు మా దురదృష్టమువలన, తాపసకన్యను,—దానిపేరు శకుంతలయఁట,—చూచినాఁడు. మఱి యిప్పుడు నగరమునకుఁ బోవుమాటను బొత్తిగా స్మరించుటయే మానినాఁడు. ఈవృత్తాంతమునే విశేషముగాఁ జింతించుచుండ నాకన్నులకు తెల్లవాఱినది. ఏమి గతి? యథాచారాలంకృతుని వయస్యుని దర్శించెదనుగాక. [పరిక్రమించి చూచి] వీఁడుగో వయస్యుఁడు, అడవిపువ్వుల దండలు దాల్చిన ధనుర్హస్తలు యవనయువతులు ప్రక్కలంగొలువ, నిటకే వచ్చుచున్నాఁడు! కానీ, అంగభంగవికలునివలె నిలిచెదను. ఇట్లయినను విశ్రామము పొందుదునుగాక. [అని చేతికఱ్ఱ నూనుకొని నిలుచును.

[అంత, రాజు పూర్వోక్తపరివారముతోఁ బ్రవేశించును.]

రాజు:—[ఆత్మగతము]

క. సతి సులభ గా, దెలుఁగుదుర్,
మతి మఱి తద్భావదర్శనంబునఁ *దనిసెన్;
గృతి గాకయె మరుఁ డున్నను
రతి నుభయప్రార్థనము కర మ్మొనరించున్. 35

[స్మితము గావించి] ఇట్లే తాను వలచినవారి చిత్తవృత్తి తనకోరినరీతినే యుండునని తలంచు కాముకుఁడు మోసపోవును. ఎట్లనిన,—

---

* ఆశ్వాసి = "తనిసెన్". పా. "క్రాఁగున్," క్రాఁగున్ = పా. ఆయాసి; అయినను ఉత్తరార్ధమునకు "ఆశ్వాసి"యే అనుగుణము.

మ. నవలా లాతులనుం గనుంగొనియెం దా నన్వోలె నిద్దంబుగా,
సవిలాసంబుగ నా నితంబగరిమ శ్రాంతిన్ జనన్ మెల్లఁగాన్,
అవలం బోవల దన్న నెచ్చెలి నసూయం బల్కె రూక్షంబుగా;
నవి యెల్ల న్బళి నాకుఁ గూర్చి యఁట! యే దస్వార్థమో కామికిన్!

విదూ:—[అట్లే నిలుచుండి] వయస్యా, నాకు కాలుసేతులు కదలకున్న మాటచేమాత్రము విజయివి గమ్ము.

రాజు:—[చిఱునగవుతో] ఎక్కడిది యీయంగభంగము?

విదూ:—ఎక్కడిదా? కన్ను పొడిచి కన్నీళ్లకుఁ గారణ మడుగుచున్నావు!

రాజు:—నీమాట నాకు బోధపడలేదు.

విదూ:—వయస్యా, ప్రబ్బలిచెట్టు మఱుగుజ్జు ననుకరించుట దాని ప్రభావ యేటివడి ప్రభావమా?

రాజు:—ఏటివడియే యందులకారణము.

విదూ:—నాకును నీవు.

రాజు:—ఎట్లు?

విదూ:—ఇట్లు నీవు రాచకార్యములను మాని యిట్టి పెడదప్రదేశములయం వనచరవృత్తినుండఁ జాల్పడితివి. నిజముగా దినదినము ఘాతుకమృగములఁ దఱుముట కీళ్లెడలి నాయవయవములు నావిగాక యున్నవి. కావున, దయ యుంచి ఒకదిన మం నను విశ్రామార్థము నాకు సెలవిమ్ము.

రాజు:—[ఆత్మగతము] వయస్యుఁడో యిట్లు పలికినాఁడు; నామనసుయుఁ గాశ్య కుమారిని దలపోయుచు వేటకు విముఖమై యున్నది. ఏలన,—

ఆ. చాప మెక్కిడియును రోపంబు దొడిగియుఁ
దిగువనేర గుఱికి మృగములపయి,
నడవి నాఁడుదయిత కనుసావాసులై
మురువుఁజూపు సూపుగుఱువులో యని.

విదూ:—[రాజుముఖమును జూచి] దేవా, నీవు మనస్సులో నేమో పెట్టుకొ గొణుఁగుకొనుచున్నావు; నామొఱ అడవిలో నేడ్పుగదా అయినది!

రాజు:—[చిఱునవ్వుతో] మఱి వే తేమి? మిత్త్రునిమాట దాటఁగూడ నిలిచినాఁడను.

విదూ:—కలకాలము బ్రదుకుము. [అని పో నుంకించు

రాజు:—వయస్యా, నిలు నిలు; నావచన మింక ముగియ లేదు.

విదూ:—ఆనతిమ్ము దేవా.

రాజు:—విశ్రమించినపిమ్మట నీవు నిరాయాస మైన యొకానొకపనిలో నాకు సహాయుఁడవు గావలయును.

విదూ:—[ఉత్సాహముతో] ఏమి, మోదకఖాదనములోనా ?

రాజు:—సమయమునఁ జెప్పెదను.

విదూ:—క్షణమును గ్రహించితిని.

రాజు:—ఎవఁడురా అక్కడ ?

దౌవారికుఁడు:—[ప్రవేశించి] దేవా, ఆనతిండు.

రాజు:—రైవతక, సేనాపతిని బిలుచుకొనిరా.

దౌవా:—చిత్తము దేవా. [అని నిష్క్రమించి సేనాపతిని దోడ్కొని వచ్చి] ఆర్యా, ఏలినవా రేమో ఆజ్ఞాపించువారై ని న్నెదురు సూచుచున్నారు. దగ్గఱకుఁ బొ మ్మార్యా.

సేనా:—[రాజును జూచి] వేఁటపలనిదోషములు ప్రత్యక్షములేకాని, యేలిన వారియందు దది గుణమునకే కారణమైనది. ఎట్లన,

మ. ప్రమదాటోపవిజృంభణానిశధనుర్జ్యాస్ఫాలనక్రూరపూ
ర్వము ఘర్మార్కగభస్తికాక్షమము దభ్రస్వేద మస్థూలమూర్
శ్రమజిద్వ్యాయతిమై నలక్ష్యకృశతాసంపర్కముం బ్రాణసా
రము నాగాత్రముతో విభుం డమఱు గిరిభ్రామ్యన్మదేభాకృతిన్. 38

[సమీపించి] దేవా, విజయివి గమ్ము. ఘాతుకమృగములను గదలనీయక యడవి నెల్ల నరికట్టినారము. ఇంకను నేల తామసము ?

రాజు:—సేనాపతీ, వేఁటను నిందించి మాఢవ్యుఁడు మా యుత్సాహమును భంగ పఱిచినాఁడోయి.

సేనా:—[జనాంతికము] మిత్రమా విదూషకుఁడా, నీపట్టు వదలకు, నేను ప్రభు చిత్తము ననువర్తించి పలికెదను. [ప్రకాశము] ప్రేలెడుఁగాక యీమూర్ఖుఁడు. ఈవిష యమున నేలినవారే నిదర్శనము.

శా. మేదశ్ఛేదకృశోదరా త్తలఘిమ స్మే నువ్యమా ర్గాం బగున్,
బ్రాదుర్భూతభయక్రుధావికృతస త్త్వస్వాంతము ల్గాన నౌన్,
గాదో లోలశరవ్యవేధన మహోత్కర్షంబు విల్కానికిన్ ?
వాదింతు ర్వ్యసనంబు వేఁట యఁట, దేవా, వేడ్క యి ట్లెం దగున్!

విదూ:—[కోపముతో] ఏలినవారికి మతి స్వస్థపడినది. నీవుమాత్ర మడవినుండి యడవికిఁ ద్రిమ్మరువాఁడవై మానిసిముక్కుమాంసమున కాసగొన్న - యేదేనొక - ముసలి యెలుఁగుబంటివాతఁ బడు పో.

రాజు:—భద్రా, సేనాపతీ వేయేల ? ఆశ్రమముచెంగట నున్నారము, కావున నీమాట నే నంగీకరింపను. మఱి యిపుడు,—

మ. మడువు ల్లోనచ్చుత దున్న లంబువుల సంస్ఫాలించుచుం శృంగముః
పొడ వానీడలఁ దెంపి లేటికనుపుల్ రోమంథముల్ సల్పుతన్,
పడియం గ్రోచ్చుతఁ గొందలింపక కిరు ల్వర్గంబులై ముస్తలన్,
బడయుంగాక యనజ్యమై యిదియు మా బాణాసనం బూఱటన్.

సేనా:—ఏలినవారి చిత్తము.

రాజు:—అట్లయిన ముందుఁ బోయినవనగ్రాహులను మరలింపుము. తపోవనము దూరముగా వదలునట్లు సైనికులను గట్టడసేయుము. చూడుము.

తే. శమపరాయణు లైనసంయములయందు
దాహకం బొందు ధామంబు దాఁగియుండుఁ,
దాఁక హితమైనభానుకాంతములు వోలె
దాని వెలిఁ గ్రక్కుదురు వేఱుధాను సోఁకఁ.

సేనా:—ఏలినవారియాజ్ఞ.

విదూ:—పోరా వెటేముండాఁకొడుకా ధ్వంసమైనదిపో నీయుత్సాహ[...]తము.

[సేనాపతి నిష్క్రమించు

రాజు:—[పరిజనమును జూచి] మీరు వేఁటవేషము తీసివేసికొనుఁడు. రైవ[...] నీవు పోయి నీపని చూడుము.

దౌవా:—ఏలినవారి యాజ్ఞ. [అని నిష్క్రమించు

విదూ:—ఇప్పుడు నిర్మక్షికము చేసితివి. ఈ చెట్లనీడలో తీవమేలుకట్టు [...] ఈయాసనమునఁ గూర్చుండుము నీవు. నేనును రవంత సుఖోపవిష్టుఁడ నయ్యెదను.

రాజు:—ముందు నడువు.

విదూ:—రారమ్మ వయస్యా. [ఇరువురును బరిక్రమించి కూర్చుందు[...]

రాజు:—మాధవ్యా, కన్నులు గల ఫలమును బొందవైతివి, ఏలయన నీవు [...] నీయమును జూడకపోయితివి.

విదూ:—చూడ కేమి, నీవు నాయెదురనే గదా యున్నావు?

రాజు:—ఎల్లవారును దమదానిం గాంతముగాఁ గందురు. నేనో యాశ్రమల[...] భూతను శకుంతలనుగూర్చి పలుకుచున్నాను.

విదూ:—[స్వగతము] ఇతనికి సందియ్యను. [ప్రకాశము] ఏమి వయస్యా, ఇప్పు[...] తాపసకన్యకకూడ నీకుఁ గోరఁదగినదిగా నగపడుచున్నదా?

రాజు:—మిత్రమా! పరిగ్రహింపరాని వస్తువుపైఁ బౌరవులమనస్సు ప్రవ[...] పదుగదా.

విదూ:—అ ట్లైన నితేమి [...]

రాజు:—

క. సురయువతీమణిసుత యఁట,
వారకిన దఁట తల్లి విడువఁ దోడ్తో మునికిన్,
ఉరలి విరజాజిక్రొన్నన
పరువడి యర్కాంబుమీఁదఁ బడినవిధమునన్. 42

విదూ:—[నవ్వి] వయస్యా, ముద్దఖర్జూరికలతీపు మొగము మొత్తినవానికి చింత కాయమీఁదియభిలాష యెట్టిదో యట్టిదిసుమా స్త్రీరత్న పరిభోగికి నీ కిప్పుడీకోరిక.

రాజు:—నీ వాకోమలాఁగిని జూడలేదు; కావున నిట్లు పలుకుచున్నావు.

విదూ:—నీకుఁగూడ నేని యాశ్చర్యము పుట్టించునో యది నిక్కముగా రమణీయమే గావలయును.

రాజు:—వయస్యా, వేయేల?

చ. చెలువుగ వ్రాసి దిద్ది విధి చిత్తము రంజిల జీవ మిచ్చెనో?
పొలుపులఁ గూర్చి మానసవిభూతిని గౌతుకియై రచించెనో?
మెలఁతుక మేనిఁ జూడఁ బరమేష్ఠిప్రభావము నెంచి చూడ, నా
నెలఁతుక దోఁచు నొండుతరుణీమణిసృష్టి యటంచు నామదిన్. 43

విదూ:—అట్లయిన నిప్పుడు రూపవతుల కెల్ల నిరాకరణము.

రాజు:—నామనస్సులోనిమాట యిది.

ఉ. ఆననితావిపూవు, నఖరాగ్రము సోఁకనిపల్లవంబు, క్రొం
దేనె రసంబు గ్రోలనిది, తీ రయి విద్ధము గానిరత్నమున్,—
మానినిరూపు,—పుణ్యభరమంజుఫలం బనఘం బఖండమున్;
నే నెఱుఁగ న్విరించి యెవనిం బరిభోక్తను గూర్ప నెంచునో? 44

విదూ:—అట్లయినఁ ద్వరితముగా నీమెను నీవు స్వైవసముచేసికొనుము, ఎవని కేని గారనూనెతల కాయవానికి ఆరణ్యకునికి చేతఁ బడకముందే!

రాజు:—అస్వతంత్రురాలు సుందరి. గురువా యిచట లేఁడు.

విదూ:—మంచిది, నీమీఁద నామెనయనానురాగ మె ట్లున్నది?

రాజు:—తాపసకన్యాజనము స్వభావముచే నప్రగల్భము. అయినను,

ఆ. మొోల నేను జూడ వాలుఁజూడ్కి గుదించు,
లేఁత నవ్వి నెపము లీల నెఱపు,
వినయరుద్ధసంభ్రమమున నలరాయనిఁ
జూపదాయెఁ జెలువ దాఁపదాయె. 45

విదూ:—ఏమి! ఆమె నిన్నుఁ జూచినమాత్రాన వచ్చి నీయొడిలోఁ గూర్చు
నా యేమి?

రాజు:—నెచ్చెలులం గూడి తరలునపు డావినయవతి భావమును మిక్కిలి
వరించినది. ఎట్లనిన,—

చ. ఎడపక యొండు రెండడుగులే చని కాలు కుశ గ్రుచ్చె నంచు
బడఁతి యకారణంబ నిలువంబడి తా వెనుచిక్కి నర్థిమైఁ,
గడఁగి ముఖేందువు న్మలఁచి కాంచుచు నా దెస సారెసారెకుఁ
దడసెను గొమ్మల న్వలువఁ దాఁకనిదానినె పీడఁ జేయుచుఁ.

విదూ:—అట్లయిన నీకి నేమి? రాజధానికి బత్తెముగట్టుకో. నాకుఁ దెలి
నీ విపు డీతపోవనమును నీయుద్యానవనమునం జేసికొంటివి.

రాజు:—తపస్వులు కొందఱిచట నున్న నన్నుఁ దెలిసికొనియున్నారు.
హించి చూడుము, ఏవ్యాజమున నింకొకమారైన నాశ్రమమునఁ బ్రవేశింపఁగలము!

విదూ:—వేఱువ్యాజ మేల? నీవు రాజవుగదా.

రాజు:—అయిన నేమి?

విదూ:—నీవారధాన్యమునాఱవపాలు మా కారణ్యకులు చెల్లింపవలసిన దని.

రాజు:—వీరల రక్షించుటచే షష్ఠియొక ఫలము లభించుచున్నది, రత్నరా
నయిన మాని యది కోరఁదగినది; చూడు,—

క. భూపతులకు వర్ణంబుల
కాఁపులచేఁ గలుగుఫలము క్షయ మొందు వేసఁ,
దాపసులు తపములో నిడు
నాపాలాఱవది మాకు నక్షయ్య మగుఁ.

[తెరలో]

ఆహాహా! సిద్ధమనోరథుల మైతిమి.

రాజు:—[చెవి యొగ్గి] అహో ధీరప్రశాంతస్వరము. తపస్వులు గావలయు.

దౌవారికుఁడు:—[ప్రవేశించి] జయము జయము ఏలినవారికి. వీరుగో ఋషి
మారు లిద్దఱు ద్వారదేశమున వచ్చియున్నారు.

రాజు:—ఆలాగా? తత్క్షణము వారిని తోడ్కొనిరా.

దౌవా:—ఇదిగోఁ గొనివచ్చెదను, [అని నిష్క్రమించి ఋషికుమారులతో
గూడఁ బ్రవేశించి] ఇటురండి యిటురండి స్వామీ.

[ఋషికుమారు లిరువురును రాజుం జూచి

ప్రథముఁడు:—ఆహా దీప్తిమంత మయ్యును నెంతవిశ్వసనీయ మీదేహము
ఆశ్చర్య మేమి? ఋషులకన్న నంత వేఱుగాని [illegible] యుపపన్న మే.

ఎట్లన,—

ఉ. ఆదట సర్వభోగ్య మగునాశ్రమమందు రహించు నీతఁడున్
బ్రోదిఁ దపంబుఁ గూర్చుఁ బ్రజఁ బ్రోచుటచే నితఁడున్ సతంబునున్
ఆదివిఁ దాఁకు పావన ముదంచితచారణయుగ్మగీతిచే
నాదిత మీరాజితాత్మమునినామము నెక్కటిరాజపూర్వమై. 48

ద్వితీయుడు:—గౌతమా! ఇతఁడా ఆయింద్రసఖుఁడు దుష్యంతమహారాజు?

ప్రథ:—ఔను.

ద్వితీ.—అట్లేని,—

మ. శరధిశ్యామలసీమ నీవసుమతీచక్రంబు నేవీరుఁ డొ
క్కరుఁడే దానుబురార్గళాభుజుఁడు ఏఁకం బ్రోచు టాశ్చర్యమా?
సుర హేలానతు లర్థిఁ గోరుదురు రక్షోవీరవైరంబులం
బురుహూతాశని మాని యీతనిధనుర్జ్యాభహుంకృతి న్నిర్వృతిన్. 49

ఇరువురును:—[సమీపించి] విజయివి గమ్ము రాజా.

రాజు:—[ఆసనమునుండి లేచి] తమ కిరువురకుఁ బ్రణామ మాచరించుచున్నాను.

ఇరువురు:—నీకు క్షేమమగునుగాక. [అని ఫలముల నొసంగుదురు.

రాజు:—[ప్రణామపూర్వకముగా గ్రహించి] తమయాజ్ఞ నెదురుచూచుచున్నాను.

ఇరువురు:—నీ విచట నునికి యాశ్రమవాసుల కెఱుకపడినది, వారు నిన్ను వేఁడుచున్నారు.

రాజు:—ఏ మాజ్ఞాపించుచున్నారు?

ఇరువురు:—"కణ్వపాదులవా రిపు డిచట లేనందున మాకు రాక్షసు లిష్టివిఘ్నము చేయుచున్నారు. కావున నీవు కతిపయదినములు సారథిద్వితీయుఁడవు నాయుధసహాయుఁడవు నై యాశ్రమమును సనాథీకరింపుము," అని.

రాజు:—మహానుగ్రహము మహానుగ్రహము!

విదూ:—[అపవారించి] వీరియీయభ్యర్థన నీకోరిక కనుకూలముగా నున్నది.

రాజు:—రైవతకా, మామాటగా సారథితోఁ జెప్పుము, బాణకార్ముకసమేతముగా రథమును దోలుకొని రమ్మని.

దౌవా:—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

---

15-పద్యమునందుఁ బాఠాంతరము; ఉత్తరార్థము.

సుర లాలంబున నర్థిఁ గోరుదురు రక్షోవైరసంసక్తులై
పురుహూతాశనికోటి నీతని..................

ఇరువురు:—[హర్షముతో]

ఆ. పూర్వనృపులమార్గమునఁ బోవునీయందు
నింతదొడ్డగాన మి దేమివింత ?
పౌరవులకు నార్తపరిపాలనం బనఁ
దిరుగు లేనిసత్రదీక్ష గాదె.

రాజు:—తమరు ముందు విజయంచేయుఁడు, నేనును వెంటనే వచ్చినవాఁ

ఇరువురు:—విజయివి గమ్ము రాజా. [అని నిష్క్రమింత

రాజు:— మాఢవ్యా, శకుంతలను జూడ నీకుఁ గుతూహలము కలదా?

విదూ:—తొలుత కలుజులు తెగఁ బాఱుచుండినది. ఇపుడు రాక్షసవృత్తాం
చేత నొక బొట్టయిన నవశేషము లేదు.

రాజు:—భయపడకు, నాచెంతనే గదా యుందువు.

విదూ:—ఇదె రాక్షసులనుండి రక్షితుఁడ నైతిని.

దౌవారికుడు:—[ప్రవేశించి] ఏలినవారికి జయము. రథము సిద్ధముగానున్నది,
వారివిజయప్రస్థానము నెదురునూచుచున్నది. మఱియొకటి,—వీఁడుగో నగరమునుండి
కుఁడు దేవులయాజ్ఞను గొని వచ్చియున్నాఁడు.

రాజు:—[సాదరముగా] ఏమి, అమ్మగారు పంపినారా ?

దౌవా:—ఔను.

రాజు:—మంచిది మంచిది రమ్మను.

దౌవా:—చిత్తము [అని నిష్క్రమించి, కరభకునిఁ దోడ్కొని
చూడు, వారుగో ఏలినవారు, దగ్గఱకుఁ బో.

కరభకుఁడు—[దగ్గఱకుఁ బోయి] జయము జయము ఏలినవారికి. దేవు లా
చున్నారు, 'రాఁబోవు నాలవనాఁడు పుత్త్రపిండపాలనము నెడి యుపవాసము
నున్నాము, అందులకు చిరంజీవు లవశ్యము వచ్చి యుండవలసినది,' అని.

రాజు:—ఇటఁ దపస్వికార్యము, అట గురుజనాజ్ఞ; రెండు నలంఘనీయ
ఇందుల కేమి యుపాయము ?

విదూ:—త్రిశంకువువలె నడుమ వ్రేలాడుచుండుము.

రాజు:—నిలుపు పరిహాసము, వాస్తవముగా నాకులపడుచున్నాను.

క. రెండుం గార్యము లొక్కచో
నుండమి నామనము చెదరుచున్నది రెండై,
కొండ యెదురడ్డ నేటిచిరు
ఖండము లై పాఱు తెంచుకై వడి ద్రోఁపఁగ.

[ఆలోచించి] మిత్త్రమా, అమ్మగారు నన్నుఁ బుత్త్రునింగాఁ బరిగ్రహించి యున్నారు, కావున నీ విటునుండి పోయి నేను దాపసకార్యవ్యాపృతుఁడ నని తెలిపి యమ్మగారికిఁ బుత్త్రికార్యమును నిర్వహింపుము.

విదూ:—రాక్షసులకు భయపడితి నని మాత్రము తలంపకుమా.

రాజు:—[చిఱునవ్వుతో] ఓయి మహాబ్రాహ్మణుఁడా, నీయందును నట్టిది సంభవించునా ?

విదూ:—[గర్వముతో] అట్లయిన, రాజుతమ్ముఁ డెట్లు పోఁదగునో అట్లు పోయెదను.

రాజు:—తపోవనోపరోధము తప్పించుటకై పరివారజనము నంత నీతోనే పంపెదను.

విదూ:—అటయిన నిపుడు యువరాజ నయితిని.

రాజు:—[ఆత్మగతము] వీఁడు చపలుఁడు. ఈనావలపును రాణివాసములకుఁ జెప్పినను జెప్పును, వీనితో నిట్లు పలికెదను గాని. [విదూషకునిచేయి పట్టుకొని, ప్రకాశము] వయస్యా, మహర్షి గౌరవముచే నాశ్రమమునకుఁ బోవుటయేగాని, తాపసకన్య శకుంతలమీఁద నా కనురాగ మున్నమాట కొంచె మయినను నిజము గాదు సుమా ; చూడుము,—

క. సరి ! సరి ! మే మెట ? మురుకత
కరి, మృగశిశులసరిఁ బెరుఁగునాటవికి యెట్ల ?
బరిహాసోక్తులు మిత్త్రమ,
పరమార్థం బనుచు మదిని బాటింపకుమా. 52

విదూ:—ఔను. [అని యందఱును నిష్క్రమింతురు.



విష్కంభము.



స్థలము I: మాలినీతీరము.

[అంత, యజమానశిష్యుఁడు చేత దర్భ గొని ప్రవేశించును.]

శిష్యుఁడు:—ఓహో! మహానుభావుఁడు సుమా యీదుష్యంతమహారాజు! మహాత్ముఁ డాశ్రమమందుఁ బ్రవేశించినమాత్రాన మాయాగకర్మలు నిరుపద్రవములై:

క. కంకపత్త్రిముఁ దొడుగుట
కంకించినఁ జెప్పవలయునా? యతఁడు ధను
ర్హుంకారంబునబలె జ్యా
టంకారంబుననె దవ్వడఁచు విఘ్నములన్.

వేదిసంస్తరణార్థ మీదర్భను ఋత్విజుల కర్పించెదను. [పరిక్రమించి, చూ ఆకాశమున] ప్రియంవదా, ఎవరికోస మీతూఁడ్లతోడితామరాకులు పట్టివేసుకొని తయుఁ గొనిపోవుచున్నావు? [వినుట నభినయించి] ఏ మనియెదవు! 'ఎండ తగిలి శకుంతల మిక్కిలి స్రుక్కినది, ఆమెదేహతాపము నార్చుట కొనియా? అట్ల బూనికతోఁ దొడంగుము, ఆమె కులపతికిఁ బ్రాణముగదా. నేనును వైతానికశాం కమును గౌతమిచేత నామెకుఁ బంపెదను. [అని నిష్క్రమించు



స్థలము II: అదే.

[అంత, కామయానావస్థుఁడు రాజు ప్రవేశించును.]

రాజు:—[చింతిల్లుచు నిశ్వసించి]

క. తెల్లంబ తపోవీర్యము
తెల్లమ యాబాల పరవతి యని, యమైనన్
బల్లమునుండి జలముబలె
నుల్లం బటనుండి తొలఁగ నొల్లదు నాకున్.

[మదనబాధ నభినయించుచు] స్వామీ, కుసుమాయుధుఁడా, నీవును జంద్రుఁడు నమ్మఁదగినవారయ్యును నామొకము నెల్ల మోసపుచ్చుచున్నారు. ఎట్లన,—

మ. పుష్పబాణంబులవైతు వీ వనుట గ్లౌ పూరించు మం చంటయున్,
భువి రెండున్ భ్రమము బోంట్లయం దివి మృషాభూతంబు లయ్యెం గటా!
యివతాళించుకరాళిచేఁ గురియు రాకేందుండు గార్చిచ్చులన్,
బుష్పబాణంబులఁ గామ, చేసితివి నీవున్ వజ్రకల్పంబులన్. 55

స్వామీ కామదేవా, నీకు నాపైఁ గనికరము లేదా ? [మదనబాధ నభినయించి] కుసుమాయుధునికి నీ కీతైక్ష్ణ్య మెట్లు గలిగినదయ్యా ? ఆహా, తెలిసినది.

ఉ. మండుచునున్న దిప్పుడును మారుఁడ, నీయెడ రుద్రకోపదు
ష్చండతరాగ్ని వారినిధిగర్భమునన్ బడబాగ్నికైవడిన్ ;
ఒండగు నేని నానచన మొయ్యన వెల్మిడి నయ్యె నిట్టు లు
ద్దండత నీవు మాదృశులఁ దాపమునం బడఁ జేయు టెట్లొకో ? 56

అయినను,

క. అనయం బీమకరాంకుఁడు
మనమున వెతఁ గూర్చువాఁడె మాన్యుఁడు నాకున్,
నను నామదిరాయతలో
చనకొఱ కిట్టు కరుణ మాని చఱచెడిఁ గాన్. 57

దేవా, కందర్పా, ఇట్లుదూఱెడు నాపై నీకుఁ గనికరము కలుగదు.

క. పెనిచితి నేలకొ నేనే
యనంగ, సంకల్పతతుల ననిశము నిన్నే ;
ధనువుఁ దివిచి చెవిఁ దాఁకఁగ
మునుకొని నన్నే శరాగ్రముంచెదు, తగవే ? 58

[ఖేదముతోఁ బరిక్రమించి] యజ్ఞకర్మము ముగిసినది, సదస్యులనుజ్ఞ యిచ్చినారు. ఇప్పు డీబడలిక నెచటఁ దీర్చుకొందును ? [నిశ్వసించి] నాకు దయితాదర్శనమున కన్న శరణ మేమున్నది ? దయితనే వెదకెదను. [సూర్యునిఁ జూచి] ఈ మిడియెండవేళను ప్రాయికముగా మాలినీతీరములయందుఁ దీఁగయిండ్లలో సఖులతోఁగూడ శకుంతల గడపుచుండును. అచటికే పోయెదనుగాక.

ఆ. సుందరీలలామ సూనము ల్గోసిన
తొడిమ లింక నివిగొ ముడుఁగ విచటఁ ;
గ్రాలు నింక నివిగొఁ బాలతో నిద్ద మై
మొల్లముగను జిప్పరుగిలు లిచట. 59

[పరిక్రమించి, స్పర్శసుఖ మభినయించి] ఓహో యీ ప్రదేశము దట్టంపు తెమ్మెరలచే నెంత రమణీయముగా నున్నది!

ఆ. తమ్మి నూఁపియూఁపి యిమ్మాలిసీతరం
గమ్ముఁ జోపిచోపి కమ్మఁజలువఁ
గమ్ముపవను నలపుఁగుమ్మటంగమ్ములఁ
గుమ్మి కౌఁగిలింప నెమ్మి యిచట.

[పరిక్రమించి, చూచి] తప్పక యీ వేతసపరిక్షిప్తలతామండపంబున శకుం యుండును; ఏలన,—

క. మునుదెస నభ్యున్నతముఁ
ఘనజఘనముచేత వెనుకకడ నిమ్నంబుఁ
గన నగు నిదె ద్వారమ్మున
వినూతన మ్మడుగుజాడ వెలఁదియిసుమునన్.

కొమ్మలచాటున నిలిచి కాంచెదనుగాక. అహాహా! ఏమి నేత్రామృతము! నామనోరథప్రియతమ శిలాపట్టముపైఁ బువ్వుఁబాన్పునఁ బవళించియున్నది. చెలు రును జెంత నున్నారు. మంచిది, వీరివిస్రంభాలాపములను వినియెదనుగాక.

[చూచుచు నిలుచుండు

[స్థలము III. అచటనే వేతసగృహము.]

[అంత, చెలులతోఁగూడ, శకుంతల, యథోక్తవ్యాపారమునఁ బ్రవేశించును.]

సఖులు:—[వీవనతో వీచి] సఖి శకుంతలా, తామరాకుగాలి నీకు సుఖము నున్నదా?

శకుంత:—సఖులారా, ఏల నాకు వీచెదరు!

[సఖులు విషాదము నభినయించి, ఒండొరువులం జూచుకొందురు

రాజు:—ఈకోమలాంగి శకుంతల మిక్కిలి యస్వస్థగా నున్నది. [వితర్కముతో ఇదేమి మదనునిదోషమా ఎండదోషమా? ఏదో నిశ్చయ మగపడకయున్నది! [సాభి వముగా చూచి] ఆహా! తీఱినది సందేహము.

మ. గురుశైథిల్యబిసైకకంకణము వక్షోజాతార్పితోశీరముఁ
దరుణీరత్నముమేను స్రుక్కె, నయినన్ దళ్కొత్తుఁ గన్పండుపైఁ
సరియే గావుతఁ గామఘర్మరచితోష్మం; బైన, వేసంగికిన్
దరమే జన్యసుల్రం దొనర్ప నపరాధం బిట్లు కాంతంబుగాన్!

ప్రియం:—[జనాంతికము] అనసూయా, ఆరాజర్షిని దొలుమాఱు చూచినది మొదలు శకుంతల యుత్కంఠితయై గాసిల్లుచున్నది. ఈయస్వాస్థ్య మతనింగూర్చియే కలిగియుండునా?

అనసూ:—[జనాంతికము] సఖీ, నామనంబునను నట్లే తోఁచుచున్నది. మంచిది, కానిమ్ము, నెచ్చెలినే యడిగి చూచెదను. [ప్రకాశము] సఖీ, నిన్నొకమాట యడుగ వలసియున్నది, నీసంతాపము బలీయముగానున్నది సుమా.

శకుంత:—[పుష్పశయనమునుండి సగము లేచి] సఖి, ఏమి యడుగఁగోరెదవు?

అనసూ:—సఖి శకుంతలా, మాకు మదనవృత్తాంతరహస్యములు తెలియవుగదా; అయినను ఇతిహాసనిబంధనములయందు వలవంతం గూరువారియవస్థ నెట్టిదానినిగా విందుమో నీ యవస్థయు నట్టిదిగా నాకగపడుచున్నది. చెప్పుము సఖీ, నీయాయాసమునకుఁ గారణ మేమి? తత్త్వ మెఱుంగక వికారమును వారింప యత్నించు టెట్లు?

రాజు:—నాకుఁ గలిగినయూహ యనసూయకును గలిగినది. నే నొక్కఁడను మాత్రమే తలంచుకొన్నదిగాదు.

శకుంత:—[ఆత్మగతము] నాబిడియము బలీయముగానున్నది. ఏమి చేయుదును! వీరితో నయినఁ దటాలునఁ జెప్పఁజాలకున్నాను.

ప్రియం:—సఖి, చెలి యడిగినమాట చక్కఁగా నున్నది. ఏమి నీయాయాసము నేయుపేక్షించుకొనెదవు! దినదినము నీయంగకము లెల్లఁ గృశించుచున్నవి, నీలావణ్యమొకటిమాత్రము నిన్ను విడువకున్నది.

రాజు:—నిక్కమే పలికినది ప్రియంవద, అట్లేగదా,—

ఉ. చిక్కెను జెక్కుటద్దములు, చిక్కఁదనం బెడలెం జనుంగవన్,
స్రుక్కెఁగరంబు నెన్నడుము, సోలె నితాంతము నంసకంబులున్,
ఎక్కెను బాండిమంబు; మరునేఁపులఁ గొమ్మ యిదు న్వ్రతతిన్
మిక్కిలి పర్ణశోషణసమీరకదర్థితమాధవీక్రియన్. 63

శకుంత:—[లజ్జతో] సఖి, మీతోఁ గాక మఱియెవరితోఁ జెప్పుదును? కాని, మీ కిపు డాయాసము కలిగింతును.

ఇరువురు:—కావుననే నిర్బంధము. మిత్రజనముతోఁ బంచుకొన్నఁగదా దుఃఖము ఓర్వ శక్యమగును?

---

63-వ పద్యమునకు మఱియొకపద్యము.

శా. క్షామక్షామకపోల మాస్య, మురముం గాఠిన్యముక్త స్తనం,
బామధ్యం బతితాంత, మంసకములున్ వ్యానమ్రము, ల్దెల్లు మై;
శ్యామారత్నము వొందె శోచ్యతను ప్రేయఃప్రేక్షణీయాత్మతన్
గామాస్త్రక్షతిఁ బర్ణశోషణమరుత్క్రాంతన్ బలె న్మాధవిన్.

రాజు:—

చ: అడిగినవారు ప్రాణసఖు, లాత్మసమల్, సమఖేదమోదనల్,
పడఁతియు బాల, దాఁప, విదె వల్కు మనోగత మాధిహేతువుఁ
గడుఁదమి వక్త్రము న్మలఁచి కన్నదియు న్నను నాఁడు సారెకుఁ
నడినిముసంబులో నిపుడు నా శ్రవణం బిది తల్లడిల్లెడుఁ.

శకుంత:—[లజ్జతో] సఖి, తపోవనరక్షకుఁ డారాజర్షి నాకన్దోయిం దోఁ
మొదలు—. [అని సగములో లజ్జ నభినయించు

ఇరువురు:—చెప్పవే నెచ్చెలీ చెప్పవే.

శకుంత:—ఆయనపై బాళిగొని యీదశకు వచ్చితిని.

రాజు:—[హర్షముతో] వినవలసినదానిని వింటిని.

క. మరుఁడే కుమ్మునఁ ద్రోయను,
మరుఁడే యాకుమ్ము నార్ప నుతకరి నాకుఁ,
శరదశ్యామల దివసమె
సరవిఁ దపాంతమునఁ బ్రాణి సమితికిఁ బోలెఁ.

శకుంత:—కావున, మీ కనుమత మేని ఎట్లు చేసిన నారాజర్షి నాపైఁ గను
చునో అట్లు సేయుఁడు; కాదేని, నాకు జలాంజలి యిచ్చివేయుఁడు.

రాజు:—విమర్శ కెడ మీయనివచనము.

ప్రియం:—[జనాంతికము] అనసూయా, వెడవిల్తునిబారిం బడి దూఁ
నెచ్చెలి, ఇఁక గాలవిలంబము నోర్వఁజాలదు. ఎవరిపైఁ జెలిమనస్సు నాటుకొ
యతఁడు పౌరవలలామభూతుఁడు, కావున నెచ్చెలికోరిక నంగీకరించి నెఱవేర
యుక్తము.

అనసూ:—[జనాంతికము] సఖీ, నీవు చెప్పినది యుచితమే. [ప్రకాశము]
బళిబళి, నీయనురాగబంధము నీకుఁ దగియున్నది. సాగరమును మాని మహానది
యెందుఁ జేరును ?

ప్రియం:—తీయమావి తప్ప ఘటి యేది చిగిర్చినగురివెందతీవకుఁ దగును ?

రాజు:—విశాఖలు చంద్రరేఖ ననువర్తించుట చిత్రమా ?

అనసూ:—మఱి, యవిలంబముగాను రహస్యముగాను ప్రాణసఖికోరిక నేయు
యుపాయమున నీడేర్పఁగలము ?

ప్రియం:—రహస్య మన్న నాలోచింపవలసియున్నది. శీఘ్ర మన్న సుకరము.

అనసూ:—ఎట్లుగా ?

ప్రియం:—చెలీ, ఆరాజర్షియు నప్పుడు స్నిగ్ధవీక్షణములచే నెచ్చెలిపై
రక్తిని సూచించియేయున్నాఁడు, నానాఁటికి జాగరములచేఁ జిక్కియున్నాఁడు.

రాజు:—[తన్నుఁ జూచుకొని] సత్యము. అట్లే యైయున్నాను.

శా. అంతస్తాపము మీఱ రాత్రుల నశీతాస్రం బపాంగోత్థమై
చింతాజాగరణోపధానమున నీచే జాల్వాఱన్, రత్నముల్
గాంతు ల్వాసినపైఁడి కంకణము జ్యాఘాతాంకనీరోధమై
యెంతేని న్మనికట్టునుండి డిగ నే నెంతే నెగంద్రోయుచున్. 66

ప్రియం:—[ఆలోచించి] ఆయనకుఁ గమ్మవిలుతుజాబు వ్రాయవలయును, దానిని బువ్వులలోఁ దాఁచి దేవతాప్రసాద మని మిషపెట్టి యతనిచేతి కందఁజేయించెదను.

అనసూ:—ఈసుకుమారోపాయము చక్కఁగానున్నది. శకుంతలమనస్సేమో?

శకుంత:—ఏమి మీచిత్తమునకు వేఱు పలుకుదునా?

ప్రియం:—అట్లయిన, నీవెత సుదాహరించుచు నొకమధురపదగుంభనము నూహింపుము.

శకుంత:—నెచ్చెలీ, ఊహింతునుగాని, తిరస్కారభయముచే నా హృదయము తల్లడిల్లుచున్నది.

రాజు:—[హర్షముతో]

ఆ. ఎవనివలన వెఱతు వవమతికై బాల,
వాఁడె నిన్ను వలచి వాఁడె నిట్లు;
సిరిని గోరువాఁడు చెందునో చెందఁడో,
సిరియ గోరునేని చెంద దెవని! 67

ప్రియం:—ఓసి స్వగుణావమానినీ, తాపనిర్వాపణ మగు శరత్కాలంపుఁదఱపి వెన్నెల నెవ్వఁ డుత్తరీయాంచలమున నివారించుకొనును!

శకుంత:—[చిఱునగవుతో] నీవలన నిదిగోఁ గుదురుకొంటిని.

[కూర్చుండి యూహించును.

రాజు:—సమయమునఁగదా ప్రియను మూయమఱచినకనుదోయితోఁ జూచుచున్నాను. అట్లేగదా,—

ఆ. పదము లల్లుచున్న పడఁతుక బొమలత
నొకటి నిక్కఁజేసియున్న మొగము
క్రొంబులకలు గూరుకొన్న చెక్కిటిచేతఁ
బలుకు మత్ప్రణయము భావనలపు. 68

శకుంత:—సఖులారా, గీతిక నూహించితిని, వ్రాఁతసాధనములు లేవే యెట్లు?

ప్రియం:—ఈచిలుకకడుపువన్నె చిన్ని తామరపాకులోఁ గొనగోరుల వ్రాయుము.

శకుంత:—[యథోద్దిష్ట మభినయించి] సఖులారా, వినుఁ డిపుడు, అర్థము తమో కాదో.

ఇరువురు:—చక్కఁగా వినుచున్నాము.

శకుంత:—[చదువుచున్నది.]

క. నీమత మేమో యెఱుఁగను,
కాముఁడు నా కైన రేవగలు నిష్కరుణా,
దీమసము మీఱఁ గ్రాఁచుఁ
నీమీఁదం గోర్కి గొన్న నిఖిలాంగములన్.

రాజు:—[తటాలున చెంతకుఁ బోయి]

ఆ. క్రాఁచుఁగాని నిన్నుఁ, గాముండు నిచ్చలు,
నన్నుమాత్ర మేపునను దహించుఁ;
జందమామ నేఁచుచందాన నేఁచునే
దివస మాకుముద్వతిని శుభాంగి ?

ఇరువురు:—[చూచి హర్షముతో] విలంబింపని మనోరథమునకు స్వాగతము.
[శకుంతల రాజుం గూర్చి లేవ నుంకించు.

రాజు:—వలదు వలదు, ఏల యాయాసము ?

క. సుమశయ్యఁ గమిచి బిసభం
గములఁ దగిలి వాడు వుచ్చి కమ్మ వలుచునీ
విమలాంగము లుపరితా
పము లుపచారాక్షమములు పర్వేందుముఖీ.

అనసూ:—ప్రియమిత్రుఁడు, ఇదిగో నీశిలావేదికాభాగము నలంకరించును.

[రాజు కూర్చుండును. శకుంతల లజ్జతో నొ...

ప్రియం:—వయస్యా, మీ యిరువురకును బరస్పరానురాగము ప్రత్యక్షమే. ...నను, నెచ్చెలిమీఁది ప్రేమ నన్నుఁ బునరుక్తవాదినిం జేయుచున్నది.

రాజు:—కల్యాణీ, ఇది మానఁగూడనిది. ఏలయనఁ జెప్పఁదలఁచినదానిం ...కున్నఁ బశ్చాత్తాపము కలుగును.

ప్రియం:—ఆపన్ను లగుదేశవాసిజనులయాపదను రాజు తొలఁగింపవలయు... మీధర్మము గదా.

రాజు:—అంతకన్న వేఱు గాదు.

ప్రియం:—అట్లయిన, ఈమానెచ్చెలిని నీనిమిత్తముననే కామదేవుఁ డీయ... దెచ్చినాఁడు, కావున దయయుంచి యీమెప్రాణముల నీవు కాపాడవలసినవాఁడవు.

రాజు:—కల్యాణీ, ఈప్రార్థన మా యిరువురకును సమానమే, నే నత్యంత మనుగ్రహింపఁబడితిని.

శకుంత:—[ప్రియంవదను జూచి] సఖీ, రాణివాసములకై విరాళిఁ గూరురాజర్షి నేల నిర్బంధించెదవు?

రాజు:—

తే. నామదిని దీని భవదేకనాయికమును
దన్నివాసిని వీవన్యథారత మని
మదిరలోచన పల్క సమర్థవేని
మదనబాణహతుఁడ నయ్యు మఱియు హతుఁడ. 72

అనసూ:—వయస్యా, రాజులు బహుభార్యులం బెండ్లియగుదు రని విందుము. ఈ మాప్రియసఖి బంధుజనశోచనీయ గాకుండునట్లు నిర్వహింపుము.

రాజు:—కల్యాణీ, వేయేల?

క. ఎన్నిపరిగ్రహములు మా
కున్నను గులమునకు రెండె యొప్పుఁ బ్రతిష్ఠల్
మున్నీరొడ్డాణం బగు
నిన్నేలవిలాసినియును నీమీచెలియున్. 73

ఇరువురు:—సంతసించితిమి.

ప్రియం:—[చూపు నిగిడించుచు] అనసూయా, ఇదిగో నిటునటుఁ జూచుచు బెంగఁబెట్టుకొని లేడిపిల్ల తల్లిని వెదకుచున్నది. రా దీనిని తల్లితోఁ గలుపుదము.

[ఇరువురును వెడలుదురు.

శకుంత:—సఖులారా, ఒంటిగా నెట్లుందును? మీయిరువురలో నొకరు రండి.

ఇరువురు:—లోకము నెల్ల రక్షించువాఁడు నీకడ నున్నాఁడు.

[అని నిష్క్రమింతురు.

శకుంత:—ఏమీ! పోనే పోయిరి!

రాజు:—ఏల యీ తొట్రుపాటు ప్రేయసీ, నీ కొలువుడుగాఁడు నీ చెంతన యుండఁగా?

చ. క్లమథ వినోదిగాఁ జలునగ్రమ్మెడు శీతామరపాకువీవనం
గొామరుగ నీటితెమ్మెరలకోమలసంచలనం బొనర్తునా?
తమిఁ గరభోరుకాండ, నలతామ్రమము నీచరణద్వయంబొడిక
గమిచి ధరించి యల్ల నొడికంబుగ సంవహనం బొనర్తునా? 74

శకుంత:—మాననీయులయెడ తప్పు చేసికొనను. [అని లేచి తరలును.

రాజు:—సుందరీ, పగటివేండ్రము మింకను తగ్గుమొగము గాలేదు, నీయవస్థ యిట్లున్నది.

క. విరిపానుపు వీడ్కొని తా
మరపాకులపయఁటఁ ద్రోచి మానిని, యేలా
నెరయెండలోనఁ బోయెదు
పరిబాధాపేశలాంగ పల్లవములతోఁ ?

[అని యామెను బలాత్కారమున మరలించు.

శకుంత:—పౌరవా, వినయముం గావుము. మదనునిపా లయినను స్వతంత్రను గాను గదా.

రాజు:—భయశాలినీ, పెద్దలవలన భయ మేమి ? మహానుభావుఁడు ధర్మజ్ఞ కులపతి విన్నను నిందు దోష మెంచఁడు. చూడు,—

క. నానారాజర్షి సుతల్
మానుగ గాంధర్వభంగిమై నుద్వాహం
బైనా రనియుం దండ్రుల
చే నందిత లై రనియును జెప్పఁగఁ వినమే ?

శకుంత:—ఆర్యా, ఇప్పటికి నన్నుఁ బోనిమ్ము, మరల సఖీజనము నడిగెదను.

రాజు:—మంచిది, పోనిచ్చెదను.

శకుంత:—ఎప్పుడు ?

రాజు:—

క. కసిగా తెలుఁగనికోమల
కుసుమంబునఁ దేనెఁ దేటికొదమయుఁ బోలెన్
ససి నడఁ యలు నీమోవిని
రస మే సదయముగఁ గ్రోలి రహిఁ వీడ్కొనెదన్.

[అని యామెముఖము నెత్తఁబో
శకుంతల నాట్యముచేఁ బరిహరించు.

[తెరలో]

చక్రవాకవధూటీ, సహచరుని వీడ్కొనుము, రాత్రి సమీపించుచున్నది.

శకుంత:—[చెవి యొగ్గి తొట్రుపాటుతో] పౌరవ, నిశ్చయముగా నా వృత్తాంత మెఱుంగుటకు ఆర్యగౌతమి యిచటికి వచ్చుచున్నది. కావున, కొమ్మలచాటు నుండుము.

[రాజు అట్లే తాను మఱేగి యుండు

[అంతఁ బ్రాతహస్తయై తాపసియు సఖులును బ్రవేశింతురు.]

సఖులు:—ఇటు ఇటు.

గౌతమి:—[శకుంతలను దఱిసి] పట్టీ, నీయంగములతాపము శమించినదా?

శకుంత:—కొంచెము తగ్గినది.

గౌతమి:—ఈ మంత్రించిన దర్భజలముచేత నీబాధ యంతయు శమించును లే. [శకుంతలశిరమున జలము చల్లి] అమ్మా, అస్తమయము కానున్నది. పర్ణశాలకే పోదము రా. [అని బయలువెడలును.

శకుంత:—[స్వగతము] హృదయమా, మొదల సప్రయత్నముగానే మనోరథము లభించినప్పుడు నీ లజ్జాదోషమును మాన వైతివి, ఇప్పుడు విఘటనమైనఁ, బశ్చాత్తాపము పా లైతివి. నీ కికఁ నెట్లు? [ఒకయడుగు నడచి నిలిచి, ప్రకాశము] లతానిలయమా, తాపహరమా, ఇప్పటికి నీయొద్ద సెలవుగొనుచున్నాను, మఱల పరిభోగమునకై కూడెదను గాక. [దుఃఖదుఃఖముగా నితరలతోఁగూడ నిష్క్రమించును.

రాజు:—[మొదలితావునకు వచ్చి నిట్టూర్పు నిగిడించుచు] అహో తప్పవుగదా విఘ్నములు మనోరథసిద్ధులకు!

ఉ. బిత్తరి వ్రేళ్లతో నధరబింబము మాటికిఁ జాటుసేయుచున్,
దత్తఱపాటుతో 'వలదు, తాళుఁడ,' యన్ప్రతిషేధవర్ణముల్
చిత్తము ముచ్చిలన్, బుజముసేర్చిననెమ్మొగ మెట్టకేని నే
నెత్తియు, సార! ముద్దుగొనకే విడనాడితిఁ బక్ష్మలేక్షణన్! 78

ఎచటికిఁ బోదును? కానిమ్ము, ప్రియతమ భోగించి విడిచిన యీ లతాగృహమందు గడియసే పుండెదను. [అంతటఁ గలయఁ జూచి]

చ. పొలఁతుక మేన నొత్తినపువుందలిమం బిది యావితర్దికన్,
నళినిదళి న్నఖార్పిత మనంగుని జాబిది క్లాంతతం గనన్,
వలయబిసం బి దాకయిని జాసిన దం చొగిఁ జూపువేఁడు త్రై
వెలువడనేర సార! వెస వేతసగేహము, శూన్య మైననున్! 79

[తెరలో]

ఓహో రాజా,

శా. సాయంకాలవిధేయ మాసవనము న్సాగింపఁగా నంతలో
స్థాయచ్ఛింబము లై హుతాశనవిరాజద్వేదికిం జుట్టురాన్
భూయిష్ఠంబు భ్రమించు భీషణగతిన్ భూరిప్రకారంబులన్
ఛాయారూపములం బలాశిగణము ల్సంధ్యాభ్రభూమ్రచ్ఛవిన్.

రాజు:—[విని] ఇదిగో వచ్చితిని. [అని నిష్క్రమించును.

## విష్కంభము.

[స్థలము. కణ్వాశ్రమము, ఉటజముచెంతఁ బూఁదోఁట.]



[అంతఁ గుసుమాపచయ మభినయించుచు సఖులు ప్రవేశింతురు.]

అనసూ:—సఖి ప్రియంవదా, మనశకుంతల గాంధర్వవిధానముచే వివాహి తగినభర్తను బొందిన దని నాహృదయ మానందమయ మై యున్నది, కాని, ఒక బాధించుచున్నది.

ప్రియం:—ఏ మది ?

అనసూ:—రాజర్షి యిప్పుడు యజ్ఞము ముగియఁగా ఋషులు సెలవీయఁ నగరముఁ జేరి రాణివాసములం గూడి యిచటి యీవృత్తాంతమును స్మరించునో పడునో యని.

ప్రియం:—దిగులుపడకు. అట్టిప్రకృతి గుణవిరోధిని గానేరదు. నాయన డీవృత్తాంతమును విని ఏ మనుకొనునో యెఱుఁగనే.

అనసూ:—నాకుఁ దోఁచుచున్నది, నాయన కిది యనుమతమే యని.

ప్రియం:—అది యెట్లు ?

అనసూ:—గుణశాలికి శకుంతల నియ్యవలయు నని గదా నాయనకు ముఖ్య ల్పము, ఆపనిని దైవమే చేసినయెడల నాయన ఆయాసము లేకయే కృతార్థుఁడుగదా!

ప్రియం:—[పూలబుట్టను జూచి] సఖి, పూజకుఁ జాలవా యీకోసినపువ్వు

అనసూ:—ఏమే, శకుంతలయొక్క సౌభాగ్యదేవతను బూజింపవలసియుండ

ప్రియం:—సరియే సరియే. [మరలఁ బువ్వులు గోయ నారంభించు

[తెరలో]

ఓహో, ఇదిగో నేను వచ్చియున్నాను.

అనసూ:—[విని] అతిథులు తెలుపుకొనున ట్లున్నది.

ప్రియం:—శకుంతల యున్నదిగదా పర్ణశాలలో ?

అనసూ:—దేహముచేత నున్నదిగాని మనస్సుచేత లేదు.

ప్రియం:—చాలు నీపాటిపువ్వులు. [అని తరలు

[తెరలో]

హా! అతిథిపరిభావినీ !

ఉ. ధ్యానము సేసె దెవ్వని ననన్యపరాయణమానసాబ్జ వై
కానక న న్తపోధనుని గ [illegible] నా

బో! నలినాక్షి, నిన్నతఁడు బోధితుఁ డయ్యు స్మరింపఁ డెట్టులున్
బానమదావిలుండు తొలి వాసిగఁ జేసినబాసకై వడిన్ ! . 81

అనసూ:—అయ్యో! అదే అయినది. ఎవరినో పూజార్హునిఁగూర్చి శకుంతల శూన్యహృదయ అపరాధిని యైనది. [ఎదురం జూచి] అయ్యో, ఎవరో గాఁడే దుర్వాసుఁడే సులభకోపుఁడే! ఈమహర్షి అట్లు శాపము పలికి తీవ్రదుర్వారగమనుఁడై వెడలి పోయెనే! నిప్పు దప్ప మఱి యేది కాల్చును! పద నీవు, అతని పాదములలోఁ బడి యతనిని మరలింపుము. ఇదిగో నే నర్ఘ్యోదకము గొని కలసికొనెదను.

ప్రియం:—అట్లే. [అని నిష్క్రమించును.

అనసూ:—[ఒక యడుగు వెట్టి తడఁబాటు నభినయించి] అయ్యో, దిగులుతొందరచే కాళ్ళు తడఁబడి నాచేతిపూలబుట్ట నేలఁ బడిపోయినది.

[అని పువ్వులను ప్రోగుచేయును.

ప్రియం:—[ప్రవేశించి] సఖీ, స్వభావకుటిలుఁ డతఁడు, ఎవరు బతిమాలిన మెత్తపడును! ఎంతో వేఁడఁగా రవంత కనికరించినాఁడు.

అనసూ:—[చిఱునగవుతో] ఆరవంతయు నతనియందపరిమితమే. చెప్పుము చెప్పుము.

ప్రియం:—నే నెంత బతిమాలుకొన్నను అతఁడు మరలఁడాయెను. అంత నే నిట్లు విన్నవించుకొంటిని.

అనసూ:—ఏ మని?

ప్రియం:—'స్వామీ, మునుపటిభక్తిని దలంచి, తమ ప్రభావ మెఱుఁగని యీకొమారిత చేసిన యీమొక యపరాధమును దమరు మన్నింపవలయును,' అని.

అనసూ:—అంతట?

ప్రియం:—అంత నతఁడు 'నామాట తప్పఁగూడదు. ఆనవాలు చూడఁగానే శాపము నివర్తించునుబో,' అని పలుకుచునె యంతర్ధానమాయెను.

అనసూ:—ఇప్పుడు కొంచె మూఱడిలవచ్చును. ఉన్నది, ఆరాజర్షి తరలినప్పుడు తనపేరు చెక్కినది జ్ఞాపకార్థ మని శకుంతల వ్రేలనుంచిన ముద్దుటుంగరము. ఆ సాధనము సిద్ధముగా శకుంతలచేతనే యున్నదిగదా.

ప్రియం:—రా మఱి, చెలికొఱకు దేవకార్యమును నిర్వర్తింతము.

[అని పరిక్రమింతురు.

ప్రియం:—[చూచి] అనసూయా, చూడవే, అదిగో నెచ్చెలి, ఎడమకేల నెమ్మొగం బుంచికొని వ్రాసినబొమ్మవలె నున్నది. వల్లభునిమీఁదిచింతచే సఖి యిపుడు తన్నే తా నెఱుంగదు, అ[illegible]?

అనసూ:—ప్రియంవదా, ఈవృత్తాంతము మన యిరువురయందే యుండనీ. ప్ర
వేళలను సఖిని మనము రక్షింపవలయుఁ గదా.

ప్రియం:—ఇట నెవరు విరజాజిని వేన్నీళ్లఁ దడుపుదురు? [అని నిష్క్రమించు

## చతుర్థాంకము.

### స్థలము I. అదే, ఉటజము.

[అంత నిద్రమేల్కొని శిష్యుఁడు ప్రవేశించును.]

శిష్యు:—వేళ చూడు మని న న్నాజ్ఞాపించినారు కాశ్యపమహర్షి పాదులు
ప్రవాసమునుండి వచ్చినారు. వెలుపలికిఁ బోయి చూచెదను, రాత్రి యింక
శేషించి యున్నదో. [పరిక్రమించి, చూచి,] అహో! తెల్లవాఱిపోయినదే!
గదా,—

చ. చరమగిరిప్రపాతమున జాఱెడి నోషధికాంతుఁ డొక్కచో,
నరుణపురస్సరుం డయి సహస్రకరుం డుదయించె నొండుచో
నిరువురకు న్మహానిధుల కెక్కట నొవ్యసనోదయంబులన్
బరినియతంబు లౌ బలె జనంబులు నాత్మదశాంతరంబులన్.

మఱియు,—

శా. కాంతుం డిందుఁడు గానరా కరుగ నాకహ్లారిణీకాంతయే
కాంతిం గోల్పడి యుంచుకే నిడదు నాకన్దోయి కానందమున్
ఎంతేనిం దరుణీజనంబునకు నాత్మేష్టప్రవాసంబునన్
సంతాపంబు నితాంతదుస్సహము సంశాంతింప దొక్కింతయున్

[అనసూయ పటాక్షేపముగాఁ బ్రవేశించును.]

అనసూ:—అక్కటా! చివర కేమయినది! విషయభోగ పరాఙ్ముఖమయిన
జనమునకుఁ గూడ స్పష్టముగాఁ దెలియుచున్నదిగదా. అట్టి యారాజు శకుంతల
యమై యెంత యన్యాయ్య మొనర్చినాఁడు!

శిష్యు:—పోయి హోమవేళ సమీపించిన దని గురువులవారికిఁ దెల్పెదను.
[అని నిష్క్రమించు

అనసూ:—ఎటింగియు నే నేమి చేయఁగలను? ఉచితకృత్యములయందుఁ
నాకాలు సేతు లాడకున్నవి. మన్మథునికోర్కి యిప్పుడు తీఱునుగాక! ఈ దురా
డసత్యసంధుఁ డయిన యారాజునందు శ్లేషమ శకుంతల ... వేళ పెట్టినాఁడు.

కాక, ఒకవేళ దుర్వాసులశాపము రాజుమతి నిట్లు మార్చియుండఁబోలును. కానిచో, ఆరాజర్షి యట్టివి పలికి యిన్నాళ్లకు జాబయినను బంపకపోవునా ? కావున జ్ఞాపకార్థ మిచ్చినయాముద్దుటుంగరము నతనికడకుఁ బంపించెదను. దుఃఖశీలు లగుతాపసజనుల ప్రార్థన నెవరు నెఱవేర్పుదురు! మఱి, కాశ్యపులునాయన ప్రవాసమునుండి వచ్చినారు. నాయనతో 'దుష్యంతవివాహిత యై శకుంతల యంతర్వత్ని యై యున్న'దని చెప్పుటకుఁ బలుమాఱు పూనుకొందును గాని, నెచ్చెలిమీఁది కీడప్పు వచ్చు నను భయముచేఁ జెప్పఁజాలకున్నాను. అకటా, ఈయసందర్భములలో మే మేమి చేయుదుము ?

[ప్రియంవద హర్షముతో ప్రవేశించును.]

ప్రియం:—సఖి వేగిరపడు వేగిరపడు, శకుంతలకు ప్రస్థానమంగళమును జరిపింతము.

అనసూ:—సఖి, ఇది యెట్లు కలిగినది ?

ప్రియం:—ఇప్పుడే శకుంతలయొద్దకుఁ బోయి 'సుఖముగా నిద్రపోయితివా' యని యడుగుచుంటిని.

అనసూ:—అంతట ?

ప్రియం:—అంతలో నెచ్చెలిని లజ్జచే తలవాంచియున్న దానిని కాశ్యపులు నాయన వచ్చి కౌఁగిలించికొని యిట్లు సెలవిచ్చినారు. "దృష్టిని పొగ యడ్డగించినను యజమానునియాహుతి యగ్నిలోనే పడినది. అమ్మా! సుశిష్యుని కిచ్చినవిద్యవలె నశోచనీయవైతివి నాకు, రాజర్షి పరిణీతను నిన్ను భర్తయొద్ద కిప్పుడే పంపెదను." అని.

అనసూ:—మఱి కాశ్యపులునాయన కీవృత్తాంతము నెవరు చెప్పినారు ?

ప్రియం:—నాయన యగ్నిహోత్రగృహమునఁ బ్రవేశింపఁగానే యశరీరవాణి ఛందోమయవాక్కున నిట్లని చెప్పినది.

అనసూ:—[ఆశ్చర్యముతో] చెప్పవే చెప్పవే.

ప్రియం:—

ఆ. భువనములకు నెల్ల భూతిగా దుష్యంత
రాజనిహిత మైన తేజమొంది
యెసఁగువరతనూజ నెఱుఁగు మోముని వర్య
జ్వలనగర్భ యైనజమ్మిఁబోలె. 84

అనసూ:—[ప్రియంవదను కౌఁగిలించి] సఖి, ఎంతో సంతోషముగానున్నది, ఎంతో సంతోషముగానున్నది. కాని, శకుంతల నిప్పుడే పంపుదురని వగపు గలసి యున్నది.

ప్రియం:—సఖి, మనము క్రమముగ మనవగపు నణఁచుకొందము, పాపము శకుంతల యూఱడిల్లునుగాక.

అనసూ:—మంచిది. మఱి మామిడికొమ్మకు వ్రేలఁగట్టిన యీ టెంకా ణీలో పొగడదండ నొకదానిని, చెలికోసమే, చిరకాల ముండుదానిని నేను పెట్టి న్నాను. దానిని నీవు చేత సిద్ధముగా నుంచుకో. ఇంతలో, నేనును చెలికి గోరోచ తీర్థమృత్తిక గఱికచిగుళ్ళు—వీనితో మంగళాంగరాగము రచియించెదను.

ప్రియం:—మంచిది. అట్లే చేయుఁదము. [అనసూయ నిష్క్రమించును

[ప్రియంవద నాట్యముచేఁ బూలబుట్ట నందుకొ

[తెరలో.]

గౌతమీ, శకుంతలను దోడ్కొని పొమ్మని శార్ఙ్గరవాదులను హెచ్చరించు

ప్రియం:—[విని] అనసూయా, వేగిరింపుము వేగిరింపుము, ఇదిగో హస్తినాపు నకుఁ బోవలసిన ఋషుల నప్పుడే పిలుచుచున్నారు.

[అంత నంగరాగము చేతఁ గొని యనసూయ ప్రవేశించును.]

అనసూ:—సఖి, రావే మఱి, రావే మఱి, పోదము.

[అని పరిక్రమించు

ప్రియం:—[చూచి] ఇదిగో ప్రియసఖి; ఆహా సూర్యోదయవేళకే ప్రియ శిరసంటి జలక మార్చి కూర్చుండఁబెట్టి మునిపత్నులు నీవారాక్షతలు కేల నుంచి స్వస్తివాచనము చెప్పి దీవెన లొసంగుచున్నారు. దగ్గఱకుఁ బోదము.

[అని యిరువురును పరిక్రమించి

[అంత, యథోక్తవ్యాపార శకుంతల ప్రవేశించును.]

మునిపత్ని యొకతె:—[శకుంతలం గూర్చి] పుత్త్రీ, భర్త్రుబహుమాన ముగా మహాదేవీపదమును బొందు.

మఱియొకతె:—పట్టీ, వీరునిఁ గుమారునిఁ బడయుము.

ఇంకొకతె:—వత్సా, భర్తకు బహుమత వగుము.

[ఇట్లు దీవన లిచ్చి గౌతమి తప్ప నిష్క్రమింతు

సఖులు:—[సమీపించి] సఖి, నీకు సుఖస్నాన మైనదా?

శకుంత:—రండి నెచ్చెలులారా రండి. ఇదిగో నిటు గూర్చుండుఁడు.

ఇరువురు:—[మంగళపాత్రములను జేతఁగొని, కూర్చుండి] సఖి శకుంతలా, ముగా నుండు. ఇదిగో నీకు మంగళాంగరాగ మలందెదము.

శకుంత:—దీనిని నేను మిక్కిలి గారవించుకొనవలసినది. ఇఁక నాకు సఖీ నము దుర్లభముగదా యగును.

[అని కన్నీ ళ్ళు విడుచు

సఖులు:—సఖి, మంగళకాలమందు నీ వేడువవచ్చునా?

[అని కన్నీళ్లు తుడిచి, నాట్యముచే నలంకరించు

ప్రియం:—సఖీ, ఆభరణార్హమయినమే నిది యాశ్రమసులభములగు నీకై సేతలచే వికారపడుచున్నది.

[అంత, ఉపాయనపాణులై యిరువురు ఋషికుమారులు ప్రవేశింతురు.]

ఋషికుమారులు:—ఇవిగో నలంకారములు. అలంకరింపుఁడీమెను.

[అందఱును జూచి యాశ్చర్యపడుదురు.

గౌతమి:—ఓరీ నారద, ఎక్కడివిరా యివి?

ప్రథముఁడు:—కాశ్యపులునాయన ప్రభావమువలన,

గౌతమి:—ఏమి మానసిక సృష్టియా?

ద్వితీయుఁడు:—కాదు కాదు. వినుండు. మమ్ముఁ గాశ్యపులవా రాజ్ఞాపించినారు, శకుంతలకోసము చెట్లనుండి పువ్వులుకోసి తెండని. అంత నిపుడు,—

ఉ. కౌముదు లీనువీణమును గట్న మిడెం దరు వొండు భద్రముర్,
భూమిజ మొండు పాదములఁ బూయఁగ సోయగమూనలక్తముర్,
ఆమణిబంధనిర్గతము లన్యముల న్నవపల్లవోద్భిదా
శ్రీమతమ్ము ల్వనేందిరల చేతలము ల్మణిభూషణంబులర్. 85

ప్రియం:—[శకుంతలను జూచి] ఈయనుగ్రహము భర్తృగృహమందు నీ వనుభవింపఁబోవు రాజ్యలక్ష్మిని సూచించుచున్నది. [శకుంతల లజ్జ నభినయించును.

ప్రథముఁడు:—గౌతమ, రారా, ఏటిలో స్నానముచేయుచుండురు కాశ్యపులు నాయన, పోయి వారికి వనస్పతులసేవను విన్నవింతము.

ద్వితీయుఁడు:—మంచిది, రా మఱి. [అని. నిష్క్రమింతురు.

అనసూ:—మే మింతవఱకు భూషణముల నుపయోగించి యెఱుఁగము, అయినను చిత్తరువువ్రాత యలవాటునుబట్టి నీయంగకములం దాభరణవినియోగము చేసెదము.

శకుంత:—ఎఱుఁగుదును మీ నేర్పు.

[ఇరువురు నాట్యముచే నలంకరింతురు.

[అంత స్నాతోత్థితుఁడై కాశ్యపుఁడు ప్రవేశించును:]

కాశ్య:—

ఉ. ఖుందు ఝనించె నేఁగెడు శకుంతల యిప్పుడె యంచు, బాష్పపుం
గ్రందు నడంప లో నెలుఁగు గాడ్పడెఁ, జింతకుఁజూపు ప్రమాన్పడెర్;
వందుర నిట్లు ప్రేమ వనవాసినె నేఁ దముఁ బాసి క్రొత్తగా
నందన లేఁగ నావగ మనంబున నెట్లు గృహస్థు లోర్తురో!

[అని పరిక్రమించును.

సఖులు:—సఖీ, శకుంతలా, అలంకరించుట అయినది, మఱి లేచి యీ క్షౌ
మయుగళమును ధరింపుము. [శకుంతల లేచి ధరించు

గౌతమి:—పట్టీ, వీఁడుగో మీ నాయన, ఆనందము వెల్లివొడుచు నేత్రములతో
నిన్నుఁ గౌఁగిలించుకొనువాఁడుంబోలె వచ్చియున్నాఁడు. ఆచారము జరుపుము.

శకుంత:—నాయనా, నమస్కారము చేయుచున్నాను.

కాశ్య:—పట్టీ,

క. పతికి బహుమతవు గమ్మా
యతులిత శర్మిష్ఠ యలయయాతికిఁ బోలెన్,
సుతుఁ గల్యాణీ నీ వా
సతి పూరునిఁ బోలెఁ బొందు సమ్రాట్ప్రభువున్.

గౌతమి:—మహానుభావా, యీ రెండును రెండు వరములుగాని యాశీర్వచ
ములు గావు.

కాశ్య:—అమ్మా, రా. ఇట నిపుడే హోమమైన యీయగ్నులకుఁ బ్రదక్షిణ
చేయుము. [శకుంతల ప్రదక్షిణించును, అందఱును పరిక్రమింతురు

కాశ్య:—[ఋక్ఛందస్సున నాశీర్వదించును.]

శిఖ. ఇవే వేదిన్ సంక్లప్తవిరచితధిష్ణ్యేద్ధములు లవి
ప్రవిఘ్నంబు ల్నిష్ఠాపితసమిధము ల్ప్రాంతకుశముల్
హవిర్ధూమామోదాహతదురితముల్ ప్రార్థితశుభా
దవీయంబు ల్నిన్ గాచుత సతము వైతానికశిఖుల్.

ఇపుడు తరలుము. [చూడ్కి నిగిడించి] వా రేరీ, శార్ఙ్గరవుఁడును గడమవా

[శిష్యులు ప్రవేశింతురు.]

శిష్యులు:—స్వామీ, ఇదిగో వచ్చియున్నాము.

కాశ్య:—శార్ఙ్గరవా, మీ చెల్లెలికి దారి నడుపు.

శార్ఙ్గరవుఁడు:—అమ్మా! యిటురా యిటురా.

[శకుంతల పరిక్రమించు

[స్థలము II. అదే, మార్గము.]

కాశ్య:—దేవతాసాన్నిధ్యశోభితముల రగు నోయాశ్రమ వృక్షములారా,

ఉ. త్రాగ దెవర్తె డస్సినదె తానిడకుండ జలంబు మీకు ముం
ద్గా గయిసేత నొంపదొ దానేద కూరిమి మీ ప్రవాళము

సాగును బండు వెన్వ తెరు౯ జయ్యన మీాతో లుపూవుసూతిచే,
నేఁగెడు నాశకుంతల యిదే మగనింటికి పేదుకొల్ప రే. 89

[కోయిలకూఁతను సూచించి]

క. అనుమతి యొసఁగె శకుంతల
కనుఁగు ల్వనవసతిబంధు లవనీరుహముల్
నునుఁగోయిలకూజితమున
విన రే యిదె బదులు వల్కెఁ బ్రేమ దొలంక౯. 90

[ఆ కా శ ము న]

చ. అవిరతిఁ బద్మినీహరిత లా సరసు ల్గనువిందు సేయఁగా
సవిధమున న్నమేరుతరుజాలము భానుకరాళిఁ దోలఁగా
సువిమల మై కుశేశయరజోమృదుమంజుధరాపరాగ మై
శివ మిడు బాల త్రోవ హితశీతలశాంత సమీరకాంతమై. 91

[అందఱు నాశ్చర్యముతో వినుదురు.

గౌతమి:—పట్టీ, ఇదిగో నీపై సోదరీస్నేహము గల యీతపోవనదేవతలు నీకు సెలవిచ్చినారు; నమస్కారము చేయుమమ్మా మహాత్ములాంద్రకు.

శకుంత:—[ప్రణమిల్లుచుఁ బరిక్రమించి, జనాంతికము] సఖీ, ప్రియంవదా, ఆర్యపుత్త్రదర్శనోత్కంఠిత నయినను ఆశ్రమమును విడిచిపోవ ముందటికి నాకాళ్లాడకున్నవి.

ప్రియం:—తపోవనమును విడువలేక సఖిమాత్రము దుఃఖించుట గాదు, నిన్నెడఁబాయనున్న యీ తపోవనంబును నీతో సమానావస్థలో నున్నది చూడు.

ఆ. కుశకబళము జార్చుకొనె నీమృగంబులు,
నృత్త ముజ్జగించె నెమలిగములు,
బాష్పవృష్టిఁ గురియ బంధురంబుగ లతల్
పండుటాకు లూడ్చు వ్యాజమునను. 92

శకుంత:—[స్మరించుకొని] నాయనా, నాతీఁగచెల్లెలిని వనజ్యోత్స్నను జూచి సెలవు పుచ్చుకొనియెదను.

కాశ్య:—ఎఱుఁగుదును నీకు దానియందుఁ గలతోఁబుట్టుచెలిమిని. ఇదిగో నిక్కడనే కుడివైపున నున్నది.

శకుంత:—[తీఁగయొద్దకుఁ బోయి] వనజ్యోత్స్నా, సహకారునిఁ గూడియున్నను, నన్నుఁ గౌఁగిలించుకొమ్మా యిటుసాఁగిన యీకొమ్మచేతులతో; ఇది మొదలు నీకు దూరవర్తినినిగదా అయ్యెదను.

కాశ్య:—పట్టీ,

శా. సంకల్పించితి నీకు నెవ్వని సముగ్ సత్కర్మపక్తి న్నిరా
తంక ప్రాభవుఁ గూడి తీ వతనినే త్రైలోక్యవీరుగ్ వరుగ్,
సంకీర్త్యున్నహకారుఁ గూడి కనె స్వాస్థ్యం బీవనజ్యోత్స్నయుఁ
గ్రుంకెగ్ దానిని నిన్నునుంగుఱేచి నాకుం జింత యి ష్ఠార్క...

అమ్మా, ఇఁక రా, ఇదిగో దారి.

శకుంత:—చెలులారా! దీనిని మీ యిరువురచేతులలోను ఉంచి పోవుచున్నా...

ఇరువురు:—మమ్ము నిప్పు డెవరిచేతులలో నుంచిపోయెదవు?

[అని బాష్పములు రా...

కాశ్య:—అనసూయా, ఏడువకుఁడు, ఏడువకుఁడు; మీ రేగదా శకుం... ధైర్యము చెప్పవలసినవారు? [అందఱు పరిక్రమిం...

శకుంత:—నాయనా, మనపర్ణశాలకడఁ దిరుగుచున్నదే యిదిగో పూర్ణ... యీ లేడి యెప్పుడు సుఖప్రసన యగునో అప్పు డాప్రియమును నాకుఁ దెలియఁజే... యును జుమా.

కాశ్య:—మంచిది, దీనిని మఱవను.

శకుంత:—[గతిభంగ మభినయించి] ఏమి యిది! మాటిమాటికి ఎవరు నా... బట్టుకొని న న్నాఁపుచున్నారు! [అని వెనుకకు మరలి చూ...

కాశ్య:—పట్టీ,

చ. దయగొని దర్భసూచికుటితం బగు మూతికి గారతైలముగ్
రయమునఁ బోసి, గాయము కరంబు నయంబుగ మాన్చి, చా...
గయిఁ గొని నోరఁ బెట్టి, యొసఁకంబుగ నెవ్వనిఁ బెంచికొంటివో,
ప్రియసుతుఁ డాకురంగకుఁడు వీఁడు నినుగ్ విడునే సుతామణీ!

శకుంత:—వత్సా, సహవాసుల విడనాడు న న్నేల యనుసరించెదవు! క్రొత్తలోనే తల్లిని గోలుపోయిన నిన్ను అదిమొదలు నేనే పెంచితిని; ఇప్పుడును లేకపోయిన నిన్ను కాశ్యపులు నాయన రక్షింతురులే. మరలుము నాయనా.

[అని యేడ్చుచుఁ ...

కాశ్య:—

చ. బుడిబుడి కొప్పులంబయికిఁబుచ్చుచుఁ జూడ్కులఁగప్పి హెచ్చుచు...
జడిగొనుబాష్ప మోతనయ జాల్కొన నీయకువమ్మ తేకువ...
వెడవెడ చూడకే నడువ బెగ్గిలి యీవిషమస్థలంబునం
దడఁబడునమ్మ నీచరణతామరసంబులు పుత్త్రికామణీ.

శార్ఙ్గ:—స్వామీ, నీటివఱకు బంధువులు సాగనంపుటగదా యాచారము. ఇదిగోఁ జెఱువుగట్టు. ఇచట మాకు సందేశ మానతిచ్చి తమరు వెనుకకు మరలుఁడు.

కాశ్య:—అట్లయిన నీపాలచెట్టునీడ నిలుతము రండు.

[అందఱు పరిక్రమించి నిలుతురు.

కాశ్య:—[ఆత్మగతము] ఆ మహాశయునికి దుష్యంతమహారాజునకు మిక్కిలి యుక్తముగా నేమి సందేశింతును? [అని యూహించుచుండును.

శకుంత:—[జనాంతికము] సఖి, కుడివై పునఁ జూడు, ఒకతామరాకు చాటయిన మాత్రాన సహచరునిఁ గానక చక్రవాకి భెగ్గిలి యాక్రందించుచున్నది. నే నెంత కఠిన హృదయనో!

అనసూ:—సఖీ, అట్లు చెప్పకే.

క. ప్రియుఁ బాసి యిదియుఁ దుఃఖా
న్వయదీర్ఘతరంబు నెట్లొ యామినిఁ గడపుఁ;
బయిఁ గలయునాస యెంతటి
వియోగశోకంబునేని పీటింబుచ్చుఁ. 96

కాశ్య:—శార్ఙ్గరవా, నామాటగా శకుంతలం జూపి నీ వా రాజుతో నిట్లు పలుకుము.

శార్ఙ్గ:—తమ రానతిండు.

కాశ్య:—

ఉ. పోలఁగ నెంచి మమ్మును దపోధనుల, న్నిజసత్కులంబునుఁ,
బాలయిదెట్లొ నీదెస నబంధుకృతంబుగఁ గొన్నయాతమిఁ;
ఏలుము బాల నీదుసతులెల్లర కౌ ప్రతిపత్తి; నాపయిఁ
మే లగు నెల్ల భాగ్య మది మెత్తురె యాలిజనంబు వేఁడినఁ. 97

శార్ఙ్గ:—సందేశమును గ్రహించితిని.

కాశ్య:—అమ్మా, నీకు మంచిబుద్ధులు చెప్పవలయును వినుము, మేము వనవాసుల మయ్యు లోకవృత్తముంగూడ నెఱుంగుదుము.

శార్ఙ్గ:—ప్రతిభావంతుల కగోచర మేమున్నది?

కాశ్య:—నీ విటుపిమ్మటఁ బతియిల్లు ప్రవేశించి,

చ. గురుల భజింపు భక్తిఁ, గడుఁ గూర్పు సపత్నులకుం బ్రియాళివై,
వరుఁడు శకించినం గినుక వట్టి కువాడము సల్ప కెప్పుడుఁ,
బరిజనము న్దయ న్దనుపు భాగ్యము లబ్బిన నుబ్బ కీక్రియఁ
దరుణులు గేహినీపదము దాల్తురు వామలు వంశ దుఃఖదల్. 98

మఱి గౌతమియభిప్రాయ మేమో?

గౌతమి:—ఇంతే యాఁడుఁబడుచులకు బోధింపవలసినది. అమ్మా, దీని జక్కఁగా గ్రహింపుము.

కాశ్య:—పట్టీ, నన్నును నీ సఖులను గౌఁగిలింపుము.

శకుంత:—నాయనా, ఇచటనుండియే మగలుదురా నా నెచ్చెలు లనసూ ప్రియంవదయు ?

కాశ్య:—పుత్త్రీ, వీరికింగూడఁ బెండ్లికావలయుఁగదా, వీ రచటికి యుచితము గాదు. నీతోఁగూడ గౌతమి వచ్చును.

శకుంత:—[తండ్రిని గౌఁగిలించి] నాయనా, మీయొడినుండి జాఱి యు మలయతటమునుండి వెల్లగింపఁబడిన గందపుఁదీఁగవలె దేశాంతరమం దెట్లు ప్రా నిలుపుకొందును ?

కాశ్య:—అమ్మా, ఏల బెంగఁబెట్టుకొనెదవు ?

ఉ. దేవనుతాభిజాత్యనరదేవమహాగృహిణీపదాప్తి మో
దావహ వైభవోద్ధుర నిరంతర తత్కృతులం బ్రసక్తవై,
పావను భానుఁ బ్రాచిబలెభాగ్యయుతు న్సుతుఁ గాంచి మి
నావిరహంపునెవ్వఁగ మనంబున నెంచవు చంచలేక్షణా.

[శకుంతల తండ్రిపాదముల ప్రా

కాశ్య:—నీ కభీష్టసిద్ధి యగునుగాత.

శకుంత:—[సఖులను సమీపించి] సఖులారా; ఇరువురు న న్నొకటనే లింపుఁడు.

ఇరువురు:—[అట్లే చేసి] సఖీ, ఒకవేళ నారాజు ఆనవాలు పట్ట అపు డాయనకు తనపేరుఁ జెక్కిన యీ ముద్దుటుంగరమును జూపు.

శకుంత:—సఖులారా, మీయీశంకచే నాహృదయము వడవడ వడం

ఇరువురు:—భయపడకు, అతిస్నేహము పాపశంకి.

శార్ఙ్గ:—ప్రొద్దెక్కుచున్నది, అమ్మా, పద పద.

శకుంత:—[ఆశ్రమాభిముఖి యై నిలిచి] నాయనా, మరలఁ దపోవనమ నెప్పుడు చూతునో ?

కాశ్య:—నాపుత్త్రీ, వినుము,—

మ. చిరకాలంబు సపత్నివై జలధికాంచీదామకు న్భూమికిన్,
దరుణీ ధారుణిఁ గూర్చి నీసుతునికి న్ద్రావ్యంతికి న్జేతకున్,
బరతత్త్వేచ్ఛఁ దదర్పితాఖిలకుటుంబక్షేముఁ డౌ భర్తతో
మరలం గూడెద వీతపోవనమున న్మమ్ము న్సతీరత్నమా.

గౌతమి:—పుత్త్రీ, ప్రయాణలగ్నము దాటిపోవుచున్నది. నాయనను బంపు మమ్మా. అట్లుగాదు, ఇది మరల నిట్లే చెప్పుచుండును! నీవే మరలిపోవయ్యా.

కాశ్య:—పుత్త్రీ, నాతపోనుష్ఠానమున కభ్యంతర మగుచున్నది.

శకుంత:—[మరలఁ దండ్రిం గౌఁగిలించుకొని] తపస్సుచేఁ గృశించియున్న నాయనశరీరము నాకై బెంగఁబెట్టుకొని మఱియుఁ గృశించునుగదా.

కాశ్య:—[నిట్టూర్పు పుచ్చుచు]

క. ఏవగ నాఱును జెపుమా
నీ వుటజముగడప నిడిన నెఱ మొలచిన యా
నీవారబలిం గన్నుల
నేవేళం గాంచునాకు నీవెత పట్టీ. 101

పద, నీమార్గము శుభము గావుత.

[శకుంతలయు సహాయాయులును నిష్క్రమింతురు.

సఖులు:—[శకుంతలదిక్కుఁ జూచి] అయ్యయ్యో వనవాటి చాటై యప్పుడే శకుంతల కంటి కగపడకపోయినది.

కాశ్య:—[నిట్టూర్పు నిగిడించుచు] అనసూయా, మీసహచారిణి పోయినది. శోకము నాఁపుకొని నావెంట రండు, నేను బోవుచున్నాను.

ఇరువురు:—శకుంతల లేక తపోవనము శూన్యమై యున్నది. ఎట్లు ప్రవేశింతుము?

కాశ్య:—స్నేహమువలన నిట్లు తోఁచును, [విమర్శతో, పరిక్రమించి] ఆహా శకుంతలను బంపఁగా నా కిపుడు మనస్సు స్వస్థపడినది. ఏల యన,—

తే. కన్య యనఁ గాదె జగతిలో నన్యసొమ్ము,
దానిఁ బతిఁ జేరఁ బంపిన తత్క్షణంబ
యెంతయుఁ బ్రసన్న మయ్యె నాయంతరాత్మ,
యిల్లడను గాచి యొడయని కిచ్చినట్లు. 102

[అందఱు నిష్క్రమింతురు.



# పంచమాంకము.

## స్థలము I. నగరిలో నొక వివిక్తప్రదేశము.

[అంత నాసనస్థుఁడై రాజును విదూషకుఁడును ప్రవేశింతురు.]

విదూ:—[చెవి యొగ్గి] వయస్యా, సంగీతశాలవైపు సావధానముగా విను. కలవిశుద్ధరీతిగా స్వరయోగము వినఁబడుచున్నది. నేఁ దలంచెద శ్రీమతి హంసప వర్ణము లభ్యసించుచున్నదని.

రాజు:—ఊరకుండుము, నేను విని యెఱింగెదను.

[ఆకాశమున నిట్లు పాట వినఁబడు

క. సుమ నవమధు లోలమ, యా
కొమరున ముద్దాడి మావి క్రొన్ననగుత్రిక్,
* గమలవసతి నిర్వృతిమై
భ్రమరమ, మఱచితివి దానిబాసనె యెట్లో! 1

రాజు:—అహో! రాగంపువెల్లువగా నున్నది పాట!

విదూ:—పాట కేమి, నీ కక్షరార్థము తెలిసినదా?

రాజు:—[చిఱునవ్వు నవ్వి] దీనితో నొకప్పుడు చెలిమి కలిపియుంటిని. ఇప్పు దేవేరిని వసుమతిని గూర్చి నన్నుపాలంభించుటగాఁ దెలిసికొనుచున్నాను. వయస్యా నామాటగాఁ జెప్పుము హంసపదికతో 'నిపుణముగా నుపాలంభించితి వ'ని.

విదూ:—నీయాజ్ఞ. [అని లేచి] వయస్యా, ఇతరులచేతులతో నాతరుణి జుట్టు పట్టుకొన్నయెడల నాకు నప్సరసలచేతులలోఁ బడిన విరక్తునికిం బోలె మోక్షము గలుగదుగదా.

రాజు:—పో పో. నాగరకవృత్తిగా దానితోఁ జెప్పుము.

విదూ:—ఏమి గతి?

[అని నిష్క్రమించును

రాజు:—[ఆత్మగతము] ఇట్టి యీగీతమును వినఁగా ఇష్టజనవిరహము లేకయే నాహృదయ మాకులపడుచున్నది. కా కేమి?

ఆ. మంచిరూపుఁ గాంచి మధురశబ్దము విని
సుఖియు నుత్సుకిల్లి స్రుక్కు చెల్ల

* "కమలవసతి మాత్రమువిణ" పాఠ.

భానమూథపూర్వభవసౌహృదంబుల
స్మరణ గాదె బోధవిరహితంబు. 104

[అని పర్యాకులుండై యుండును.

[అంతఁ గంచుకి ప్రవేశించును.]

కంచుకి:—[నిట్టూర్పు నిగిడించి] అహో! ఎట్టియవస్థకు వచ్చితిని!

ఆ. అధిపునంతిపురి సమాచార మునఁ గొంటి
వేడ్క గేల నెట్టి వేత్రయష్టిఁ
గాల మేఁగ నేఁగఁ గాళ్లు తొట్రిలునాకు
నడియ యూఁతగఱ్ఱ యయ్యె నిపుడు. 105

లోపలికిఁ బోయి విన్నవించెదను ఏలినవారికి ఈ యవిలంబితానుష్ఠేయమును, [కొంచెము దూరము నడిచి] మఱి యే మాపని? [ఆలోచించి] ఆహా! జ్ఞప్తి వచ్చినది. కణ్వశిష్యులు తాపసులు ప్రభువును దర్శింప వచ్చినారు. ఆహా! నాస్థితి చిత్రముగా నున్నది!

ఆ. క్షణముసేపు బోధ సంపూర్ణమై వెల్గు,
క్షణముసేపు ముంచు సంతమసము,
స్నేహ మాఱిపోవ నిర్వాణ మగుదివ్వె
మొగ్గఁ బోలు నాదు ముసుకబుద్ధి. 106

ఔను, ధర్మకార్య మేలినవారి కనుల్లంఘనీయమే గాని, యిప్పుడే ధర్మాసనము నుండి లేచినప్రభువునకు మరల నిర్బంధకారి యగునీకణ్వశిష్యాగమనమును జెప్ప నుత్సహింపకున్నాను. అట్లు కాదు, లోకతంత్రాధికారమున విశ్రామ మెక్కడిది? ఎట్లనిన,

ఆ. భానుఁ డొక్కమాఱె బాబాలఁ బూంచెను,
వాయు వట్టె పఱచు రేయుఁబవలు,
శేషుఁ డెపుడు మోచు శిరముపై భువనంబుఁ,
బన్ను వడయువానిపాడి యిట్లె. 107

కానిమ్ము, నాపని నేను జేసెదను. [పరిక్రమించి, చూచియు] వీఁడుగోఁ బ్రభువు.

క. తనబిడ్డలనుంబలె భూ
జనుల నరసి మది యలసి విజనముం జేరెఁ
వని నిభయూథముల నడపి
ఖను నెండఁ బడి నీడఁ జేరు నిభరాజువలెన్. 108

[సమీపించి] జయము జయము ఏలినవారికి. వీరుగోఁ దాపసులు హిమాలయ నడివారపు టడవి నివాసులు, కాశ్యపులవారియొద్దనుండి సందేశము తెచ్చినారు, స్త్రీసమేతులుగా వచ్చియున్నారు. అటుపైని యేలినవారిచిత్తము.

రాజు:—[ఆదరముతో] ఏమీ కాశ్యపసందేశమును దెచ్చినారా?

కంచుకి:—చిత్తము.

రాజు:—అట్లయిన నామాటగాఁ జెప్పు ముపాధ్యాయులు సోమరాతులవారికి శ్రౌతవిధిచే వారిని సత్కరించి తోడ్కొని రమ్మని. నేనును వారికొఱకు మునిసందర్శనయోగ్యప్రదేశమునఁ గనిపెట్టుకొని యుండెదను.

కంచుకి:—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును]

రాజు:—[లేచి] ఎవ రక్కడ?

ప్రతీహారి:—[ప్రవేశించి] ఏలినవారియాజ్ఞ యేమి?

రాజు:—వేత్రవతి, అగ్నిహోత్రగృహమార్గమును దెల్పుము.

ప్రతీ:—ఇటు ఇటు ఏలినవారు. [పరిక్రమింతురు]

రాజు:—[అధికారాయాసము నభినయించి] ఇతరు లెల్లఁ దమకోరిక దీఱిన సుఖముందురు. రాజులకు మనోరథసిద్ధివలన శ్రమయే కలుగును.

క. ఏలం గలుగుట ముద మహా
* నేలుట మఱి లబ్ధపదము నిట్లు శ్రమద మహాఁ,
గేలఁ గొనుగొడుగువలె నర
పాలత శ్రమ ముసుపఁ గుడుపఁ బరిపాటి నగుఁ. 1

[తెరలో వైతాళికులు.]

జయము జయము ఏలినవారికి,

ప్రథముఁడు:—

ఉ. లోకముఁ గావ క్లేశముల లోనవు దాత్మసుఖాపవాది వై,
వాకొన నేల యిట్టిదె భవద్ఘవృత్తి యహర్నిశంబునుఁ;
మేకొని యెండలం దపనుమేటినిదాఘము నాత్మసంశ్రితా
నీకము నెండసోఁకు లననీకుమహా మార్పదె చల్లనీడలన్. 1

ద్వితీయుఁడు:—

ఆ. దారి తప్పువారి దండి వై మఱఁగింతు;
కడఁగి తగవుఁ దీర్తు, కాతు, ప్రోతు;

* పా. "ఏలఁ గలుగఁ గోరికిది ... నేలుట మఱి లబ్ధపదము నిట్లు శ్రమ ఖేద

నై భవములఁ బ్రజకు బంధువు లొక్కరుదువయే,
కడకు బంధుకృత్యకారి వీవు. 111

రాజు:—ఇదిగో మామతిబడలిక తీఱి మరల మేము క్రొత్తపడినారము.

[అని పరిక్రమించును.



[స్థలము II. నగరిలోనే యగ్నిగృహము.]

ప్రతీ:—ఇది యిప్పుడే సమ్మార్జింపఁగా వెలుఁగొందుచున్నది, సన్నిహితహోమ ధేనుక మగ్నిహోత్రగృహంపుముంగిలి, ఏలినవా రెక్కవలెను.

రాజు:—[ఎక్కి, పరిజనముబుజముపై చేయి యూనుకొని నిలిచి] వేత్రవతి, ఏ పనిమీఁదఁ గాశ్యపపాదులవారు నాకడకు ఋషులను బంపియుందురో ?

శా. మోదం బొప్ప వ్రతము ల్గొడంగినతపంబు ల్విఘ్నము ల్గాంచె నో ?
లేదే నేఁడనుఁ గ్రైవ న్నాశ్రమమృగాళిం గాఁడియం బెట్టెనో ?
కాదా, నాయపచర్యచేఁ బ్రసవముల్ గన్పట్టవో తీవలన్
బ్రాదుర్భూత బహూహ మి ట్లైన యసిద్ధాంతాప్తిఁ గాసిల్లెడున్.112

ప్రతీ:—ఏలినవారి సచ్చరిత్రమునకు సంతసిల్లి ఋషులు ఏలినవారిని గౌరవింప వచ్చినా రని నాకుఁ దోఁచుచున్నది.

[అంతఁ బ్రవేశింతురు గౌతమీసమేతను
శకుంతలను ముందిడుకొని ఋషులును వారిముందఱఁ
బురోహితుండును గంచుకియు.]

కంచుకి:—పూజ్యులారా, ఇటు రండి యిటు రండి.

శార్ఙ్గరవుఁడు:—శారద్వతా,

మ. నరనాథుండు మహామహుం డితఁ డభిన్నప్రాజ్యమర్యాదుఁ, డే
నరుఁ డేజాతిని నెంతముక్కిడియు నున్మార్గుండు గాఁ; డైననున్,
నిరతిన్ శాంతవివిక్తవాసి నగుటన్ నే నీపురోత్తంసమున్
నరసంకీర్ణము నెంతుఁ బావకనిగీర్ణం బైనగేహంబుగాన్. 113

శారద్వతుఁడు:—యుక్తమే, ఈనగరము చొచ్చుటచే నీ వట్లయితివి. నేనును,

ఆ. నూనెయొడలివాని స్నానశుద్ధాంగుండు,
జాగరితుఁడు సుప్తు, స్వైరి బద్ధు,
శుచి యశుచిని, దలఁచుచొప్పుగాఁ దలఁతు నే
నిచటి విషయభవసుఖైషి జనుని. 114

శకుంత:—[దుర్నిమిత్తము సూచించి] అయ్యో! ఏమి నాకుడికన్ను దరుచున్న
గౌతమి:—పుత్త్రీ, అమంగళము డడంగునుగాక, నీమగనియిలువేల్పులు
శుభంబులొసంగుదురు గాక. [అని పరిక్రమించు

పురోహితుడు:—[రాజును జూపించి] తపస్వులారా, ఈతఁడే మహాశయుడు
వర్ణాశ్రమరక్షకుఁడు ముందుగానే ఆసనమునుండి లేచి మిమ్ము నెదురుసూచుచున్నా
చూడు డితని.

శార్ఙ్గ:—ఇది మిగుల సంతోషింపఁ దగినది, అయినను మే మిందు మధ్యస్థు
ఎట్లన,

[వంశస్థము]

* వినమ్ర మౌఁ బండ్లవి - వృద్ధిఁ జేఁదరుల్
ఘనంబులు వ్వంగు గ-తెన్నవాంబులన్,
అనుద్ధతు ల్సజ్జను - లాఢ్యసంపదన్,
జనోపకృజ్జన్మగు-ణం బిదే గదా. 1

ప్రతీ:—దేవా, ప్రసన్నముఖరాగులుగా నగపడుచున్నారీ ఋషులు, అందుచే
దలంచెద స్నేహముతోడి పనిమీఁదనే యని.

రాజు:—[శకుంతలం జూచి] మఱి యీమె,

క. జిలుఁగుమునుం గిడి జడదా
ల్పులనడుమ శరీరసుషమ పొటిపొటి గనరాఁ,
దలి రొండు పాండుపర్ణం
బులలోబలె వెలుఁగు భువనమోహిని యెవరో? 1

ప్రతీ:—దేవా, నామనస్సు కుతూహలపూర్వకముగాఁ దర్కించుచున్నది
యీమె యాకారము దర్శనీయముగా నగపడుచున్నది.

రాజు:—మంచిది, పరభార్యను జూడఁగూడదు.

శకుంత:—[హృదయముపై చేయి యుంచుకొని, ఆత్మగతము] హృదయమా,
యిట్లు తల్లడిల్లెదవు, ఆర్యపుత్త్రునిభావము నెఱుఁగకయే? ధైర్యముగా నుండుము.

పురో:—[ముందటికిఁ బోయి] దేవా, వీరుగ్గోఁ దాపసులు విధ్యుక్తముగ
బూజింపఁబడినారు. తమ యుపాధ్యాయులనుండి సందేశ మేమో తెచ్చియున్నారు
దానిని నీవు వినవలయును.

రాజు:—అవహితుఁడనుగా నున్నాను.

ఋషులు:—[చే యెత్తి] రాజా, విజయివి గమ్ము.

* పా. పండ్లబరువుద్గమింపఁ గై వ్రాలుఁదరులు। మొగిళులున్నూత నాంబుల మ్రొగ్గుదల్చు
ఉద్ధతులుగారు సాధులు బుద్ధిచేత। పరహితవ్రతుల కిది స్వాభావికంబు.

రాజు:—మీ కందఱకు నమస్కారములు.

ఋషులు:—నీకు మే లగుఁగాక. నీయిష్టము సిద్ధించునుగాక.

రాజు:—మఱి మునీంద్రులతపస్సులు నిర్విఘ్నముగాఁ బ్రవర్తిల్లుచున్నవా?

ఋషులు:—రాజా,

ఆ. సజ్జనులకు నీవు శరణంబవై యుండ,
విఘ్న మెట్లు ధర్మవిధుల కొదవు?
దెసల నెల్ల ఘర్మదీధితి దీపింప,
ధ్వాంత మేవిధానఁ దలను జూపు. 117

రాజు:—నా రాజపదము సార్థకమైనది. కాశ్యపపాదులవారు లోకానుగ్రహార్థము కుశలముగా నున్నారుగదా?

శార్ఙ్గ:—సిద్ధిమంతులకుఁ గుశలము చేతిలోనే యున్నది. వారు నీతో నారోగ్యప్రశ్నపూర్వకముగా నిట్లు చెప్పు మనిరి.

రాజు:—ఏమి మహాత్ములయాజ్ఞ?

శార్ఙ్గ:—"ఏకాంతమున నొడంబడిచి నీవీ మాకొమారితను వివాహమైతివి, దానిని నేను బ్రీతుఁడనై మీయిరువురయెడల నంగీకరించితిని, ఏల యన,—

తే. జగ మెఱుఁగు నిన్ను సజ్జనసత్తమునిఁగ,
నీశకుంతల సత్క్రియ యిద్ధమూర్తి,
సమగుణం బగుమిథునంబు సంఘటించి,
యెట్టకేల కిపుడు వాసె ఱట్టు ధాత. 118

ఈబాల నిపు డంతర్వత్నిని గ్రహింపవలసినది సహధర్మాచరణముకొఱకు" అని.

గౌతమి:—ఆర్యా, నేనును నొకమాట చెప్పఁ గోరియున్నాను, కాని, నామాట కవకాశము లేదు. ఎట్లన;

క. గురునికి వేవవు నీ, వీ
వరాంగి బంధుల నడుగదు, వార కిరువురుఁ
వరియించితి రేకైకతఁ
బరస్పరము, మీకు నేమి వచియింపఁగలన్. 119

శకుంత:—[ఆత్మగతము] అహో! ఆర్యపుత్త్రుఁ డేమి చెప్పునో గదా?

రాజు:—ఇదేమి యీ యుపన్యాసము?

శకుంత:—[ఆత్మగతము] పావనముగదా యీ యుపన్యాసము.

శార్ఙ్గ:—ఇదేమని యడిగెద వేమి? లోకతంత్రమం దత్యంతప్రవీణులకు మీకుఁ దెలియదా?

శా. పాతివ్రత్యమహానిధాన మయిన న్భావింతు రట్లట్లుగా
జ్ఞాతివ్రాతకులైకసంశ్రితిరత న్సనాథ్యభద్రన్ జనుల్,
కాతర్యంబు వహించి యీకలిమునం గాంక్షింపుదు ర్బాంధ్య
నేతం గూర్పఁగ సప్రియం బ్రియను గాని నెవ్వడి న్జవ్వనిన్.

రాజు:—ఏమి యీమెను మేము వివాహమై యుంటిమా?

శకుంత:—[విషాదముతో, ఆత్మగతము] హృదయమా, నీభయ మిప్పటి తమే యైనది.

శార్ఙ్గ:—

క. చేసిన దుష్టము గాదో?
వేసమొ? ధర్మంబు నేదొ? వెకిరింతో మమున్?

రాజు:—మమ్ముఁగూర్చి యిట్టిప్రశ్నకుఁ గారణ మేమి?

శార్ఙ్గ:—

వాసను లీదోసములకు
మాసర మైశ్వర్యమత్తమనుజాపశదుల్.

రాజు:—మమ్ము విశేషించి దూషించుచున్నారు.

గౌతమి:—అమ్మా, రవంతసేపు మేల్మునుఁగు దివియనిమ్ము, అంతె నిన్ను యానవాలుపట్టునుగాక. [అని చెప్పినట్టు చేయు

రాజు:—[శకుంతలం గలయఁ జూచి, ఆత్మగతము.]

మ. కనుదోయి న్మిఱుమిట్లు గొల్పు చిటు నాకై ప్రాప్తమై నట్టి య
కనదత్యద్భుతరూపముం దొలుత నే గైకొంటినో లేదొ య
చు, నిశాంతంబునఁ దేఁటి లోని కెలమంచుం గొన్నకుందంబు
లను, గైకోఁజొర మాననోప భ్రమిమద్డోలారూఢచిత్తుండనై.

[అని విచారించుచు నుండు

పరిజనము:—[జనాంతికము] అహో! ఏలినవారి ధర్మాభిమానము! ఇట్టి యతర్కితోపనతరూపాద్భుతముం గని మఱి యన్యుఁ డెవ్వఁడు విచారించుచుండును!

శార్ఙ్గ:—ఏ మయ్యా యూరకున్నావు?

రాజు:—ఓతపోధనుఁడా, ఎంత తలపోసి చూచినను నీమెను నేఁ బరిగ్రహి నట్లు జ్ఞప్తి గలుగ లేదు. అభివ్యక్తగర్భలక్షణ కీమెకు భర్తనా యని సందేహ చున్నాను, ఏమి చేయుదును?

శకుంత:—[విషాదముతో, ఆత్మగతము] వివాహమందే సందేహము! ఇక దూర మెగఁబ్రాఁకుచున్న నాయాశ?



శార్ఙ్గ:—మాటాడ కూడదు.

చ. తను మదిఁ బాటిసేయక సుతామణి నీ వవమర్శ సేయఁగా
ననుమతి సేసి ప్రీతుఁ డగునాముని నీ కవమాన్యుఁడే, బళీ!
మునుకొని చోరుఁ డాత్మధనముం హరియింపఁగ దాని వానికే
కనికర మూని యిచ్చినవగ న్నుత నీకడ కర్థిఁ బంపుటం. 123

శార:—శార్ఙ్గరవా, నీ విప్పటికి నిలుపు. శకుంతలా, మేము స్పష్టముగాఁ జెప్పితిమి. ఆయన యిట్లు చెప్పుచున్నాఁడు. ఆయనకుఁ దార్కాణగా బదులుమాట నీవు చెప్పుము.

శకుంత:—[ఆత్మగతము] అట్టి యాయనురాగ మీయవస్థకు వచ్చి యుండఁగా, జ్ఞప్తిపటిచి యేమి ప్రయోజనము? నాగతి యిపుడు శోచనీయ మై యున్నది. అయినను యత్నించెదను. [ప్రకాశము] ఆర్యపుత్త్రా [అని సగముమాటలోనే] వివాహమే యిపుడు సంశయితమై యుండఁగా నిది యుచితాచారము గాదు. పౌరవా, నీకు యుక్తము గాదు సుమా, పూర్వము తపోవనములో స్వభావోత్తానహృదయము నీజనమును బ్రతిజ్ఞాపూర్వకముగా వంచించి యిప్పు డిట్టి యక్షరము లాడి నిరాకరించుట.

రాజు:—[చెవులు మూసికొని] శాంతము పాపము! శాంతము పాపము!

క. కులమును మలినము సేయం
దలఁగక యీజనునిఁ గూల్పఁ దలకొనె దేలా
సలిలంబు నచ్ఛముం దట
పలాశినిం గట్లుగోయు వాహినివోలెం? 124

శకుంత:—మంచిది, వాస్తవముగాఁ బరపరిగ్రహశంకచే నీ విట్లు ప్రవర్తిల్లుచున్నాఁడవేని, ఇదిగో ఈయభిజ్ఞానముచే నీసందేహమును దొలఁగించెద.

రాజు:—ఉత్తమపద్ధతి.

శకుంత:—[ముద్దుటుంగరపుఁజోటును దాకి చూచి] అయ్యో! అయ్యో! నావ్రేల నుంగరము లేదు. [విషాదముతో, గౌతమిని జూచును.

గౌతమి:—నిశ్చయముగా శక్రావతారమున శచీతీర్థమును నమస్కరించినప్పుడు నీవ్రేలినుండి యుంగరము జాఱి పడిపోయినది.

రాజు:—[చిఱునవ్వుతో] ఇదే అది తత్క్షణోత్పన్నప్రతిభ స్త్రీప్రభావ మని లోకులు పలుకునది.

శకుంత:—ఇందు దైవము తనమహిమను జూపినది. మఱియొకటి నీకుఁ జెప్పెదను.

రాజు:—ఇప్పటికి వినవలసిన దైనది.

శకుంత:—ఒక నాఁడు విరజాజిమంటపములో నీ చేతియందుఁ దామరాకు పాత్రములో జల ముండెను.

రాజు:—వింటిము గాక.

శకుంత:—ఆ క్షణమున నాపుత్త్రికుఁడు దీర్ఘాపాంగమను లేడిపిల్ల అచటికి వచ్చినది. అంత నీవు ముందుగా నిది త్రాగునుగాక యని దయఁబూని ఆనీటితో బెట్టితివి. అది అపరిచయముచే నీకడకు రాదాయెను. అంత నా నీటిదొన్నెను నా చేత నుంచుకొనఁగానే అది వచ్చినది. అపుడిట్లు పరిహాసము చేసితివి. 'అందరు తమ బంధువులయందు విశ్వసింతురు, మీ రిరువురును ఆరణ్యకులే గదా' అని.

రాజు:—ఆత్మకార్యసాధిక లగుబాణల యిట్టి యీ మొదలగు నసత్యవాక్యములకు విషయాతురులు లోఁబడుదురు.

గౌతమి:—మహాభాగుఁడా, ఇట్లు చెప్పుట తగవుగాదు. అడవిలోఁ బెరిగి యీజనమునకుఁ గపట మేమి తెలియును?

రాజు:—ఓతపసి ముసలీ,

(మత్తకోకిల)

స్త్రీలమానుషజాతులందె యశిక్షు సప్రతిభ ల్గదా,
మేలుబోధన గన్ననాతులమేధ శక్యమె చెప్పఁగా!
లీల లాతిద్విజాళిచేఁ దనలేఁతకందుల నింగిఁ బోఁ
బోలుము న్పెనిపించు నాపరపుష్ట నేరుపుఁ గానవే.

శకుంత:—[రోషముతో] అనార్యుఁడా, నీమనస్సువలెనే యని సర్వమును తలంచుచున్నావు. ఎవఁ డిపుడు ధర్మకంచుకములో దూఱి గడ్డిమూసికొన్న నూతివలె నిన్నుఁ బోలువాఁడు!

రాజు:—[ఆత్మగతము] నాబుద్ధిని సందేహముపాలు సేయుచు నీమె కోపము కపటముగానియట్లగపడుచున్నది. అట్లె గదా,

చ. పటుతరవిస్మృతిప్రఖరభావుఁడ నై తనతోడి యా రసో
త్కటనిభృతప్రసంగత మతథ్య మనా నతిలోహితాక్షి యై
కుటిలము లౌ బొమ ల్ముడిచికొంటను మానిని గంటునీసునన్
బెటపెట మారుకార్ముకము పెల్లున భగ్నము సేసి నై చెబో.

[ప్రకాశము] కల్యాణీ, దుష్యంతునిచరిత్రము ప్రసిద్ధము, అయినను నిదియగపడదు.

శకుంత:—చాలుఁ జాలు. నోటఁ దేనెయు హృదయమున విషము నయిన యీ చేతఁ బడి స్వచ్ఛందచారిణిని జేయఁబడితిని.

[అని వస్త్రాంచలమున ముఖము గప్పుకొని యేడ్చును]

---

125-వ పద్యమునకు పద్యాంతరము.

మ. నరభిన్నాంగనలం దశిక్షితము పూర్ణప్రౌఢి సిద్ధంబు గా,
వరబోధైధితమానుషీప్రతిభల న్వర్ణింపఁగా శక్యమే!
అరితిక్ లాతి ద్విజాళిచేఁ దమయపత్యంబుల్ దివిక్ బోకముక్
పరపుష్టల్ పెనిపించి ధన్య లసద్ప్రౌఢి స్వాలోకింపవే?

శార్ఙ్గ:—ఇట్లు తనచాపల మప్రతిహతముగాఁ దన్ను దహించును.

క. ఆరసి చేయం దగు, మఱి
యారసి చేయంగఁ దగు రహస్సంగతమున్;
ఈరీతి మనసు దెలియని
వారలతో సౌహృదంబు వైరంబ యగున్. 127

రాజు:—ఏ మయ్యా, ఆమెమాటనమ్మకముమాత్రాననే మమ్మ రోషరూక్షాక్షరముల నొంచెదరా?

శార్ఙ్గ:—[అసూయతో] తమరే యెక్కువతక్కువలు వినియున్నారు.

క. పుట్టువుఁ దొట్టి కపుడు గన
నట్టిజనమె యప్రమాణ మాడునుగాతన్,
గట్టిఁడిమోసమె విద్యగ
నిట్టలముగ నేర్చువారలే సత్యపరుల్. 128

రాజు:—ఓయి సత్యవాదీ, ఈమాటను మే మొప్పుకొనియెదము గానిమ్ము, ఈమెను మోసము చేసిన, మా కేమి ప్రయోజనము?

శార్ఙ్గ:—వినిపాతము.

రాజు:—వినిపాతమును పౌరవులు ప్రార్థింతు రని నమ్మఁదగినది కాదు.

శార్ఙ్గ:—ఓరాజా, ఏల యుత్తరోత్తరము? గురునిదేశమును మే మనుష్ఠించితిమి. ఇఁక మేము మరలెదము.

క. చాలు సఖీ, యీమె నీసతి,
యేలుకొనుము మాను మొండె నిష్టంబుబడిన్,
ఆలిపయి సర్వతోముఖ
శీలప్రాభవము పతికి సిద్ధము గాదే? 129

గౌతమీ, నీవు ముందు నడువు. [అని తరలుదురు.

శకుంత:—ఏమి చేయుదును! ఈవంచకుఁడు మోసపుచ్చెను. మీరును ఇట్లేడ్చుచున్న నన్ను విడిచి పోవుచున్నారు. [అని వెంటఁ దరలును.

గౌతమి:—[నిలిచి] ఓరీ శార్ఙ్గరవా, అయ్యో! పాపము! శకుంతల యేడ్చుచుఁ గూడ వచ్చుచున్నదిరా. భర్త క్రూరుఁడై పొమ్మనఁగా నాతూన యేమి చేయును!

శార్ఙ్గ:—[రోషముతో మరలి] ఆ! ఆ! దోషైకదర్శినీ, ఏమి స్వాతంత్ర్యము వహించెదవు!

[శకుంతల భయముచే వడవడ వడఁకును.

శార్ఙ్గ:—శకుంతలా,

తే. రాజు వల్కెడుక్రియ నపరాద్ధ వేని
తండ్రి కిం కేల కులమును దక్క నీవు?
కాక యాత్మవ్రతము శుచిఁ గాచితేని
దాస్యమేనియు నీకు మే లధ్వనియుంట.

నిలు నిలు; మేము పోయెదము.

రాజు:—ఓతపస్వీ, ఏల యామెను వంచించెదవు?

క. కైరవములనే చంద్రుఁడు
వారిరుహంబులనె దినపతి మేల్కొలుపుఁ ;
వారక జితాత్ములకుఁ బర
దారపరాఙ్ముఖత సహజధర్మం బెందుఁ.

శార్ఙ్గ:—అన్యాసంగముచేఁ బూర్వవృత్తమును మఱచితివేని నీ వధర్మ
మెట్లు ?

రాజు:—[పురోహితుం గూర్చి] తమ్మనే యిందు గౌరవ లాఘవము లడ

ఆ. నాకు బుద్ధిమలిపొ ? యీకల్కి కల్లలు
సాటునొక్కొ ? యిట్టి సందియమున,
నాలినే త్యజించి కూళనే యగుదునో ?
పరవధూటిఁ దాఁకి పా డగుదునొ ?

పురో:—[విచారించి] ఇప్పటి కిట్లు చేయుము.

రాజు:—అనుశాసింతురుగాక నన్నుఁ బురోహితులవారు.

పురో:—ఈమె ప్రసవపర్యంతము మాయింట నుండునుగాక. ఏల యట్లు
ననఁగా, పెద్దలు చెప్పియే యున్నారుగదా, మొదటఁ జక్రవర్తినిఁ గుమారునిఁ
వని. ఈమె కనుమునిదౌహిత్రుఁ డాలక్షణమువాఁడేని, అంతట సంతోషించి
నంతఃపురముం జేర్పుదువు, కానిచోఁ దండ్రికడకుఁ బంపుట సిద్ధమైయే యున్న

రాజు:—గురువులవారికి సమ్మత మైనట్లు.

పురో:—అమ్మాయీ, నాతో రా.

శకుంత:—ఓ భూదేవీ, నన్ను లోఁగొనుము.

[అని యేడ్చుచుఁ బురోహితునితోను దపస్వు
నిష్క్రమించును. రాజు శాపహత స్మృ
శకుంతలావృత్తాంతమునే తలపోయుచుండు

[తెరలో]

ఆశ్చర్య మాశ్చర్యము!

రాజు:—[ఆకర్ణించి] ఇదే మై యుండును ?

పురో:—[ప్రవేశించి, ఆశ్చర్యపడుచు] దేవా, అద్భుతముగదా జరిగినది!

రాజు:—ఏమి ? ఏమి ?

పురో:—దేవా, కణ్వశిష్యులు దాటిపోఁగానే,

క. తనభాగ్యము దూరుచు జ
వ్వనియున్ దోర్యుగళ మెత్తి వాపోఁదొడఁగెన్

రాజు:—అంతట ? అంతట ?

పురో:—

వనితగ నొక జోతియు నా
తిని గొని చనె నప్సరసల తీర్థంబుబడిన్. 133

[అందఱు నాశ్చర్యమును సూపింతురు.

రాజు:—స్వామీ, ముందే మన మీవిషయమును నిరాకరించినారము. వృథా తర్కములచే నేమి ప్రయోజనము? తమరు విశ్రమింపుఁడు.

పురో:—[చూచి] విజయివి గమ్ము. [అని నిష్క్రమించును.

రాజు:—వేత్రవతి, కలఁగిపోయినది మామనస్సు. శయనగృహమార్గము చూపుము.

ప్రతీ:—ఇటు ఇటు ఏలినవారు. [అని పరిక్రమించును.

రాజు:—[ఆత్మగతము]

ఆ. స్మరణ సేయ లేక స్వపరిగ్రహం బని
పోవఁ ద్రోచినాఁడ మునితనూజ,
దుర్భరముగ నిప్డు దోదూయమాన నై
నమ్మఁ జేయుఁబోలె నన్ను మనము. 134

[అందఱు నిష్క్రమింతురు.



## ప్రవేశకము.

[స్థలము :— నగరికడ నొకవీథి.]

[అంత, కొత్వాలుయొక్క బావమఱంది ప్రవేశించును. ఒకపురుషునిఁ బెడ రెక్కలు విఱిచికట్టి యిద్దఱుకావలివాండ్రు తోడ్కొని ప్రవేశింతురు.]

కావలివాండ్రు:—[కొట్టి] ఓరేయ్, ఓరే దొంగా, శప్పరా శప్పరా, కట్టులోన యేలినవోరిపేరు శెక్కిన యీవుంగరం నీకెక్కడ నోరే దొరికింది ?

పురు:—[భీతి నటించుచు] బాబులారా, నామీ ద్దయి శేండి, నా నిలాటి శేశివోణ్ని గానుండి.

కావలివారిలోఁ బ్రథముఁడు:—మఱేగంటే, నువ్వు మంచి బాపనయ్యవో! యేలినవోరు నీకు దాన మిచ్చినారా యేంట్రా ?

పురు:—యినుండి మారాజా యినుండి మఱి. నానుండి శక్కరావతారం రేవు బిశికివోణ్ని జాలరోణ్నుండి.

ద్వితీయుఁడు:— తెక్కలికోడా, నిన్నెవడ్రా నీజా తడిగినవోడు ?

బావ:—సూశక, అంతా వొరాసగా ఆణ్ణే శెప్పనీయండి, నడిమద్దెలో రడ్డం సొరబడకండి.

ఇద్దఱు:—బావ శెప్పిన ట్టింటాం. [ఊరకుం

బావ:— శెప్పరా శెప్పరా.

పురు:— నా నుండి, మారాజా, మరిగంటేనుండి, వల, గాలాం, ఊశ, ఈటోటితోటి శాపలు బట్టుకొంటా పెళ్ళం బిడ్డల్కి కూడెట్కొంటా వుండోణ్నుండి.

బావ:—[నవ్వి] దోసంలేని జీవనం రా నీది!

పురు:—అటయితే యినుండి మారాజా.

[గే య ము]

బెమ్మ నొట్ట రాశిన బు వ్వేమో బెడిశి పోదు గందా,
దమ్మమె గానీ కమ్మమె గానీ దప్పరాదు గందా ;
మ్యాకల మింగే బ్యాపన రొయ్యకి మెత్త మణుచు గందా,
యేకలి శేశిన యాకలి కోసం య్యాస్రు డొప్పు గందా.

బావ:—ఆయెనక ఆయెనక ?

పురు:—ఆయెన్క మరిగంటేనుండి, ఒక నాడుండి యెఱ్ఱిశాపని ముక్కలు తరుగుతున్నానుండి, దానికడుపులో యీవుంగరం రతనాలతో

జిగజిగా మెరుస్తా దొక్కిందుండి ; ఆపాట్కా దీన్ని అమ్మనూపితే యీబాబులు పట్టు కున్నారు మారాజా. నన్ను సంపేస్తే సంపేండి ఒదిలేస్తే ఒదిలేండి, ఉన్నమాట శెప్పి నాను. ఇది దొక్కినదారి యింతేనుండి మారాజా.

బావ:—జానుగ, నీసుకంపు రోతమొగం, యీడేమో జాలరోడే ; అందుకు మఱోమాట లేదుగాని, యీడికి యీవుంగరం దొరకటం మాత్రం యిచారించాల. అందు కోసం నగరికే యెల్దాం రండ్రా.

కావలి:—బుద్దిబుద్ది, ఓరే మూటయిప్పుడుగా నడ్డా నడు.

[అందఱు పరిక్రమింతురు.

బావ:—సూశక, యీణ్ని దర్వాజాకాడ బలే కబడ్దారీగా కాపలా శేస్తావుం డండి. నే నెల్లి యీవుంగరం వొచ్చినయిదం యేలినవోరికి మనివిశేశి అరి ఆగ్గి యినుకొని వొస్తా.

ఇరువురు:—బావమీద యేలినవోరికి దయరావాల. [బావమఱది నిష్క్రమించును.

ప్రథ:—జానుగ, ఏమోరే బా వెల్లి చాంచేపయింది ?

ద్వితీ:—ఓరి సమయం నూశి గందంట్రా యేలినవోరిదరిశనం శేస్కోవాల ?

ప్రథ:—జానుగ, నా శేతులు పురపుర్లాడుతావున్నయిరా యీణ్ని కొఱతనేస్తారె అందుకోసం యీడిజుత్తుకి పూలు సుట్టనానికి. [అని పురుషునిఁ జూచును.

పురు:—నాయం గాదు బాబూ, ఉత్తపున్నాన్యానికే సంకెద్దం.

ద్వితీ:—[చూచి] ఇల్లిడుగో మావోర, యేలినవోరియాగ్గె యిని వొస్తావున్నడుశే. రానీ, నిన్ను గద్దల కేస్తాంశా.

బావ:—[ప్రవేశించి] సూశక, ఒదిలెయ్రా యీజాలరోణ్ని ఒదిలెయ్యి, యీడి కుంగరం దొరకటం నాయంగానే వుందిరా.

ప్రథ:—బావ శెప్తే సరి.

ద్వితీ:—యీడు యెమదమ్మరాజింటికెల్లి మల్లీ వొచ్చినాడురా నాయినా !

[అని పురుషునికట్లు విప్పును.

పురు:—[బావమఱదికిఁ బ్రణమిల్లి] మారాజా, నీయి నాపానాలు.

బావ:—ఇదుగోరా యేలినవోరు అవుంగరానికి యెంత కరీదో అంతసొమ్ము నీకు యిస్తాం దయశేశినార్రా. [అని పురుషునికి ధన మిచ్చును.

పురు:—[ప్రణామపూర్వకముగా గ్రహించి] నామీద్దయి శేశినావు మారాజా.

సూచ:—వవ్వా, యీడిమీదనిరా దయశేశినారు ! యీణ్ని కొఱ్తిమీదినుంచి యేనుగమీది కెక్కించినార్రా.

జాను:—బావా, యినామశేతనే తెలుస్తా వుంది, అవుంగరం యేలినవోరికి మణుసుగా వుందని.

బావ:—అవుంగరం అరి కంత మణుసొచ్చిందని నాకు దోచలేదుగాని దాన్ని సూడగానే యేలినవోరికి ఎవరో కావలిశినవోరు గ్యాపకం వొచ్చినారు, అందమూ లంగా, అంతల [illegible] అమారాజ్ఞి గడసరి [illegible] కన్నీ [illegible]

సూచ:—కొలిశినావా బావా?

జాను:—యీశాపలగొంగడికోస మని శెప్పరా.

[అని యనూయతోఁ బురుషుని చూ...

పురు:—తొరలారా, యిందులో సగం పూలుకొనుక్కోడానికి పుచ్చు...
మారాజా.

జాను:—ఇది బాగుంది.

బావ:—జాలరినాయిడా, నా కిప్పుడు అచ్చం నేస్తగాడివైనావు. సా...
సాచ్చిగా మనకి తొలినేస్తం జరగాల, అందుకోసం రా యెల్దాం సారాయిగిడ్డంగికా...

[అందఱు నిష్క్రమింతు...

---

# షష్ఠాంకము.

---

## స్థలము I. నగరిపైని యాకాశము.

[అంత, నాకాశయానమున సానుమతియను నప్సరస
ప్రవేశించును.]

సానుమతి:—ఉంటిని నావంతు ప్రకారము సాధువులు స్నానముచేయు ...
తాకాలంబు నప్సరస్త్రీస్థంబున. ఇఁక నిపుడు రాజర్షివృత్తాంతమును ప్రత్యక్షము...
గనియెదను. మేనకసంబంధముచేత శరీరమే నాకు శకుంతల. ఆమెయుఁ గూ...
తొలుత న న్నాదేశించియున్నది. [కలయం జూచి] ఏమి యిది? ఉత్సవకాలమైనను ...
త్సవముగా నున్నది యీ రాచనగరు! కలదు నాకు మహిమ యోగదృష్టిచే స...
నెఱుంగుటకు, అయినను సఖికి నావైఁగల యాదరమును గారవింపవలయును. మం...
తిరస్కరిణీవిద్యచే మఱుఁగి యీ యుద్యానపాలికలచెంతన యుండి సర్వముం ...
పట్టెదను.

[నాట్యముచే దిగి నిలుచు...

## [స్థలము II. నగరితోఁ జేరిన ప్రమదవనము.]

[అంతఁ, జూతాంకురమును జూచుచు నొకచేటియు, దానివెంబడి
మఱియొకచేటియుఁ బ్రవేశింతురు.]

ప్రథమ:—

క. మావిననఁ బికానందము
జీవితకల్పము వసంతజేత్రుపరునకుఁ
బూవుబుఱుతు ప్రమంగళముగ
భావించుచు మధుపచరణభగ్న...

ద్వితీయ:—చెలీ పరభృతికా, ఏమే ఒంటిగా నీలో నీవే మాటలాడుకొనుచున్నావు?

ప్రథమ:—చెలీ మధుకరికా, మావిమొగ్గను జూచిన బరభృతిక యొడలుమఱచి వేదుఱుగొనును గదా.

ద్వితీయ:—[హర్షముతో త్వరగాఁ జెంతకుఁ బోయి] ఓహో! వచ్చినదే వసంతమాసము!

ప్రథమ:—మధుకరికా, ఇదెగదా నీమదవిభ్రమగీతములకుఁ గాలము.

ద్వితీయ:—చెలీ, నన్నుఁ బట్టుకొమ్మ. మునిపాదములపై నిలిచి కామదేవపూజకొఱకు మావిమొగ్గను గోసెదను.

ప్రథమ:—పూజాఫలములో నాకు సగమేని?

ద్వితీయ:—నోటఁ జెప్పకున్నను ఇది యిట్లే జరుగునది; అదెట్లనిన, మనకు దేహములు రెండైనను జీవితమొకటేగదా. [తన్నుఁ జెలి పట్టుకొనఁగా మావిమొగ్గను గోయును.] ఓహో వికసిల్లకయే మావిమొగ్గ తొడిమనువిఱువఁ బరిమళించుచున్నది! [కపోతము చేసి]

క. దరిసింతు నిన్నుఁ జూతాం
కురమా, కంతుని కధిజ్యకోదండునికిన్;
గరకరియువతుల నేయఁగ
శరమవు పంచాధికమవు చయ్యనఁ గమ్మా. 137

[అని మావిమొగ్గను వైచును.

[కంచుకి పటాక్షేపముగాఁ గోపముతోఁ బ్రవేశించును.]

కంచుకి:—ఆ! ఆ! ఏమి యీయొడలెఱుఁగమి! ఏలినవారు వసంతోత్సవమును నిషేధించియుండఁగా నీవేమో మావిమొగ్గను గోయుచున్నావు!

ఇరువురును:—[భయముతో] అయ్యా, మమ్ము మన్నింపుము మన్నింపుము. ఆ విషయమును మేమెఱిఁగినవారము కాము.

కంచుకి:—వినలేదుగా మీరు, ఈవాసంతికవృక్షములుగూడ వీని నాశ్రయించిన పక్షులుగూడ శిరమున వహించుచున్న యేలినవారియాజ్ఞను? చూడలేదా?

మ. చిరమయ్యున్ బొడతెంచి క్రొన్నన రజఃశ్రీఁ దాల్ప దామ్రంబులన్,
సిరులన్ గోరఁటమొగ్గ నిండియును నిల్చెన్ మొగ్గరూపాననే,
పొరసెన్ లీనతఁ గుత్తుకన్ సురభినిన్ బుంస్కోకిలోత్కూజనల్,
స్మరుఁడున్ డించుబలెన్ నిషంగదరకృష్టంబున్ వెలన్ బాణమున్.

సానుః—

ప్రథమ:—అయ్యా, కొలఁదిదినములేగదా అయినవి ఏలినవారి బావమఱఁది మి
వసువుగారు పంపఁగా మేము ఈప్రమదవనము నలంకరించుటకై యేలినవారిపాదము
నిచ్చుటఁ బ్రవేశించి.

కంచుకి:—కానిండు. ఇఁక మఱి యిట్లు చేయకుఁడు.

ఇరువురు:—అయ్యా, మాకు వినవేడుకగా నున్నది. మేము వినఁదగునేని దయ
చెప్పుము. ఏలినవారు వసంతోత్సవము నేల నిలిపివైచినారు ?

సాను:—ఉత్సవప్రియులు మనుష్యులు. ఇందులకారణము గొప్పదిగా నుం

కంచుకి:—ఎల్లవారికిం దెల్లమైనవిషయ మిది, ఏల చెప్పరాదు ? ఏమి ! లో
చెప్పుకోఁగా మీరు వినలేదా, రాజు శకుంతలను నిరాకరించినవృత్తాంతమును ?

ఇరువురు:—మిత్రావసువుగారివలన వింటిమి, ఏలినవా రుంగరమును జూచిన

కంచుకి:—అట్లయినఁ జెప్పవలసినది కొంచెమే అల్ల తనయుంగరమును
కొనఁగానే యేలినవారు నిజముగా తా నామహానుభావురాలిని శకుంతలను నేకాం
వివాహ మగుటయు మఱపుచే నామెను తాను నిరాకరించుటయుఁగా స్మరించి
మొదలు పశ్చాత్తాపముపాలై యున్నారు. ఎట్లనిన,—

మ. గొనబొల్లం డనుఘస్ర మెప్పటివలెం గొల్వుం డమాత్యాళికిం,
ఘనశయ్యాంతవివర్తనంబుల నిశ న్వేగించు నున్నిద్రుఁడై,
తనువే యాచితి రాణివాసములతో దాక్షిణ్యభావం బెడం
బెనఁగం బల్కియు గోత్రసంస్ఖలితుఁడై వ్రీడాజడుం డౌఁగడు

సాను:—మిగుల సంతోషము, మిగుల సంతోషము.

కంచుకి:—ఇందువలని యాకులపాటుచే నుత్సవము నిలుపుదల చేయఁబడి

ఇరువురు:—బాగుగానున్నది, బాగుగానున్నది.

[తెరలో]

దేవా, ఇటు ఇటు.

కంచుకి:—[చెవి యొగ్గి] ఓహో, ఏలినవారు ఇట్లే వచ్చుచున్నారు,
మీరు చూచుకొనుఁడు.

ఇరువురు:—అట్లే చేసెదమయ్యా. [అని నిష్క్రమింతు

[అంతఁ బశ్చాత్తాపోచితవేషుఁడై రాజు ప్రవేశించును;
విదూషకుఁడును బ్రతీహారియుఁ గూడ నత్తురు.]

విదూ:—దేవా, ఇటు ఇటు.

కంచుకి:—[రాజుం గని] అహో! కొన్నియాకృతు లెల్లయవస్థలయందును రమణీయములే. అట్లే ప్రభు వీరీతి నుత్కంఠితుం డయ్యును బ్రియదర్శనుండే.

మ. పలుభూష ల్గయిసేఁత మాని యొకటే వామప్రకోష్ఠంబునన్
జ్వలియింపంగఁ బసిండికంకణము నిశ్వాసాపరక్తోష్ఠుఁ డై
యలఁతం జింత ననిద్రతాంతనయనుం డై క్రుస్సియున్ స్వప్రభన్
గలయం జెక్కిన దొడ్డహీరమువలెన్ గన్పట్టు నక్షీణతన్. 140

సాను:—[రాజును జూచి] యుక్తమే సుమా నిరాకృతిత ప్త యయ్యును శకుంతల యితనికై గాసిల్లుట.

రాజు:—[ధ్యానించుచు మెల్లఁగాఁ బరిక్రమించి]

క. మును నాప్రియ యాహారిణన
యన మెంతే మేలుకొల్ప నటు సుప్తమ నై
యనుశయదుఃఖముకొఱకే
వెనుక నిపుడు మేలుకొంటివే పాడుమతీ. 141

సాను:—పాపము! శకుంతలయదృష్ట మిట్టిది!

విదూ:—[అపవారించి] అయ్యో, మరల నితనిని శకుంతలావ్యాధి ముంచుచున్నది! ఏవైద్యమునఁ గుదురునో యెఱుఁగను. ఏమి చేయుదును?

కంచుకి:—[సమీపించి], జయము జయము ఏలినవారికి. మహాప్రభూ, ప్రమదవనప్రదేశములను బరికించి వచ్చితిని. ఏలినవారు చిత్తమువచ్చినట్లు వినోదస్థానములయందు విజయం చేయవచ్చును.

రాజు:—వేత్రవతీ, మామాటగా మహామంత్రిపిశునునితోఁ జెప్పుము; "ప్రొద్దెక్కి మేల్కొంటిమి గాన ధర్మాసనమునకు రా మైతిమి. ఆర్యుఁడు విచారణకుఁదెచ్చు పౌరకార్యమును మాకడకు వ్రాసి పంపవలసినది," అని.

ప్రతీ:—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాజు:—వాతాయనా, నీవును నీపనిఁ జూచుకొమ్ము.

కంచుకి:—చిత్తము. [అని నిష్క్రమించును.

విదూ:—నిర్మక్షికము చేసితివి. ఇఁక నిపుడు నేద దేఱఁ జలువలు వెదచల్లు నీప్రమదవనభాగంబున వినోదింపుము.

రాజు:—[నిశ్వసించి] వయస్యా, ఛిద్రములదారి ననర్థములు వచ్చుననుమాట తప్పునది గాదుసుమా.

[ద్రుతవిలంబితము]

యమిసుతాప్రణయస్మృతిరోధి యా
తమము వీడెఁ గదా యిదె నామదిన్,
సుమశరుండు నను న్సఖ యేయఁ జా
పమున మామిడిబాణముఁ గూర్చెఁబో.

విదూ:—రవంత యోర్వుము. ఈచేతికఱ్ఱతో మదనవ్యాధిని నుసిఱ్చెదను.
[అని కఱ్ఱ యెత్తి మావిమొగ్గను బడఁగొట్ట నుంకించు

రాజు:—[చిఱునవ్వుతో] మంచిది, నీబ్రహ్మవర్చసము ప్రత్యక్షమైనది. మిత్ర
నాప్రాణేశ్వరి నించుకంతపోలు నీతీవియలచేత నాచూడ్కికి వినోద మొసఁగ నేనె
గూర్చుందును ?

విదూ:—ఆసన్నపరిచారికను చతురిక నాజ్ఞాపించితివిగదా, 'ఈ సమయమున
మాధవీమంటపమునఁ గడపెదను, అచటికి నేను స్వయముగా వ్రాసిన శకుంతలా ప్ర
గల చిత్రఫలకమును దెమ్ము,' అని.

రాజు:—అట్టిచోట మది వినోదముం బొందును. అచటికే దారి చూపుము.

విదూ:—వయస్యా, ఇటు ఇటు.

[రాజు పరిక్రమించును. సానుమతికూడఁ బోవు

---

[స్థలము III. ఆ ప్రమదవనముననే మాధవీమంటపము.]

విదూ:—ఇదిగో రతనంపుటరఁగుతో మాధవీమంటపము శోభిల్లుచున్నది.
యుపచార రమణీయతచే నిస్సంశయముగా ప్రీతితో నిన్నదుస నూచుచున్నది
బోలె నొప్పుచున్నది. కావున, వయస్యా, ఇందుఁ బోయి కూర్చుందము.

[ఇరువురు ప్రవేశ మభినయించి, కూర్చుం

సాను:—తీఁగయం దుండి చూచెదనుగాక నెచ్చెలిప్రతిమను. అంత నా
బహుముఖ మగుభర్తృనురాగమును దెలిపెదను. [అని యట్లే చేసి యుం

రాజు:—మిత్రమా, సర్వము నిపుడు స్మరించుచున్నాను శకుంతలా ప్ర
వృత్తాంతమును. చెప్పియుంటిని నీతోఁగూడ, నిరాకరణసమయమందు నీవు నా
లేవు గాని తత్పూర్వ మెప్పుడును గోష్ఠిలో నాప్రేయసిపేరి నయినఁ బలుకవై
ఏమి నీవును నావలెనే మఱచితివా ?

---

142-వ పద్యమునకుఁ బద్యాంతరము.

ఆ. మునికుమారిమీఁది యనురక్తి మఱువెట్టు
తమము విడెనొ లేదొ తా మనంబు,
నన్ను నేయఁ దక్షిణమె మిత్ర యరిఁబోనె
యనసిఱుయు మామిడిమార్గణమును.

విదూ:—మఱవలేదు, కాని, సర్వమును జెప్పి నీవు చివరను బరిహాసోక్తు లనియుఁ బరమార్థము గాదనియుఁ బలికితివి. మట్టిముద్దబుద్ధిగాఁడను దాని నట్లే గ్రహించితిని. ఇం తేల, విధి బలీయము.

సాను:—అది వాస్తవమే.

రాజు:—[ధ్యానించి] మిత్త్రమా, నన్నుఁ గావుము.

విదూ:—అయ్యయ్యో! ఏమి యిది! నీయం దిట్టిది తగదుసుమా. సత్పురుషు లెప్పుడును శోకముపాలు గారు. మిత్త్రుఁడా, పెనుగాలి కయినను గొండలు కద లవుగదా.

రాజు:—వయస్యా, నిష్కారణ నిరాకరణముచే డిల్లవోయిన నాప్రేయసియవస్థను దలంచి మిగుల నశరణుండ నగుచున్నాను. ఎట్లన, నాసమయమున,

ఉ. చేకొన కేను ద్రోవ నిటఁ, జేఁవ్వడి బంధులఁ జేరనై యటఁ,
రా కని రోష భీషణగిర న్బితృశిష్యుఁడు తన్నిభుఁడు నా,
నాకమలాక్షి నన్నుఁ గఠినాశయు వెంగియుఁ గన్న యాప్రబా
ష్పాకులదృష్టి యేన్ప ననయంబు నిశాతశరంబుకైవడిన్. 143

సాను:—అహా! ఒంటెత్తుఁదన మన నిట్టిది, ఇతని యీసంతాపమునకు నేను సంతసిల్లుచున్నాను.

విదూ:—హా! నేఁ దలంచెదను, ఎవఁడో ఆకాశచారి యామెను గొని పోయి నాఁడని.

రాజు:—అ ట్లుండదు. ఆపతిదేవత నన్యుఁ డెవఁడు తాఁక నుత్సహించును? మేనకగదా నీచెలితల్లి యని వింటిని. ఆమెచెలులు నా ప్రేయసిని గొనిపోయి రని తలంచెదను.

సాను:—మఱపున కాశ్చర్యముగాని మేలుకువకుఁ గాదు.

విదూ:—అట్లేని, త్వరలోనే నీ కామెతో సహగమము కలుగును.

రాజు:—అ దెట్లు?

విదూ:—భర్తృవిరహదుఃఖితను కొమారితను తల్లిదండ్రులు చిరకాలము చూడ నోపరుగదా.

రాజు:—వయస్యా.

క. కలయో! మాయయొ! భ్రమయో!
ఫల మంతియు నైనపుణ్యపరిక్షప్తియొకో?
మలఁగక యనియు నడంగెను;
గల్గుగున్నె నూలవములు నోఁకల వెల్గులమ్మన్? 144

విదూ:—అట్లుగాదు, ఇదిగో ఈయుంగరమే నిదర్శనము, తప్పక సమసమ నర్థము అతర్కితోపనతముగా లభించు ననుటకు.

రాజు:—[ఉంగరమును జూచి] అయ్యో, ఇదియును అయసులభస్థానము భ్రష్టమై కనికరింపఁదగి యున్నది.

ఆ. అంగుళీయకంబ, యల్పపుణ్యామ వీవు
నను దొరయుదు ఫలమునను దలంప,
నరుణనఖలసత్తదంగుళీదళములఁ
బదముఁ గనియుఁ గోలుపడితి గాదె ? 1

సాను:—మఱియొకచేతఁ బడెనేని నిజముగాఁ గనికరింపఁదగినదే.

విదూ:—మిత్త్రుఁడా, ఈనామముద్రిక, ఏసందర్భమున నామెచేతిపొందు దింపఁబడినది ?

సాను:—నామనంబునను నిదియే కుతూహలము.

రాజు:—వినుము. అపుడు నా నగరమునకు నేను దరలఁగాఁ బ్రాణేశ్వరి సబాష్పగద్గదముగా నడిగినది-'ఆర్యపుత్త్రుఁడు మరల నన్నెప్పటికి స్మరించుటయో' య

విదూ:—అంతట ?

రాజు:—అంత, ఈనామముద్రికను బ్రేయసివ్రేల నుంచుచు నిట్లు వచించి

చ. దినదిన మొక్కటొక్కటిగ దీనఁ జెలంగుమదాఖ్యలోఁ గల
దనరెడు నక్కరాలు తుదిదాఁకఁగ లెక్కయొనర్పు వావిరిఁ;
బనివడి యంత నిన్నుఁ గులభామను నాయనరోధసీమకుం
గొనెడినరుండు నీకడకుఁ గొబ్బున వచ్చునుజుమ్ము ప్రేయసీ. 1

అని.—దానిని క్రూరాత్ముఁడను మఱపుచే జరుపనైతిని.

సాను:—అందమయిన యవధిని దైవము తప్పించినది.

విదూ:—మఱి, అది జాలారివాఁడు కోసిన యెఱ్ఱచేపకడుపులోని కెట్లు వచ్చె

రాజు:—శచీతీర్థమును నీచెలి నమస్కరించినప్పుడు చేతినుండి జాఱి గంగా ప్రవాహములోఁ బడిపోయినది.

విదూ:—సరిగానే యున్నది, సరిగానే యున్నది.

సాను:—సరి, అందువలనఁజుమా అధర్మభీరువున కీరాజర్షికి శకుంతలయం వివాహసందేహము. అయినను, మఱి, యిట్టియనురాగమున కానవాలు వలయున ఇది యెట్లు ?

రాజు:—ఈ యుంగరమును దూఱెదనుగాక.

విదూ:—[ఆత్మగతము] ప్పట్టి మదురుచున్నది.

రాజు:—

చ. ఒఱపుగ బంధురారుణమహోమృదులాంగుళిఁ దత్కరంబునన్
వలలియు దానిఁ ద్రోచి జలభంగములం బడి తేల యుంగ్రమా?

అట్లు గాదు,

మొఱక యచేతనంబు, గుణము న్గ్రహియింపదుగాక, నేన యా
తెఱఁగునఁ గాంత నేల యనధీరణ సేసి యలంచితిం గటా! 147

విదూ:—[ఆత్మగతము] హా! న న్నాఁకలి తినివేయుచున్నది!

రాజు:—నిష్కారణపరిత్యాగపశ్చాత్తప్తహృదయు నీజనుని మరల దర్శనమిచ్చి కావవే ప్రాణనాయికా.

[చతురిక పటాక్షేపముగాఁ బ్రవేశించును.]

చతురిక:—ఇదిగో చిత్రగత దేవేరి. [అని చిత్రఫలకమును జూపును.

విదూ:—బళి! వయస్యా బళి! అహో! ఈయాకృతి యెంతమధురము! భావము లెంత చక్కఁగా తీరినవి! నాచూడ్కి యీనిమ్నోన్నతములయందుఁ దడఁబడి జాఱు నదివోలె నున్నది.

సాను:—అహో! ఏమి యీరాజర్షి శిల్పనైపుణి! సాక్షాత్తు నెచ్చెలి కన్నుల యెదుట నున్నట్లు తోఁచుచున్నది.

రాజు:—

ఆ. చిత్తరువున నేది చెందదో సాధుత
దిద్ది దిద్ది దానిఁ దీర్తు రెంను,
అనహికిని లేమలావణ్య మీరేఖ
నించుకించుకే లగించె నౌర! 148

సాను:—ఇది అగర్వమునకును బశ్చాత్తాపసంభృతస్నేహమునకును సరిగా నున్నది.

విదూ:—ఇందు మువ్వురు మహాభాగ లగపడుచున్నారు, అందఱు దర్శనీయలే, వీరిలో మహానుభావురాలు శకుంతల యెవరు?

సాను:—ఈమనుష్యుఁడు నాసఖిరూపమును గని యెఱుఁగఁడు, వీనికన్నులు నిష్ప్రయోజనములు.

రాజు:—నీబుద్ధి కెవ రని తోఁచుచున్నది?

విదూ:—ఇదిగో, క్రొమ్ముడి వీడి పువ్వులు రాల, మొగంబున లేఁజెమ రంకురింప, బాహులతలు కడు నమ్రత నొప్ప, నీటిపోఁతచేఁ దళతళలాడుచున్న లేఁజివుళులతోడి యీమావిమోక చెంత నించుకంత యలసినదిగా నాలిఖితయైన యీమహానుభావురాలు శకుంతల యనియు, కడమ యిరువురుం జెలులనియు నేఁ దలంచెద.

రాజు:—నిపుణుఁడవోయి నీవు. ఇచట నాభావంపుగుఱుతుగూడ నున్నది.

ఆ. స్వేద మూరు వ్రేలిచే నూనుటం దెల్పు
రేఖయోర మచ్చరీతి యిదిగొ
గండదర్పణమునఁ గన్నీ ర్పడుటఁ దెల్పు
వన్నె పొక్కినట్టిచిన్నె యిదిగొ.

చతురికా, అర్ధలిఖిత మీవినోదస్థానము, పోయి వర్ణికలను గొనిరమ్ము.

చతు:—అయ్యా మాధవ్యయ్యా, పట్టుకోవయ్యా చిత్తరుపలకను, నేను రం బరణిని తెచ్చెదను.

రాజు:—నేనే దీనిం బట్టుకొనెదను.

[అని యట్లుఁ జేయును. చతురిక నిష్క్రమించు

రాజు:—మిత్రమా,

ఆ. సరస కపుడు రాఁగ సాక్షాత్సఖిని ద్రోచి
చిత్రసఖిని దొడ్డ సేయునేను
త్రోవ ఘూర్ణదమృతస్రోతోవహాను దాఁటి
మనసుపడితి నెండమావులందు.

విదూ:—[ఆత్మగతము] నిజముగా నితఁడు నదిని దాఁటి యెండమావులకు పో చున్నాఁడు. [ప్రకాశము] వయస్యుఁడా, ఇంక నిం కేమి వ్రాయుదువు?

సాను:—నిశ్చయముగా నేయేప్రదేశము నానెచ్చెలికిఁ బ్రియమో దానిఁ వ్రాయఁగోరుచున్నాఁడు.

రాజు:—వినుము,—

ఉ. జానగు వ్రాయ మాలిని సనై కతలీనమరాళపంక్తిగా
దానిదరిన్ హిమక్ష్మాహరిణంబులు మాగురుపుణ్యపాదముల్
బూనెద వ్రాయ వల్కలపుఁబుట్టము వ్రేలెడు చెట్టునీడలో
మానుగఁ గాంతు కొమ్ముకొన మంపుగ డాకను గీఱుకొన్మృగిన్.

విదూ:—[ఆత్మగతము] ఇట్లేని, యితఁడు తప్పక యీచిత్రఫలకమును కు మీసాల వ్రేలుగడ్డాల తాపసులగుంపుతో నిండించును.

రాజు:—వయస్యా, శకుంతల దాల్చినయలంకారము నిచట వ్రాయమఱచి తిమా, దాని నిపుడు వ్రాయఁగోరెద.

విదూ:—ఏ మది?

సాను:—వననివాసమునకును సౌకుమార్యమునకును తగినదో అది.

రాజు:—

ఉ. వ్రాయన యైతిఁ గర్ణమున వావిరి నర్పితవృంతముం గపో
లాయతిచుంబి కేసరము నందములొల్కు శిరీషపుష్పముం,
వ్రాయఁగదా స్తనాంతరమునం శరదిందుమరీచి రేఖనే
లోనెయగమా మృణాళతనుసూత్రము నైన ననుంగుమిత్రమా. 152

విదూ:—ఇ దేమి, యీమె యెట్టిగలువం బోని కరతలంబున నెమ్మొగమ్ముం గ్రమ్మి బెదరినదివోలె నిలుచున్నది? [సావధానముగాఁ బరికించి] హా! వీఁడుగో లంజాఁకొడుకు పూవుఁదేనె తెక్కలికాఁడు పాపుఁదుమ్మెదగండఁడు మహాభాగముఖమును పైకొనుచున్నాఁడు!

రాజు:—ఈదుష్టుని నివారింపవోయి.

విదూ:—నీవే దుర్వినీతులను దండింపువాఁడవు, వీనిని వారింప సమర్థుఁడవు.

రాజు:—ఓయి పూఁదీఁగలప్రియాతిథీ, ఇచట నేల పడిపడి బడలెదవు?

క. కుసుమమున వ్రాలియును, దగ
నసివాడియు, నీకుఁ గూర్చి, సరమతి నీకై
దెస లరయు, మధువుఁ గ్రోలదు,
భసలి సరస నీవు లేక భసలవతంసా. 153

సాను:—ఇట్టిప్రభువు దీనిని నాగరకముగా నివారించుచున్నాఁడు.

విదూ:—తఱిమినను ఈజాతి మొండిదిగదా.

రాజు:—ఇట్లు నాయాజ్ఞచొప్పున నడచుకొనవేని, విను మఱి.

చ. నలుఁగనిపోఁడిబాలతరునవ్యదళం బన లోభనీయముం
బలుదయ దేని నన్నువిభవంబుల మెల్లనె యానినాఁడనో
జెలిమధురాధరంబునఁ గసిం గసిఁ గాటువవింతువే నటం,
సలిలరుహోదరంపుఁజెఱసాలను బంచె నెనర్తు నిన్నలీ. 154

విదూ:—ఇట్లు తీక్ష్ణముగా దండించువాని కేల భయపడుఁడు? [వికవిక నవ్వి ఆత్మగతము] ఆహా, ఇతనికి వెఱ్ఱి యెత్తినది! ఇతని సంపర్కముచే నేను నట్లే అయితిని! [ప్రకాశము] వయస్యా, చిత్తరువుసుమా యిది.

రాజు:—ఏమీ!

సాను:—నాకుఁగూడ నింతవట్టు తెలియ కుండినది! యథాలిఖితముగా ననుభవించుచున్న యితనిమాట చెప్పవలయునా?

రాజు:—వయస్యా, [illegible]

క. సుఖమునఁ జొక్కుచు సాతఁపొ
త్సఖిఁ గన్న ట్లుండ నేను దన్మయమతి నై,
సఖ, తెలివిగొల్పి యకటా!
లిఖియించినబొమ్మగాఁ జెలిం జేసితివే!

[అని కన్నీరు విడు

సాను:—ఈవిధ మపూర్వము, పూర్వాపరవిరోధిగా నున్నది.

రాజు:—నిరంతరము దుఃఖ మి ట్లనుభవింపఁదరమా?

క. బలుజాగరములచే నా
కలికిఁ గలం గలయుటయును గల్లయ యయ్యెన్,
అలవడనీదు విలోచన
జల మీచిత్రస్థ నైన సందర్శింపన్.

సాను:—వయస్యా, సర్వథా తుడిచివేసితివి శకుంతల కిడిన నిరాకరణదుః

చతురిక:—[ప్రవేశించి] జయము జయము ఏలినవారికి. రంగులబరణిని
యిటు వెడలితిని.

రాజు:—అంతట?

చతు.—అంత, వసుమతీదేవిగారు తరళికా ద్వితీయ యై వచ్చి, "ఆర్య
నికి నేనే దీనిం గొనిపోయి యిచ్చెద న"ని బలాత్కారముగా నాచేతినుండి దానిం
కొన్నారు.

విదూ:—నీయదృష్టముచేత నిన్ను వదలిరారు.

చతు:—అమ్మగారి పైఁటచెఱంగు క్రొమ్మకుఁ దగులఁగా, తరళిక దానిం ద
చుండఁగా, నేను దప్పించుకొని వచ్చితిని.

రాజు:—వయస్యా, అదిగో దేవి వచ్చినది, బహుమానగర్వితే; నీ
రక్షింపుము.

విదూ:—[చిత్రఫలకం గొని లేచి] 'నీప్రాణములను' అని పలుకుము.
రాణిగారితోడికలహామునుండి తప్పి బయటఁ బడితివేని, అప్పటికి నన్ను మేఘప్ర
ప్రాసాదమునుండి రప్పించుకొమ్ము. [అని వడివడిగా నిష్క్రమిం

సాను:—అన్యసంక్రాంతహృదయుఁ డయ్యును మొదలిగౌరవమును గా
చున్నాఁడు, కావున నితఁడు సడలనిప్రేముడిగలవాఁడు.

ప్రతీహారి:—[జాబు తెచ్చి ప్రవేశించి] జయము జయము ఏలినవారికి.

రాజు:—వేత్రవతి, దారిలో దేవి నే మయినఁ జూచితివా?

ప్రతీ:—చూచితిని. జాబుచేతితో నేను వచ్చుటం గని యమ్మగారు వెనుకకు మరలిపోయినారు.

రాజు:—పని యెఱింగినది, పని కభ్యంతరము చేయదు.

ప్రతీ:—దేవా, మంత్రిగారు మనవిచేయుమన్నారు:—"ధనజాతము విస్తారము లెక్కవెట్టుచున్నందున నేఁటి కొకటే పౌరకార్యము విచారించినాఁడను. దానిని పత్త్రికలో వ్రాసి పంపినాఁడను, ఏలినవారు చిత్తగింపవలయును." అని.

రాజు:—ఇటు చూపుము పత్త్రికను. [ప్రతీహారి చూపును.

రాజు:—[చదువుకొని] ఏమీ! సముద్రవర్తకుఁడు ధనమిత్రుఁడు ఓడ పగిలి కాలముచేసినాఁ డఁట! పాపము! సంతతికూడ లేదఁట. అతని ధనరాసులు రాజునకుఁ జేరవలసిన వని మంత్రి వ్రాసినాఁడు. కటకటా! సంతు లేమి యెంత కష్టము! శ్రేత్రవతి, మహాధనుఁడు గావున ఆవణిక్సత్తమునికి పలువురు భార్య లుందురు, విచారింపుమనుము.

ప్రతీ:—దేవా, ఈనడుమనే యతనిభార్యలలో సాకేతసెట్టికొమారితకు పుంసవనము జరిగిన దని చెప్పుకొనుచున్నారు.

రాజు:—సరి, పితృధనము గర్భమును జెందవలసినది. పోయి మంత్రితో నట్లు చెప్పుము.

ప్రతీ:—ఏలినవారియాజ్ఞ. [అని తరలును.

రాజు:—ఓహో! ఇటు రమ్ము రమ్ము.

ప్రతీ:—వచ్చితిని.

రాజు:—సంతతి కలదని లేదని యీ విచార మేల?

క. ఏయే ప్రియబంధువు నెడఁ
బాయుదురో ప్రజలు వారిపాల ననఘు మా
నాయమ్మున దుష్యంతుం
డాయాబంధు వని చాటుఁ డతివిశదముగాఁ. 157

ప్రతీ:—ఇట్లే చాటింపు మని చెప్పెదను. [నిష్క్రమించి మరలఁ బ్రవేశించి] ఏలినవారి యీశాసనమునకు మహామంత్రిగారు కాలప్రవర్షమునకుంబోలె సంతోసించినారు.

రాజు:—[నిడుదయూర్పు పుచ్చి] ఇట్లకటా సంతతిచ్ఛేదముచే నిరవలంబు లగు వారిసంపదలు మూలపురుషునిపిమ్మట నితరునిం జేరును. నాపిమ్మటను పూరువంశపు సిరికి నిదే గతి.

ప్రతీ:—ప్రతిహాత మమంగళము.

రాజు:—ఇసీ! తనంతన వచ్చినశ్రేయస్సును దిరస్కరించితిని.

సాను:—నిశ్చయముగా నెచ్చెలినే దలంచి యీతఁడు తన్ను నిందించు చున్నాఁడు.

రాజు:—

క. ఏల విడనాడితిఁ గులా
వాలము గర్భితమదాత్మఁ బాణిగృహీతిన్,
గాలోప్తబీజ ఫలభర
శాలిని వసుధం ద్యజించుజాల్మునిభంగిన్!

సాను:—మితిలేనిసంతతి నీకుఁ గలుగును.

చతు:—[జనాంతికము] ఓసీ, యీసార్థవాహవృత్తాంతముచే ప్రభువునకు నాకులపాటు కలుగుచున్నది. ఏలినవారిని వినోదపఱుచుటకు మేఘప్రతిచ్ఛందమున మాఢవ్యయ్యను తోడ్కొనిరా.

ప్రతీ:—చక్కఁగా చెప్పితివి. [అని నిష్క్రమించు

రాజు:—అకటా! దుష్యంతునిపితృదేవతలు సంశయఖేదమునఁ బడినారు.

చ. 'ఎవఁ డిఁక వీనివెన్క మన కీకులమం దయయో! యథావిధిన్
నివపన మిచ్చువాఁడ, నుచు నిక్కము మత్పితృదేవసత్తముల్
అవసితసూతి నే నిట సమర్పణసేయు నివాపవారిలో
నెవులున బాష్పముల్గడుగనిల్చినపాటిని ద్రావుదు ర్కటా.

[అని మూర్ఛిల్లు

చతు:—[సంభ్రమముతోఁ బట్టుకొని] సమాశ్వసింపుఁడు దేవా, సమాశ్వసింపుఁడు

సాను:—దీపము వెలుఁగుచున్నను చాటుదోషముచేత నితఁ డంధకారము ననుభవించుచున్నాఁడు. నే నిప్పుడే యితని నూఱడిలంజేసెదను. పోనిమ్ము, అట్లు కాదు మహేంద్రునితల్లి శకుంతల నోదార్చుచు 'యజ్ఞభాగార్థులు సురలే నీభర్త నిన్ను ధర్మపత్నిని త్వరలోనే గ్రహించునట్లుగాఁ జేసెదరు లే'యని చెప్పుచుండఁగా వింటిని. కావున నాసమయము నెదురుచూచుచుండుట మంచిది. ఇచటియీవృత్తాంతమును జెప్పి ప్రియసఖి నోదార్చెదను.

[అని యుద్భ్రాంతకముచే సానుమతి నిష్క్రమించు

[ తెరలో ]

అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యము!

రాజు:—[చెవి యొగ్గి] ఏమి! మాఢవ్యునియార్తస్వరమువలె నున్నది! ఎవరక్కడ?

ప్రతీ:—[తొట్రుపాటుతోఁ బ్రవేశించి].—దేవా! కావుము కావుము! ఎవరో గొంతుపట్టి ప్రాణసంశయమునకుఁ దెచ్చినారు నీప్రియవయస్యుని!

రాజు:—ఎవరు గొంతుపట్టుకొన్నా రీకుఱ్ఱవానిని?

ప్రతీ:—కంటి కగపడక యేదో భూతము మాఢవ్యయ్యను మేఘచ్ఛందప్రాసాదము పైతలమునకుం గొనిపోయినది.

రాజు:—[లేచి] చెల్లదు చెల్లదు, నాయింటఁగూడ భూతములా! అయినను, అట్లనరాదు;

క. అనుదిన మాత్మస్ఖలితము
లనే ప్రమాదజములను నలవి గా దెఱుఁగన్,
జనులం దెనఁ డేపథమునఁ
జనునో యది యెల్ల నెఱుఁగ శక్యం బగునే! 160

[తెరలో]

ఓహోయి వయస్యా, చచ్చితిని చచ్చితిని!

రాజు:—[గతిభేదముగాఁ బరిక్రమించుచు] మిత్రుఁడా, భయపడకు భయపడకు!

[తెరలో]

[మరల దానినే పఠించి] మహానుభావా, ఎట్లు భయపడకుందును? వీఁడెవఁడో నన్ను మెడపట్టి వెనుకకు వంచి చెఱకు విఱిచినట్లు విఱుచుచున్నాఁడు.

రాజు:—[చూడ్కి నిగిడించి] ధనుస్సు ధనుస్సు!

యవని:—[బాణాసనము కేలఁ గొని ప్రవేశించి] దేవా, ఇదిగో ధనుస్సు, ఇదిగో అత్తెము. [రాజు సశరముగా ధనుస్సును గ్రహించును.

[తెరలో]

మ. నవకంఠక్షతజాశ బెబ్బులి యనూనక్రాంతిమై నుక్కుముగ్
వివశోద్దామవిచేష్టము న్గడపుఁవి న్నిన్ని దే గూల్చెదన్!
బ్రవిభీతార్తిఁ దెరల్ప నాత్తధను వై భ్రాజిల్లుదుష్యంతభూ
మివిభుం డిప్పుడు నిన్నుఁ గాచు నఁట! నెమ్మిం బేరుకొ మ్మాతనిన్.

రాజు:—[రోషముతో] ఏమి! నన్నే నిర్దేశించుచున్నాఁడు! నిలునిలు కోణపాదమా, ఇఁక నీ వుండవు. [వి ల్లెక్కువెట్టి] వేత్రవతి, సోపానమార్గమును జూపుము.

ప్రతీ:—ఇటు ఇటు ఏలినవారు. [అందఱు సత్వరముగా నడతురు.

[స్థలము IV. మేఘప్రతిచ్ఛందప్రాసాదము.]

రాజు:—[అంతటఁ గలయం జూచి] ఎవరును లేరే యిచట ?

[తెరలో]

అయ్యయ్యో! అయ్యయ్యో! వయస్యా, నేను నిన్నుఁ జూచుచున్నాను, నన్నుఁ జూడవు. పిల్లిపట్టిన యెలుకవలె ప్రాణములపై నిరాశుఁడ నయితిని.

రాజు:—ఓరి తిరస్కరిణీగర్వితుఁడా, నాయస్త్రము నిన్నుఁ గాంచును. ఇఁక పాఱిపోక నిలువుము. ఇదిగో బాణమును దొడుగుచున్నాను.

క. ఇది నిన్ను వధ్యు దూఁకొని
విదళించుఁ రక్ష్యు విప్రు వెస రక్షించున్,
విదితముగ హంస పాల్గొని
తదన్వితంబును జలంబుఁ ద్యజియించుగతిన్.

[బాణము సంధించును.

[అంతట విదూషకుని విడిచి మాతలి ప్రవేశించును, విదూషకుఁడును బ్రవేశించును.]

మాతలి:—

ఆ. హరి యొనర్చె నీకు నసురుల గుఱి గాఁగ
వంపవయ్య ధనువు వారిఁ ద్రుంప,
సజ్జనులు ప్రసాదసౌమ్యదృష్టులఁ గాని
చెలులపై వయితురె శితశరముల ?

రాజు:—[అస్త్రము నుపసంహరించి] ఓహో మాతలీ, దేవేంద్రసారథీ, స్వాగతము !

విదూ:—న న్నిష్టిపశుమారముగాఁ జంపినవాని నితఁడు స్వాగతముల గాఁచుచున్నాఁడు.

మాత:—[చిఱునవ్వుతో] ఆయుష్మంతుఁడా, వినుము, ఇంద్రుఁడు నీకడకు బంపఁగా వచ్చినాఁడను.

రాజు:—అవధానముతో వినుచున్నాఁడను.

మాత:—కాలనేమికుమారులు దుర్జయు లనుపేరి రాక్షసులు గొప్పమూఁక...

రాజు:—కలరు, నేను నారదునివలన విని యున్నాను.

మాత:—ఆయుష్మంతుఁడా,

ఉ. నీచెలికాని క్రిందునికి నెట్టన వారలజయ్యు, లాత్రియా
మాచరపాళిఁ బోరఁ బరిమార్పుదు నీ వని యాతఁడెంచెఁబో;
రోచిరుదంచితుండు రవి ద్రోవఁగ లేనినిశాంధకారముం
బీఁచమడంపఁడే యమృతబింబవిరాజితుఁ డిందుఁ డుద్ధతిన్. 164

నీవు గృహీతశస్త్రుఁడ వై యిపుడ యీయింద్రరథము నెక్కి విజయార్థము బయలు వెడలుము.

రాజు:—మహేంద్రుని యీగౌరవముచే ననుగృహీతుఁడను. సరిగాని, మాఢవ్యునిఁ గూర్చి నీవేల యట్లు చేసితివి?

మాత:—దానిం జెప్పెద. కారణాంతరముచేఁ గలిగిన మనస్సంతాపమున నాయుష్మంతుఁ డాకులపాటుగా నగపడెను, వెంటనే కోపముగలిగించుట కట్లు చేసితిని. ఏల యన,—

ఆ. ఎరియుఁ గృష్ణవర్త్మ యిధ్మము ల్గదలింప,
ఫణి కెరల్తు మేని పడగ విప్పు,
స్వప్రభావ మెల్ల వాలాయముగఁ జూపుఁ
బ్రాణికోటి క్షోభపడినయపుడు. 165

రాజు:—యుక్తమే చేసితివి. [జనాంతికము] వయస్యా, దేవేంద్రునియాజ్ఞ యనుల్లంఘనీయము, కావున, ఈవృత్తాంతమును దెలిపి నామాటగా మహామంత్రి పిశునునితోఁ జెప్పుము.

క. కేవలము నీప్రతిభయే
గానంగావలయు నల్పకాలము ధరణిన్,
నావి ల్లధిజ్య మొుండొక
తావున నిదె యిపుడు వ్యాపృతము మంత్రివరా. 166

విదూ:—వయస్యునియాజ్ఞ. [అని నిష్క్రమించును.

మాత:—ఆయుష్మంతుఁడా, ఇటు ఇటు.

[రాజు రథారోహణము నభినయించును. అందఱు నిష్క్రమింతురు.



# సప్తమాంకము.

## స్థలము I. ఆకాశము.

[అంత, నాకాశయానమున రథారూఢుండై రాజును మాతలియుఁ బ్రవేశింతురు.]

రాజు:—మాతలీ, దేవేంద్రునియాజ్ఞను నెఱవేర్చియు సేనతనివలని సత్కా[illegible] విశేషములచేత నన్ను నుపయుక్తునిఁగాఁ దలంచుకొనుచున్నాఁడను.

మాత:—[చిఱునగవుతో] ఆయుష్మంతుఁడా, ఇరువురకును నసంతుష్టియే.

చ. లఘు వని యెంతునయ్య మొదలన్ గృత మైననిజోపకారమున్,
మఘవుఁడు సేసినట్టియభిమానమున్ గడు దొడ్డ సేయుచున్,
లఘు వనియే దలంచుఁ బరిలక్షితతావకకర్మవిస్మితిన్
మఘవుఁడు నాత్మకల్పితసమగ్రబహూకృతివైభవంబులన్.

రాజు:—మాతలీ, అట్లుగాదు, నన్ను వీడ్కొలుపునవసరంబున మహే[illegible] డొసర్చిన యాసత్కారము మనోరథాతీతముగదా. ఎట్లనిన, నన్ను సర్వగీర్వా[illegible] సమక్షమున నిజార్ధాసనాసీనుం జేసి,

తే. స్వాంతధృతయాచను జయంతు నంతికస్థుఁ
గనియు నెలనవ్వ వొలయ నాఖండలుండు
సంప్రమృష్టహృదయహరిచందనంబు
నామెడను జుట్టెఁ దాన మందారమాల.

మాత:—ఆయుష్మంతుఁ డమరేశ్వరునివలన నేసత్కారమున కర్హుఁడు గా[illegible] చూడుము,

తే. హరికి సుఖసక్తునికి నుభయంబు సేయు
నాక ముద్ధృతదనుజకంటకము గాఁగ-
మీసరంబును నతపర్వభాసురంబు,
నీశరం బిప్డు నృహరిగోర్త్నికర మప్డు.

రాజు:—ఇది యెల్ల శతక్రతునిమహిమ గాని నాది గాదు.

చ. ఉరుతరకర్మలందును నియోజ్యులకున్ జయమాట యీశ్వరు[illegible]
వరకృపఁ జేయుసత్కృతులభవ్యఫలంబ యటం చెఱుంగవే,

యరుణుఁడు గాఢసంతమసహారధురంధరుఁ డై వెలుంగు నే
ఖరకిరణుండు వానిఁ దనకన్నను మున్నుగ నిల్పకుండినన్? 170

మాత:—చక్కఁగానే యున్నది. [కొంచెము దూరము గడచి] ఆయుష్మంతుఁడా, ఇటు చూడుము, ఇదిగో స్వర్గపృష్ఠ ప్రతిష్ఠితము నీకీర్తి సౌభాగ్యము.

చ. సురవరు లాత్మసుందరులఁ జొక్కఁగఁ దార యలంకరించుచో
నిరతి మిఁగుల్చువన్నియల నిర్మలకల్పలతాంశుకంబులన్
వరకవితన్ లిఖింతు రదె వారలగీతికిఁ జొప్పడంగ నీ
చరితము నర్థబంధరససంపదఁ దారమనోహరంబుగాన్. 171

రాజు:—మాతలీ, అసురసంహారోత్సుకతచే నిన్న నిటు పోవునపుడు స్వర్గమార్గమును నేను బరికింపనైతిని. కావున వచింపుము మన మిపుడే వాయుస్కంధమున నున్నామో.

మాత:—ఆయుష్మంతుఁడా,

చ. సురసరణిం బ్రతిష్ఠఁ గని శోభిలుమువ్వడియేటిపోటి, జ్యో
తిరనఘమండలం బయుతదీధితిగా సుడియించుజంత్రమున్,
సిరిపతిమధ్యవిక్రమముచేత నిరస్తతమస్తమంబు, నా
పరివహవాయుమార్గ మని ప్రాజ్ఞులు దీని వచింత్రు భూవరా. 172

రాజు:—కావుననే సబాహ్యాంతఃకరణముగా నాయంతరాత్మ ప్రసన్నముగా నున్నది. [రథచక్రములం జూచి] మేఘమార్గమునకు దిగినారము.

మాత:—ఎట్లు తెలిసినది?

రాజు:—

తే. చక్రవివరాల వెలి దూఁటఁ జాతకములు,
మెఱపు తేజంపుమెయిపూఁత మెఱయ హరులు,
నేమి తడిఁ దోఁగ, నీ తేరు నీటికడుపు
మొగిలుఁగదుపులపై మనపోకఁ దెలుపు. 173

మాత:—ఇఁక క్షణమున కాయుష్మంతుఁడు నిజాధికారభూమిలో నుండును.

రాజు:—[క్రిందఁ జూచి] మాతలీ, వేగముగా దిగుటచే మనుష్యలోక మాశ్చర్యదర్శనముగా నగపడుచున్నది.

మ. కులశృంగు ల్దివి కెక్కుఁబోలె, భువి డిగ్గుంబోలెఁ దచ్ఛృంగముల్,
దలఁగన్ బోదెలు గానిపింపఁ దరువుల్పత్త్రిచ్ఛదిర్లీనతన్,
కలసెం దానవనష్టవేణి మరల న్గన్పట్టునన్ నిమ్నగల్,
తెలియన్ నాక మెవండొ నాకడకు ధాత్రిన్ మీటిచేర్చున్ బలెన్.

మాత:—చక్కఁగాఁ గంటివి. [సబహుమానముగా విలోకించి] అహో! లోక మతిరమణీయముగానున్నది!

రాజు:—మాతలీ, ఇది యేపర్వతము? తూర్పుపడమరల సముద్రములం సాంధ్యమేఘముంబోలె వెలుంగుచుఁ గనకరసప్రవాహములతో నొప్పుచున్నది.

మాత:—ఆయుష్మంతుఁడా, ఇది హేమకూట మనుపేరిది, కింపురుషపర్వ ఇది తాపసులకు సిద్ధిక్షేత్రము. చూడు,

ఆ. జనన మొందె నేప్రజాపతి యాత్మభూ
సూతి యామరీచి కాతఁ డెల్ల
సురుల కసురులకును గురుఁ డిందుఁ దప మొందుఁ
బత్నితోడఁ గశ్యపప్రభుండు.

రాజు:—అటయినశ్రేయముల నుల్లంఘింపఁగూడదు. ఈభగవంతునిఁ ప్ర ణించి పోఁగోరెద.

మాత:—ఉత్తమకార్యము. ఇదిగో దిగినారము.

రాజు:—[విస్మయముతో] మాతలీ,

తే. చక్రనేముల నేమియు స్వనము లేదు,
లేవ దొక్కింతయేని ధూళీభరంబు,
ఉర్విఁ దాఁకమి నీతేర నుద్ధతంబు
దిగియునుం దిగినట్టులు తేటపడదు.

మాత:—ఇంతయే విశేషము ఆయుష్మంతునికిని శతక్రతునికిని.

రాజు:—మాతలీ, మారీచాశ్రమ మెచట?

మాత:—[చేతితోఁ జూపుచు]

మ. అలమే నుప్పుటను డిందఁ, బర్విఁ గుబుసంబా హేయకం బనుకి
నలుత జీర్ణలతాప్రతానవలయం బ్రశాంతము న్నోవిడఁ,
వలలంగా ఖగనీడసంకట జటాప్రాగ్భార మంసద్వయిన్,
గొలు నా మౌని యకంప్రుఁడై యెచట వెల్గు, న్భానుపై దృష్టి

రాజు:—కష్టతపసుని కీయనకు నమస్కారము.

మాత:—[వాగెలు బిగించి] ఆయుష్మంతుఁడా, అదితిపరివర్ధితమందారంబుల పతియాశ్రమముం జొచ్చినారము.

రాజు:—స్వర్గమునకన్న నెక్కుడు నిర్వృతి నిడునీస్థానము ప్రవేశించి య తంపుమడువు సొచ్చిన ట్లయితిని.

## [స్థలము II. మారీచాశ్రమము.]

మాత:—[రథమును నిలిపి] దిగవచ్చును.

రాజు:—[దిగి] నీవో మఱి ?

మాత:—రథము నాఁపితిని. నేనును దిగియెదను. [అట్లే చేసి] ఆయుష్మంతుఁడా, ఇటు ఇటు, ఈమహర్షుల తపోవనభూములను జూడుము.

రాజు:—[చూచుచు] ఆహా ! వీరి వృత్తి యెంతవింతగా నున్నది !

ఉ. జీవనవృత్తి గాలికడిచే నగుఁ గల్పకవృక్షవాటికన్,
బావనమజ్జనక్రియలు భర్మసరోజరజోరుణాంబులన్,
భావన కోర్కిఁ-ఱాల, సురభామలచెంత సమాధి వీరి కా;
సేవిధ మొంద నొండ్లు తపియింతురొ యంద తపింతు రీమునుల్.

మాత:—గొప్పవారికోరిక యెపుడును పైకే పోవుచుండును. [పరిక్రమించి, ఆకాశమున] అయ్యా పెద్దశాకల్యా, మారీచభగవంతులు ఏమి చేయుచున్నారు ? ఏ మనియెదవు ? “దాక్షాయణి యడుగఁగా మహర్షి పత్నీ సమేత కామెకుఁ బతివ్రతా ధర్మములు వాక్రుచ్చుచున్నా” రందువా ?

రాజు:—అ టయిన, నవసర మెదురుచూడవలసి యున్నది.

మాత:—[రాజును జూచి] ఆయుష్మంతుఁడా, రవంతసేపు ఈ యశోకవృక్షమూలమున నుండుము, నేను బోయి నీరాక గురువున కెఱింగించుటకు సమయము వేచెదను.

రాజు:—నీకుఁ దోఁచినట్లు. [అని నిలిచియుండును. మాతలి నిష్క్రమించును.

రాజు:—[నిమిత్తమును సూచించి,]

క. కోరికను నే వదలితిన్,
వారక నీ వదరె దేల నమ్మ భుజమ్మా ?
ధారుణిలోఁ బూర్వం బవ
ధీరిత మామేలు వెండి తిరుగుట గలదే ? 179

[తెరలో)

వలదుసుమా వలదుసుమా దుండగము. ఏమి నిజప్రకృతినే పొందినాఁడు !

రాజు:—[చెవి యొగ్గి] ఇది అవినయమునకుఁ జోటు గాదు. ఎవరిని శిక్షించుచున్నారు ? [శబ్దము వచ్చినవైపు చూచి, ఆశ్చర్యపడుచు] అహో ! ఎవ రీబాలుఁడు, తాపసపురంధ్రులు వలదని బతిమాలుచుండ నబాలుఁడు సత్త్వపర్య వొప్పుచున్నాఁడు ?

ఆ. తల్లి చన్నుఁ గ్రోలుదాని నాసగములో
నలుగులమున జూలు మెలికపడఁగ
నాటకొఱకు బలిమి హర్యక్షపోతంబుఁ
ద్రోలఁగఁదివుచు వీఁడు దుండగీఁడు.

[అంత, యథానిర్దిష్టవ్యాపారుఁడు బాలుఁడు ఇరువురు
తాపసపురంధ్రులతోఁ బ్రవేశించును.]

బాలుఁడు:—ఆసలిం చావలించు బుచ్చిసింగమా నీదంతాలని లెక్కపెడతా.

ప్రథమ:—ఏమీ! అవినీతుఁడా, మాకు బిడ్డలవలెఁ బ్రాణ మయిన జంతు... బాధించెదవు? ఏమి నీతుందుడుకు హెచ్చుచునే యున్నది! యుక్తమేసుమా స... దమనుఁ డని నీకు ఋషులు పెట్టిననామధేయము.

రాజు:—ఏమి యిది! ఈ బాలునియందు నౌరసపుత్త్రునియందుంబోలె నా... తరాత్మ తగులుకొనుచున్నది. నిశ్చయముగా సంతతిలేమి యిట్టివాత్సల్యమును బ... చున్నది.

ద్వితీయ:—సత్త్వదమనుఁడా, ఈసింహి నీమీఁదికి దుముకునుజూమా, ... మను నీవు వదలవేని.

బాలుఁడు:—[చిఱునగవుతో] అమ్మో! బయమవుతూవుంది!

[అని యధరోష్ఠమును ...

రాజు:—

ఆ. బీజదశను వెల్గువిరివి తేజంబుగా
నీకుమారుఁ డొప్పు నాకుఁ జూడ,
విస్ఫులింగదశను వెలయునిధ్మాపేక్షి
జాతవేదుఁ డెసఁగుచందమునను.

ప్రథమ:—వత్సా, విడువరా యీ సింహడింభమును, నీకు మఱియొక బొమ్మ నిచ్చెదను.

బాలుఁడు:—ఏదీ? ఇయ్యి దాన్ని. [అని చేయి చా...

రాజు:—[చూచి, ఆశ్చర్యముతో] ఏమి! వీనియందుఁ జక్రవర్తిలక్షణము... గలదు! అట్లే గదా, వీనిది

ఆ. లోభనీయవస్తులోలతఁ జూపిన
శయము వెలుఁగు వ్రేళ్ల సందు లేక
వేగుకెంపు లోన వికసి రేకులసంధు
గానరానియొంటికమల మనఁగ

ద్వితీయ:—సువ్రతా, వీనిని మాటమాత్రాన మాన్ప శక్యము గాదు. నీవు పోయి నాపర్ణశాలలో, ఋషికుమారుఁడు కలఁడే మార్కండేయుఁడు, వానిది రంగులువేసినది మట్టినెమలి యున్నది, దానిని దెచ్చి వీని కిమ్ము.

ప్రథమ:—అట్లే. [అని నిష్క్రమించును.

బాలుఁడు:—అందాక దీనితోనే ఆడుకొంటాను.

[అని తాపసపురంధ్రిం గని నవ్వును.

రాజు:—ఈదుండగీనికై యాసగొనుచున్నాను.

మ. అనిమిత్తోదయహాసభాసురము లై యంతంత పల్గొన్ననల్
కననౌనస్ఫుటవర్ణజల్పనమనోజ్ఞవ్యాహృతివ్యగ్రుల౯
అనపాయాంకసతృష్ణుల న్సుతులఁ గ్రోడావాసులం జేసి పు
ణ్యనిధు ల్తద్వపురాత్తపాంసుధృతి సంప్రాపింత్రు ధన్యత్వము౯. 183

తాపసి:—కానీ, వీఁడు నన్ను లక్ష్యపెట్టఁడు. [పార్శ్వమునఁ జూచి రాజును గాంచి] భద్రముఖుఁడా, కొంచెము ఇటురా, వీఁడు డింభచేష్టచే ఈసింహపుఁ గొదమను బాధించుచున్నాఁడు, విడిపింపుము.

రాజు:—[సమీపించి చిఱునవ్వుతో] ఓయి మహర్షికుమారుఁడా,

తే. ఏల నీ వాశ్రమవిరుద్ధశీల మూని
జన్మసిద్ధంబు నిట్లు దూషణ మొనర్తు,
నల్లద్రాచుబుడుత చందనమ్ముఁ బోలె
సత్త్వసంశ్రయసుఖ మైనసంయమమును ? 184

తాపసి:—భద్రముఖా, వీఁడు ఋషికుమారుఁడు గాఁడు.

రాజు:—కాఁ డని యాకారసదృశము వీనిచేష్టితమే చెప్పుచున్నది. స్థానమును బట్టి నే నిట్లు తలంచితిని. [వారు వేఁడినట్లు చేయుచు, బాలస్పర్శసుఖమును బొంది, ఆత్మగతము]

తే. ఎవనివంశాంకురమొ వీఁడు దవిలినంత
నాదుగాత్రము లిట్లు సమ్మోదితములు,
వేనిదేహంపు మొలకయో వాని కెట్టి
ప్రమదమోహంబు నీయుద్ధుఁగొమరుఁ డిడునొ! 185

తాపసి:—[ఇరువురను జక్కఁగాఁ గాంచి] ఆశ్చర్య మాశ్చర్యము! ఈబాలుఁడు నీపోలిక నున్నాఁ డని యాశ్చర్య మగుచున్నది. చనవులేకయే యార్యునియొద్ద వీఁ డింత విన్ననువుగా నుండుట కాశ్చర్యపడుచున్నాను.

రాజు:—[బాలుని లాలించుచు] అమ్మా, మునికుమారుఁడు గాఁడేని వఖీ వీని వంశ మేది ?

తాపసి:—పురువంశజాతుఁడు వీఁడు.

రాజు:—[ఆత్మగతము] నావంశమువాఁడే. కావుననే యీమె వీనిని నా
కగాఁ దలఁచినది. పౌరవరాజులకు వార్ధకమున నిది కులవ్రతము.

క. క్షితిఁ గావఁగఁ దొలుత సుధా
సితహర్మ్యములందుఁ బ్రతివసించి పిదప నా
క్షితిపులు నియతైకపతి
వ్రతాసఖతఁ దరుతలముల వసియింత్రుగదా.

[ప్రకాశము] స్వభావగతిని బట్టి యీస్థానము మనుష్యులకు విషయముగా

తాపసి:—భద్రముఖుఁడు చెప్పినది సరియే. అప్సరస్సంబంధముచేత
యిచట దేవజనకునితపోవనమున వీనిం గన్నది.

రాజు:—[ఆత్మగతము] ఆహా, ఇది రెండవది యాశాజననము, [ప్రకా
ఇతనితల్లి యేరాజర్షి భార్య ?

తాపసి:—ఆ ధర్మపత్నీపరిత్యాగిపే రెవరు దలంతురు ?

రాజు:—[స్వగతము] ఈకథయు నన్నే తడవుచున్నది. కానీ, వీనితల్లి
గుదునా? వలదు. పరభార్యావ్యవహారము తప్పిదము.

తాపసి:—[లక్క నెమలినిఁ జేతఁగొని ప్రవేశించి] సర్త్వదమనా, శకుం
స్యముచు జూడుము.

బాలుఁడు:—[చూడ్కి నిగిడించి] ఏదీ మాయమ్మ ?

ఇరువురుపురంధ్రులు:—[నవ్వి] నామసామ్యముచే మోసపోయినాఁడు
వత్సలుఁడు.

ద్వితీయ:—వత్సా, ఈలక్క నెమలియాటను జూడుమని చెప్పితిని.

రాజు:— [ఆత్మగతము] ఏమి వీనితల్లికి శకుంతల యని పేరా! నా
సాదృశ్యము లుండవా ? ఒకవేళ యీప్రస్తావము ఎండమావులనీటివలె నాకు వి
ణమే యగునుగాఁబోలు !

బాలుఁడు:—అమ్మా, ఈ ముద్దునెమలి నాకిష్టముగా నున్నది.

[అని యాటబొమ్మను కైకొ

ప్రథమ:—[ఉద్వేగముతో] హా! వీనిమనికట్టున రక్షాకంకణ సుగపడదే

రాజు:—వ్యాకులపడవలదు వ్యాకులపడవలదు. ఇదిగో ఇదిగో. సింహ
చెర్లాటమున నిచటఁ బడినది.

[అని కైకొన నుం

ఇరువురు:—ఎత్తకెత్తకు! దీని నితఁ డెట్లు తాఁకి యెత్తినాఁడు!

[ఆశ్చర్యముచే బొమ్మలఁ జేతు లుంచుకొని యొండొరులఁ

రాజు:—ఏల నన్ను నివారించితిరి?

ప్రథమ:—వినుము మహారాజా, ఇది అపరాజిత యను పేరి మహౌషధి

జాతకర్మసమయమున మారీచులవా రిచ్చినారు. ఇది పడిపోయెనేని, దీనిని నేలనుండి వీఁడును వీనితల్లిదండ్రులును దప్ప మఱియెవరును ఎత్తఁగూడదు.

రాజు:—ఒకవేళ ఎత్తిన ?

ప్రథమ:—అంతట తత్క్షణమే పాపమయి కఱచును.

రాజు:—దీని యామహిమను మీ రెప్పుడేని ప్రత్యక్షముగాఁ జూచినారా ?

ఇరువురు:—పలుమాఱు.

రాజు:—[హర్షముతో, ఆత్మగతము] ఏల యిపుడు మనోరథము పూర్ణమాయె నని సంతోషింపరాదు. [బాలునిఁ గౌఁగిటం బొదువును.

ద్వితీయ:—సువ్రతా, రారమ్మ, పోయి యీవృత్తాంతమును నియమవ్యాపృతయగు శకుంతలకు నివేదింతము. [అని నిష్క్రమింతురు.

బాలుఁడు:—నన్ను వొదులు. అమ్మ దగ్గిరికి వెళ్తాను.

రాజు:—పుత్త్రికా ! నాతోఁ గూడనే మీయమ్మను సంతోషపెట్టెదవు.

బాలుఁడు:—మా నాయన దుష్యంతుఁడు, నీ వెవరు ?

రాజు:—[చిఱునగవుతో] ఈవివాదమే నమ్మించుచున్నది.

[అంత, ఏకవేణీధర శకుంతల ప్రవేశించును.]

శకుంత:—వికృతిసమయమునఁగూడ నోషధి ప్రకృతినే యుండిన దని వినియు నాభాగ్యమును నమ్మఁజాలకున్నాను. ఒకవేళ సానుమతి చెప్పినట్లే యుండునుగాఁబోలు!

రాజు:—[శకుంతలం జూచి] ఓహో ! ఇదిగో ఆమహానుభావ శకుంతల !

క. పరిధూసరవసనద్వయ
ఖరనియమకృశాస్య యేకఘనవేణిక యీ
సరశీల నోఁచుఁ గరుణా
విరహితు ననుఁ గూర్చి దీర్ఘవిరహవ్రతముల్. 187

శకుంత:—[పశ్చాత్తాపవివర్ణుని రాజుం జూచి] ఆర్యపుత్త్రునివలె లేఁడు, మఱి యితఁ డెవఁడు, రక్షామంగళవంతుని నాశిశువును దాఁకి మైలచేయుచున్నాఁడు ?

బాలుఁడు:—[తల్లియొద్దకుఁ బోయి] అమ్మా, ఇత నెవరో పరాయివాడు నన్ను కొమారున్నని యెత్తుకొంటున్నాడు.

రాజు:—క్రౌర్యముకూడ నీయెడ నేను బ్రయోగించినది మేలుకొఱకే అయినది ! ఎట్లన,—నావలెఁగాక యిపుడు నన్ను నీవు దెలిసికొంటివిగాన.

శకుంత:—[ఆత్మగతము] హృదయమా, ఊఱడిల్లు మూఱడిల్లుము. దైవము మత్సరము మాని నన్నుఁ గనికరించినది. ఆర్యపుత్త్రుఁడే.

రాజు:—

క. తెలివి మరలి నామోహము
తొలఁగుడు నోసుముఖి వేగ దోఁచితి వెదురన్,

అలరాహు వెడలినంతనె
నెల నేడ్తెఱఁ గలయురోహిణీ రమణివలెన్.

శకుంత:—జయ మార్యపుత్త్రునికి.

[అని సగముమాటలోనే లజ్జచే బాష్పరుద్ధకంఠి యై విరమి

రాజు:—ప్రేయసీ,

ఆ. జయపదంబు బాష్పసంరుద్ధ మైనను
జయము నొందినాఁడ సతము నీదు
భగ్నసంస్కృతిప్రపాటలోష్ఠపుటంబు
నాననంబుఁ గాంచి యేను దయిత.

బాలుఁడు:—అమ్మా, ఎవ రీయన ?

శకుంత:—వత్సా ! నీభాగ్యము నడుగుము.

రాజు:—[శకుంతలపాదముల వ్రాలి]

చ. చెలువరో నే నిరాకరణ చేసినవంత యెదం దలంగునూ,
దలముగ నప్పు డేమొ యొకదారుణమోహము గప్పె నామదిన్
గలితమహాతమస్కులకుఁ గల్గు శుభంబుల నిట్టివృత్తులే,
తలఁగఁడె మాళి వైవ సుమదామక మంధుఁడు సర్పశంకచేన్ !

శకుంత:—[బాష్పములతో] లేలె మ్మార్యపుత్త్రా. నిశ్చయముగా నాప్ర
బంధకము పురాకృతము ఆదినములలో ఫలాభిముఖ మైనది. దానంజేసి కరుణామయు
యార్యపుత్త్రునికి నాయెడ హృదయ మట్లయినది. [రాజు లే

శకుంత:—మఱి దుఃఖభాగధేయమను నే నార్యపుత్త్రుని కెట్లు స్మరణకు

రాజు:—దుఃఖశల్య ముద్ధృత మైనవెనుకఁ జెప్పెదను.

చ. ఉవిదరో మున్ను మోహమున నొప్పరికించితి దేని బద్ధబిం
దువు భవదోష్ఠబింబమున డొందడి నో విడుచున్న బాష్పముల్,
బ్రవణత దాని నాకుటిలపక్ష్మవిలగ్నముఁ ద్రోచి యిప్పుడే
నవుదునుగాక యేను విరతానుశయుండను ప్రాణనాయికా.

[అని చెప్పినట్లు చేయు

శకుంత:—[నామముద్రికను జూచి] ఆర్యపుత్త్రా, ఇది ఆయుంగరముగదా.

రాజు:—ఔను, ఈయుంగరము దొరకఁగా జ్ఞప్తి కలిగినది.

శకుంత:—ఇది విషమము చేసినది, ఎట్లనిన, ఆర్యపుత్త్రునికి ప్రత్యయము నొ
నాసమయమున దుర్లభ మయినది.

రాజు:—అట్లయినఁ, దీఁగియ ఋతుచిహ్న మగుకుసుమమును ధరించుఁగాత.

శకుంత:—నాకు దీన విశ్వాసము లేదు, ఇది ఆర్యపుత్త్రుని క్రేలన యుండుఁగాక.

మాతలి:—[ప్రవేశించి] ఆహా ధర్మపత్నీసమాగమముచేతను బుత్త్రముఖదర్శనముచేతను నాయుష్మంతుఁడు వర్ధిల్లుచున్నాఁడు.

రాజు:—నామనోరథము మిత్త్రసంపాదితము గాన మధురతరంబును సఫలంబు నయినది. మాతలీ, ఈవిషయము మాఖండలునికిఁ దెలియదేమో గదా?

మాతలి:—[చిఱునగవుతో] ఈశ్వరులకుఁ బరోక్ష మొకటి కలదా? రమ్మా యుష్మంతుఁడా, మారీచభగవంతులు నీకు దర్శన మిచ్చెదరు.

రాజు:—శకుంతలా, పుత్త్రునిఁ గైకొమ్ము, నిన్ను ముందుంచుకొని భగవంతుని దర్శింపఁ గోరుచున్నాను.

శకుంత:—ఆర్యపుత్త్రునితోఁగూడ గురు సమీపమునకుఁ బోవుటకు లజ్జ యగుచున్నది.

రాజు:—లజ్జింపకుము. అభ్యుదయకాలములయం దిట్లు నడచుకొనవలయును; రారమ్ము. [అందఱును బరిక్రమింతురు.

---

[స్థలము III. మారీచులవారి యుటజాంగణము.]

[అంత, అదితితోఁగూడ మారీచులవారు ఆసనస్థులై ప్రవేశింతురు.]

మారీచులు:—[రాజువైపు చూచి] దాక్షాయణీ,

మ. సమరాగ్రంబున నగ్రగుం డెపుడు యుష్మత్సూతి కీతంసు, మ
ధ్యమలోకేశుఁడు, నామమీతనికి దుష్యంతుం, డదోహస్తచా
పముచే సాధితసర్వకృత్యమయి భాస్వత్కోటి దంభోళి యా
సుమనోవల్లభు కేలఁ గేవలము సంశోభిల్లు భూషాకృతిన్. 192

దాక్షాయణి:—ఇతనియాకృతియే మహానుభావమును దెలుపుచున్నది.

మాతలి:—ఆయుష్మంతుఁడా, పుత్త్రప్రీతిఁ దెలుపులోచనములతో వీర దేవతల తలిదండ్రులు నిన్నుఁ గాంచుచున్నారు. దగ్గఱకుఁ బొమ్ము.

రాజు:—మాతలీ,

ఉ. ద్వాదశధావిభిన్న మగుధామము దేన సముద్భవించెనో,
యేది జగత్త్రయావనుని నిష్టిభుగగ్రణిఁ బుత్త్రుఁ గాంచెనో,
ఆదట దేని ధాతపిత యాత్మభవాస్పదముం బొనర్చెనో,
యాద్రుహిణైకకాంతరత మాద్వయి దక్షమరీచిజం బిదే! 193

మాతలి:—ఔను.

రాజు:—[సమీపించి] మీకిరువురకును వాసవునిబంటు దుష్యంతుఁడు ప్రణ
చున్నాఁడు. [అని యట్లు చేయు

మారీచులు:—వత్స, చిరకాలము భూమి నేలుము.

అదితి:—అప్రతి రథుఁడవు కమ్ము.

శకుంత:—పుత్త్రునితోఁగూడ మీపాదములకు వందనముచేయుచున్నాను.
[అని యట్లు చేయు

మారీచులు:—పుత్త్రీ,

ఆ. నీమనోహరుండు నిర్జరేశసముండు,
జాతకుఁడు జయంతసన్నిభుండు,
తగదు నీకు వేఱువగ మీఁదుదీవన,
సమవు గమ్ము శచికి సాధ్వి నీవు.

అదితి:—పుత్త్రీ, పతికి బహుమత వగుము. అవశ్యము నీపుత్త్రుఁ డీదీర్ఘా
ఉభయవంశ దీపకుఁ డగునుగాక. కూర్చుండుఁడు.

[అందఱును బ్రజాపతియెదుటఁ గూర్చుం

మారీచులు:—[ఒకరొకరిని నిర్దేశించి]

క. బళి బళిరే! సాధ్వి శకుం
తల, తోకము మేలుబంతి, ధన్యుఁడ వీవుగ;
లలితగతి మీరు గూడుట
యలశ్రద్ధాధనవిధిత్రయము గూడుటయే.

రాజు:—స్వామీ, ముందు మనోరథసిద్ధి తర్వాత దర్శనము, అపూర్వము
తమయనుగ్రహప్రకారము. చిత్తగింపుఁడు.

ఆ. పూవు దోఁచు ముంద, పూప వుట్టుఁ బిఱుంద,
వారిదంబు మున్న, వాన వెనుకఁ;
హేతుకార్యములకు నిట్టి దాఁ గ్రమమెంచు,
నీదుకృపకు మున్న నెగడు సిరులు.

మాతలి:—విధాతల యనుగ్రహప్రకార మిట్టిది.

రాజు:—స్వామీ, యీమీకింకరిని గాంధర్వవిధిచే వివాహ మైతిని.
కొన్నాళ్ళకు, బంధువులు నాకడకుఁ దోడ్కొని రాఁగా జ్ఞప్తి తప్పి నిరాకరించి
త్రులు కణ్వాపాముల వారిచిత్తమును దప్పుచేసికొంటిని. పిమ్మట నుంగరముఁ జూ
మద్వివాహిత యిది యని స్మరణ కలిగినది. ఇది చిత్రముగా నాబుద్ధికిఁ దోఁచు

ఆ. ఎదుర నేనుఁ గుండఁ గదిరెఁ గా దనుబుద్ధి,
చన్నపిదపఁ గల్గె సంశయంబు,

అడుగుజాడఁ జూడఁ బొడమెను నమ్మిక,
సోఁకె నట్టివికృతి నాకు మఱిని. 197

మారీచులు:—వత్సా, నీవలనఁ జింతిల్లకుము; నీసమ్మోహమునకుఁ గారణము గలదు. వినుము,—

రాజు:—అవహితుండను.

మారీచులు:—ఎప్పుడు నిరాకరణఖిన్నను శకుంతలను అప్సరస్తీర్థమునుండి తెచ్చి మేనక దాక్షాయణికడకు వచ్చినదో, అప్పుడే నేను యోగదృష్టిచే నెఱింగితిని, దుర్వాసుల శాపముచే నీవు, పాపము! శకుంతలను సహధర్మచారిణిని నిరాకరించితివి గాని, వేఱు గాదని! ఆశాపము ఉంగరము చూచువఱకే.

రాజు:—[ఉచ్ఛ్వాసముతో] నింద తప్పినది.

శకుంత:—[ఆత్మగతము] ఆహా! పుణ్యము! నిష్కారణనిరాకర్త గాఁ డార్యపుత్త్రుఁడు! నిశ్చయముగా నపుడు శాపమును నేను నెఱుంగను. ఒకవేళ, నేను విరాళిచే శూన్యహృదయనై యుండఁగా ఈశాపము తగిలియుండును. కావుననే సఖులు చెప్పిరి, భర్తకంగుళీయకమును జూపుమని.

మారీచులు:—[శకుంతలం జూచి] పుత్త్రీ, ఇందులతత్త్వము నిపు డెఱింగితివి. సహధర్మాచరణునిపై నీ వలుగఁగూడదు. చూడుము,

చ. స్మరణనిరోధరూక్షమగుశాపముచే నిరసించె నిన్ను నీ
వరుఁ, డలమోహ మేపడఁగఁ బ్రాభవ మీక్రియ నీకు నాథుపైఁ,
జొరదు మసిం బ్రసాద మఱసుంతయు రూపము దర్పణంబునన్,
సురుచిరనిష్కళంకమున సొంపెసఁగన్ సులభావకాశ మా. 198

రాజు:—[కుమారుని స్పృశించుచు] స్వామీ, ఇందుఁగదా నావంశప్రతిష్ఠ.

మారీచులు:—అట్లే, వీఁడు ఇఁక చక్రవర్తి యగును; ఎఱుంగుము,

శా. ఖాతోత్ఖాతనిరస్తకంపము శతాంగం బెక్కి తీర్ణాబ్ధియై
యాతం డేలు జయించి యప్రతిరథుం డే డంతరీపంబులన్,
స్ఫీతిన్ సత్త్వదమాప్తి సత్త్వదమనాభిఖ్యుండు మాతాపురన్,
ధాత్రీసంభరణంబుచే భరతుఁ డన్నామం బిఁకం జెందెడిన్. 199

రాజు:—స్వామీ, తమచే సంస్కారములు వడసినవీనియందు సర్వమును మే మెదురుచూచుచున్నాము.

అదితి:—స్వామీ, ఈతనయామనోరథసిద్ధి వృత్తాంతమును బరిచారక ముఖమునఁ గణ్వమునికి దెలిపింపుఁడు; దుహితృవాత్సల్యముచేత మేనక యిచటనే నన్నుఁ బరిచరించుచున్నది.

శకుంత:—[ఆత్మగతము] నాకోరిక నేగదా భగవతి సెలవిచ్చినది.

మారీచుఁడు:—తపఃప్రభావముచేత నిది యెల్ల గణ్వమునికిఁ దెలిసియే యున్న

రాజు:—కావుననే నాపై మహర్షి కోపము పూనలేదు.

మారీచులు:—అట్లయినను, ఈప్రియ సమభియోగమును దెలిపించెదము. ఎ రా అక్కడ?

శిష్యుఁడు:—[ప్రవేశించి] స్వామీ, నే నున్నాను.

మారీచులు:—గాలవా, ఈక్షణమే, ఆకాశమార్గమునఁ బోయి కణ్వమునితో మాటగాఁ జెప్పుము, ఏ మనఁగా,—పుత్త్రవతిని శకుంతలను శాపాంతమున స్మ దుష్యంతుఁడు పరిగ్రహించినాఁ డని.

శిష్యుఁడు:—దేవరవారి యాజ్ఞ. [అని నిష్క్రమిం

మారీచులు:—వత్సా, నీవును పత్నీపుత్త్రసమేతుఁడవై నీచెలికాఁ డి రథము నెక్కి నిజరాజధానికిం దరలుము.

రాజు:—దేవరవారియాజ్ఞ.

మారీచులు:—[రాజును జూచి]

ఉ. నీకును నీజనంబులకు నించుత నింద్రుఁడు భూరివృష్టులన్,
నాకుల విధ్యుదారసవనంబులచేఁ దనియింపు మీవునున్,
లోకయుగప్రియావహానలోలపరస్పరకృత్యకారు లై,
యీక్రియ నూర్లుగా యుగము లేత్తెఱ నర్థిలుఁ డీర లిద్దరున్.

రాజు:—స్వామీ, యథాశక్తి మేలుకై ప్రయత్నించెదను.

మారీచులు:—వత్స, నీకింక నేమిప్రియము చేయుదును?

రాజు:—స్వామీ, ఇంతకన్నను బ్రసాదముండునా? అయినను, ఇది యగు

[భరతవాక్యము.]

చ. ప్రకృతిహితంబుకై సతము పార్థివపుంగవు లుద్యమించుతన్,
సకలముఁ గన్నకోవిదులశారద పూజన మొందుఁ గావుతన్,
సకృపుఁడు నీలలోహితుఁడు శక్తిసఖుండు భవుండు నాకునున్
వికలముసేయుఁగాత దృఢవేష్టనము న్భవపాశబంధమున్.

[అందఱు నిష్క్రమిం

ఇది శ్రీ వేంకటరాయకవి విరచితంబయిన యాంధ్రాభిజ్ఞానశాకుంతలము

సమాప్తము.

PRINTED AT THE INDIA PRINTING WORKS, MADRAS.

# ఉత్తరరామచరిత్రనాటకము

కృతికర్త

బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు
రాజమహేంద్రవర కలాశాలాంధ్రపండితులు

సవరింపఁబడిన




ప్రకాశకుఁడు
చల్లా జగన్నాధము బి. ఏ. యల్. టి.

అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారి
సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రితము
రాజమహేంద్రవరము

C. M. V. Sharma

 1926 వెల 0—12—0

0-8-0

## ఇందు వచ్చు పాత్రలు

| పురుషులు. | స్త్రీలు. |
|---|---|
| సూత్రధారుఁడు | సీత |
| నటుఁడు | ఆత్రేయి |
| శ్రీరాముఁడు | వాసంతి |
| అష్టావక్రుఁడు | మురళ |
| లక్ష్మణుఁడు | తమస |
| దుర్మ్ముఖుఁడు | అరుంధతి |
| శంబూకుఁడు | కౌసల్య |
| దాండాయనుఁడు | విద్యాధరి |
| సౌధాతకి | గంగాదేవి |
| జనకుఁడు | వసుంధర |
| చంద్రకేతువు | |
| సుమంత్రుఁడు | |
| కుశలవులు | |
| విద్యాధరుఁడు | |
| వాల్మీకి | |

# ద్వితీయముద్రణపీఠిక

పావన మైనయితివృత్తమును, అపూర్వ మైన కథాసన్నివేశ మును, మనోహర మైనరసపోషణమును, నిరుపమాన మైనపాత్రౌచిత్య ము ననెడిసద్గుణములతో సకరుణ మైనవిప్రలంభశృంగారము ప్రధాన రసముగా శ్రీభవభూతిమహాకవి సంస్కృతమున రచియించిన యుత్తర రామచరితము "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" యను నార్యోక్తినిబట్టి జగద్విఖ్యాతిని గాంచియుండ, దానిసుగుణము లిందు వివరింపఁ బూనుట యనావశ్యకము.

నే నీనాటకమును దొలుత నాంధ్రీకరించి కీర్తిశేషులును మహో దారులును వెంకటగిరిసంస్థానాధీశ్వరులు నగు శ్రీ మహారాజా వెలు గోటి రాజగోపాలకృష్ణయాచేంద్రబహద్దరు జి. సి. ఐ ఇ. వారి సమా దరమున 1909 లోఁ బ్రకటించితిని. ఇది 1917 వ సంవత్సరమునందు చెన్నపురి విశ్వవిద్యాలయపక్షమున ఇంటర్మీడియెట్ పరీక్షకుఁ బఠనీయ మగునాఁటికే ముద్రితపుస్తకములు చాలావఱ కయిపోయినవి. నాఁట నుండియు దీనిని సవరించి ప్రకటింపవలె నన్నకుతూహలము గలదు గాని నేఁటికిఁ గాని యది కొనసాగినది గాదు.

మొదటిముద్రణములోని యనేకపద్యగద్యము లన్నియంకము లందును శైలిలో మార్పుచెందినది. ఈమార్పుగూడ మూలానుసరణమే యైనను గొన్నిచోట్ల భావప్రధానముగాఁ గూడ నుండును. ఎట్లయి నను, ఆంధ్రీకరణము స్వతంత్రరచనను బోలదు కాని, చదువ నింపు గాను, ప్రదర్శింప రమ్యముగాను, ఉండవలె నన్నయుద్దేశముతోఁ బ్రయత్నించి దీనిని సవరించితిని. పాఠకలోక మిందలిగుణము గ్రహించి యాదరించుఁగాక.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

# కృతిసమర్పణము

—:•:—

క. ఈ రామచరిత్రంబు మ
దారాధిత జనకపాదు లారాధిత సీ
తారామ వెంకమాంబా
శ్రీరాముల కంకితంబు చేసితి భక్తిన్.



శ్రీరస్తు

ఓన్నమః పరబ్రహ్మణే

# ఉత్తరరామచరిత్రనాటకము

## ప్రథమాఙ్కము

C. M. V. Sharma Nalgonda

### —ప్రస్తావన—

నాంది- గీ. పూర్వకవులకు సద్భక్తిపూర్వకముగ
నిదె నమస్కార మొనరింతు మెదఁ దలంచి
నిత్యమూర్తియుఁ బరమాత్మసత్యకలయు
నైనవాణికి మ్రొక్కెద నధికభక్తి.

సూత్ర—(నాంద్యంతమున—) కాళప్రియనాథుని మహోత్సవమునకు విచ్చేసిన పెద్దల కిదే విన్నవించుచున్నాను. ఓపూజ్యులారా! కాశ్యపగోత్రుఁడు శ్రీకంఠబిరుదాంకితుఁడు పదవాక్యప్రమాణజ్ఞుఁడు నైన యుబ్రాహ్మణోత్తమునికి వాగ్దేవి వశ్యురా లయ్యెనో, అభవభూతిమహాకవి సంస్కృతమున రచించిన యుత్తరరామచరితనాటకమును చర్ల బ్రహ్మశాస్త్రిగురువరకరుణాధృతపాణినీయుఁడును గద్యపద్యాత్మకానేకకావ్యకర్తయు నుభయభాషాకవియు నైనమల్లాది సూర్యనారాయణశాస్త్రి యాంధ్రీకరించెను. దాని నిపుడు ప్రదర్శింపఁబోవుచున్నాము. సావధానముగాఁ జిత్తగింపుఁడు.

ఇదిగో! నే నీకథ జరిగినపు డయోధ్యాపురములో నున్నవాఁడనుగా మాటినాను. (అంతటఁ జూచి) ఏమండీ! ఇది పౌలస్త్యకులధూమకేతు నగు శ్రీరామచంద్రమహారాజేంద్రుని పట్టాభిషేకమహోత్సవసమయము గదా, రేయింబవ ళ్ళెడతెలిపి

లేకుండఁగా వేడుకలు సలుపఁదగిన యీదినములలోఁ బరిచారకు లందఱు దర లేక ముంగిండ్లలో సుఖముగాఁ గూర్చున్నా రేమి?

నటుఁడు — (ప్రవేశించి) అయ్యా! పట్టాభిషేకమహోత్సవమునకు విచ్చేసిన సమరమిత్రు లగుసుగ్రీవవిభీషణాదులను నానాదిగంతములనుండి దయచేసిన మహాత్ము లగుబ్రహ్మర్షులను దేవర్షులను రాజర్షులను నేడు యథోచితముగ సత్కరించి మామహారాజుగారు వారివారియిండ్లకనిపిరి. వా రందఱు రోజులలో వేడుకలు మెండుగా జరిగినవి. వా రందఱు వెళ్ళఁగానే పోయినవి.

సూ — ఆఁ! ఇదీ కారణము!

నటు — మఱియును —

గీ. మాన్యుఁ డైనవసిష్ఠునిమాటఁబట్టి
విమలచరిత నరుంధతి వెంబడించి
రామచంద్రునితల్లులు క్రతువు చూడ
నల్లునాశ్రమమునకు వెళ్ళి రయ్యా!

సూ — పరదేశీయుఁడ నగుటచే నడుగుచున్నాను. అల్లుఁ డెవ రయ్యా!

గీ. దశరథమహామహీశుఁడు తాను గన్న
కన్నె శాంతను గూఁతురుగా నొసంగె
రోమపాదుండు నాఁజనుభూమిపతికి
నాతఁ డామెను బెంచి మహాదరమున.

విభండకమహర్షిపుత్త్రుఁ డగుఋశ్యశృంగున కిచ్చి పెండ్లి చేసెను. ఋశ్యశృంగుఁ డిపుడు ద్వాదశవార్షిక మైనసత్రయాగ మారంభించెను. అందుచే పెద్ద లగుజానకీదేవిని గూడ విడిచి పెద్దవా రందఱు నచ్చటి కేగిరి.

సూ — అట్లయిన రమ్ము. రాజద్వారమున నిలిచి స్వజాతిమర్యాదతో స్తోత్రము చేయుచుందము.

నటు — అట్లయినచోఁ బరిశుద్ధ మైనరాజస్తోత్రపద్ధతిని ముందుగా నిరూపింపుము.

సూ — గీ॥ సర్వవిధముల సన్నుతి సలుపవలయుఁ
గాని పరిశుద్ధ మనుమాట కలుప నేల?

మానినులశీలమునఁ బోలె మాటమంచి
యందు లోకంబు దుర్జనం బగును గాదె?

నటు— అతిదుర్జనమగు నని చెప్పఁదగును. ఏమనఁగా?

గీ. అవనిపుత్రి మహాసాధ్వి యఖిలపూజ్య
యైనవై దేహి యెడ నింద లాఘవము,
రక్కసునియింట నుంటయే లెక్కసేయు
నమ్మహాగ్ని పరీక్షను నమ్మఁబోదు.

సూ— కాని యీలోకాపవాదము మనమహారాజుచెవిని బడెనేని మిక్కిలికష్టము సంభవించునుజుమీ! అయినను, మునీంద్రులును దేవతలును సర్వవిధముల శ్రేయస్సు సమకూర్పఁగలరుగదా! (పరిక్రమించి యాకాశమున దృష్టినిలిపి) ఓయీ! మహారాజుగారిపు డెక్కడ నున్నారు? (వినుట యభినయించి) ఆఁ! జను లిట్లు చెప్పుచున్నారు.

చ. జనకుఁడు రాజదంపతులసత్కృతి నల్పఁగ వచ్చి వేడ్క నీ
దినములు వెళ్లఁబుచ్చియు విదేహపురంబున కేగె నేఁడ, యం
దునఁ గడుఁ గుందునట్టితనతోయలిచిత్తము దేర్పఁ బాలనా
సనమును డిగ్గి రాఘవుఁడు చయ్యన నంతిపురంబుఁ జొచ్చెడిన్.

(అని నిష్క్రమించిరి.) ఇది ప్రస్తావన.

[అంతటఁ గూర్చుండి సీతారాములు ప్రవేశింతురు]

రాము— దేవీ! ఊఱడిల్లుము. పెద్దలు స్వయముగా మనల విడుచఁజాలరు. ఇఁక నేమన?

గీ. నిఖిలవేదోక్తకర్మనిర్ణిద్రనియతి
కర్మత స్వేచ్ఛ కడ్డంబు గలుగఁ జేయు
నాహితాగ్నులగార్హస్థ్య మాగమోక్త
కర్మములు చేయుమని దోషకలిత మగును.

సీత— ఆర్యపుత్రా! ఎఱుఁగుదును. కాని గురుజనబంధువియోగము సంతాపకర మగును.

రా— ఇట్లే సంసారము మనస్సునకు నొప్పి గలిగించుచుండును. కావున నే విద్యాం

సులు దీనియెడ రోఁతపడి యెల్లకోరికలు పరిత్యజించి యడవులలో...
చుందురు.

కంచుకి—(ప్రవేశించి) జయము జయము రామభద్రా (అనఁబోయి) మహా...

రా—(నవ్వుతో) నాయనగారిపరిచరులు నన్ను రామభద్రా యనిపిల...
తగును. నీ కలవా టయినట్లే పిలువవచ్చును.

కం—ఋశ్యశృంగాశ్రమమునుండి యష్టావక్రమహర్షి వచ్చెను.

సీ—ఆలస్య మొనరింప నేల?

రా—శీఘ్రముగాఁ దీసికొనిరమ్ము.

కం—(వెళ్ళెను)

అష్టావక్రుఁడు—(ప్రవేశించి) మీకు శుభ మగుఁగాక.

రా—మునీంద్రా! నమస్కారము. ఇచ్చట విచ్చేయుము.

సీ—మహర్షీ! వందనము. అత్తలు, అల్లుఁడు, మాఅఁడుబిడ్డ, లక్కనపెద్ద...
లును సుఖముగా నున్నారా?

రా—పూజ్యులైన ఋశ్యశృంగుఁడును శాంతాదేవియు నిర్విఘ్నముగా ...
సుఖ మనుభవించుచున్నారా?

సీ—వా రెప్పుడైన మామాట తలపెట్టుచున్నారా?

అష్టా—అయ్యో! మిమ్ము స్మరింప కేమి? (అని చూచ్చుండి) దేవీ! పూజ్య...
ష్ఠుఁడు నీతో నిట్లు చెప్పు మనెను.

క. జననియు నీకు వసుంధర,
జనకమహారాజు నీకు జనకుఁడు, సూర్యుఁ
డును నే నేరాజన్యుల
కును గురువుల మీవు వారికోడలవు గదా!

ఇఁక ని న్నేమని దీవింతును? మహావీరు లయినకుమారులకుఁ ద...

రా—దేవీ! మనము గురువుగారియనుగ్రహమునఁ గృతార్థుల మైతిమి.

గీ. సద్గుణులు లౌకికులు నగుసాధుజనుల
నుడువు లర్థంబువెనువెంట నడచుచుండు
ననఘు లాద్యులు నగుమహామునులు పలుకు
పల్కు వెంబడి నర్థంబు పరుగులెత్తు.

అష్టా—రఘువీరా! సీతాదేవికి గర్భవాంఛలు కలిగనేని వాటిని వెంట...

నని మీతల్లులును శాంతాదేవియు మాన్యురా లయినయరుంధతియు మరల మరలఁ జెప్పిరి.

రా—ఈమె కోరినట్లయిన నట్లే చేసెదను.

అష్టా—,,అమ్మా! నిండుచూలాల వగుటచే నిన్ను యాగమునకుఁ దీసికొని రాలేదు. నీసంతోషముకొఱకే రామునిగూడ నందుంచితిమి. నీసంతానము నొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని ముద్దాడుచుండఁగా నిన్నుఁజూడఁగలము'' అని ఋశ్యశృంగమహర్షి దేవితోఁ జెప్పుమనెను.

రా—(సంతోషహాసములతో) అట్లే యగుఁగాత. మునివరా! గురువర్యులగువసిష్ఠులు నాతో నేమియుఁ జెప్పుమన లేదా?

అష్టా—అన కేమి? వినుము.

గీ. అల్లుఁ డొనరించుక్రతువున నాఁగివాము,
బాలుఁడవు నీవు, నూత్నంబు పాలనంబు,
ప్రజలయనురంజనంబె కార్యంబు మీకుఁ
దనువుకంబెను గీర్తి యుత్తమధనంబు

రా—గురుపాదు లాజ్ఞాపించినట్లే చేసెదను.

గీ. ప్రజలయారాధనంబె నాప్రాణపదము
దానికై స్నేహమునుగాని దయనుగాని
సౌఖ్యమునుగాని తుదకు నీజనకతనయఁ
గాని విడిచెద బాధ యింతేని లేక.

సీ—ఇట్టియౌదార్య మున్నందునచేత నే యార్యపుత్త్రుఁడు రఘువంశశ్రేష్ఠుఁ డయ్యెను.

రా—ఎవ రక్కడ? మునివరా! కొంచెమునేపు విశ్రమింపుము.

అష్టా—(లేచి-నడచి) ఇదుగో లక్ష్మణుఁడు వచ్చెను (అని వెళ్ళెను)

లక్ష్మణుఁడు—(ప్రవేశించి) ఆర్యా! జయముజయము. చిత్రకారుఁ డైనయర్జునుఁడు మనము చెప్పినట్లుగా మీచరిత్రమును వరుసగాఁ జిత్రించెను. దానిని బరీక్షింపుఁడు.

రా—వత్సా! అ దెందుకో తెలియునా? వికలచిత్త యగుజానకిని సంతోషపెట్టుటకు. కాని యది యెంతవఱ కయినది?

ల—పూజ్యురాలియగ్నిశుద్ధివఱకు నయినది.

రా—పాపము శాంతించుఁ గాక. (తియ్యనిమాటలతో)

క. జననంబునఁ బావన యగు
జనకునికన్నియకు వేఱె చనునే శుద్ధుల్?
అనలంబును దీర్థోదక
మును వేఱొకదాన శుద్ధిఁ బొందఁగఁ దగునే?
దేవీ (1)వయజ్ఞసంభవా! అనుగ్రహింపుము.

(1) ఇది నీకు యావజ్జీవ ముండునట్టి ప్రవాదము.

గీ. దుఃఖితులలాలనంబు బంధువులధర్మ
మట్టిచో నిన్నుఁ జెడ్డమా టంటి మకట!
పువ్వు దలలో ధరించుట పొసఁగుఁ గాని
కాలితోఁ ద్రొక్కి నల్పుట పోలు నొక్కొ?

సీ—కానిండు దీని కేమి! మీచరిత్రము చూతము రండు.
(అందఱును లేచి పరిక్రమింతురు)

ల—ఇదియే చిత్తరువు.

సీ—(చూచి) పై నున్నవీ రెవరు? ఒకరి కొకరు మిక్కిలి దగ్గఱగా నిలిచియు
యార్యపుత్రుని గొనియాడుచున్నట్లున్నారు.

ల—భగవంతుఁ డగుకృశాశ్వునివలనఁ గౌశికుఁడు గ్రహించి తాటకావధసమ
మున నార్యున కనుగ్రహించిన జృంభకాస్త్రము లివియే.

రా—దేవీ! ఈదివ్యాస్త్రములకు నమస్కరింపుము.

గీ. ధర్మరతియు లోకహితంబుఁ గోరి
పెక్కువే లేఁడ్లు బ్రహ్మాదివిబుధు లొక్క
పూన్కిఁ దప మాచరించి తపోమయములు
తైజసంబులు జృంభకాస్త్రములు గనిరి.

సీ—ఈ జృంభకాస్త్రములకు నమస్కారము.

రా—ఈ మహాస్త్రము లెల్లవిధముల నీసంతానము నాశ్రయింపఁగలవు.

సీ—మహాప్రసాదము. కృతార్థురాల నైతిని.

ల—ఇది మిథిలావృత్తాంతము.

సీ—ఆహా! క్రొత్తగా వికసించిన నల్లకలువవలె నిగనిగలాడు శ్యామసుందరశరీర

(1) ఇది నీకు జీవితావధి యగు (పరిణామము—ప్రణాళము) పా—

ణ్యమును, జనసాలఁ జెన్నొందుముఖసౌందర్యమును జూచి యాశ్చర్య మానందమును గదుర నిశ్చేష్టులై నిలిచి మిథిలాపురవాసులు చూచుచుండఁగా, నవలీలగా శివధనుస్సు నెత్తి విఱిచినయార్యపుత్రుఁ డీచిత్రమునఁ జక్కఁగా శోభిల్లుచుండె.

ల—దేవీ! చూడుము చూడుము.

గీ. వియ్య మందినవారిని వీరిరాజ
బంధువులను వసిష్ఠాదిపరమమునుల
జనకరాజు శతానందమునియు భక్తిఁ
గట్నము లొసంగి యర్చించుకరణి గనుము.

రా—ఈచిత్రలేఖనము మిక్కిలి యర్హ ముగానున్నది.

గీ. కన్నియల నిచ్చినతఁడు గైకొన్నయతఁడు
సకలరాజర్షిఘనుఁడు కౌశికుఁడు గాఁగ
జనకరాజులు రఘురాజు లొనరఁజేసి
నట్టిసంబంధమున కెవ్వఁ డలరకుండు?

సీ—స్నాతకవ్రతములు సలిపి వివాహదీక్ష వడసినట్లున్న మీరు, మీనలువురుసోదరులే కదా! అహా! ఆమిథిలాపురమున వివాహసమయమున నిపు డున్నట్లు తలఁచుచున్నాను.

రా—అవును. నిజముగా నట్లే యున్నది.

గీ. పరిణయోత్సవరూపమై పరగునీదు
పచ్చతోరంబు గట్టినభవ్యపాణి
గౌతముఁడు మంత్రియుక్తి నాచేతి కిచ్చి
నట్టియాసమయం బిదే యనఁగఁ దోఁచు.

ల—ఈమె యార్యురాలు, ఈమె మాండవి. ఇది శ్రుతకీర్తి.

సీ—(నవ్వుచు) ఈమె యెవతె?

ల—(సలజ్జస్మితముగాఁ దనలో) ఓహో! ఈమె యూర్మిళను జూపి యడుగుచున్నది, కానిమ్ము. పైకి జరిపెదను. (ప్రకాశముగా) దేవీ! చూడఁదగిన దెంతో మిగిలియున్నది చూడుము. ఇఁడుగో పూజ్యుఁ డైనపరశురాముఁడు.

సీత—(చూచి) నాయొడలు వణఁకుచున్నది.

రా—మహర్షీ! నమస్కారము.

ల—దేవీ! చూడుము. ఇతనిని మాయన్న-

రా—ఇ దెందుకురా, చూపింపవలసిన దెంతోయున్నది. తరువాయి చూ

సీ—(సస్నేహగౌరవముగా రామునిజూచి తనలో) ఆర్యపుత్రా! కుమార

సంపదచే మీరు మఱియును శోభిల్లుచున్నారు.

ల—దేవీ! వివాహము లైనవెనుక మన మందఱమును, అయోధ్యకు వచ్చినట్లు

యీచిత్తరువు చూడుము.

రా—(కన్నీటితో) హా! అసమయము తలఁపునకు వచ్చుచున్నది.

గీ. తండ్రిగారు సుఖంబుగాఁ దనరుచుండ

భార్యలును గాఁపురముచేయ వచ్చియుండఁ

దల్లు లేలోటు రాకుండఁ దనుపుచుండ

వెలయుమన కాదినంబులు వెళ్ళిపోయె.

అపుడీజానకియును—

ఉ. పోయినపట్లఁ బుట్టుపలు మొగ్గలఁగూడిన దంతపుష్పముల్

సోయగ మొల్కునట్టినునుఁజూపులు, ముద్దుమొగంబు, నాదు

న్దోయికి విందు చేయఁగ మనోజ్ఞములౌ లలితోజ్జ్వలప్రభా

ప్రాయము లైనయంగముల హాయి యొసంగెను నాదుమే

ల—ఇది మంథరావృత్తాంతము.

రా—(అది తప్పించి మఱియొకటి చూపి)

గీ. శృంగిబేర పురంబున చెంతనున్న

యింగుదీ పాదపం బిది యిందువదన!

దీనిక్రిందనె మనకు ము న్నానిషాద

మహితుఁ డైనట్టిగుహునితో మైత్రి కలిసె.

ల—(నవ్వి) ఆర్యుఁడు కైకేయీవృత్తాంతమును గప్పిపుచ్చెను.

సీ—ఇది జటాబంధనవృత్తాంతమా! అహా!

ల—గీ. జ్యేష్ఠపుత్రుని రాజ్యాభిషిక్తుఁ జేసి

వృద్ధు లిక్ష్వాకునరనాథు లేవ్రతంబు

గడపి రాపుణ్యా మారణ్యకంబు  నైన
వ్రతము నొనరించె మాయన్న బాల్యమందె.

సీ—ఇదిగో! ఈమె ప్రసన్నపావనసలిలయుఁ బూజ్యురాలు నగు భాగీరథి.

రా—రఘుకులదేవీ! నమస్కారము

మ. జననీ! మున్ను భగీరథుండు సగరాశ్వం బారయంబోయి మే
దిని భేదించి క్రుధాత్ముఁడౌ కపిలుశక్తిన్ దగ్ధులౌ వారలన్
దనముత్తాతలతండ్రులన్ దివికి నెత్తంగాఁ దపోనిష్ఠుఁడై
నిను సేవించి తదీయభస్మముపయి న్నీనీళ్ళఁ బాఱించెఁగా.

తల్లీ! నీవు మాగురుపత్ని యైనయరుంధతివలెనే నీకోడ లైన సీతకు మేలు గోరుచుండుము.

ల—ఇదియే భరద్వాజుఁడు తెలియఁజెప్పిన చిత్రకూటమార్గమందలి కాళిందీతటమున నుండు శ్యామనామకవటవృక్షము.

రా—(స్మృతితోఁ జూచును)

సీ—ఆర్యపుత్రా! ఆప్రదేశము స్మృతికి వచ్చినదా?

రా—దేవీ! ఎట్లు మఱచిపోవుదును? నీవు—

చ. కమలినతూఁడులట్లు సడకం గడుఁగంది వశంబు దప్పి స
త్వము చెడియున్ మఱింత లలితంబులుగాఁ గనవచ్చునీమనం
గములయలంత కొంత బిగికౌఁగిళులన్ శమియింపఁగేల మై
నిమిరెడు నాయురంబుపయి నిద్దురవోయినచో టిదే కదా!

ల—ఇది వింధ్యాటవిలోని విరాధుని వృత్తాంతము.

సీ—చాలుఁజాలు. విసనకఱ్ఱ గొడుగుగాఁ జేతఁ బట్టుకొన్న యార్యపుత్రునిదక్షిణారణ్యమార్గమందలి భయంకరసంచారమును జూచుచున్నాను.

రా—చ. మునులకు టీరముల్ సఫలపుష్పమహీజము లొప్పునీతపో
వనములు కొండయేళ్ళ కిరువంకల భాసిలుచుండె జానకీ!
కనుము గృహస్థు లిందు తమకల్గిననివ్వారియన్న మిల్లు చో
చ్చినయతి కింత పెట్టుచును సేవ లొనర్తురు ధర్మనిష్ఠమై.

సీ—పుష్పించిన కడిమిచెట్లపై నెమళ్ళు నాట్యము సల్పుచున్న యీకొండ పేరేమి?

ల—దట్టముగాఁ బెరిగిన చెట్లగుంపులచేఁ జీఁకటిపడినట్లుండిన పరిసరారణ్య ప్రవహించి వచ్చుగోదావరితరంగములు రొదచేయుగుహలు కలిగి, యెడల స్రవించు నీరదంబులఁ గూడి నల్లనై కనఁబడునిదియే జనస్థా భాగమున నుండు ప్రస్రవణ పర్వతము.

రా-తలఁతువె? లక్ష్మణుండు బహుధా పరిచర్యలు చేయ దాని నలరుచునున్న యాదినము, లాసరసోదక గౌతమీనదిన్ దలఁతువె?, దానిచెంతఁ బులినంబుల ముచ్చటలాడుచున్నడ దలఁతువె?, నాఁటివర్తన మెసం దలఁతే లలితాంగి జానకీ!

మఱియు నొక్క మాట. ఇది యెపుడైనఁ దలఁచెదవా దేవీ!

ఉ. ఒక్కొకభావముతోడ నొడ లుబ్బఁగ బిగ్గఁగవుంగిలించి నె న్నెక్కిలు లొక్కటై కదియ నెమ్మదిగా మన మేమి యేమిడె మక్కువ మీఱ మాటపయి మాటగ ముచ్చటలాడుకొంచు

1 న్నక్కడి నాఁటి రాత్రి నలుయామము లంతనె యంతరింపనే

ల—ఇది పంచవటిలోని శూర్పణఖావృత్తాంతము.

సీ—హా ఆర్యపుత్రా! నీదర్శన మింతవఱకే.

రా—ఓ వియోగభయకంపితురాలా! ఇది చిత్తరువు.

సీ—ఏలా గయినను దుర్జనము దుఃఖము కలిగింపక పోదు.

రా—అబ్బా! నాకు జనస్థానవృత్తాంత మిపుడుజరుగు చున్నట్లే యున్నది.

ల—(సీతాహరణవృత్తాంతము చూపి)

చ. వనరుచునున్న యార్యుదురవస్థకు వజ్రముగుండె వ్రచ్చున ట్లును శిల లేడ్చునట్లును, ఖలుల్ నశియించినయంత నివ్వా గనకమృగంబుమూలముగఁ గల్గిన దీపని, దీని మేనువెం టనె యణఁగించినన్ గటకటంబడు నేఁటికి నంతరంగముల్.

సీ—(కన్నీ రొలుకఁ దనలో) దేవా సూర్యవంశనందనా! నామూలమున క్షష్టపడితివి గదా!

ల—(రాముని జూచి సాభిప్రాయముగా) అన్నా! ఏమిది?

(1) నాఁటిరాత్రి మన కంతటిలోపలఁ జెల్లవాఱదే?

చ. పెరిగినమంచిముత్తెముల పేటలకైవడి నీదుకన్నులన్
దొరఁగినబాష్పధారలివె త్రుంగి ధరంబడుఁ జుక్కచుక్కలై,
వరులకుఁ దోఁచు నెంతబిగఁబట్టిన నీహృదయార్తి యెంతయే
నురవడి నాసికాపుటము లోష్ఠము లొమ్మను సంచలించుటన్.

రా-నాఁడు సతీవియోగమున నామదిఁ బుట్టినదుఃఖవహ్ని చిం
దాడుచు లేచినన్ రిపునియంతము చూడఁ దలంచి యోర్చితిన్
నేఁ డది పక్వమై యెడఁద నిప్పులు గ్రక్కుచు గుండెలోని పె
న్వాఁడికటారిపోటువలె బాధ యొనర్చుచునుండెఁ దమ్ముఁడా!

సీ—అయ్యో ఎంతకష్టము! ఈమహాభయ సంభ్రమంబున నేనుగూడ నార్యపుత్రుని విడిచియున్నట్లు తలఁచుకొనుచున్నాను. ఛీ ఛీ!

ల—(తనలో) వీ రిది మఱచిపోవునట్లు చేసెదను. (చిత్తరువుచూపి ప్రకాశముగా) ఇదిగో! మన్వంతరపురాణుఁడును పూజ్యుఁడు నగుజటాయువుసచ్చరిత్ర పరాక్రమముల కుదాహరణము.

సీ—హాతండ్రీ! సపత్న్యానురాగము సఫలము గావించితివి.

రా—హాతాతా! కాశ్యప కకుంతరాజా! నీవంటిపుణ్యాత్ముఁ డగుమహానుభావుఁ డెక్కడ లభించును?

ల—ఇదిగో మున్ను దనుకబంధులు నివసించిన జనస్థానపశ్చిమ మైనకుంజవంతము నెడి దండకారణ్యభాగము. దీనికి దగ్గఱగా నున్నయిదియే మతంగాశ్రమము. ఈమె శ్రమణ యనుపేరు గలసిద్ధశబరి. ఇది పంపాసరస్సు.

సీ—ఆర్యపుత్రుఁడు కోపధైర్యములు విడిచి గొంతెత్తి విలపించినచో టిదేనా?

రా—దేవీ! ఈ పద్మసరోవరము కడురమణీయము సుమీ! ఇందు—

మ. కలనాదం బొనరించుహంసములతెక్కల్ సోఁకఁ దూఁగాడుతూఁ
డుల భాసిల్లెడుతెల్లతామరలచోటుల్ వేఁడికన్నీటిచు
క్కలచాలొల్కుచుఁ బుట్టుచుండునడుమం గన్గో నహా! నల్లక
ల్వలతావుల్ బలె నాదుకన్నులకుఁ గన్పట్టెన్ సరోజాననా!

ల—ఇఁడుగో! ఇతఁడు మాననీయుఁ డగుహనుమంతుఁడు.

సీ—ఇతఁడు జీవలోక ముద్ధరించినమహోపకారి యగుమహానుభావుఁడు.

రా—గీ. ఔను నిజ మీమహాభావులఁ డట్టివాఁడె
యాజనానందవర్ధనుఁ డైనయితని
భుజబలంబునఁగాదె యీభువనములును
మనము ధన్యుల మైతిమి మంజులాంగి!

సీ— ఈకొండమీఁది యొకచెట్టునీడను సహజానుభావసౌందర్యమాత్రము లుగా ధూళిధూసరితశరీరశోభ గలిగి మూర్ఛిల్లి విలపించుచు నీచే ... బడియున్న ట్లార్యపుత్రుఁడు లిఖింపఁబడెనే! పుష్పించిన కడి... మయూరములు తాండవమాడుచున్న ట్లున్న యీకొండపే రేమి!

ల—నీలనవీన మేఘరమణీయ మహాశిఖరంబు రమ్యపు
ష్పాళి సుగంధ మిచ్చుకకుభావనిజంబులు గల్గినట్టియా
శైలముమాల్యవంత మిట—

రా—........చాలునిఁ కాఁగుము తాళఁజాల నీ
వేళ మహీసుతావిరహవేదన వెండియు వచ్చి నట్లగున్.

ల—ఇటుపైని మాయన్నయు మానసియు లైనకపిరాక్షసులను గానిం... లెక్కలేనన్ని యున్నవి. దేవీ! ఇప్పటికే సి వలసితివి. కొంచెము సే... మింపు మని నా మనవి.

సీ—ఆర్యపుత్రా! ఈచిత్రసందర్శనమువలన నా కొక్కకుతూహల ముదయి... అది మనవిచేయుచున్నాను.

రా—ప్రేయసీ! తప్పక యానతిమ్ము.

సీ—ప్రసన్నగంభీరము లగువనవీథుల నొక్కమాఱు విహరింపవలె ననియు శీతలోదక యగుగంగానదిలో నొక్కమాఱు చల్లగా జలక... ననియుఁ దలఁచుకొనుచున్నాను.

రా—వత్సా! దోహదము శీఘ్రముగాఁ జేయవలయు నని గురువు లిపుడే ... మంపిరి. కావునఁ గుదుపులేనిరథము తీసికొనిరమ్ము.

సీ—మీరుకూడా రావలెనుజుమండీ!

రా—ఓసి కఠినురాలా! ఈమాట చెప్పవలెనా?

సీ—అట్లయినఁ బరమానందము.

ల—అయ్యఁ డాజ్ఞాపించినట్లు చేసెదను (వెళ్లెను)

రా—ప్రేయసీ! ఈకిటికీపరిక్కనించుక సేపు సుఖముగాఁ గూర్చుందము రమ్మ.
సీ—మంచిది (అట్లు చేసినపిదప) అలసియుండుటచే నిద్ర వచ్చుచున్నది.
రా—అట్లయిన నన్నుఁ బట్టుకొని నిద్రింపుము.

గీ. అలపు వెలిపును గదురఁ జయ్యనఁ జెమర్చి
యిందుకాంతిఁ గరంగినయిందుమణుల
సరమువలె జల్లనగునీబుజంబు జీవ
నంబుగాఁ బెట్టు నామకంఠంబుపైని.

(అట్లు సీతబుజమును దనమెడమీఁదఁ జేర్చుకొని సంతోషముతో)

మ. అరయంజాలను దుఃఖమో సుఖమొ మూర్ఛావస్థయో నిద్రయో
గరాళావేగమొ మత్తొ? నీవు ననుఁ దాఁకన్ బుట్టి నాయింద్రియో
త్కరముం ద్రొక్కి మనోవికార మొకఁ డేకాకారమై లేచి యాం
తరచైతన్యము నంతలోఁ గలఁచు నంతం దేర్చు నేమే సఖీ!

సీ—ఇం దాశ్చర్య మే మున్నది? మీనిశ్చలానుగ్రహ మట్టిది.

రా—గీ. అవుర? నీమాట లరయఁ గర్ణామృతములు
మానసరసాయనంబులు మ్లానజీవ
పుష్పవికసనములు నంగమోహనంబు
లగుచు నానంద పెట్టు స న్నంబుజాక్షి?

సీ—దేవా ప్రియంవదా! ఇంక నిద్రపోవుదము.
రా—ఈమాట చెప్పవలెనా? నిద్రింపుము.

చ. పరిణయవేళనుండియును బాల్యమునం దెలప్రాయమందు మం
దిరమునఁ గాన నీకు సుఖనిద్రకు సాధన మైన దొండుబి
త్తరి నిదురింప నెన్నఁడును దార్పని దీరఘురాముబాహు వో
ధరణికుమారి! సిద్ధ మగుతల్గడ నిద్దురపొమ్మ దీనిపై.

సీ—(అట్లు నిద్ర నటించుచు) హా! ఆర్యపుత్రా! (పలవరించును)
రా—ఓ! ఈపికవాణి యపుడే నాబొమ్మమీఁద నిద్రించినదా యేమి? (చూచి సస్నేహముగా)

ఉ. నానిలయంబులక్ష్మి యిది నానయనామృత, మీమెతాఁకు
మేన సలందుచందనము, మే లగుముత్తెపుదండ నామెడం
బూనినయీభుజంబు, తివుచు న్నను నీమెకుఁ జెందినట్టిదే
దైనను, గాని యీమెవిహరంబు భరింప నశక్య మొంతయున్.

ప్రతీహారి—(ప్రవేశించి) దేవా! వచ్చెను.

రా— ఎవఁడు?

ప్రతీ—దేవరవారియాసన్నపరిచారకుఁడు దుర్ముఖుఁడు

రా—(తనలో) అంతఃపురసంచారి యగుదుర్ముఖుఁడా! పౌరజానపదుల వా
తెలిసికొనివచ్చుటకు వీనిని బంపియున్నాను. (ప్రకాశముగా) రా
(ప్రతీహారి వెళ్ళెను)

దుర్ముఖుఁడు—(ప్రవేశించి తనలో) సీతాదేవి నడుము నుండఁగా నిట్టిలోక
జనాపవాదమును దేవర కెట్లు విన్నవింతును? అయ్యో యేమిచేయు
నిర్భాగ్యునకు నియోగ మిట్టిదే కదా?

సీ—హా నాథా! ఎక్కడ నున్నావు?

రా—అయ్యో! చిత్రరువుచూచుటవలనఁగలిగిన విరహభావనచే దేవి కల
చున్నది (ఆమెదేహము నిమురుచు)

మ. సకలావస్థల నేది కష్టసుఖముల్ సైరించునో యేకమై,
వికలం బైనమనంబు నెందు గనునో విశ్రాంతి, యెం దొప్పు
ర్థకమందుం దమి, పెండ్లి యాది మృతిపర్యంతంబుగాఁ బ్రేమ
ర్థక మా నెయ్యది, నిత్యభద్ర మయి యాదాంపత్య మేపా

దుర్ము—(సమీపించి) దేవా! జయము జయము!

రా—విన్నవార్తలు చెప్పుము.

దుర్ము—శ్రీరామచంద్రుని యేలుబడిచే దశరథమహారాజును మఱచిరి మని
జానపదు లేలినవారిని గొనియాడుచున్నారు.

రా—ఇది స్తోత్రవాక్యము. తప్పే మున్నదో చెప్పుము. ఛేశ సైస
కొందును.

దుర్ము—(కన్నీరు విడిచి) దేవా! వినండి (చెవిలోఁ జెప్పును)

రా—అఁతిఁ అయ్యో! అయ్యో! ఎంతఘోరవార్త! పిడుగులాగున వచ్చి పేఁ
(మూర్ఛిల్లును)

దుర్ము—దేవా! ఊఁఅడిల్లుఁడు.

రా—(ఊఁఅడిల్లి) హా! ఎంతకష్టము? ఛీ ఛీ!

గీ. పరగృహోవాసమున సీత పడిననింద
యద్భుతాగ్ని పరీక్షచే నణఁగె నపుడు
విధివశంబున నిపు డది వెట్టికుక్క
విషము కైవడి నంతట విస్తరిల్లె.

భాగ్యహీనుఁడను, నే నిపు డేమిచేయుదును? (విచారముతో నాలోచించి) ఇంతకంటె మఱియొక టే మున్నది?

గీ. పరమధర్మజ్ఞపురుషు లేపగిది నైనఁ
బ్రజల రంజింపఁజేయుట పాడి యగును
దానికై కాదె మొన్న మాతండ్రి యహహా
నన్ను విడనాడెఁ దనదుప్రాణాలు విడిచె.

కులగురువులైనవసిష్ఠులవారు గూడ నాకిపుడు పంపినసందేశ మిదే కదా!

గీ. భానువంశజులైనభూపాలవరుల
సర్వలోకప్రసిద్ధమౌసచ్చరిత్ర
నిట్టియపనింద నావల్లఁ బుట్టె నేని
ఛీ! యభాగ్యుండ నింక నాజీవ మేల!

హా దేవీ! దేవయజనసంభవా! హా నిజజన్మానుగ్రహపవిత్రీకృతమేదినీ జనకనందినీ! హా పావకవసిష్ఠారుంధతీప్రశంసితా రామమయజీవితా! హా సుశీలశాలినీ దండకారణ్యవాసప్రియసఖీ! హా దశరథవాత్సల్యభాజనా సాధువర్తనా! హా మనోహారిణీ మితభాషిణీ! ఇంతటిదానవు. ఇంతటిలో నే నీ కిట్టిమార్పా? అకటా! దేవీ!

క. నీపేరు దలఁచి లోకము
పావం బెడఁబాసె దానిపలుకులు నీకుం
బాపంబు లయ్యె, లోకము
నీపాలన నుండె నీకుఁ బాలన మెడలెన్.

దుర్ముఖా! ఈక్రొత్త రాజయినరాముఁ డిట్లాజ్ఞాపించుచున్నాఁ డని లక్ష్మణునితోఁ జెప్పుము. (అని చెవిలోఁ జెప్పును.)

దుర్ము— ఎవరో దుర్జను లేదో యన్నా రని యగ్నిపరిశుద్ధురాలై పవిత్ర మైన
సంతానమును గర్భమున ధరించియున్న యీమహాదేవి నిట్లు చేయ
లేవరవారెట్లు నిశ్చయించినారో కదా! అకటా!

రా— పౌరజానపదులు దుర్జను లెట్లగుదురు.

గీ. జనుల కిక్ష్వాకువంశ మిష్టంబె కాని
దైవవశమున నపనింద దానఁ బుట్టె
నద్భుతాగ్నిపరీక్ష నాఁ డయ్యె నన్న
నిచట నాదూరవృత్తాంత మెవఁడు నమ్మ?

కావున, దుర్ముఖా! నీవు వెళ్ళి చెప్పుము.

దుర్ము— హాదేవీ! ఎంతకష్టము (వెళ్ళును)

రా— అయ్యో! ఎట్టిఘోరకర్ముఁడను, ఎంతపాపాత్ముఁడను?

గీ. నన్ను నెన్నఁడు విడనాడ కున్నయిట్టి
చెలియఁ బిన్నటఁగోలెఁ బోషించి యిప్డు
డొక్కమిష పెట్టి మిత్తికి నొసఁగుచుంటి
నింటిచిలుకను బోయకు నిచ్చినట్లు.

కావున నస్పృశ్యుఁడ నగునే నీదేవిని ముట్టుకొనఁదగను. (అని మెల్లగా
తలయెత్తి బుజము తీసికొని)

గీ. నవనవోద్భూతకర్మచండాలు నన్ను
విడిచి పెట్టుము నీ వింక వెట్టిముగుద!
మంచిగందపుఁజెట్టని మెంచి నీవు
చెనఁటి విషపాదపముఁ జెంతఁ జేరినావు.

(లేచి) హాకష్టము! ఇపుడు జీవలోకము తల్లక్రిం దయిన ట్లున్నది.
మనుగడలాభము నేఁటితో సమాప్త మైనది. ఇపు డీజగ మంతయు శూన్యము,
రణ్యము. సంసార మసారము. శరీరము కాష్ఠప్రాయము. దిక్కు లేనివా
ఏమి చేయుదును! ఏమి గతి? ఎక్కడికిఁ బోవుదును?

గీ. బహువిధం బైనదుఃఖానుభవముకొఱకె
నేను శ్రీరాముఁ డనఁగ జన్మించినాను, 1

(1) మూర్ఛపడినప్పుడే చచ్చిపోకమరల బ్రతికిలేచుట దుఃఖానుభవము

మించి యాయుపుపట్టులు నొంచునట్టి
ప్రాణములు వజ్రకీలంబులనఁగ బిగిసె.

హా తల్లీ అరుంధతీ! హా గురువరా వసిష్ఠా! హా మాన్య చరిత్రా విశ్వామిత్రా! హా వీతిహోత్రా! హా భగవతీ వసుమతీ! హా తాతా జనకమహారాజా! హా తండ్రీ! హాతల్లులారా! హా ప్రియసఖా సుగ్రీవా! హా సౌమ్యా ఆంజనేయా! హా మహోపకారీ విభీషణా! హా సఖీ త్రిజటా! ఈదుర్మార్గుఁడైన రాముఁడు మిమ్ము వంచించినాఁడు పరిభవించినాఁడు. (అనుమానించి) కాని నే నిపుడు వారిని చే రెత్తి పిలుచుట కెవఁడను?

గీ. క్రూరచిత్తుండ నతికృతఘ్నుండ నైన
నేను చేరెత్తి పిలిచితి నేని యిపుడు
పూజ్యులైనట్టియామహాత్ములకుఁ బాప
మంటు నంచుఁ దలంతు, నే మనఁగ? నేను—

చ. నను నెడఁబాయలేక గహనంబులఁ గూడ వసించినట్టి కా
ననసఖి, నమ్మి నాయురమున న్నిదురించిన గేహలక్ష్మి, నం
దనపరిపూర్ణగర్భ వసుధాసుత జానకి-యీసతిన్ బలా
శనులకుఁ గానలోన బలి సల్పఁగఁ బంపెడు దారుణాత్ముఁడన్.

(సీత పాదములు తలపైఁ బెట్టుకొని) దేవీ! నీ పాదపద్మస్పర్శము రాముని శిరస్సున కిదియే కడపటిది. (అని యేడ్చును.)

(తెరలో) రక్షించు రక్షించు మహారాజా!

రా—ఏమిది? (మరలఁ దెరలో)

గీ. ధర్మపరిపాలకా యయోధ్యామహీశ!
యమునదరి నుండుతాపసోత్తముల మేము
లవణరాక్షసబాధ లెల్లను వచింపఁ
జచ్చిచెడివచ్చినాము నీసముఖమునకు.

రా—ఏమి? ఇప్పటికిని రాక్షసబాధలేనా! కుంభీనసీపుత్రుఁడును మధురాధిపతియు నైన యా దురాత్ముని మొదలు వెఱుక శత్రుఘ్నుని బంపునంతవఱకే యీభయము. (కొంచెము నడచి మరల వెనుకకుఁ దిరిగి) హా దేవీ! ఇట్టిదాన వెట్లు

వెళ్ళఁగలవో! భగవతీ వసుమతీ! సచ్చరిత్ర యగు నీపుత్రిని జూచుకొ

గీ. రఘుకులంబును జనకభూరమణుకులము
రెండును దరింప శుభము గూర్చినసుశీల,
పావనం బైనసురయజ్ఞవాటి నీవు
కన్నకూఁతురు, చూచుకో కరుణతోడ.

(అని యేడ్చుచు నిష్క్రమించును.)

సీత—ఆర్యపుత్రా సౌమ్యా! ఎచ్చట నున్నావు? (తొందరగా లేచి) అయ్యో! స్వప్నభయమున విప్రలబ్ధ నైననేను, ఆర్యపుత్రు నెడఁబాసి యున్నట్లు తలఁచుచున్నాను. (ఇటు నటుఁ జూచి) హా! ఎంతకష్టము? నిద్రపోవు నన్నొక్కదానిని విడిచిపెట్టి యార్యపుత్రుఁడు వెళ్ళెనా? ఏ మిది? ఎందుకు చేసెను? కానీ! అతనిని జూచినపిదప నామనస్సు నాలో నున్నదో గోపగించెదను. ఎవ డిక్కడ?

దుర్ము—(ప్రవేశించి) దేవీ! ఎక్కుటకు రథము సిద్ధముగా నున్నదని లక్ష్మణస్వామి విన్నవించుచున్నాఁడు.

సీ—ఇదిగో వచ్చి యెక్కెదను. (లేచి యొకింత నడచి) గర్భభారము స్ఫురించుచున్నది. మెల్లగాఁ బోవుదము.

దుర్ము—దేవీ! ఇటు దయచేయుము.

సీ—రఘుకులదేవతలకు నమస్కారము. తపోధనులకు వందనము.

(అందఱు నిష్క్రమింతురు.) ఇది ప్రథమాఙ్కము.





# ఉత్తరరామచరిత్రనాటకము

## ద్వితీయాఙ్కము

(తెరలో) తపోధనకు స్వాగతము.

తాపసి—(దారి వెదకికొనుచుఁ బ్రవేశించి) ఫలపుష్పపల్లవగర్భిత మైన యర్ఘ్యమున నన్నుఁ బూజింప వనదేవత వచ్చుచున్నది.

వనదేవత—(ప్రవేశించి) తపోధనా! స్వాగతము. (అర్ఘ్యమిచ్చి)

చ. సుదినము నేఁడు తల్లి! నినుఁ జూచి తరించితిఁ, బూర్వపుణ్యసం
పద సమకూరు సజ్జనసమాగమ, మీవన మెల్ల నీదె, యీ
సదమలతోయ మీతరులచల్లనినీడయు నీఫలంబు లీ
యెదిగినకందమూలము లి వెల్ల సుఖంబుగ నారగింపుమీ.

తాప—అమ్మా! చెప్పెడిదేమి?

చ. సరసము లైనమాట లుపచారవివేకము తోఁచుచేఁత లా
దరణముతోడియీవి వినుతం బగునెయ్యము ముందువెన్కలన్
దిరుగనిసుస్వభావము విధేయత నిష్కపటంపువృత్తి సు
స్థిరమతి-ఔర! యీసుజనశీలరహస్య మెఱుంగ శక్యమే?

(ఇరువురును కూర్చుందురు)

వన—అమ్మా! నీపే రేమి?

తాప—ఆత్రేయి.

వన—ఆర్యా ఆత్రేయీ! ఎందుండి వచ్చుచున్నావు? ఈదండకారణ్యమున సంచరింపఁ గారణ మేమి?

ఆ. గీ. ఈవనంబున నుద్గీథ మెఱిఁగినట్టి
ఘను లగస్త్యాదిమునులు పెక్కండ్రు కలరు

ఏరి సేవించి వేదాంతవిద్య నెఱుఁగ
వచ్చుచున్నాను వాల్మీకివద్దనుండి.

వన—పురాణబ్రహ్మవాదియైనయా ప్రాచేతసమహర్షి నే యితరమునీశ్వరులు వేదాంతవిద్య నభ్యసింప నాశ్రయింతురుగదా! ఏ కీప్రవాస మేల!

ఆ—అచ్చట నధ్యయనమునకు గొప్పవిఘ్న మొకటి సంభవించినది. అందుచే తరగమనమున కిష్టపడితిని.

వన—ఆవిఘ్న మెట్టిది?

ఆ—పాలు విడచినప్రాయమువారై ముద్దులు మూటగట్టుచున్న ట్లున్నయిద్దఱు బాలురను ఒకానొకవనదేవత యెత్తుకొనివచ్చి వాల్మీకిమహర్షి కప్పగించెను. ఆకుమారులను జూడఁగానే మునులహృదయములే కాదు, పశుపక్ష్యాదు లన్నియు స్సులు గూడఁ గరఁగిపోయినవి.

వన—ఆబాలురపే ళ్లేమనుచున్నవా!

ఆ—ఆదేవతయే ,,కుశలవు'' లనువారి పేళ్లను వారిప్రభావమునుగూడఁ జెప్పెను.

వన—ఆప్రభావ మెట్టిదమ్మా!

ఆ—సరహస్యములైన జృంభకాదిమహాస్త్రములు వారికిఁ బుట్టుకతోనే వచ్చె.

వన—ఏమి? ఇ దెంతచిత్రమమ్మా!

ఆ—ఆపిల్లవాండ్రను వాల్మీకి దాదివలెఁ బెంచి చౌలకర్మ మొనరించి ఋగ్యజు వేదములు దక్కఁ దక్కినయాయుర్వేద ధనుర్వేద గాంధర్వములను శస్త్రములను ముందుగావారికి నేర్పెను. తరువాత గర్భమాసములలోఁ పదకొండవయేఁట క్షత్రియోచితకల్పమున నుపనీతులను జేసి త్రయీ నేర్పెను. అట్టివిశేషప్రతిభగలవారితో నాబోటిదానికి సహాధ్యయనము ధింపదు. ఏమనఁగా?—

సీ. మానితబుద్ధి మందుని సమానముగాఁ జదివించు నొజ్జ పై
వానికి బుద్ధిశక్తి కొనిపైచున! వీనికిఁ దీసివేయునా!
కాని ఫలంబు వేఱుపడి కానఁబడున్, మణిదర్పణాంబుచం
దాన శిలామృదాదులు గనం బ్రతిబింబము పట్టఁజాలునే!

అక్కడ చదువుకొనుట కిదిముఖ్యవిఘ్నము. ఇంకొకయంతరాయము

వన—అది యేమి?

ఆ—వాల్మీకిమహాముని యొకనాఁడు మధ్యాహ్నకృత్యములు నెఱవేర్పఁ తమసకేగెను. అప్పు డక్కడ నొక కిరాతుఁడు జంటగాఁ దిరుగు క్రౌంచ

లో నొకదానిని జంపెను. దానిని జూచినంతనే-,, మానిషాద! ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితం'' అనుశ్లోక మనుష్టుప్ఛందోబద్ధమై యాకస్మికముగా నతనినోటనుండి వచ్చెను.

వన—వేదములకుఁ దరువాత నూతనముగా నవతరించిన యీ ఛందస్సు మిక్కిలి చిత్రముగా నున్నది.

ఆ—అపుడు, క్రొత్తగాఁ బుట్టినశబ్దబ్రహ్మప్రకాశముగల యా వాల్మీకికి బ్రహ్మదేవుఁడు ప్రత్యక్షమై,, మునివరా! శబ్దబ్రహ్మజ్ఞానమున నుత్తమప్రతిభాశాలి వైతివి. నీవిపుడు మొదటికవీశ్వరుఁడవైతివి. నీజ్ఞాన నేత్ర మడ్డులేక ప్రకాశించుచున్నది. శ్రీరామచరిత్రము వర్ణింపుము'' అని పలికి యదృశ్యుఁడయ్యెను. పిదప మహాత్ముఁడైనవాల్మీకి మానవలోకమున మొదటిది యు శబ్దబ్రహ్మవివర్తము నైన రామాయణ మనెడి యితిహాసమును రచియించెను.

వన—సెబాసు! అది మానవలోకమునకు నూతనాలంకారమే.

ఆ—అందుచే నచ్చటఁ జనువుకొనుటకు వీలు లేకపోయిన దని చెప్పినాను.

వన—ఔను. నీవు చెప్పినకారణము సరిగా నున్నది.

ఆ—అమ్మా! అలసట తీఱినది. ఇంక నేను బోవలెను. అగస్త్యులవారి యాశ్రమమునకు దారి చెప్పు.

వన—ఈ దారి నే తిన్నగాఁ బోయి పంచవటిఁ బ్రవేశించి గోదావరియొడ్డు ననేపొమ్ము.

ఆ—(కన్నీటితో) ఇది తపోవనమా? పంచవటి యిదేనా? ఇదా గోదావరి? ఈ కొండ ప్రస్రవణమా? అమ్మా! నీవు జనస్థానవనదేవత వైన వాసంతివా?

వాసంతి—అవును. నీవు చెప్పినదంతా నిజము.

ఆ—హా వత్సా జానకీ!

గీ. ఇపుడు మాటలధోరణి నెఱుఁగఁబడిన
నీదుచుట్టాలు తరువశ్వాదు లెల్ల
నామమాత్రావశిష్ట వైనట్టి నిన్నుఁ
గోరి నాకంటఁ బెట్టుచున్నారు తల్లి!

వా—(భయముతోఁ దనలో) నామమాత్రావశిష్ట యన్న దేమి? (పైకి) సీతాదేవి కపాయ మేమైన వచ్చెనా?

ఆ—కేవల మపాయముకాదు. అపవాదముతోఁ గూడిన యపాయము. (చెవిలోఁ జెప్పును.)

వా—హా దైవమా! ఎంతదారుణమైన దెబ్బకొట్టినావు? (అని మూర్ఛిల్లును)

ఆ—ఊఱడిల్లు మాఱడిల్లుము.

వా—(ఊఱడిల్లి) హా ప్రియసఖీ జానకీ! నీజన్మఫల మిట్టిదా? హా రామభద్రా! ఇక నీతో నేమి?—ఆత్రేయీ! చెప్పు మమ్మా! అడవిలో విడచిపెట్టి లక్ష్మణుడు వెళ్ళిన పిదప సీత యేమయినదో వార్త తెలిసెనా?

ఆ—లేదు లేదు.

వా—అన్నరా!! అరుంధతీవసిష్ఠు లాశ్రయించియున్న రఘుకులమునఁ గౌసల్యా ముప్పురు రాణులు జీవించియుండఁగా నింతపని జరిగినదా?

ఆ—అపుడు పెద్ద లందఱు ఋశ్యశృంగునిసత్త్రయాగము చూడవెళ్లినారు. ఇప్పుడు యజ్ఞము సమాప్తమైనది. ఋశ్యశృంగుఁడును వారిని సమ్మానించిపాగనంపెను. కాని, కోడలు లేని యయోధ్యకు నేను రా నని యరుంధతి యనఁగా రాణులు తల్లులు లామాటే పట్టుకొన్నారు. అపుడు వసిష్ఠుఁడు వారియనురోధముచేత మహామునితపోవనమున కేగి యందు నివసింత మని నిశ్చయించెను.

వా—అమ్మా! శ్రీరామమహారాజు గారిపు డేమి చేయుచున్నారో!

ఆ—అతఁ డశ్వమేధయాగము చేయ నారంభించెను.

వా—ఛీఛీ! మరలఁ బెండ్లాడెనా?

ఆ—లేదు లేదు. పాపము శాంతించుఁ గాక.

వా—అయితే యజ్ఞములో సహధర్మచారిణి యేది?

ఆ—బంగారు సీతాప్రతిమ.

వా—ఆహా! ఏమి?

గీ. వజ్రమునకంటె గట్టివి పట్టి చూడ
నలరుకంటెను మెత్తని వైనయట్టి
ధీరగంభీరసుస్థిరోదారవీర
పురుషహృదయంబు లెఱుఁగ నెవ్వరితరంబు?

ఆ—వామదేవునియనుజ్ఞ వడసిన మేధ్యాశ్వము విడువఁబడినది. యథాశాస్త్రముగ దానికి సంరక్షకులు నియమింపఁబడిరి. దివ్యాస్త్రసంప్రదాయము తెలిసిన లక్ష్మణపుత్త్రుఁ డైనచంద్రకేతువు చతురంగబలములతో సేనానాయకుఁడై వెళ్ళెను.

వా—(ఆనందబాష్పములతో) కుమారలక్ష్మణునకుఁ గూడఁ గుమారుఁడా! ఇప్పటికి ప్రాణము లేచివచ్చినదమ్మా.

అ—అంతలో నొక బ్రాహ్మణుఁడు చచ్చిపోయిన తనకుమారుని దెచ్చి రాజద్వారమునఁ బెట్టి యొమ్మొ బాదుకొనుచు రక్షింపురక్షింపు మని మొఱ్ఱ వెట్టెను.

వా—తరువాత—

అ—అంతట రాజదోషము లేకుండఁగాఁ బ్రజల కకాలమృత్యువు రా దని దయామయుఁ డైన శ్రీరాముఁడు దోషము తనయం దారోపించుకొనుచుండఁగా, ఆశరీరవాణి యిట్లు పలికెను.

గీ. వినుము శంబూకుఁ డనుశూద్రుఁ డనుపమాన
తపము చేయుచునుండె భూతలమునందు
చంపఁ దగినట్టివానిమస్తకము దునిమి
బ్రాహ్మణకుమారు బ్రతికింపు రామచంద్ర!

అది విని జగతీనాయకుఁ డైన రామభద్రుఁడు కత్తి చేతఁబట్టి విమాన మెక్కి శూద్రతాపసుని వెదకుటకై యెల్లదిక్కులు తిరుగ బయలుదేరెను.

వా—ధూమపాయి యైనశంబూకుఁ డీజనస్థానముననే తలక్రిందుగాఁ దపము చేయుచున్నాఁడు. వానిని వెదకుచున్న శ్రీరామచంద్రుడు మరల నీవన మలంకరించును గాఁబోలు!

అ—అమ్మా! ఇపుడు వచ్చుచున్నాఁడు.

వా—ఆర్యా ఆత్రేయీ? కానిమ్ము. ఇపుడు మట్టమధ్యాహ్న మైనది చూడు.—

ఉ. ఆతపబాధ కోర్వక రయంబున గూళ్ళకుఁ జేరి వేడిమిన్
గూఁతలు వెట్టుకాకులును గోళ్లను బావురముల్ గలట్టియా
యాతరుపంక్తి తీఁట గొని యేన్గులు రాచుకొనంగ గాలు ఘ
ర్మాతివిశీర్ణవృంతకుసుమావళిఁ బూజ యొనర్చు గాతమిన్.

(ఇద్దఱు నిష్క్రమింతురు) ఇది శుద్ధవిష్కంభము.

(తరువాత సదయుఁ డైనశ్రీరాముఁడు విమానస్థుఁడై కత్తిపై కత్తి పట్టుకొని ప్రవేశించును)

రా—మ. విను మో దక్షిణహస్తమా! వృషలుపై వేవేయు మీకత్తిఁ జ
చ్చినభూమీసురబాలకుండు మరలన్ జీవింపఁగాఁ, బూర్ణగ
ర్భను వైదేహిని బట్టి త్రోసినమహాపాపాత్ముఁ డైనట్టి రా
మునిగాత్రంబవు గా వొకో! దయయను మోమాటంబు నీకుంగునే!

(అతికష్టమున నఱికి) రాముఁడు చేయఁదగినపని చేసితిని. ఇఁక బ్రాహ్మణ కుమారుఁడు జీవించునా?

దివ్యపురుషుడు—(ప్రవేశించి) దేవా! జయము జయము.

గీ. దండధరభీతిఁ బాపినదండధారి!
స్వామి! శంబూకుఁ డను నమస్కార మయ్య!
బ్రతికె విప్రుండు నాకు దివ్యత్వ మబ్బె
సజ్జనులచేతిమృతియు నిస్తారకంబ.

రా—ఈరెండును నాకిష్టములే. నీవు చేసినమహాతపస్సునకుఁ దగినఫల మ వింపుము.

గీ. మోద మానంద మష్టవిభూతు లిష్ట
సంపదలు నెందు సమకూరు, సకలశుభము
లలరు వైరాజనామక మైనయట్టి
పుణ్యలోకంబుఁ జేర శంబూక! పొమ్ము.

శం—దేవా! మీయనుగ్రహము చేత నా కిట్టిమహిమ గలిగినది గాని నాతప గాదు—అట్లననేల? తపస్సే మహోపకారము చేసినది.

చ. నరవర! లోకనాథుఁడ వనాథశరణ్యుఁడ వీవ లోకమం
దరయఁగ నొప్పు, దైవ ధరయాత్రయుఁ గ్రుమ్మరి వచ్చి
న్నరయఁగ, నాతపోమహిమ నమ్మ నిజంబిది, యట్లు
దిరిగి యయోధ్యకుండి చనుదెంతువె? దండకఁ గాలు పెట్టు

రా—ఇది దండకారణ్యమా? (అంతటఁ జూచి)

చ. చకచకలాడుచుండె నలచక్కనిచిక్కనిపట్లు, మేల్, భయా
నక ముదయించుఁ గగ్గొన ఘనం బగుగోత్రులుమిట్టలున్న
వికటతలం, బవే గిరులు వెల్లువ వాఁగు లగస్త్యునాశ్రమం
బకట! యి దంతయున్ బరిచితాటవిగాఁ గనుపట్టు

శం—అవును. ఇది మీ కెటేఁగినదండకారణ్యమే. తొల్లి దేవరవా రిచ్చట చినప్రుడు పదునాల్గువేలపదునల్వురరక్కసులను ఖరదూషణ సంహరించినారు. ... సిద్ధక్షేత్ర మయినజనస్థానమందు

జానపదు లందఱును నిర్భయముగా సంచరింపఁగలిగినారు.

రా—అయితే, ఇది కేవలము దండకాటవి కాక జానస్థానము కూడనా?

లం—చిత్తము. చూచువారిశరీరములు గగుర్పొడుచునట్లుగా భయంకరములై మదించిన బెబ్బులులతోఁ గూడినకొండగుహలు గలజనస్థానపర్యంతదీర్ఘారణ్యములు దక్షిణదిక్కునను వ్యాపించి కనవచ్చుచున్నవి చిత్తగింపుఁడు.

సీ. ఆవంక నిద్రించునల త్రాఁచుపాముల
నిట్టూర్పులకు రేఁగి నిప్పు మండు,
ఆప్రక్క కవల గాఢారణ్యమధ్యంబు
క్రూరసత్వములసంచారభూమి,
ఆచాయ మృగములయూర్పులు వినవచ్చు
నీచాయ నిశ్శబ్ద మొంతయేని,
ఆచక్కి గుహాలలో నందందు నీ ళ్ళున్న -
వీచక్కి నీర మిం తేని లేదు,

గీ. దప్పి గొన్నట్టితొండ లీదరులమొగలఁ
బొంచి లోపల సుఖము నిద్రించుచున్న
కొండచిలువలమేనులనుండి కాఱు
చెమటనీళ్ళను ద్రాగు నచ్చెరువుగాఁగ.

రా-గీ. మున్ను ఖరరాక్షసుండు కాఁ పున్నయట్టి
యీజనస్థాన మిప్పు డిట్లేమగఁటి;
నపుడు జరిగినయిచటివృత్తాంతములను
గన్నులకుఁ గట్టినట్లుగాఁ గాంచుచుంటి.

(అంతటఁ జూచి) జానకి, సర్వథా రాముని ప్రేమించిన మహాపతివ్రత—ఇవి దుర్గమారణ్యములు గదా!—ఇంతకంటె భయకారణ మేముండును—(కన్నీటితో)

గీ. పుష్పరస పుష్పగంధంబు పొలయునట్టి
కానలం దుండు నీతోడఁ గలిసి యనుచు

నిందు నను( గూడి యుండె నాయిందువదన,
ఆమెయనురక్తి యట్టిది—యనన్యశంబు.

గీ. ఏమియును జేయ కూరక మెప్ప రెవరి
దుఃఖముకు నైజసుఖమున( దొలఁగుచుందు
రట్టినిర్హేతుకప్రీతి నలరునట్టి
వారు వారియదృష్టదేవతలు సుమ్ము.

శం.—దేవా! తలపెట్టరాని యీదుఃఖవచనములు విడిచిపెట్టి యీప్రసన్న
లైనమహారణ్యములను జూడుఁడు. మత్తమయూరముల చక్కనికేకా
తళతళ మెఱయుచుండ, మిక్కిలి దగ్గఱగాఁ గలిసియుండి చల్లని
శేత మొక్కలగుంపు లతిసుందరంబులై కన్నులవిం దగుచుండ, ...
గా నందను సంచరించువివిధమృగయూథములతో వెలయుచు
లెంతరమణీయముగా నున్నవో చిత్తగింపుఁడు.

చ. కిలకిలలాడునట్టివిహగీవిహగంబులు త్రొక్క వేతసం
బులపయినుండి జాఱిపడుపువ్వులవాసనతో, వినీలన
త్ఫలభర మైననేరెడుపాదంబసి తొట్రిలి మ్రోఁగువాఁగు
గలిసినయేళ్ళు చూడు వడిగాఁ బ్రవహించెడుఁ దేటనీటితో

గీ. ఘోరభల్లూకములు కొండగుహాల నుమియు
నట్టిచప్పుడు మఱుమ్రోఁత సధిక మయ్యెఁ
గరులు విఱిచినసల్లకీతరులనుండి
వెడలురసమునుగంధంబు విరియు నిందు.

రా—(కొంచెము సేపు మాటాడకుండి) ఓయీ! దేవయానంబు లయిన
నీ కనుకూలములగును గాక. పుణ్యలోకముల కెగిరిపొమ్ము.

శం—ప్రాచీనబ్రహ్మవాది యైనయగస్త్యమహామునికి నమస్కరించి
నకుఁ బోయెదను. (వెళ్ళును)

రా-క. ముసులము గృహమేధుల మై

...సంసారసుఖ .

బును గాంచుచు బహుకాలము
నును పున్నవనంబు నిపుడు పొందితి మరలన్.

గీ. పీనహరిణంబు లున్నయీ కాన లవియె
కేక లిడునెమ్మి లున్నయీగిరులు నవియె
మంజులాశోక వేతససహితనీప
కలిత మైనట్టియీయేళ్ళగట్టు లవియె.

మేఘపంక్తివలెఁగనవచ్చునట్టియీకొండయే ప్రస్రవణము. దానిలోయలనుండియే గోదావరి ప్రవహించుచున్నది. దానిశిఖరముమీఁదనే గృధ్రరాజు నివసించెడివాఁడు. దానిక్రిందనే కిలకిలారావవివిధశకుంతసంతానముల కావాసములై శ్యామలాకారమున గోదావరిలోఁ బ్రతిఫలించు బహువిధఫలపుష్పపాదపంబులతోఁగూడినచక్కనివనాంతప్రదేశ మున్నది. అందే పర్ణశాలలలో మేము సుఖముగా నుండెడివారము. ఇదిగో! దానికి దగ్గఱగానే పంచవటి. ఇందే నాప్రియురాలిప్రాణసఖి యైనవాసంతి నివసించును. ఆహా! చిరకాలము నివసించుటచే మాస్నేహసల్లాపక్రీడాదుల క్రీడాప్రదేశములు సాక్షు లగును గదా! (పునోవైకల్య మభినయించి) ఇ దెందుకు సంభవించినది? అయ్యో! ఇపుడు—

చ. తనువున నుండి యుండి మొగఁదన్నెడుతీవ్రవిషద్రవంబురీ
తిని, మును ఱొక్కలో నణఁగి దెబ్బఁ జలించినముల్కిముక్కలా
గున, సెల లెత్తి బద్ద లగుగుండియలోని రణంబుమాడ్కి, నా
వెనుకటిశోక మే మరల వేపఁగఁజొచ్చెను నూతనంబుగా.

అయినను, పూర్వకాలమిత్రము లైనయీ భాగములను జూచుచున్నాను. (చక్కఁగా నిరీక్షించి)ఆహా! ఈప్రదేశ మెంత మాఱిపోయినదో!

ఉ. చూడఁగఁ దొంటివెల్లువలచోటులు మేటలువేసె, నచ్చటం
బాడయి పల్చ నయ్యెఁ దరువాటిక, యిచ్చటఁ జిక్క నయ్యె, నే
నాఁ డిది చూచినాఁడనొ? కనంబడుచుండెను వేఱుకానగా
నేఁ డిది,కాని యీగిరులు నిక్క మదే యిది యంచుఁదెల్పెడున్.

అయ్యో! నేను విడిచిపెట్టుచున్నను, నన్నిపంచవటీస్నేహము బలాత్కారముగా లాగుచున్నదిగదా! (సవిచారముగా)

ఉ. అక్కటా! యింట నున్నగతి నాకమలాక్షిని గూడి పెక్కునా
ళ్ళెక్కడ నుంటి? దేనికథ లెప్పటి కప్పుడె యూడుమండె మ
కక్కనమనీయపంచవటి నాసతి మాపినపాపి రాఘవుం
డొక్కఁడు నిప్పు డెట్లు కనునో? చని చూడక యెట్లు పోవు

శంబూకుఁడు—(ప్రవేశించి) దేవా! జయము జయము. నావలన దేవర
విన్నయగస్త్యులవారు దేవరతో నిట్లు చెప్పు మని సెలవిచ్చినారు.

"రామభద్రా! నీవు విమానము దిగునప్పు డాచరింపఁదగిన నీరాజ
సమకూర్చుకొని లోపాముద్ర మిక్కిలి వాత్సల్యముతో నీరాక కెదురు
చున్నది. ఇచ్చటి మునీశ్వరు లందఱును నిన్నుఁ జూడఁ గుతూహలపడుచు
కావున ముందుగా నిచ్చటికి వచ్చి మా కందఱికిని సంతోషము గలిగించి
మహావేగసంపన్న మైనవిమాన మెక్కి యయోధ్య కేగి యశ్వమేధయాగము
శింపుము."

రా—ఆమహానుభావుఁ డాజ్ఞాపించినట్లే చేయుదును.

శం—దేవా! ఇటు దయచేయుఁడు.

రా—(విమానమును బోనిచ్చుచు) అమ్మా పంచవటీ! పెద్దల యనురోధ
నిన్నతిక్రమించి పోవుచున్నాను. క్షణకాలము క్షమింపుము.

శం—దేవా! ఇదియే క్రౌంచావతపర్వతము. దయచేసి నిరీక్షింపుఁడు—

చ. అలపొదరిండ్ల నుండినదివాంధగణంబులభీకరధ్వనిం
గలిసినకీచకధ్వనికిఁ గాకులు మూకము లయ్యె, వీను లిం
పొలయుమయూరనాదముల కుల్లము తల్లడ మంద సర్పముల్
తలఁకుచు మట్టితోఁట్రల మొదళ్ళను డాఁగి వణంకు నెంతయున్

చ. తరళపయోదశృంగ మిది దక్షిణపర్వతపంక్తి, దీనికం
దరముల గద్గదధ్వని యొనర్చును గాతిమి, చూడుమీ; పర
స్పరమును దాఁకి పై కెగసి సంకులమై వడి మ్రోఁగునట్టిపె
న్దరఁగలు లోఁతునీరును గనంబడునేళులసంగమంబులన్.

(అందఱు నిష్క్రమింతురు.) ఇది ద్వితీయాఙ్కము.



# ఉత్తర రామచరిత్ర నాటకము

## తృతీయాఙ్కము

(అటుతరువాత నదీద్వయము ప్రవేశించును)

ఒకతె—సఖీ మురళా! తొందరపడుచున్నట్లున్నా వేమి?

మురళ—అమ్మా తమసా! అగస్త్యులవారి యిల్లాలు లోపాముద్ర గోదావరితో నొక మాట చెప్పి రమ్మని నన్నుఁ బంపినది. నీకును దెలిసియే యుండును.—

,, భార్యను విడిచినది మొదలుగా—

గీ. ధీరగంభీరుఁ డగుటచేఁ దెలియరాక
యుండి లోపలఁ గుతకుతయుడుకునట్టి
రాముకరుణారసంబు దురంతతాప
కారియై పుటపాకసంకాశ మయ్యె.

గద్గదస్వరంబునకుఁ గారణ మైనయాదీర్ఘశోకసంతాపముచే రాముఁ డిపుడు మిక్కిలి చిక్కి-పోయినాఁడు. అతనిఁ జూచినపిదప నామనస్సు కదలుచున్న పువ్వు తొడిమెలాగున నున్నది. ఇపుడు తిరిగి వచ్చుచున్న రామభద్రుఁడు తనభార్యతోఁ గూడి నివసించిననాఁటివినోదవిలాసంబులకు సాక్షు లైనపంచవటీప్రదేశములను దప్పక చూచును. ఎంతధీరుఁ డైనను, ఈయవస్థలో దుఃఖమూలము లైన యాస్థానములు చూచునపు డతని కతిగంభీరశోకక్షోభసంవేగముచే మాటిమాటికిని మహాప్రమాదము సంభవించుచుండు నని శంకింపఁదగి యున్నది. కావున, భగవతీ గోదావరీ! నీవచ్చట సావధానముగా నుండుము.

గీ. పద్మకింజల్కగంధసం వాసితంబు
నంబుశీకరశీతల మైనయలల

గాలి నిశ్శంకముగ శేఁపి కరుణతోడ
మూర్ఛమూర్ఛకు రాముని బ్రోవుమమ్మ!"

తమ—స్నేహధర్మముచే నాలోచించిన యీయుపాయ మెంతయుఁ జక్క
సున్నది. కాని ప్రధానమైన సంజీవనోపాయము చే రామునకుఁ జేకూరినది.

ముర—అ దెట్టిదో చెప్పుము.

తమ—చెప్పెదను వినుము. అపుడు, వాల్మీకులవారియాశ్రమముదగ్గఱ సీతా
విడిచిపెట్టి లక్ష్మణుఁడు వెళ్ళినతరువాత, ఆమె ప్రసవవేదనకోర్వలే
వేళముచే గంగలో దగినది. వెంటనే యామె కచ్చుటనే యిద్దఱు
పుట్టిరి. అపుడు గంగావసుంధర లనుగ్రహించి యామెను శిశువులతో
తలమును జేర్చిరి. పాలు త్రాగుట మానినతోడనే గంగాదేవి యాకు
నిద్దఱిని దీసికొనివచ్చి వాల్మీకిమహర్షికి స్వయముగా నప్పగించినది.

ముర—(ఆశ్చర్యముతో)

గీ. ఔర! గంగావసుంధరలంతవారు
సీత కట్టిసహాయంబు చేసి రనుట
నిట్టివారికి వచ్చెడిమెట్టికష్ట
మైన భాగ్యంబుగా మాఱు నని తలంతు.

తమ—పిదప, శంబూకవృత్తాంతముచే రామభద్రుఁడు జనస్థానమునకు వచ్చి
సరయూనదివలన విన్నదై జాహ్నవీదేవి, స్నేహవశంబున లోపాముద్ర
మానించినట్లే యనుమానించి, సీతాదేవిని వెంటఁ బెట్టుకొని యేదో
పనిమీఁద వచ్చినట్లుగా గోదావరీతీరమునకు వచ్చినది.

ముర—భాగీరథి చక్కఁగా నాలోచించినది. రాజ్యపరిపాలననిష్ఠచే దేవా
హేతువు లైనఘనకార్యములలో మునిఁగి రామచంద్రుఁ డింతవఱకు
మనోవ్యథబారినుండి తప్పించుకొనుచున్నాఁడు కాని యిపుడువ్యాపా
శూన్యుఁడై శోకమాత్రద్వితీయుఁ డైనయితనికిఁ బంచవటీప్రవేశ మ
యకము కాక పో దని యామె యూహించినయుపాయ మెంతయు
కూలముగానున్నది—ఔను గాని సీతాదేవి రామభద్రు నె ట్లూ
నమ్మా!

తమ—గంగాదేవియే జానకితో నిట్లు చెప్పినది. ,,అమ్మా దేవయజనసంభూ
సేఁడు చిరంజీవు లైనకుశలవులకుఁ బన్నెండవజన్మదినోత్సవము చేసి

లకు శుభసూత్రము కట్టవలసినరోజు. కాఁబట్టి నీకు వరుసకు మొట్టమొదటి మామగారును మనుసంబంధమైనరాజవంశమునకు జనకుఁడును సకలదోషహారుఁడునైనసూర్యదేవుని నీ చేతితోఁ గోసినపువ్వులఁ బూజింపుము. భూతలమందున్నను నామహిమచే నిన్ను వనదేవతలు గూడఁ జూడఁజాలరు. ఇంక మనుష్యులమాట చెప్పనేల?,, అని యామెతోఁ జెప్పి, ,,తమసా! మాకోడలయిన సీతకు నీమీఁద నెంతో ప్రేమగదా! కావున నీవు దీనితోనుండుము, అని నాతో సెలవిచ్చినది. అందుచే నే నామె యాజ్ఞాప్రకారము నడచుకొనుచున్నాను.

ముర— నే నీవృత్తాంతము లోపాముద్రకుఁ జెప్పెదను. ఇపుడు రామభద్రుఁడును వచ్చినాఁడనియే తలఁచెదను.

తమ— ఇదిగో! గోదావరీప్రవాహమునుండి బయలుదేరి, జానకి—

గీ. తెల్లపడి చిక్కినట్టిచెక్కిళ్ళతోడఁ
గొప్పు విడిపోయి మోముపైఁ గురులు చెదరఁ
గరుణరసమూర్తియో మేను గాంచువిరహ
బాధయో యన నడవికి వచ్చుచుండె.

ముర— ఇదిగో జానకి—

చ. పుడికినయట్టి కేఁజిగురుపోఁడిమి గల్గి కృశించినట్టియీ
పడఁతుక పాండురాంగమును వాడఁగఁజేసెడుఁ జిత్తపుష్పమున్
గడు నుడికించుదీర్ఘతరగాఢమనోవ్యథ, శారదోష్మ మా
పాడముచున్నలే మొగలిపువ్వునలోపలిఱేకునుంబలెన్.

(అని నిష్క్రమింతురు)

(తెరలో) ప్రమాదము ప్రమాదము.

[తరువాత, పుష్పాపచయవ్యగ్రహస్తయై సవిచారకుతూహలముగా వినుచున్న సీత ప్రవేశించును]

సీత— ఆహా! తెలిసినది. నాప్రియసఖియైనవాసంతి మాట్లాడుచున్నది.

(మరలఁ దెరలో)

మ. అనురాగంబున మున్న సీత తనముం దల్లాడునేయేన్గుపి
ల్లను బోషించెనొ లేఁతయందుగుచిగుళ్ళన్ నోటి కందించుచున్

(మఱియుఁ దెరలో) దాని కేమి వచ్చినది?

తన యొండేఁగుఁ గూడి నీళ్ళఁబడి యీఁతాలాడునద్దాని !
కొని పోరాడఁగఁ జొచ్చె వేఱొక మదగ్రూరేభ మెట్లో క...

సీ—(తొందరతో నాలు గడుగులు వెళ్ళి) ఆర్యపుత్రా! నా పెంపు...
రక్షింపు రక్షింపు—అయ్యో! పంచవటిని జూచుటచే దురదృష్టవంతు...
నైననా కలవాటయిన యామాటయే నోటికి వచ్చుచున్నది, హా ఆర్యపు...
(మూర్ఛిల్లును)

తమస—(ప్రవేశించి) అమ్మా కుమారీ! ఊరడిల్లుము.
(తెరలో) విమాన రాజమా! నీ విచ్చటనే యుండుము.

సీ—(స్మృతిఁ జెంది సభయోల్లాసముగా) ఆహా ఆశ్చర్యము! జలభరితమేఘ...
ధ్వనిమాడ్కి గంభీరమైనగొప్పకంఠధ్వని యెక్కడనుండియో వచ్చి ...
వింబడి మందభాగ్య నగునా కానందము గలిగించుచున్నది.

తమ—(కన్నీటితో, చిఱునవ్వుతో) కుమారీ!

గీ. స్పష్టమా? కాదు, దూరాన సంభవించె
నట్టికంఠస్వరంబు నీ వాలకించి
పొడము తహతహఁ దత్తఱపడెద వేల?
యుఱుము విన్నట్టిబాలమయూరివోలె.

సీ—భగవతీ! ఏ మన్నావు? ఈవిన్నకంఠస్వన మస్పష్టమా? స్వరసందర్భము...
నెఱుఁగనా? అది నిజముగా నార్యపుత్రుని మాటయే.

తమ—కావచ్చును. శూద్రతాపసునిదండించుటకై యారఘువీరుఁడు జనస్థానము...
వచ్చె నని విన్నాను.

సీ—పరిపాలకధర్మములు నిర్వహించుట యామహారాజునకు మిక్కిలి య...

(తెరలో)

గీ. బాలమృగములు చెట్లు చుట్టాలు గాఁగ
నెందు చిరకాలముంటి నాయిందువదనఁ
గూడి, యవి యివ్వె సెలయేళ్ళు గుహాలు పెకు—
పరగుగోదావరీతీరగిరితటములు.

సీ—ఎట్లు? ప్రభాతచంద్రమండలమువలెఁ దెల్లవడి శరీర మంతో కృశించిన...
జగంభీరానుభావమాత్రమున గుఱుతు పట్టదగిన యార్యపుత్రుఁడే ...

వశమున వచ్చెను. తల్లీ తమసా! నన్నుఁ బట్టుకొనుము, (అని తమసను గౌఁగిలించుకొని మూర్ఛిల్లును)

తమ—అమ్మా! ఊఱడిల్లుము.

(తెరలో)

గీ. హృదయమునన దాఁగియుండి యు నింత, కిపుడు
పంచవటిఁ జూడ రగిలి జ్వలించునట్టి
దుఃఖవహ్నిని మును లేచుధూమమట్లు
గాఢముగ నన్ను మోహంబు గ్రమ్ముచుండె.
హా ప్రేయసీ జానకీ!

త—పెద్దలు శంకించినవిషయ మిదే కదా!

(తెరలో) హా దండకారణ్యప్రియసఖీ వైదేహీ! (మూర్ఛిల్లును)

సీ—హా కష్టము! అభాగ్యురాల నైననన్నుఁ బేరెత్తి పిలుచుచు నల్లకలువలు ముకుళించునట్లు కన్నులు మూఁతవడ నార్యపుత్రుఁడు మూర్ఛిల్లెను. అయ్యో! ఉచ్ఛ్వాసనిశ్వాసములు లేక వ్యత్యాసముగా భూతలమునఁ బడియుండెను. తల్లీ! తమసా! రక్షింపుము. ఆర్యపుత్రుని బ్రతికింపుము (అని కాళ్ళపైఁ బడును)

తమ—

క. నీవే బ్రతికింపవలెఁ, భూవలయప్రభుని రాఘవుని గల్యాణీ!
నీవిమలకరస్పర్శము, నీవిభుని కభీష్ట మగుట నిక్క ము గాదే?

సీ—కానున్నది కాక మానదు. నీవు చెప్పినట్లే చేసెదను. (అని తొందరగా వెళ్ళును.)

(పిదపఁ గన్నీరు విడుచుచున్న సీతచేఁ బట్టుకొనఁబడి సానందముగా నిట్టూర్పు విడుచుచు నేలఁ బడియున్న రాముఁడు ప్రవేశించును)

సీ—(కొంచెము సంతోషించి) ముల్లోకములకుఁ బ్రాణము మరల వచ్చిన దని తలఁచెదను.

రా—ఆహా ఏమిది?

ఉ. చందనపల్లవంబులరసంబొ? నిపీడితచంద్రమఃకలా
స్యందరసంబొ? జీవనమొసంగెడియోషధిరాజసారమో?

పొందుగ నామెడందపయిఁ బూసినయట్టులు చల్లనయ్యె న
ర్వం దెను విచ్చెఁ గన్నులు కడఁటినప్రాణము వచ్చె వెండియు

మ. పరమాహ్లాద మొనర్చి జీవనము నాపాదించి రక్షించునీ
కరసంస్పర్శము మున్నెఱింగినదె నిక్కం బౌర! చిత్తవ్యథా
భరజాతం బగు మూర్ఛ నిప్పుడిది పోవం ద్రోసి యానంద
భరితం బౌజడభావ మంగములఁ బర్వం జేయు నూత్నంబు

సీ—(భయవిచారములతోఁ గొంచె మొత్తిగిల్లి) నాకిప్పుడిదే యెక్కువ.

రా—(కూర్చుండి) అనురక్తురాలయిననాదేవి నన్ను స్పృశింపలేదు.

సీ—అయ్యో ఎంతకష్టము! ఆర్యపుత్రుఁడు నన్నెట్లు నిర్దేశించును?

రా—కాని! చూచెదను.

సీ—తమసా! మన మావలికిఁ బోవుదము. తనసెలవు లేకుండఁగా దగ్గఱ
కీమహారాజు కోపగించును.

తమ—బిడ్డా! గంగాదేవియనుగ్రహముచే నీవు వనదేవతలకుఁ గూడఁ గనఁ

సీ—ఆఁ! ఔను జ్ఞప్తికి వచ్చినది.

రా—ప్రేయసీ జానకీ!

సీ—(గద్గదస్వరముతో) ఆర్యపుత్రా! ఇప్పటి స్థితినిబట్టి యీమాట యు
లేదు. (కన్నీళ్లతో) అయ్యో! జన్మాంతరమం దైనను, ఈమహారాజు
లభించునని యూహించుట కవకాశము కనఁబడదు. అట్టియెడ మం
రాల నయిన నన్నుద్దేశించి ప్రేయసీ యని పిలుచునట్టియీప్రియు
తాతిగుండెదాననై యెట్లు నిర్దయురాల నగుదును? ఈయనమనస్సు
చును. నామనస్సీయన యెఱుఁగును.

రా—(అంతటఁజూచి) హా! ఇక్కడ యెవ్వరును లేరు.

సీ—భగవతీ! నిష్కారణముగా నన్ను విడిచిపెట్టినయీప్రియుఁ డీస్థితిలో
చున్ననాహృదయావస్థ యెట్లున్నదోయేమి చెప్పుదును?

తమ—అమ్మా! నే నెఱుఁగుదును.

సీ. ఎఱిఁగి యూరకయ నన్నెడఁబాసె నితఁ డెంత
వంచనం బసి కోపగించిరిట్లు

నాయాస లడుగంటె నాకెందు కీక నంచు
నాస్థ మాని తటస్థ మైనయట్లు
ఘనవియోగమున నాకస్మికఘటనచేఁ
బరవశం బయి భ్రమానుపడినయట్లు
సహజసౌజన్యభాస్వర మాటఁ బతిభక్తి
నల్క దేటి ప్రసన్న మైనయట్లు
గీ. భర్తదుఃఖంబునకు దుఃఖపడినయట్లు
ఘనతరం బగుననురక్తిఁ గరఁగినట్లు
పాలుపో కున్నయట్లు నీపట్టునందు
నీసుహృదయంబు గనవచ్చు నిర్మలాంగి!

రా-గీ. తనువు దాల్చుననుగ్రహం బనఁగ నీదు
పావనదయార్ద్రశీతలస్పర్శ మిపుడు
గూడ నానందమును సమకూర్చుఁ గాని
దేవి! నీ వెక్క డున్నావో? తెలియరాదు.

సీ—ఆహా! అతిగంభీరహృదయానురాగరసమునఁ బుట్టి యానందరస మొలుకుచున్న యీమహారాజుమాట లమృతప్రాయము లగుచున్నవిగదా! నిష్కారణముగా విడిచిపెట్టుటచేఁ బుట్టినమహాదుఃఖము మనశ్శల్యమై వేధించుచున్నను, మన సార వచ్చినయీమాటలను విశ్వసించి యిపుడు నాజన్మము బహుమతమై సార్థక మయ్యెనని తలఁచెదను.

రా—నావెఱ్ఱి కాని, ప్రియురా లెచ్చటనుండి వచ్చును? నిశ్చయముగా నిది యెల్లప్పుడును దలఁచుకొనుచుండుటచే నాకు గలిగినభ్రాంతి కాని వేఱు కాదు. (తెరలో) అనుగ్రహింపు మనుగ్రహింపుము.

మ. అనురాగంబున మున్ను సీత (పూర్వార్థము చదువఁబడును.)

రాము—(సవిచారముగా) దాని కేమి వచ్చినది?

మ. తన యోఁడేఁ గుఁగూడి (ఉత్తరార్థము చదువఁబడును.)

సీ—ఇపు డేది మార్గ మెను?

రా—ఆఁ! ఎక్కడ? కరిణితో విహరించుచుండఁగా నాప్రియురాలి పెంపుడుగజము

నెనుర్కొన్న దుష్టవారణ మెక్కడ? (అని లేచును)

వా—(ప్రవేశించి) ఏమి? పూజ్యుఁడైన రఘునందనుఁడు!

సీ—(చూచి) హా! నాప్రియసఖియైన వాసంతి.

వా—మహారాజా! జయము జయము.

రా—(గుర్తించి) ఓ! వాసంతి, జానకీప్రియసఖి.

వా— దేవా! త్వరపడుము. ఇటు జటాయుశిఖరమునకు దక్షిణముగా సీతా మీఁదుగా గోదావరిఁ జొచ్చి నీప్రియురాలి పెంపుడేనుఁగును రక్షింప

సీ—హాతాతా! జటాయూ! నీవు లేనిజనస్థానము శూన్యమే కదా!

రా—అక్కటా! ఈమాటలు హృదయమర్మములందు గ్రుచ్చుకొని బాధించు గదా! (పరిక్రమించును)

వా—దేవా! ఇటు దయచేయుము.

సీ—అమ్మా తమసా! నిజముగా వనదేవతకూడ నన్నుఁ జూడఁ జాలదు కదా

తమ—కుమారీ! మందాకినిమహిమ యెదేవతలకును లేదు. నీకు సందేహ మే

సీ—అట్లయిన, మనము కూడ ననుసరింతము. (పరిక్రమింతురు)

రా—భగవతీ గోదావరీ! నమస్కారము.

వా— దేవా! నధూసాహాయ్యమున నీప్రియురాలియేనుఁగే గెలిచినది. సంతోష

రా—ఇది చిరంజీవియై వృద్ధి కెక్కుఁగాక.

సీ—ఆహా! ఇది యెంతటి దైవది!

రా—దేవీ! నీవు పెంచిన కరికలభము జయము గాంచినది. నీ భాగ్యము కే

ఉ. తామరతూండ్లఁ బోలునవదంతయుగం బుదయించునీడును
దోమదిరాక్షి! నీదు చెవి నున్నలవంగపుఁబల్లవంబు లీ
లామతితోఁ గరాగ్రమున లాగిన పెంపుడుపిల్ల యౌవన
శ్రీమతమంగళంబు మదసింధురజేత యు నయ్యెఁ జూడుమీ

సీ—ఈదీర్ఘాయువు చక్కఁగా నున్నయీభార్య నెడఁబాయక చిరకాల గాత.

రా—సఖీ వాసంతీ! ఈచిరంజీవికిఁ దనభార్యను సంతోషపెట్టు చాతుర్య గలదు సుమీ చూడు.

ఉ. ప్రేయసి తూఁళ్ళు మెక్కినతతిన్ గనిపెట్టుచు నిచ్చె నోటికిన్
దోయజవాసితంబయినతొండములో నిజలంబు, వీఁపునన్

హాయిగ నీళ్ళుచల్లెఁ దనహస్తముతో, మఱి దానినెత్తిపైఁ
బాయనికూరిమిన్ గొడుఁగుపట్టె సనాళసరోజపత్రమున్.

సీ—తమసా! ఇది యిట్లు పెరిగి పెద్దదైనది. కాని కుశలవు లీనాఁటి కెంతవారైరో తెలియదు గదా!

తమ—ఇది యెట్లు పెరిగినదో వారు నట్లే పెరిగియుందురు.

సీ—నేను నిర్భాగ్యురాలను. పతివియోగమొక్కటే కాదు, పుత్రవిరహముగూడ దుస్సహమై నన్ను బాధించుచున్నది.

తమ—నీయదృష్ట మింతే. ఏమి చేయఁగలము?

సీ—పిల్లలనుగన్నాను. ఆయితే నేమి? మల్లెమొగ్గలవంటిపలుఁకుదురుతోను, విశాలనేత్రములతోను, తెలిసీతెలియనిసన్ననిమృదుమధురకంఠస్వనముతోడి చిఱునవ్వుతోను ముద్దు లొలుకునాపుత్రులసుందరవదనారవిందముల నాయార్యపుత్రుఁడు ముద్దుపెట్టుకొను భాగ్యమునకు నోఁచుకొని నాకాన్పుతో నేమి ప్రయోజనము?

తమ—ఆభాగ్యము దేవతానుగ్రహమునఁ గలుగుఁగాక.

సీ—తల్లీ తమసా! పిల్లలను దలఁచుకొనుటచే బొమ్మచేఁపుటయు, పిల్లలతండ్రి దగ్గఱనుండుటచేఁ గొంచెము సేపు కాఁపురముచేయుటయు సంభవించినది.

తమ—నిజ మమ్మా! ఈమాట చెప్పవలెనా? సంతాన మనఁగా స్నేహముయొక్క పరమావధి. మఱియును, తల్లిదండ్రుల యవినాభావసంబంధమునకుఁ బ్రధాన కారణము.

క. పూనిక భార్యాభర్తల
మానసములఁ బ్రేమ నొక్కటై గూర్చెడియా
యానందగ్రంథియె సం
తానం బని చెప్పుచుంద్రు తత్త్వజ్ఞు లిలన్

వా—దేవా! ఈవైపుకూడఁ జూడుము.

గీ. తరుణపింఛంబు పుట్టినతఱుణమందు
దేని నీభార్య పెంచెనో దినదినంబు,
ఆమయూరమె కడిమిపై నాఁడునెమలి
తోడుగాఁ గేక లడరంగ నాడుచుండె

సీ—(సకౌతుకస్నేహాశ్రమముగా) ఔ నదే యిది.

రా—కుమారా! ఆనందింపు మానందింపుము. మేమిపుడు సంతుష్టుల మైతి

చ. కనుబొమ లాడఁగా, విరియఁగాఁ గనుఁదమ్ములు, వేడ్కనీ
త్తనవలయంబులందు కరతాళ మొనర్చుచు దృష్టి నిల్పిన
జనకతనూజ మున్ను తనచాతురి మీఱఁగ నాట్య మా
ర్పిననిను మాతనూభవునిరీతిఁ దలంచెద నోమయూరకా

ఆహా! తిర్యగ్జంతువులు గూడ స్నేహమార్గ మనుసరించుచున్నవి.

గీ. ఎడనెడను మొగ్గ తొడుగునీకడిమిచెట్టు
ప్రేమతో మున్ను ప్రియురాలుపెంచినదియ

సీ—(నిట్టూర్పు విడిచి కన్నీళ్ళతో) ఆర్యపుత్రుఁడు చక్కఁగా నానవాలు

రా—కనుకనే చుట్టమైనయీ కడిమిఁ జేరి
నాతి పెంచిన నెమలి యానంద మొందు.

వా—దేవా! ఇది నీవు పూర్వము నివసించినయాశ్రమస్థానము గాన్న
గొంచెమునేపు కూర్చుండుము.

రా—అట్లే చేయుదును (కూర్చుండును)

వా—గీ. బాలకదలీవనాంతరవర్తి యిదియె
పడఁతి తోడుగ నున్ననీపడకబాయి
దేవి యిందుండి పచ్చి కందించెఁ గాన.
హరిణములు నేఁటి కీరాతి నాశ్రయించు.

రా—అబ్బా! నే నిది చూడలేను. (ఏడ్చుచు వేఱుప్రక్కకుఁ దిరిగి కూర్చుం

సీ—సఖీవాసంతీ! ఆర్యపుత్రునకును నాకును దీనిఁ జూపి యేమిప్రయోజనము. గా
చితివి! అయ్యో! అయ్యో!! అతఁడే యార్యపుత్రుఁడు, అదే పంచవటి
యేనా చెలికత్తె యైనవాసంతి. అవియే యెల్లసవిలాసవిహారములకు
లైనగోదావరీతీరకానన ప్రదేశములు, అవియే కుమారసమానము లైన
పక్షిపాదములు, దురదృష్టవంతురాల నైననా కిది యంతయు దృగ్గో
చరమగుచున్నను శూన్యముగా నున్నది. హా జీవలోక మంతయు నాకిట్లు
మైనది.

వా—సఖీ జానకీ! రామభద్రుని యవస్థను నీ వెందుకుఁ జూడవు?

చ. కనుఁగొనుచున్న నెల్లపుడుఁ గల్వలఁ గేఁశరీరకాంతి నే
ఘనుఁడు నవీనునట్లు మనకన్నులవిం దగుచుండెఁ దొల్లియు
య్యనఘుఁడు దుఃఖ పాండురకృశాంగుఁ డితండొకో యన్న సంశయం
బున కను వయ్యె,నైనను బ్రమోద మొనర్చుచునుండెఁజూడ్కకిన్.

సీ—సఖీ! చూచుచున్నాను.

తమ—పుత్రీ! మనసు దీర మరలఁ జూడుము.

సీ—హా దైవమా! ఇతఁడు నన్నెడఁబాయు ననియు, నే నితని విడిచియుందుననియు నెవ రనుకొన్నారు? అందుచే ముహూర్తమాత్ర మైనను జన్మాంతరములో నకస్మాత్తుగాఁ గనఁబడినట్లు కనఁబడిన నా ప్రియనాథుని గన్నులకు తెలపియిచ్చి నపుడెల్ల మనసారఁ జూచుచున్నాను (అని చూచుచుండెను)

తమ—(సస్నేహాస్రముగా సీతను గౌఁగిలించుకొని) కుమారీ!

మ. పరమానందవిషాదసంజనిత మాబాష్పాంబుపూరంబుతో
నుగు వేగం బయి దీర్ఘమై విపులమై యుత్పత్ష్మలంబై తమిన్
దొరఁగం జొచ్చినసీదుదృష్టి విలసద్దుగ్ధాబ్ధికు ల్యాభమై
చిరకాలంబున కానతో జలక మార్చెన్ నీమనోనాయకున్.

వా—

చ. అనఘుఁడు రాముదేవుఁడు తనంతన నెంకియుఁ జూడవచ్చె ని
వ్వని,దరులార! పువ్వులను బండ్లనొసంగుచుఁ బూజనేయుఁడీ
యనిలములార! మందగతి నంబుజగంధము తోడ వీవుఁడీ
యనుపమ మంజులస్వనము లార శకుంతము లార! పాడుఁడీ.

రా—సఖీ వాసంతీ!ఇటు వచ్చి కూర్చుండుము.

వా—(కూర్చుండి కన్నీళ్ళతో) కుమారలక్ష్మణుఁడు కుశలముగా నున్నాఁడా?

రా—(వినన ట్లభినయించి)

గీ. నీరు పచ్చిక నివ్వరుల్ నెమ్మిఁ గూర్చి
సీత తనచేతులారఁ బెంచినమహీజ
హరిణవిహగంబులను జూచునపుడు మనసుఁ
గలఁచు విషరసమట్లు వికార మొకటి.

వా—మహారాజా. లక్ష్మణుని కుశల మడుగుచున్నాను.

రా—(తనలో) మహారాజా, యని ప్రేమరహితముగా సంబోధించుచున్నది. కోపైక మాట తొట్రుపడ లక్ష్మణుని కుశల మడుగుచున్నది. సీతావృత్తాంతమీమెకుఁ దెలిసినదని తోఁచుచున్నది. (ప్రకాశముగా) కుమారలక్ష్మణుఁడు కుశలముగా నున్నాఁడు

వా—(ఏడ్చుచు) దేవా! ఏమి? మిక్కిలి క్రూరుఁడ వై తివిగదా!

సీ—సఖీ వాసంతి! ఎందు కిట్లు మాట లనెదవు? ఆర్యపుత్రుఁ డందఱికిని బూజ్యుఁడు. అందును నా చెలికత్తె వగుటచే నీకు మిక్కిలి పూజ్యుఁడు.

వా—ఉ. నీవు మదీయజీవితము నీవు మదీయతనూసుధారసం
బీవు మదీయచిత్తము మదీక్షణచంద్రిక నీవయంచు సం
భావనచేసి కూర్మిగలమాటల లాలనచేసి చేసి యా
దేవి నొకర్తె ముగ్ధను సతిన్—(మూర్ఛిల్లును)

తమ—వాక్యసమాప్తియు మూర్ఛయుఁ గూడ నుచితముగా నున్నవి.

వా—ఉ.....పయిమాట లిఁకేల చెప్పఁగన్. (నేలఁబడును)

రా—ఊఱడిల్లు మూఱడిల్లుము.

వా—(ఊఱడిల్లి) దేవా! ఎందు కింతచెడ్డపని చేసితివి?

సీ—వాసంతీ! ఊరకుండుము.

రా—లోకము సహింప కున్న దని.

వా—కారణ మేమి?

రా—ఏమో! లోకమే యెఱుఁగును.

తమ—చిరకాలమునకు లోకనింద.

గీ. కఠిన! నీకిష్టము యశస్సు గాదె? యింత
కన్న ఘోరాపకీర్తి వేఱున్న దొక్కొ?
సీత యే మయ్యెనో వనిఁ జెప్పవయ్య
తెలియదే నేమి తలఁచెదో తెలుపుమయ్య!

సీ—వాసంతీ! నీవే కఠినురాలవు. నీవే క్రూరురాలవు. దుఃఖించు నార్యుని మఱింతదుఃఖించునట్లు చేయుచున్నావు.

తమ—కుమారీ! ఆమె స్నేహావిషాదము లిట్లు మాట్లాడుచున్నవి.

రా—వాసంతీ! తలఁచుట లే మున్నవి?

చ. ఉరుతరగర్భభారమున కోపక ఘోరవియోగబాధ వం
దురు చోకమేఁటిలేడివలెఁ దొయ్యలి బెగ్గిలి చూచుచుండఁగా
సరసిజనాళమో విమలచంద్రికయో యన నొప్పునామెనుం
దరతనువల్లి నేఁపులియొ నంజుట నిక్క మటంచు నెంచెదన్.

—హా! ఆర్యపుత్రా! బ్రతికి యున్నాను. ఇక్కడనే యున్నాను.

—హా ప్రేయసీ జానకీ! ఎక్కడ నున్నావు?

—అయ్యో! ఎఱుఁగనివానివలె నార్యపుత్రుఁడు గూడ గొంతెత్తియేడ్చుచుండెను.
ఆయ్యో? ఎంతకష్టము!

—కుమారీ! ఇప్పటి కిది నైజమే. దుఃఖములో మునిఁగినవారు తమకడుపులోని
దుఃఖము నెట్లో వెళ్ళఁబుచ్చవలెను గదా!

గీ. గట్లు తెగదాసి సలిలంబు కలఁచునపుడు
చెఱువు రక్షింప గతి తూము తెఱచు టొకటె
ఘనవిషాదంబు హృదయంబుఁ గలఁచునపుడు
దానిరక్షింప నేడుపే తగినమందు.

అందును; బహువిధములఁ గష్టజీవనము చేయుచున్న రామభద్రుఁ డీసమయ
న గొంతెత్తి విలపించుట ముఖ్యమే యగును.

పూనిక ధర్మతత్పరత భూపరిపాలన మాచరించు, దుః
ఖానల మార్చు జీవము లతాంతమునా తప మట్లు, ప్రేయసిఁ
దా నయి పాయుటన్ గృహమునన్ విలపింపఁగలేదు, నేఁడు వీ
లైనది యూపి రాడ, నిపు డైన విలాపము లాభమే కదా!

—హా! కష్టము కష్టము.

హృదయము బీఁటవాఱును మ టెందుకు ముక్కలు కాదొ? మేను వె
ల్లదడు మూర్ఛఁ జెందు విడనాడదు తెల్వి నదేమొ? దేహమున్
బాదిగొని కాల్చు దుఃఖశిఖి బూడిదచేయ ద దేమొ? మర్మముల్
వదలక కోయునట్టివిధి ప్రాణము తీయ ద దేమిపాపమో?

ఓపౌరజానపదులారా మహాత్ములారా!

ఉ. జానకి యింట నుండుట యసమ్మత మయ్యెను మీకుఁ గ్యాన
గానఁ దృణంబువలెవిడిచితి మీ కవు డైన జాలి
తేనియుఁ బుట్టెనే? మది దహించెను నప్పటిభావముల్, గ
హీనుఁడ దిక్కు లేక యిపు డేడ్చెద మీర లనుగ్రహించి

తమ—(తనలో) కోపాతిశయమును వెల్లడించుట మిక్కిలి గంభీరముగా
వా—దేవా! గతించినదానికి విచార మేల? ధైర్యము తెచ్చుకొనుము.
రా—సఖీ! ధైర్య మని చెప్ప నేల?

గీ. జానకీశూన్య మైనట్టిజగతి కిపుడు
వఱలుచున్నది ద్వాదశవత్సరంబు,
ఆమెపేరును మాసిన ట్లయ్యెఁ గాని
బ్రతికియుండక పోలేదు రాఘవుండు.

సీ—ఆర్యపుత్రునియీమాటలు వినుటచే మూర్ఛ వచ్చుచున్నట్లున్నది.
తమ—అమ్మా! నీ వన్నమాట నిజము.

గీ. ప్రియము లనురాగసిక్తముల్ విరహదుఃఖ
కఠినములు నివ్వి మాటలు కావు సుమ్మ,
విమలమకరందధార లే విషముఁ గూడి
కురియుచున్నవి నీమీఁదఁ గోమలాంగి!

రా—వాసంతీ! ధైర్యము లే దేమి? చూడు—

గీ. కాల్చి గ్రుచ్చినశల్యంబుకరణి, విషము
పూసి నాటినదంతంబుపోల్కిఁ, దీవ్ర
మగుచు హృదయంబుమర్మముల్ తెగఁ బెఱికెడి
దుఃఖకీలంబు నోర్చుకొందును గదమ్మ!

సీ—నేను పట్టినిర్భాగ్యురాలను. ఎప్పటి కపుడే యార్యపుత్రున కాయాసము
చున్నాను.

రా—ఇట్లే శ్రమపడి నాహృదయము నెట్లో యణఁచుకొనుచున్నను. పరిచిత
చూచుటవలన నిపు డావేగము కలుగుచున్నది. ఎట్లనఁగా?—

సరగున హద్దు దాఁటి కలుషం బయి ఘూర్ణిలి పొంగి పొంగి పై
పొరలెడి దుఃఖ మాఁపుటకుఁ బూని యొనర్చెడియత్నమెల్ల స
త్వరగతిఁ ద్రొక్క వచ్చె నతిదారుణచిత్తవికార మొందు, భీ
కరముగఁ బొంగు నేఁ టిసుకకట్టను జీలిచి వచ్చుకైవడిన్.

—ఎంత యణఁచిపెట్టినను, ఆఁగక దారుణవేగముతోఁ బైకివచ్చుచున్న యార్యపుత్రునిమహాదుఃఖముచే ధిక్కరింపఁబడిననాదుఃఖము నాహృదయము బద్దలుచేయుచున్నది.

—(తనలో) కష్టము కష్టము. రాజు మిక్కిలి గాఢవిచారమున మునిఁగిపోవుచున్నాడు. ఇపు డితనిదృష్టి మరల్చుట యుచితము. (ప్రకాశముగా) దేవా! చిరపరిచితములైన యీజనస్థానభాగములను జూచి మన్నింపుము.

—సరే కానిమ్ము. (ఇద్దఱును లేచి పరిక్రమింతురు)

—ప్రియసఖి తలపెట్టిన వినోదనోపాయము దుఃఖము నింకను బ్రజ్వలింపఁజేయు ననియే తలఁచెదను.

—(సవిచారముగా) దేవా! మున్నొకనాఁడు—

ఈపొదరింట నుంటివి మహీసుత వచ్చెడిత్రోవ చూచు చీ
వాపెయు గౌతమీపులినమండలిహంసలఁ జూచి చూచి రా
నోపక వచ్చి కోపపడుచున్నటు లుండిననిన్నుఁ జూచి నీ
కోపము దీర్పఁగా జలజకోశసమాంజలి యెత్తి మ్రొక్కదే!

—వాసంతీ! ఎంత కఠినురాల వైతివే! హృదయమర్మంబుల నాటుకొనియున్న శల్యమును గదల్చునట్టి యీపూర్వవృత్తాంతములు తెల్పి దురదృష్టవంతురాల నైనన న్నే యార్యపుత్రుఁడు స్మరించునట్లు చేయుచున్నావా?

—చండీ జానకీ! ఇటు నటుఁ గనఁబడుచున్నావు కాని యనుగ్రహింపకున్నావు.

హా దేవీ! జగ మెల్ల శూన్య మగు, దేహాంగంబు లూటాడు, న
న్నావసం బెత్తి మహాంధకారమున మగ్నం బయ్యె జీవాత్మయున్,
ఛేదిల్లున్ హృదయంబు, మూర్ఛ యలమెన్, దీంద్రించె దుఃఖాగ్ని హా
హా! దీనుండను మందభాగ్యుఁడను జేయంజాల నే నేమియున్.

(అని మూర్ఛిల్లును)

—అయ్యయ్యో! ఆర్యపుత్రుఁడు మరల మూర్ఛిల్లె

వా—దేవా! ఊఱడిల్లు. ధైర్యము తెచ్చుకో.

సీ—హానాథా! పాపజన్మ మెత్తినవన్నుఁ గూర్చి సకలలోకశ్రేయస్కర
నీజన్మలాభము మఱిమఱియు జీవనసంశయంబు గలిగించుచారుణ
చున్నదిగదా! హా దైవమా! చచ్చిపోయినాను. (అని మూ

తమ—బిడ్డా! ఊఱడిల్లు. ధైర్యము నొందుము. మరల నీపాణిస్పర్శమే రా
సంజీవనోపాయము. లెమ్మి.

వా—హా! ఇప్పటికిని నిట్టూర్పు రాకున్నది. హాసీతా! ఎక్కడ నున్నా
నీప్రాణనాధుని బ్రతికింపుము.

సీ—(తొందరతో తెచివచ్చి రాముని హృదయమును లలాటమును స్పృశి

వా—అమ్మయ్యా! ఇప్పటికి రామభద్రునకుఁ దెలివి వచ్చినది.

రా—గీ. అంగముల నెల్ల నమృతంబు నలఁదినట్లు
బ్రతుకఁజేసి మహాద్భుతస్పర్శ మొకటి
విస్మయానందసంభవావేశ మైన
యన్యమోహంబు గలిగించునట్లు లుండె.

(ఆనందముతోఁ గన్నులు మూసికొని) సఖీ వాసంతీ! నీయదృష్టమ

వా—ఎందుచే?

రా—వేఱే యేమున్నది? జానకి వచ్చినది.

వా—ఏది? రామభద్రా! జానకి యెక్కడ?

రా—(స్పర్శసుఖ మభినయించి) చూడు మిదిగో! ఎదుట నే యున్నది.

వా—రామభద్రా! సఖీవిపత్తిచేఁ బుట్టినదుఃఖాగ్నియే నన్నుఁ గాల్చివేయు
నాయువుపట్లు పొడుచునట్టి దారుణమైన యీపలవరింతలచే నీవు
దహించెదవా?

సీ—దాఁటి పోవలె నని యనుకొనుచున్నాను గాని, నాదీర్ఘదారుణసం
జల్లార్చునట్టి చిరకాలస్నేహశీతలమైన యార్యపుత్రునిస్పర్శముచే
చేసినట్లుగా నాచేయి యంటుకొని కదలి యాడకున్నది.

రా—సఖీ! పలవరింత యెక్కడ?

చ పరిణయకాలమందు మును పట్టిన (1) కంకణధారి దే
కరకిరణాళిశీతలవికస్వరకాంతి ముదంబు గూర్చెనో.

---

(1) ఈ విశేషణములు రెండును సీతాహస్తమునకును రామునకున
ముగా నన్వయింపను.

సీ—నాఁడట్లు ముదంబు గూర్చినయార్య పుత్త్రుఁడవే యిప్పటినీవు.

రా—అరయఁగ సాటిదేనికి దదన్యకరం బగు, నట్టిజానకీ
సురుచిరహస్తపల్లవము చూడు నిజంబుగ నేను బట్టితిన్.
(అని సీతాహస్తమును గ్రహించును)

సీ—అయ్యో! ప్రియనాథుని దాఁకుటచే మోహపడి పొరపాటు చేసినాను.

రా—వాసంతీ! ప్రేయసీస్పర్శసంజనిత మైనభయముచే నానందమగ్న మై నాయొడలు పరవశ మగుచున్నది. ఈ చెయ్యి నీవు కూడఁ బట్టుకొనుము.

వా—అకటా! నిజముగా నిది యున్మాదమే.

సీ—(తత్తఱపడి చేయూడఁ దీసికొని వెళ్లును)

రా—అయ్యో ప్రమాదము! కరికరమునుండి కరిణీకరము జాఱినట్లుగాఁ బొరపాటుగా నున్న నాచేతినుండి యామెచేయి జాఱిపోయినది.

సీ—అబ్బా! దుఃఖభయములచే మిక్కిలి కలఁగిపోయిననాహృదయ మిప్పటికిని గుదుటఁబడకున్నది.

తమ—(సస్నేహ కౌతుకస్మితముగాఁ జూచి) అమ్మా సీతా!

గీ. మగనిఁ దాఁకినసుఖముచే గగురుపాటు
చెమట కంపంబు గదురు నీవిమల తనువు
గాలిఁ గదలుచు వానచుక్కలకుఁ దడిసి
మొగ్గ దొడిగినకడిమి సొంపును వహించె.

సీ—(తనలో) హృదయము పరవశ మగుటచేఁ గదా తమసాదేవిమాటలకు సిగ్గుపడవలసివచ్చినది! ఈ పరిత్యాగమును, ఈ యాసక్తినిగూర్చి యీమె యిపు డేమనుకొనుచున్నదో?

రా—(నలుదిక్కులు కలయఁజూచి) హా! లేదు. సీతలేదు. ఓనిర్దయురాలా సీతా!

సీ—నిజముగా నేను నిర్దయురాలనే. ఇట్టియవస్థలో నున్ననిన్నుఁ జూచుచు జీవించి యున్నాను.

రా—హా దేవీ! ఎక్కడున్నావు? అనుగ్రహింపుము. ఇట్టిదశలో నున్ననన్ను విడిచి వెళ్ళుట తగదు.

సీ—ఆర్యపుత్త్రా! నీమాట విపరీతముగా నున్నది.

వా—దేవా! విచారపడవద్దు. లోకోత్తర మైన ధైర్యముచే మహాదుఃఖమున మునిఁగిన నిన్ను నీవే లేవనెత్తుకొనుము. సీతా సీతా యనెదవు! సీతయిచ్చటి కెక్కడనుండివచ్చును!

రా—నిజముగా సీతలేను. ఉన్నయెడల వాసంతిచూడదా?—ఇది స్వప్నమా?—న్ను
నిద్రింపలేదే!—రామునికి నిద్రయెక్కడిది?— అన్నివిధముల మహాశ్రు
పన్నమై పలుమాఱు పలుతెఱంగుల సిద్ధమగుచున్న భ్రాంతియే నన్ను
డత్యంతమాశ్రయించుచున్నది.

సీ—క్రూరాత్మురాలనై యార్యపుత్రుని మోసపుచ్చినాను.

రా—దేవా! చూడు చూడు.

చ. ఇదె మునుపా జటాయువు మహిం బడగొట్టినపంక్తికంఠుదే
రదియె తదీయవాహనఖరాస్థిచయం, బిపిశాననుండు దు
ర్మనమునఁ గూల్చినట్టిఖగమాన్యుని ఱెక్కలగూళ్లు, విద్యు
న్నదఘనభంగిఁ బై కెగసె జానకితో సురవైరి యిచ్చటన్.

సీ—(భయముతో) ఆర్యపుత్రా! ఈ దురాత్ముఁడు పూజ్యుఁ డైనజటాయువు
జంపుచున్నాఁడు. నన్నపహరించుచున్నాఁడు. రక్షింపు రక్షింపు.

రా—(తొందరతో లేచి) ఓరిపాపీ! తాతప్రాణసీతాపహారీ! ఉండు ముందుకు

వా—దేవా సకలరాక్షసాంతకా! ఇప్పటికిని ఏవు కోపగింపఁదగిన విషయమున్నా

సీ—ఆహా! భ్రాంతిగదా!

రా—ఔను. తపఁబడుచున్నాను. ఇది మునుపటి యాపత్తు గాదు. క్రొత్తది, మఱియు
విధమైనది.

ఉ. వానరసేన గూర్చుకొని వారిధి దాఁటి విచిత్రమైనకా
ర్యాఁకు లోకమద్భుతము నందఁగ రావణుఁ గూల్చినాఁక
న్నైనవియోగ మోర్చుకొననయ్యె, ననంతము ఘోరమైనయీ
జానకివిప్రలంభ మిఁకఁ జచ్చెడిదాఁక సహింప నయ్యెడిన్.

సీ—పూర్వవిరహమున బహుమానభాజన నైతిని గాని, యిప్పటివిరహ మనంతము
టచే నిరాశురాల నైతిని. హా దేవా! దురదృష్టవంతురాలను. అయ్యో!

రా—హా! హా! కష్టము కష్టము! హా దేవీ!

ఉ. వానరరాజుమైత్రియును వానరశౌర్యము సప్రయోజనం,
బానలజాంబవంతులసహాయ మనర్థక, మాంజనేయున
ద్యానముపాళ్లు, లక్ష్మణునియస్త్రమహత్త్వ మసార్థకంబు, న
కానల నెక్క ... యు ... హా సతీమణీ!

సీ—పూర్వవిరహము నెంతయు గారవించుచుండెను.

రా—వాసంతీ! రామదర్శనము మిత్రజనమున కెంతయు దుఃఖదాయకమే యగును. ఎంతసేపు నిన్నేడిపింతును? కావున నే నిఁకఁ బోయెదను. సెలవిమ్ము.

సీ—(దుఃఖావేగముతో, తమసను గౌఁగిలించి) హా భగవతీ! ఆర్యపుత్రుఁ డరుగు చున్నాఁడు. ఏమి చేయుదును?

తమ—బిడ్డా! శాంతింపుము. విచారింపకుము. మనము కూడఁ జిరంజీవు లయిన కుశలవుల ద్వాదశవత్సర పూర్తిమహోత్సవ మొనరింప భాగీరథీదేవి దగ్గఱకుఁ బోవుదము.

సీ—అమ్మా! క్షమింపుము. దుర్లభదర్శనుఁ డైన ప్రాణనాథుని మఱొక్కనిమిష మైనఁ జూచెదను.

రా—అశ్వమేధ మొనరింప నా కిపుడు సహధర్మచారిణి కలదు సుమీ!

సీ—(సాక్షేపముగా) ఆర్యపుత్రకా! అది యెవతె?

వా—హా! పెండ్లి యాడితివా?

రా—లేదు. లేదు. బంగారుసీతాప్రతిమ—

సీ—(కన్నీరు విడిచి నిట్టూర్పుతో) ఇపుడు నీవు నిజముగా నార్యపుత్రుఁడవు. నామనస్సులోనివిరహదుఃఖశల్యము నిపుడు నిజముగా నూడఁదీసితివి.

రా—అశ్రుబిందువు లొలుకునాకన్ను లాబొమ్మను జూచియే తృప్తిపడును.

సీ—ఆప్రతిమయే ధన్యురాలు. ఆహా! ఆమెయార్యపుత్రుని సంతోషపెట్టుచున్నది. ఆర్యపుత్రుని గౌరవ మందుచున్నది. ప్రియనాథుని జీవితాశకు హేతు వైన యామెయే లోకమున కంతకును జీవితాశాబంధన మగుచున్నది.

తమ—(సమందహాసస్నేహబాష్పముగాఁ గౌఁగిలించి) బిడ్డా! నిన్ను నీవే పొగడు కొనుచున్నావు.

సీ—(సిగ్గుతోఁ దనలో) తమస పరిహాసము చేయుచున్నది.

వా—దేవా! నీకు మాయెడఁ గలయనుగ్రహమువలన నీసమావేశము తటస్థించినది. ఇదియే మాకు మహాప్రసాదము. ఇఁకఁ గార్యహాని కలుగకుండఁ బురమున కేగుటయే యుత్తమము.

రా—అట్లే చేసెదను.

సీ—వాసంతి నాకిపుడు ప్రతికూలురా లైనది.

తమ—అమ్మా! మనము పోవుదము రమ్ము.

సీ—అట్లే చేయుదము.

తమ—నీ వెట్లు రాఁగలవు?

సీ. అధికతరతృష్ణచే మనోహరునిమేన
గట్టిగా నాటుకొన్ననీగాఢదృష్టి
హృదయమర్మంబులను గత్తిరించుపూనిక
నూడఁదీయుచు నుంటి వో యుత్పలాక్షి!

సీ—పుణ్యాత్ములకు దర్శనీయము లైన యార్యపుత్రుని పాదపద్మములకు నమస్కారము. (అని మూర్ఛిల్లును)

తమ—అమ్మా! ధైర్య మవలంబింపుము. శాంతింపుము.

సీ—(ఊఱడిల్లి) మబ్బుచాటున నున్నపూర్ణచంద్రు నెంతసేపు చూడఁగలము! ఒక

తమ—ఆహా నిర్మాణపద్ధతి!

గీ. కరుణరస మొక్కటే వేఱుకారణముల
వేఱు వేఱు విధంబుల మాఱుచుండు
సలిల మొక్కటె బిందుతుషారభంగ
బుద్బుదావర్తరూపముల్ పొందునట్లు.

రా—విమానరాజమా! ఇట్టిటు—

(అందఱు లేచుచున్నారు)

వాసంతి—(రామునిగూర్చి)—తమస—(సీతనుగూర్చి)

గీ. వంశకర్తయు వేదప్రవక్త యైన
సూర్యుఁడు నరుంధతీవసిష్ఠులును మఱియు
వసుధ జాహ్నవి మానంటివారిఁ గలిసి
శ్రేయ మొనగూర్చి నిన్నురక్షింత్రు గాత.

(అందఱు నిష్క్రమింతురు) ఇది తృతీయాఙ్కము

———



# ఉత్తరరామచరిత్రనాటకము

## చతుర్థాఙ్కము.

(తరువాత నిద్దఱు మునిశిష్యులు ప్రవేశింతురు)

ఒకఁడు—సౌధాతకీ! ఇపు డీయతిథులు వచ్చుటచే మన వాల్మీకిమహర్షి గారియాశ్రమ మెంతరమణీయముగా నున్నదో చూడు.

చ. అలమఁగలేడి యిప్పు డిపు డక్కడ యీనినలేడి త్రాఁగఁగా
నిలిచినతీపి వేఁడి యగునివ్వరిగంజిని ద్రాగుచుండె, జి
హ్వాలఁ జవులూరఁ జేసెడిఘృతాన్నసుగంధము రేఁగుపండ్లతోఁ
గలిసినకూరవండుతఱిఁ గ్లైడికమ్మనితావి వచ్చెడిన్.

ా—దాండాయనా! అనధ్యాయకారణము లైన యీ తెల్లగడ్డాలకు స్వాగతము—

ాం—(నవ్వి). ఓరీ! పెద్దవాఁని జూచి సంతోషించుటకుఁ గ్రొత్తకారణము చక్కఁగాఁ గనిపెట్టినావురా!

ా—(నవ్వుచు) ఆఁడువాళ్ళను కట్టకట్టుకొని మోసికొనివచ్చిన ముసలితాతయ్యగా రెవరురా!

ాం—ఛీ పశువా! ఆపనికిమాలిన నవ్వేమిటి? ఆయన నెవ రనుకొన్నావు? వసిష్ఠమహాముని గారు, ఋశ్యశృంగాశ్రమమునుండి వచ్చుచున్నారు. ఆయన వెనుకవచ్చినవారిలో మొదటియామె వసిష్ఠులవారిభార్య అరుంధతీదేవిగారు, ఆమెతో నున్నవారు దశరథమహారాజుగారిభార్యలు కౌసల్యా కైకేయీ సుమిత్రలు. తెలియకుండఁగాఁ బ్రేలుచున్నావు సుమీ!

—ఓఁ. వసిష్ఠులవారా?

ం—అవును.

—అలాగా? ఏదో పెద్దపులి యనుకొన్నాను.

ం—అఁ. ఏ మన్నావు? ఎందు కట్లు తోఁచినది?

సౌ—పాపము! ఆయన రాఁగానే పుల్లావుపెయ్యను బలాత్కారముగా
మనిపించినారు.

దాం—"సమాంసో మధుపర్క" యన్నధర్మశాస్త్రమునుబట్టి గృహమేధు
యిండ్లకు వచ్చిన శ్రోత్రియు లైనయభ్యాగతుల కావుపెయ్యనో
బలిసినయెద్దుమాంసమునో వండి పెట్టుట యాచారము. అది యు
మని సూత్రకారులు చెప్పుచున్నారు.

సౌ—మటి దొరకినావురా!

దాం—ఎట్లు?

సౌ—వసిష్ఠులవారు వచ్చుటకుఁ గొంచెము ముందుగా వచ్చిన రాజర్షి
నకు మనగురువుగారు తేనెపెరుగులు కలిసినమధుపర్కముమాత్రమే
నారు. ఆవుపెయ్యను ముట్టుకోలేదు.

దాం—మాంసాహారము విడిచినవారి కీకల్ప ముచిత మని కొంద ఱన్న
మహర్షి మాంసపరిత్యాగి.

సౌ—ఎందుచే?

దాం—అతఁడు సీతాదేవికి సంభవించినఘోర మైనయాపత్తు విని
చంద్రద్వీపతపోవనములోఁ దపస్సుచేయుచు నిన్నేళ్లె పెక్కేండ్లు

సౌ—అందుండి యిచ్చటి కెందుకు వచ్చెను?

దాం—చిరకాలప్రియమిత్రు లైనవాల్మీకిమహర్షి గారిని జూచుటకు—

సౌ—ఇపు డితనివిష్యపురాంౘడు, ఇతనిని జూచినారో లేదో తెలిసిన

దాం—"నీవు స్వయముగా వచ్చి జనకమహర్షి ని జూచి యాదరింప
కౌసల్యతోఁ జెప్పుటకు వసిష్ఠులవా రిపుడే యరుంధతీదేవిని

సౌ—ఈ ముసలివా రందఱు కలిసినట్లుగా, మనము గూడఁ దక్కిన
లతోఁ గలిసి యనధ్యాయమహోత్సవము నాటలతో
. కాని యిపుడు జనకుఁ డెక్కడ నున్నాఁడు?

దాం—వాల్మీకివసిష్ఠులను సేవించివచ్చి యాశ్రమము వెలుపల నున్న
గూర్చున్నాఁడు.

క. చిరముగ మది నాటినకూఁ
తురివిరహముచే జనించుదుఃఖాగ్నిని గో
టరగతవహ్నిఁ బురాతన
ధరణీజమువోల్కి నతఁడు తపియింపఁబడున్.

(అని నిష్క్రమించుచు) షడ్మిశ్రవిష్కంభము.

(పిదప జనకమహర్షి ప్రవేశించును)

జ—చ. తనయకు వచ్చినట్టియతిదారుణ పాపవిపత్తి విన్ననా
మనమును బుందుచేసినయమర్షవిషాదమునన్ జనించి నూ
తనగతి నేఁటికిన్ సునిశితం బగుకోపము వాఁడిఱింపవ
ట్లనయము కోయుచున్నది హృదంతరసీమలు తగ్గదింతయున్.

ఈచెప్ప నలవికాని దుఃఖమును వార్ధకమును దిగఁదీయుచున్నను, కష్టసాధ్యములైన కృచ్ఛ్రచాంద్రయణాది వ్రతము లాచరించి శరీరధాతువు లెండించుకొన్న నాపాడుదేహము నిరాలంబ మయ్యు నిప్పటికిని నశింపకున్నది గదా! పోని! చచ్చిపోదమన్న నాత్మహత్య చేసికొన్నవా రంధతామిస్రము లయినయసూర్యనామ నరకలోకములకుఁ బోవుదురని ధర్మశాస్త్ర వేత్త లయినమునీశ్వరు లిట్లుచెప్పుచున్నారు.

„అసూర్యా నామ తే లోకా అంధేన తమసా వృతాః
యాం స్తే ప్రే త్యాభిగచ్ఛంతి యే కే చాత్మహనో జనాః”

ఇప్పటి కనేకసంవత్సరములు గడచినను, నిరంతరచింతచే నెప్పటి కప్పుడే నవీన మగుచు నాదుఃఖావేగము శాంతింపకున్నది. ఓతల్లీ దేవయజనసంభవా సీతా! నీజన్మఫల మిట్లున్నది. సిగ్గుచే యథేచ్ఛముగా నేడ్చుటకుఁ గూడ వీలు గాకున్నది. హాకుమారీ!

చ. కలకలనవ్వు చొక్కపరి, కావున నేడ్చుచు నొక్కసారి, యిం
పులు దులకించు కొన్నిపలుమొగ్గలకాంతులు పర్వ ముద్దుగన్
దెలియనిపల్కులన్ బలుక నేర్చిననీపసిపిన్ననాఁటికో
మలవదనారవింద మిదె మానసదర్పణగోచరం బగున్.

భగవతీ వసుమతీ! నీవు నిజముగాఁ గఠినురాలవే.

చ. ఎఱుఁగుదు రగ్ని జాహ్నవి మునీంద్రు లరుంధతియున్ వసిష్ఠభా
స్కరులును జానకీమహిమ, కాంచితి వామెను వాణి విద్యన
ట్లెఱుఁగవె నీవు! పావకపరీక్ష జగద్విదితంబు గాదె! కూఁ
తురు వడినట్టిదుఃఖ మపదూఱును నీ వెటు లోర్చినావొకో!

(తెరలో) తల్లులారా! ఇటు రండు.

జన—కంచుకివలన దాని తెలిసికొని వచ్చుచున్న యీామె యరుంధతీదేవి. ఈరండవ

మహాదేవియో—(పరీక్షించిచూచి) హా! ఈమె దశరథమహారాజున కిల్లాలైనకౌసల్య. నాప్రియసోదరి. అకటా! ఈమె యామె యని యెవరు గుర్తింపవాలుపట్టఁగలఁడు!

ఉ. ఈమె వసించె ముందశరథేశ్వరునింటను లక్ష్మిసాటిగా
సామెత యేల! లక్ష్మియె నిజంబుగ, హావిధి! రాణి ఘోర
తామయమూర్తియై యిటులు దైవవశంబున మాఱిపోవు
హా! మహనీయదైవగతిఁ బ్రాణియవస్థలు మాఱకుండునే!

గీ. తొల్లి నాకన్నుఁగవ కీమె తోఁచుచుండెఁ
దనువు దాల్చినయామహోత్సవ మనంగ
నీమెదర్శన మిపుడు సహింపరాక
పుండుపై నుప్పు చల్లినట్లుండె నకట!

(పిదప నరుంధతి కౌసల్య కంచుకి ప్రవేశింతురు)

అరు—స్వయముగా వెళ్ళి వియ్యంకుని బలుకరింపవలె నని మీగురువుగారు అందుకేకదా నీవద్దకు నేను వచ్చినాను! అట్టియెడ మాటిమాటికి నీ మెందుకు?

కంచు—అమ్మా! మనస్సు గట్టిచేసికొని వసిష్ఠులవారిసెలవుప్రకారము చేయ దని నామనవి—.

కౌస—ఇట్టిసమయములో జనకచక్రవర్తిని జూడవలసి వచ్చినదిగదా యని రా లన్నియు నొక్కమాఱుగాఁ బైకివచ్చుచున్నవి. అందుచే జాఱిపోయిన బంధము గలనాహృదయ మాఁపుకొనఁ జాలకున్నాను.

అరు—ఈవిషయమున సందేహ మేమి?

గీ. ముఖ్యబంధువియోగసంభూత మైన
నరులదుఃఖంబు లెప్పుడుఁ దాఁగుచున్నఁ
బ్రాణమిత్రుండు కనఁబడినప్పు డవ్వి
హెచ్చి వేవాఁగులన్ బ్రవహించుఁ గాదె?

కౌస—అడవిపాలయిన యనుఁగుకోడలి తండ్రికి రాజర్షి యైన జనకునకు నా మొగ్గము నెట్లు కనఁబఱుతును?

అరు-క. ఘనయాజ్ఞవల్క్యముని యె
వ్వని కుపదేశించె బ్రిహ్మపారాయణ మా
జనకకులోద్భవుఁ డగునీ
జనకుఁడు మీాపొగడఁదగిన సంబంధి యగున్.

కౌస—ఆమహారాజు నకుఁ బ్రాణమిత్రుఁడును, కోడలికిఁ దండ్రియు నైన సీరధ్వజుఁ డితఁడే. హా! నిర్విచారము లైనయారోజు లిపుడు తలఁపునకు వచ్చుచున్నవి. హా దేవా! ఇ దంతయు శూన్యము.

జన—భగవతీ! అరుంధతీ! సీరధ్వజుఁడు నమస్కరించు చున్నాఁడు.

చ. గురువులకున్ గురుండు నతిఘోరతపోనిధి నీదుభర్త నీ
పరిచితిఁ బావనుండ నని భావనచేయు, జగత్త్రియంబు భా
స్వరముగఁ జేయునాయుదయసంధ్యను బోలినతల్లి! నీకు నే
శిరమును నేల మోపి యిరుచేతులు మోడ్చి నమస్కరించెదన్.

అరు—అక్షరం బగుజ్యోతిస్సు వెలయుఁగాక. సృష్టిస్థితికారణుండై యంతటఁ బ్రకాశించురజఃపరుఁ డగుపరమాత్ముఁడు నిన్నుఁ బవిత్రుని జేయుఁగాక.

జన—ఆర్యగృష్టీ! ఈప్రజాపరిపాలకులతల్లిగారి కారోగ్యమా?

కంచు—(తనలో) ఇది మాకుసంపూర్ణ మైనగట్టి దూషణము. (ప్రకా) రాజర్షివర్యా! ఎంతకాలముక్రిందటనో రామభద్రుని జూచి యిట్లుదుఃఖించుచున్నయీాదేవి నిట్టికోపముచే మఱింతదుఃఖపెట్టుట యుక్తము కాదు. పౌరజానపదులలో నతినింద్య మైనకింవదంతి వ్యాపించుటచేతను నీచమతులగువా రగ్నిశుద్ధిని విశ్వసింపకపోవుటచేతను రామభద్రుఁ డిట్లు దుర్యోగముపాలై దారుణకర్మ మొనరించెనుగాని తెలుకాను.

జన—(రోషముతో) మావంశములోఁ బుట్టినపరిశుద్ధురాలయినసీత కగ్నిశుద్ధి యనఁగా నేమి? అకటా! రామభద్రుఁడు చెసినయవమానమునకుఁ దోడై యీాలోకుల మాటలు మఱిమఱియు మా కవమానము గలిగించుచున్నవి.

అరు—(నిశ్వసించి) అవును నిజమే. 'అగ్ని' యనెడి యక్షరములు 'సీత' యనునక్షరములదగ్గఱ మిక్కిలి తేలికవి. సీత యనుటయే యన్నివిధములఁ బరిపూర్ణమైనది. హా వత్సా సీతా!

ఉ. బాలిక శిష్యురా లనెడిభావన కేమి? పవిత్ర మైననీ
శీలము నాకు నీయెడ విశేషవుభక్తిని గూర్చెఁ, గాంతవు
బాలిక వయ్యు నీ వఖిలవంద్యవు గావె? గుణాఢ్యులందు
చ్ఛీలమువంద్య,మట్లుపయిచిన్నెలుప్రాయముఁగావొకప్పు

కౌస—అయ్యో ! దుఃఖములు నాప్రాణము మొదలూడఁదీయుచున్నవి.

(మూర్ఛిల్లును)

జన—అయ్యో ఏమిది ?

అరు—రాజర్షీ ! వేఁటేమున్నది ?

ఉ. ఆనరపాలుఁడాదినములాసుఖమాపసిపిల్ల లంతయున్
ధ్యానపథంబుఁ జొచ్చెఁ బరమాప్తుని నిన్నిటఁ జూచినం
దాన భయంకరం బయినదైవికదుర్దశ ముగ్గి మూర్ఛిలెన్
గానఁగఁ బువ్వుకంటెఁ గులకాంతలచిత్తము మెత్తనౌ

జన—అకటా! చాలాకాలమునకుఁ గనఁబడిన నాప్రియస్నేహితుని ప్రియసఖి
కౌసల్యను శత్రువువలెఁ జూచి యన్నివిధముల ఘాతుకుఁడ నైతిని.

మ. అతఁడే నాప్రియమిత్రుఁ డుత్తముఁడు వియ్యంకుండు చిత్తో
చితసాఫల్యము మోద మీమొదలు భావింపంగ జీవంబు
యితరంబేది ప్రియంబదే యతఁడు,భూమీంద్రుండు రా
హితుఁడాపంక్తిరథుండు పుణ్యనిధి నా కేమేమి కాఁడెన్న

అకటా ! ఈమెయే యాకౌసల్య—ఆహా ! కౌసల్యాదశరథులు—

చ. ఇరువురు వేఱువేఱ వచియించుచు నాకు రహస్యభావ
కరిపయి నేర మొక్క రధికంబుగ మోపెడివేళ వార
ర్వారమది తేలుటో యలుక పూనుటయో యది నాయ
పగా, నిఁ కేల హా! కడుపుభగ్గున మండెను దానిఁ దల్చి

అరు—కటకటా ? చాలాసేపటినుండి నిశ్వాసము నిలిచిపోవుటచే నీమెను
మాడకున్నది.

జన—హా ప్రియసఖా! (కమండలూదకము చల్లును)

కంచు— మొదట దైవంబు మిత్రునిపోల్కి నొక్క
కరణి సుఖ మిచ్చు ననుకూలగతిని జూపి,
యనమయంబున దారుణమగు మఁ బిదప
వెనుకకును మళ్ళి హృదయపీడన మొసర్చు.

కౌ—(నిట్టూర్పు విడిచి) హా వత్సా జానకీ! ఎం దున్నావు? అమ్మా! క్రొత్త పెండ్లికూఁతుర వైననాఁటిలక్ష్మీప్రద మైననీముఖపద్మమును దలఁచుచున్నాను. ఓ శరచ్చంద్రచంద్రికాసుందరాంగీ! రమ్ము. మరల నా తొడమీఁదఁ గూర్చుండుము. ,,జానకి రఘువంశమహత్తరులకుఁ గోడలు కాని మనకుఁ గూఁతురే'' యని మీమామగారు సర్వదా యనుచుండెడివారు

కంచు—ఔను. దేవి సెల విచ్చినమాట నిజము.

గీ ఐదుగురిఁ గన్నవాఁడైన నావిభునకు
రామభద్రునిమీఁదనే ప్రేమ మెండు
మఱియు నలుగురు కోడళ్ళమాట చూడ
జనకసుతమీఁదఁ బ్రేమ మాయనకు మెండు.

జన—హా ప్రియసఖా! దశరథమహారాజా! అన్నివిధముల నామనస్సున కెక్కినట్టి నిన్నెట్లు మఱవఁగలను?

ఉ. కన్నియతల్లిదండ్రు లధికంబుగ నల్లునిమాప్తబంధులన్
మన్ననచేయుచుందు, రది మాయెడనో విపరీత మయ్యె నీ
మన్నన, నట్టినిన్ను మనమైత్రికిఁ గారణ మైనసీతఁ దా
నెన్ని హరించెఁ గాల మిసి యీబ్రతు కేటికి ఘోరభూమిలో!

కౌస—జానకీ! ఏమి చేయుదును? వజ్రలేపమున బిగిసినట్లుగా, నిర్భాగ్యురాల నైన నాపాడుజీవనము నన్ను విడువకున్నది.

అరు—రాణీ! ఊరడిల్లుము. అదే పనిగాఁ గంట నీరు పెట్టుకొనకు. అది గాక ఋశ్యశృంగాశ్రమమున మీగురువుగారు చెప్పినమాట మఱచినావా యేమి! ,,తప్పనిసరి యగుటచే నిది యిప్పటి కిట్లు జరిగినది కాని తుదకు శుభప్రదము కాఁగల''దని వారు సెలవిచ్చియుండలేదా?

కౌస—అన్నికోరిక లడుగంటిన నా కట్టియదృష్టము పట్టునా?

అరు—అట్లయిన, రాణీ! మీగురువులమాట యసత్య మనుకొనుచున్నావా?

అట్లాలోచింపఁగూడదు సుమీ !

గీ. ఆత్మవిజ్ఞాను లైనబ్రాహ్మణులమాట
సత్యమే యని నమ్ము సంశయము వలదు
వారిపలుకుల నివసించు భద్రలక్ష్మి
వారు పలుక రనర్థంపువాక్కు లెపుడు.

(తెరలోఁ గలకలము—అందఱు విందురు)

జన— నేఁడు శిష్టానధ్యయన మగుటచే ననర్గళముగా నాడుకొనుచున్నబ్రహ్మచా
కలకల మిది;

కౌస—చిన్నతనము సౌఖ్యదాయకము గదా! (చూచి) ఆహా ! ఆబాలురమ
జక్కని కోమలాంగములతోఁ గనవచ్చుచున్న యాపిల్లవాఁడు మా
చంద్రుఁడు చిన్నప్పు డున్నట్లుండి నాకన్నులకానందము గ
చున్నాఁడు. అతఁ డెవరిపిల్లవాఁడో !

అరు—(తనలో సంతోషముతో) భాగీరథి చెప్పినరహస్యకర్ణామృత మిదే
చిరంజీవు లైనకుశలవులలో నితఁ డెవఁడో తెలియకున్నది. (ప్రకా-)

చ. కువలయనీలమూర్తిఁ జెలుకూఁకటి నొప్పుచుఁ జిన్ననాఁటి
ఘువుఁ డీవు డిందు నుట్టిపడుకై వడిఁ, దాపసపుత్రపంక్తికి
బ్రవిమలభూషణం బగుచు భవ్యతనూమృదుకాంతి, నాడు
న్గవకమృతాంజనంబయి సుఖంబొనగూర్పు నితం డెవఁడో

కంచు—నిశ్చయముగా నీబాలుఁడు క్షత్రియబ్రహ్మచారి యని తలఁచెదను.

జన—సత్యము సత్యము. నీమన?—ఇతఁడు—

చ. కలిసినకంకపత్రములఁ గ్రాలెడియమ్ముల నింపుతూణముల్
పొలుపుగఁ దాల్చెఁ బ్రక్కలను, బోరఁ ధరించె విభూతిరేఖల
జెలు వగుతోలు జందెమును, జేతులఁ గార్ముక మక్షమాల
ప్పలితరుదండ మూనె, మొలబట్టకుఁ జుట్టి బిగించెనారియ
భగవతీ! అరుంధతీ! ఈపిల్లవాఁ డెక్కడనుండి వచ్చినాఁ డని నీ వనే
చున్నావు?

అరు— మేమును, ఇపుడే వచ్చినాము.

జన—ఆర్యగృష్టీ! కుతూహలము హెచ్చుగా నున్నది. నీవు వెళ్ళి వాల్మీకిమహ

నడిగి రమ్ము. ఇదిగో! మఱి యొకమాట. ,,ఎవరో పెద్దలు నిన్నుఁ జూడఁ గోరుచున్నా,, రని యాపిల్లవానితోఁ గూడఁ జెప్పి పొమ్ము.

కంచు—చిత్తము చిత్తము (నిష్క్రమించును)

కౌస—మీ రేమనుకొనుచున్నారు? మనకోరిక విని యాచిన్నవాఁడు వచ్చునా రాఁడా?

జన—ఇట్టిలోకోత్తర మైనయాకారమునకు సౌశీల్యము వే ఱగునా?

కౌస—కంచుకి చెప్పినమాట నణఁకువతో విని తన తోడిబాలురను విడిచి యాకుమారుఁ డిటు వచ్చుచున్నాఁడు.

జన—(చాలాసేపు చూచి) ఆహా! ఏమిది?

చ. వినయముచేతఁ జల్లనయి పిన్నతనంబున మెత్తమెత్తనై
కనుఁగొన సూక్ష్మబుద్ధులకుఁ గాక తదన్యుల కప్రమేయమై
యనువగునీకుమారుమహిమాతిశయంబు విమూఢ మైననా
మనమును నూదిరాయినుముమాడ్కి బలంబునలాగుచుండెడిన్.

లవుఁడు—(ప్రవేశించి) ఎవరు పెద్దలో, ఎవరు చిన్నలో, క్రమము తెలియకుండఁగా నీపూజ్యుల కెట్లు నమస్కరింతును? (ఆలోచించి) కానిమ్ము. ఇది విరుద్ధము గానిపద్ధతి యని పెద్దలందురు. (సమీపించి) మీయందఱికిదే లవునినమస్కారపరంపర.

అరు—జన—దీర్ఘాయుష్యుఁడవు కమ్ము

కౌస—నాయనా! చిరంజీవివి కమ్ము.

అరు—రా నాయనా! (అని యొడిలో లవుని గూర్చుండఁబెట్టుకొని) నాయదృష్టముచే నాయొడియే కాదు నాకోరికయు నిండినది.

కౌస—నాయనా! ఇటు కూడ రమ్ము. (అనియొడిలోనికిఁ దీసికొని) ఆహా! వికసించుచున్ననల్లకలువను బోలుశరీరచ్ఛాయచేతనే కాదు, పద్మకేసరములు తినుటచేఁ గషాయవర్ణ మగుకంఠము గలిగినరాయంచకూఁతవలె ఖంగుమని మ్రోఁగు కంఠస్వరముచేఁ గూడ రామభద్రు ననుసరించుచున్నాఁడు. లేఁతతామరఱేకువలె మెత్తనగుశరీరస్పర్శము నట్టిదే. తండ్రీ! నీమొగము చూడ నిమ్ము (గడ్డమెత్తి పట్టుకొని చూచి సాశ్రుప్రాయముగాఁ గన్నీటితో) రాజర్షీ! చక్కఁగాఁ బరిశీలింపఁగా, నితనిమొగము సరిగాఁ గోడలిముఖచంద్రబింబమును బోలియున్నది చూడలేదా?

జన—అమ్మా! చూచుచున్నాను. తల్లీ! చూచుచున్నాను.

కౌస—అకటా? వెఱ్ఱి యెత్తినట్లు నాహృదయము పరిపరివిధములఁ బరితపించు.

జ—

మ. అనుఁగుంగూఁతురిచాయ రామురుచి తా నచ్చొత్తినట్లు
తనియం దీముఖకాంతి యీయొడలిసౌందర్యంబు నీవాణి
వినయం బీయనుభావ మయ్యవియ హా విశ్వంభరానంద
తనయా! నాహృదయంబు చంచలగతిన్ ధావించు వేదా

కౌస—అబ్బాయీ! నీకుఁ దల్లియున్నదా? ఆమెను దలఁచుచుందువా!

లవు—లేదు లేదు.

కౌస—అట్లయిన నీ వెవరిపిల్లవాఁడవు?

లవు—సుప్రసిద్ధు లయినవాల్మీకిమహర్షిగారిపిల్లవాఁడను

కౌస—నాయనా! చెప్పఁదగిన దేమైనఁ జెప్పుము.

లవు—నే నింతే యెఱుఁగుదును

(తెరలో) ఓసైనికులారా! కుమార చంద్రకేతు వాజ్ఞాపించుచున్నా
రెవ్వరును, ఆశ్రమసమీపప్రదేశములను ద్రొక్కఁగూడదు.''

అరు—జన—యాగీయాశ్వప్రసంగమున వచ్చినచంద్రకేతువును జూచుట
నది, నేఁడు సుదినము.

కౌస—చిన్నిలక్ష్మణునికొడు కాజ్ఞాపించుచున్నాఁ డనునక్షరము లమృత
రములై వినఁబడుచున్నవి.

లవు—ఆర్యా! చంద్రకేతు వెవరు?

జన—దశరథపుత్రు లయినరామలక్ష్మణుల నెఱుఁగుదువా?

లవు—రామాయణకథాపురుషులు వీరే కదా!

జన—అవును.

లవు—అట్లయిన నెందు కెఱుఁగను?

జన—ఈచంద్రకేతు వాలక్ష్మణునికొడుకు.

లవు—అట్లయిన నూర్మిళాపుత్రుఁ డగుటచే మైథిలుఁ డైనరాజర్షికి

అరు—బాలుఁడు కథాపాండిత్యమును బ్రకటించెను.

జన—(ఆలోచించి) నీ వీకథ చక్కఁగా నెఱుఁగుదు వేని చెప్పుము
ఆదశరథుని భార్యలలో నెవరెవరి కెందఱెందఱు పుత్రు
పుట్టిరి?

లవు—[illegible]

జన—కవిగా రీభాగమును రచియింపలేదా?

లవు—రచియించిరి కాని మాకు వినిపింపలేదు. మాచే జదివింపలేదు. మఱియు వారు రామాయణములోని యొకచిన్న భాగమును జక్కని దృశ్యకావ్యముగా రచించి, తమచేతితో వ్రాసినయాపత్రిబంధమును తౌర్యత్రిక సూత్రధారుఁడైన భరతునికిఁ బంపిరి.

జన—ఎందుకు?

లవు—అతఁ డప్సరసలచే దాని నభినయింపఁజేయు నని—

జన—మా కిదంతయు గూఢార్థముగా నున్నది.

లవు—ఈవిషయమున వాల్మీకులవారి కాసక్తి యొక్కఁడు. ఏమనఁగా!—కొందఱు శిష్యులచేతి కాపుస్తక మిచ్చి భరతాశ్రమమునకుఁ బంపుచు వారితోఁగూడ ధనుష్పాణి యగు మాభ్రాతను బ్రమాదములను దొలఁగించుటకుఁ బంపినారు.

కౌస—నీకు భ్రాత యొకఁడున్నాఁడా?

లవు—కుశుఁడను పేరుగలయార్యుఁ డున్నాఁడు

కౌస—నీమాటనుబట్టి యతఁడు నీకంటెఁ బెద్దవాఁ డని తెలియుచున్నది.

లవు—అవును. ప్రసవానుక్రమమున నతఁడు పెద్దవాఁడే.

జన—మీరు కవలపిల్లలా యేమి?

లవు—అవును.

జన—కుమారా! మీగురువుగా రీకథాప్రపంచ మెంతవఱకుఁ బ్రకటించినారో చెప్పుము.

లవు—,,అసత్యమైనలోకాపవాదమునుబట్టి తొందరపడిన శ్రీరాములవారియాజ్ఞచే నొక్క తెయు నాసన్న ప్రసనవేదనయు నైన సీతాదేవిని మహారణ్యమున విడిచిపెట్టి లక్ష్మణుఁడు వెళ్ళె,, నన్నంతవఱకును.

కౌస—హా! చంద్రసుందరముఖీ సీతా! ఒంటికత్తె వైన నీకుసుమ కోమలశరీరమున కాకస్మికమైన దైవదుర్యోగమున నేమి గతి పట్టినదో కదా!

జన—హాకుమారీ! పతివ్రతాశిరోమణీ!

చ. అనుచితనింద భర్త విడనాడినయట్టిపరాభవంబు కా
ననగతి కాన్పువేదన యనన్యసహాయత దుఃఖవార్ధి ముం
చినతఱి దుష్టజంతువులు చేరినయప్పుడు భీతి చెంది, నా
యన!యని యెన్ని సార్లు హృదయంబుననన్నుఁదలంచితో కదా!

లవు— ఆర్యురాలా! వీ రెవరు?

అరు— ఈమె కౌసల్య, ఇతఁడు జనకమహారా

లవు—(సభహుమాన ఖేదకౌతుకముగాఁ జూచును)

జన—అహాహా! దురాత్ము లగు పౌరుల నిర్దయత్వము; అహో రా జయినక్రియా శీఘ్రకారిత్వము?

చ ఘనతరదుఃఖవజ్రపటుఘాతము గాంచిననాఁడు కోపమున్
గనలఁగఁ జేయు కాలమిది కార్ముకమెత్తియొ శాపమిచ్చెద

కౌస—(భయముతో) భగవతీ! కాపాడుము. కోపగించు రాజర్షిని ప్రస న్నుఁ జేయుము.

లవు—

గీ అతిపరాభూతు లైనమహోహృదయుల
కోప ముడిగింప బ్రతిమాలుకొనుట మందు.

అరు—

రామభద్రుండు నీబిడ్డ రాజమౌని!
పాలనీయులు దీను లాపౌరజనులు.

జ—

వినుత సతీ శిశు స్థవిర విప్ర వికీర్ణము పౌరలోక మా
యనఘుఁడు రాఘవుండునను దాత్మజభాండము శాంతినొందెఁ
నేఁటితోఁ గోపము విడిచితిని విడిచితిని.

వటువులు—(తొందరగాఁ బ్రవేశించి) కుమార! కుమారా!
'అశ్వోఽశ్వ' యని జనపదముల వినవచ్చు జంతువిశేష మిపుడు మాకుఁ ప్రత్య క్షముగాఁ గనఁబడినది.

లవు—'అశ్వోఽశ్వ' యని పశుసమామ్నాయమందును యుద్ధకాండమందును గూడఁ బఠింపఁబడును. మీరు చూచిన దెట్టిదో చెప్పుడు.

వటు—అట్లయిన వినుము.

చ. వెడఁదగు తోఁక వెన్కఁ గనిపించు, నజస్రము దాని వీచుచుఁ
చెడుఁ, బొడు గౌను దానిమెడ, డెక్కలు నాలుగె, లేఁతపచ్చి
మడులను మేయు, వేసెడును మామిఁడికాయలమాడ్కి లద్దిఁ
ప్పెడి దిఁక నేమి? దూరముగ వెళ్ళును బోదము రమ్ము రమ్మిఁ

(అని లవుని చేయి విల్లు చేతులు పట్టుకొని లాగుదురు)

లవు—(కౌతుకబలాత్కారవినయములను సూచించుచు) అయ్యలారా! చూడండి. వీరు నన్ను లాగుకొని పోవుచున్నారు (అని వేగముగా వెళ్లెను.)

అరు—జన—పిల్లవానికిఁ గుతూహలము హెచ్చుగా నున్నది. వెళ్ళనీ!

కాస—మీ రడవిపిల్లవాండ్రరూపములకును మాటలకును సంతోషించినారు. నేను లవుని జూచుచునే మోసపోయితి ననుకొనుచున్నాను. కావునఁ గొంచె మటు వెళ్లి యుత్సాహముతోఁ బరుగెత్తుచాలుని జూతము రండు. వానిని జూడకుండ నుండలేను.

అరు—ఆచపలుఁ డతివేగముతో బహుదూరము వెళ్ళెను. ఇం కెట్లు కనఁబడును?

కంచుకి—(ప్రవేశించి, "సమయము వచ్చినపు డిది మీకుఁ దెలియు"నని వాల్మీకి మహర్షి గారు సెల విచ్చినారు.

జన—ఇదేదో యతిగంభీరముగా నున్నది. మనమే వెళ్ళి ప్రాచేతసమహర్షిని జూతము రండు. (నిష్క్రమింతురు.)

వటులు—(ప్రవేశించి) కుమారా! ఈయాశ్చర్యము చూడు.

లవు—చూచితిని గ్రహించితిని. ఇది నిజముగా నశ్వమేధసంబంధమైన గుఱ్ఱము.

వటు—ఎట్లు తెలిసినది?

లవు—ఓరిమూఢులారా! ఆభాగము మీరు కూడఁ జదివినారే. కనఁబడదా యేమి! ఒక్కొక్కనందమందిచొప్పున దండధారులు కవచధారులు నిషంగధారులు రక్షకులుగా నున్నారు. మఱియొకవిషయమునఁ గూడ నిట్టిసైన్యమే యుండ వచ్చునని మీకు సంశయము గలిగనేని పోయి వాండ్రనే యడుగుఁడు.

వటు—సేనారక్షితమై యీతురగ మెందు కిట్లు తిరుగుచున్నది?

లవు—(కోరికతోఁ దనలో) అశ్వమేధయాగము, విశ్వమంతయు జయింపఁగోరు క్షత్రియులకు బలిష్ఠమును సకలరాజతిరస్కారకారియు నైన గొప్పసాన రాయి.

(తెరలో)

గీ. ఈతురంగంబు సప్తలోకైకవీరుఁ
డయినదశకంఠశత్రునిజయశఃపతాక,
కానిచో నెల్లరాజలోకంబునకును
వీరఘోషణ యగు నిదే వినుఁడు వినుఁడు.

లవు—(గర్వముతో) ఆహా! ఈ యక్షరములు క్రోధజనకము లగుచున్నవి గదా!

వటు—ఎందు కీమాటలు? ఈకుమారుఁడు ప్రాజ్ఞుఁడు గదా!

లవు—ఎందు కీకేకలు? భూతల మరాజకమా యేమి? (తెరలో) ఓరిచపల!

మహారాజున కెదురు రాజు లెక్కడ?

లవు—చీ మూర్ఖులారా!

గీ. ఉర్విలో నట్టిరాజన్యు లుండ నిందు

కాక యుండక పోనిందు-కాని యిప్పు

డీబిభీషిక యేమి?-పోనిందు మాట

లేల? యిప్పుడు హరియింతు నీపతాక.

వటులారా! ఈగుఱ్ఱమును పట్టియుండఁలు ఱువ్వి కొట్టి మళ్లించి మన
మృగములమందలోనికిఁ దోలుకొనిపొండు.

పురుషుఁడు—(ప్రవేశించి) చీ చపలా ! ఏమన్నావు? ఈసైనికపంక్తులు సా
ములు కావు. మిక్కిలి చులుకనైనవి. కుఱ్ఱవాఁడన్నను గర్వోక్తిని సహిం
పైగా, రాజపుత్రుఁడైనచంద్రకేతువు దుర్దాంతుఁడు. అతఁడును ద
రణ్యసందర్శనమున నత్యాసక్తహృదయుఁడై యిప్పటికిని రాకుండె
నీదుర్గమతరుగహనముఁ జొచ్చి శీఘ్రముగాఁ బాఱిపొండు.

వటు—కుమారా! మన కీగుఱ్ఱ మెందుకు? అయోధ్యవర్గము విండ్లు ప్రో
భయపెట్టుచున్నది. మనయాశ్రమమా దూరమందున్నది. కావున
లేడిగంతులతోఁ బాఱిపోవుదము.

లవు—(నవ్వి) అశరాసనము లేమి ప్రోఁగును? ((విల్లెక్కు పెట్టుచు)

చ. గొన మనునాల్కఁ జుట్టఁబడుకోటియుగంబను కోఱలొప్ప
ఘనతరఘర్ఘరధ్వనులు క్రమ్మఁగ భీకరలీల, ప్రమింగఁ బా
నినతెఱి బాగుగాఁ దెఱచి నిల్పినయంతకునాస్యయంత్ర
యన వికటోదరంబయి భయంకర మయ్యెడు విల్లు చూ

(అంత యథోచితముగాఁ బరిక్రమించి యందఱును నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాఙ్కము.

---



# ఉత్తరరామచరిత్రనాటకము

పంచమాంకము.

(తెరలో) ఓసైనికులారా! మనబలముల కవలంబనము కలిగినది.

ఉ. వారక కోవిదార మనుభవ్యపతాక చలించునట్లుగా
సారథి యశ్వరాజములఁ జయ్యనఁ దోల, మహాజవంబునన్
జేరెడి తేరిపై నధివసించి వినంబడుయుద్ధవార్తపైఁ
గోరిక, జంద్రకేతు వఁడుగో! యరుదెంచెను గొప్పప్రాపుగా.

చంద్రకేతువు—(యథోక్తముగాఁ బ్రవేశించి సారథితో) ఆర్యాసుమంత్రా! చూడు చూడు.

మ. చిఱుకోపంబున నెఱ్ఱవాఱినముఖశ్రీ యొప్పఁగాఁ, బిల్లజు
ట్లరుదారం జలియింప, నీబుడుత వీరాకారుఁడై నారి చె
చ్చెర లాగన్ గిఱుపెట్టుకోటియుగళిం జెన్నొందువిల్లెత్తి సం
గరభూమిన్ భటకోటిపైఁ గురియు వేడ్కన్ సాయకాసారమున్

గీ. ఔర! రఘువంశదుర్యశోఽంకూర మనఁగ
నీమునికుమారుఁ డొక్కరుఁ డేపు మీఱి
దారుణారంభశరశతదళితకుంభి
కుంభటంకారముల నాకుఁ గూర్చు ముదము.

సుమ—కుమారా! వినుము.

గీ. దేవరాతుసమహిమల ధిక్కరించు
నితనిశౌర్యంబు రూపంబు నెంచి చూచి

కౌశికుని యజ్ఞభూమి రక్కసులఁ జంప
ధనువు పట్టినరాముని దలఁచుచుంటి.

చం—ఒక్క చిన్నపిల్లవానితోఁ బెక్కండ్రు యోధులు పోరాడవలసివచ్చె
యని నాహృదయము సిగ్గుపడుచున్నది.

గీ. మదము తొరఁగెడునేనుఁగుల మందతోడ
హైమఘంటలు మ్రోఁగురథాళితోడ
ఘోరశస్త్రాస్త్రచయములతోడ వీరభటుల
మొత్తమొక్కకుమారుని ముట్టడించె.

సుమ—వత్సా! వీ రందఱును గలిసియున్నను వీనికిఁజాలరు. వేఱుగా నున్న
డిదేమి?

చం—ఆర్యా! త్వరపడుము త్వరపడుము. మనసైనికుల నితఁడు చంప
పెట్టినాఁడు

మ. రణభేరీఘననాదముం గలిసి సాంద్ర బైనచంచద్ధను
ర్గుణనిర్ఘోషము శైలకుంజవిచలత్కుంభస్రవద్దానవా
రణకర్ణజ్వరకారియై వెలయఁ సంగ్రామస్థలిన్ మృత్యుభీ
షణవక్త్రంబును జొచ్చు యోధులశిరస్సంఘంబులన్ గొ...

సుమ—(తనలో) ఇట్టివానితోఁ జంద్రకేతువు ద్వంద్వయుద్ధము చేయ ...
రింతును? (ఆలోచించి) కాకపోయినను, నే నిక్ష్వాకురాజులయిం...
పెద్దవాఁడను గదా! యుద్ధము సంభవించినపు డింతకంటె గతి యే...

చం—(సవిస్మయలజ్జాసంభ్రమముగా) అయ్యో! సైనికులెల్లడఁ బాఱిపోయిరి...

సుమ—(రథవేగము నిరూపించి) కుమారా! ఇఁడుగో బాలవీరుఁడు. మాట్లా...

చం—(స్మృతి నభినయించి) ఇతనిపే రేమి?

సుమ—లవుఁడు.

చం—మణిరంగవృత్తము.

ఓ మహాభుజ యోలవ బాలా!, యేమి నీకిఁక హీనులతోడన్
రా మతేనిదె రా శమియించున్, ధామమిప్పుడు ధామములో...

సుమ—ప్రభాకలితవృత్తము.

మరలెను నీసిలు పాలకించి కుమారుఁ డీతఁడు సైన్యసం
హరణము మానుచుఁ జూను బాలక! యంబుదధ్వని విన్నకే
సరివరశాబక మామదాంధగజప్రహింసను మాని తా
మరలినయట్టులు చూడఁగా నుపమాన మీతని కీవుగా.

లవుఁడు—(ధీరోద్ధతపరాక్రమభావముతోఁ బ్రవేశించి) సెబాసు! రాజపుత్రా సెబాసు!! నీవు నిజముగా నైక్ష్వాకుఁడవే. ఇదిగో నేను వచ్చినాను.

(తెరలోఁ గలకలము)

లవు—(నిరసనదృష్టితోఁ దిరిగి చూచి) ఈసేనాపతులు పరాజితులైపాఱిపోయియు మరల వెంబడించుచున్నారు. ఛీ ఛీ! నీచులారా!

చ. ఘనతర మైన శైలపరిఘట్టన రేఁగిన బాడబాగ్ని క
య్యనిలవికంపితాబ్ధిరణితౌఘము కై వడి, నాక్రుధాగ్నికిన్
వెనుకకుఁబోయి హేలమెయి వెండియువాఁగుచువచ్చుమీదువా
హిని యొకముద్దయయ్యెడు సహింపను హేళన రండురండిఁకన్.

(అని తొందరగాఁ బరిక్రమించును)

చం—ఓయీ మునికుమార!

చ. అతులిత మద్భుతం బగుగుణాతిశయంబున నైతి వీవు స్నే
హితుఁడవు గాన నాకుఁ గల దెల్లను నీయదియౌనుగాదె? యు
ద్ధతి నిజసేనతో ననికిఁ దార్కొనఁ జూతువె? రమ్ము రమ్మనీ
జతి యన నీబలంబునికషం బన నే నిదె చంద్రకేతుఁడన్

లవు—(సహర్షసంభ్రమముగా మరలి) అహో! మహానుభావుఁ డయినయీసూర్యవంశకుమారుని వీరవచన ప్రయోగ మెంతప్రసన్నకర్కశముగా నున్నది! ఇఁక నీతుచ్ఛులతో నేమి? ఇతని నే యెదుర్కొనెదను.

(తెరలోఁ గలకలము)

లవు—(కోపముతో) ఛీ ఛీ! ఈపాపాత్ములు వీరసంవాదమునకు విఘ్నమొనరించుచు నాపని పాడుచేయుచున్నారు. (అని వారి కెదురుగా వెళ్లును)

చం—ఆర్యా సుమంత్రా! చూడు చూడు.

మ. పటుదర్పంబు కుతూహలం బడర నాపై దృష్టి సారించి యు
ద్భటకోపంబున వెంబడించుబలముం దాడింప వి ల్లెత్తునీ

వటువీరుం డిరువంక వాయువులు వీవం దత్తఱిం బొట్టి
ట్టటు నూఁగాడున పేంద్రచాపజలదం బన్నట్లు భాసిల్లె

సుమ—బాలకా! మన సేనానాయకు లితనివైపు కన్నెత్తి చూచుటకుఁ
జాలరు. మనమే కేవల మాశ్చర్యమునఁ బరవశుల మైతిమి గదా! నా
చెప్పెడి దేమి?

చం—ఓ రాజులారా!

చ. అరదములున్ గజంబులు హయంబులు నెక్కియు నంగ
భరణము లెల్ల దాల్చి నడిప్రాయము మీఱిన వెన్కఁ గ్రొ
ద్దారఁగొని, పాదచారి యయి తోళ్ళు ధరించినపిల్లవా
క్కురుగుమిగూడిముట్టుదురొకో! యపకీర్తియమీకు మా

లవు—(సోన్మాదముగా) ఆ! పాపము! నాపై దయ దలఁచుచున్నాఁడు
(ఆలోచించి) కాలహరణము కాకుండుటకై యీసేనలను జృంభ
ముచే స్తంభించెదను (అని ధ్యానము నటించును.)

సుమ—ఉల్లోల మైనసైన్యనిర్ఘోష మకస్మాత్తుగా శాంతించిన దేమి?

లవు—ఇంక నే నీప్రగల్భుని జూచెదను.

సుమ—కుమారా! ఈబాలుఁడు జృంభకాస్త్ర మామంత్రించె నని యూ
చున్నాను.

చం—సందేహ మేమి?

చ. వెలుఁగును జీకటిం గలిసి వెల్గెసరీతిని భీతి గొల్పిక
న్నులు మిఱుమిట్లుగొల్పుచుఁగనంగొనశీయక విప్పుమూ
శ్చలముగఁజేసె సైన్యమును సందడి మాన్పెను దెప్పపా
దెలియ ననంతవీర్య మురుతేజము నియ్యది జృంభకా

ఆశ్చర్య మాశ్చర్యము—

మ. పరితప్తస్ఫురదారకూటకపిశజ్వాలాభ తేజంబు భీ
కరపాతాళతమోవినీలరుచి గల్గన్ జృంభకాస్త్రాళి, య
ద్ధురకల్పానిలకంపితం బగుతటిత్పుంజాంబుదావాసకం
దరవింధ్యాచలశృంగవం క్తిగతి మింటన్ నింపెఁ దేజం



సుమ—ఇతని కీజృంభకాస్త్రము లెట్లు వచ్చెనో!

చం—వాల్మీకిమహర్షి వలన వచ్చిన వని తలఁచెదను.

సుమ—ఇతఁ డస్త్రవిద్యామాత్రము వాల్మీకిమహాముని యొద్ద నేర్చి నను కొను. అందు లోను జృంభకములమాట చెప్పనే యక్కఱ లేదు.

క. మునుపు కృశాశ్వమహాముని
కనె నీజృంభకము లతనికరుణఁ గని గ్రహిం
చెను విశ్వామిత్రుం డా
మునికరుణ గ్రహించె రామమూర్తియుఁ బిదపన్

ఇది జృంభకాస్త్రసంప్రదాయము.

చం—నీవు చెప్పినవారే కాక, గురుసంప్రదాయము లేకుండఁగా మహాప్రతిభా శాలులు మంత్రవేత్తలు నగు నితరమహర్షులు గూడఁ గొంద జీయస్త్రములను స్వయముగాఁ గనుఁగొనియుందు రని భావించెదను.

సుమ—కుమారా! సావధానముగా నుండుము. సీప్రతివీరుఁడు సమీపించెను.

కుమారులు—(ఒకరి నుద్దేశించి యొకరు తమలో) ఆహా! చూచుట కెంతయింపుగా నున్నాఁడు! (స్నేహానురాగములతోఁ జూచి)

చ. సమయవిశేషమో! నియతిసంగతసద్గుణతావిశేషమో!
అమలినపూర్వజన్మసముదంచితమైత్రివిశేషమో! యవే
ద్యమయిన దేహబాంధవమహత్త్వమొ! యాతనిఁ జూచినంతఁ జి
త్తము కడు సావధాన మయి తత్పర మయ్యె నిదేమి చిత్రమో!

సుమ—తారామైత్రి యనియుఁ జక్షూరాగ మనియు దేనిని లోకజ్ఞులు వ్యవహరింతురో యట్టినిష్కపటప్రేమ యొకానొకరి కొకానొకరియెడఁ గలుగుట యనునది ప్రాణిస్వభావము. అనాలోచనీయమూల మయినయట్టిప్రేమ మనుభవైకగోచర మని పెద్ద లందురు.

గీ. హేతువిరహిత మాపక్షపాతవృత్తి
దాని కడ్డంబొకింతయుఁ గానరాదు
శుచితరం బైనయాప్రేమసూత్ర మహహా!
జీవిహృదయాంతరంబులు చేర్చి గ్రుచ్చు.

కుమారులు—(అన్యోన్యము మరలఁ దమలో)

గీ. ఎంతయును జూడఁ జూడంగ నితనిమేను
కౌఁగిలింపఁగ నామేను గగురుపొడుచు,
నట్టిమృదునీలపట్టాంబరాభ మైన
కాయమున నెట్లు బాణంబు లేయువాఁడ!

ఉ. కాని పరాక్రమాధ్యునెడఁ గైదువు పట్టక తప్పునొక్కొ
ల్లనియు నిట్టిశూరునెడ నెత్తనిశస్త్రము శస్త్ర మా
వూనియు నాయుధంబు మఱి పోరనిచో నితఁ డేమి
చీ! నిజ మైనకూర్మికిని జే టగు దారుణవీరపద్ధతీ.

సుమ—(లవుని జూచి కన్నీటితోఁ దనలో) హృదయమా? పెడదారిఁ

గీ. నీదు మొలకెత్తునభిలాష కాది యైన
బీజమును ముందుగా దుష్టవిధి హరించె,
హృదయమా! యెక్కడైనను మొదలుకోసి
నట్టితీఁగకుఁ బువ్వులు పుట్టు నొక్కొ?

చం—ఆర్య సుమంత్రా! రథము దిగెదను.

సుమ—ఎందుకు?

చం—ఈ వీరపురుషుని గౌరవించుట యగును. అది గాక రాజధర్మ
టయు నగును. రథికులు పాదచారితో యుద్ధము చేయరాదని
చెప్పుచున్నారు.

సుమ—(తనలో) ఓ! కష్టమే సంభవించినది.

గీ. న్యాయ్య మైనట్టియీకార్య మాచరింప
వద్దనుచు నెట్లు పల్కు నావంటివాఁడు!
సాహసైకరసక్రియాచరణ మిప్పు
డెట్టు లంగీకరింతు? నే నెఱుఁగఁజాల.

చం—ఏదైనఁ గార్యసందేహము వచ్చినపుడు మా తండ్రులుగూడ మా
ప్రియమిత్రుఁడ వైన నిన్నడుగుచుందురు గదా! ఈ విషయము
చించుచున్నా వేమి?

సుమ—కుమారా! క్షత్రియధర్మ మనుసరించుచున్నావు.

క. ఇదియె సనాతనధర్మం
బిదియే సంగ్రామధర్మ మిదియే న్యాయ్యం
బిదియే క్షత్రియధర్మా
న్వదరాఘవవీరచరితపద్ధతి వినుమా !

చం—ఆర్యా! అసమాన మైనమాట చెప్పినావు.

క. ఇతిహాసపురాణంబులు
స్మృతులును సూత్రములు న్యాయశిక్షలును జగ
న్నుత మగురఘువీరకుల
స్థితిగతు లెఱుఁగుదువు నీవ తెల్లము గాఁగన్.

సుమ—(సస్నేహాస్రముగాఁ గౌగిలించి)

ఉ. చిన్నికుమార! యింద్రజిని జీల్చినకీర్తిని గన్నబిడ్డ ని
న్గన్నకుమారలక్ష్మణుఁడు గాంచఁగ మొన్నటివాఁడు గాఁడె? ఘే
లన్న! తదాత్మజుం డెజిఁగె నప్పుడె వీరులధర్మముల్ బళీ!
సన్నుతి కెక్కె భాగ్యమున సౌరకులంబు బహుప్రతిష్ఠమై

చం—గీ. అన్వయజ్యేష్ఠుఁ డనపత్యుఁ డగుచునుండ
దినకరాన్వయమునకుఁ బ్రతిష్ఠ యేది?
యనుచు దుఃఖించుచున్నవా రాత్మలోనఁ
దక్కుమువ్వురు మాతండ్రు లొక్కగతిని.

సుమ—అకటా! చంద్రకేతునిమాటలు హృదయమర్మచ్ఛేదదారుణము లగుచున్నవి గదా!

లవు—అబ్బా! రసక్రమము కలిసి పోవుచున్నది.

గీ. చంద్రుఁ గన్గొన్నకుముదినిచాయ నితనిఁ
జూచి యానంద మొందు నాచూడ్కి, కాని
కలహ మాసించు గుణరఘుణాత్కార ఘోర
కార్ముకం బూనుగుణకిణ కలితభుజము.

చం—(రథావతరణము నిరూపించి) ఆర్యా! సూర్యవంశజుఁ డైన చంద్రకేతుఁడు

నమస్కరించుచున్నాఁడు.

సుమ—ఆదివరాహమూర్తి యైన శ్రీమన్నారాయణుని యనుగ్రహమున నపరాభవము గలుగుఁగాక.

మ. కులనాథుం డగుసూర్యుఁ డియ్యెడ నొసంగుం గాక సౌఖ్యంబు,
కులపూజ్యుండు వసిష్ఠమౌని యొసంగుంగాక యుత్సాహ,
గలుగున్ గారుడ మాగ్నిమారుతము నైంద్రావైష్ణవం బోలె
గెలుపున్ గూర్చుత గామిఁ ఘృణధనుర్నిక్వాణమంత్రంబుల

లవు—కుమారా! నీవు రథముమీఁద నుండియే మిక్కిలి శోభిల్లుచున్నాడు;
నాయెడఁ జూపిన మహాదరము చాలును.

చం—అట్లయిన, మహాభాగా! నీవు గూడ మఱి యొకరథ మెక్కుము.

లవు—ఆర్యా! రాజపుత్రుని మరల రథ మెక్కింపుము.

సుమ—కుమారా! నీవు గూడఁ జంద్రకేతుని కోరిక నంగీకరింపుము.

లవు—తమ సాధనములు తా ముపయోగించుకొనుట కాలోచన మేల!
వనవాసులు రథగతు లెఱుఁగరు.

సుమ—బాలకా! ఇతని దర్పసౌజన్యముల యాచారమును జూచితివా? ఇట్టి
వీరుఁడైన రామభద్రుఁడు చూచెనా, అతని హృదయము నితఁడు స్నే
గరఁగించునుగదా!

లవు—దాని కేమి గాని, ఆరాజర్షి మిక్కిలి సజ్జనుఁ డని వినుచున్నాను. (
చున్నట్లుగా)

చ. మునివరుయజ్ఞశత్రులరిపుం డగుఁ బీకునియాదరంబు నా
కును లభియించునే నతనిగొప్ప నెవం డిల గారవింపఁ? దై
నను హయరక్షకుల్ ధరణినాథుల నెల్లర ధిక్కరించి మిం
చినఁ దగినట్లు నేనును వచించితిఁ గోపము వచ్చె వారికిన్.

చం—నీవు మా నాయనగారి మహాప్రతాపమును గూడ సహింపవా యేమి!

లవు—సహింతునో సహింపనో, అది వేఱుమాట. దాని కేమి కాని యొక
మడుగుచున్నాను. ఆరఘుకుల రాజన్యుఁడు దాంతుఁ డని వినుచు
అతఁడు స్వయముగా గర్వింపఁడు, అతని ప్రజలుగూడ గర్వింప
వందుము. అట్టియెడ నీయశ్వరక్షకులు రక్కసమాట లాడెద రేమి

గీ. వెట్టి యెత్తి నవారి గర్వించువారి
మాట రక్కసపూటని మానులండ్రు
అఖిలవైరంబులకు మూలమదియె, మఱియు
సర్వలోక తిరస్కారసదన మదియె.

ఇట్లు మత్తోన్మత్తభాషితమును నిందించినవారే సూనృతభాషితము నిట్లు నుతించిరి.

గీ. కోరికలు దీర్చుఁ బగవారినో రణంచు
యశము గలిగించు నపసిరి నపహరించు
భవ్యమును బావనం బింటిపాఁడియావు
భద్రములపుట్టినిల్లు సుభాషితంబు.

సుమ—అయ్యో! వాల్మీకి శిష్యుఁడైనయీబాలుఁడు పరిపూతస్వభావుఁడయ్యును, అసమానాభిప్రాయముతో మాటాడుచున్నాఁడు.

లవు—సరే కాని, చంద్రకేతూ! "నీవు మానాయనగారి మహాప్రతాపమును గూడ సహింపవా యే"మని పల్కితివి గదా! క్షత్రియధర్మ మొక్కనియందే మూర్తీభవించి యున్నదని నీయభిప్రాయమా యేమి?

సుమ—ఓయీ వత్సా! నీ వాపూజ్యుఁడైన యిక్ష్వాకువంశవీరు నెఱుఁగవు. కావున నధికప్రసంగము కట్టిపెట్టుము.

గీ. సత్యముగ సైనికుల నోర్చి జయము గాంచి
వెల్లడించితి తేజంబు చెల్లుఁ గాని,
పరశురాముని గెల్చినపురుషునందు
యాక్షవాదంబు చేయ నర్హుఁడవు గావు.

లవు—ఆర్యా! పరశురాముని గెల్చిన పురుషుఁడని పెద్దగొప్ప చెప్పుచున్నా వేమి?

గీ. బ్రాహ్మణులకును వాక్కున క్షత్రియులకు
బాహువుల నుండు వీర్య మీపల్కు నిజము
శస్త్రధరుఁడైనవిప్రు నాజామదగ్న్యు
గెల్చు టొకగొప్ప యౌనె మీతాతవరునకు

చం—(మనఃక్లేశముతో) ఆర్య సుమంత్రా! చాలుఁజాలు. ఇఁక బదులు చెప్పవద్దు.

చ. భువనము లెల్ల నిర్భయతఁ బొంది సుఖింపడ నేలుకీర్తిక్
దవిలినరాఘవేంద్రుచరితంబు లెఱుంగఁ డశేషవిప్రమా
నవపతిపూజ్యుఁ డైనభృగునందను వీనిని గా గణింపఁడీ
నవపురుషావతారుఁ డగునాయకనాయకుఁ డెంతవాఁడొకో

లవు—రఘునాథునిచరిత్ర గాని మహిమ గాని యెవ్వఁ డెఱుఁగఁడు? చెప్పు విశేష మేమయినఁ గలదా?-లేదా, వినుము.

ఉ. వారలు పెద్ద లాచరితవర్ణన కూడదు, సుందునుందరిన్
బోర వధించి పేర్చినయమోఘయశస్కులు వారి నుండనీ!
వీరు ఖరుఁ వధించునెడ వెన్కకుఁ బోయినపోక వాలిపై
సారశరంబు లేయుఘన చాతురియుఁ జగతీప్రసిద్ధమే.

చం—ఆఁ! ఓరీ తాతాపవాదీ! భిన్నమర్యాదా! కొలఁదిమీఱి యెగురుచున్నా!

లవు—ఆఁ! ఏమీ! కనుబొమలు ముడివడఁ జూచుచున్నాఁడే!

సుమ—వీరికిఁ గోపము హెచ్చుచున్నది.

ఉ. కూఁకటిముళ్లు తుళ్లిపడఁ గోపవికంపిత మయ్యె నంగముల్
కోకనదచ్ఛదంబులకుఁ గూరిమిమిత్రము లయ్యె నేత్రముల్
భ్రూకుటిభీకరాననములున్ ధృతలాంఛనచంద్రశోభ భృం
గీకలితారవిందరుచిఁ గేరినకాంతి వహించె నెంతయున్.

లవు—కుమారా! అట్లయిన, యుద్ధమున కనుకూలమైన చోటికిఁ బోవుదము.

(అని యందఱు నిష్క్రమింతురు) ఇది పఞ్చమాఙ్కము.





# ఉత్తరరామచరిత్రనాటకము

## షష్ఠాఙ్కము.

(తరువాత విమానారూఢ మైనవిద్యాధరమిథునము ప్రవేశించును)

విద్యాధరుఁడు— ఆహా! ఆకస్మికవైరభీకరాకారులును, ఉత్తమక్షాత్రతేజోవిరాజమానులు నయినయీసూర్యవంశకుమారులపరాక్రమవిలాసములు దేవాసురులకుఁ గూడఁ దత్తఱపాటు గలిగించుచు నెంతయాశ్చర్యకరములుగా నున్నవి! ప్రేయసీ! చూడు చూడు!

గీ. వింటికొప్పను గంటలు వింటినారి
రణరణంబు గణగణలు ఝుంఝుణలు చేయ
ఘోరశరములు గురియుకుమారవీర
వరులపోరాట మద్భుతావహము గాదె!

విచిత్రపదవృత్తము—
నీరదగర్జముఁబోల్కిన్, భో రనునాదము గల్గన్
గోరుచు వీరిశుభంబుల్, భేరులు మ్రోఁగుచు నుండెన్

కావున సురతరు తరుణమణిమయ ముకుళమకరంద సుందరంబును, వికచకనకమయకమల కమనీయంబు నగుపుష్పవర్షము తెఱపి లేకుండ వీరిపైఁ గురిపింతము గాక.

విద్యాధరి— సరే కాని, ఇదేమి! మనయెదుట నెల్లెడఁ దళతళ మెఱయు విద్యుత్కాంతిజాలమునఁ గపిలవర్ణ మైనట్లుగా నాకాశ మకస్మాత్తుగా నిట్లుమాఱి పోయిన దేమి?

విద్యా— ఔను నిజమే. ఇంతకుఁ గారణ మిప్పు డిట్లు తోఁచుచున్నది. ఈ ఋషితేజము—

గీ. శాణయంత్రంబునన్ ద్వష్ట సానపట్టు
తఱిని గిరగిరఁదిరిగెడు తరణికిరణ
జాలశిత తేజమో, కాక కాలరుద్రు
ఫాలనేత్రంబు నద్భుతో స్మీలనంబొ?

(పరికించి) ఆఁ! కాదు కాదు. నిజము తెలిసినది. కలఁత చెందిన చంద్ర వాగ్నేయాస్త్రము ప్రయోగించెను. అదియే నిప్పులఁ బోలిన శరధారలఁ గు చున్నది.

గీ. కనుము జెండాలు చామరల్ కాలిపోవఁ
దొలఁగి పోయె విమానమండలము, చూడు
క్రొత్త మోదుగు పువ్వులాగున వెలుంగు
నగ్ని దహియించు దీర్ఘధ్వజాంశుకములు

ఆశ్చర్య మాశ్చర్యము. భగవంతుఁ డైనవీతిహోత్రుఁడు విజృమ్భ చున్నట్లుగాఁ బ్రచండ మైనఛటచ్ఛటారవంబు గావించుచు మిణు గ్రక్కుచు భీకరజ్వాలామయము లైననాలుకలు క్రోయుచు నంతట వ్యా చుండె. కావున నాప్రియురాలిని బట్టతోఁ గప్పి దూరముగాఁ పోయెదను (అట్లు చేయును.)

వి.రి.—అహా! విమలమౌక్తిక శైలముమాడ్కి నున్నదై చల్లనైన ప్రియురా సోఁకినంతనే జనియించిన మహానందముచే మెల్లమెల్లగాఁ దల నాసంతాప మంతనే చల్లారినది. బళీ నాభాగ్యము!

విద్యా—ప్రేయసీ! నే నేమి చేసితిని? అయినను—

గీ. ఏమియును జేయ కూరక యెవ్వ రెవరి
దుఃఖమును నైజసుఖమునఁ దొలఁగుచుందు
రట్టినిర్హేతుకప్రీతి నలరునట్టి
వారు వారియదృష్టదేవతలు గారె!

వి.రి—అనారతము సంచలించు విద్యుల్లతలు చకచకలాడుచుఁ బ్రకాశింప యూరకఁతములఁ బోలిన జలధరము లాకాశము నావరించుచున్న

విద్యా—సుందరీ! ఇది లవుఁడు ప్రయోగించిన వారుణాస్త్రముయొక్క సెబాసు! తెలిసి ... ధారలచే నాగ్నేయ

శాంతించినది.

వి.రి.—సంతోషము సంతోషము.

విద్యా—అయ్యో! ఏది యైనను, అనర్థమునకే యగుచున్నది గదా! అకటా! ప్రలయ కాలఝుంఝూమారుతమునఁ గలఁత చెందినకల్పాంతమేఘములు గుడగుడ లాడుచు మింటికిమంటికి నేకధారగాఁగురియు నెడ దట్టముగాఁగ్రమ్మిన మహా గాఢాంధకారమునఁ గన్నుగానక పడిపోయి నట్లును, ఒక్కమాఱుగాఁ బ్రపంచ మంతయు మ్రింగుటకై తెఱచినమృత్యుదేవతనోటిలోఁ బడి దొర లుచున్నట్లును, యుగాంతకాలమున యోగనిద్రచే సకలద్వారంబులు బంధించి యున్న శ్రీమన్నారాయణుని విశాలోదరమున నిలిచి యున్నట్లును, భూతజాల మంతయు విపత్తినొందుచున్నది. (చూచి) చంద్రకేతూ! మేలు మేలు! వాయవ్యాస్త్రము ప్రయోగించి మంచిపని చేసితివి.

గీ. మారుతాస్త్రంబునఁ మేఘమండలంబు
లెక్కడో యణఁగిపోయెఁ జీ రేని లేక
యగు త్రైవిద్యఁ బరబ్రహ్మమం దణంగు
ఘటపటాదివివర్తసంఘాతమట్లు.

వి.రి.—నాథా! దూరమున నుండియే తొందరతోఁ జేయి పై కెత్తి పైబట్ట చెఱఁగు విసరుచు మృదుమధురగంభీరస్వరంబున శాంతింపుఁడు శాంతింపుఁ డను మాటలతోఁ గుమారులపోరాటమును నిషేధించుచు వచ్చి వారినడుమ విమా నము దింపినయీమహాత్ముఁ డెవరో!

విద్యా—ఇతఁడు శంబూకుని జంపి తిరిగివచ్చుచున్న శ్రీరామచంద్రమూర్తి.

చ. చెవులకు హాయి గొల్పు రఘుశేఖరు శాంతరసోక్తి మీఁదిగౌ
రవమున శాంతుఁడై సమరరాగము మానె లవుండు, చంద్రకే
తువు నతిభక్తి శాంతుఁడయి దోసిలి యొగ్గి నమస్కరించె, రా
ఘవుఁడు కుమారులిద్దఱిని గౌఁగిటఁ జేర్చి సుఖించుఁగావుతన్.

ప్రేయసీ! మన మిఁక బోవుదము రమ్మ (అని నిష్క్రమింతురు)

ఇది మిశ్ర విష్కంభము.

(పిదప శ్రీరాముఁడు, లవుఁడు, సాష్టాంగపడిన చంద్రకేతుఁడును ప్రవేశించు చున్నారు)

రాము—(విమానము దిగి)

గీ. సౌరకులపూర్ణిమాచంద్ర! చంద్రకేతు!
కౌఁగిలింపుము లెమ్ము వేగముగ రమ్ము
తుహినశీతలభవదంగ మహిమవలన
శాంతిఁ జెందును నామనస్తాప మిపుడు

(లేవనెత్తి సస్నేహాగ్రముగాఁ గౌఁగిలించి) కుమారా! దివ్యాస్త్రయు[illegible]
చేయు నీ కారోగ్యమా?

చం.—నాయనా! అత్యాశ్చర్యకరుఁ డైనప్రియమిత్రుఁడు లభించిన భాగ్య[illegible]
నెంతయుఁ గుశలము. కాని నా దొక్క విన్నపము, నన్నుఁ జూచి[illegible]
యంతకంటె నెక్కువగాఁగాని యనగ్గళసాహసుఁడైన యీవీరకు[illegible]
మీరు స్నేహదృష్టితోఁ జూడవలె నని నాకోరిక.

రా.—(లవుని జూచితనలో) అదృష్టవశమునఁ గుమారున కతిగంభీర మంగళా[illegible]
డైన స్నేహితుఁడు దొరకెను. (మరలఁ జూచి) చూడఁగాఁ జూడఁగా[illegible]
కిట్లు తోఁచుచున్నది. ఈబాల వీరుఁడు—

మ. మణియో! లోకులపుణ్యమో! మహితసామర్థ్యవ్రజంబో! [illegible]
ద్గణరక్షార్థశరీరధారి యగుసాక్షాదస్త్రవేదంబో! స
ద్గుణపుంజంబో! ఘనీకృతం బయినసంతోషంబో! బ్రహ్మండవ
క్షణముం గోరినమూర్తిమంత మగు రాజద్రాజధర్మంబొకో!

లవు—(తనలో) మహానుభావంబును బ్రభూతపుణ్యంబు నయినయీమహా[illegible]
సాక్షాత్కారమా హా! అహా! ఇతఁడు—

గీ. అంచితధ్యానమునకు నాహ్లాదపదము
పావనై కాంతభక్తికిఁ బట్టుకొమ్మ
మూర్తిసుందర మైనసంపూర్ణధర్మ
సుప్రసాదం బనంగ నా చూడ్కి దనిపె.

మ. అహురా యేమిది? యీతనిం గన నదృశ్యం బయ్యె దర్పం[illegible]
కవ చేకూరెను భారవశ్య మహ రెన్ గ్రుంగె స్వరోధంబు[illegible]
త్సవ మయ్యెన్-మహనీయులందు విలసద్గంగాదితీర్థంబులం
డ[illegible] మహి[illegible] [illegible]డై [illegible]యాడు. [illegible]

రా—(తనలో) ఏమిది? ఏకారణముచేతనో యీబాలుఁడు దృష్టిమాత్రముగా నా యంతరాత్మను దుఃఖరహితముగాను స్నేహసహితముగాను జేయుచున్నాఁడు. ఆశ్చర్య మాశ్చర్యము-అది గాక, స్నేహమేమి? నిమిత్తసాపేక్ష మేమి? ఇది మిక్కిలి పొసఁగనిమాట

చ. కలువుఁ బదార్థసంతతి నొకానొకలోపలికారణం బదే
తెలియఁగ స్నేహమంచు వినుతింగను, నయ్యది కోర దెన్నఁడున్
వెలుపలికారణంబు లిది నిక్కము, చంద్రుని జూచుచున్ విధూ
పలము ద్రవించు సూర్యుఁ గని పంకజమున్ వికసించుఁగాదొకో!

లవు—చంద్రకేతూ! వీ రెవ్వరు?

చం—ప్రియవయస్యా! వీరు మాతాతపాదులు.

లవు—ప్రియవయస్యా యని పిలిచితివి కావున నాకుఁ గూడ వీ రట్టే యగుదురు. కాని, నీవు తండ్రు లనఁదగినవారు నలుగు రున్నారుగదా! రామాయణకథా పురుషు లయినవారిలో వీ రెవరో తెల్పుము.

చం—పెదనాయనగా రని తెలిసికొనుము.

లవు—(సోల్లాసముగా) ఏమి? భగవంతుఁ డైనరఘునందనుఁ డేనా? అదృష్టవశమున నీమహానుభావునిదర్శన మైనది. నేఁడు సుదినము. (వినయకౌతుకములతోఁ జూచి) తాతా! ప్రాచేతసాంతేవాసి యగులవుఁడు నమస్కరించుచున్నాఁడు.

రా—చిరంజీవీ! రమ్ము రమ్ము (ప్రేమతోఁ గౌఁగిలించి) నాయనా! అత్యంతవినయము చాలును. గట్టిగా నన్నుఁ గౌఁగిలింపుము.

సీ. కమలకుట్మలగర్భపత్రములఁ బోలి
మెత్తనై నున్ననై లేఁత యొత్తు నగుచుఁ
జందనముఁ జందురుని బోలి చల్ల నగుచు
నీదుకౌఁగిలి సౌఖ్యంబు నెఱపె నాకు.

లవు—(తనలో) ఆహా! వీరికి నాయెడ నిట్టినిర్హేతుకానురాగ ముదయించినది. నేనో, అజ్ఞానుఁడనై యిట్టివారికే యపకారము గావింప వ్యర్థముగా నాయుధము చేఁబట్టినాను, (ప్రకా) తండ్రిగా రిపుడు మూఢుఁ డైనలవుఁడు చేసిన తప్పు క్షమింతురుగాక.

రా—నీవు చేసినయపరాధ మేమి?

లవు—గుఱ్ఱములో వచ్చినయోధులు నాయనగారి ప్రతాపమును బ్రకటింపఁగా విధి

వీరునివలెఁ బ్రవర్తించినాను.

రా—కుమారా! ఇది క్షత్రియుని కలంకారమే కదా!

చ ఇతరుల తేజ మెన్నఁడు సహింపఁడు దేజము గల్గువాఁ, డనా
హతమును నైజ మైనయది యాతని ధర్మ ము నిశ్చయం, బనా
రతము తపింప నుజ్జ్వలకరంబుల సూర్యుఁడు సూర్యకాంతము
ద్గతపరిభావ మోర్వనివిధంబున నగ్నికణాలు గ్రక్కదే!

చం—ఈమహావీరుని తేజస్సే కాదు, కోపముగూడ శోభాయమానమే యగుచున్న
చిత్తగింపుఁడు. నాప్రియవయస్యుఁడు ప్రయోగించినజృంభకాస్త్రమహిమ
సైన్యము లెల్ల నిశ్చేష్టములై పడియున్నవి.

రా—కుమారా! అస్త్ర ముపసంహరింపుము. చంద్రకేతూ! నీవు వెళ్లి నిశ్చేష్ట
టచే నాశ్చర్యపడుచున్న సైనికులను మంచిమాటలచే నాదరింపుము.

లవు—(ధ్యానము నటించును)

చం—చిత్తము చిత్తము (నిష్క్రమించును)

లవు—తండ్రీ! అస్త్రము శాంతించినది.

రా—వత్సా! జృంభకాస్త్రములును వానిప్రయోగసంహారములును, అతిరహస్య
లైనవి.

గీ. ధర్మరక్షయు లోకహితంబుఁ గోరి
పెక్కువేలేండ్లు బ్రహ్మాదివిబుధు లొక్క
పూనికఁ దప మాచరించి తపోమయములు
తైజసంబులు జృంభకాస్త్రములు గనిరి.

వారివలన నవి కృశాశ్వునకు వచ్చినవి. ఆమహాముని వేయేండ్లు పైగా
శుశ్రూష యొనర్చినవిశ్వామిత్రున కాయస్త్రమయ మైనయుపనిషత్తు నొ
అపూర్వుఁ డైనకౌశికుఁడు దానిని నాకుఁ జెప్పెను. ఇది జృంభకములపూర్వ
దాయము. నీ కీయస్త్రసంప్రదాయ మెక్కడనుండి వచ్చెనో యని తెలి
యడుగుచున్నాను.

లవు—మా కీయస్త్రములు తమంతటఁ దామే వచ్చినవి.

రా—(ఆలోచించి) ఏమి! ఇది యసంభావ్యమా? ఇదేదో మహాపుణ్య
సంభవించినయొక మహిమ కావచ్చును. అబ్బాయీ! మా కని బహు
ప్రయోగించితి వేమి?

లవు—మే మిద్దఱము కవలపిల్లలము.

రా—ఆరెండవవాఁ డెక్కడ?

(తెరలో) మిత్రా దాండాయనా!

శా. ఏ మన్నావుర! చెప్పు చెప్పు మఱి యేమీ! యేమి! మాతమ్ముఁడున్
భూమీనాథుని సైనికప్రవరులున్ బోరాడుచున్నారు? వ
హ్వా మే ల్మేలధిరాజశబ్ద మిపుడే యస్తంగతం బయ్యెడున్
భూమీనాథులశస్త్రపావకము లామూలంబు చల్లారెడున్.

రా—

గీ. ఇంద్రనీలమణిచ్ఛవి యెవఁ డితండు?
కాలజలధరగర్జనఁ గడిమిచెట్టు
మొగ్గ దొడిగినకరణి నీముద్దులాని
కంఠరవమున నా మేను గగురుపొడిచె.

లవు—ఇతఁడే యార్యుఁ డయినమాయన్న కుశుఁడు. భరతాశ్రమమునుండి వచ్చు
చున్నాఁడు.

రా—(సంతోషముతో) అట్లయినఁ గుమారా! ఆచిరంజీవి నిచ్చటికిఁ బిలుచుకొని
రమ్ము.

లవు.—చిత్తము (పరిక్రమించును)

కుశుఁడు—(కోపధైర్యములతో విల్లు ద్రిప్పి గించి)

చ. అమలినసూర్యవంశభవు లైనమనుప్రముఖక్షితీశ్వరుల్
దమితసురారులై యభయదక్షిణ లింద్రున కిచ్చి, రట్టియు
త్తములకు నాకుఁబో రఘున ధన్యము గాదొకో యీశరాసనం
బెతిలనద స్త్రిదీధితులు హారతులై చెలు వొందునారితో?

(అని వికటముగా నడచును)

రా—ఓహో! ఏ మీక్షత్రియకుమారునిపౌరుషాతిరేకము?

ఉ. చూపు జగత్త్రయీబలముఁ జూచును గాదె? తృణీకరించి, పె
ల్లూఁపును గాదె యానడక యుద్ధతిమై ధరణీతలంబు? నా

-రా! పసివాఁడె కాని గిరిరాజనఁగా గురుఁడై తనర్చు నీ
పాపఁడు వచ్చు వీరరసభాసురమూర్తియొ దర్పమో యనన్

లవు—(సమీపించి) అన్నా! జయము జయము.

కుశు—తమ్ముఁడా! యుద్ధము యుద్ధ మనువార్త వినవచ్చెను. సత్యమే నా!

లవు—అదెంత? దానికేమిగాని, నీవు దర్పము విడిచి వినయముతో నుండవలె
నా కోరిక.

కుశు—ఎందుచే?

లవు—పూజ్యుఁడైనరఘుకులనాయకుఁ డిచ్చట నున్నాఁడు.

కుశు—(ఆలోచనతో) రామాయణకథానాయకుఁడును బ్రహ్మాండరక్షకుఁడు నై
శ్రీరాముఁడా?

లవు—అవును.

కుశ—ఆమహాత్మునిదర్శనము తప్పక కోరి చేయఁ దగినదే. కాని, అతనిచెం
కేవిధమునఁ బోవలయునో యని యాలోచించుచున్నాను.

లవు—తండ్రియొద్దకుఁ బోవునట్లే—

కుశు—అ దెట్లు?

లవు—సుజనుఁడును గంభీరుఁడు నూర్మిళాతనయుఁడు నైనచంద్రకేతుఁడు ప్రి
యవయస్య' యనుచు నన్ను స్నేహభావముతోఁ జూచుచున్నాఁడు. అసం
మునుబట్టి యా రాజర్షిని దండ్రివలెఁ జూచుట ధర్మము.

కుశు—సరే. ఈసమయమం దారాజన్యునియెడ వినయము చూపుట తప్పగా

(ఇద్దఱు పరిక్రమింతురు)

లవు—అన్నా! ఆకారానుభావగాంభీర్యాదులను బట్టి యూహింపఁదగిన లోకో
సచ్చరిత్రములరాశియో యన విలసిల్లునీమహాపురుషు నాలోకింపుము.

కుశు—(చూచి)

గీ. ఏమియనుభావ మేమిరూ పేమిమహిమ?
యహహ! రామాయణకవీంద్రుఁ డనఘుఁ డైన
యర్హనాయకు సమకూర్చి యర్హ్యదివ్య
ఫణితి వాగ్దేవి నుపయోగపఱిచెఁ గాదె?

తాతా! ప్రాచేతసాంతేవాసి యగుకుశుఁడు నమస్కరించుచున్నాఁడు.

రామ—కుమారా! రమ్ము చిరంజీవివి కమ్ము.

గీ. నూతనాన్మృతపూర్ణజీమూతశోభఁ
బూని నిగనిగలాడుసీమేను నేఁడు
గాఢముగ నాదరక్తిమైఁ గౌఁగిలించు
వాఁడ సుఖియింపఁ జూచుచున్నాఁడ రమ్మి.

(కౌఁగిలించి) ఏమిది? ఈబాలుఁడును—

మ. అనురాగామృతజాతమై పయికి సర్వాంగస్రుతం బైననా
తనుసారంబొ? బహిర్గతం బయినచైతన్యాంశమో నాఁగ సం
జనితాహ్లాదరసప్రపూర్ణహృదయస్రావాభిషిక్తాంగుఁడై
నను నాలింగితు మందమసోనవలె నానందాబ్ధి నోలార్చెడున్.

లవు—అయ్యా? చండభానుఁడు లలాటంతపుఁడై ప్రజ్వలించుచున్నాఁడు. కావున దయచేసి యీచెట్లనీడను విశ్రమింపుఁడు.

రా—నాయనా! నీయిష్టము నెఱవేర్చెదను. (పరిక్రమించి యందఱును గూర్చుం
రా—(తనలో) (ద్దురు.

గీ. భక్తి వినయంబుఁ గడు నుట్టిపడుచునున్న,
వీరిచూపులలో మాటతీరులోను
నడక మున్నగువానిలో నడగుచుండె
రాజ్యలక్ష్మిని సూచించు రాచఠీవి.

గీ. శారదేందున కాత్మాంశుజాలమట్లు
కమలమున కాత్మమకరందకణములట్లు
వీరిలావణ్యమహిమ మజేవీరిమేన
నవనవోన్మేషరుచి నిరంతరము గూర్చు.

మఱియును జూడఁజూడ రఘువంశసంజాతులబాల్యశోభ వీరియం దధిక
ముగాఁ గనవచ్చుచున్నది.

గీ. పోలవే? మూఁపు లాఁబోతుమూఁపురంబు
చూపులు ప్రసన్నసింహకిశోరదృష్టి

కాయములు మేచకకపోత కంఠసీమ
కంఠనాదంబు శుభమృదంగస్వనంబు.

(మరలఁ జక్కఁగా జూచి) ఓ! కేవలమువావంశమువారి ననుకరిం
రమే కాదు! జానకిపోలికకూడ వీరియందు గనవచ్చుచున్నది. అహా! అక్క
ప్రియురాలిసుందరవదనారవిందము నేఁడు నాకు మరల గోచరించి

గీ. ధవళతరదంతకాంతిసుందరము లైన
వీరిపెదవులుఁ జెవులు నావెలఁదివేను
కనులు వీరివి యెఱు పామెకనులు నలుపు,
కాని, సౌందర్య మంత యొక్కటియె నిజము.

(ఆలోచించి) వాల్మీకిమహర్షి నివసించు నీయరణ్యమే దేవిని వి
చోటు. వీరియాకారమా! యిట్టిది. వయస్సా! ఈమధ్యకాలమునకుఁ ద
వీరిప్రభావమా! అసాధారణము. మఱియు, "మా యస్త్రములు తమంతట
వచ్చిన" వని లవుఁడు చెప్పినమాట స్మరింపఁగా, చిత్రప్రదర్శనసమయము
మహాస్త్రము లెల్లవిధముల నీసంతానము నాశ్రయింపఁగల" వని నేను దేవి
కుచు నిచ్చినయభ్యనుజ్ఞ యిపుడు జ్ఞప్తికి వచ్చినది. కానిచో వీరి కెట్లు
పూర్వమహర్షుల కైనను గురుసంప్రదాయము లేకుండఁగా నిజృంభకాస్త్ర
వచ్చినట్లు వినియుండలేదే! (ఆలోచించి) లోకములోఁ బ్రియజనసం
సంయోగము సుఖహేతువును, వియోగము దుఃఖహేతువు నగుట సహజ
సంభవించినయీవియోగమో, ఆశ్చర్యప్రవాహమువలెఁ దేలియాడుచు హృ
నకు సుఖదుఃఖములు రెంటిని గూడఁ గలిగించుచున్నది. ఆహా!, మేము
మనుట గూడ నాపూర్వానుభవమునకు మిక్కిలి సరిపడుచున్నది. అపుడు
గర్భము కవలపిల్లలు పుట్టునని సూచించు నే యుండెను. (విచారములో)

చ. పరిచయ మెక్కువై చనవు పారము ముట్ట రహస్యవే
సరసఁ దనంతఁ జేరుటకు జంకని దైనను, సిగ్గు చూపు
దరిఁ గడు వంతట న్నిమిరి తాల్చెను గర్భయుగం బటం
దరఁగనుఁగొంటి, నామెయుఁ బడంపడి కన్గొనెఁ గొన్నినా

(కంట నీరు పెట్టి) నా యొక్క యీవాదము మెచ్చి నిర్ణయము గదా!

లవు—

గీ. భవ్యచారిత్ర! లోకశుభప్రదంబు
నిర్మలం బగునమ ఖము కన్నీటఁ దడిసి
దట్ట మగుమంచుబినుకులఁ దడిసినట్టి
పుండరీకంబుకాంతిని బొందె నేమి?

కుశు—ఆఁ! తమ్ముఁడూ! ఏమిది?

ఉ. ఆమెను సీత లేనిబ్రతు కక్కట! దుఃఖము రాదె జేసికిన్?
ప్రేయసి పోయినన్ జగము పెద్దయరణ్యము, వారిప్రేమ మ
జ్ఞేయ మపార మీవిరహసింధువు, దీని నెఱుంగ వౌక్కొ? రా
మాయణ మెన్నఁడున్ జదువనట్టులు ప్రశ్నలు వేయఁజూతువే?

రా—(తనలో) నాయూహ కీమాటలు మిక్కిలి తటస్థముగా నున్నవి. అడుగవద్దు. ముగ్ధహృదయమా! నిష్కారణముగా నీ కీయెగురుపా టెందుకు? అకటా! దుఃఖవేగమున హృదయము బద్ధ అగుటచేతఁ గదా, పిల్లలు గూడ నన్నుఁ జూచి కనికరము చూపుచున్నారు? కాని! ఇఁక దీనిని గప్పిపుచ్చెదను. (ప్రకా—) కుమారులారా! రామాయణము రామాయణ మని సూర్యవంశప్రశంసారూపముగా వాల్మీకిమహాకవి రచియించిన దివ్యవాణీవిలసిత మైన మహాకావ్య మొకటి తఱచుగా వినవచ్చుచున్నది. అం దేదయినఁ గొంచెము వినవలె నని కుతూహలపడుచున్నాను.

కుశు—మే మాకావ్య మంతయుఁ జదివితిమి. బాలకాండము కడపటిశ్లోకము లీ రెండును జ్ఞప్తికి వచ్చినవి.

రా—చదువు నాయనా!

(1) కుశు—

శ్లో. ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి
గుణా ద్రూపగుణా చ్చాపి ప్రీతి ర్భూయోఽభ్యవర్ధత

(1) ధర్మపత్ని యగుటచేతను, తండ్రిగారు కూర్మితో సమకూర్చిన దగుటచేతను సీతాదేవి రామునికిఁ బ్రియురా లయ్యెను. ఆమెచక్కఁదనమును బట్టియు సద్గుణసంపత్తిని బట్టియు నామెయెడ రామునకు మఱియుఁ బ్రేమ హెచ్చెను. అట్లే సీతాదేవికి శ్రీరాముఁడు ప్రాణములకంటె నెక్కువ ప్రియుఁ డయ్యెను.

తథైవ రామః సీతాయాః ప్రాణేభ్యోఽపి ప్రియోఽభవత్
హృదయం త్వేవ జానాతి ప్రీతియోగం పరస్పరం.

రా—(తనలో) అయ్యో! ఇది గుండెలోనిపోటై మిక్కిలి దుస్సహముగున్న
దేవీ! ఇదంతయు నిజమే కదా! ఆహా! సీతతోఁ గలిసి యున్న శారీ
రిక సుఖానురాగాదులు దైవవంచనచే సంభవించిన యీ వియోగమున
మాత్రము లైనవిగదా! అయ్యో!

ఉ. చక్కఁగ నత్తుకొన్న సరసంబగుపొత్తున మించుసంతసం
బెక్కడ? మా మనోరథము లెక్కడ? మా మదిలోని ప్రేమసొం
పెక్కడ? సౌఖ్యదుఃఖముల నేకమనస్కత యెక్క? డైన, నీ
వెక్కడి పాపజీవుఁడనొకో? యిప్పటికైన నశింపఁ డక్కటా!

హా! కష్టము కష్టము. ఈశ్లోకములవలన మిక్కిలి దుఃఖకరమును చక్క
నగుచుఁ బ్రియురాలి సౌందర్య సౌజన్యాది సుగుణసంపదను నాటి
కాలము స్మృతికి వచ్చినది గదా! అపుడు—

గీ. సీతయురమున యావనచిహ్నలంకు
రించి కొన్నాళ్ళకవి విస్తరించువేళ
నింగితము ప్రాయమనురాగ మెఱిఁగి మదనుఁ
డంగముల ముగ్ధుఁ డెదఁ బ్రోడ యగుచు నలరె.

లవు—ఇది చిత్రకూటమార్గమున మందాకినీతీర వనవిహార సమయమున సీతా
శించి రాఘవుఁ డన్నది.

(1) శ్లో. త్వదర్థ మివ విన్యస్త శ్శిలాపట్టో య మగ్రతః
యస్యాయ మభితః పుష్పైః ప్రవృష్ట ఇవ కేసరః.

రా—(సలజ్జాస్మితస్నేహకరుణముగాఁ దనలో) పిల్ల లేమియు నెఱుఁగ
అందులోను వనవాసు లైనవారు బొత్తిగా నెఱుఁగరు. హా దేవీ!
సుందలి ప్రణయక్రీడాప్రసంగము స్మరించుచున్నావా? హా కష్టము!

---

వారిపరస్పర ప్రేమను వారిహృదయములే యెఱుఁగును.

(1) ప్రేయసీ! నాలుగుప్రక్కలను వకుళవృక్షము పువ్వులు వర్షించి
యున్న ... నీకొఱకు వేయఁబడినట్లున్నది.

ఉ. శ్రమజలశీతలం బయి నిరాభరణోజ్జ్వలకర్ణపాళిర
మ్యము నయి పత్రభంగమలినాకృతిఁ జెందని చెక్కులన్ మనో
జ్ఞము నయి యేటిగాలి కలకల్ చలియించి పడంగ వానిమ
ధ్యమునఁ జెలంగుఫాలమచు లారిననాఁటి మొగంబు నెంచెదన్
(స్తంభించిన ట్లుండి సకరుణముగా) అహా! ఏమిది?

మ. పరదేశంబునఁ కేగుబంధుల సదా భావింప భావింపముం
దరఁ బ్రత్యక్షము కాకపో రెపటికైనన్, జచ్చువా రట్లు వ
త్తురొకో! భార్య నశింప జీర్ణవనమై తోఁచున్ జగం బక్కటా!
చిరదుఃఖం బనుకుమ్మ్మలో నణఁగి నాచిత్తంబు పక్వం బగున్.
(తెరలో)

ఉ. ఈకొమరుల్ భటాళి కలహించినవార్తకు భీతి చెంది వా
ల్మీకివసిష్ఠులున్ జనకమిశ్రుఁ డరుంధతి రామతల్లు ల
త్యాకులచిత్తులై నడక తత్తఱ మంద జటల్ చలింపఁగా
నాకడనుండి యీకడకు నట్టులె వచ్చుచునుండి రెట్టులో!

రా—ఏమి? అరుంధతీవసిష్ఠులు, మాఅమ్మలు, జనకమహర్షియు నిచ్చటనే యున్నారా! అయ్యో! వీరి నెట్లు చూతును? (దుఃఖముతో వారివైపు చూచి) పూజ్యుఁడైనజనకమహర్షి యిక్కడికి వచ్చుటవజ్రము వచ్చి నాహృదయమున గ్రుచ్చుకొనుటయే, అకటా!

మ. సమసంబంధ మి దంచు వేడ్క గురువుల్ శ్లాఘింపఁగా మావివా
హము గావించినతండ్రిమామలముదం బానాఁడు వీక్షించి, యి
ట్టిమహాపాప మొనర్చి నేఁడితనిఁ గంటిన్ గాని నే ఖండఖం
డము లై నాఁడనె? కాక, యెట్టిపని కైనన్ రాముఁ డర్హుం డగున్.
(తెరలో) కష్టముకష్టము.

గీ. ముందు పడిపట్టి జనకుండు మూర్ఛ దేటి
యితఁడె యనుభావమాత్రసమితృప్తుఁ డైన
రాముఁ డని చూపఁ దల్లు లౌరా యటంచుఁ
బొగలి నిశ్చేష్టలై మూర్ఛ నొంది రకట!

రా—

గీ. తాత! మిథిలేశ! నను గన్నతల్లులార!
యుభయవంశశుభం బైనయుర్వీపుత్రి
యందు దయఁబూలినట్టి పాపాత్మునందు
కరుణ చూపుట వ్యర్థంబు కాదె మీకు?

కాని! వాని కెదురుగా వెళ్ళి నమస్కారాదులచే సత్కరించెదను.
(అని లేచును)

కుశలవులు—తాతా! ఇటు దయచేయుఁడు.

(సకరుణముగా నందఱు పరిక్రమించి నిష్క్రమింతురు)

—ఇది షష్ఠాఙ్కము—





# ఉత్తరరామచరిత్రనాటకము

## సప్తమాఙ్కము.

(అంతర్నాటకము)

(పిదప లక్ష్మణుఁడు ప్రవేశించును)

ల—ఆహా! ఆశ్చర్యము. భగవంతుఁడైనవాల్మీకిమహర్షి మాతోఁగూడ బ్రాహ్మణ క్షత్రియసహిత మైన సకలపౌరజానపదప్రజాసముదాయము నీసభకుఁ బిలిపించి, నిజమహిమచే సకలదేవాసుర నాగాదిసంఘమును సమస్త జంగమస్థావరసమూహమును సమీపమునకు రావించెను. మాఅన్నగారు నాకిట్లాజ్ఞాపించినారు. ,,వత్సా లక్ష్మణా! అప్సరస లభినయించు తననాటకముచూచుట కని భగవంతుఁడైనవాల్మీకిమహాముని పిలిపింపఁగా మన మందఱ మిచ్చటికి వచ్చినాము. కావున నృత్తగీతాదిరంగస్థాన మైనగంగాతీరమున సమాజసన్నివేశము చేయుము''

అన్యనియానతిచే నేనును మానవులకు దేవదానవాదులకు భూతజాతమునకుఁ దగినరీతిని స్థానము లేర్పఱచితిని. (ముందుచూచి) ఇతఁడే రఘువంశపావనుఁడైన యార్యుఁడు—

క. పరిపాలనాశ్రమంబునఁ
జరియించుచుఁ గష్టతాపసవ్రతుఁ డగుసీ
నరపతి వాల్మీకిమునీ
శ్వరునందలిగౌరవమున వచ్చుచునుండెన్.

ఆర్యా! జయము జయము.

రాముఁడు—(ప్రవేశించి) లక్ష్మణా! రంగస్థలమున సామాజికు లందఱు నుచిత స్థానములఁ గూర్చున్నారా?

ల—చిత్తము.

రా—ఈకుమారకుశలవులు కుమారచంద్రకేతువులతో సమానముగా సర్వస్థానము
గూర్చుండఁబెట్టఁదగినవారు.

ల—దేవరవారి కీపిల్లలమీఁద నున్న ప్రేమనుబట్టి యట్లే యేర్పాటుచేసినాను. ఇది
రాజపీఠము. మీ రిందు దయచేయుఁడు.

(అందఱు యథోచితముగాఁ గూర్చుందురు)

రా—ప్రదర్శనము ప్రారంభింపవచ్చును.

సూత్రధారుఁడు—(ప్రవేశించి) సభాసదులారా! మహాత్ములును సత్యవాదులు
వాల్మీకిమహర్షి గారు „మేము యోగదృష్టిలోఁ జక్కఁగాఁ జూచి కరు
ద్భుతరసమిశ్రమును బరమపావనము నగు వచనామృతమును సమకూర్చి
ము. ఇది చిన్నరూపక మైనను గౌరవార్హము గావున దీనియెడ సావధా
గా నుండవలె”నని జంగమస్థావరాత్మక మైన సకలజగమున కానతి
చున్నారు.

రా—దీనినిబట్టి మహర్షులు ధర్మసాక్షాత్కారముగలవా రనియు, పరమపవిత్ర
ములును సుధారసపూరితములు నైన యామహాత్ముల ప్రజ్ఞానముల కడ్డు లే
యు స్పష్టమైనది. కావున నీకావ్యార్థము సత్యమా యసత్యమా యని
కింపఁ దగినది కాదు.

(తెరలో) హా! ఆర్యపుత్రా!, హా లక్ష్మణా!

ఒంటికత్తెను, దిక్కు లేనిదానను, నిరాశురాలను, ఆసన్నప్రసవవేదన
నన్ను శార్దూలములు మ్రింగఁ జూచుచున్నవి. హా! ఇపుడు గతిమాలినదానై
లోఁ బడుచున్నాను.

ల—(తనలో) అయ్యో, ఎంతకష్టము! ఇది యుద్దేశించినప్రసక్తి కాదు.

సూ—

గీ. విభునిచే ఘోరవనమున విడువఁబడిన
పట్టపుమహిషి ధరాత్మజ పరమసాధ్వి
జానకీదేవి సంప్రాప్త మైనప్రసవ
బాధ నోర్వక గంగలోఁ బడుచునుండె.

(అని నిష్క్రమించును) ఇది ప్రస్తావన.

రా—(తొట్రుపాటుతో) దేవీ! ఉండుము ఉండుము. లక్ష్మణుని ప్రతీక్షింపుము

ల—అన్నా ! ఇది నాటకము.

రా—హా దేవీ దండకారణ్యవాసప్రియసఖీ ! ఇది నీకు రాముఁడు తెచ్చిపెట్టిన దుఃఖము.

ల—ఆర్యా ! దుఃఖము విడిచిపెట్టి ఋషికల్పితమైన యీప్రబంధమును చిత్తగింపుఁడు.

రా—ఇదిగో! వజ్రమూర్తినై సిద్ధముగా నున్నాను.

(పిదప నొక్కొక్కబిడ్డ నొడిలోఁ బెట్టుకొన్న గంగావసుంధరలచేఁ బట్టుకొనఁబడి మూర్ఛితురాలైనసీత ప్రవేశించును.)

రా—లక్ష్మణా ! కాలు తీసి కాలు పెట్టుటకుఁ గూడఁ గనఁబడని గాఢాంధకారములో మునిఁగినట్లుగా నాకన్నులు కానరాకున్నవి. నన్నుఁ బట్టుకో.

గంగా వసుంధరలు_

గీ. ఊఱడిల్లుము జానకీ ! యూఱడిల్లు
మమ్మ కల్యాణి ! నీదుభాగ్యము ఫలించె
రఘుకులస్థితికారులై ప్రణుతి కెక్కు
కవలపిల్లల నీటిలోఁ గంటి వీవు.

సీ—(ఊఱడిల్లి) దైవవశమునఁ బిల్లలను గన్నాను. హా ఆర్యపుత్రా ! (అని మూర్ఛిల్లును.)

ల—అన్నా! (అని కాళ్ళపైఁ బడి) మనయదృష్టము ఫలించినది. రఘువంశము శుభప్రదముగా మొలక లెత్తినది. (చూచి) అయ్యో! ఆర్యుఁడు కన్నీరు కాలువలు గట్ట మూర్ఛ మునిఁగి యుండెనే ! (విసరుచున్నాఁడు.)

గం-వసు—అమ్మా! ఊఱడిల్లు మూఱడిల్లుము.

సీ—(ఊఱడిల్లి) ఎవరమ్మా మీరు ? నన్ను విడిచిపెట్టండి.

వసు—ఈమె మీయత్తవారికులదేవత యైన భాగీరథి.

సీ—దేవీ ! నమస్కారము.

గం—నీపాతివ్రత్యమునకును సచ్చరిత్రకును దగినశ్రేయస్సంపత్తిని గాంచుము.

ల—మహానుగ్రహము.

గం—ఈమె నీజనని విశ్వంభరాదేవి.

సీత—అమ్మా! ఈయవస్థలో నన్నుఁ జూచినావు.

వసు—రా తల్లీ! రా బిడ్డా! (ఇరువురు కౌఁగిలించుకొని మూర్ఛిల్లుచున్నారు.)

ల—(సంతోషముతో) భాగ్యవశమున గంగావసుంధరలు సీతాదేవియెడ నన్నుగ

హించినారు.

రా—(చూచి) ఇది నాదుఃఖమును మించినదుఃఖముగా నున్నది. అహ!

గం—పూజ్యురా లైనభూదేవి గూడ దుఃఖించుట చూడఁగా, అపత్యస్నేహ...లాంగనివా రుండ రని తెలియుచున్నది. కాకపోయినను, మనస్సున...మడియు, హృదయములోనియుపద్రవమును సంసారతంతువు నైన...పుత్రస్నేహము సర్వసాధారణము గదా! సఖీ భూతధాత్రీ! కుమారీ...ఊఁటడిల్లుఁడు.

వసు—(ఊఁటడిల్లి) సీతను గన్నదానికిఁ జిత్తశాంతి యెట్లు గలుగునమ్మా!

గీ. రాక్షసులమధ్య నునికి చిరంబు తొలుత
నిపుడు ఘోరవియోగ మో ర్వెట్టు లమ్మ?

గం—

అరయఁ బరిపక్వపూర్వకర్మానుభూతి
మార్గములు మాయ నెవరు సమర్థు లమ్మ!

వసు—దేవీ జాహ్నవీ! సరే కాని, మీరామభద్రున కిది యుక్తముగా దమ్మా?

గీ. చిన్నతనమునఁ బట్టినసీతపాణి
యీమెశీలంబు సుగుణంబు లీమెకులము
వహ్ని జనకుండు నేను సర్వంబుగూడ
నప్రమాణీకృతం బయ్యె నతని కౌర!

సీ—హా! ఆర్యపుత్రా! స్మరించుచున్నావా?

వసు—ఆఁ!! ఏ కార్యపుత్రుఁ డెవఁడు?

సీ—(సిగ్గుతోఁ గన్నీటితో) ఔను. మాఅమ్మ చెప్పినట్లే-

రా—తల్లీ భూదేవీ! అనార్యపుత్రుఁడనై యిట్లున్నాను.

గం—దేవీ! ఈజగత్కుటుంబమున కంతకును నీవే కదా శరీరము! అట్లయ్యు గనిదానివలె నల్లునియెడ, కోపము వహించెద వేల?

చ. పరగెను ఘోర మైనయపవాదము లోకమునందు, లంకలో
జరిగినయుగ్నిశుద్ధియుఁ బ్రశంసయు నిచ్చటివారిక నమ్మనే!

లోకము సంతసించుగతి లోఁ దలపోయుచు నేలుచున్న యి
క్ష్వాకులసొమ్ము గాదె? యిఁక బాలుఁ డొనర్చున దేమి చెప్పుమా?

ల—సర్వవిషయములందును దేవత లమోఘవిజ్ఞానము గలవారుగదా! భూదేవికి మాత్రము నిజము తెలియదా యేమి?

గం—అయినను నీ కంజలి ఘటించి మ్రొక్కుచున్నాను. ప్రసన్నురాలవు కమ్ము.

రా—తల్లీ భాగీరథీ! భగీరథవంశమునఁ బూర్తిగా మహానుగ్రహము ప్రకటించినావు.

వసు—దేవీ! మీయెడ నేను నిత్యమును బ్రసన్నురాలనే. పుత్త్రీప్రేమచేఁ గలిగిన దుఃఖము దుస్సహ మగుటచే నిట్లు పలికితిని గాని వేఱు కాదు. రామభద్రునకు సీతమీఁద నున్న యనురాగ మెఱుఁగనిదానను గాను.

గీ. దహ్యమానమనస్కుఁడై దైవగతిని
భార్య విడనాడియును రామభద్రుఁ డతని
ధైర్యబల మూఁతగాఁ బాలితప్రజాళి
భాగ్యవశమున నెట్టులో బ్రతికియుండె.

రా—పెద్దవారికిఁ బిన్నలమీఁద నెప్పుడును దయ తప్పదుగదా!

సీ—(దుఃఖముతో దోసిలియొగ్గి) అమ్మా! నన్ను నీలో లయముచేయుము.

గం—ఏమన్నావు? ఎంతమాట? తప్పుతప్పు! లయము లేకుండఁగా వేయేండ్లు జీవింపుము.

వసు—అమ్మా! నీవు నీపిల్లలగతి చూచుకొనవలెను గదా!

సీ—అనాథ నైతిని. ఇఁక నీపిల్లలతో నేమి?

రా—హృదయమా! వజ్రమువలె మా గట్టిగా నున్నావు!

గం—నీవు సనాథురాలవై యుండ ననాథ వెట్లయితివి?

సీ—అభాగ్యురాల నైననాకు సనాథత్వ మెక్కడ?

గం-వసు—

గీ. జగములకు శ్రేయ మొనగూర్పఁ జాలినట్టి
నిన్ను నిందించుకొందువే నీవు తల్లి!
నిన్నుఁ దాఁకుటచే మాకు నిశ్చయముగఁ
బావనత్వంబు వర్ధిల్లెఁ బావనాంగి!

ల—అన్నా! వినండి

రా—లోకము వినుఁగాక.

(తెరలోఁ గలకలము)

రా—ఇదేదో యత్యద్భుతము.

సీ—కలకలధ్వనితో నాకాశము ప్రజ్వలించుచున్న దిదేమి?

గం-వసు—ఆఁ! తెలిసినది తెలిసినది. కృశాశ్వుఁడు కౌశికుఁడు శ్రీరాముఁడు ముగ్గురును గ్రమముగా గురువులైనజృంభకాస్త్రములతో నితర దివ్యాస్త్రములు ప్రాదుర్భవించుచున్నవి.

(తెరలో)

గీ. పావనీ జానకీదేవి! వందనములు
రఘుకులాగ్రణి చిత్రదర్శనము వేళఁ
గరుణ వాగ్దాన మిచ్చినకతన మాకు
గురువు లైనారు నీముద్దుకొడుకు లిపుడు

సీ—సంతోషము సంతోషము. వీ రస్త్రదేవతలు. ఆర్యపుత్రా! మీయను మిప్పటికిని మామీఁదఁ బ్రసరించుచున్నది.

ల—ఈమహాస్త్రము లెల్లవిధముల నీసంతానము నాశ్రయింపఁగల" వని రప్పుడు సెలవిచ్చినారు.

గం-వసు—

గీ. అస్త్రదేవతలార! జోహారు మీకుఁ,
గలిగె ధన్యత మాకు మీకరుణవలన
బాలకులు మిమ్ముఁ దలఁచిన కాలమందు
దర్శనం బిందు మీకు భద్రింబు పొందు.

రా—

గీ. విస్మయానందసందర్భవికల మైన
యట్టిదుఃఖతరంగంబు లంతరంగ
మంత గలఁచుచు వచియింప నలవికాని
తీవ్రదురవస్థలో ముంచి తేల్చుచుండె.

గం-వసు—కుమారా! ఇపుడు నీకొడుకులు రామభద్రునితో సమానులైరి. అను...

సీ—ఆర్యలారా! వీరికి క్షత్రియోచిత మైన యుపనయనాది సంస్కారముల చేయుదురు!

రా—
గీ. ఘనవసిష్ఠమహాగురుకరుణ నెనఁగు
రఘుకులము నన్నెఁ దెచ్చినరమణి సీత
పిల్లలకు క్షత్రియోచితవిధు లొనర్చ
గురువు గనరాక యక్కటా కుందుచుండె!

గం—కల్యాణీ! నీ కీవిచార మెందుకు? పాలు విడువఁగానే యాపిల్లలను దీసికొని పోయి వాల్మీకిమహర్షి కప్పగించెదను. జనకవంశమునకు శతానందుఁడును, రఘువంశమునకు వసిష్ఠుఁడు నెట్లు గురువులో యట్లే యిపు డారెండువంశము లకును వాల్మీకిమహర్షి యే గురువగును. అతఁడే నీపుత్రులకుఁ గులోచితసంస్కారములు గావించి బ్రహ్మక్షత్రవంశోచితము అయిన వేదధనుర్వేదములు రెంటి నిగూఁడఁ జెప్పును.

వసు—దేవీ! చక్కఁగా నాలోచించినావు.

ల—అన్నా! నిజము చెప్పుచున్నాను. ఆయాసందర్భములనుబట్టి చూడఁగా, ఆపిల్లలే యాకుశలవు లని నాయభిప్రాయము.

గీ. వీర లిద్దఱు వాల్మీకిఁ జేరినారు
వీరు లాజన్మసిద్ధాస్త్రసారు లైరి
వీర లాకృతి నినుఁ బోలినారు మఱియుఁ
దలఁపఁగా వీరు ద్వాదశాబ్దములవారు.

రా—ఇట్టియూహలలోనే నాహృదయము మునిఁగి తేలుచుండుటచే మూఢుఁడ నైనాను.

వసు—కుమారీ! రమ్ము. రసాతలము పావనము చేయుము.

రా—హా ప్రేయసీ! నీవు లోకాంతరముఁ జేరినావు.

సీ—అమ్మా! ఈజీవలోకపరాభవ మనుభవింపఁజాలను. నన్ను నీలో విలయము చేయుము.

ల—ప్రత్యుత్తర మేమి వచ్చునో?

వసు—నాయాజ్ఞనుబట్టి పాలు విడిచిపెట్టునంతవఱకును నీపిల్లలను జూచుకొనుచు నుందుము. తరువాత నీయిష్టము వచ్చినట్లే చేసెదను.

గం—ఇది యుక్తముగా నున్నది.

(సీతయు గంగావసుంధరలును నిష్క్రమింతురు)

రా—హా సచ్చరిత్రదేవతా సీతా! దీనినిబట్టి నీవు లోకాంతరమున విశ్రమించియున్నా
వనుట నిశ్చయము. హాదేవీ! (అని మూర్ఛిల్లును.)

ల—దేవా మహానుభావా! ప్రాచేతసా! రక్షింపు రక్షింపు. నీనాటకము ప్ర
ముగాఁ జూచినాము.

(తెరలో) గీతవాద్యసాధనములు తీసివేయుఁడు. ఓజంగమస్థావరములారా!
ఓమర్త్యామర్త్యులారా! వాల్మీకిమహర్షి చేసినప్రతిజ్ఞచొప్పునఁగనవచ్చునత్యద్భుతము
జిత్తగింపుఁడు.

ల—(చూచి) ఆహా! ఆశ్చర్య మాశ్చర్యము.

చ. కలఁగుచునుండెఁ గవ్యమున గట్టిగఁ ద్రిప్పినయట్లు జాహ్నవీ
సలిలము, దేవతల్ మునులు సంతస మొప్పఁగ మింట నిండి రా
జలముననుండి లేచి యలసాగరకన్యకఁ బోలినట్టి భూ
తలసుత సీత, జాహ్నవియు ధాత్రియుఁ దోడుగ వచ్చుచుండెడిన్,

(తెరలో)

గీ. లోకవంద్యా! అరుంధతీ! నీకు భద్ర
మమ్మ! గంగావసుంధరాఖ్యలము మేము
నీకు నర్పింప వచ్చినా మీకుమారి
నిదిగో మీసీత మీకోడ లీద్యచరిత.

ల—అహో! ఆశ్చర్య మాశ్చర్యము. అన్నా! పూజ్యురాలు. చూడండి. (రాము
జూచి) హాకష్టము. ఇప్పటికిని స్మృతి రాలేదు.
(పిదప సీతతో నరుంధతి ప్రవేశించును.)

అరుంధతి—

గీ. త్వరపడుము రమ్మ రమ్మ సీతాకుమారి!
సిగ్గుపడకమ్మ! ధైర్యంబు చెందవమ్మ!
చల్లనగు నీదుమృదులహస్తమునఁ దాఁకి
బ్రతుకఁ జేయుము వేగ మాఁరామభద్రు.

సీ—(తొందరతో) స్పృశించి) ఆర్యపుత్రా! ఊఱడిల్లుము.

రా—(నిట్టూర్పు విడిచి యానందముతో) ఆహా ఏమిది? (చూచి యాశ్చర్యసంతో
ములతో) ఏమీ! ... (సిగ్గుతో) ఆహా! పూజ్యురా

యరుంధతి, ఎట్లూ! ఋశ్యశృంగాదులయిన పెద్ద లందఱును వచ్చి యున్నారే!

అరుం.— ఆమె రఘుకులదేవతయు సుప్రసన్నురాలు నయిన భాగీరథీదేవి.

(తెరలో) జగన్నాయకా రామభద్రా! „తల్లీ! నీవు మాగురుపత్ని యైన యరుంధతివలెనే నీకోడ లైనసీతమేలు గోరుచుండు”మని చిత్రప్రదర్శన సమయమున నన్నుద్దేశించి యన్నమాట స్మరింపుము. అట్లు చేసి నాఋణము తీర్చుకొన్నాను.

అరుం.—ఆమె మీయత్తగారు వసుంధరాదేవి.

(తెరలో) రామభద్రా! లోకరక్షకా! „భగవతీ వసుమతీ! సచ్చరిత్ర యగు సీతనయును జూచుకొ”మ్మని సీతాపరిత్యాగసమయమున నన్నుద్దేశించి పలికిన మాట తలఁచుకొనుము. అట్లు చేసి నీమాట చెల్లించినాను.

రా.—తల్లులారా! మహాపరాధ మొనర్చినాను. క్షమించి కరుణింపుఁడు. మీకు నమస్కారములు.

అరుం.—ఓపౌరజానపదులారా! గంగావసుంధరలు ప్రశంసించినదియుఁ, దొల్లి భవంతుఁ డగు వైశ్వానరుఁడు నిర్ణయించిన సచ్చరిత్ర గలదియు, బ్రహ్మాదిదేవతలనుతులఁ గాంచినదియు, దేవయజ్ఞసంభూతయు, సూర్యవంశపురాజుల కోడలు నగు సీతాదేవిని మీకు నేను సమర్పించుచున్నాను. ఈశావకిని మీరు పట్టపురాణిగాఁ బరిగ్రహింపఁ దగును. ఇందు మీయభిప్రాయ మేమి?

ల.—ఈవిధముగాఁ దల్లి యైనయరుంధతి యదలించి పల్కినంతనే సకలపౌరజానపదవర్గమును సమస్తభూత సముదాయము నామెకు నమస్కరించు చున్నది. లోకపాలురను సప్తర్షులును బుష్పవర్షముచేఁ బూజ్యురాలిని బూజించు చున్నారు. ఆహా!

అరుం.—రామభద్రా!

గీ. కనకవిగ్రహమూల మీకనకగాత్రి
పుణ్యచారిత్రి నీదేవి భూమిపుత్రి,
యీామె సహధర్మచారిణి యై మెలంగ
నశ్వమేధం బొసర్పు ధర్మానురక్తి.

రా.—తల్లీ! నీయాజ్ఞ శిరసా వహించి చేయుదును.

ల—కృతార్థుఁడ నైతిని.

సీ—అమ్మా! బ్రతికినాను.

ల—పూజ్యురాలా! నమస్కారము.

సీ—లక్ష్మణా! నామేలు గోరుచు దీర్ఘాయుష్మంతుఁడవై వర్ధిల్లుము.

ఆరుం—పూజ్యపాదా! వాల్మీకిమహర్షీ! సీతాగర్భసంభవులయిన కుశలవులను రా భద్రునకు సమర్పింపుము. (అని నిష్క్రమించును)

రా-ల—ఇదంతయు మనము తలచినట్లే యైనది.

సీ—నాపుత్రు లేరి?

(పిదప వాల్మీకి కుశలవులతోఁ బ్రవేశించును)

వాల్మీకి—కుమారులారా! ఈరఘుకులనాయకుఁడు మీతండ్రి. ఈపుణ్యశీల జానకి తల్లి, ఈతఁడు లక్ష్మణుఁడు మీపినతండ్రి. ఈరాజర్షి జనకుఁడు మీమాత మహుఁడు.

సీ—(సంతోషవిచారములలో సాభిప్రాయముగాఁ జూచి) ఎట్లు? నాముద్దుల లైన కుశలవులా?

కుశలవులు—(సంతోషముతో) జననీజనకులారా! వందనములు. మాతామహా! న స్కారము. బాబూ! ప్రణామము.

రా-ల—(సంతోషముతోఁ గౌఁగిలించుకొని) నాయనలారా! మీరు లభించినా మాభాగ్యము ఫలించినది.

సీ—నాయనా కుశా! బిడ్డా లవా! రండు రండు. చిరకాలమునకు లోకాంతర నుండి వచ్చిన మీతల్లిని గౌఁగిలింపుఁడు.

కు-ల—(అట్లు చేసి) అమ్మా! మాజన్మము తరించినది. ధన్యుల మైతిమి.

సీ—మహర్షీ! నమస్కారము.

వాల్మీ—ఇట్లే సౌభాగ్యవతివై వర్ధిల్లుము.

(తెరలో) లవణాసురుని నిర్మూలముచేసి యతని రాజధాని యగుమథు నాయకుఁ డైనశత్రుఘ్నుఁడు వచ్చెను.

లక్ష్మ—శుభము శుభముతోఁ గలిసి వచ్చును.

రా—ఇదంతయుఁ బ్రత్యక్షముగా ననుభవించుచున్నను, నాకు నమ్మకము కున్నది. ఇది శ్రేయస్సుల స్వభావము కాఁబోలు!

వాల్మీ—రామభద్రా? నీ కింకేమి కావలెనో కోరుకొనుము.

రా—మునీంద్రా! ఇంతకంటె నా కేమి కావలెను? కాని (కవ కిందిది భరతవాక్య

కాని, (ఈక్రిందిది భరతవాక్యము)

చ. పరమమహర్షి వాగమృతవార్ధిజ మాభవభూతిసత్క వీ
శ్వరకవితాసుధారసముఁ బట్టి తెలుంగునఁ బుట్టినట్టియీ
యురుతరపావనంబయిన యుత్తరరామచరిత్ర విద్వదా
దరమును గాంచి రంగవిదితం బయి శాశ్వతకీర్తిగాంచుతన్.

ఇది, మల్లాది సూర్యనారాయణశాస్త్రి
యాంధ్రీకరించినయుత్తరరామ
చరిత్రనాటకమందు
సప్తమాఙ్కము.

సంపూర్ణము

Saraswathi Power Press, Rajahmundry. 1209-500-26.

# ఆంధ్ర-మాళవికాగ్నిమిత్రము.

—∘∘⋄∘∘—

వేదము - వేంకటరాయశాస్త్రిచే విరచితము.

ప్రథమ ముద్రణము.



చెన్నపురి
ఇండియా ప్రింటింగు ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1919.

 [[illegible] 12 అణాలు.

# పెద్దలకు విన్నపము.

---

నేను ఆంధ్రసాహిత్యపరిషన్నిష్పాదితమైన శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు సంపాదకాధికారమున నున్న 1916-7 సం॥ ల కాలములో 1916-వ సం॥ మున అప్పటికి బహువర్షములకు పూర్వము నారచియించియుండిన బొబ్బిలి యుద్ధనాటకమును ప్రకటించితిని.

ఆయధికారమునుండి నేను తలంగిన 1918 ఫిబ్రవరి మొదలు ఆసెప్టెంబరుదనుక ఆరోగ్యము తప్పి యుంటిని. అనంతరము మచ్చికీర్షిత విష్ణుచిత్తీయముద్రణమునకు అవతారిక వ్రాయం దొడంగితిని. తన్నిమిత్తమై పెక్కుగ్రంథములను ఆంధ్రగైర్వాణ భాషలయందు ఇంచుమించుగా మున్నూటిని పఠించుట ఆవశ్యకమైనది. అట్లు పఠించుటలో దొరకినవిశేషములలో కొన్నింటిని గూర్చి పైఁజెప్పినయవతారికను మూఁడు భాగములుగా నుద్దేశించి అందు రెండు భాగములు వ్రాసితిని. ఇప్పటికిని మూఁడవ భాగము వ్రాయవలసి యున్నది. అవతారికారచనక్లేశము కరము దుర్భర మగుచుండినందున నడుమ నడుమ విశ్రాంతికై పూర్వోక్తవిశేషములలో కొన్నింటి నవలంబించి, తిక్కనవిజయము, విమర్శవినోదము అను వ్యాసములను రచించితిని. అనంతరము అధికమనోవ్యాపారము శక్యముకాని యీ కడచిన వేసవిదినములలో విష్ణుచిత్తీయ టీకాశేష రచనను కొంచెము నిలిపితిని. కాలయాపనకొఱకు మాళవికాగ్నిమిత్రోత్తరరామచరితములను ఆంధ్రీకరించితిని. ఈకాలమందు వ్రాఁతపుస్తకము అముద్రిత మగునేని అరచితప్రాయమే గావున, ఈతుదిరెంటిని ముద్రింప సమకట్టియు, ఎల్లవారికిం దెలిసినకారణముచేతనే, ముద్రింపక యుండఁగా—

ఆంధ్ర గైర్వాణ నాటకాలంకారాది సాహిత్యరసజ్ఞులును, పండితమిత్రులును, విద్యాభిమానులు, పంటకులవతంసులు [నెల్లూరుజిల్లా కోవూరుతాలూకా విడవలూరువాస్తవ్యులు]

శ్రీయుత దొడ్లా రామిరెడ్డిగారు,

మాళవికను ముద్రించుటకు వలయుసర్వధనమును నాకుఁ బ్ర దానిముద్రణమునకు నన్ను సమర్థుం గావించినారు.

వారికి శాశ్వతకీర్తితోడి సకలశ్రేయములను లక్ష్మీసరస్వతులు ఒసంగు గాక యని కోరుచు, ఈగ్రంథమును ముద్రించినాఁడను.

ఈనాటకములను నేను రచించుట చాపలముచేత నే గాని, ప్రజ్ఞాగర్వ గాదు. శ్రీవిక్రమసింహపు ర్యాంధ్రభాషాభిమాని సమాజమువారు మళ్ళ ప్రయోగింపఁ గోరుదురుగావున, వారికి ప్రయోగార్థము కాళిదాసీయ మైన మా కను అభిశాకుంతలమైన యుత్తరరామ చరిత్రకను ఆంధ్రానువాదములు చే అనునభిమానంబును ఏతద్రచనకు కారణమైనవి.

---

# ఉపోద్ఘాతము.

---

మాళవికాగ్నిమిత్ర విక్రమోర్వశ్యభిజ్ఞానశాకుంతలములు కాళిదాసనాటకత్రయ మని ప్రఖ్యాతము గదా. అందు గుణాతిశయము లెల్లను యథోత్తరము పెంపొందియున్నవి. మూఁడును మదనుని జయభేరులే. మూఁటను శృంగారమే అంగి. అయినను భేదములు గలవు:—మూఁటనుం గ్రమముగా రాచకన్య, స్వర్వేశ్య, మునికన్యయు, నాయికలు. తొలిదానం గామసిద్ధి కలదు. రెండవదాన పుత్త్రోత్పాదనరూపధర్మంబును. మూఁడవదాన ఆరెండింటితోఁగూడ పరపరిగ్రహ పరాఙ్ముఖతయు ధర్మదార పరిత్యాగ జనితానుశయంబును నుత్కటములు. ఏవమాదిగుణాతిశయముల చేత శాకుంతలము లోకములో నాటకరాజ మయినది.

అయినను ఇందును నాయకునియందు స్వార్థపరతయే కనఁబడుచున్నది. ఉత్తరరామచరిత్రములో భవభూతి స్వార్థపరతను అధఃకరించి లోకారాధన వ్రతధ్వజమును స్థాపించినాఁడు. దానంజేసి పెద్దలచిత్తమున నదియే శాకుంతలముకన్న నుత్కృష్టమైనది. నామగ్రహణక్రమముననే ఈత్రయమున కాళిదాసభారతి ముగ్ధామధ్యాప్రౌఢావస్థలం జూపుచున్నది. దానంజేసి అదియ తద్రచనాక్రమ మని యెన్నఁదగి యున్నది.

ఇందు మాళవిక రత్నావళీప్రియదర్శికలకు రెంటికిని అనుకృతి యనం దగియున్నది. మల్లిక మాలతికి అనుకృతి. అనుకృతి యేదో అనుకృతమేదో నిర్ణయించుట కొన్నిసమయములలో దుష్కరము. అయినను అందులకు రెంటినిం జక్కఁగా పఠించి రసమెఱింగిన విద్వాంసుల సూక్ష్మదృష్టి మంచి తార్కాణము. దానికి చరిత్రనిర్మాతలు కవుల కాలములను నిర్ణయించునప్పుడు వైతార్కాణమును సయితమును పరికించుకొనుట న్యాయ్యము. కొందఱు కాళిదాసుని ఖ్యాతిని బట్టి మాళవికయే రత్నావళీ ప్రియదర్శికలయందు అనుకృతే మని వాదింతురు. వైయాడంబరమును ఒప్పరికించి లోగుట్టుం గనిపట్టుట సమంజసము. 40, 50 సం॥ లకు ముందునుండి మాళవికంగూర్చిన వైమతభిప్రాయమును నేను ప్రసక్తమయినప్పుడు వెల్లడించుచుంటిని. దానినే పూర్వచరిత్ర నిర్మాతలగు నాధునికసూక్ష్మమతులు ఇటీవల అంగీకరింపఁ దొడంగినారు. రసికశిఖామణు లగు పఠితలు రెంటినుం గల సమసంవిధా

నాది విశేషములు ఎదురెదుర దెలియునట్లుగా పట్టికలు వ్రాసి పరికించుట
రంజకము.

అందులకు సహకారముగా రత్నావళీకథావస్తువును ఇంచుక తెలిపెద... వళి (=సాగరిక) సింహళేశుని కూఁతురు; కౌశాంబీపతియగు వత్సరాజు దేవి... వాసవదత్తకు మేనమామకూఁతురు. ఆమెను బెండ్లియగువాఁడు సర్వభూమండ... నేలు నని సిద్ధుఁడొకఁడు ఆదేశించెను. దానంజేసి వత్సరాజునకు ఆమెను ... నొసంగు మని తన్మంత్రి యౌగంధరాయణుఁడు సింహళేంద్రుని కంచుకిముఖ... నడిగెను. సింహళుఁడు ఆమె నొసంగెను. అనంతరము ఆమెందోడ్కొని సముద్ర... మున ఆకంచుకియు సింహళేశ్వరునిమంత్రియు వచ్చుచున్నయోడ దారిలో తుపా... పగిలినది. రత్నావళి ఒకపలకను తెప్పగాఁగొని నీటిపైఁ దేలుచుండెను. ఆ... వత్సరాజు రాజధాని యగు కౌశాంబివాఁడయిన యొక వణిజుఁడు ఆదారికే... చుం గాంచి తనయోడలో నెక్కించుకొని తెచ్చి యౌగంధరాయణమంత్రి క... చెను. మంత్రి యామెను వాసవదత్తాదేవి కొసంగి యంతఃపురము చేర్చెను. ... కడనుండి సాగరిక వసంతోత్సవములో రాజుం గాంచి వలచి వలరాయని కొ... జీకాకుపడుచుండెను. పిమ్మట వత్సరాజు ఆమెను చిత్తరువులోఁ గాం... అనంతరము ఉపాయములచే ఆమెతో సమాగమమును బొందును. అది ... పట్టమహిషి వాసవదత్త ఆమెను అంతఃపురములోనే కారాగృహములో ... అట్లుండ ఐంద్రజాలికుఁడొకఁడు వచ్చి తనవిద్యచేత నని తెలియ నీయక ... మెల్ల నిప్పంటుకొన్నట్టు కనఁబడం జేసెను. వాస్తవ మయినగృహదాహ... భయపడి వాసవదత్త సాగరికను చెఱలో వైచినందులకు శోకించును. ... పోయి సాగరికను మంటల నడిమినుండి తెచ్చును. నిప్పు మాయ మగును. ... యానకు అచటికి ఓడ పగిలినప్పుడు చెదరిపోయిన వారు సింహళేంద్రమంత్రి... తియు వత్సరాజకంచుకి బాభ్రవ్యుఁడును వత్తురు. మంత్రి సాగరికను... పట్టును. అప్పుడు వాసవదత్త సాగరికను తనమామకూఁతు రని యెఱింగి ఆమెను... వివాహమాడుటకు అంగీకరించును.

ఇట రత్నావళిలో ఇంద్రజాలమువలన నైనకార్యము మాళవికలో విదూ... పాముకాటుతంత్రమువలన నెఱవేఱినది. రెంటను వానరకృతబిభీషికయు... ఇట్లే సవిమర్శముగా రెంటినిం జదివిన సామ్యములు పెల్లుప్పతిల్లును.

వీనియందెల్ల చక్షుఃప్రీతిమనస్సంగములు వలసియున్నవి. అందులకు విరహ... మున నృత్తగీతములు రాజకన్యకావున మాళవికకు ఉచితములైనవి. ఉర్వశియందు... రవునికి [illegible] సంధిబున నొండొరువుల నొరయుచుం గూర్చు...

ఊర్వశి ఉద్ఘాతము కలిగినప్పుడు ఆతనిపైఁ బడుటయు, ఆతనిం గృతజ్ఞతతోఁ గామ ప్రేరిత సవిభ్రమ దృష్టులతోఁ గాంచుటయు, అని కులకన్యలతో ఘటిల్లని కారణవిశేషణములచే తిరముగా నాటుకొన్నది. మునికన్య యగుశకుంతలతో ని వేవియు ఘటిల్లవు. కాన అందులకై కాళిదాసుఁడు ప్రియదర్శికలోని తుమ్మెదలతుటుమునుండి ఒకతుమ్మెదం దెచ్చికొన్నాఁడు. అది పైకొనఁగా నామె పడినతత్తఱపాటును అతుమ్మెదం గాంచినయాజలుకుఁజూపులును [అకామాఽపి హి=] కామప్రేరితములు గానివే కామప్రేరితము లైనశృంగారచేష్టలతోడి సవిభ్రమదృష్టులుంబోలె దుష్యంతునికి మనస్సంగముం గలిగించినవి. ఇట్లు శాకుంతలములోని

"యతోయతః షట్చరణోఽభివర్తతే
తతస్తతః ప్రేరిత లోల లోచనా
వివర్తితభ్రూ రియ మద్య శిక్షతే
భయా దకామాఽపిహి దృష్టివిభ్రమమ్."

క. "ఎందెందుఁ దేఁటి పైకొను
నందందే బెదరి కనుచు నలుకున నేర్చెఁ
సుందరి బొమలాట మొదల్
కందర్పుఁడు నేరుపక యె కనువిభ్రమముల్."

అనుసీశ్లోకము కాళిదాసుని విజయధ్వజముగాను, "అకామాపిహి" అను నీయక్షరములు తద్ధ్వజాంశుకములోని పసిండివ్రాఁతగాను ఉన్నవి. అట్టి యీరసఘుటికను "అనిచ్ఛ" అనియు, "ఎన్నక" అనియు అనువదించుట గుటికి ఊరెఁడు దూరముగా నున్నది.

వర్ణనీయములైన యితర మదనావస్థావిశేషముల సొంపు వెంపులను గ్రంథవిస్తరభయముచే నిట తడవ నైతిని.

మౌర్యవంశ్యుఁడైన బృహద్రథుని రాజ్యమును తన్మంత్రి పుష్పమిత్రుఁడు అగ్నిమిత్రునితండ్రి హరించి తనవంశమునకుం దెచ్చికొనియె నని విష్ణుపురాణమందును భాగవతమునందును జెప్పఁబడియున్నది.

మదరాసు,
8—8—1919.

వేదము - వేంకటరాయశాస్త్రి.

## ఈ నాటకమందలి పాత్రములు.

---

**పురుషులు.**

(సూత్రధారుఁడు
పారిపార్శ్వికుఁడు)
గణదాసుఁడు } నట్టువొజ్జలు
హరదత్తుఁడు }
అగ్నిమిత్రుఁడు-విదిశారాజు
వాహతకుఁడు-మంత్రి
గౌతముఁడు-విదూషకుఁడు
మౌద్గల్యుఁడు-కంచుకి
(ఇద్దఱు వైతాళికులు)
సారసకుఁడు-కుబ్జుఁడు

**స్త్రీలు.**

పండితకౌశికి-పరివ్రాజిక
వకుళావళిక } చేటికలు
కౌముదిక }
ధారిణి-అగ్నిమిత్రుని దేవి
మాళవిక-నాయిక
మధుకరిక-ఉద్యానపాలిక
సమాభృతిక-పరివ్రాజికపరి
ఇరావతి-భట్టిని
నిపుణిక-ఇరావతిచేటి
జయసేన-ప్రతీహారి
నాగరిక-చేటి
రజనిక-శిల్పకారిక
జ్యోత్స్నిక- ,,

---

# మాళవికాగ్నిమిత్రము.

## నాటకము.



సీ. శ్రీమీఱ భక్తచింతామణీభూత మా
నేకేశ్వరత్వమం దిరవుకొనియు,
నాదట నుత్తరీయంబుగా నజినంబు
ధరియించు నెప్పుడుఁ దా నెవండు?
దయితను సామేనఁ దాల్చియు నాద్యుఁ డా
నవిషయమతు లగుయతుల కెవఁడు?
అఖిలవిశ్వముఁ దనయష్టమూర్తులచే భ
రించుచును నహంకరింపఁ డెవఁడు?
తే. ఆమహేశుండు కరుణ నాత్యంతికముగ
మీకుఁ దామసవృత్తి శమింపఁజేసి
మంచిమార్గంబు పొడగాంచు నంచు దెలిపి
సకలనిఃశ్రేయసంబు లొసంగుఁగాత. ౧

---

# ప్రస్తావన.

నాంద్యంతమున

సూత్రధారుఁడు.—(నేపథ్యము వైపు చూచి) మారిషా, ఇటు రమ్ము.

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) ఇదిగో వచ్చితిని భావా.

సూత్ర.—ఈ సభాసదులు నా కానతిచ్చినారు. ఏమని యనఁగా—కాళిదాసగ్రథితవస్తువును మాళవికాగ్నిమిత్ర మనునాటకమును ఇప్పుడు ఈవసంతోత్సవములో ప్రయోగింపవలయు నని. కావున మీరు సంగీతక మారంభింపుఁడు.

పారి.—వలదు ; వినుము. ప్రఖ్యాతకీర్తు లైన భాస సౌమిల్లి కవిపు త్రా... ప్రబంధములను మాని ఈసభాసదులు నేఁటికవి యైన యీ కాళిదాసుని కృతిని... కరించుచున్నా రేమి ?

సూత్ర.—ఇహిహీ ! తెలివి మాలినమాటను పలికితివి ! చూడు.

ఆ. ప్రాఁత దైనమాత్ర భవ్య మై కబ్బంబు
క్రొత్త దైన యంతఁ గొదువపడునె !
ప్రాజ్ఞుఁ డరసి రెంటి భవ్యంబుఁ గైకొను
మూఢుఁ డొరులపల్కె ముట్టనమ్ము.

పారి.—సరియే. పెద్దలు ప్రమాణము.

సూత్ర.—కావున, నీవు త్వరపడుము.

తే. తొలుత నీసభ యిడఁగ నొదలను నేను
గొన్నయాజ్ఞను సాధింపఁ గోరినాఁడ ;
కొలువులోన వలంతి యీకొలువుఁజెలువ
దేవిధారిణియాజ్ఞ సాధించునట్లు.

[అని నిష్క్రమి...

ప్రస్తావన ముగిసినది.

---

మిశ్రవిష్కంభకము.

[అంతట చేటి ప్రవేశించును.]

చేటి.—దేవి ధారిణి నన్నాజ్ఞాపించింది. ఇప్పు డిప్పుడే నేర్చుకొన్న... ఛలితనాట్యంలో మాళవిక ఏలా గున్నదో అని నట్టువాఁజ్ఞను గణదాసయ్య... మని.—అందుకోసము సంగీతశాలకే వెళ్తాను. [అని పరిక్రమి...

[అంతట చేత నొకయాభరణముం గొని
యింకొకచేటి ప్రవేశించును.]

ప్రథమ.—(రెండవదానిం జూచి) ఒశే కౌముదికా, ఎందుకే నీకింత... దగ్గిర నే దాటి వెళ్తున్నా... 

ద్వితీయ.—ఓహో! వకుళావళికా? చెలీ, దేవిగారి యీవుంగరాన్ని పాము ముద్ర చెక్కినదాన్ని శిల్పికాడినుంచి తెస్తూ, దీన్ని బాగా పరకాయించి చూస్తూ, నీచేత నిందపాలైనాను.

వకుళా.—(చూచి) దీనిమీద నీచూపు నాటుకోవడం న్యాయమే. ఈవుంగరంచేత నీముంజెయ్యి పువ్వుపూచినట్టు నాకు తోస్తూవుంది, ఈ కిరణాలు దాని అకరువులలాగ మెరుస్తూ ఉన్నవి.

కాము.—ఒకే నీ వెక్కడికే వెళ్తూవున్నావు?

వకుళా.—దేవిగారు ఆజ్ఞాపించినారు- నట్టువొజ్జని గణదాసయ్యని మీదగ్గిర నేర్చుకోవడంలో మాళవిక ఏమాత్రంగావుందని అడిగిరమ్మని. అందుకోసం వెళ్తున్నాను.

కాము.—సకీ, ఈనాట్యం నేర్చుకోవడం మూలంగా మాళవిక దగ్గిర లేక పోయినా, దొరవారు దాన్ని చూచినా రటే!

వకుళా.—అవును చూచినారు. చిత్తరువులో రాణీగారిపక్క నుండగా చూచినారు.

కాము.—అది యేలాగ?

వకుళా.—దేవిగారు చిత్రశాలలో ముచ్చి కొత్తగా రంగులు వేసిన చిత్తరువు చూస్తూ వుండిరి. అంతలో దొరగారు అక్కడికి వచ్చినారు.

కాము.—అంతట? అంతట?

వకుళా.—అంతట మరియాద అయినతర్వాత, దొరవారు రాణీగారితో కూడా ఒకచోటే ఆసనంమీద కూర్చుని చిత్తరువులో దేవిగారిపక్కను పరిజనంలో ఉన్నదాన్ని చెంగటిపరిచారికని చూచి దేవిగారిని అడిగినారు.

కాము.—ఏమని?

వకుళా.—"దేవి, ఈపిల్లను ఇంతకు ముందు నే నెప్పుడును చూచియుండ లేదు, నీచెంగట వ్రాయఁబడియున్నది. దీనిపే రేమి?" అని.

కాము.—నిశ్చయంగా ఆకృతివిశేషాలమీద ఆదరం నాటుకొంటుంది. తర్వాత తర్వాత!

వకుళా.—ఆమాటని దేవి బదులు చెప్పక గెంటివేశింది. అంతట దొర శంక గలిగి మళ్లీమళ్లీ అడగ నారంభించినాడు. ఎంతటికిన్ని దేవి చెప్పకపొయ్యేటప్పటికి పిల్ల వసులక్ష్మి చెప్పింది "బావా, ఇది మాళవిక." అని.

కౌము.—(చిఱునవ్వుతో) పసితనానికి సరిగా వుంది గదా. తర్వాత దేమి చెప్పు.

వకుళా.—ఇంక నేముంది? ఇప్పుడు దేవిగారు మాళవికని మహా... ఏలినవారి కంటబడకుండా కాపాడుతున్నారు.

కౌము.—ఒళ్ళే, నీపనికి నీవు వెళ్లు. నేనున్ను దేవిగారికి ఈవుంగరాన్ని ... గిస్తాను. [అని నిష్క్రమించును.

వకుళా.—(పరిక్రమించియు చూచియు) ఇదుగో నట్టువాణ్ణు గణదాసు ఈయన కవుపడుతాను. [అని పరిక్రమించును.

గణదాసుఁడు.—(ప్రవేశించి) ఎల్లవారును తమకులవిద్యను ... గణింతురు. కాని, మాకుమాత్రము నాట్యమునుగూర్చి గౌరవము మిథ్య ... ఏల యన.—

మ. అమరశ్రేణికిఁ గాంతచాక్షుషమఖం బండు ర్మును ల్దీని, న
య్యుమతో నత్తినమేన దీనిఁ గొనె నాయుగ్రుండు భంగిద్వయిన్
సమవేక్ష్యం బిట లోకచర్య త్రిగుణీజాతంబు నానారసం,
బమరున్నాట్యము భిన్నకౌతుకజనైకారాధనశ్రేష్ఠ మై.

వకుళా.—(సమీపించి) అయ్యా, దండము.

గణ.—కల్యాణీ, చిరకాలము జీవింపుము.

వకుళా.—అయ్యా, దేవిగారు అడిగి రమ్మన్నారు. 'ఉపదేశం ... డంలో మీకు శిష్యురాలు ఎక్కువగా కష్టం కలిగించడం లేదు గదా,' అని.

గణ.—దేవికి విన్నవింపుము - మాళవిక పరమనిపుణురాలును మేధా... నని. వెక్కుమాట లేల?

ఆ. నేను భావికమును నేర్పుదునో యాడ
దేని దేని బాల దాని దాని,
నేర్పినంతకంటె నిజవిశేషములతో
బదులు నాకు నేర్పుపగిది నాడు.

వకుళా.—(ఆత్మగతము) ఇరావతిని మించుతుం దని తలుస్తాను. (ప్ర... గురువుగారు మీరు ఈవిధంగా ... మాళవిక యిప్పుడు ...

గణ.—కల్యాణీ, అట్టివారు సులభముగా దొరకరు; కావున, అడిగెదను. ఆ పాత్రను దేవి యెక్కడనుండి తెప్పించినది?

వకుళా.—దేవిగారికి క్రిందికులమువాడు వీరసేను డని తోడబుట్టినవాడు ఉన్నాడు. అతణ్ని ఏలినవారు నర్మదయొడ్డున గడిదుర్గంలో ఎల్లరక్షణకోసం వుంచివున్నారు. అతడు శిల్పవిద్యలో ఈపిల్ల తెలివిగలదని దీన్ని అక్కగారికి కానుక పంపినాడు.

గణ.—(స్వగతము) ఆకృతివిశేషమునుబట్టి యీమె యెవరో గొప్పయింటి పిల్ల అని తలంచెదను. (ప్రకాశము) కల్యాణీ, నాకును కీర్తి కలుగును. ఏల యన,

తే. గురువు నేర్పెడు కళ చెందు గుణముపేర్మి
పాత్రతల్లజమునయందుఁ బడియె నేని;
మొగులు గురిసెడునీరు సముద్రశుక్తి
నడరి ముక్తాఫలం బయి యలరునట్లు. ౬

వకుళా.—అయ్యా, మీశిష్య యిప్పుడు ఎక్కడ వుంది?

గణ.—ఇప్పుడే పంచాంగాభినయము నేర్పి నేను అలపు తీర్చుకొమ్మని పంపఁగా డిగ్గియ కనఁబడెడు కిటికీలో కూర్చున్నదై చల్లగాలి ననుభవించుచు ఉన్నది.

వకుళా.—అట్లయితే అయ్యగారు నాకు సెలవియ్యండి; నేను వెళ్లి అయ్యగారి సంతోషాన్ని చెప్పి ఆమెకి ఉత్సాహం వర్ధిల్లజేస్తాను.

గణ.—పోయి నీసఖిని చూచుకొమ్మ. నేనును నాకిపుడు విరామము కలిగినది గావున ఇంటికి పోయెదను. [అని నిష్క్రమింతురు.

మిశ్రవిష్కంభకము సమాప్తము.

---

## ప్ర థ మా ం క ము.

[అంతట ఏకాంతస్థితపరిజనుఁడు రాజు తన వెంట మంత్రి, జాబును కేలఁ గొని యుండఁగా ప్రవేశించును.]

రాజు.—(జాబును తనలో చదువుకొన్న మంత్రిని చూచి) వాహతక ఏమి చెప్పుచున్నాఁడు వైదర్భుఁడు ?

అమాత్యుఁడు.—ఇదె యిప్పు డతఁడు వ్రాసినబదులు. "తమరు నన్ను శించినారు : ఏమని యనఁగా - 'నీపితృవ్యపుత్రుఁడు కుమారుఁడు మాధవసే మాతో సంబంధము సేయ మాట యిచ్చి, మాకడకు వచ్చుచుండఁగా, అతని నీయెల్లకాపరి ముట్టడించి పట్టుకొన్నాఁడు. ఆకుమారుని నీవు నన్ను గుఱించి తోను సహోదరితోను కూడ విడిచి పెట్టవలయును.' అని. మఱి, ఒకయింటఁ దాయాదులు భూమిని హరించునప్పుడు రాజులవర్తనమును తమ యున్నారు. కావున తమరు ఉదాసీనులుగా నుండఁదగును. మఱి యతని తో ఆతఁడు పట్టువడిన యాసంకులములో చెదరిపోయినది. ఆమెను వెదకింప చెదను. మఱి, తప్పకుండ మాధవసేనుని తమరు విడిపింపఁగోరుదురేని, ఈయొ కను వినుఁడు.—

ఆ. మౌర్యసచివు నాదుమఱఁదిని జెఱనుండి
తమరు విడిచిపుచ్చుతత్క్షణంబ
బంధనంబునుండి బదులు మాధవసేను
విడుచువాఁడ నంచు విన్నవింతు."

రాజు.—(రోషముతో) ఏమీ ! అనాత్మజ్ఞుఁడు వీఁడు నాతో యముచే వ్యవహరించుచున్నాఁడు ! వాహతకుఁడా, వైదర్భుఁడు నాకు శత్రుఁడును ప్రతికూలకారియు. కావున అభియోక్తవ్యపక్షమువాఁడైన ఉన్మూలించుటకై మున్నె సంకల్పిత మయిన సేనాచక్రమును వీరసేననాయ ఇపుడు ఇతనిమీఁదికి తరల నాజ్ఞాపింపుము.

అమా.—ఏలినవారియాజ్ఞ.

రాజు.—కానీ, నీ కేమి తోఁచుచున్నది ?

అమా.—శాస్త్రమున చెప్పఁబడినదానినే యేలినవారు సెలవిచ్చినారు

ఆ. ఇప్పుడిపుడె గద్దె యెక్కినయీవైరి
ప్రకృతులందుఁ జక్కఁ బదము కొనమిఁ,
గ్రొచ్చి యపుడె యిడినక్రొత్తయంటుంబోలె
వెలువరింపఁ గరము సులభుఁ డగును. ౭

రాజు.—అట్లేని, నీతిశాస్త్రకారులమాట తప్పదు. దీనినే నిమిత్తముగాఁ గొని సేనను కూర్చుఁడు.

అమా.—చిత్తము. [నిష్క్రమించును.

[పరిజనము సమీపించి రాజుమ్రోలఁ దమతమ పనులందు నిలుతురు.]

విదూషకుఁడు.—(ప్రవేశించి) నన్ను ఏలినవా రాజ్ఞాపించినారు. "గౌతముఁడా, అప్పుడు అలవోకగా చిత్తరువులో నేను చూచిన యామాళవికను ప్రత్యక్షముగా చూచేలాగు ఉపాయ మేమయినా పన్నుమా" అని. నే నున్ను ఆలాగే దాన్ని సాధించితిని. వెళ్లి ఆయనతో చెప్తాను. [అని పరిక్రమించును.

రాజు.—(విదూషకుం గని) ఇతఁడు మతి యొకఁడు, వేఱుకార్యమున మంత్రి, మాకడకు వచ్చుచున్నాఁడు.

విదూ.—(సమీపించి) నీవు వర్ధిల్లుదువు గాక.

రాజు.—శిరఃకంపముతో ఇక్కడ కూర్చుండుము. [విదూ. కూర్చుండును.

రాజు.—మిత్రమా, ఉపాయముం గనిపట్టుటకు నీ తెలివికంటిని పనిగొంటివా?

విదూ—ప్రయోగసిద్ధి నడగవయ్యా.

రాజు.—మిత్రమా, ఎట్లోయి?

విదూ.—(చెవిలో) ఇట్లు.

రాజు.—బళీ! మిత్రమా! నేర్పు మెఱసి యారంభించితివి! మాయీకోరిక తీఱునది కాకున్నను ఇప్పుడు మేము తీఱు నని ఎన్నుకొనుచున్నాము. ఏలయనః—

ఆ. అడ్డు గలిగినట్టియర్థంబు సాధింప
సాయ మొప్పువాఁడె శక్తుఁ డగును;
కటికియిరులులోనఁ గన్నుగలాఁడును
దృశ్యముం గనండు దివ్వె లేక. ౮

[నేపథ్యమున]

చాలింపు చాలింపు. ఎంతయని బడాయి కొట్టుకొనెదవు? రాజుగారియెదు
మనలో హెచ్చెవరో తగ్గెవరో స్పష్టపడును లే.

రాజు.—(ఆకర్ణించి) మిత్రమా, నీసునీతివృక్షము పూవు పూచినది.

విదూ.—ఫలాన్ని కూడా చూస్తావు.

[అంతట కంచుకి ప్రవేశించును.]

కంచుకి.—దేవా, అమాత్యుఁడు విన్నవించుచున్నాఁడు: "ఏలినవాఁడు
నెఱవేర్చితి" మని. వీరుగో మఱి హరదత్తగణదాసులు.

తే. అభినయాచార్యు లిరువు రన్యోన్యజయము
వలచి నీసమ్ముఖమునకు వచ్చినారు,
భావములు తామె మేనులఁ బరఁగఁ దాల్చి
సరగ సాక్షాత్కరించెడు చంద మొప్ప:

రాజు.—ప్రవేశపెట్టుము వారిని.

కంచు.—దేవర యాజ్ఞ. [అని నిష్క్రమించి ఆయిరువురతో ప్రవే
ఇటు ఇటు రండి మీరు.

హరదత్తుఁడు.—(రాజు నవలోకించి) అహో! దురాసదము గదా
తేజము!

తే. అపరిచితుఁడును గాఁడు కాఁ డరుచిరుఁడును,
అయిన నీతని డాయంగ నగును భీతి;
అంబునిధివోలె నెప్పటియతఁడె యితఁడు,
నాకనులకు నజస్రంబు నవనవుండు.

గణదాసుఁడు.—గొప్పదిగదా పురుషరూపముం బొందినయా
అట్లే సుమా.

తే. ద్వారపాలునియనుమతి వడసి వొచ్చి
గద్దె దఱియునతనివెంటఁ గదియు నేను
చూడ్కి వెనునెట్టు నితని తేజు గమిచేత
వవనమునము...... వెనుదిరిగి... బోదిఁనను.

కంచుకి.—వీరుగో దేవరవారు. దగ్గఱుఁడు మీరు.

ఇరువురు.—(సమీపించి) జయము జయము ఏలినవారికి.

రాజు.—స్వాగతము మీ కిరువురకు. (పరిజనమువంకఁ జూచి) ఆర్యులకు ఆసనములు.

[ఇరువురుం బరిజనులు తెచ్చినయాసనములయందు కూర్చుందురు.

రాజు.—ఏమి యిది! శిష్యులకు నేర్పవలసిన సమయములో ఒజ్జ లిరువురును ఒక్కట ఇటకు వచ్చితిరి?

గణ.—అవధారు. నేను దొడ్డగురువునొద్ద అభినయవిద్యను నేర్చితిని. శిష్యులకు నేర్పనుగూడ నేర్పితిని. దేవరకును దేవేరికిని అనుగ్రహభాజన మై యున్నాను.

రాజు.—చక్కఁగా ఎఱుఁగుదును. అటయిన నేమి?

గణ.—అట్టినన్ను ఈతఁడు ఈహరదత్తుఁడు తనపాదధూళికి కూడ సమానుఁడను కా నని గొప్పవారియెదుర నిందించినాఁడు.

హర.—దేవరా, ఇతఁడే నన్ను ముందు నిందించినవాఁడు: ఈయనకును నాకును సముద్రమునకును పడియకును ఎంతయంతరమో అంతయంతర మఁట. కావున, ఏలినవారు ఈయనను నన్నును శాస్త్రమందును దానిని నేర్పనేర్పునందును పరీక్షింపుదురుగాక. దేవరవారే మాయందు విశేషము నెఱుంగఁగల ప్రాశ్నికులు.

విదూ.—సమర్థమయిన ప్రతిజ్ఞ.

గణ.—ఉత్తమపక్షము. దేవరవారు అవధానముతో వినవలయును.

రాజు.—త్వరపడకుఁడు. ఈవిషయములో దేవి మాయందు పక్షపాతమును శంకించును. కావున పండితకౌశికితోఁ గూడినదేవిమ్రోలనే యీవ్యవహారము న్యాయ్యము.

విదూ.—నీవు చెప్పినది సరి.

ఆచార్యులు.—దేవరవారికి తోఁచినట్లు

రాజు.—మౌద్గల్యుఁడా! ఈప్రస్తావమును నివేదించి దేవిని పండితకౌశికితోఁ గూడ ఇటకు విజయంచేయు మని ఆహ్వానము చేయుము.

కంచుకి.—ఏలినవారియాజ్ఞ. (అని నిష్క్రమించి సపరివ్రాజిక యగు దేవితోడ ప్రవేశించి) ఇటు ఇటు దేవిగారు.

దేవి.—(పరివ్రాజికను చూచి) భగవతి, గణదాసహరదత్తుల యీయాటోపము నీకు ఏమిగా తోస్తున్నది!

పరివ్రాజిక.—నీపక్షము ఓడిపోవు నని వెలువడును. గణదాసుడు కన్న తక్కువవాఁడు కాఁడు.

దేవి.—అది వాస్తవమే. అయినా, రాజావలంబము అతనికి ప్రధానత కలిగిస్తుంది.

పరి.—దేవి, రాజ్ఞీశబ్దభాజనమును నిన్నుఁగూడ కొంచెము తలంపుము.

ఆ. చెలఁగి తమ్మివిందు చేపట్టుకతమున
నసలుఁ డమితతేజుఁ డగుట నిజమ ;
మహిమ నొందఁ డోటు మిహికాంశుఁడును నట్లె
రాత్రిచేతఁ బరిగృహీతుఁ డగుట ?

విదూ.—వహవ్వా వహవ్వా ! పీఠమర్దికని ముం దుంచుకొని వచ్చింది

రాజు.—చూచుచున్నాను దేవేరిని. ఈరమణి—

క. మంగళమండిత యాసీ
యంగన కౌశికిని గూడి యతి వేషధరన్
సాంగను నాధ్యాత్మిక వి
ద్యం గూడినమూర్తిసహిత త్రయి నా వెలుఁగున్.

పరివ్రాజిక.—(సమీపించి) దేవా, విజయ మొందుదువుగాక.

రాజు.—భగవతీ, నమస్కారము.

పరి.—

ఆ. పతివి గమ్ము వర్షశత మిర్వురకు నిట్లు
ధారిణికిని భూతధారిణికిని,
సన్నుతలకు భూరిసారప్రసవలకు
మానఘనలకున్ సమక్షమలకు.

దేవి.—ఆర్యపుత్రునికి జయ మగు గాక.

రాజు.—స్వాగతము దేవికి. (పరివ్రాజికను గాంచి) భగవతీ, కూర్చు
[ అందఱు యథోచితముగా వారికి తగినట్లు కూర్చు

రాజు.—భగవతీ, హరదత్తయ్యగారికిని గణదాసయ్యగారికిని విజ్ఞానవిషయములో ఒరయిక సంభవించినది. అందు నీవు పరీక్షకాధికారమును వహింపవలయును.

పరి.—(మందహాసముతో) ఏల నన్ను పరిహసించుట? పట్టణ ముండఁగా పల్లెలో నా రత్నపరీక్ష?

రాజు.—కాదు, అట్లనఁగూడదు, పండితకౌశికివిగదా నీవు. నేనును దేవియు వీరివిషయమున పక్షపాతము వహింతుము.

ఆచార్యులు.—దేవరవారు సరిగా సెలవిచ్చినారు. మధ్యస్థురాలు భగవతీ మాయిందు గుణదోషములను విడఁదీయుట సరి.

రాజు.—అటయిన మీవివాదమును ప్రస్తావింపుఁడు.

పరి.—దేవా, నాట్యశాస్త్రము క్రియాప్రధానము గదా. ఇట వాగ్వాదము చేత నేమి ప్రయోజనము?

రాజు.—దేవిచిత్త మెట్లో?

దేవి.—నన్నడుగుదువేని వీళ్ల యీవివాదమే నాకు రుచింపకున్నది.

గణ.—దేవి నన్ను సమానవిద్యునిచేత అవమానము పొందవలసినవానినిగా తలంచుట తగదు.

విదూ.—కానీ చూతాము పొట్టేళ్లజగడాన్ని; ఊరిక యెందుకు జీతాలివ్వడము?

దేవి.—నిశ్చయంగా నీవు కలహప్రియుఁడ వోయి.

విదూ.—అలా గాదు, కోపంచేయకు; ఒకదానితో ఒకటి పోరాడుతూ వున్న మదపుటేనుగలలో ఒకటి ఓడిపోకుండా శాంతి యెక్కడిది?

రాజు.—మఱి యీ యిరవురు స్వాంగ సౌష్ఠవాభినయమును భగవతి చూచి యున్నదిగదా?

పరి.—చూచి యున్నాను.

రాజు.—మఱి యిప్పుడు అంతకన్న వీరు ఏమి ప్రదర్శింపవలయును?

పరి.—అదే చెప్పఁగోరియున్నాను.

ఆ. ఒకఁడు నేర్చు నెంతయును బ్రశస్తంబుగా,
నొకఁడు నేర్పు నల్లె యుత్తమముగ;
నేర్వ నేర్ప నెవఁడు నెఱవాది యగు, వాని
నొజ్జలందు మొదల నునుపవలయు. ౧౬

విదూ.—విన్నారయ్యా ఒజ్జగార్లు భగవతిమాట? పిండితార్థ మిదీ:—మీ యుపదేశం చూపితే తీర్పు చెప్తా మని.

హర.—అది నాకు మిక్కిలి ప్రియము.

గణ.—దేవీ, వ్యవహార మిట్లున్నది.

దేవి.—ఒకవేళ శిష్య మేధ చాలనిదై ఒజ్జ నేర్పినదాన్ని చెడగొట్టి... అదేమి ఒజ్జదోషమా?

రాజు.—దేవి, అట్లును సంభవించును; తెలివితక్కువ శిష్యను ప... చుటచే ఒజ్జయందు తెలివిచాలమి ప్రకట మౌను గదా?

దేవి.—(స్వగతము) ఏమి చేయుదును! (గణదాసుం గాంచి, జనాం... ఆర్యపుత్రునికి ఉత్సాహకారణమైన యీ కోరిక నెఱవేర్చకు. (ప్రకాశము)... యోజన మైన యీ యారంభాన్ని మానవయ్యా.

విదూ.—దేవి చెప్పినమాట బాగా వుంది. ఓయిగణదాసుడా, సం... దేశం ఆరంభిస్తూ, సరస్వతీనైవేద్యపు మోదకాలని హాయిగా తింటూ ... తప్పకుండా ఓడడం కలిగే యీ వివాదంలో ఎందుకు ప్రవేశిస్తావు?

గణ.—నిజముగా ఇదే దేవిమాటలోని భావము. ఇప్పుడు అవసరప్ర... యీమాటను వినుఁడు.

ఆ. ఆస్పదంబు గంటి నని వాదునకు లోఁగి,
యొరులవలని నింద నోర్చుకొనుచు,
బ్రదుకుకొఱకె యెఱుకఁ బచరించు నెవ్వాఁడు,
వాని నెఱుకసరకు వణిజుఁ డండ్రు.

దేవి.—నీశిష్య నీవద్ద నేర్వ నారంభించి కొంచెం దినాలే అయినవి... పడని యుపదేశాన్ని పరీక్షకు చూపడం న్యాయం గాదు.

గణ.—కావుననే నానిర్బంధము.

దేవి.—అటయితే ఇద్దరున్ను భగవతికి ఉపదేశం చూపండి.

పరి.—దేవి, ఇది న్యాయ్యము గాదు. సర్వజ్ఞు లయినను ఒక్క... కారమును పూనుట దోషావహ మగును.

దేవి.—(జనాంతికము) మూఢురాలా, పరివ్రాజికా, నేను మేలుకొ... నన్ను నిద్రితురాలినిగా చేస్తున్నావు.

[అని ... ...సూయ ... రాజు ... పరివ్రాజికకు ...]

పరి.—(చూచి)

ఆ. కతము లేక పెడమొగం బయ్యె దేలమ్మ
యిందువదనరో, నిజేశుమీఁద ?
పతులపైఁ బ్రభుత్వవతు లయ్యు నిల్లాండ్రు
కనలు పూనుదురె యకారణముగ ? ౧౭

విదూ.—కారణం లేకేమి ? తనపక్షాన్ని రక్షించవలశివుండడమే కారణం. (గణదాసుని చూచి) భళీ ! కోపంమిష చేత దేవి నిన్ను రక్షించిందోయి. చక్కగా నేర్చినవా రైనా ఎల్లవారున్ను ఉపదేశం చూపడంలో నిపుణులుగా వుండరు.

గణ.—దేవి, వింటివా ? ఇట్లే లోకులు తలంతురు. కనుక ఇప్పుడు,

ఆ. నాదుకళను, దాని నానేర్పు నేర్పును,
వాదమందు రూఢిపఱుచునాకు
నియ్య వే ననుజ్ఞ, యేను నీచేఁ బరి
త్యక్తుఁ డన యటంచుఁ దలఁపు దేవి. ౧౮

[అని ఆసనమునుండి లేవ నుంకించును.

దేవి.—(స్వగతము) ఏమి గతి ! (ప్రకాశము) ఒజ్జగారికి శిష్యురాలిమీద సర్వస్వాతంత్ర్యమున్నూ కలదు.

గణ.—చాలసేపు నిష్కారణముగా శంకితుఁడ నయితిని. (రాజుం గాంచి) దేవిగారు అనుజ్ఞ యొసంగినారు. ఏలినవారు ఆనతీవలయును - ఏవస్తువున నా నేర్పిన యభినయమును ఆడింపు మనియెదరు ?

రాజు.—భగవతి యాదేశించుదానియందు.

పరి.—దేవిమనస్సులో ఏమో యున్నది. కావున శంకాకులిత నై యున్నాను.

దేవి.—శంక మాని పలుకు. ఏమైనా, నాపరిజనంమీద నాకు ప్రభుత్వం తప్పదు గదా.

రాజు.—నామీఁదనుగూడ నని వచింపుము.

దేవి.—భగవతి, ఇప్పుడు చెప్పు.

పరి.—దేవా, శర్మిష్ఠ రచించినట్టిది నాలుగుపాదములు గలది. ఛలిత మను నాట్యము అభినయించుటకు కష్ట మని చెప్పుదురు. ఆ యొక నాట్యమందే యీ

యిరువురయుపదేశమును చూతము. అంతట ఇరువురయుపదేశమందును గుం
తమ్యము నిశ్చయముగా తెలియును.

ఆచార్యులు.—భగవతి ఆజ్ఞాపించినట్లు చేయఁదగును.

విదూ.—అ పైతే ఉభయవర్గాలున్నూ ప్రేక్షాగృహంలో సంగీతకసంవి
చేసి ఏలినవారికి దూతని పంపండి. పోనీ దూతెందుకు లే, మద్దెళనాదమే చె
తేపుతుంది.

హర.—అట్లే చేసెదము. [అని నే

[గణదాసుఁడు దేవిని చూ

దేవి.—ఆర్యునివిజయానికి నేను ఎంతమాత్రమూ ప్రతికూలను కాను.

[ఆచార్యులు ఇరువురును తె

పరి.—ఒజ్జలు, ఇటు చూడుఁడు.

ఇరువురు —(వెనుకకు మరలి) ఇదిగో ఉన్నాము.

పరి.—నిర్ణయాధికారములో చెప్పుచున్నాను - ఎల్లయవయవముల
స్పష్టముగా తెలియునట్లుగా, కొలఁదిపాటి నేపథ్యముతోనే, పాత్రములను ప్ర
వెట్టవలయును.

ఆచార్యులు.—ఇది మాకు హెచ్చరింప నక్కఱలేదు. [అని నిష్క్రమించి

దేవి. — (రాజును చూచి) ఆర్యపుత్రునికి రాచకార్యములలో ఇట
ఉపాయనిపుణత వుంటే అది చాలా మేలుగా వుండును.

రాజు.—

ఆ. ఒందువగను గొనకు మో మనస్విని, యిది
నాదుపన్నకంబు గాదు సుమ్ము;
కానమో సదా సమానవిద్యులు పర
స్పరయశమున దొసఁగు పట్టుచుంట?

[నేపథ్యమున మద్దెళధ్వని. అందఱు చెవి యొ

పరి.—ఆహా! సంగీతకము ప్రవర్తిల్లుచున్నది! అదిగో—

ఆ. అభ్రనాదశంక నబ్బు లెత్తి నెమళ్లు
అనురసింప మురజము[illegible]

మధ్యమస్వరోత్థ మాయూరి మార్జన
మదిని సొగియఁ జేయు మంజుఘోష. ౨౧

రాజు.—దేవీ, సామాజికుల మవుదము.

దేవి.—(స్వగతము) అహో! ఏమి దుండగము ఆర్యపుత్రు నిది!

[అందఱు లేతురు.

విదూ.—(అపవారించి) వయస్యుఁడా, నింపాదిగా నడువు, దేవిగారు బెడిసి పొయ్యేని.

రాజు.—

క. ధీరతఁ బూనిన యేనిక
మారజనిస్వనము నన్ను మఱి వడిగొల్వన్,
చేరువ సిద్ధిని గను స్వామ
నోరథ మటు నన్నుఁ బిలుచు నుడికార మనన్. ౨౨

[అందఱు నిష్క్రమింతురు.

ప్రథమాంకము సమాప్తము.

---

ద్వి తీ యాం క ము.

---

[అంతట సంగీతరచన అయి యుండఁగా, ఆసనస్థుఁడు సవయ
స్యుఁడు రాజును, ధారిణియు, పరివ్రాజికయు, విభ
వంబున పరివారంబును ప్రవేశింతురు.]

రాజు.—భగవతీ, పూజ్యు లయిన యీయొజ్జ లిద్దఱిలో ఎవరిప్రయోగమును ముందుగా చూతము?

పరి.—జ్ఞానవృద్ధత్వము ఇరువురకు సమాన మయినను వయోధికత్వముచేత గణదాసుఁడే నిశ్చయముగా పురస్కారమునకుం దగినవాఁడు.

రాజు.—అయిన, మౌద్గల్యుఁడా, ఇట్లని అయ్యగార్లకు ఇరువురకు దెలిపి, నీవు నీపనిని చూచుకొమ్ము.

కంచుకి.—ఏలినవారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

గణ. — (ప్రవేశించి) దేవా, శర్మిష్ఠ రచించినది లయమధ్య చతుష్పదికలను; దాని ప్రయోగమును చతుష్పదవస్తుకమును ఏకాగ్రచిత్తముతో చిత్తగింపఁదగును.

రాజు.—ఒజ్జమీఁదిగౌరవముచేత అవహితుఁడను.

[గణ. నిష్క్రమించును.

రాజు.—(జనాంతికము) వయస్యా!

ఆ. వేషగృహమునందు వెలుఁగుచంద్రాస్యను
గాంచ నెలయు నాదు కన్నుదోయి
తడవు సైఁపలేక తాలిమి వెలి గాఁగఁ
దెరను దొలఁగఁ ద్రోయఁ దివురుఁ బోలె.

విదూ.—(అపవారించి) ఓయి, కన్నులతేనె ఎదుట ఉన్నది. తేనెటీగ కూడా చెంతనే వుంది. కనక జాగ్రత్తగా చూడు.

[అంతట ఆచార్యుఁడు సరిచూచుకొనుచున్న యంగసౌష్ఠవముతో కలది మాళవిక ప్రవేశించును.]

విదూ.—(జనాంతికము) ప్రతిమలో చూచినంతకంటె యీమె శోభ తక్కువ కాదు గదా.

రాజు.—(జనాంతికము) వయస్యుఁడా!

క. చెలిఁ జిత్తరువునఁ గనుచోఁ
దలపోసితి నట్టిసౌరు తలకొన దనుచున్;
దలఁచెద నిప్పుడు శిల్పికిఁ
జెలి వ్రాసెడువేళ బుద్ధి చెదరె నటంచున్.

గణ.—అమ్మాయీ, భయము మాని, సత్త్వ మూని, యుండుము.

రాజు.—అహో! ... సౌందర్యమంతయును ... రూపము

ఎట్లన—

సీ. అక్షులు వాలారు, లాస్యంబు శారద
    రాకా శశి ప్రభా రాజితంబు,
బాహుయుగ్మం బంసభాగంబుల నతంబు,
    చిక్కఁదనము మీఱి యక్కు మెఱయు,
స్తనములు నిబిడోన్నతంబులు, పార్శ్వముల్
    మెఱుఁగు వెట్టినవి నా మెఱుఁగు లీను,
లేఁగౌను పిడికిట డాఁగుమూఁతల నాడుఁ,
    బిఱుఁదిచే జఘనంబు బిరుదశాలి,

తే. అంగుళుల వంపుఁదనముచే నతిశయముగఁ
    బదయుగము సోయగంపుసంపద నహించె;
నెట్టి చందంబు మదిఁ గోరు నట్టువొజ్జ,
    యట్టె తీరైన దనూహా యీయబలవపువు. 3

మాళవిక.—(ఉపవహనము చేసి చతుష్పదవస్తువును పాడుచు.)

(గేయము)

1. వల్లభుండు దుర్లభుఁడు సుమా ;
ఉల్లమ, వా నిపయి యాస నుజ్జగింపుమా ; ॥వల్ల॥

2. ఘోర ! యేటి కదరు చున్నది !
వారక నా కంటిచివర వామకం బిది ! ॥ఘోర॥

3. ఎట్టకేనిఁ గంటి నీతని ;
ఎట్టు వెండి కనఁగ లుగునో యెఱుఁగ నైతిని ; ॥ఎట్ట॥

4. పరుల చేతఁ బడిన దానరా ;
సరసుఁడ నిను వలచి తినిర; సామి, యేలరా. ॥పరు॥

[అని యథారస మభినయించును.

విదూ.—(జనాంతికము) వయస్యుడా, ఈచతుష్పదవస్తువు మిష గా చేసు కొని ఈమె తనను నీకు అర్పించుకొన్నట్టుంది సుమా.

రాజు.—(జనాంతికము) వయస్యా, నాకును అట్లేతోఁచినది. ఈకోమలాంగి.

ఉ. 'ఏలుము సామి, ని న్నలచు నీలువుక త్తైను న న్న'టంచు నా
బాల యురంబు దాఁకికొని పాటకుఁ దో డభినీతి సల్పుచోఁ,
బాళిని దెల్ప దారి కనుపట్టమి ధారిణి చెంత నుంటచేఁ,
బోలఁగ నన్నె వేఁడుకొనఁ బోలును భావిక కైతవంబునన్.

[మాళవిక గీతాంతమున నిష్క్రమింప నుద్యు

విదూ.—ఏ మమ్మా, ఉండు, వరసలో ఒకవిశేషం మఱచిపోయా
దాన్ని నే నడుగుతాను.

గణ.—అమ్మాయీ, నిలువు. ఉపదేశము నిర్దోష మని నిరూపించి

[మాళవిక మరలి ని

రాజు.—(ఆత్మగతము) అహో! ఒక్కొక్క యవస్థయందును సౌం
నకు ఒక్కొక్క శోభావిశేషము కలుగును. ఎట్లనః—

సీ. మణివలయంబులు మనికట్టుమీఁదను
నిశ్చలతం జెంది నెలవుకొనఁగ,
దాఁ కేలిని నితంబతటమునఁ గీలించి,
లాఁతి కేలిఁ బ్రియంగులతికఁబోలె
జాఱంగ విడిచినచాడ్పున నిడికొని,
యడుగునంగుటమున నంతనంత
విరులను మీఁటుచు, వెలఁదుక నెలకట్టు
పయిని మెఱుఁగుఁజూడ్కిఁ బాదుకొల్పి,
తే. నిలువుసామేను తిన్న నై నెగడుచుండ,
నిలిచి యున్నయీతీరు నా నేత్రములకు
న ర్తనము నేఁతయందలి నలువుకన్నఁ
బందు వైసఁగుచునున్నది! భాగ్య మహహా!

దేవి.—ఏమి! గౌతమునిమాట కూడా మీరు సరకు చేయరమా!

గణ.—దేవి, అట్లు గాదు. దేవరమూలముగా గౌతమునికి సూ
దృష్టి యలవడఁగలదు. చూడు.

క. విందునిసాంగత్యంబున
మందుఁడునుఁ మంచిబుద్ధిమంతుండ యగుఁ,
ఇందుపు గింజ బోడుమునుం
బొంది కలుషజలము తేటఁ బొందెడుమాడ్కిఁ. ౬

(విదూషకుం గాంచి) అయ్య అడుగందలఁచినదానిని వినెదము.

విదూ.—(గణదాసుం గాంచి) ముందుగా పరీక్షకురాలిని అడుగు. నేను కనిపట్టిన లోపాన్ని తర్వాత చెప్తాను.

గణ.—భగవతి, గుణమో దోషమో నీవు చూచినది చూచినట్లు చెప్పుము.

పరి.—అంతయు శాస్త్రముప్రకారమున్నది. దోషమేమియు లేదు. ఎట్లన—

సీ. వావిరి వచనగర్భంబులై యంగముల్
సూచించె నర్థంపుఁజొప్పు సరిగ,
అడుగుల నుంచెడుహారువులో నెంతయు
లయయును సరిఁగూడె లలితముగను,
ఆయారసంబుల యభినయంబులయందుఁ
దన్మయత్వం బద్భుతంబు గొలిపె,
శాఖా సముద్భూత సన్నుతాభినయంబు
వరసౌకుమార్య వైభవము నొందె,
తే. అందులవికల్పముల నాడునవసరమున
భావ మెడలించె విషయంబువలననుండి
భావమును, రక్తిమాత్ర మెప్పటివితాన
వఱలె. విశ్రాంతిదనుక నవంధ్యవృత్తి. ౭

గణ.—ఏలినవారియభిప్రాయ మేమో?

రాజు.—మాకు ఇప్పుడు స్వపక్షముమీఁద అభిమానము సడలిపోయినది.

గణ.—ఇప్పుడు నట్టువొజ్జ నయితిని.

క. బంగారగ్నులలో బలె
నంగా నుపదేశ మేది [illegible]

సంగడిని, దానిఁ బండితు
లంగీకరణం బొనర్తు రమలం బనుచుర్.

దేవి.—సంతోషము. పరీక్షకులు మెచ్చడంచేత ఆర్యుడు మిక్కిలి
చున్నాడు.

గణ.—దేవిగారి యవలంబము నాకు వృద్ధిహేతువు. (విదూషకుని
గౌతమయ్యా, ఇప్పుడు చెప్పవయ్యా, నీమనస్సులో నున్న దానిని.

విదూ.—తొలిమాటు ఉపదేశం చూపించేటప్పుడు ఆదిలో బ్రాహ్మ
చేయవలెశివుండెను. దాన్ని మీరు మరచిపోయినారు.

పరి.—అహో! ప్రయోగంపు గు ట్టెఱింగినప్రశ్న!

[అందఱును పకపక నవ్వుదురు. మాళవిక చిఱునవ్వు

రాజు.—(ఆత్మగతము) నాకన్ను తనవిషయమునుండి సారమ
కొన్నది. ఎట్లనఁగా, ఈ కంటికి—

ఆ. ఇంచుకంత గానిపించుపల్వరుసతోఁ
నవ్వు దేఱు విపులనయన మోము
లక్ష్య మయ్యె సామి లక్ష్య కింజల్క మై
విరియుచున్న తమ్మి విరియుఁ బోలె.

గణ.—ఓయి మహాబ్రాహ్మణుఁడా, ఇది తొలుతటి రంగపూజ కా
అగు నేని, అర్చనీయుని నిన్ను ఎట్లు అర్చింపకుందుము.

విదూ.—ఇసీ! నేను తెలివిమాలిన వానకోయిలలాగ పట్టిపురుము
అంతరిక్షాన నీరుత్రాగుతా నని ఆశపడితిని.

పరి.—అట్లే.

విదూ.—అటయితే మరి మూఢజాతికి పండితుల సంతోషమే
గదా. భగవతి యీప్రయోగం చక్కగా వుం దని చెప్పినందున, ఇదుగో
మానం యిస్తాను.

[అని రాజుచేతినుండి కడియమును

దేవి.—ఉండుఉండు. నేర్పులో వార ఎఱుగకుండా నీవు ఎందు క
మిస్తావు?

విదూ.—ఎందు కంటావా? మరి వొకరిదిగదా అని.

దేవి.—(ఆచార్యుని చూచి) అయ్యా, గణదాసయ్యా, మతి
ఉపదేశం చూపడం అయిపోయింది.

గణ.—అమ్మాయీ ఇప్పుడు తరలుము.

[మాళవిక లజ్జతోకూడ నిష్క్రమించును.

విదూ.—(రాజును జూచి జనాంతికము) నిన్ను సేవించడానికి నాకుగల తెలివంతా యింతే.

రాజు.—పరిమితి పెట్టకు, పరిమితి పెట్టకు. ఏలన నిప్పుడు,

తే. ఇందువదనను దెరచీర యెడయఁజేత
నాకుఁ గనుదోయి భాగ్యంబు నష్ట మగుట,
స్వాంతమునఁ బెనుఁబందువు శాంత మగుట,
ముదము వచ్చెడు ద్వారంబు మూఁతపడుట. ౧౦

విదూ.—భళీ! దరిద్రరోగిలాగ నీవు వైద్యుడే ధర్మానికి మందు తెచ్చియియ్యవలెనని ఆశపడుతూ వున్నావు.

హరదత్తుఁడు.—(ప్రవేశించి) దేవరా, నాయుపదేశమును చిత్తగించుటకు ఇప్పుడు ప్రసాదింపవలయును.

రాజు.—(ఆత్మగతము) దర్శనప్రయోజనము నాకు సమాప్త మయినది. (దాక్షిణ్య మవలంబించి, ప్రకాశము) హరదత్తుఁడా, మేమును మిక్కిలి కోరుచునే యున్నాము.

హర.—అనుగృహీతుఁడను.

[నేపథ్యమున]

వైతాళికుఁడు.—దేవరవారికి విజయమగుఁగాక, సూర్యుఁడు మింటినడిమికి ఎక్కియున్నాఁడు. అటు గావుననే—

(స్రగ్ధర)

బావి న్గన్నోడ్చు నంచల్ బడలిక నళినీపత్త్రిసంఛాయలందున్,
తపున్ వీడున్ స్వమున్ మేడలగూఁణిగల వేండ్రంబుచేఁ బావురంబుల్,
త్రావన్బిందూత్కరంబు న్దగ నెమలి భ్రమిద్వారియంత్రంబుఁ జేరున్,
వేవెల్గుల్ నిండఁ బ్రొద్దున్ నిఖిలగుణముల న్నిండునీయట్లు వెల్గున్. ౧౧

విదూ.—అయ్యో? అయ్యో! ప్రభువుకు స్నానభోజనవేళ అయింది. తగినవేళ దాటినట్లైతే మంచిది కా దని వైద్యులు చెప్తారు. ఏమంటావయ్యా హరదత్తుడా?

హర.—ఇఁక, ఏమి చెప్పుటకేని అవకాశ మెక్కడిది?

రాజు.—(హరదత్తునిఁ గాంచి) అటులైన నీయుపదేశమును రేపు చూచెదను. నీవు విశ్రాంతి పొందుము.

హర.—ఏలినవారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

దేవి.—ఆర్యపుత్రుడు మాధ్యాహ్నికవిధిని నిర్వర్తించునుగాక.

విదూ.—దేవి, విశేషంగా పానభోజనం త్వరపర్చు.

పరి.—(లేచి) దేవా, నీకు క్షేమ లగుఁగాక.

[అని పరిజనముతోను దేవితోను కూడ నిష్క్రమించును.

విదూ.—ఏమయ్యో, రూపంలో మాత్రమే గాక, శిల్పంలో కూడా తీయురాలు మాళవిక!

రాజు.—వయస్యుఁడా,

క. భామకు నిసర్గసుందరి
కా మంజుల శిల్పమర్మ మలవడుచుటచేఁ
దామరచూలి యొనర్చెఁ
గామునికి విషాక్త మయినకాండోత్తమమున్.

వే యేల? ఇఁక నాప్రాణములు నీచేతిలో నున్నవి.

విదూ.—నాప్రాణాలున్ను నీచేతిలో వున్నవి. నాకడుపు తీవ్రంగా పెనంలాగ కాలిపోతూవుంది.

రాజు.—నీవును మిత్రార్థము ఇట్లే త్వరపడవలయును.

విదూ.—ఋణం గ్రహించితిని. కాని మొయిలువరుస యడ్డపడ్డ వెన్నెల మాళవిక పరాధీనదర్శనగా వుంది. నీవుం పేనో కసాయిదుకాణంమీద తిరిగే గద్దలాగ ఆమిషలుబ్ధుడ వున్ను పిల్లీ పిరికివాడవున్ను. అందువల్ల అనాతురుడవై కార్యసిద్ధిని ఎదురుచూస్తూ వుంటే బాగా వుంటుంది.

రాజు.—అనాతురుఁడ నెట్లు కాఁగలను? ఏల యన—

క. సకలాంతఃపుర వనితా
వికసద్వ్యాపారములకు విముఖం బగు నా
సకలానురాగమున కా
యకలంకేందుముఖి యొకతె యాస్పద మయ్యెన్.

[అందఱు నిష్క్రమింతురు.

ద్వితీయాంకము సమాప్తము.

## ద్వితీయ తృతీయాంకముల నడుమ ప్రవేశకము.

[అంతట పరివ్రాజికా పరిచారిక ప్రవేశించును.]

పరిచారిక.—నన్ను భగవతి ఆజ్ఞాపించింది. ఏమనంటే—"ఒసే పరభృతికా, ఏలినవారికి చేకానుక ఇయ్యడానికి మాదీఫలాన్ని ఒకదాన్ని తీసుకొనిరావే" అని. అందుకోసం అంతఃపురపు వుద్యానపాలికని మధుకరికని వెతుకుతూ వున్నాను. (పరిక్రమించియు, చూచియు) ఇదుగో మధుకరిక, బంగార పళోకాన్ని చూస్తూ వున్నది. దీనికాడికి వెళ్తాను.

[అంతట ఉద్యానపాలిక ప్రవేశించును.]

పరభృతిక.—(సమీపించి) మధుకరికా, నీకు ఈ వుద్యానపాలనపుపని సుఖంగా వుందా?

మధుకరి.—ఓహో! పరభృతిక! సఖి, నీకు స్వాగతం.

పర.—ఒసే, భగవతి ఆజ్ఞాపించింది.—"చేకానుక ఏమీ లేకుండా మా బోంట్లు ఏలినవారిని దర్శనంచెయ్యడం మర్యాదగాదు. అందుకోసం మాదీఫలంతో దర్శించడానికి కోరుతూవున్నాను" అని.

మధు.—ఒసే, దగ్గిరనే వుందిలేవే మాదీఫలం. మఱి చెప్పు - ఒకరితో ఒకరు ఒరుసుకొంటూవున్న ఆనట్టువొజ్జల యిద్దరిఉపదేశాలు చూచి భగవతి యెవరిని అధికుడని చెప్పింది?

పర.—ఇద్దరున్ను శాస్త్రంలోనూ గట్టివాళ్లే, నేర్పడంలోనూ గట్టివాళ్లే, అయినప్పటికీ శిష్యురాలిగుణాతిశయంచేత గణదాసుడి ఉపదేశమే అతణ్ని అధికుణ్నిగా చేశింది.

మధు.—మరి మాళవికనిగుఱించి అల్ల ఆసంగతి లోకులు యేమనుకొంటూ వున్నారు?

పర.—రాజు దానిమీద విపరీతంగా మర్లుపడివున్నాడు. కేవలం ధారిణీదేవి చిత్తాన్ని కాపాడుకొంటూ తనప్రభుత్వాన్ని చూపకుండా వున్నాడు. మఱి, మాళవిక కూడా యీదినాలలో, రాత్రంతా కొప్పులో పెట్టుకొని తీశివేశిన జాజిదండ లాగ, వళివాళ్లువాడుతూ వుంది. అటుపైన నాకు తెలియదు. నన్ను పంపించు.

మధు.—ఇదుగో ఈకొమ్మలో వేలాడుతూవుంది. మాదీఫలం, తీసుకో.

పర.—(నాట్యముచే గ్రహించి) ఒశే, నీవున్ను ఇంతకన్న మనోహరమయిన దాన్ని సాధుజన శుశ్రూషా ఫలాన్ని పొందు. [అని తరలిగది.

మధు.—సఖి, యిద్దరం కలిశే వెళ్దాం. నేనున్నూ, ఈబంగారపుఅశోకం ఎ ళ్లకు పూవకుండా వుంది, దీనికి దోహదం చేయించమని దేవిగారికి విన్నపించ వస్తా.

పర.—మంచిదే. అది నీ పని గదా. [అని నిష్క్రమించి

ప్రవేశకము సమాప్తము.

---

# తృతీయాంకము.

---

[అంతట కామయమానావస్థుఁడు రాజు విదూషకునితో ప్రవేశించు

రాజు.—(తన్ను చూచుకొని)

మ. దయితాలింగనభాగ్య మబ్బమిఁ గృశత్వం బొందెడుం గాత్ర
నయనం బశ్రులనించుఁ గాత తుణ మైన న్గాంత గన్పట్టమిన్,
ప్రియ ని న్బాయదు డెందమా నిమునమున్ బిభ్యత్కరంగాఁ
కుయ నిర్వాణమ వయ్యె నీ వనయమున్ రాగం గతం బేమొ

విదూ.—వయస్యా, తాలిమి నీవు మానకు. పలవించకు. ఆమాళవికప్రి నెచ్చెలిని వకుళావళికని నేను చూచాను. నీవు చెప్పిపంపిన సమాచారాన్ని చెప్పా

రాజు.—అందుల కేమన్నది?

విదూ.—"ధొరవారితో విన్నపం చెయ్యి. నాకు ఈపని పెట్టినందుకు ఎంతో కృతజ్ఞురాలిని. కాని, మతి, ఇప్పుడు ఆదీనురాలిని రాణీగారు మనసులో జాగర్తగా నాగుబాము కాపాడుతూవుండే మణిలాగ కాపాడుతూ వున్నా అందువల్ల ఎంతమాత్రమూ దగ్గిరికి వెళ్లడానికి వల్లపడకుండా వున్నది. యత్నిస్తా." అని.

రాజు.—ఓభగవంతుఁడా, చిత్తభవుఁడా, ప్రతిబంధవంతము లైన కో మీఁద నామనస్సును నాటించి, యిఁక ఇంచుక సే పయినను ఆఁగలేనియట్లుగా రించుచున్నావు! (ఆశ్చర్యముతో)

ఆ. హృదయమును మథించు నీ వాఁడి నో వేడ!
కోమలమ్ము లీవు ... యొడ!

మృదువు పదనుకన్నఁ బద నన్న సామెత
నీచరిత ననంగ, నిక్క మయ్యె. ౨

విదూ.—అయ్యా, నామాట విను. ఆకార్యాన్ని సాధించడానికి నేను ఉపాయం ప్రయోగించి వున్నాను. కనుక నీవు గుండెదిటవు చేసుకొని వుండు.

రాజు.—నామన స్సేమో ఉచిత మైన పనులమీఁదికి పోతున్నది. మఱి యీ దినశేష మంతయు ఎక్కడ ఎట్లు గడపుదును ?

విదూ.—నిన్ను ఇప్పుడే ఇరావతి వసంతపురాకడ సూచించేవాటిని యెఱ్ఱ అశోకపు మొగ్గలని కానికపంపి వసంతం ఇప్పుడే వచ్చిందనే మిష చేత నిపుణికద్వారా వేడుకొని వుండలేదా ? "ఆర్యపుత్రునితోగూడా ఉయ్యాల యెక్కేవుత్సవం అనుభవించ గోరుతున్నాను," అని. నీవున్ను అందుకు అంగీకరించావు. కనక ప్రమదవనానికే వెళ్దాం రా.

రాజు.—ఇప్పు డది సరిపడదు.

విదూ.—ఎందుచేత ?

రాజు.—వయస్యుఁడా, స్త్రీలు స్వభావనిపుణలు. తన్ను నేను లాలనచేయుచున్నను నీసఖి నామనస్సు మఱియొకతెమీఁద తగుల్కొనియున్న దని కనిపట్టకుండునా ? కావున నాకుఁ దోఁచున దే మనఁగా—

ఆ. ప్రణయభంగ మేని పచరింప.నగుఁ గాని
భంగకారణములు బహుళ మగుటఁ,
దొంటి కెచ్చినను జదురు గాదు లాలన
భావ మెడల మానవతులయెడల. 3

విదూ.—ఈప్రకారంగా రాణివాసాలమీదిదాక్షిణ్యాన్ని ఒక్కమాటుగా వెనకకి నెట్టివేయడం నీకు సరిగాదు.

రాజు.—(ఆలోచించి) అటయినపక్షమున ప్రమదవనమునకే దారి చూపుము.

విదూ.—ఇటురమ్మ, ఇటురమ్మ.

[ఇరువురును పరిక్రమింతురు.

విదూ.—ఇదుగోనయ్యా ప్రమదవనం, గాలికి ఆడుతూవున్న ఆకువేళ్లతో నిన్ను త్వరగా లోపలికి రమ్మని సన్న చేస్తూవున్నట్టు అవుపడుతూవుంది.

రాజు.—(స్పర్శసుఖము నభినయించి) గొప్పపుట్టుక కలవాఁడు సుమా వసంతుఁడు ; వయస్యా, చూడుము.

ఉ. ఆమని జాలిమైఁ జెవుల కామెత యా మదకోకిలధ్వనిన్
'గామరుజన్ సహింతువె సఖా' యని నన్ననుయుక్తి సల్పుచున్
మామిడిపూలచే వలుచు మారుతమున్ నెఱతాఁకుఁజల్వతోఁ
నామెయి దక్షిణంపుఁగయి నా నిడి తా నిమురున్ బలే యటన్.

విదూ.--రా మరి, లోన ప్రవేశిస్తే హాయిగా వుంటుంది.

[ఇరువురును ప్రవేశిం

విదూ.—వయస్యుడా, హెచ్చరికతో కనుపెట్టు. ఇదుగో నిన్ను ... డానికి ప్రమదవనలక్ష్మి ఎలజవ్వనుల యలంకరాన్ని అవమానపరిచే వసంతశృం కారాన్ని ధరించింది.

రాజు.—వింతపడుచు చూచుచున్నాను.

(స్రగ్ధర)

కంకేళ్యుత్ఫుల్లపుష్పాళియరుచి తెగడున్ గమ్మకెమ్మోవిలాస్య
జంకించున్ గండపత్త్రచ్ఛవిని గురవముల్ శ్యామగారారుణ...
సంకోచం బూన్చు భృంగాంజనము తిలకపుష్పంబు కస్తూరిబొ...
శంకింతున్ మాధవశ్రీ సకులవదనభూషన్ సధిక్కార య...

[ఇరువురును ఉద్యానశోభను నిరూ...

[అంతట విరహోత్కంఠిత మాళవిక ప్రవేశించును.]

మాళ.— ఓనిని చిత్త మెఱుగక వలచినందుకు నాయెడలనే నేను ల... వున్నానే, మఱి నాప్రాణసఖులతో ఈగుట్టు చెప్పుకోవడానికి నా... నిబ్బరం యెక్కడిది? ప్రతిక్రియ లేని యీనొప్పి శారికి ఎంతకాలం ... నన్ను అగ్గించేస్తాడో ఎఱగనే! (కొన్ని యడుగులు నడచి) ఎక్కడికి ... తిని? (ఆలోచించుకొని) ఆ! జ్ఞాపకం వచ్చింది! దేవి అనతిచ్చిందిగదా "... కు చేష్ట చేత ఉయ్యాలనుంచి జాఱిపడినందున నాయడుగులో నొప్పిపట్టుకొన్న... వల్ల బంగారపు అశోకానికి దోహదాన్ని నీవు నెఱవేర్చు. అది గనక అయి... లోపల పువ్వు చూపెనా, అంతట నేను (అని నడుమ నిట్టూర్పు నిగిడించి) ... తీరే పసదనం ఇస్తాను." అని. కనుక ముందుగా ఆపనియెక్కడో ... వెళ్తాను. నావెంటనే నాచరణాలంకారం చేతపట్టుకొని వకుళావళిక వ... గడియసేపు జంకు లేకుండా ... వుంటాను. [అని పరి...

విదూ.—(చూచి) భళీ! భళీ? వహావ్వా వహావ్వా! యిదుగో సారాయి తాగి మొగం మొత్తిన వాడికి చక్కెర దొరికింది!

రాజు.—ఆహా! ఏమి యిది?

విదూ.—ఇదుగో యీమె మాళవిక అంత యెక్కువగాని వేషంతో విరహార్తురాలుగా ఒంటరిగా సమీపాననే వున్నది.

రాజు.—(సంతోషముతో) ఏమీ? మాళవికయా?

విదూ.—అవును.

రాజు.—ఇప్పుడు ప్రాణమును నిలుపుకొనుట శక్యము.

తే. నీవలన విని చెలి చెంతనే కల దని
యూఱడిల్లితి నెదలోని యుల్కు దీఱి,
బెగ్గురురుతంబుచే దరువృత నెఱింగి
ధునిని దృష్ణాతురుండు పాంథుండువోలె. ౬

మఱి ఎక్కడ ప్రాణేశ్వరి?

విదూ.—ఈమె చెట్ల చాలునడచునుంచి వెడలి యిక్కడికే వస్తూ వున్నదని తోస్తున్నది.

రాజు.—వయస్యా, ఈ మహానుభావురాలిని చూచుచున్నాను.

క. అతివిపులము జఘనస్థలి,
నతిదీర్ఘము కన్నుదోయి, నవలగ్నమునం
దతికృశము, చన్నుఁగవయం
దతి తుంగము, నాదు జీవ మదె యరుదెంచెన్. ౭

వయస్యా, మునుపటికిని ఇప్పటికిని చాల మాఱినది యీ మానవతి. ఎట్లనఁగా—

క. శర కాండ పాండు గండయుఁ
బరిమిత భూషణయు బాల పరిశోభిల్లున్,
సురభి పరిణత పలాశయు,
బరిమిత సుమయు నగు కుందవల్లియుఁ బోలెన్. ౮

విదూ.—ఈమెకున్ను నీకువలెనే వలరాచవ్యాధి సోకిం దనుకొంటాను.

రాజు.—స్నే[illegible] నల్లు [illegible]

మాళ.—ఇదే సుకుమార దోహదానికోసము ఆశపెట్టుకొని పూతపూ దాల్పక వున్న ఆ యశోకము ఉత్కంఠితురాలిని నన్ను పోలివున్నది. దట్ట దీని చల్లని నీడలో ఱాతిపలకమీద కూర్చుండి దుఃఖశాంతి చేసుకొంటా

విదూ.—విన్నావటోయి "ఉత్కంఠితురాలిని" అని ఆమె పలికినమా

రాజు.—ఇంతమాత్రానికే నీయూహ సరి యని నేను తలంపను. యనఁగా.—

క. గోరంటపుప్వాడివ్రొథలు
పూరితములు నవకిసాల పుటముల తడిచేఁ
గారణము లేకయే మదిఁ
గోరిక లూరించు మలయ కుధరానిలముల్.

[మాళవిక కూర్చు

రాజు.—మనమును ఇచట తీవగుబురుచాటునుండి విందము.

విదూ.—అదుగో దూరాన ఇరావతిలాగ అగపడుతూ వుంది.

రాజు.—తమ్మితీఁగను గనుచున్న యేనుఁగు మొసలిని ఎన్నదుగదా.

[అని చూచుచు

మాళ.—హృదయమా, నెఱవేఱేదారి లేనటువంటి యీకోరికచే ఎందుకు నన్నిక్కి ఆయాసపెడతావు!

[విదూషకుఁడు రాజును వి

రాజు.—(ఆత్మగతము) ప్రేయసీ, అనురాగంపువక్రతం బరికింపుమ.

తే. ఎవనికై విరాళి నెరియుదో చెప్పవు,
తత్త్వ మబ్బు మానుఁ దర్కమునకు;
అట్లయినను దలఁతు నబ్జాక్షి నీ విట్లు
వనరు టెల్ల నన్నె వలచి యనుచు.

విదూ.—ఇప్పుడే నీసందేహం తీరుతుందిపో. ఇదుగో, నీవు చెప్పి ముదలవార్తను తీసుకొని వకుళావళిక ఈయేకాంతాన వచ్చివుంది సుమా.

రాజు.—మాప్రార్థనను స్మరించునా?

విదూ.—ఏమీ! ఈలంజెకూతురు ఘనమైన నీవార్తని మరచి నేను కూడా ఇప్పుడు మరచ్చలేదా?

[అంతట చరణాలంకారము చేతఁగొని వకుళావళిక ప్రవేశించును.]

వకుళావళిక.—సఖి, నీవు సుఖమా ?

మాళ. — అమ్మో! వకుళావళిక! సఖి వకుళావళికా, నీకు స్వాగతం. కూర్చుండు.

వకు.—(కూర్చుండి) సఖి, నీవు ఇందుకు సంపూర్ణంగా యోగ్యురాల వని దేవిగారు నీకు ఈపని పెట్టినారు. ఒకకాలు నాకేసి చాపు; దానికి లత్తుకతో పారాణి పూసి అందె పెడతాను.

మాళ.— (స్వగతము) హృదయమా, ఈవిభవం వచ్చిం దని నీకు సుఖ మెక్కడిది? దీన్ని ఏలాగ తప్పించుకోగలను? కానీ, ఇదే నాకు మృత్యుమండనం కాగలదు.

వకుళా.—ఏమి ఆలోచిస్తున్నావు! ఈబంగారపు అశోకపు పూతకోసము దేవి ఉవ్విళ్లూరుతున్నదిగదా.

రాజు.—ఏమి! అశోకదోహదము నిమిత్తమా ఈవ్యాపారము!

విదూ.—ఏమీ! కారణం లేకుండానే దేవి అంతఃపురాలంకారాన్ని ఈమెకి తొడిగిస్తుం దనుకున్నావా ?

మాళ.—(పాదమును చాఁచి) సఖీ, ఈతప్పు క్షమించు.

వకు.—సఖీ, నాశరీరానవు గదా.

[నాట్యముచేత చరణసంస్కారము గావించును.

రాజు.—

క. పరికింపుము సఖ, సార్ద్రిను
జరణాంత న్యస్త రాగచర్చారేఖన్,
హర దగ్ధ మనోజ తరు
స్ఫురి తాదిమ పల్లవ ప్రసూతిం బోలెన్. ౧౧

విదూ.—చరణానికి తగిన పనిని సుమా ఈమహానుభావురాలికి దేవి పెట్టినది.

రాజు.—చక్కఁగా చెప్పితివి వయస్యా.

ఉ. బాలిక యావకార్ద్రిమును బాలకిసాలసరాగమున్ నఖ ౧౨
శ్రీలసితంబు నా పదముచేతను దాఁప వలంతి యిర్వురన్:
పూలకు వెల్తి యైన తటిమొండి నశోకుని దోహదోత్కునిన్
మాళిఁ బదానఁ జేర్చి బతిమాలెడు కాంతుని నార్ద్రిమంతునిన్.

విదూ.—ఈమెరయెడఁ దప్పు గావించుటకు నోచియే వున్నాను.

రాజు.—సిద్ధిదర్శి యైన బ్రాహ్మణునివచనమును పరిగ్రహించితిని.

[అంతట సారాలుచే కైపుకొన్నదై ఇరావతి చేటితోఁగూడ ప్రవేశించును.]

ఇరావతి.—ఒసే, నిపుణికా, తలుచుగా, వింటును గదా. కైపు విశేషాలంకార మని. ఆలోకవాదము సత్యమేనా?

నిపుణిక.—మొదట లోకవాదంగానే వుండినది. నేడు మరి అయింది.

ఇరా.—నెయ్యాన పలకకు. ధొరవారు ముందుగానే ఉయ్యాల వెళ్లివున్నా రని యిప్పుడు నీ కేలాగ తెలిశింది?

నిపు.—దొరసానిగారిమీద అఖండిత మైనప్రేమచేతను.

ఇరా.—సేవ మాను. మధ్యస్థురాలవుగా పలుకు.

నిపు.—వసంతనైవేద్యానికి ఆశపెట్టుకొని వున్న గౌతమయ్య చెప్పి దొరసానిగారు త్వరగా నడవండి.

ఇరా.—(అవస్థకు తగినట్లు పరిక్రమించుచు) కైపుచేత సోలిపోతూ నన్ను ఆర్యపుత్త్రుని దరిసెనానికోసం హృదయం త్వరపెడుతూ వుంది; గా గులు ముందుకు ఆడకుండా వున్నవి.

నిపు.—ఇంకేమి! ఉయ్యాలయింటికి రానే వచ్చినాము.

ఇరా.—ఇక్కడ ఆర్యపుత్రుడు లేడే!

నిపు.—దొరసానిగారు జాగర్తగా చూడండి. వేళాకోళంకోసం ధొ ఎక్కడైనా దాంకొని వుండేని. ప్రేంకణపుతీగలు చుట్టూరా కమ్ము అశోకమున్ను రాతితిన్నెయున్ను గల యీ ఆవరణంలో మనమున్ను ప్రవేశిం

ఇరా.—అలాగే.

నిపు.—(చూచి) చూడండి దొరసానిగారూ, చూడండి. మామిడి వెతుకుతూవున్న మనలని చీమలు కుట్టినవి.

ఇరా.—ఇదేమి యిది!

నిపు.—ఇదే వకుళావళిక అశోకవృక్షంనీడలో మాళవికకి పాదాన్ని రిస్తూ వుంది.

ఇరా.—(శంక నభినయించి) ఇంత వైభవం మాళవిక కెక్కడిది! తోస్తుంది?

నిపు.—నాకు తోస్తుందీ - ఉయ్యాలనుంచి జారిపడి కాలు బెణికి దేవి అశోకదోహదానికి మాళవికని నియమించిం దని. అలాగ కాకపోతే, దేవి తాను పెట్టుకొనే అందెలజతని ఎందుకోసం పరిజనాన్ని పెట్టుకో నిస్తుంది.

ఇరా.—ఒక గొప్ప ఊహ నాకు పొడకట్టుతూ వుంది?

నిపు.—మరి ధొరవారిని వెదక వేమి?

ఇరా.—ఒకే, నా అడుగులు ఎటూ కదలకున్నవి. నా మనస్సులో గొప్ప చింత ఒకటి బాధిస్తూ వుంది. కలిగిన సందేహానికి పర్యవసానం కనుక్కొంటాను. (మాళవికను చూచి ఆత్మగతము) నా మనస్సులోని భయము న్యాయమే గదా.

వకు.—(అడుగును చూపుచు) సఖీ! ఈపారాణిరచన నీకు అందంగా వుందా?

మాళ.—నా పాదములోని దని దీన్ని పొగడడానికి లజ్జపడుతూవున్నాను. ఈ యలంకరణశిల్పాన్ని ఎవరి దగ్గిర నేర్చుకొన్నావు?

వకు.—ఈ విద్యలో నేను దొరవారిశిష్యురాలిని.

విదూ.—లేవోయి తే, తటాలున వెళ్లి గురు దక్షిణ అడుగు.

మాళ.—అయినప్పటికి నీకు గర్వం కలగలేదు. అందుకు నాకు సంతోషం.

నిపు.—ఉపదేశానికి తగిన అడుగుదమ్ములు దొరికినందున, ఇప్పుడు గర్వము వహిస్తాను. (స్వగతము) బళీ నాదూత్యము నెఱవేరింది. (ప్రకాశము, రాగచర్చను చూచి) సఖి, ఇప్పటికి నీకు ఒకచరణానికి పారాణిరచన ముగిశింది, ఇకను నోటితో వూది తడి ఆర్పడమే తరవాయి. వూదడం యెందుకులే, ఈచోట గాలి బలంగా వున్నది.

రాజు.—వయస్యుడా, చూడు చూడు.

ఆ. ఆర్ద్రిలాక్షతోడి యడుగుఁగెందామర
నాస్యమారుతమున నారఁ జేత
దొరకె నిపుడు నాకుఁ దొలియవకాశంబు
సేవ సేసి దయితచిత్త మెుంద. ౧౩

విదూ.—ఇందుకై నీకు సెగు లేల? చిరకాలం నివు దీన్ని క్రమంగా అనుభవిస్తావులే.

వకు.—సఖీ, నూఱురేకుల యెఱ్ఱదామరలాగ నీ చరణం శోభిస్తూ వున్నది. తప్పక ధొరవారి ఒడిలో దొర్లు.

[ఇరావతి నిపుణికముఖమును చూచును.

రాజు.—ఇది నాకు దీవన.

మాళ.—సఖి, అనగూడనిమాట అన్నావు.

వకు.—అనవలసినమాటనే నే నంటిని.

మాల.—నీకు నేను ప్రియని గదా.

వకు.—నాకు మాత్రమే గాదు.

మాళ.—మఱి యింకా యెవరికి ?

వకు.—గుణములయందు దృఢానురాగము గల దొరవారికి కూడా.

మాళ.—అనృతం పలుకుతూ వున్నావు ; ఇదే నాలో లేనిది.

వకు.—సత్యము; నీలో లేదు, కృశించి పాలిపోయిన దొరవారి సుశ్రా వములలో కనబడుతూ వున్నది.

ఇరా.—ఈచెడిబదికినది నేను మొదట అనుకొన్నట్లే ఉత్తరము చెప్పి

వకు.— అనురాగమును అనురాగముచేత పరీక్షించవలెనం దనే వ నాన్ని ప్రమాణీకరించు.

మాళ.—ఏమి నీయిచ్ఛయే ప్రమాణంగా పలుకుతున్నావా ?

వకు.—కాదు కాదు; ఇవి వలపుచేత తియ్యనివి ఏలినవారినోటినుండి మఱియొకనోటినుండి నీచెవిని పడుతూవున్నవి.

మాళ.—సఖీ, దేవిని తలచుకొంటే నాహృదయము నమ్మకుండా

వకు.—ఓసి గోలా, తుమ్మెద కుడుతుం దని వసంతావతార సూచకమైన మామిడిపుష్పాన్ని రసికులు అవతంసించుకోరా ?

మాల.—ఈయిక్కట్టులో నీవే నాకు అత్యంతసహాయవు కావలెను.

వకు.—నలిపినకొలదీ పరిమళించేదాన్ని వకుళావళికని గానా నేను.

రాజు.—బళి, వకుళావళికా, బళి !

ఆ. భావ మాది నెఱిఁగి, ప్రస్తావముం దెచ్చి,
నెట్టివైచినంత నేర్చి పలికి,
తననిదేశమందు స్థాపించె నిది చెలిఁ ;
కామియుసురు దూతికరగతంబు.

ఇరా.—ఒసీ, చూడుచూడు, వకుళావళిక మాళవికని తేనిన గానే లాగు చేయనే చేసింది.

నిపు.—[illegible]ట్టిని, వలసిరగనివారికైనా వుపదేశం వలపు పుట్టిస్తుంది

ఇరా.—మరి నామనస్సులో కలిగినశంక యిప్పటికి తార్కాణపడ్డదిగదా? సుట్టు కనుక్కొని తర్వాత పైయెత్తు ఆలోచిస్తాను.

వకు.—ఇదుగో నీరెండో అడుగు కూడా అలంకరించినాను; ఇప్పుడు వీటికి రెంటికి అందెలు తొడుగుతాను. (అందెలజతను తొడుగుట నభినయించి) సఖీ, లే, అశోకం పూచేలాగ దేవిగారిపంపు నెఱవేర్చు.

[ఇరువురు లేతురు.

నిపు.—'దేవిగారిపంపు' అన్నమాట ఇప్పుడు విన్నావా?

వకు.—ఇదే ఎదటనే రాగ మెక్కి ఉపభోగానికి తగి కనబడుతూ ఉండ లేదా?

మాళ.—ఏమి! ఏలినవారా?

వకు.—ఏలినవారు గారు; అశోకపుకొమ్మలో వేలాడుతూవున్న దే చివురుగుత్తి. దానిని కొనచెవిని పెట్టుకో.

విదూ.—విన్నావటయ్యా.

రాజు.—మిత్రుడా, కాముకులకు ఇంతపాటి చాలును.

క. దొరకొన్నను సంగ మనా
తురోత్సుకుల కేను మదిని దుష్టిగొనఁ; బర
స్పరసంగనిరాశులకుఁ
శరీరలయ మేని మేలు సమరాగులకుఁ. ౧౭

[మాళవిక పల్లవావసంతము దాల్చి అశోకవృక్షముమీఁదికి
సలీలముగా పాదమును నిగుడ్చును.]

రాజు.—వయస్యా,

ఆ. శ్రవణపల్లవము తరువునుండి కైకొని
పదము నుంచెఁ దరువుపయిని బాల;
ఇరువు రిట్లు వీరు సరిబేర మీఁడేర్ప
వంచితుండ నే నటంచుఁ దలఁతు. ౧౮

వకు.—సఖి! నీదోషము గాదు. ఇటువంటి చరణసత్కారం పొందిన్ని ఈయశోకము పూవక ఆలస్యము చేస్తే, ఇదే గుణహీనము.

రాజు.—

చ. నవశతపత్త్రకోమలమునన్ మణిహంసకనాదితంబునన్
దివిజపథావలగ్ననఖదీప్రపదంబున సత్కృతుండ వై,
పువుల నశోక, తత్క్షణమ పూవవయేని కృతార్థకామికిం
దవు వరదోహదంబును వృథా హరియించెదు దైవదుష్కృతిన్.

వయస్యుఁడా, వచనప్రసక్తితోఁ గూడ ప్రవేశింపఁగోరెద.

విదూ.—రా. ఈమెను హేళనము చేస్తాను.

[ఇరువురు ప్రవేశము చేయు

నిపు.—భట్టిని, దొరవారున్ను ఇక్కడనే ప్రవేశిస్తూ వున్నారు.

ఇరా.—ఇదే మొదటనే నేను హృదయంలో శంకించినది.

విదూ.—ఏమమ్మా, ఇది మంచిపనేనా యేలినవారి యాప్రియవయస్యుణ్ని ... కాలితో తన్నడం?

ఇరువురు—(తొట్రుపాటుతో) అహా ఏలినవారు!

విదూ.—వకుళావళికా, నీవు తెలిసినదానవుగదా, నీచెలిని యిటువంటి ... చేయకుండా నీవెందుకు మాన్పినావు గావు?

[మాళవిక భయమును నటిం

నిపు.—భట్టినీ, గౌతమయ్య ఏమి ఆరంభించాడో చూడు.

ఇరా.—ఈకులంకక్కువ బాపనవాడు మరేయేలాగ బతుకుతాడు!

వకు.—ఆర్యా, ఈమె దేవిగారియాజ్ఞని నెఱవేలుస్తూవున్నది. ... చెయ్యడంలో ఈమె స్వతంత్రురాలు గాదు. ఏలినవారు మన్నించవలెను.

[అని తనతోకూడ మాళవికను రాజునకు చాఁగిలఁబడఁజేయు

రాజు.—అట్లయినయెడల తప్పులేదు. కల్యాణీ, లెమ్ము.

[చేయిపట్టుకొని లే

విదూ.—అయితే సరే, దేవిగారిమాటని గౌరవించవలిశింది.

రాజు.—(నిహసించి)

క. బెరయింప నో విలాసిని,
పరుషతరం బయిన పాదప స్కంధమునన్
కరభోరువ వామము నీ
చరణ మిపుడు నొవదో కిసల మృదువు గదున్.

[మాళవిక లజ్జ నభినయించు

ఇరా.—అహో ! ఎంత దుర్వినీతహృదయుడు ఆర్యపుత్రుడు !

మాళ.—వకుళావళికా, రా, దేవిగారికి పసుపును నెఱవేర్చితి మని విన్నపం చేతాము.

వకు.—అటయితే, 'నాకు సెలవిండు' అని యేలినవారితో విన్నవించుకొమ్ము.

రాజు.—కల్యాణీ, వెళ్లుదువు గాని; మఱి, అవసరప్రాప్తమయిన నాయాచనను కూడ వినుము.

వకు.—అక్కఱతో విను. ఆనతియ్యి దేవా,

రాజు.—

క. చిరముగఁ బ్రమదపువిరిఁ గిం
కరుఁ డితఁడును దాల్పఁ గనఁడు కల్యాణినిగో,
నెరపుము స్పర్శామృత మని
తరరుచి కితనికిని దోహదవిధానమునన్. ౧౯

ఇరా.—(తటాలున సమీపించి) నెరపు నెరపు. అశోకం పువ్వులు చూపుతుందో లేదో, ఇత డైతేనో పువ్వులు ఫలములూ కూడా !

[అందఱు ఇరావతిం గని తబ్బిబ్బగుదురు.

రాజు.—వయస్యా, ఇప్పు డేమి యుపాయము ?

విదూ.—వేరే యే ముంది ? పిక్కబలమే.

ఇరా.— వకుళావళికా, నీవు నేర్పుతోనే ఆరంభించినావు. మాళవికా, నీవున్ను ఆర్యపుత్రునికోర్కెని తీర్చు.

ఇరువురు.—మమ్మ మన్నించు భట్టినీ. ఏలినవారి ప్రీతిని అంగీకరించడానికి మే మెవ్వరము ?

[అని నిష్క్రమింతురు.

ఇరా.—అహో ! మగవారిని నమ్మరాదు గదా. నేను వేటగాడికి పాటచే చిక్కుకొన్న లేడిలాగ నిశ్శంకనై నా కయిన మోసాన్ని కొన నైతిని.

విదూ.—(జనాంతికము) ఇప్పు డే దయినా తగిన పన్నాగం బదులు పన్ను. మ రే ముంది, పనిలో పట్టుపడ్డదొంగ కన్నం వేయడం నేర్చుకొంటూవున్నా నని చెప్పవలసివుంటుంది.

రాజు.— సుందరి, నాకు మాళవికవలన ఏప్రయోజనమును లేదు. నీవు చాల సేపు విలంబము చేయుచున్నందున ఏదో విధముగా వినోదించుచుంటిని.

ఇరా.— ఆర్యపుత్రునికి ఇట్టివినోదవస్తువు దొరికిందని నేనెఱక్కపోతిని, ఎఱిగేవుంటే మందభాగ్యురాలిని యీలాగు చేసివుందును.

విదూ.—అట్లనకు. మహనీయురాలవు నీవు మహనీయు డైనయీతని న్యాయానికి భంగం పలకడం తగునా? యదృచ్ఛగా తారసిల్లిన దేవేరిపరిజనంతో యినా కూడ దండువేని, అందుకు న్యాయము నీవే చెప్పాదువుగాక.

ఇరా.—సరే సంకథ కానియ్యండి, ఏల న న్నాయాసపెట్టుకోవడం!

[అని కోపగించి పోవ

రాజు.—(అనుసరించుచు) క్షమింపుము రమణిరో, క్షమింపుము.

[ఇరావతి మొలనూలు జాటి చరణములకు చుట్టుకొన్నను పోవుచునే యుం

రాజు.—సుందరి, అనురక్తుని విషయమున ఈనిరపేక్షత తగదు సుమా.

ఇరా.—శఠా, నీహృదయాన్ని నమ్మరాదు.

రాజు.—

క. పరిచితుఁడఁ గాన నన్నుఁ
నిరసింతువుగాక శఠుఁ డని దయితరో, నీ
చరణముల వ్రాలి మేఖల
నిరతిఁ వేఁడినను గినుక నీఁగమి తగవే?

ఇరా.—ఈహతాళయు నీపక్షమే అవలంబించినది.

[అని మొలనూలిం గైకొని దానితో రాజును కొట్ట నుం

రాజు.—వయస్యా, నిశ్చయముగా ఈతరుణి—

చ. దరిఁ గొనుకిన్కఁ గానమి నితంబతటీపరినష్టమైన బం
గరురశనాగుణంబునను గాటముగా నను జండి వ్రేయగా
దొరఁకొనె, బాష్పవారిజడి తోరముగాఁ గురియంగ, వి
ధురుని వలాహకావళి శతహ్రదతోఁ బ్రహరించుచాడ్పు

ఇరా.—ఏమి ! మళ్లీ నన్ను అపరాధను చెయ్యగలవా?

[అని రశనను చేతితో అ

రాజు.—

ఆ. సాపరాధుమీఁద మాపు సేసెద వేల
యుద్యతంబు దండ మురగవేణి?
విలసితమును నీవు విరివి గావించెదు
దాసజనముమీఁద డాల్చి కినుక.

నిశ్చయముగా ఇదిగో అనుజ్ఞ యిచ్చితివి. [అని పాదములలో వ్రాలును.

ఇరా.—ఇవి మాళవికచరణాలు గావు. అవి నీకు స్పర్శదోహదాన్ని పూరిస్తవి.

[అని చేటికతో నిష్క్రమించును.

విదూ.—లేవోయి లే. నిన్ను క్షమించినది.

రాజు.—(లేచి ఇరావతిని గానక) ఏమి! ప్రియ పోనే పోయినదే!

విదూ.—వయస్యా, నీపుణ్యం మంచిది! ఈతప్పితాని కైన నిర్బంధాన్ని వేలుపులు ఇప్పటికి తొలగించినారు. కనక మనము వెంటనే ఆవలికి నడుతము, మళ్లీ ఆమె అంగారకుడు రాశికి ఏలాగో ఆలాగు ఇక్కడికి అనువక్రము చేసినా చేసేని.

రాజు.—అహో! మదనుని విషమత్వము!

క. చెలి నామది ముచ్చిలుటన్
దలఁతు నితర ప్రణతిలంఘనము నుపకృతిగాన్;
వల పిట్లు వెట్టిగొను నా
కలికి నుపేక్షింపఁ గోపకలుషితఁ దగునే. ౨౩

[అని అందఱు నిష్క్రమింతురు.

తృతీయాంకము సమాప్తము.

---

# చ తు ర్థా ం క ము.

---

[అంతట పర్యుత్సుకుఁడు రాజు ప్రతీహారితో ప్రవేశించును.]

రాజు.—(ఆత్మగతము)

చ. వినుకలి నైనబాలపయిప్రేముడిచేతను బద్ధమూల మై,
కనులకుఁ దోఁచినంతట నికామపురాగముచేఁ జిగిర్చియున్,
దనువును గేలనంటినకతంబున నున్బులకాళి నన్చియున్,
బొనరుచుఁ గాత నన్ను స్మరభూజము క్లాంతు ఫలోపభోక్తగాన్. ౧

(ప్రకాశము) సఖుఁడా, గౌతముఁడా,

ప్రతీహారి.—జయము జయము ఏలినవారికి. గౌతమయ్య ఇక్కడ లేడు.

రాజు.—(ఆత్మగతము) ఆ! మాళవిక వృత్తాంతమును తెలిసికొని రమ్మని పంపితిని.

విదూషకుఁడు.—(ప్రవేశించి) నీకు జయ మగుఁగాక.

రాజు.—జయసేనా, దేవి ధారిణి ఎక్కడనున్నదో, పాదము నొప్పి ప్రతిక్రియ జరుగుచున్నదో తెలిసికొని రమ్ము.

ప్రతీ.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాజు.—గౌతమా, నీ చెలి శ్రీమతి మాళవిక వృత్తాంతము ఏమి?

విదూ.—పిల్లిచేత బడిన కోకిల వృత్తాంతమే.

రాజు.—(విషాదముతో) వివరము చెప్పు.

విదూ.—పాపము! ఆమెని ఆపింగళాక్షి సారభాండభూమిగృహ మృత్యుముఖంలో లాగున వేసినది.

రాజు.—ఏమి! నా సంపర్కము పొంది—

విదూ.—అవును.

రాజు.—గౌతమా, ఎవరు మాకు ప్రతికూలురు, ఈ విధముగా దేవిని ... చేసినవారు?

విదూ.—వినవయ్యా మఱి, నాకు పరివ్రాజిక చెప్పింది. నిన్న ఇరావతి గారిని కాలినొప్పి కొంచెం నిమ్మళంగా వున్నదా అని అడగడానికి వచ్చింది.

రాజు.—అంతట అంతట?

విదూ.—అప్పుడు దేవి ఆమెని అడిగింది: —'వల్లభజనాన్ని చూచితివా' అని. ఆమె బదులు చెప్పింది.—'ఏల నీ యుపచారపుమాటలు! వల్లభత్వం ... పరిజనం పాలయిం దని యెఱుగవు.'

రాజు.—పేరు గూర్పకపోయినను ఈ ప్రస్తావము మాళవికను గూర్చి నాకు శంక వొడముచున్నది. తర్వాత ర్వాత?

విదూ.—అంతట రాణిగా రడిగినకొలిదీ ఇరావతి నీదుండగమంతా గారికి స్పష్టంగా శ్రుతపరిచింది.

రాజు.—అహో! ఆమానవతికి ఏమి దీర్ఘరోషము! తర్వాత ఏ మయింది అదియును జెప్పుము.

విదూ.—తర్వాత నా చెప్పవలశిం దే ముంది? మాళవికానున్న బకుళావళి కానున్న బేడీలు పడి నాగకన్యకలలాగ సూర్యకిరణం యెరగని పాతాళవాసం అనుభవిస్తూవున్నారు.

రాజు.—కట్టా కట్టా!

క. అమృతస్వరలఁ బరభృతఁ
భ్రమరికను విబుద్ధమాత పరిలంపలలఁ

ద్రుమరంధ్రంబునఁ ద్రోచెన
సమయపువృష్టి సపురోగ ఝుంఝు కటకటా! ౨

ఇందు ఏ మేని ఉపాయమునకు అవకాశ ముండునా ?

విదూ.—ఎట్లుంటుంది ? అ దేమనగా, సారభాండగృహంలో కాపుండేదానికి మాధవికకి దేవి యీలాగ చెప్పిపంపింది.—"నావుంగరపు ముద్రని చూడకుండా నీవు ఈ హతాశలని మాళవికని వకుళావళికని వదలకు." అని.

రాజు.—(నిట్టూర్పు నిగిడించి సపరామర్శముగా) మిత్రమా, ఇందు ఏ మేని ఉపాయము కలదా ?

విదూ.—కలదు.

రాజు.—ఎట్టిది ?

విదూ.—(సదృష్టిక్షేపము) ఎవరైనా కనబడకుండా వుండి వినగలరు. నీ చెవిలో చెప్తాను. (డగ్గఱి) ఇట్లు ఇట్లు.

రాజు.—మంచిదే, ప్రయోగించి సాధింపుము.

ప్రతీహారి.—(ప్రవేశించి) దేవా, దేవిగారు ప్రవాతశయ్యలోకూర్చున్నారు. పాదానికి ఎఱ్ఱగంధంపూత పూసివున్నారు. పరిజనము దాన్ని చేతులో పెట్టుకొని వున్నది. భగవతి కథలు చెపుతూ దేవిగారిని వినోదపెడుతూ వుంది.

రాజు.—మేము ప్రవేశించుటకు తగినదే యీ సమయము.

విదూ.—అయ్యా నీవు వెళ్లు; నేనున్ను దేవిగారిని దర్శించడానికి పండేదైనా కానిక తెస్తాను.

రాజు.—మఱి జయసేనకు తెలియఁబఱిచి వెళ్లు.

విదూ.—ఆలాగే. అమ్మా, (చెవిలో) ఈలాగ. [అని నిష్క్రమించును.

రాజు.—అటయిన ప్రవాతశయ్యకు దారి చూపు.

ప్రతీ.—దేవరవారు ఇటు ఇటు.

[అంతట శయనస్థ యైనదేవియు, పరివ్రాజికయు, విభవముగా
పరివారమును ప్రవేశింతురు.]

దేవి.—భగవతి, కథావస్తువు అతి రమణీయంగా వున్నది. తర్వాత మఱి?

పరి.—(కన్నుగీటుచు) పయిది తర్వాత చెప్పెదను. అదె మహానుభావుఁడు విదిశానాథుఁడు విజయంచేసినాఁడు.

దేవి.—అహో! ఆర్యపుత్రుఁడు! [... లేవం గోరును.

రాజు.—ఉపచారముకై అలయిక వలదు.

క. అందె విడఁ దగనియడుగుం
బొందమ్మిని హేమపీఠిఁ బొనరినదానిన్
సుందరి, నన్నును నిట్లేఁ
చం దగ దీయుగ్మమును రుజాపరిగతమున్.

దేవి.—జయము ఆర్యపుత్రునికి.

పరి.—దేవా, విజయివి గమ్ము.

రాజు.—(పరివ్రాజికకు నమస్కరించి కూర్చుండి) దేవీ, నొప్పి సయఁస
యున్నదా ?

దేవి.—మునపటికంటె సహ్యంగా వుంది.

[అంతట జన్నిదముతో బొట్టనవ్రేలిని బిగియఁ జుట్టుకొని
వేగిరపాటున విదూషకుఁడు ప్రవేశించును.]

విదూ.—కావు కావు దేవా, సర్పరూపి మృత్యువు నన్ను కరిచినది.

[అందఱును దిగులు అభినయిం

రాజు.—కటకటా కటకటా! ఎక్కడ తిరుగు చుంటివి?

విదూ.—దేవిగారిని దర్శించడానికి ఆచారపు చేకానుకపువ్వుకోసం ప్ర
వనానికి వెళ్లితిని.

దేవి.—అయ్యో ! అయ్యో ! నేనే బ్రాహ్మడికి ప్రాణసందేహానికి గ
అయితిని.

విదూ.—మఱి అశోకపుపూగుత్తికోసం చేతికొన సాపగానే సర్ప
యముడు నన్ను కరిచినాడు. ఇల్లివిగో రెండు కోరకాట్లు. [అని చూ

పరి.—అయితేను, కాటును కోసివైచుట మొదటిపని, అని చెప్పుదురు. మఱి
ఇతనికి ఆపని చేయుఁడు.

రాజు.—భగవతీ,

ఆ. కాటుఁ గోయుటేని కాల్చివైచుటయేని,
గంటినుండి నల్లఁ గార్చుటేని,
దంశనంబు గల్గు తత్క్షణంబున నైనఁ
ప్రాణరక్షణకు సుపాయము లవి.

ఇప్పుడు మతి విషవైద్యులపని. జయసేనా, తటాలున ధ్రువసిద్ధిని రప్పింపుము.

ప్రతీ.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

విదూ.—అయ్యో ! పాపి మృత్యువు నన్ను మింగివేశిందే !

రాజు.—ఆ! భయపడకు. కాటునకు విష మెక్కకపోవుటయుం గలదు.

విదూ.—అయ్యో, నేనేలాగ భయపడకుండును ! నాఒళ్లంతా చిమచిమలాడుతూవుంది ! [అని విష వేగమును రూపించును.

దేవి.—అయ్యో ! వికారము అశుభాన్ని చూపుతూ వున్నది ! ఓసీ, ఇతణ్ని పట్టుకోండి పట్టుకోండి.

[పరిజనము వేగిరపాటున పట్టుకొనును.

విదూ.—(రాజును చూచి) ఓహోయి, నీకు బాలసఖుణ్ణి, కనక, దాన్ని విచారించి అపుత్త్రికురాలికి మాయమ్మకి యోగక్షేమాలు నడుపు.

రాజు.—భయపడకు గౌతమా. నిబ్బరంగా నుండు. ఇదిగో ఇప్పుడే వైద్యుఁడు నీకు మందు చేయును.

జయ.—(ప్రవేశించి) దేవా, తమయాజ్ఞ విని ధ్రువసిద్ధి యేమని విన్నపంచేసుకొన్నాడంటే, గౌతమయ్యని అక్కడికే తీసుకొరమ్మన్నాడు.

రాజు.—అటయిన కొజ్జాలచేత మోయించుకొని యితనిని ఆయనకడకు కొనిపొమ్ము.

జయ.—అలాగే.

విదూ.—(దేవిని చూచుచు) అమ్మా, బతుకుతానో లేదో, ఈయనకొలువులో నేను నీయెడల చేసిన నాయపరాధాలన్నీ మన్నించు తల్లీ మన్నించు.

దేవి.—చిరకాలము జీవించు.

[విదూషకుఁడును ప్రతీహారియు నిష్క్రమింతురు.

రాజు.—పాపము ! ఇతఁడు పుట్టుపిఱికి, యథార్థనామఁ డైనధ్రువసిద్ధికిఁగూడ సిద్ధి కలుగు నని నమ్మకున్నాఁడు !

జయ.—(ప్రవేశించి) జయం జయం యేలినవారికి. ఉదకుంభవిధానానికి సర్పముద్ర కావలెనట, దాన్ని సంపాయించం డని ధ్రువసిద్ధి మనివి చేసుకొంటున్నాడు.

దేవి.—ఇదుగో పాముముద్రతోడి వుంగరం. తర్వాత దీన్ని నాచేతికే ఇయ్యి.

[అని ఇచ్చును.

రాజు.—కార్యము నెఱవేఱినతత్క్షణమే మాకు తెలియఁజేయుము.

జయ.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

పరి.—దేవా, గౌతముఁడు నిర్విషుఁ డని నాహృదయము చెప్పుచున్నది.

రాజు.—అట్లే అగుఁగాక.

జయ.—(ప్రవేశించి) దేవా, విషవేగము నిమ్మళించి గౌతమయ్య [illegible] సేపులో స్వస్థపడ్డాడు.

దేవి.—ఆహా పుణ్యము! నాకు నింద తప్పింది.

జయ.—మఱి మంత్రిగారు వాహతకులవారు మనివిచేస్తున్నారు.—'[illegible] కార్యం విశేషంగా మాట్లాడవలిశింది వున్నది. అందుకోసం ఏలినవారు దర్శన[illegible] గ్రహించవలెను.' అని.

దేవి.—ఆర్యపుత్రుఁడు కార్యసిద్ధికై పోవును గాక.

రాజు.—(లేచి) దేవి, ఈచోట ఎండ తగులుచున్నది. దీనికి [illegible] చారము మంచిది. కావున సెజ్జను మఱియొకతావునకు కొనిపోవలయును.

దేవి.—పిల్లలారా, ఆర్యపుత్రునిమాటప్రకారం చెయ్యండి.

పరిజనము.—ఆలాగే.

[పరివారముతోఁగూడ దేవి నిష్క్రమించుచున్నది]

రాజు.—జయసేనా, చాటుదారిని నన్ను ప్రమదవనమునకు తోడ్కొనిపో.

జయ.—ఇటు ఇటు దేవరవారు.

రాజు.—గౌతమకృత్యము సమాప్త మయినదిగదా.

జయ.—అయినది.

రాజు.—

ఆ. ఇష్టసిద్ధికొఱకు నేకాంతసాధు వౌ
పన్నకం బి దనుచు నెన్నుకొనియు,
జయముఁగూర్చి యిపుడు సందియంపడఁ జొచ్చి,
కాతరత్వమొందుఁ జేత మహహా!

విదూషకుఁడు.—(ప్రవేశించి) జయ మొందు వయస్యా. నామం[illegible]భా లన్నీ సిద్ధించినవి.

రాజు.—జయసేనా, నీవును నీ నియోగమును చూచుకొమ్ము.

జయ.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించును]

రాజు.—వయస్యుఁడా, మాధవిక కేవలము తెలివితక్కువది. ఆ [illegible] విచారింప లేదా?

విదూ.—దేవిగారి ముద్దుటుంగరాన్ని చూచినతర్వాత ఎందుకు విచా[illegible]

రాజు.—ముద్రికను గుఱించి నేను చెప్ప లేదు. 'ఆయిద్దఱకు ఏల విడుదల? దేవిగారు తనపరిజనము ఉండఁగా నిన్ను పంపిన దేల?' ఇట్లని నిన్ను మాధవిక అడిగి యుండవలసినది.

విదూ.—అడగనే అడిగింది. అప్పటికి తోచిన ఉత్తరం నేను ఈలాగ చెప్పినాను.

రాజు.—ఏలాగున?

విదూ.—నే నీలాగంటిని. "జోస్యులు రాజుగారితో 'మీనక్షత్రం ఇప్పుడు దుష్టగ్రహపీడను పొంది వున్నది, అందుకై బందీలనందఱిని చెఱలనుంచి విడుదల చెయ్యవలశింది' అని చెప్పినారు. ఆమాట విని ఇరావతి చిత్తాన్ని కాచుకొంటూ దేవి నాతో 'గౌతమయ్యా, ఏలినవారు విడిపిస్తున్నా రని చెప్పి నీవే మాళవికని విడిపించవయ్యా,' అని నన్ను పంపించినది." అని. అంతట 'సరిగానే ఉన్నది.' అని మాధవిక ఆపని చేసింది.

రాజు.—(విదూషకునిఁ గవుంగిలించుకొని) మిత్రుఁడా! నీకు నేను ప్రియుఁడను సుమా.

క. తెలివి యొకటె గాదు సుమా
చెలులకు నిష్ప్రాప్తి కుపమ చెప్పున దెల్లన్,
చెలువుగఁ దెల్లము సేయున్
జెలిమియు సూక్ష్మమును గార్యసిద్ధిపథమ్మున్. ౬

విదూ.—మఱి త్వరగా పద. సముద్రగృహంలో ప్రియసఖితో సహా మాళవికని ఉంచి నీకోసం నే నిక్కడికి వచ్చినాను.

రాజు.—ఇదె నేను చెలిని గౌరవించెదను. ముందు నడువు.

విదూ.—రా మఱీ. (పరిక్రమించి) ఇదే సముద్రగృహం.

రాజు.—(ఆశంకతో) వయస్యా, ఇదె చేతులతో పువ్వులు కోయుచు ఇరావతి పరిచారిక చంద్రిక ఇటు వచ్చుచున్నది. మనము ఈగోడచాటున దాఁగుదము.

విదూ.—అహో! దొంగలును కాముకులును చంద్రికని పరిహరించవలశినది గదా.

[ఇద్దఱును ఆచెప్పినట్లు చేయుదురు.

రాజు.—గౌతముఁడా, నీసఖి నన్ను ఎట్లు ఎదురు సూచుచున్నదో? రమ్ము, ఈకిటికీనుండి నీసఖిని చూతము.

విదూ.—అలాగే.

[ఇరువురును చూచుచు నుందురు.

[అంతట మాళవికయు వకుళావళికయు ప్రవేశింతురు]

వకుళావళిక.—చెలీ, ఏలినవారికి మ్రొక్కుకోవే.

మాళవిక.—నమస్కారము దేవరకు.

రాజు.—నాచిత్తరువును నిర్దేశించి పలుకుచున్న దని తలంచెదను.

మాళ.—(సంతోషముతో ద్వారముపైపు చూచి) ఏలినవారేనా! ఓక్కె వంచనచేస్తూవున్నావు.

రాజు.—మిత్రమా, ఈసుందరీ రత్నంపుహర్ష విషాదములచేత సంతుష్ట

క. రవి పొడిచినఁ గ్రుంకిన నే
యవి సంప్రాప్తంబు లగు సితాంబుజమునకున్
సువదనవదనంబును న
య్యవస్థలు క్షణాన రెండు నధివసియించెన్.

వకు.—ఇ దేమిటి? చిత్తరువులో ఏలినవారు లేరూ?

ఇరువురు.—(ప్రణమిల్లి) జయము ఏలినవారికి.

మాళ.—సఖి, యిప్పుడు చిత్తరువులోని ప్రాణేశ్వరుని తిలకించగా తనివి తీరుతూవున్నదో ఆలాగున అప్పుడు సముఖాన చూడగా తీరకపోయె

విదూ.—ఏమయ్యా, విన్నావూ? ఈమెగారు చిత్తరువులో ఏలా చిందో ఆలాగు నిన్ను సాక్షాత్తుగా చూడలే దని అంటూ వున్నది. ఇక్క వ్యర్థంగా రత్నాభరణాన్ని మంజుస యేలాగో ఆలాగ యౌవనగర్వాన్ని వున్నావు.

రాజు.—మిత్రుఁడా, కుతూహలము గల దైనను స్త్రీజనము స్వభా దిట్టతనము లేనిదిగదా చూడు.

ఆ. ప్రథమసంగతమున వాంఛించుఁ గాంతుల
సోయగంబు నెల్లఁ జూడఁగోనఁగ;
కాని పడవు వారిపైని నిండారంగ
వీక్షణంబు లాయ తేక్షణలకు.

మాళ.—చెలీ, ఇదిగో దొరవారిప్రక్కను ఇరావతి.

మాళ.—చెలీ, దొర అదక్షిణుడుగా కనబడుతున్నాడు. ఎల్లా దేవీజనము నెల్ల మాని ఒకతెముఖాన్నే గుతిపెట్టి చూస్తూ వున్నాడు.

వసు. — (ఆత్మగతము) చిత్తరువులోని ప్రతిమని నిజమైనదొరనిగా తలచి ఈమె అసూయపడుతూవున్నది. కానీ ఈమెని కొంచెము తమాషాచేస్తాను. (ప్రకాశము) సఖీ, ఈమె దొరవారికి ప్రియగదా.

మాళ.—అటయితే, ఎందుకు నే నిప్పుడు నన్ను ఆయాసపెట్టుకోవడం?

[అని అసూయతో వెడమొగం బగును.

రాజు.—చూడు నీ సఖిముఖమును:—

చ. బొమముడిచేతఁ జిత్రకము పొక్కఁగఁ బ్రస్ఫురితాధరోష్ఠ యై
రమణి యసూయ నాస్యము మరల్చిన యీచతురంపు పాసుచే
రమణునిమీఁద వానియపరాధములం గొనుకిన్కఁ దెల్పు వి
భ్రమ లలి తాభినీతి గురువర్య సుశిక్షితఁ జూపఁగాబలెన్. ౯

విదూ.—ఓదార్చడానికి ఇప్పుడు సిద్ధపడు.

మాళ.—గౌతమయ్య కూడా ఇక్కణ్ణే ఈయన్ని సేవిస్తూవున్నాడు.

[మరల స్థానాంతరాభిముఖి కాఁగోరును.

వసు.—(మాళవికను ఆఁపి) ఇప్పుడు నీవు కోపగించినావుగావా?

మాళ.—నేను చాలసేపు కోపగించానని తలిస్తివేని ఇదిగో కోపాన్ని వెనకకి లాగివేశాను.

రాజు.—(సమీపించి)

తే. కలువకంటిరో, నామీఁదఁ గనలు నిట్లు
చిత్రగతచేష్టకే వహించెద వి దేమి!
నన్నె గను నేన చెంతనున్నాఁడ నీదు
దాసతముఁడ ననన్యసాధారణుండ. ౧౦

వసు.—జయము ఏలినవారికి.

మాళ.—(ఆత్మగతము) ఏమి యిది! చిత్తరువులోని దొరమీద నేను అసూయపడితిని!

విదూ.—ఏమి నీవు ఉదాసీనునిలాగ ఉన్నావు?

రాజు.—నీసఖి నమ్మరాని దయినందున.

విదూ.—అలాగ చెప్తావేమి? ఈమెనా నీవు నమ్మలేవు?

రాజు.—విను మఱి:—

ఉ. నేత్రపథంబునం గలను నిల్చి క్షణంబున దిచ్చుమో మగఁ,
జేతికి దక్కి కౌఁగిటికిఁ జిక్కి తటాలున నష్ట యయ్యెడిన్,
ఈతెగ కల్లకూటముల హృచ్ఛయ తాంతుని నన్ను నేచున
యీతరళాక్షి మదీయ మన మేవగ నమ్మెడుఁ జెప్పు మిత్రమా.

వకు.— సఖి, సారసారకు నీవు ప్రభువుని మోసగించినావు; కనుక
నీమీద ఆయనకి నమ్మకం పుట్టేలాగ చేసుకో.

మాళ.—సఖి, మతి నాకైతేనో మందభాగ్యరాలికి ప్రభువుతోడి
కూటమికూడా అబ్బ దాయెను.

వకు.—ఏలినవారే యీ మెకు ఉత్తరం ఇయ్యవలెను.

రాజు.—

తే. ఉత్తరం బేల నీచెలి కువిద, నన్నె
యిచ్చికొంటిని; వలరాచచిచ్చు సాక్షి;
ఏకతపుసేవకుఁడ నాదు నేను సఖికిఁ
గాని, యెప్పుడు సేవ్యుండఁ గాను జుమ్ము.

వకు.—అనుగృహీత నైతిని.

విదూ.—(పరిక్రమించి, వేగిరమున) వకుళావళికా, జింక శాలాలో
చిగుళ్లని కొఱకడానికి వస్తూవుంది. రా నీవు, దీన్ని తోలేలాము.

వకు.—ఆలాగే. [అని

రాజు.—ఇట్లు మమ్ము కాచుటయందు వయస్యుఁడు జాగరూకుఁడుగా
వలయును.

విదూ.—ఇది కూడా గౌతమునికి చెప్పవలెనుగదా. [పరిక్రమిం

వకు.—గౌతమయ్యా, నేను ఇక్కడ దాగి వుంటాను. నీవు వాకిట కా

విదూ.—తగును. [వకుళావళిక నిష్క్ర

విదూ.—(పరిక్రమించి, కాంచి) ఇది స్ఫటిక శిలాతలము. ఇక్కడ కూ
టాను. (అట్లుచేసి) ఆహా! శిలావిశేషపు తాకుడు ఎంతహాయిగా వున్నది!

[అని నిద్రంగూరును. మాళవిక భీతయై నిలుచు

రాజు.—

తే. విడుము సుందరి, కూటమి వెఱపు విడుము
తడవుగా నిన్ను వలచిన దయితునెడల;

ఏను సహకారుఁడనుగ నాయెడను దాల్పు
బండిగురివెంద లతిక విభ్రమము నీవు. ౧౩

మాళ.—దేవా, దేవిగారికలని భయముచేత నాప్రియంకూడా నేను చేసుకోలేక ఉన్నాను.

రాజు.—భయపడకు.

మాళ.—ఇప్పుడు నాకు భయం తీర్చేదొరవారు దేవిని చూచినప్పుడు పడ్డపాటును నేనున్ను చూచేవున్నాను.

రాజు.—

తే. దక్షిణత్వం బనఁ గులవ్రతంబు సూవె
పక్వబింబాధరోష్ఠిరో, బైంబికులకు.
మఱి, మదీయంబు లసువులో మదిరనేత్ర
బద్ధములు నీపయిని జిక్కె వలపుఁద్రాట. ౧౪

కావున చిరకాలానురక్తుని ఈజనుని అనుగ్రహింపుము.

[అని కౌఁగిలింత నభినయించును. మాళవిక నాట్యముచే పరిహరించును.

రాజు.—నవవధువులు వలరాచకేళిలోనికి దిగువిధము రమణీయముగదా. అదెట్లన నీమె:—

మ. మొలనూల్వీడుపఁ బూను వ్రేళ్లకయి నాఁపున్ వేపమానాంగి యై,
బలిమిం గౌఁగిటఁ గ్రువ్వఁ గప్పును గరద్వంద్వంబుచేఁ జన్గవన్ ;
ఎలమిం గ్రోలఁగఁ బక్ష్మలాక్షియు మొగం బెత్తన్ బెడంబొగ్గెడున్;
జెలి వ్యాజంబున నేని నన్ను సుఖుఁ జేసెం గోర్కెసేఁతన్ బలెన్. ౧౫

[అంతట ఇరావతియు నిపుణికయుం బ్రవేశింతురు.]

ఇరావతి.—ఒసే నిపుణికా, సముద్రగృహపు నడవగదిలో గౌతమయ్య ఒంటరిగా కనబడ్డా డని చంద్రికచేత నీవు చెప్పిపంపినవృత్తాంతము నిజ మేనా?

నిపుణిక.—నిజము కాకపోతే భట్టినికి తెలుపుదగునా?

ఇరా.—అటయితే, అక్కడికే వెళ్దాము. ప్రాణసంశయమునుంచి తప్పినవాణ్ణి ఏలినవారి ప్రియస్నేహితుణ్ణి చూడడానికిన్నీ—

నిపు.—భట్టినిమాట ఇంకా సానశేషంలాగ ఉన్నది.

ఇరా.—ఇంకొకందుకుకూడాను; చిత్తరువులోని యేలినవారిని మన్నన వేడుకోవడానికిన్నీ.

నిపు.—అటయితే సాక్షాత్తు ప్రభువునే ఎందుకు వేడుకోరాదు?

ఇరా.— ఓసీ ముద్దరాలా, చిత్రగతుడు ఆర్యపుత్రుడు ఎటువంటి వేరొకతెమీద మనసు పెట్టినవాడున్ను అటువంటివాడే. కేవలం నాచేసిన ఉ త్క్రమాన్ని తుడిచి వేయడానికి ఈయారంభము.

నిపు.—ఇటు ఇటు భట్టిని.

[ఇరువురును పరిక్రమి

చేటి.—(ప్రవేశించి) జయము భట్టినికి. దేవిగారు చెప్పతూవున్నా 'ఇది నాకు మత్సరానికి కాలంగాదు. కేవలం నీగౌరవాన్ని పెంచడాని త్తెతో కూడా మాళవికని సంకిళ్లువేయించితిని. నీ కిచ్చ యైతే ఆర్యపు కూడా నీకోసము విజ్ఞాపనచేస్తాను. నీయిష్టమేమో తెలుపు.' అని.

ఇరా.—నాగరికా, దేవితో మనవిచేయి: 'దేవిని నియోగించడా మెవరము? పరిజనాన్ని దండించడంచేత దేవిగారు నామీద స్నేహాన్ని చ నారు. మఱి యెవరిప్రసాదంచేత ఈజనము వర్ధిల్లుతున్నది?'

చేటి.—అలాగే [అని నిష్క్రమి

నిపు.—(పరిక్రమించి, చూచి) ఇదుగో సముద్రగృహద్వారమున బజా యెద్దులాగ గౌతముడు కూర్చునియే నిద్రపోతూ వున్నాడు.

ఇరా.—అయ్యో పాపం. విషవికారం ఇంకా నిశ్శేషం కాలేదు గ

నిపు.—ముఖంలో కళ చక్కగానే వుంది. పైగా ధ్రువసిద్ధిగదా వాడు. కనక ఇతనికి కీడు గలుగుతుందని భయపడ నక్కఱలేదు.

విదూ.—(స్వప్నములో పలవరించును.) అమ్మా, మాళవికా.

నిపు.—భట్టిని విన్నదా? ఈహతాశుడు తమపని నెఱవేరుస్తా ఎవరు నమ్మవచ్చును! ఎల్లకాలము మీవల్లనే స్వస్తివాచనమోదకాలచే చుకొని ఇప్పుడు మాళవికని పలవరిస్తూ వున్నాడు!

విదూ.—ఇరావతిని మించినదానవు కమ్మా.

నిపు.—ఇది మహాభయము! పాముకువెఱచిన యీ బాపనబంధు లాగేవంకరయిన యీ చేపాటికఱ్ఱతో స్తంభంచాటునుంచి భయ పెడతా

ఇరా.—తగినదే ఉపద్రవం ఈకృతఘ్నుడికి.

[నిపుణిక విదూషకునిమీఁద చేపాటికఱ్ఱ

విదూ.—(తటాలున మేల్కొని) కావుకావు! ఓవయస్యా, నామీ పడ్డది.



రాజు.—(తటాలున వచ్చి) భయపడకు భయపడకు.

మాళ.—(వెంటవచ్చి) దేవా, తటాలున వెలువడకు; పామంటూ వున్నాడు.

ఇరా.—అయ్యో అయ్యో! ప్రభువుకూడ ఇటే పరుగున వస్తున్నాడు!

విదూ.—(ప్రహాసముతో) ఏమి! చేపాటికఱ్ఱ యిది! ఇది మొగలిముళ్లతో పాముకాటులాగ గాయంచేసుకోవడం వాస్తవంగానే ఫలించిం దని నేను అదలి పోతిని.

[అంతట పటాక్షేపముగా వకుళావళిక ప్రవేశించును.]

వకు.—దొరవారు ప్రవేశించ వద్దు. ఇక్కడ వంకరగా పాకుతూ సర్పంలాగ కనబడుతూ వున్నది.

ఇరా.—(రాజును తటాలున దరిసి) నిర్విఘ్నంగా మిధునానికి పగటిసంకేతం నెఱవేఱిందా? [అందఱును ఇరావతిం గని సంభ్రాంతు లగుదురు.

రాజు.—ప్రేయసీ, ఈయుపచారము అపూర్వముగా నున్నది.

ఇరా.—వకుళావళికా, సంతోషం! దూత్యధికారంవిషయంలో నీప్రతిజ్ఞ నెఱవేఱింది.

వకు.—అనుగ్రహించు భట్టినీ. నే నేమి చేసినానో ప్రభువునే అడుగు. కప్పలు పలుకత వని అందుచేతనా దేవేంద్రుడు భూమిపై వర్షించడం?

విదూ.—పోనీగాని, నీ వగపడ్డమాత్రాన ఈదొడ్డవాడు నీప్రణిపాతాతిక్రమాన్ని మఱచి పోయినాడు. నీవు మాత్రము ఇప్పటికిన్ని అనుగ్రహం తాల్చకున్నావు.

ఇరా.—కోపగించి నే నిపుడు ఏమిచేయగలను?

రాజు.—ఇది యిట్లు; నిమిత్తము లేని కోపము నీకు తగదు.

తే. ఎన్నఁడు శుభాంగి, నీమోము నెనసె నిట్లు
క్షణమయినఁ గిన్కచేఁ గెంపు కతము లేక?
అహి కలుషి తేందు మండల యగునె రాత్రి
పర్వమునఁ గాక? చెప్పుమా ప్రాణదయిత. ౧౬

ఇరా.—తగ దని ఆర్యపుత్రుడు వచించినమాట మిక్కిలి తగియున్నది. మాభాగ్యములు ఇతరలను చెందియుండగా ఇక మళ్లీ కోపగించి పరిహాసపాత్ర మగుదునా?

రాజు.—నీవు వేఱుగా కొనుచున్నావు. నే నేమో సత్యముగానే ఇట కోపమునకు కారణముం గానకున్నాను. ఏలన,—

క. చన దపరాధుల నేనియు
ననుగుల దండింపఁ బండు వగుదినములలో,

నని విడిపించితి వీరలఁ;
బ్రణమిల్లఁగ నాకు వీరు వచ్చినవారల్.

ఇరా.—నిపుణికా, పోయి దేవితో విన్నవించు. ఇప్పుడు దేవిగారిపక్షపాత స్పష్ట మయిన దని.

నిపు.—అలాగే [అని నిష్క్రమించును.

విదూ.—(ఆత్మగతము) అయ్యో! అనర్థం సంభవించింది! బంధనము తప్పిన పెంపుడు గువ్వ మార్జాలికంట బడినది.

నిపు.—(ప్రవేశించి) యదృచ్ఛగా కనబడి మాధవిక చెప్పింది. ఇదిగో జరిగిం దని. [అని చెవిలో చె

ఇరా.—(ఆత్మగతము) సర్వము జతపడ్డది. ఈబాపనబంధువు చేసి పన్నాగ మిది. (విదూషకుని చూచి, ప్రకాశము) ఇది యీకామతంత్రమం

విదూ.—అమ్మా, నీతిలో ఒక అక్షరమైనా చదివివుంటే గా కూడా మఱచిపోదును.

రాజు.—(స్వగతము) ఈసంకటమునుండి ఎట్లు తప్పించుకొందును.

జయసేన.—(ప్రవేశించి తొట్రుపాటుతో) దేవా, కుమారి బంతివెంట పరుగెత్తుతూ వుండగా పింగళవానరంచేత చాలా భయపడి ఒడిలో కూర్చుండి పెనుగాలిలో చిగురాకులాగ వణుకుతూ కొంచెమైనా పడకుండా వున్నది.

రాజు.—కట్టా! పసితనమున భయము మెండు!

ఇరా.—ఆర్యపుత్రా, త్వరగా వెళ్లు, త్వరగా వెళ్లు ఓదార్చడానికి వల్లనైన వికారము పిల్లకి హెచ్చిపొయ్యేని.

రాజు.—నేను పోయి బాలను తెలివిగొల్పెదను. [అని పక్ష

విదూ.—బళిరా! పింగళవానరుడా! బళి! సంకటములో చక్కగా కాచితివి.

[రాజు, విదూషకుఁడు, ఇరావతి, నిపుణిక, చేటియు నిష్క్రమి

మాళ.—సఖీ, దేవిని తలుచుకొంటే నాగుండెలు తల్లడిల్లుతున్నవి ఏమి అనుభవించవలసివస్తుందో ఎఱగనే!

[నేపథ్యమున]

ఆశ్చర్య మాశ్చర్యం! దోహదం చేసి అయిదు దినాలు నిండకముందే రపశోకం మొగ్గలు తొడిగింది. వెళ్లి దేవిగారికి తెలుపుతాను.

[కుంకుపుర విని

వకు.—ఊఁటడిల్లు సఖీ, దేవిగారు మాట తప్పరు.

మాళ.—అ టయితే ప్రమదవనపాలిక వెంబడినే ఉందాము.

వకు.—అలాగే చేతాం.

[అని నిష్క్రమింతురు.

చతుర్థాంకము సమాప్తము.

---

## చతుర్థపంచమాంకములనడుమ ప్రవేశకము.

---

[అంతట ఉద్యానపాలిక ప్రవేశించును.]

ఉద్యానపాలిక.—నేను బంగారపశోకానికి సత్కారాలు గావించి తిన్నె కట్టితిని. మఱి ఆజ్ఞ నెఱవేర్చినా నని దేవికి తెలుపుకొంటాను. (పరిక్రమించి) అహో! దైవం ఇప్పటికి మాళవికమీద కరుణించినది. ఏలా గనగా, ఆమె మీద అవిధంగా చండిరైన దేవి ఈయశోకపు పువ్వులవృత్తాంతంచేత ప్రసన్నురాలవుతుంది. దేవి యిప్పు డెక్కడ ఉండును? (చూచి) అహో! దేవిగారి పరిచారకుడు ఇతఁడు గుజ్జువాడు సారసకుఁడు, లక్కముద్ర వేసిన చందుగాను చేత బెట్టుకొని మందిరమునుంచి బైటికి పోతూవున్నాడు; ఇతణ్ని అడుగుతాను.

[అంతట యథానిర్దిష్టుఁడు కుబ్జుఁడు ప్రవేశించును.]

ఉద్యాన.—(సమీపించి) సారసికా, ఎక్కడికి వెళ్లుతున్నావు?

సార.—మధుకరికా, వేదపారాయణంచేసే బాపలకి నిత్యదక్షిణ ఇయ్యవలెను. అందుకోసం పురిహోతయ్యవారిచేతికి దీన్ని యియ్యడానికి.

ఉద్యాన.—ఎందుకోసం?

సార.—ఎప్పటినుంచి సేనాపతిగారు జన్న పుగుఱ్ఱానికి కాపుగా భర్తృదారకుణ్ణి వసుమిత్రుణ్ణి నియోగించినారో అప్పటినుంచి దేవిగారు పుత్రుని ఆయుస్సుకోసం పద్దెనిమిది వరహాల దక్షిణ దక్షిణకి తగిన బ్రాహ్మణులకి ఇప్పిస్తూవున్నారు.

మధు.—మఱి దేవి యెక్కడ వుంది? ఏమి చేస్తూ వుంది?

సార.—దేవి మంగళగృహంలో ఆసనస్థురాలై విదర్భదేశంనుంచి తోబుట్టువు వీరసేనుడు పంపినజాబును లిపికరులు చదువుతూ వుంటే వింటూవుంది.

మధు.—మఱి విదర్భరాజు వృత్తాంత మేమి!

సార.—వీరసేనుడి నాయకత్వాన నడిచినట్టివి ఏలినవారి విజయ విదర్భనాథుణ్ణి వశీకరించినవి. అతని దాయాదుడు మాధవసేనుడు విడుదల నాడు. అతడు పంపినవాటిని వెలపొడు గయిన రత్నాలు వాహనాల మంది శిల్పకారికలు పరిజనులు అనే కానికలని తెచ్చినదూత వచ్చివున్నాడు. ఏలినవారిని దర్శనం చేస్తాడు.

ఉద్యాన.—వెళ్లు, నీపనిచూచుకో, నేనున్నూ దేవిగారిని చూస్తాను. [అని నిష్క్రమించు

ప్రవేశకము సమాప్తము.

---

పంచమాంకము.

---

[అంతట ప్రతీహారి ప్రవేశించును.]

ప్రతీహారి.—నన్ను అశోకసత్కారంలో పనివడియున్నదై దేవి ఆజ్ఞాపించె "ఆర్యపుత్రునికి మనవిచెయ్యి. ఆర్యపుత్రునితోగూడ అశోకవృక్షపుష్ప... తంగా చూడగోరుతున్నాను." అని. అందుకోసం ధర్మాసనస్థులు ఏలినవారు వచ్చే దాకా కనిపెట్టుకొని వుంటాను. [అని పరిక్రమించు

[నేపథ్యమున]

వైతాళికులు ఇరువురు.—అయ్యారే! దండప్రయోగముచేత శిరంబులపైని ఏలినవారు వర్తిల్లుచున్నారు!

ప్రథముఁడు.—

సీ. విదిశా పురీ సంగి నది తటంబులయందుఁ
బిక కల వ్యాహార విలసితముల
నుద్యానవనముల నుద్భూతరూపుఁ డౌ
మరుఁడవు నా నీవు మధుదినముల
నాత్తరతివి పర మానందథువులందుఁ
గడపుచున్నాఁడ వఖండబిరుద,
తననాటిపై దాడి సనిన, నీపరిలోని
[illegible]

తే. వాని కాలానములు గాఁగ వఱలుకతనఁ
బడిన నఱదలు గుఱుతులై పరిఢవిల్ల,
వరదయొడ్డులఁ గలమేటి తరులతోడ
వరద, నీరిపుఁడును నీకు వంగినాఁడు. ౧

ద్వితీయుఁడు.—

చ. మిన్నలు బీరముం గవులు మెచ్చి నుతించిరి గీతి నిర్వ్యర్గ
బన్నుగ నీవిదర్భభువిఁ బాదుగఁ గాంచి కథాప్రసక్తికిన్,
నిన్ను విదర్భభూపుసిరి నిర్భరధాటిని నాఁచికొంటకున్,
వెన్నుని బల్మిచేఁ బరిఘ పీవర బాహుల భైమిఁ గొంటకున్. ౨

ప్రతీ.— అదే జయధ్వనుల గొల్లు; ఏలినవారు ధర్మాసనంనుంచి లేచి వారు. ఇటే వస్తున్నారు. నేనున్ను వీరిమ్రోలనుంచి కొంచెం జరిగి ఈమొగసాల వాకిటిగదిలో నిలిచి వుంటాను. [ఏకాంతమున నిలుచును.

[అంతట విదూషకునితో రాజు ప్రవేశించును.]

రాజు.—

తే. కవయ దుర్లభ మైన యాకాంతఁ దలఁచి,
బలవితతులు విదర్భుని వ్రాల్చుట విని,
వర్ష ధారలహతి నాతపమునఁ గుడుచు
తమ్మివలె డొంద మొందె దుఃఖమ్ము సుఖము. 3

విదూ.—నాకు తోస్తుంది, నీవు కేవల సుఖమునే పొందుతా వని.

రాజు.—అ దెట్లు ?

విదూ.—నేడు పండితకౌశికితో దేవి ఆనతిచ్చింది-"భగవతీ, అలంకరించ నేర్తు నని నీకు గర్వము కలదేని, మాళవిక నెమ్మేన విదర్భదేశపు పెండ్లియలంకారాన్ని చూపించు." అని. ఆమె చేత మేలుగా అలంకృత మై ఒకవేళ మాళవికమ్మ నీకోరిక ని తీరుస్తుంది.

రాజు.—సఖుఁడా, ఈసు మాని నాకోరికనే నెఱవేర్పుటయు ధారిణీదేవి యందు తదీయ పూర్వచరిత్రల చేత సంభావనీయమే.

ప్రతీ.—(సమీపించి) జయం ఏలినవారికి. దేవిగారు మనవిచెయ్యమన్నా బంగారపశోకపు పువ్వుశ్రీని తిలకించడానికి అంగీకరించడంచేత ఏలినవారు నా త్నాన్ని సఫలీకంచవలె నని.

రాజు.—దేవిగారు అక్కడనే ఉన్నారుగదా ?

ప్రతీ. — అవును. దేవిగారు కడమరాణివాసాలని తగినట్లు సత్కరించి వేసి మాళవికా ప్రధాన మయిన తనపరిజనంతో కూడ ఏలినవారిని ఎదురు వున్నారు.

రాజు.—(సంతోషముతో, విదూషకుం గాంచి) జయసేనా, ముందు

ప్రతీ.— ఏలినవారు ఇటు ఇటు.

[అందఱు ప్రక్రమిం

విదూ. — (చూచి) ఓయిమిత్రుండా, ఏమి ! ప్రమదవనంలో వసంత వనము ముదిసినట్లు కనబడుతూవున్నాడు !

రాజు.—నీ వన్నది సరియే. ఇదె యిపుడు-

తే. రాలు గోరంట పిందెల రాజిలోన
మావిపిందెల భేదంబు మఱుంగ బెదుర ;
పరిణతిని డాయు ఋతువు జవ్వనము నాదు
మదిని దమికొల్పుచున్నది మాసరముగ.

విదూ.—(పరిక్రమించి) ఓహో ! ఇదే ఆబంగారపశోకము ! పూలకొ లాన అలంకారము పొందినట్లున్నది; చూడవయ్యా నీవు.

రాజు.—ఇది మొదట పూవక తామసించుట యుక్తమే. ఏలన ప్పుడు మఱి దేనికిని లేనిశోభను దాల్చినది చూడు.

క. తొలుత వసంతవిభవముఁ
వెలయించిన యయ్యశోక విటపుల నెల్లఁ
గల పువ్వు లెల్ల దీనఁ
విలసితదోహదమునం బ్రవేశింపబలెఁ.

విదూ.—నీకోరిక తీరేలాగున్నదోయి; ఎట్లన;—మనము దగ్గిరవున్నా ణీదేవి మాళవికని తనప్రక్క నుండనిచ్చింది.



రాజు.—(సంతోషముతో) చూడుము మిత్రుండా,

క. ననుఁగూర్చి దేవి లేచెడి
వినయంబున వెంట లేచు ప్రేయసితోడన్,
వనజమును గేలఁగొనఁ దలఁ
పని జనవరలక్ష్మితోడి వసుమతి వోలెన్. ౬

[అంతట దేవియు, మాళవికయు, పరివ్రాజికయు, విభవంబుగా
పరివారంబును ప్రవేశింతురు.]

మాళవిక.—(ఆత్మగతము) ఈ కౌతుకాలంకారానికి కారణం యెరుగుదును. అయినా నాహృదయము తామరాకులోని నీటిలాగ తల్లడిల్లుతున్నది. నాయెడమ కన్ను మాటిమాటికి అదురుతున్నది.

విదూ.—ఓ యవస్యుఁడా, పెండ్లికూతురి వేషాన మరీ శోభిస్తూవున్నది సుమా మాళవిక.

రాజు.—చూచుచున్నాను. ఈభామామణి—

తే. అనతిలంబి దుకూలవాసిని శుభాంగి
యలఁతి తొడవులె ధరియించి హవణు మించు
విరళతుహినత నక్షత్రవితతు లొప్ప
నెలపొడుప నున్న మధుమాసనిశయుఁబోలె. ౭

దేవి.—(సమీపించి) జయము జయము ఆర్యపుత్త్రునికి.

విదూ.—దేవిగారు వర్ధిల్లవలెను.

పరి.—దేవా, విజయ మొందుము.

రాజు.—భగవతి, నమస్కరించుచున్నాను.

పరి.—అభీష్టసిద్ధి యగుఁగాక.

దేవి.—(చిఱునవ్వుతో) ఆర్యపుత్త్రా, ఈయశోకవృక్షాన్ని తరుణీజనసహాయునికి నీకు సంకేతగృహం చేశినాము.

విదూ.—ఓయి ఆరాధితుడ వైనావు.

రాజు.—(సలజ్జముగా అశోకముకడకు పరిక్రమించుచు)

తే. తగినదే యిట్టి నీదు సత్కారములకు
నీయశోకంబు దేవి, య దెట్లటన్న-
నిది మధుశ్రీనియోగంబు నెడగఁ ద్రోచి
తెలిపె నీపూన్కిపై బీతి నలరుగముల. ౮

విదూ.—ఓయి, నిర్భయముగా నీవు ఈయౌవనవతిని చూడుము.

దేవి.—ఏయౌవనవతిని ?

విదూ.—అమ్మా, బంగారపశోకపు పువ్వులక్ష్మిని.

[అందఱును చూచ్చు...

రాజు.—(మాళవికను గాంచి ఆత్మగతము) హా! కష్టము సుమా యీ... విరహము.

క. వెలయుదు నేఁ గోకముగతి,
వెలయుచునున్నయది కోకివిధమునఁ బ్రియయు౯;
కలయిక మా కొల్లక తా
నెలకొన్నది నడుమ దేవి నిశయుంబోలె౯.

కంచుకి.—జయము జయము దేవరవారికి. మంత్రిగారు మనవిచేసు...న్నారు. "విదర్భదేశమునుండి వచ్చినకానుకలలో ఇరువురు శిల్పకారికలు దా...చేత నలుగుడువడియుండి రని అప్పుడు సన్నిధికి కొనిరాలేదు. ఇప్పుడు ...దటియందగియున్నారు; పంపుటకు నాజ్ఞ వేఁడుచున్నాను." అని.

రాజు.—వారిని ప్రవేశపెట్టుము.

కంచుకి.—ఏలినవారియాజ్ఞ. (అని నిష్క్రమించి వారిని తోడ్కొ...శించి) అమ్మాయీ, ఇటు రండి, ఇటు.

ప్రథమ.—(జనాంతికము) రజనికా, అపూర్వమయినప్పటికిన్ని ...గరు ప్రవేశించగా నాయంతరాత్మ ప్రసన్నమవుతూవుంది!

ద్వితీయ.—జ్యోత్స్నికా, నాకున్ను ఆలాగేవుంది. కలదు కదా ...దము, రాగలసుఖాన్నేమి దుఃఖాన్నేమి మనస్సులోనియవస్థ సూచిస్తుందని.

ప్రథమ.—అది యిప్పుడు సత్యమగునుగాక.

కంచుకి.—వీఁడుగో ప్రభువు, దేవేరితోఁగూడ నున్నాఁడు. మీ ...దగ్గఱకు పొండు.

[ఇరువురును సమీపింతురు. మాళవికయు, పరివ్రాజి...
అచేటికలను చూచి ఒండొరులం జూచుదురు...

ఇరువురు.—(ప్రణమిల్లి) జయము ఏలినవారికి. జయము దేవిగారికి.

రాజు.—కూర్చుండుఁడు. [ఇరువురును కూర్చు...

రాజు.—ఏశిల్పమును మీరు నేర్చినారు.

ఇరువురు.—దేవా, మేము సంగీతము నేర్చుకొనియున్నాము.

రాజు.—దేవి, వీరిలో నొకతెను నీవు కైకొమ్ము.

దేవి.—మాళవికా, ఇటు చూడు. వీరిలో ఎవతెను నీవు సంగీతంలో సంగాతెకత్తెనిగా ఇచ్చగిస్తావు?

ఇరువురు.—(మాళవికం గని) అహో! భర్తృదారిక! (అని ప్రణమిల్లి) జయము భర్తృదారికకి.

[ఆమెతో కూడ బాష్పములు విడుతురు. అందఱును ఆశ్చర్యముతో చూతురు.

రాజు.—మీ రెవరు? ఈతరుణి యెవరు?

ప్రథమ.— దేవా, ఈమె మాదొరకూతురు.

రాజు.—అ దెట్లు?

ఇరువురు.—ప్రభూ, వినవలెను. ఏలినవారి విజయసేనలు విదర్భనాథుణ్ణి వశీకరించి బంధనమునుంచి విడిపించిన కుమారుడు మాధవసేనుడు కలడే, అతని చెల్లెలు మాళవిక యీమె.

ధారిణి.—ఏమీ! రాజకుమారియా యీమె! చందనాన్ని నేను పావుకోళ్లగా దాల్చి కీడొందించితిని.

రాజు.—మఱి యీకోమలి యిట్లేల యయినది?

మాళ.—(నిశ్వసించి ఆత్మగతము) విధివిలాసము చేత.

ద్వితీయ.—ప్రభువుగారు చిత్తగింపవలెను. మాదొరకుమారుఁడు మాధవసేనుడు దాయాదులచేత పట్టుపడినంతట, అతనిమంత్రి సుమతిగారు మాబోటిపరిజనాన్ని వదలివేసి ఈమెని గూఢంగా తొలగించుకొనిపోయినారు.

రాజు.—ఇంత వట్టు మేము వినియున్నాము. తర్వాత తర్వాత?

ఇరువురు.—అటుపైని మాకు తెలియదు.

పరివ్రాజిక.—అటుపై వృత్తాంతమును మందభాగ్యను నేను చెప్పెదను.

ఇరువురు.—కౌశికిగారిగొంతువలె వినబడుతూవుంది.

మాళ.—అవును.

ఇరువురు.—యతివేషాన ఆర్యకౌశికిని కనుఁగొనలేకపోయినాము. భగవతి, మ్రొక్కుతున్నాము. [అని ప్రణమిల్లుదురు.

పరి.—మీకు మేలగుఁ గాక.

రాజు.—ఏమి! వీరు నీకు ఆప్తవర్గమా?

పరి.— అట్లే ఇది.

విదూ.—అటయిన భగవతీ, ఈమె మిగతవృత్తాంతాన్ని చెప్పు.

పరి.—(వైక్లబ్యముతో) మతి వినుఁడు. మాధవసేనునిమంత్రి సుమతి నా యని యెఱుఁగుఁడు.

రాజు.— తెలిసినది. అటు పైని? అటు పైని?

పరి.—ఆయన, మాధవసేనుఁడు, అట్లు ఇడుమలలోఁ బడఁగా, ఈమెను గూడ తోడ్కొని దేవరతోడి సంబంధమును ఆసించి యీ వైదిశనగరమునకు వచ్చు చున్న యొక బాటసారుల బిడారుతోఁ గలసికొన్నాఁడు.

రాజు.—తర్వాత? తర్వాత?

పరి.—ఆవర్తకులసాతు దారిబడలిక తీర్చుకొనుటకై అడవిలోఁ బస చేసె.

రాజు.—అంతట? అంతట?

పరి.—అంతట, ఆసాతును—

తే. దొనలవారులకట్లు అమ్ములను గ్రాల
విల్లు దాల్చి యులియుచు నావిర్భవించి
మడిమదాఁక నెమలిపురితోడవు వ్రేల
కానిధాకను దాఁకెఁ దస్కరబలంబు.

[మాళవిక భయము రూపి...

విదూ.—అమ్మా, భయపడకు; నడిచిపోయిన వృత్తాంతాన్ని గదా చెప్పుతూవుంది.

రాజు.—అంతట? అంతట?

పరి.—అంతట, ముహూర్తముసేపు పోరి, దొంగలదండు సాతును పాఱఁదోలినది.

రాజు.—అటు పైని ఇప్పుడు కష్టతరమైనవార్తను వినవలసియున్నది

పరి.—అంతట నాయన్న— ... —

ఆ. పరులచేత ద్రోసఁగు పడనీక నీ బాల
నిడుమలోనఁ గావఁ దొడరి సుమతి,
స్వామితత్పరుండు స్వామిఋణముఁ దీర్చెఁ
బ్రియతమంబు యసువు ప్రీతి నిచ్చి

ప్రథమ.—హా! సుమతిగారు హతులైరా!

ద్వితీయ.—అందువల్ల గదా భర్తృదారిక ఇటువంటి యవస్థపాలయినది!

[పరివ్రాజిక అశ్రువులు గార్చును.

రాజు.—భగవతీ, దేహధారుల కెల్లను ఇట్టిదే లోకయాత్ర. మఱి, స్వామి యన్నమును సఫలీకరించిన యామహానుభావుఁడు శోకింప వలసినవాఁడు గాఁడు. తర్వాత?

పరి.—అంతట నేను మూర్ఛ పాలైతిని. నేను తేరునప్పటికి ఈమె కంటికి కనఁబడక పోయెను.

రాజు.—భగవతి గొప్ప యిక్కట్టును అనుభవించినది!

పరి.—అంతట అన్న దేహమునకు అగ్ని సంస్కారము గావించి వెండియు క్రొత్తదైన వైధవ్యదుఃఖము ననుభవించుచు మీదేశముం జొచ్చి యీకాషాయ యుగళమును గ్రహించితిని.

రాజు.—యుక్తము. సజ్జనులమార్గ మిది. తర్వాత తర్వాత?

పరి.—ఈమె అడవినుండి వీరసేనుని, వీరసేనునుండి దేవిని, చేరినది. దేవియింట ప్రవేశ మొంది నేను ఈమెను గాంచితిని. ఇది యీకథకు అవసానము.

మాళ.—(ఆత్మగతము) ఇప్పుడు ఏలిక యేమి చెప్పునో గదా!

రాజు.—అహో! వినిపాతములు పరిభవమును తెచ్చును!

తే. దేవిపదమున కర్హ యీ తెఱవ యకట
పనిగొనంబడ నైనది వరవుడుగను;
జలక మాడంగఁ దడుపుగాఁ జలునపట్టు
వలువ దాల్పంగఁబడియెడువడువు దోఁప ౧౨

దేవి.—భగవతీ, మాళవిక ఆభిజాత్యవంతురా లని నీవెఱిగియుండిన్ని చెప్పకుండడం సరిగా లేదు.

పరి.—పాపము శమించునుగాక. కారణము కలిగియే నేను చెప్పకుంటిని.

దేవి.—ఏ మాకారణము?

రాజు.—చెప్పఁదగిన దేని చెప్పుము.

పరి.—వినుఁడు. ఈమెతండ్రి బ్రదికి యుండఁగా వాక్సిద్ధిగలవాఁడు సాధు వొకఁడు దేవతోత్సవాగతుఁడు నాకడ నిట్లు ఆదేశించినాఁడు—'ఈమె సంవత్సర మాత్రము వరవుడ పనులు చేయుచు తగిన భర్తను పొందును.' అని. జరుగక తప్ప

వట్టియా యాదేశము నీపాదములసేవరూపమున పరిణమించుటం గాచి కాల
నూచుచు, నేను ఊరకుండుటయే సరి యని ఊరకుంటిని.

రాజు.—ఉపేక్ష యుక్తమే.

కంచుకి.—(ప్రవేశించి) దేవా, వేఱుప్రసంగములలో అంతరిక
యీవిషయమును మంత్రిగారు విన్నవించుచున్నారు. 'విదర్భ దేశముంగూర్చి
వలసిన సంవిధానమును మేము నిశ్చయించితిమి. ఏలినవారియభిప్రాయము
గోరుచున్నాము.' అని.

రాజు.—మౌద్గల్యా, ఆయన్నదమ్ములకు యజ్ఞసేనమాధవసేనులకు
రాజ్యము స్థాపింపఁ దలంచియున్నాను.

క. వరదాకూలంబుల ను
 త్తరదక్షిణములను నేలుతఁ బాల్గొని వా
 రిరువురు వేర్వేఱుగ, రా
 తిరినిం బవలిఁ హిమోష్ణదీధితులు బలెఁ.

కంచుకి.—దేవా, ఇట్లని మంత్రిపరిషత్తునకు నివేదించెదను.

[రాజు వ్రేలితో అంగీకారముం దెలుపును. కంచుకి నిష్క్రమించు

ప్రథమ.—[జనాంతికము] భర్తృదారికా, సంతోషం సంతోషం!
దారకుడు అర్ధరాజ్యానికి ఏలిక ఔతాడు!

మాళ.—ప్రాణసంశయంనుంచి తప్పినాడు, అందుకే సంతోషించవలె

కంచుకి.—[ప్రవేశించి] ఏలినవారికి జయము. మంత్రిగారు మనవి
చున్నారు.—ఆహా! దేవరబుద్ధి శోభనముగా నున్నది. మంత్రిపరిషత్తు
ఇట్లే నిర్ధారించినది. ఏలన—

చ. ఇరువగఁ బంచినట్టిసిరి నిర్వురుఁ దాల్చి పరస్పరంబుఁ ప్రో
 గరకరి విస్మృతిం బడ సుఖానఁ జరింతురు నీదునానతిఁ,
 ధురను సమంబుగాఁ గొని ప్రతోదకు తోత్రపు సన్నచే
 స్వర కుకృతు ల్మదిం గొనక వర్తిలు రథ్యయుగంబు చాల్పు

రాజు.—అట్లయిన, ఇట్లు చేయు మని సేనాపతి వీరసేనునికి ప్రా
మంత్రిపరిషత్తునకుం జెప్పుము.

కంచుకి.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించి పావడములతో
తెచ్చి వెండి ప్రవేశించి] ప్రభువునానతిని నైఱవేర్చితిని. ఇదిగో ఇళ్ళను

రగు సేనాపతి పుష్పమిత్రులవారి యొద్దనుండి ప్రాభృతముతోడి జాబు వచ్చినది. దీనిని దేవర ప్రత్యక్షీకరించుఁగాక.

[రాజు తటాలున వేచి సోపచారముగా గ్రహించి పావడమును శిరమునఁ దాల్చి పరిజనమునకు అర్పించును. కమ్మను నాట్యముచేత విప్పును.

దేవి.—అహో? నాహృదయము అటువైపే మొగంపెట్టుకొని వుంది. గురుజనకులం తర్వాత కుమారుడు వసుమిత్రుని వృత్తాంతాన్ని వింటాను. గుఱ్ఱానికి కాపుగా గదా నాకుమారుణ్ణి సేనాపతిగారు పంపినారు.

రాజు.—[కూర్చుండి చదువును.] "స్వస్తి—యజ్ఞవాటమునుండి సేనాపతి పుష్పమిత్రుఁడు వైదిశమందున్న మాకుమారుని ఆయుష్మంతుని అగ్నిమిత్రుని స్నేహంబున కౌఁగిలించుకొని శాసించుట. ఎఱుంగునది—నేను రాజయజ్ఞదీక్షితుఁడనై రాజపుత్రశతపరివారముతోడి వసుమిత్రుఁడు కాపుగా యజ్ఞాశ్వమును నిరర్గళసంచారిని సంవత్సరాంతమున మరల నాకడకు వచ్చి చేరవలసినదానినిగా విడిచితిని. దానిని సింధునదముదక్షిణతీరమున చరించుచుండఁగా యవనులగుఱ్ఱపుదండు పట్టవచ్చినది. అంతట ఇరువాగునకును బెట్టిదంపుఁ బోరితమయినది."

[ధారిణివిషాదమును రూపించును.

రాజు.—ఏమి ఇట్టిదైనది! (శేషమును చదువును.)

క. "అంత వసుమిత్రుఁడు ధను
ష్మంతుఁడు యవనులు హరించు మనతేజిని దు
ర్దాంతుఁడు వారల నోరిచి
పంత మెలర్పంగ బలిమి మరలిచి తెచ్చెన్. ౧౫

దేవి.—ఈవార్తచే నాహృదయం కుదుట బడినది.

రాజు.—(జాబులో మిగత చదువుచున్నాఁడు.) "ఇప్పుడు నేను అంశుమంతునిచేత సగరుండువోలె పౌత్రునిచే ప్రత్యాహృతాశ్వుండనై యజించుచున్నాను. కావున నిపుడు నీవు అవిలంబితముగా మనస్సులో రోషము మాని వధూజనముతోఁ గూడ యజ్ఞము సేవించుటకై రావలసినది." అని.

రాజు.—అనుగ్రహింపఁబడితిని.

పరి. — సంతోషము! సంతోషము! పుత్రునివిజయముచేత దంపతులు వర్ధిల్లుచున్నారు.

పట్టియా యాదేశము నీపాదములసేవరూపమున పరిణమించుటం గాచి కాల
నూచుచు, నేను ఊరకుండుటయే సరి యని ఊరకుంటిని.

రాజు.—ఉపేక్ష యుక్తమే.

కంచుకి.—(ప్రవేశించి) దేవా, వేలుప్రసంగములలో అంతరిత
యీవిషయమును మంత్రిగారు విన్నవించుచున్నారు. 'విదర్భదేశముంగూర్చి
వలసిన సంవిధానమును మేము నిశ్చయించితిమి. ఏలినవారియభిప్రాయము
గోరుచున్నాము.' అని.

రాజు.—మాద్గల్యా, ఆయన్నదమ్ములకు యజ్ఞసేనమాధవసేనులకు
రాజ్యము స్థాపింపఁ దలంచియున్నాను.

క. వరదాకూలంబుల ను
త్తరదక్షిణములను నేలుఠ బాల్గొని వా
రిరువురు వేర్వేఱుగ, రా
తిరినిం బవలిఠ హిమోష్ణదీధితులు బలెఠ.

కంచుకి.—దేవా, ఇట్లని మంత్రిపరిషత్తునకు నివేదించెదను.

[రాజు వ్రేలితో అంగీకారముం దెలుపును. కంచుకి నిష్క్రమించును.

ప్రథమ.—[జనాంతికము] భర్తృదారికా, సంతోషం సంతోషం!
దారకుడు అర్ధరాజ్యానికి ఏలిక ఔతాడు!

మాళ.—ప్రాణసంశయంనుంచి తప్పినాడు, అందుకే సంతోషించవలె.

కంచుకి.—[ప్రవేశించి] ఏలినవారికి జయము. మంత్రిగారు మనవిచేయు
చున్నారు.—ఆహా! దేవరబుద్ధి శోభనముగా నున్నది. మంత్రిపరిషత్తు
ఇట్లే నిర్ధారించినది. ఏలన—

చ. ఇరువగఁ బంచినట్టిసిరి నిర్వురుఁ దాల్చి పరస్పరంబుఁ బ్రా
గరకరి విస్మృతిం బడ సుఖానఁ జరింతురు నీదునాజ్ఞఠ,
ధురను సమంబుగాఁ గొని ప్రతోదకు తోత్రపు సన్నచే
స్వర కుకృతు ల్మదిం గొనక వర్తిలు రథ్యయుగంబు చాడ్పునన్

రాజు.—అట్లయిన, ఇట్లు చేయుమని సేనాపతి వీరసేనునికి వ్రాసి
మంత్రిపరిషత్తునకుం జెప్పుము.

కంచుకి.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించి పావడములోడ గ
తెచ్చి వెండి ప్రవేశించి] ప్రభువు నాజ్ఞను తెలుపవచ్చితిని. ఇదిగో ఇప్పుడు

రగు సేనాపతి పుష్పమిత్రులవారి యొద్దనుండి ప్రాభృతముతోడి జాబు వచ్చినది. దీనిని దేవర ప్రత్యక్షీకరించుఁగాక.

[రాజు తటాలున వేచి సోపచారముగా గ్రహించి పావడమును శిరమునఁ దాల్చి పరిజనమునకు అర్పించును. కమ్మను నాట్యముచేత విప్పును.

దేవి.—అహా? నాహృదయము అటువైపే మొగంపెట్టుకొని వుంది. గురుజనకుశలం తర్వాత కుమారుడు వసుమిత్రుని వృత్తాంతాన్ని వింటాను. గుఱ్ఱానికి కాపుగా గదా నాకుమారుణ్ణి సేనాపతిగారు పంపినారు.

రాజు.—[కూర్చుండి చదువును.] "స్వస్తి—యజ్ఞవాటమునుండి సేనాపతి పుష్పమిత్రుఁడు వైదిశమందున్న మాకుమారుని ఆయుష్మంతుని అగ్నిమిత్రుని స్నేహంబున కౌఁగిలించుకొని శాసించుట. ఎఱుంగుము—నేను రాజయజ్ఞదీక్షితుఁడనై రాజపుత్రశతపరివారముతోడి వసుమిత్రుఁడు కాపుగా యజ్ఞాశ్వమును నిరర్గళసంచారిని సంవత్సరాంతమున మరల నాకడకు వచ్చి చేరవలసినదానినిగా విడిచితిని. దానిని సింధునదముదక్షిణతీరమున చరించుచుండఁగా యవనులగుఱ్ఱపుదండు పట్టవచ్చినది. అంతట ఇరువాగునకును బెట్టిదంపుఁ బోరితమయినది."

[ధారిణివిషాదమును రూపించును.

రాజు.—ఏమి ఇట్టిదైనది! (శేషమును చదువును.)

క. ‹‹అంత వసుమిత్త్రుఁడు ధను
ష్మంతుఁడు యవనులు హరించు మనతేజిని దు
ర్దాంతుఁడు వారల నోరిచి
పంత మెలర్పంగ బలిమి మరలిచి తెచ్చెన్. ౧౫

దేవి.—ఈవార్తచే నాహృదయం కుదుట బడినది.

రాజు.—(జాబులో మిగత చదువుచున్నాఁడు.) "ఇప్పుడు నేను అంశుమంతునిచేత సగరుండువోలె పౌత్త్రునిచే ప్రత్యాహృతాశ్వుండనై యజించుచున్నాను. కావున నిపుడు నీవు అవిలంబితముగా మనస్సులో రోషము మాని వధూజనముతోఁ గూడ యజ్ఞము సేవించుటకై రావలసినది." అని.

రాజు.—అనుగ్రహింపఁబడితిని.

పరి. — సంతోషము! సంతోషము! పుత్త్రునిజయముచేత దంపతులు వర్ధిల్లుచున్నారు.

ఆ. భర్త నిన్ను వీరపత్ను లౌసాధ్వుల
మూర్ధమందు నిల్పె ముదిత మున్నె;
వీరమాత వనెడువిఖ్యాతి యిపు డబ్బెఁ
బూవుఁబోఁడి నీకుఁ బుత్త్రివలన.

దేవి.—భగవతి, నాపుత్రుడు తండ్రివలె వీరుడైనందుకు సంతుష్టురాల...

పరి.—మౌద్గల్యా, గున్న ఏనుఁగు పరికానిని అనుకరించినది.

కంచుకి.—

తే. ఇంతవికాంతియును మాకు నించుకేని
యీబుడుతయందు వింతగా దితని కీవు
అలయబింధనవహ్నికి నార్వ్వనట్లు
దుష్ప్రిధర్షణుఁడవు జన్మదుఁడవు గాన.

రాజు.—మౌద్గల్యా, యజ్ఞసేనునివలెదిని మాని, కడమబంధుల నెల్ల ...
సేయవలసినది.

కంచుకి.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమిం...

దేవి.—జయసేనా, వెళ్లి ఇరావతి లోనైనరాణివాసాలకి పుత్రుని...
వృత్తాంతాన్ని నివేదించు.

ప్రతీ.—అలాగే. [అని ...

దేవి.—పోదుగాని రా.

ప్రతీ.—(వెనుకకు మరలి) ఇదుగో వచ్చితిని.

దేవి.—(జనాంతికము) నేను అశోకదోహదానికి నియోగించినప్పుడు ...
కకి ప్రతిజ్ఞచేసివుంటినిగదా, దాన్నిన్ని ఈబాలికకులాన్నిన్ని చెప్పి, నా...
నీవు ఇరావతిని, నాసత్యంనుండి నన్ను తప్పించకు మని, అనునయించవలెను...

ప్రతీ.—దేవిగారియాజ్ఞ. (అని నిష్క్రమించి, మరల ప్రవేశించి) ...
యానికి సంతోషించిన రాణివాసాల నగలకి నేను మంజస నైనాను.

దేవి.—ఇదేమి ఆశ్చర్యమా! ఈయభ్యుదయం నావున్న వారికిన్ని స...
గదా.

ప్రతీ.—(జనాంతికము) దేవీ, ఇరావతి మరి విన్నవిస్తుంది. ఏలిక ...
తోలుత ఇచ్చినమాట తప్పిపోవడం తగదు గదా.

దేవి.—భగవతి, ఆర్యుడు సుమతి తొలుత సంకల్పించినప్రకారం మా...
నీయనుజ్ఞతో ఈయ్యడానికి కోరుతూ వున్నాను.

పరి.—ఇప్పుడును నీవే ఈమెకు స్వామినివి.

దేవి.—(మాళవికను చేయి పట్టుకొని) ప్రియంచెప్పినందుకు తగిన పారితోషికంగా ఆర్యపుత్రుడు ఈమెని మాళవికని పుచ్చుకోవలెను.

[రాజు లజ్జచే ఊరకుండును.

దేవి.—(చిఱునవ్వుతో) ఆర్యపుత్రుడు నన్ను సరకుచేయడా యేమి?

విదూ.—దేవీ, ఇది లోకమర్యాద గదా, కొత్తపెండ్లికొడుకు ప్రతివాడున్ను లజ్జావశుడు కావడం.

[రాజు విదూషకునిం గాంచును.

విదూ.—అది కాకుంటే, దేవిగారే ప్రేమాతిశయంతో దేవీపదపూర్వకంగా ఇస్తే మాళవికని దేవరవారు ప్రతిగ్రహించ నిచ్ఛగిస్తారు.

దేవి.—రాజకుమారికి ఈమెకి పుట్టుకే దేవీశబ్దాన్ని ఇచ్చింది. మఱి పునరుక్తి యెందుకు?

పరి.—అట్లు గాదు.

ఆ. ఆకరమునఁ బుట్టి నది యయ్యు మణిజాతి
భవ్యసంస్కరణముఁ బడయదేని
కాంచనంబుతోడఁ గల్యాణిరో యెట్లు
యోగమును భజింప యోగ్యమగును? ౧౮

దేవి.—మన్నించు భగవతీ. అభ్యుదయకథలో నేను తలంచనైతిని. జయసేనా, నీవు వెళ్లి తెల్లపట్టు వలువ తీసుకొనిరా.

ప్రతీ.—దేవిగారియాజ్ఞ (అని నిష్క్రమించి, పట్టువలువం దెచ్చి ప్రవేశించి) దేవీ, ఇదుగో.

దేవి.—మాళవికకు (మేల్ముసుంగు వైచి) ఆర్యపుత్రుడు ఇప్పుడు ఈమెని ప్రతిగ్రహించును గాక.

రాజు.—దేవీ, నీయాజ్ఞకు మే మెదురాడుదుమా!

పరి.—ఆహా! ప్రతిగృహీత యైనది!

విదూ.—అహాహా! దేవిగారియనుకూలత!

[దేవి పరిజనమును చూచును.

ప్రతీ.—(మాళవికం దఱిసి) జయం భట్టినిగారికి.

[దేవి పరివ్రాజకను కాంచును.

పరి.—ఇది నీయందు వింత గాదు.

క. ప్రతియువతిచేత నైనను
బలినారాధింత్రు భర్తృవత్సలలు సతుల్
ఇతరధునీశతములఁ దమ
పతిఁ జేర్చు సముద్రగ స్రవంతుల పోల్కిన్.

నిపుణిక.—(ప్రవేశించి) జయము ఏలినవారికి. భట్టిని ఇరావతి ...న్నది—"అప్పుడు నేను ఉపచారాతిక్రమంచేత ప్రాణేశ్వరునియెడల యే ... చేస్తినో అది ప్రాణేశ్వరునికి అనుకూల మాచరించడమే అయినది. ఇప్పుడు ... నిండిన ప్రాణేశ్వరుడు ప్రసాదమాత్రంచేత నన్ను ఆదరించవలె" నని!

దేవి.—నిపుణికా, తప్పక ఆర్యపుత్రుడు ఈమెచేసిన సేవను తెలుసు...

నిపు.—అనుగృహీత నైతిని.

పరి.—దేవా, ఈయుక్తసంబంధముచేత కృతార్థుఁ డైన మాధవసే...వించుటకు పోయెదను.

దేవి.—భగవతి మమ్ము విడిచి వెళ్లడం యుక్తం గాదు.

రాజు.—భగవతీ, నా వ్రాయించుజాబులలో నే ఆయనకు నీవు పలికె...దనవచనములను వ్రాయించెదను.

పరి.—మీయిరువుర స్నేహముచేత నేను అస్వతంత్రురాలను.

దేవి.—ఆర్యపుత్రుడా, నీకు ఇంకను ఏమి ప్రియము చేయుదును!

రాజు.—ఇంకనుం బ్రియ ముండునా! అయినను ఇట్లగును గాక.

[భరతవాక్యము]

ఉ. నీవు ప్రసన్నవక్త్రి వయి నిత్యము న న్గనుచుండు చండిరో;
నే విమతార్థ మీవరమె ని న్నిటు వేఁడెద నానతుండ నై
ఏవి యలభ్యముల్ ప్రజల కీతివిరామము మున్న గాఁగ ద...
భూవరుఁ డగ్నిమిత్రుఁ డిలఁ బ్రోచుచుఁ గాచుచు నుండ నిత్య...

[అని అందఱు నిష్క్రమి...

పంచమాంకము సమాప్తము.

ఆంధ్ర-మాళవికాగ్నిమిత్ర నాటకము

సంపూర్ణము.



PRINTED AT THE INDIA PRINTING WORKS, MADRAS

శ్రీ

# ఆంధ్ర - రత్నావళీ నాటిక

[శ్రీహర్ష రచితమునకు ఆంధ్రమున అనువాదము]

వేదము వేంకటరాయశాస్త్రి
ప్రణీతము

ప్రథమముద్రణము



1921

దీనివెల 12 అ.

# విజ్ఞప్తి.

కడచినవత్సరము జూలై మొదలు ఆముక్తమాల్యదకు తత్పూర్వ లిఖితావశిష్టమైన టీకను వ్రాయుచుంటిని. అది నవంబరులో సమాప్తిం జెందినది. అందులకైన పరిక్లేశమువలన అనారోగ్యము పైకొనినది. తత్స హనోపాయముగా డిసెంబరు జనవరినెలలలో రత్నావళీవిక్రమోర్వశీయ ములను ఆంధ్రీకరించితిని.

ఆవృత్తాంతమును—పూర్వము మదీయమాళవికకు ముద్రణ వ్యయము నొసంగినవారు కావ్యనాటకాదివాఙ్మయరసజ్ఞశిఖామణులు విడవలూరుగ్రామవాస్తవ్యులు పంటకులవతంసులు సదాచారధురంధరులు

నెల్లూరిలో నిధిపతులు

## శ్రీయుత-దొడ్ల రామిరెడ్డిగారు

విని, అత్యంతప్రీత్యుత్సాహములతో ఏతద్రచనంగూర్చి తమయభినందన ముం దెలుపుచు ఏతద్గ్రంథద్వయముద్రణమునకు పర్యాప్తమైనధనమును నాకుం బంపినారు.

శ్రీరామిరెడ్డిగారు 20 ఏండ్లకుముందు విక్రమోర్వశీయము నాంధ్రీకరింపుమని నన్ను హెచ్చరించిరి. వారి యాయిాప్సితము నావలన ఇప్పటికి నెఱవేఱినది.

నాదు ప్రజ్ఞారిక్తగ్రథనమునకు ముద్రణార్థము అప్రార్థితముగా తోడ్పడినట్టి యీసరస్వతీసరస్వత్పుత్త్రీలాలితునికి అత్యంతకృతజ్ఞుఁడను.

ఆయుత్తాకోడంద్రిరువురును శ్రీరెడ్డిగారికి విద్యకన్న ఐశ్వర్యమును ఐశ్వర్యముకన్న విద్యను పోటీలుమెఱసి యొసంగుచుందురుగాక.

అక్టోబరు, 1921 మదరాసు.

వే. వేంకటరాయశాస్త్రి.

శ్రీ

# రత్నావళీ నాటిక

—————:o:—————

నాంది

మ. చరణాగ్రస్థిత యై, స్తనోచ్ఛ్రితికి శశ్వన్నమ్ర యై, దృక్త్రయిన్
హరుఁ డాసాసలఁ గాంచ, హైమవతి లజ్జాన్విత యై, పూజలో
గరుపాటున్ నును జెమ్మటల్ వణఁకునుం గా, మౌళి కై చిమ్మ, నం
తరమం దాకుల వూసుమాంజలి యనంత శ్రీలు మీ కిచ్చుతన్. ౧

మఱియు,

మ. త్వరగొల్పన్ మరు లెంతయున్, సహజ యాడ్వన్ లజ్జ వే వెన్కకున్,
సరసోక్తంబుల వెండి బంధులలనల్ సామ్ముఖ్యముం గూర్పఁగా,
పరమోహాలం గని త్రాస మంది గగురున్ బ్రాపించి తొల్కాటమిన్
సరసం జేరఁగ శూలి నవ్వి మెయిఁ గొన్నర్వాణి మి మ్మేలుతన్. ౨

మఱియు,

తే. త్రచ్ఛితివి గావె యామకరధ్వజు మును
నాకొఱకె నీవు, గావున, నీకుఁ దగుర
మత్సమక్షమె ధర బహుమార్గ మోవ;
దానినే భావకుటిలను దన్పుకోర,

తే. కృష్ణకంధరాగ్రహ ముజ్జగింపు, నాన
గండ. — యనుఁ గిన్క నెవని నగప్రభవయు
నబ్ధిభవయు నాదేవుఁ డనల్పకరుణ
సర్వసౌభాగ్యములు మీ కొసంగుఁ గాత.

మఱియు,

తే. కినుక జ్వలియించుదృక్త్రయిఁ గనినయంత
మూఁడుపవహ్నులునుఁ ముచ్చముడిఁగి సమసె;
చికురతరగణములు తలచీర లోఁడియ
దద్దిరిలి ఋత్విజులు భీతి ధరణిఁ బడిరి;
దక్షుఁడు నుతించు, నేడ్చుఁ దత్పత్ని జాలి,
మందలుగ వేల్పులును మటుమాయ మైరి. —
అని హసించుచు దేవికి యజ్ఞనిహతిఁ —
జెప్పెడు శివుండు మిమ్ము రక్షించుఁ గాత.

[ఇదియుఁగాక,

తే. జయము రిక్కలదొరకు, నంజలి సురలకు,
ద్విజవృషుల్ నిరుపద్రవస్థితిఁ బడయుత,
పుడమి సస్యసమృద్ధతఁ బొదలుఁగాత,
విభుఁడు చంద్రవపుఁడు ప్రతాపించుఁ గాత.]

# ప్రస్తావన

నాంద్యంతమున,

సూత్రధారుఁడు:—అతివిస్తర మేల? నేఁడు విక్రమసింహపురీ నాయకస్వామి వసంతోత్సవములో మిళితులైన రసికవతంసులు సభ తీరి సన్మానంబుగా పిలువంబంచి యిట్లానతిచ్చినారు. — "మామిత్రులు వేదము వేంకటశాస్త్రిగారు శ్రీహర్షప్రణీత రత్నావళీనాటికను ఆంధ్రంబున రచించిన యది పఠించితిమేగాని ఆటలోఁ జూడమైతిమి. దానిని నీవు మాత్రమేలనాటకానందంబు గావింపవలయును." అని. [పరిక్రమించి చూచి] కావున నిప్పుడు రచనం గావించి వారి యభిలషితమును నెఱవేర్చెద: [పరివర్తిపంక్తి] అహో! సకలసామాజికులయు మనస్సులు వశీకృతము లయ్యె నని నా నిశ్చయ మేల యన—

శా. శ్రీహర్షుండు కృతిప్రణేత, సదసుఁ జేరె న్గుణగ్రాహి, యా
తేహృద్యం బగు వత్సరాజకథయుం, గేర్పొప్ప మా కా

ఈహాసిద్ధి నొనర్చు నిం దొకఁడొకండే; యేమి భాగ్యంబొ కా!
డాహా! సర్వగుణంబులుం గలిగె నా కానందరాజ్యంబుగా! ౫

శా. వేంకటరాయశాస్త్రి కవి, వీనులవిందులు వత్సరాట్కథల్,
కొంకము మేము నాట్యమున, గోవిదసత్తము లీసభాసదుల్;
ఇంకను నేమి గావలయు, నిం దొక డొక్కఁడె కార్యసిద్ధి కా
కొంకి, యి వన్నియుం గలయు కీవిని దైవ మొసంగెఁ నేఁటికిన్. ౬

కావున నింటి కరిగి యిల్లాలిం బిలిచి సంగీతక మారంభించెదను. [పరిక్రమించి నేపథ్యాభిముఖము గాంచి] ఇది మా యిల్లు. లోనికిం బోయెద. [చొచ్చి] ఆర్యా! ఇటురమ్ము.

నటి [ప్రవేశించి].—ఆర్యపుత్రా, ఇదుగో వచ్చినాను. ఏపనుపు సేయుమంటావో ఆజ్ఞాపించు.

సూత్ర.—ఆర్యా, ఈ సభవారు రత్నావళీదర్శనోత్సుకులై యున్నారు. కావున నేపథ్యముం దాల్పుము.

నటి.—[నిశ్వసించి సనిర్వేదము] ఆర్యపుత్రా, నీకు చింతే లేదు. మఱి నీవు ఆడకేమి? నే నంటేనో అదృష్టహీనురాలిని. నాకు ఒక్కతే కూతురు. దాన్ని నీవు ఏలాగో దేశాంతరంలో ఇచ్చినావు. మఱి దూరదేశంలో వున్న వరునితో దానికి పెండ్లి ఏలా గవుతుందా అనేచింతచేత నాకు ఏమీ తోచడం లేదు. ఇటువంటి యాస్థితిలో నేను ఆడడం యేమిటి?

సూత్ర.—ఆర్యా, వరుఁడు దూరస్థితుఁడని దిగులుపడకు. ఇదె చూడు:

తే. కడలినడుమనుండి, కడల కావలినుండి,
యొండు దీవిగడ్డనుండి, తెచ్చి,
నిమిషమాత్రలోన సమకూర్చుఁ బో విధి
యభిముఖుండ యేని యభిమతమును. ౭

[నేపథ్యమున]

ఒళీ! భరతపుత్రుఁడా, ఒళీ! అది యట్లే, సందేహము లేదు. "కడలి నడుమ" ఇత్యాది.

సూత్ర.—[విని, నేపథ్యాభిముఖముం గాంచి] ఆర్యా, ఇంకను తామసించెదవేమి? వీఁడుగో నాతమ్ముఁడు యౌగంధరాయణ వేషమును దాల్చి వచ్చియున్నాఁడు. రా మఱి, మనమును అనంతరకరణీయము లయిన యితరవేషముల ధరించి సిద్ధపడుదము.

[అని నిష్క్రమింతురు.

ప్రస్తావన సమాప్తము.

## విష్కంభకము.

[అంతట, హృష్టుఁడు యౌగంధరాయణుఁడు ప్రవేశించును.]

యౌగంధరాయణుఁడు. — ఇదియిట్లే. సందేహము లేదు. ["శరణ... ఇత్యాది మరలం బఠించి] కాదేని, సిద్ధుని యాదేశమును విశ్వసించి నేను సింహళేశ్వ... ప్రార్థించిన యాతని కూఁతురు సముద్రములో ఓడ పగిలి మునిఁగినట్టిది ఒకఫలక... లేచుటయు, కౌశాంబివాఁడు వణిజుఁడు సింహళమునుండి వచ్చుచు ఆయవస్థలో... యాబాలను కాచుటయు, అతఁడు రత్నమాలాచిహ్నముచేత ఆమెను ఆనవాలుపట్టి... కుం దెచ్చుటయు, ఇవి యెట్లు ఘటిల్లును? [హర్షముతో] ఎల్లవిధములను వాని... అభ్యుదయములు ఒనఁగూడుచున్నవి. [ఆలోచించి] నేను ఈమెను సగౌర... దేవిచేతం బెట్టుటయు యుక్తమే. వింటిని గదా ఇచ్చటికంచుకి బాభ్రవ్యుఁడు... శేశ్వరమంత్రి యగువసుభూతితోఁ గూడ ఎట్లో సముద్రమునుండి గట్టెక్కి... కోసలుని సమయింపంబోయియున్న రుమణ్వంతునితోఁ గలసినాఁడని. ఈ ... ప్రభుప్రయోజనము సిద్ధప్రాయమ యైనను నాకు ధృతిం గూర్పకున్నది! కష్టము... భృత్యభావము.

తే. ఒడయనికి మేలు కూర్చునీయుద్యమమున
నిట్లు దైవంబు చేయూఁత యిచ్చి యుండ,
నగును నిచ్చలు సిద్ధి; యట్లైనఁ బతికి
జంకుచునె యుండు స్వచ్ఛందచారి నగుట.

[నేపథ్యమునం గలకలము]

[విని] అహో! మృదుమధుర మృదంగవాదనానుగతం బయిన సంగీత... పౌరులచర్చరీధ్వని మ్రోల నుద్ఘమించుచు వీనులకు విం దొనర్చుచున్నది! ఇయ్యది... నూహించెద - మదనమహోత్సవముచే పెంపారుచున్న యీ పౌరజనప్రమోద... గాంచువాఁడై ప్రభువు ప్రాసాదమునకు తరలినాఁడని. [ఊర్ధ్వము చూచి] ... అప్పుడే ప్రభువు ప్రాసాదము నెక్కినాఁడే! ఇదె యీతఁడు—

తే. ప్రియవసంతుండు, విశ్రాంతవిగ్రహుండు,
జనమనోనిలయుఁడు, రతిసంగతుండు;
స్వమహమును జూచులివ్రట సాక్షాత్కరించు
ప్రసవధనుఁ డన నదె వత్సరాజు వచ్చు.

కావున నేను మహారాజు వేలికిం జని కార్యశేషమ మరసెద. [అని నిష్క్రమించును]



విష్కంభకము సమాప్తము

# ప్ర థ మా ం క ము

[అంతట ఆసనస్థుఁడు ధృతవసంతోత్సవవేషుఁడు రాజు ప్రవేశించును, విదూషకుఁడును.]

రాజు.—[హర్షముతోఁ గాంచి] సఖుఁడా, వసంతకా !

విదూషకుఁడు.—ఆనతియ్య వయ్యా.

రాజు.—

మ. సమయం జేసితి వైరులన్, వసుమతిన్ సన్మంత్రికై నుంచితిన్,
శమితోపద్రవతన్ జనుల్ వినుతరక్షాప్రాప్తి రక్తుల్ సుఖుల్,
సమయం బామని, యీ, వవంతి భవయున్ ; సంకేతమాత్రన్ ధృతిన్
సుమబాణుండు భజించుఁగాతఁ దన దంచు ; న్నాదె యీపండు గా.

విదూ.—[హర్షముతో] వయస్యుడా, నీవు చెప్పినది సరే. దీన్ని గురించి నీ వీలా గన్నావు గదా, అయినా నే ననుకొంటూను, ఈ మదనమహోత్సవం నీదీ గాదు కామదేవుడిదీగాదు, బాపనవటువ నైన నావొక్కనిదే అని. [చూచి] ఈమాట కేమి గాని, చూడవయ్యా ఛూడు, సాశాయి తాగి కైపెక్కిన యీకామినులు స్వయంగా పైకొని చిమ్మనగోవుల నెత్తి గురిపెట్టి చల్లిన వసంతముతో పౌరజనులు ఉల్లాసం మీఱి ఆడుతూవున్న యీనృత్యముచేతను ఎక్కడ చూచినా ఇచ్చను మెచ్చుగా హెచ్చుగా వాయిస్తూవున్న మద్దెళల ధ్వనితోటి చర్చరీశబ్దాలచేతనున్న రాజమార్గపు మొగాలు మోగుతూవుండగా బుక్కాచల్లకాలచేత దట్టమయిన దశదిక్కుల మొగాలతో ఈ మదనమహోత్సవం ఎంత శోభిస్తూవుందో చూడు.

రాజు.—[హర్షముతోఁ గలయం గని] అహో ! పౌరుల ప్రమోదము పరమోచ్ఛ్రితిం బొందియున్నది !

తే. కౌంకుమక్షోదగౌర బుక్కాప్రవృష్టి
సకలదిశలకు నిడఁ దొలుసంజసిరిని,
శిరములను వంప వంజుల శేఖరములు,
మేనులను తుంప వసలత ఖనిదాలు,

తనదు వేసమున ధనేశుధనగృహంబు
జవురుకొనె నాఁగ నొప్పు కౌశాంబి యిపుడు
బంగరుమొలాము గొనిరి సర్వజను లనఁగఁ
బసిమి యెక్కఁడె వన్నెగాఁ బరిఢవిల్లె.

మఱియు,

శా. పౌరుల్ ముంగిటఁ గ్రోవులన్ గురిసి కాల్వల్గాహిమాంబుల్, ...
మూరింబో, నటియింపఁ, ద్రొక్కుడుల యేపుల్ సేయ...
నారీమండలి చెక్కుచెంద్ర మురలన్, నానాపదన్యాస ...
యీరాక ట్టఖిలంబు చెందిరమె యై యేపారె నెక్కు ...

విదూ.—[చూచి] ప్రియవయస్యుడా, బలేజాణ లయినసరసులు ... గ్రోవులతో చిమ్మిన వసంతాలపోట్లకి సీత్కారం చేస్తూ ఈభోగాల ... ఏలాగు విలసిస్తున్నారో చూడు.

రాజు.—[చూచి] వయస్యుఁడా, సరిగా కనిపట్టితివి. ఏలన,

ఉ. మానక రాలుబుక్కబలుమబ్బులు చేసెడిచిమ్మచీకటిన్
గానఁగ నా చొకింత మణికాంచనభూషణరశ్మిపాళిచేన్,
పూనికఁ గ్రోవుల న్ఫణలపోలిక నెత్తుభుజంగలోక మా
ధ్యానము మీఱ నన్ను బలిధామమునన్ స్మరియింపఁ జేసెడిన్.

విదూ.—[చూచి] ఓవయస్యుడా, ఇదుగో మదనిక మత్తుకు తగినట్టు ... నయం చేస్తూ చూతలతికతో కూడా ఇక్కడికే వస్తూవున్నది. చూడు [ప్రియ...

[అంతట మదలీలను నటించుచు ద్విపదీఖండము పాడుచు
ఇరువురు చేటికలు ప్రవేశింతురు.]

గేయము

వలకడ తెమ్మెర వచ్చెనే! వలరాజు నానతిఁ దెచ్చెనే!
ఎలనాగ లను గంట గించెనే! ఎలమావు లను నని పించెనే!
పొగడతావుల వెద సల్లెనే, మగువల మగలపై నల్లెనే,
తొలకరింట యీలువు త్రుంచెనే, చిగురుంబోఁడులగుండె ...

క. మునుమును మధుమాసం బట
జనులమొదల మెత్తఁబఱుచుఁ, జయ్యన నంత్రా
అను వాటఁ జొరఁగఁ, గాముఁడు
మునుకొని కాడంగ నేయుఁ బువ్వబాణములన్. ౧౫

రాజు.—[చూచి] ఆహా! ఈచేడెల యాటలమి పాటిమీఱి మనోహరముగా నున్నది. అట్లేగదా;

ఉ. వేనలి స్రస్తమై చెదరి వీడ్కొనె నల్లినమెత్తుపోశమిన్,
మానక పాద మంటి యినుమట్టుగఁ గ్రందిలుచున్న వందియల్,
పూనుచుఁ గంప మిట్టటుయి మోఁదుచునున్నది హార మక్కునన్,
కౌను కుచాద్రినమ్రము ద్రెగంబడ మత్త నటించుచీడ నాన్. ౧౬

విదూ.—[నవ్వుచు] వయస్యుడా, నేనుగూడా కాసెగట్టిన యీచేడెల మధ్య ఆడుతూ పాడుతూ రవంత సేపు హోళీపండుగని గౌరవించివస్తాను.

రాజు.—[చిఱునగవుతో] వయస్యా, అట్లే చేయుము.

విదూ.—నీయాజ్ఞ [అని లేచి చేటికల నడుమ నర్తించుచు] ఓ మదనికా, ఓ చూతలతికా, ఈచర్చరిని నాకున్ను నేర్పండి.

మదనిక.—[నవ్వి] చెడిబతికినవాడా, ఇది చర్చరి గాదోయి.

విదూ.—మఱి యి దేమిటి?

మద.—చెడిబతికినవాడా, ద్విపదీఖండమోయి యిది.

విదూ.—[హర్షముతో] ఈఖండంతో మోదకాలు చేస్తారా లడ్డువులు చేస్తారా?

మద.—చెడిబతికినవాడా, కాదు కాదు, పాడేదోయి యిది.

విదూ.—[అచ్చెరువుతో] పాడేదా యిది! [విషాదముతో] పాడేదే గాని తినేది కాకుంటే నా కెందుకు ఇది? ప్రియవయస్యుడికాడికే వెళ్తాను.

[అని పో నుంకించి ఓసరిలి కూర్చుండును. ఆయిరువురును లాగుదురు. విదూషకుఁడును లాగును.

ఇరువురును.—[ఆకసిచేతులు పట్టుకొని] ఉండు. చెడిబతికినవాడా, తప్పించుకొనివెళ్తావా? ఎక్కడికి వెళ్తావు? [అని బహువిధముల తాడనము సేయుదురు.

విదూ.—[చేతులు లాగికొని పలాయితుఁడై రాజును దఱిసి] ప...
న ర్తించితిని.

రాజు.—వయస్యా, క్రీడనముం గావించితివా?

విదూ.—క్రీడనం గాదు, పలాయనం గావించాను.

చూతలతిక.—ఓసే మదనికా, మనము చాలా సేవు ఆడినాము. ...
ఏలినవారికి దేవిగారిసందేశాన్ని నివేదింతాము.

మద.—చూతలతికా, చక్కగా జ్ఞాపకం చేసుకొన్నావు, అలాగే ...

ఇరువురును.—[పరిక్రమించి, కని] జయం జయం ఏలినవారికి. దేవరా, ...
ఆజ్ఞాపిస్తున్నారు - [అని సగముమాటలో లజ్జను నటించుచు] కాదుకాదు, ...
న్నారు.

రాజు.—[హర్షముతో నవ్వి ఆదరముతో] మదనికా, ఆజ్ఞాపించుచున్న...
టయే రమణీయము, మఱి మదనోత్సవములో అది మఱియు రమణీయము. ...
చెప్పుము దేవి యే మాజ్ఞాపించుచున్నదో.

విదూ.—ఓసి దాసికూఁతురా, ఏ మాజ్ఞాపిస్తున్నారే దేవిగారు?

చేటికలు.—దేవిగారు ఈలాగు విన్నపిస్తున్నారు, ఏమనంటే,- నే ...
మకరందోద్యానములో ఎఱ్ఱయశోకముకింద ప్రతిష్ఠచేసిన దేవుణ్ణి ...
చేస్తాను. ఆర్యపుత్రుడు అక్కడికి విజయంచేయవలెను.—అని.

రాజు.—వయస్యుఁడా, ఏ మందువు? ఉత్సవముమీఁద ఉత్సవము ...

విదూ.—మఱి లే, అక్కడికే వెళ్దాం ఎందుకంటే అక్కడికి ...
కుట్టిశాడికి నాకు స్వస్తివాచనం ఏమయినా దొరుకుతుంది.

రాజు.—మదనికా, పోయి దేవికి నివేదింపుము, ఇదె నేను ...
మునకు వచ్చితి నని.

చేటికలు.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్ర...

రాజు.—వయస్యుఁడా, రా దిగుదము.

[అని యిరువురును ప్రాసాదావరోహణము ...

రాజు.—వయస్యుఁడా, మకరందోద్యానమునకు దారి చూపుము.

విదూ.—ప్రభూ, ఇటు రమ్మా. [అని పరి...

విదూ.—[ఎదురం గాంచి] ఓయి ఇదే ఆమకరందోద్యానము. రా ...
శింతాము. [అని ప్ర...

విదూ.—[ఆశ్చర్యముతో] మహారాజా, చూడుచూడు, ఈమకరందోద్యానము, పిల్లతెమ్మెరలచేత ఊగులాడుతూవున్న ననిచిన యెలమావి పూగుత్తుల పుప్పొడి మొత్తాలతో మేలుకట్టు కట్టినదై కైపెక్కిన తేనెతిండుల ఝుంకారగానాలతో కోయిలల చేత తియ్యబల్కులు నీకు చెవులపండువుగా పలికించుచు నీరాకకోసం మహాదరము చూపుతూ వున్నది మఱి ప్రవేశించు.

రాజు.— [కలయం గని] ఆహా ! మకరందోద్యానము ఎంత రమణీయముగా నున్నది! ఏలన నిచ్చట,—

ఉ. మోసుల వైద్రుమంబులను మొల్టెడులేఁతచివుళ్ల నెట్టనై,
గాసటబీసలే యళులక్రందుకలార్భటిఁ గేలిఁ బల్కుచున్,
త్రోసెడితెమ్మెరన్ గోమలుతోడుతఁ దూలఁగఁ దామఁ దూలుచున్,
భాసిలుఁ గైపు గాంచె మధుభక్తము లౌట ననన్ మహీజముల్.

మఱియు,

తే. పొగడ గురిసెను మూలానఁ బూలవానఁ
గల్లుగండూషముల వెలిఁ గ్రక్కె ననఁగ ;
వెనుకఁ జిక్కినసంపెంగ ననిచె మద్య
తామ్రతరుణీముఖేందుసంధానగరిమ ;
ఆలకించి యశోకపాదాహతులను
గుబ్బెతలయందియలరొద, లుబ్బు మీఱి,
తేఁటితుటుములు ఝుంకారదీర్ఘగీతి
ననుకరణ మొనరించెడి ననఁ జెలంగు. ౧౫

విదూ.— [విని] వయస్యా, ఇది తుమ్మెదలు అందెలశబ్దాన్ని అనుకరించడం కాదోయి, ఇది దేవిపరిజనంమొక్క అందెల శబ్దమే.

రాజు.—అవునోయి, సరిగా కనిపట్టితివి వయస్యా.

[అంతట సకాంచనమాల వాసవదత్తయు పూజోపకరణములు చేతఁగొని సాగరికయు విభవంబుగ పరివారంబును ప్రవేశింతురు.]

వాసవదత్త.—ఓసే కాంచనమాలా, నాకు మకరందోద్యానానికి దారి చూపు.

కాంచనమాల.—భట్టిని, ఇటు ఇటు.

వాస.—[పరిక్రమించి] ఓసి కాంచనమాలా, నేను మదనపూజ చేసి కింద
నున్నానో ఆ రక్తాశోకము ఇంకా ఎంతదూరమే ?

కాంచ.—భట్టిని, ఇదుగో దగ్గిరనే ఉన్నది, చూడు భట్టిని. భట్టిని
ఆ బండెగురిగింజ ఇదే దట్టంగా పొడమిన పువ్వులతో వెలుగొందుతూవున్నది
అకాలంలో పువ్వులు పూచేలాగ చేయడానికోసం ఏలినవారు ప్రతిదినము
వున్న ఆసవమాలిక. దీని కవతల దేవిపూజకు తావయిన ఆ యెఱ్ఱ అశోకము,
కనబడుతూ వుంది.

వాస.—అయితే రా, అక్కడికే త్వరగా వెళ్దాము.

కాంచ.—రా భట్టినీ, రా. [అందఱు పరిక్రమించు

వాస.—ఇదే పూజాస్థానము ఆ రక్తాశోకము. రా మఱి, నాకు పూజో
ములను తే.

సాగరిక.—[సమీపించి] భట్టిని, ఇదుగో సమస్తమూ సిద్ధముగావుంది

వాస.—[చూచి, ఆత్మగతము] అయ్యో, పరిజనులు ఎంతపొరబాటు
ఎవనికంటి కగపడకుండా దాస్తూ వున్నానో ఆతని కంటియెదటనే పడనున్నది
ఈలాగు చెప్తాను గాక. [ప్రకాశము] ఒసే సాగరికా, ఏమే నీవు పరిజను
మదనమహోత్సవంలో మైమరిచివుండఁగా గోరవంకను విడిచి యిక్కడికి వచ్చి
దానికాడికే తక్షణం వెళ్లు. ఈపూజాద్రవ్యాన్ని కాంచనమాలచేతికి అప్పగించు

సాగ.—భట్టినియాజ్ఞ. [అట్లే చేసి కొంచెందియకుగులు నడచి ఆత్మ
శారిక నేమో నేను పదిలంగా సుసంగతచేత అప్పగించితిని. ఇక్కడ దీన్ని
నాకు ఆశ గలదు. ఏమంటే, దేవుణ్ణి కుసుమాయుధుణ్ణి మానాయనగారి
లో ఏలాగు పూజచేస్తారో ఇక్కడకూడా ఆలాగే చేస్తారా, కాక మరో
చేస్తారా, చూతామని. అందుకోసము నేను ఎవరికీ కనబడకుండా వుండి
[పరిక్రమించి చూచి] కనక ఇక్కడ పూజాసమయం వచ్చేలోపల నేనున్న
పూజించడానికి పువ్వులు కోస్తాను. [అని పువ్వులు కోయుటను అభిన

వాస.— కాంచనమాలా, అశోకమూలమున, భగవంతుణ్ణి కుసుమా
ప్రతిష్ఠించు.

కాంచ.—భట్టిని యాజ్ఞ. [అని యట్లు చే

విదూ.—[పరిక్రమించి చూచి] వయస్యా, అందెలరవళి నిలిచినది
అశోకమూలానికి వచ్చాం దని నేను తలుస్తాను.

రాజు.—చక్కఁగా ఊహించితివి. ఇదిగో దేవి, చూడు. ఈపుణ్యశీల,—

తే. కుసుమసుకుమారమూర్తి యీ బిసరుహాక్షి
వ్రతముచేఁ గాను సూక్ష్మతరంబు గాఁగఁ
దనరుచున్నది మకరకేతనుఁడు పజ్జ
నునిచికొన్న ధనుర్యష్టియో యనంగ. ౨౦

కావున రమ్ము సమీపింతము. [సమీపించి] ప్రియా వాసవదత్తా—

వాస.—[చూచి] ఓహో ఆర్యపుత్రుఁడే! జయము జయము ఆర్యపుత్రునికి. మహారాజు ఈచోటిని ఆసనగ్రహంచేత అలంకరించును గాక. ఇదుగో ఆసనము. ఆర్యపుత్రుడు ఇక్కడ కూర్చుండవలెను. [రాజు నాట్యముచే కూర్చుండును.

కాంచ.—దేవీ, శోభించుచున్న యీ యశోకవృక్షముకాడికి వెళ్లి నీచేతితోనే పువ్వులు కుంకుమ చందనము వస్త్రాలు అర్పించి భగవంతుణ్ణి ప్రద్యుమ్నుణ్ణి పూజించు.

వాస.—నాకు పూజోపకరణాలను అందీ.

[కాంచనమాల అందిచ్చును, వాసవదత్త పూజించును.

రాజు.—ప్రియా, వాసవదత్తా,

ఉ. నూతనమజ్జనప్రభవనూత్నవివిక్తవిశిష్టశోభతన్
ఖ్యాతకుసుంభరాగరుచిరాతిపరిస్ఫురదంశుకాంతతన్
ఆతతమోదముం గొలిపె దబ్జదళాయతనేత్రరో, మనో
జాతుని నోముచున్ మృదులశైశవవిద్రుమశాఖకైవడిన్. ౨౧

మఱియు,

క. దయితరో, మదనుని నోమెడు
కయిత్తో నీవంటెనంతఁ గంగేళి నవో
దయమృదుతరాపరకిసా
లయ మన నానేత్రయుగళి లాలన గొల్పున్. ౨౨

ఇదియునుం గాక,

క. బాలరో, యనంగుఁ డిప్పుడు
చాలఁ దనయనంగతను నిజముగా దూఱున్ ;
ఏలనఁ దాను భవత్కర
హేలా స్పర్శోత్సవంబు నెనయనికతనన్. ౨౩

కాంచ.—భట్టినీ, భగవంతుణ్ణి ప్రద్యుమ్నుణ్ణి పూజించినావు. మఱి ప్రభు గారికి తగిన పూజాసత్కారం కానీ.

వాస.—నాకు పువ్వులున్ను మైపూతనున్ను అందీ.

కాంచ.—భట్టినీ, ఇదుగో సమస్తము సిద్ధము.

[వాసవదత్త నాట్యముచే రాజును పూజించును.

సాగరిక.—[పూవులు తెచ్చుకొని] కట్టా కట్టా ! పూవులు కోసుకొనే లేమిలో మఱిచి చాలా ఆలసిస్తిని. అందుచేత ఇదుగో ఈ వావిలిచెట్టుచాటున కనబడకుండా దాగి చూస్తాను. [చూచి] ఏమి! ప్రత్యక్షుడే అపూర్వుడు కుసుమాయుధుడు! మానాయన గారి అంతఃపురంలో చిత్తరువున ఈతని అర్చిస్తారు. ఇక్కడ ప్రత్యక్షుణ్ణి చేసి అర్చిస్తు వున్నారు. కనక నేనున్ను ఇక్కడినుంచే ఈపువ్వులతోటి భగవంతుణ్ణి కుసుమాయుధుణ్ణి పూజిస్తాను. [అని కుసుమములను చిమ్మును]. భగవంతుడా కుసుమాయుధుడా, నీకు నమస్కారము. నాకు శుభదర్శనుడవు అగుదువుగాక. చూడదగిన దానిని చూస్తిని నాకు అమోఘదర్శనుడవు కమ్ము. మఱి నన్ను ఎవరున్నూ చూడకముందే వెళ్ళి పోతాను. [అని కొలఁదియడుగులు నడచును.

కాంచ.—ఆర్యా, వసంతకుడా, రా, మఱి నీవు స్వస్తివాచనం గ్రహించు.

[విదూ.—సమీపించును.

వాస.—[విలేపనకుసుమదానపూర్వకముగా] ఆర్యా, ఇదుగో స్వస్తివాచనః పుచ్చుకో. [అని అర్పించును.

విదూ.—[హర్షముతో గ్రహించి] నీకు మేలవుగాక.

[నేపథ్యమున వైతాలికుఁడు పఠించును.]

చ. చరమగిరిన్ సమస్తరుచి జాఱిచి హేళి నభోంత మంటఁగా,
నరపతు లెల్లరుం గలసినారు భవత్సభ సంజప్రొద్దునన్
హరువుగ నిప్డు ఓ యుదయనా, కనువిందుల సారసప్రభా
హరముల నీదుపాదముల నబ్జునిపాదములట్లు గొల్వఁగాన్.

సాగ.—[విని హర్షముతో రాజును చూచి సస్పృహముగా] ఏమి ! ఈయన నన్ను మానాయన యిచ్చిన ఆ ఉదయనమహారాజా! [నిట్టూర్పునిగిడించి] కనక ఇతని కొలువుచేత నొగిలిన దైన్యప్పటికీ ఈతనిదర్శనంచేత నా శరీరము నాకు బహుమతే మైనది

రాజు.—ఏమి! ఉత్సవముచేత వ్యగ్రచిత్తుఁడనై సంధ్యాతిక్రమమును సయితము గుర్తింపనైతిని! దేవీ, కనుము.

క. ఉదయగిరితటాంతరితుని
నదె సూచించెడిని బ్రాచి యామినినాథున్
వదనపరిపాండిమముచే
హృదయస్థితుఁ డైనదయితుఁ బ్రియయును బోలెన్. ౨౫

దేవీ, మఱి లేతము, లోఁగిటికే పోవుదము.

[అందఱును లేచి పరిక్రమింతురు.

సాగ.—ఏమి ! దేవి తరలిందే ! కానీ. త్వరగా వెళ్తాను. [రాజును ఆసతో చూచి నిట్టూర్చి] ఏమి నామందభాగ్యత ! ఈయనను చాలాసేపు చూడడానికైనా నోచనైతిని.

[అని నిష్క్రమించును.

రాజు.—[పరిక్రమించుచు]

శా. దేవీ, నీముఖకాంతిచే నమృతరుక్తేజస్తిరస్కారిచే
వేవే నాన వహించి యబ్జములివే విచ్ఛాయతం బొందెడిన్;
నీవిన్నాణపుటూడిగంపుగణికల్ నిస్తంద్రతం బాడఁగాఁ
బూవుంగ్రోవుల లజ్జ డాఁగెడి నివే పుష్పంధయవ్రాతముల్. ౨౬

[అందఱు నిష్క్రమింతురు.

మదనమహోత్సవ మను ప్రథమాంకము

సమాప్తము

---

## ప్ర వే శ క ము

---

[అంతట శారికాపంజరమును చేతఁగొని సుసంగత ప్రవేశించును.]

సుసంగత.—అయ్యో, మరి యీగోరువంకను నాచేత బెట్టి ఎక్కడికి వెళ్లిపుందును నాప్రియసఖి సాగరిక ? [మఱియొకవంక చూచి] ఇదుగో నిపుణిక, ఇక్కడికే వస్తూవుంది. దీన్ని అడిగి చూస్తాను.

[అంతట నిపుణిక ప్రవేశించును.]

నిపుణిక.—తెలుసుకొన్నానుగదా ఏలినవారి వృత్తాంతాన్ని. మఱివెళ్లి భర్తకు విన్నపిస్తాను. [అని పరిక్రమించును.

సుసం.—ఒసే నిపుణికా, ఎక్కడికే ఆశ్చర్యంచేత మైమరిచినదాని లాగ నీవు ఇక్కడనే వున్న నన్ను లక్ష్యంచేయక దాటిపోతూవున్నావు?

నిపు.—ఏమి! సుసంగతా! ఒసే సుసంగతా, నీవు సరిగానే కనుక్కొన్నావు నాయాశ్చర్యానికి కారణ మున్నది. ఏమంటే? నేడు దొరవారు శ్రీపర్వతంనుంచి వచ్చిన శ్రీఖండదాసుడనే పేరుగల ధార్మికుడివల్ల అకాలములో పుష్పించే లాగు శీఘ్ర దోహదాన్ని నేర్చుకొని తాను పెంచుకొన్న నవమాలికని దానిచేత పూలమొత్తముతో శోభించేలాగ చేస్తారట. అక్కడికి ఈవృత్తాంతాన్ని కనుక్కొమ్మని దేవి పంపగా నే వస్తూ వున్నాను. నీ వెక్కడికి వెళ్తున్నావు?

సుసం.—నాప్రియసఖిని సాగరికని వెదకడానికి.

నిపు.—ఒసే, రంగులపెట్టె, చిత్తరుఫలక, తూలిక, వీటిని చేతబట్టుకొని సాగ రిక అరిటిచెట్ల యింటిలోపలికి వెళ్తూవుండగా నేను చూచినాను. అక్కడికి వెళ్లు చెలీ. నేనున్ను దేవికాడికే వెళ్తాను. [అని నిష్క్రమింతురు.

ప్రవేశకము సమాప్తము.

---

## ద్వితీయాంకము

---

[అంతట సాగరిక చిత్రఫలకవర్తికలం గొని మదనావస్థను నటించుచు ప్రవేశించును.]

సాగ.—హృదయమా, దయదాల్చు దయదాల్చు. ఎందుకు నీకు ఆయాసంతప్ప వేరే ఫలం లేని యీ దుర్లభజనప్రార్థనాపారము, ఇది గాక, ఎతణ్ణి చూచిన మాత్రాన నీకు ఇటువంటి సంతాపం పెరుగుతూవుందో [ఆశ్చర్యముతో] మళ్లీ అతణ్ణే చూడ గోరుతూ వున్నావు. ఈనీమూఢత్వానికి ఏ మందును! కృతఘ్నమా! ఓహృదయమా! పుట్టినప్పటినుంచి కూడా పెరిగిన యీనన్ను వదలి క్షణమాత్రదర్శనపరిచితుడైన అతణ్ణి తగులుకొని పోతూ లజ్జపడవు! అయినా నిన్ను అననేల? నీయందేమి తప్పు! ఆ మేనులేనివాడినారసాలధాటికి ఆగలేక నీవు ఈలాగు చేయబూనినావు గనుక ఆ యనంగుణ్ణే నిందిస్తాను. [కన్నీళ్లతో కేలుమోడ్చి మోకరించి] భగవంతుడా, కామ మాయుధుడా, సకలసురాసురులను జయించిన నీవు స్త్రీజనాన్ని కొట్టుటకు

ఉపాయమేమి? [ఆలోచించి] నిశ్చయంగా మందభాగ్యురాలికి నాకు ఈదుర్నిమిత్తంచేత అవశ్యం మరణము మూడినది. [చిత్తరుబలకను చూచి] మఱి యిక నెవ్వరూ రాక ముందే చిత్రఫలకాన ఈయభిమతజనుణ్ణి వ్రాసి చూచి, నాయిష్టాన్ని నెఱవేర్చుకొంటాను. [సావష్టంభముగా ఏకాగ్రచిత్తయై నాట్యమున చిత్తరుబలకం గొని నిట్టూర్చి] నాకొనచేయి అతిభయంచేత అమితంగా వణుకుతూ వున్నప్పటికి అతణ్ణి చూడడానికి ఉపాయం లేనందున వ్రాసిచూస్తాను. [అని వ్రాయుటను నటించును.

[అంతట సుసంగత ప్రవేశించును.]

సుసం.—ఇదిగదా ఆయరటియిల్లు. ఇందులో ప్రవేశిస్తాను. [ప్రవేశించి చూచి ఆశ్చర్యముతో] ఇదే నాప్రియసఖి సాగరిక, ఏమి! ఇది యేమో బలమైన అనురాగం హృదయాన్ని లాగుతూవున్నలాగు ఏమో వ్రాస్తూ నన్ను చూడకున్నది. కానీ, దీనికంటియెదట పడకుండా ఇదేమిటో కనిపెడతాను. [స్వచ్ఛందముగా ఆమెవెనుక నిలిచి కాంచి సంతోషముతో] ఏమి! ప్రభువును వ్రాసింది! బళీ ప్రియసఖీ బళి! కాకేమి! కమలాకరాన గాక రాజహంసి మరియెక్కడ ప్రియపడుతుంది?

సాగ!—[బాష్పములతో] ఇతణ్ణి వ్రాసితిని. కాని ఎడతెరపిలేకుండా రాలుతూవున్న బాష్పాలచేత నాదృష్టి చూడలేకున్నది. [మొగమెత్తి అశ్రువులను తొలంచుకొనుచు సుసంగతను చూచి ఉత్తరీయముతో చిత్తరుబలకను కప్పుచు చిఱునవ్వు నవ్వి] ఓహో ప్రియసఖి సుసంగత! [అని లేచి చేపట్టి] సఖీ, సుసంగతా, ఇక్కడ కూర్చో.

సుసం.—[కూర్చుండి, బలాత్కారమున ఫలకముం గొని చూచి] సఖి, ఎవరిని యిక్కడ వ్రాసినావు?

సాగ.—[లజ్జతో] ఈ జరుగుతున్న మదనోత్సవంలో కామదేవుణ్ణి వ్రాసినాను.

సుసం.—[చిఱునగవుతో] ఎంతటిజాణవే! మఱి యీచిత్తరవు శూన్యంగా కనబడుతున్నది. కనక నేనున్ను ఇందులో ఆయనసరసను రతీదేవిని వ్రాస్తాను.

[వర్తికం గొని నాట్యమున రతీమిషచేతను సాగరికను వ్రాయును.

సాగ.—[చూచి కోపముతో] సఖి, నీవు నన్నేల యిక్కడ వ్రాసినావు?

సుసం.—[నవ్వి] ఎందుకే కారణం లేకనే కోపగిస్తావు? నీవు ఎటువంటి కామదేవుణ్ణి వ్రాసినావో నేనున్ను అటువంటి రతినే వ్రాసినాను. మఱి వేఱువిధంగా భావించడం మాను. ఈదాపరిక మెందుకే? వృత్తాంతమంతా చెప్పు.

సాగ.—[లజ్జతో స్వగతము] ప్రియసఖి నాగుట్టు కనిపట్టినది. [ప్రకాశ...] ప్రియసఖీ, నాకు లజ్జ బలీయముగా నున్నది. అందుకోసము, సఖీ, ఈవృత్తాంతము ఇ... రుల కెవ్వరికిగాని తెలియకుండా వుండేలాగు చేయవే.

సుసం.—సఖి, లజ్జపడకు. ఇటువంటికన్యారత్నానికి ఇటువంటి వ... అవశ్యంగా వలపు కలుగుతుంది. అయినప్పటికీ ఇతరుల కెవ్వరికీ ఈవృత్తాంతము తె... యకుండేలాగ చేస్తాను. అయినా ఈశారిక మేధావిని ఈగుట్టు బైటపెట్టినా పెట్ట... ఒకవేళ ఇది మనయాలాపాన్ని యథాతథంగా గ్రహించి యెవరి యెదట నైనా ప... పలుకును.

సాగ.—[ఉద్వేగముతో] సఖి, నన్ను సంతాపము మరీయెక్కువగా బా... న్నది. [అని మదనబాధను నటించు...]

సుసం.—[సాగరికయెదను హస్త ముంచి] సఖి, ఊఱడిల్లు ఊఱడిల్లు. ఇ... నేను వెళ్లి ఈదిగుడుబావిలోనుంచి తామరాకులు తామరతూళ్లు క్షణంలో తెస్తా...

[నిష్క్రమించి మరల ప్రవేశించి నాట్యమున తామరాకులతో పె... తూండ్లతో వలయములు చేసి మిగిలిన యాకులను సాగరిక యెదపై కప్పు...

సాగ.—సఖీ, తీసివేయి యీతామరాకులను తూటికడియాలనున్ను. ఇ... వృథాగా ఏల నన్ను ఆయాసపెట్టుకోవడము? చెప్తాను విను.

(గేయము.)

అందరానిపండు గోరితిఁ; సఖీ
డెందమందు నాస నన్ను డిందఁజేయునే; సఖీ
పరవశాత్మఁ జేసె దైవము; సఖీ
కరుణ లేనివలపు నన్ను గళము పట్టెనే; సఖీ
ఒక్కటే శరణము నా కిఁక, సఖీ
తక్కి యుసురు నీవిరాళి దాఁటెదను బలే. సఖీ

సుసం.—[సకరుణము] ప్రియసఖి, సాగరికా, ఊఱడిల్లు ఊఱడిల్లు.

[నేపథ్యమున కోలాహలము]

ఉ. దారితశిష్టఁ గంఠగ నధఃస్థిత నీడ్చుచుఁ బైఁడిశృంఖలల్
ద్వారములందు దూఁటుచు నుదారరణత్పదకింకిణీక మై
భీరుల భీతిగొల్పు చనువిద్రవదాకులితాశ్వపాల మై
చేరెను సాహిణంపుఁ గపి వెచ్చర దాఁటుల రాజవేశ్మముల్.

మఱియు,

చ. పడయమి లెక్క పూరుషతఁ బాఱెరి షండులు నానగండలై,
ముసిఁగిరి వామనుల్ భయము ముంపఁగఁ గంచుకికంచుకంబులోఁ,
కడలఁ గిరాతకుల్ నిలిచి కాంచిరి సార్థకనామభావముల్,
నడిచిరి క్రుంగి కుబ్జులు కనంబడ నోడుచు మెల్లమెల్లఁగాన్. ౹౼

సుసం.—[విని మ్రోలం గాంచి సంభ్రమంబున లేచి సాగరికచేయి పట్టుకొని] సఖీ, లేవే లేవే, ఇదుగో చెడుకోతి ఇక్కడికే వస్తూవున్నది.

సాగ.—అయితే ఇప్పుడు ఏమి చేతాము?

సుసం.—రా, ఈచీకటిచెట్ల చీకటిలోఁ జొచ్చి దీన్ని తప్పించుకొందాము.

[పరిక్రమించి యిరువురు భయముతో చూచుచు ఏకాంతమున నిలుతురు.

సాగ.—సుసంగతా, ఏమే చిత్తరుపలక వదలి వచ్చితివి? ఒకవేళ ఎవరైనా దాన్ని చూచేరు.

సుసం.—ఓసి స్వస్థంగా వుండు. ఇప్పుడుకూడా చిత్తరుపలకతో పని యేమే? ఈపెరుగుకూటియాసపోతు చెడుకోతి ఈపంజరాన్ని తెరిచి దాటిపోయింది. మఱి మేధావిని ఎక్కడికైనా పోతుంది. అందుకోసం త్వరగా కూడా వెళ్లి దాన్ని పట్టుకొందాము రా. మనమాటల అతురాలు గ్రహించి ఎవరిదగ్గిరనైనా వెళ్ల ఖెడుతుండి.

సాగ.—సఖీ, అలాగే చేతాం. [అని పరిక్రమింతురు.

[నేపథ్యమున]

బళే బళే! ఆశ్చర్య మాశ్చర్యం!

సాగ.—[చూచి] సుసంగతా, మళ్లీ ఆచెడుకోతే వస్తూవున్నట్టు ది.

సుసం.—[చూచి నవ్వి] ఓసి పిరికీ, భయపడకు, ఇతడు ఏలినవారి పార్శ్వవర్తి వసంతకయ్య.

[అంతట వసంతకుఁడు ప్రవేశించును.]

వసం.—బళేబళే! ఆశ్చర్యమాశ్చర్యం! బళిరా! శ్రీఖండదాసుడా ధార్మికుడా, భళీ!

సాగ.—[అక్కఱతో చూచి] సఖీ, సుసంగతా, ఇతణ్ణి చూడవలసినదే సుమా.

సుసం.—సఖి, ఇతణ్ణి చూస్తే ఏమి ఫలం? ఆశారిక దూరం వెళ్లింది. రా వెంబడింతాము.

[అని నిష్క్రమింతురు.

వస.—బళిరా! శ్రీఖండదాసుడా బళీ!—నీ ఆదోహదాన్ని ఉపయోగ మాత్రాన నవమాలిక ఈలాటి దైనది. దట్టంగా మొలిచిన పూవుమొత్తాలతో గుతూవున్న కొమ్మలచేత దేవి పెంచుకొన్న మాధవిని చూచి నవ్వుతూ కనబడుతున్నది.—కనక వెళ్లి ప్రియవయస్యుడికి నివేదిస్తాను. [పరిక్రమించి ఇదుగో ప్రియవయస్యుడు; ఆదోహదము మీది నమ్మకంచేత నవమాలికని పూచిన పరోక్షాన్నే ప్రత్యక్షంగా చూస్తూ వున్నట్టు సంతోషంచేత కండ్లు వికాసం ఇక్కడికే వస్తువున్నాడు. ఇతనిదగ్గిరికి వెళ్తాను. [అని రాజుకడకుం

[అంతట యథానిర్దిష్టుఁడు రాజు ప్రవేశించును.]

రాజు —[హర్షములో]

తే. పాండువును సోత్కలిక దీనిఁ బ్రాప్తజృంభ
నవిరళశ్వసనోద్గమాయాసితాత్మఁ
గంతుయుత లాఁతిసకిఁ బోలెఁ గనుచు లతను
బొనరిచెద దేవిముఖమునఁ గినుకకెంపు.

విదూ.—[తటాలున సమీపించి] జయం జయం ప్రియవయస్యుడికి. వయస్యా బళీబళీ నీకు మేలు కలుగుతున్నది. ఏలాగంటే.—

["ఆదోహదాన్ని" ఇత్యాది మరల

రాజు.—వయస్యుఁడా, సందేహ మేమి? మణిమంత్రౌషధులప్రభావము ఊ నలవిగానిది గదా. చూడు—

మ. కలనన్ శ్రీపతికంఠకౌస్తుభమణిన్ గన్నంతనే శాత్రవుల్
తలఁగం బాఱరె? పన్నగంబులు ధరన్ దాఁకోవె మంత్రాహ
తొలి రామానుజవీరవానరభటాదుల్ మేఘనాదాహతుల్
బలుదివ్యౌషధిగంధ మాని మరలన్ బ్రాపింపరే జీవమున్?

మఱి దారిసూపు, దానిని చూచి నేత్రసాఫల్యము ననుభవించెదము.

విదూ.—[ఆటోపముతో] రా నీవు రా.

రాజు.—ముందు పొమ్ము.

[ఇరువురు గర్వముతో పరిక్రమి

విదూ.—[విని భయపడి వెనుకకు మరలి కేలిచేయి పట్టుకొని సంభ్రమముతో] వయస్యుడా రా పాఱిపోదాం.

రాజు.—ఎందుకోసము ?

విదూ.—ఈపొగడచెట్టులో ఏదో భూత మున్నది.

రాజు.—ఛీ మూర్ఖుఁడా, భయపడక నడవుము; ఇట్టివానికి ఇక్కడ ప్రభావ మెక్కడిది ?

విదూ.—స్పష్టాక్షరంగా పలుకుతున్నది. నామాట నమ్మకం గాకపోతే ముందు కేసి నీవే స్వయంగా విను.

రాజు.—[అట్లు చేసి విని]

తే. విస్ఫుటంబుగ వర్ణముల్ వినఁగ నగుట,
స్త్రీస్వభావోచితంబుగాఁ దియ్య నగుట,
నల్పతను వాటచే ననిహ్రస్వాది యగుటఁ,
బలుకునది శారిక యటంచుఁ దలఁతు నేను. 3౭

[పైని చూచి నవ్వి] ఏమీ ! శారికసుమా.

విదూ.—[పైని చూచి] ఏమి ! నిజంగా శారికే.

రాజు.—[నవ్వి] అవునోయి.

విదూ.—ఓయి వయస్యుడా, నీవు బలే పిరికివాడవే, శారికని భూతమన్నావు ?

రాజు.—ఛీ మూర్ఖుడా, నీ చేసినదానిని నామీఁద పెట్టెదవు !

విదూ.—ఓయి అట్లైతే నన్ను నివారించకు. [రోషముతో చేతికఱ్ఱ నెత్తి] ఓన్నా ! దాసికూతురా, నిజంగా నేను భయపడతా నని నీవు అనుకొన్నావా ? అట్లైతే క్షణ ముండు. నేను కొండెగాళ్ల హృదయంలాగ కుటిలమైన యీ చేతికఱ్ఱతో పండిన వెలగపండులాగ ఈ పొగడచెట్టునుంచి నిన్ను నేలకి పడేలాగ కొడతా.

[అని కొట్ట నుంకించును.

రాజు.—[నివారించుచు] మూర్ఖుఁడా, ఇది దేనినో రమణీయమైనదానిని పలుకు చున్నది. దీని నేల బెదరఁగొట్టెదవు ? విందుము గాక. [ఇరువురును విందురు.

విదూ.—[విని] ఇది పలుకుతూ వుంది, ఈ బ్రాహ్మడికి అన్నం పెట్టూ అని.

రాజు.—కుక్షింభరికి సర్వము భోజనవిషయముగానే పర్యవసించును. సరిగా విన్నా, శారిక ఏమి పలుకుచున్నదో.

విదూ.—[విని] వయస్యుడా, ఇది అన్నమాట నీవు విన్నావా? ఇది అం న్నది—'సఖి, ఎవరిని నీవిక్కడ వ్రాసినావు? ఈ జరుగుతూవున్న మదనోత్సవం కామదేవుణ్ణి వ్రాసినాను,' అని. మళ్లీ చెప్పుతూవుంది—' సఖి, నీవు నన్నేల య వ్రాసినావు? ఎందుకే కారణంలేకనే కోపగిస్తావు? నీవు ఎటువంటి కామదేవుణ్ణి వ్రా నావో నేనున్ను అటువంటిరతినే వ్రాసినాను. మరి వేఱువిధంగా భావించడ ఈ చాపరికం ఎందుకే? వృత్తాంత మంతా చెప్పు.' అని. ఓయి వయస్యుడా, టోయి యిది?

రాజు.—వయస్యుఁడా, నాకు ఇట్లు తోఁచుచున్నది. ఎవతెయో వల్లభుని చిత్తరువున వ్రాసి సఖిమోల కామదేవుఁ డని మిష పెట్టి కప్పుకొ అంతట సఖి గుట్టు కనిపట్టి నేర్పుచేత ఆ చిత్తరువులోనే ఆ చెలువప్రతిమను వ్రా రతి యని మిష పెట్టి చూపించినది.

విదూ.—[చిటిక వైచుచు] వయస్యా, ఇది సరిపడుతూ వుంది.

రాజు.—ఓయి వయస్యుఁడా, సందడిచేయకు. మరల పలుకుచున్నది. విం గాక. [ఇరువురును విం

విదూ.—ఓయి, ఇది మళ్లీ యీలాగు అంటున్నది.—'సఖి, లజ్జపడకు. వంటి కన్యారత్నానికి ఇటువంటి వరునిమీద అవశ్యంగా వలపు కలుగుతుంది.' కనక ఆ వ్రాయబడినది కన్య; దర్శనీయ కూడా.

రాజు.—అట్లయిన, సావధానముగా విందముగాక. ఇందు మాకు కుతూ మునకు అవకాశ మున్నది.

విదూ.—ఓ వయస్యుడా, నీవేమో మహాపండితుడ నని గర్వపడకు. నే నోటినుంచీ విని సర్వమూ నీకు వక్కాణిస్తాను. [అని యిరువురును విం

విదూ.—విన్నావా ఇది చెప్పినమాట? 'సఖి, నా సంతాపము మీ మిగా బాధిస్తూవున్నది. సఖి, తీసివేయి యీ తామరాకులనున్ను తూటికడియాల ఇ వేల? వృథాగా ఏల నన్నాయాసపెట్టుకోవడము?'

రాజు.—వయస్యుఁడా, వినుట మాత్రమే గాదు, అభిప్రాయమును కూ పట్టితిని.

విదూ.—ఓయి వయస్యుడా, ఈశారిక దాసికూతురు ఇంకా ఏమేమో కు మంటున్నది.

రాజు.—సరిగానే చెప్పితివి. [అని యిరువురు విం

విదూ.—వయస్యా, ఈశారిక దాసికూతురు నాలుగువేదాలు చదివినబ్రాహ్మడి బుక్కలు పఠించ నారంభించిందే!

రాజు.—వయస్యుఁడా, నేను పరధ్యానములో వినలేదు, చెప్పు ఇదేమి పలికినదో.

విదూ.—ఓహో ఈలాగ పలికింది.

(గేయము.)

అందరాని పండుగోరితిగా; డెందమందు నాన నన్ను డిందఁజేయునే. సఖీ,
పరవశాత్మచేసె దైవము; కరుణ లేని వలపు నన్ను గళముపట్టెనే. సఖీ,
ఒక్కటే శరణము నా కిఁక,తక్కు యుసురు నీ విరాళి దాఁటెదను బలే.సఖీ,

రాజు.—(స్మితముతో) వయస్యుఁడా, ఇటువంటిబ్రాహ్మణుఁడవు నీవు దక్క వేఱెవ్వరు ఇటువంటి బుక్కలు ఎఱిఁగినవారు?

విదూ.—అటయితే మఱి యి దేమిటి?

రాజు.—ఇది పాటసుమా.

విదూ.—పాటా ఇది! అయితే ఏమి చెప్పినట్లు?

రాజు.—వయస్యుఁడా, ఎవతెయో శ్లాఘ్యయౌవన ప్రియతమునిపొందు అలవడ కనే ప్రాణముమీఁదియాస వదలి యిట్లు పలికినది.

విదూ.—[బిగ్గరగా నవ్వి] ఓయి, ఎందు కీవంకరమాటలు, తిన్నగా ఎందుకు చెప్పవు—నన్నే పొందనందున అని? నిన్ను గాక మరి యెవ్వని పూవిల్తు డసేమివచ్చే దిమ్మ నగును. [చేతులతో చప్పట్లుకొట్టి బిగ్గరగా నవ్వును.

రాజు.—[ఊర్ధ్వము చూచి] ఛీ. మూర్ఖుఁడా, బిగ్గరగా నవ్వి, పాపము! ఆ శారికను బెదరఁగొట్టితివి? అందుచేత అది ఎక్కడికో ఎగిరిపోయినది. [అని నిరూపింతురు.

విదూ.—[చూచి] వయస్యుడా మ రెక్కడికీ గాదు. అది అరటిచెట్లయింటికి వెళ్లింది. రా, మరి, వెంబడింతాము. [అని పరిక్రమింతురు.

రాజు.—

తే. కామిని వచించుఁ దాళక కంతుబారి
దేని నెయ్యంపుసకులతో, దాని నల్లె
వెండి శుకశిశుశారికల్ వెల్లడింప,
ధన్యులకు నగు శ్రవణసుధారసంబు. ౩౮

విదూ.—వయస్యుఁడా, ఇదుగో అరిటిచెట్ల యిల్లు. ఇందులోపలికి వెళ్దాము. [అని యిరువురు ప్రవేశింతురు.

విదూ.—ఏ మయ్యేవు? ఎందుకు దాసికూతురిని ఈ శారికని వెదికేప్రయత్నం? ఇక్కడ మలయమారుతంచేత కదులుతూవున్న లేతయరిటాకులచేత చల్లనైన యీ అరుగు తిన్నెమీద క్షణంసేపు విశ్రమింతాము.

రాజు.—నీకు రుచించినట్లే చేయుదము.

[అని కూర్చుండురు. రాజు నిట్టూర్చి "కామిని" ఇత్యాది మరలం జదువును.

విదూ.—[పార్శ్వమునం జూచి] వయస్యా, ఇది ఆ శారికపంజరము గావలె. దీనితలుపును ఆదుష్టవానరము తెరిచియుండబోలును.

రాజు.— నిరూపింపుము.

విదూ.—నీయాజ్ఞ. [అని పరిక్రమించి చూచి] ఇదుగో చిత్రఫలక ఇక్కడ ఉన్నది. దీన్ని పుచ్చుకొంటాను. [పుచ్చుకొని చూచి హర్షము నటించును.

రాజు.—[కుతూహలముతో] వయస్యా, ఏ మది?

విదూ.—వయస్యా, నీయదృష్టము దొడ్డది- ఇదే నేను చెప్పినది అది. నీరూపు ఇక్కడ వ్రాసి ఉన్నది. కాక మరెవ్వరి పూవిల్తు డని మిమ్మ పెట్టగలదు?

రాజు.—[హర్షముతో చేతులు చాచి మిత్రమా, చూపు చూపు.

విదూ.—నీకు చూపను. ఆ కన్యప్రతిమకూడా ఇందులోనే వుంది. ఏమీ పారితోషికం లేకుండా ఇటువంటికన్యారత్నాన్ని చూపిస్తారా?

రాజు.—[కడియమును తివిచి యిచ్చుచునే చిత్రఫలకం బలిమిం గైకొని చూచి ఆశ్చర్యముతో] వయస్యా, చూడవోయి.

తే. తొయ్యలి యెవర్తొ లీలావధూతపద్మ
పక్షపాతంపుఁ బేర్మి నాపయిఁ దెలుపుచుఁ,
జిత్రగత మానసమును విచిత్రసరణిఁ
జేరుచున్నది రాజహంసియును బోలె.

మఱియు,

తే. ముదితవదనం బనునపూర్వపూర్ణచంద్రు
నించువేడుకఁ దా సృజియించి ధాత,
అంత మొగిడిన నిజపీఠికాంబుజమునఁ
జిక్కి యుక్కిరిబిక్కిరిఁ జెందె నిజము.

[అంతట సాగరికయు సుసంగతయు ప్రవేశింతురు.]

సాగరిక.—సఖి, సుసంగతా, మనకు శారిక దొరికింది గాదు. మరి చిత్తరుపలక నైనా యీయరిటిచెట్ల యింటిలోనుంచి తెచ్చుకొని త్వరగా వత్తాము.

సుసం.—సఖి, ఆలాగే చేతాం. [అని ఉపసర్పింతురు.

విదూ.—వయస్యుడా, ఎందుకు ఈమె ముఖము వంచుకొన్నదిగా వ్రాయబడినది?

సుసం.—[విని] సఖి, వసంతకయ్యమాట వినబడుతూవున్నది. అందుచేత నే తలకొంటాను దొరవారుగూడ ఇక్కడనే ఉన్నారని. కనక అరిటిగుబురుచాటున నుండి చూతాము. [అని యిరువురు విందురు.

రాజు.—వయస్యా, చూడు చూడు.

[“ ముదితవదనంబు ” ఇత్యాది మరల పఠించును.

సుసం.—సఖి, సాగరికా, నీయదృష్టము పండినది. ఇదుగో నీహృదయవల్లభుడే నిన్నే వర్ణిస్తూ వున్నాడు.

సాగ.—[లజ్జతో] సఖి, ఏల నీవేళాకోళస్వభావముచేత నన్ను చులకన చేస్తావు?

విదూ.—[రాజును కదిపి] అడుగుతున్నానే-‘ఎందుకయ్యా ఈమె మొగము వంచుకొన్నదిగా వ్రాయబడినది?’ అని.

రాజు.—వయస్యా, శారికయే అంతయు తెలియఁజేసినది.

సుసం.—[నవ్వి] సఖి, శారిక తనమేధావిత్వాన్ని చూపించింది.

విదూ.—ఇది నీకు నేత్రానంద మవునా కాదా?

సాగ.—[సాధ్వసముతో స్వగతము] ఈయన ఏమి చెప్పునో ఎరుగను. నిశ్చయముగా మరణజీవితాలమధ్యలో ఉన్నాను.

రాజు.—వయస్యుఁడా, నేత్రానంద మని చెప్పవలయునా?

ఉ. ఊరుల నెట్టులో కడచి, యూరు భ్రమించి నితంబమండలిన్,
హారివళిత్రయీవిషమ మాకవుఁ దీవఁ జలింపకుండి, దు
ర్వారతృషంబలెన్ గుచధరంబుల నల్లన నెక్కి, చూపిదే
వారక కాంచు బాష్పలవవాహినిఁ గోర్కి విలోచనద్వయిన్. 32

సాగ.—[విని స్వగతము] హృదయమా, తేరుకో తేరుకో, ఊరడిల్లు ఊరడిల్లు. నీకోరికకూడా ఇప్పుడు ఈయంతస్థు ఎక్కినది!

సుసం.—సఖీ, విన్నావా?

సాగ.—[నవ్వి] నీవే విను. నీచిత్తరువ్రాఁత నేర్పునే గదా పొగుడుతున్నాఁడు!

విదూ.—[పలకను చూచి] వయస్యుఁడా, ఇటువంటి సొబగురాళ్లు సహితము ఎవ్వనిప్రియసమాగమానికై ఉవ్విళ్లూరుతారో అటువంటి నీమీద నీకే ఎందుకు తిరస్కారము? అందులోనే కూడానే వున్న నీప్రతిమ కేసి చూడవేమి?

రాజు.—[చూచి] వయస్యా, ఈసుందరి నన్ను వ్రాసినందులకు నిశ్చయముగా నాయందు నాకు గౌరవమే. మఱి చూడ కేమి? చూడు.

తే. చెలువ చిత్రంబు వ్రాయుచోఁ జిందినట్టి
బాష్పజలశీకరాళి నావపువుమీఁద
భాసిలెడు నిది తత్కరస్పర్శచేతఁ
బొటమరించినఘర్మాంబుపుంజ మనఁగ. ౩౮

విదూ.—[పార్శ్వమందుం గని] వయస్యా, ఇది నిశ్చయంగా ఆబిడకోసము సరసములైన లేఁతతామరాకులతోటిన్ని తామర తూళ్లతోటిన్ని చేసినది, ఆబిడయొక్క మదనసంతాపానికి సూచకంగా కనబడుతూవున్నది.

రాజు.—వయస్యా, నేర్పుతో కనిపట్టితివి. అట్లే—

చ. ఇరుగడల న్గురుస్తనసమిద్ధనితంబము లొత్త వ్లానమై,
హరితమ వైై నభఃప్రతిమ మాకవునంటమి నంతరంబునన్,
కరము భుజాలతల్ విసరఁగా నిట నోరల వీటతాట మై,
తరుణమృణాళినీచ్ఛదనతల్పము తెల్పెడి లేమతాపమున్. ౩౯

మఱియు,

తే. లేమ పయ్యెద యగుదొడ్డతామరాకు
తెలుప దట్లుగ లోనిపూవిలుతుకడిమిఁ
దెలుపు నెట్లు వేఁడిమికిఁ గమలినయట్టి
మండలంబులఁ బాలిండ్లదండితనము. ౪౦

విదూ.—[నాట్యముచే తామరతూఁడు కైకొని] వయస్యుఁడా, ఇది ఆమెదేమో యొకటి, గబ్బిగుబ్బల నడుమనుంచి జాఱిపడి క్లేశపడుతూవున్నది నున్ననితామరతూఁడుహారము. దీన్ని చూడు నీవు.

రాజు.—[ప్రైకొని ఉరమున నుంచుకొని నిందించుచు] ఓజడమా,

శ్లో. చెలువచనుగిండ్లనడిమికిఁ దోలఁగి రాలి
మేల వసివాడె దిట్లు మృణాళసరమ?
నీదు ప్రోఁగున కేనట లేదు తావు,
నీకు నేరీతిఁ గల్గునో నీవ చెపుమ. ౪౧

సుసం.—[ఆత్మగతము] అయ్యో, ప్రభువు మితిమించినమరులుచేత హృదయాన కల్లడపడి ఏమేమో అసంబద్ధము పలుకుతున్నాడు! మరి యింక ఉపేక్షించడం సరి కాదు. కనక ఇలా గవుగాక. [ప్రకాశము] సఖి, నీవు ఎవరికోసము వచ్చినావో ఆతడు నీయెదటనే వున్నాడు.

సాగ.—[అసూయతో] నేను ఎవరికోసము వచ్చినాను!. ఇక్కడ ఎవరు న్నారు?

సుసం.—[నవ్వి] ఏమో శంకిస్తావేమే. చిత్తరుపలకలోని పూవిల్తునికోసం గదా నీవు వచ్చినావు? పుచ్చుకో చిత్తరువుపలకను.

సాగ.—[రోషముతో] నీతో ఇటువంటిమాట లాడడానికి నేను జాణను కాను. కనక అవతలికి వెళ్తాను. [అని పో నుంకించును.

సుసం.—ఓసి ఓర్పులేనిదానా, ఇక్కడనే క్షణముండు. నేనే వెళ్లి ఈయరిటి యింటిలోనుంచి చిత్తరుపలకను తెస్తాను.

సాగ.—సఖి, అలాగే చేతాం.

[సుసంగత కదళీగృహాభిముఖముగా పరిక్రమించును.

విదూ.—[సుసంగతను జూచి సంభ్రమముతో వయస్యుడా, ఈచిత్రఫలకాన్ని కప్పివేయి. ఇదే దేవిపరిచారిక సుసంగత వస్తూవున్నది.

[రాజు వస్త్రాంతముతో ఫలకమును కప్పును.

సుసం.—[సమీపించి] జయం జయం ఏలినవారికి.

రాజు.—సుసంగతా, స్వాగతము ఇక్కడ కూర్చుండు.

[సుసంగత కూర్చుండును.

రాజు.—సుసంగతా, నే నిక్కడ నున్నా నని నీ కెట్లు తెలిసినది?

సుసం.—[నవ్వి] దేవర యిక్కడ వుండడంమాత్రమే గాదు, చిత్తరుపలకతో కూడా సకలవృత్తాంతమున్ను నాకు తెలిసినది. కనుక వెళ్లి దేవితో చెప్తాను.

[అని పో నుంకించును.

విదూ.—[అపవారించి భయముతో] వయస్యుడా, ఇది యింతా చేశేదే, ...దాసి యిది పేలుడుగుణం గలది. అందుకోసం దీనికి ఏ మయినా లంచ మియ్యవోయి.

రాజు.—నీవు చెప్పినది యుక్తమే. [సుసంగతచేయి పట్టుకొని] సుసంగతా, ఇది ఉత్తవినోదము. నిష్కారణముగా నీవు దేవిని వ్యథపెట్టుట సరి గాదు. ఇంద, పారితోషికము పుచ్చుకో. [అని ఆభరణమును తివిచి ఇయ్యబోవును.

సుసం.—ప్రభూ, అక్కఱలేదు ఈకర్ణాభరణము. నేను భట్టిని ప్రసాదంకొ ఎంతెంతో పొందివున్నాను. ఇదే నాకు గొప్పయనుగ్రహము. ఏ మంటే, 'ఎందుకీ చిత్తరుపలకలో నన్ను వ్రాసినావు?' అని నా ప్రియసఖి సాగరిక నామీద కోపం చేస్తున్నది. వెళ్లి ఆమెను చేయిపట్టుకొని కోపము తీర్చు.

రాజు.—[సంభ్రమముతో లేచి] ఎక్కడ నున్నది? చూపు చూపు.

సుసం.—ఇదుగో ఇక్కడే అరిటిగుబురుచాటున వున్నది.

రాజు.—[హర్షముతో] దారి చూపుము.

సుసం.—ఇటు ఇటు ఏలినవారు. [అందఱును కదళీగృహమునుండి వెలువడుదురు.

సాగ.—[రాజును గని సహర్షముగా సభయముగా సకంపముగా సలజ్జముగా స్వగతము] ఈయనం గని అతిభయంచేత అడుగు గత్తి అడుగు పెట్ట లేకుండా ఉన్నాను. మఱి యిక నే నేమిచేతును ?

విదూ.—ఓయి, ఈచిత్రఫలకాన్ని నేను పదిలం చేస్తాను. ఒకవేళ దీనితో ఏదైనా పని రావచ్చును. [సాగరికను చూచి] హీహీ! హాహా! ఆశ్చర్య మాశ్చర్యం ! ఇటువంటి కన్యకారత్నము మనుష్యలోకంలో కనబడదు. నే ననుకొంటాను బ్రహ్మకూడా ఈమెను సృజించి ఆశ్చర్యములో మునిగివుండును.

రాజు.—వయస్యా, నాకును మనస్సులో ఇట్లు తోచుచున్నది.

తే. తనదుగద్దియరుచి మీఱుకనులఁ దెలిచి
పలికె నలుమోముల న్వాధి బళిబళి యని,
అబ్బురంపోయి శిరము లిట్టట్టు న్రూఁచె,
త్రిజగతీలలామంబు నీ తెలవఁ జేసి.

సాగ.—[అసూయతో సుసంగతం గాంచి] సఖి, ఇదా నీవు తెచ్చినట్టి ఫలకము ? [అని పో నుంకించును

రాజు.—

చ. కనలునఁ జూడ్కి- నైచెదవు గావుత భామిని, యట్టులైనను-
గొన దది మాతృభావము నకుంఠితమా ననురక్తిపెంపునన్ ;
చను మెలమెల్ల, సంభ్రమము జార్పు, తడంబడె నేని పాదముల్,
ఘన మగునీనితంబ మిది కాంతరొ చెందు నమందఖేదమున్. ౪౩

సుసం.—ప్రభూ, ఈమె ఎప్పుడూ అతికోపకత్తె. కనుక కొనచేయి పట్టుకొని ఈమెకోపాన్ని తీర్చు.

రాజు.—వయస్యుఁడా, నిజముగా—

క. శ్రీదేవియ యగు నిజ మీ
పైదలి, కేల్ పారిజాతపల్లవమ యగున్ ;
కాదేని యేల తొరుఁగున్
స్వేదచ్ఛద్మమున నమృతశీకరగణమున్. ౪౪

సుసం.—సఖి, నీవు ఇప్పుడు అదక్షిణురాలవుగా వున్నావు, ఈవిధంగా ఏలినవారు చేయిపట్టినా కోపం మానవు.

సాగ.—[అభ్యసూయతో] సుసంగతా, ఇప్పటికిన్ని, మానవా?

రాజు.—ప్రియా, సాగరికా, సఖీజనముమీఁద చిరకోపము యుక్తము కాదు.

విదూ.—ఏ మమ్మా, ఆకలిగొన్న బ్రాహ్మణుడిలాగ కోపగిస్తావు?

సాగ.—సఖి, నీతో నేను మాట లాడను.

రాజు.—ఓసి కోపనురాలా, సమానగౌరవ లయిన సఖులయెడ నిది తగదు.

విదూ.—ఓహో! నిశ్చయంగా ఈమె మరిఒకతె, కోపకత్తె వాసవదత్త!

[రాజు భయముతో సాగరికచేతిని వదలును.

సాగ.—[సంభ్రమముతో] సుసంగతా, ఇప్పుడేమి చేయుదును?

సుసం.—ఈ కదళీవాటికలోగా వెళ్లిపోదాము. [అని నిష్క్రమింతురు.

రాజు.—[పార్శ్వమునం బరికించి, ఆశ్చర్యముతో] ఏదోయి దేవి వాసవదత్త?

విదూ.—అయ్యా, ఆమె యెక్కడనో నాకు తెలియదు. మరి నేను దీర్ఘకోపంలోఈమె ఇంకొకవాసవదత్త అని చెప్పినాను.

రాజు.—ఛీ మూర్ఖుఁడా!

తే. దైవవశమున నెట్లొకో తాఁ దొరకియుఁ
గాంత రత్నావళియుఁ బోలెఁ గథితరాగ
కంఠమునఁ దాల్చుమన్నె నాకరమునుండి
దుసికిలం బడె నీదు తుందుడుకువలన.

[అంతట వాసవదత్తయు కాంచనమాలయు ప్రవేశింతురు]

వాస.— ఓసీ కాంచనమాలా, ఆర్యపుత్రుడు పెంచుకొన్న ఆ నవమా[లిక] ఇంకా ఎంతదూరము?

కాంచ.—ఇదుగో ఈయరిటియింటికి అవతల.

వాస.—అయితే దారి చూపు.

కాంచ.—ఇటు ఇటు భట్టిని. [అని పరిక్రమింతురు

రాజు.—వయస్యా, ఇప్పుడు ప్రియతమను ఎక్కడ చూడ నగును?

కాంచ.—భట్టినీ, సమీపాన ఏలినవారిమాట వినబడుతూవున్నది. కనుక నేను [అను]కొంటాను భట్టినినే ఎదురుచూస్తూవున్నా రని. మరి సమీపించు భట్టినీ.

వాస.—[సమీపించి] జయం జయం ఆర్యపుత్రునికి.

రాజు.—[అపవారించి] వయస్యా, చిత్రఫలకమును దాఁచియుంపుము.

[విదూషకుఁడు గ్రహించి చంకలో పెట్టుకొనును

వాస.—ఆర్యపుత్రా, నవమాలిక పనిచినదా?

రాజు.—[ఆశ్చర్యముతో] దేవీ, నీవు విలంబించుచున్నందున మేము ముందుగా వచ్చియు దానిని చూడకున్నాము. ఇప్పుడు చూతము రా, కలసియే పోయి చూతము.

వాస.—[చూచి] ఆర్యపుత్రుని ముఖదర్శనంచేత నే తెలిసినది నవమాలిక పని[చిన]దని. కనుక నే నక్కడికి వెళ్లను.

[రాజు అపవారించి ప్రేలితో చూపుచు వసంతకుని ముఖమును చూచును

విదూ.—అమ్మా, అట్లైతే జయము మాదే గదా!

[అని చేతులు చాఁచి, నృత్యము చేసి, చంకలోనుండి పడి[న]
చిత్రఫలకముం గాంచి విషాదముం జెందును.

విదూ.—[అపవారించి] ఓహోయి కోపగింపకు. ఇందుకు నేను ఉత్తరము చెప్పే నేస్తును.

కాంచ.—[ఫలకమును పుచ్చుకొని] భట్టిని, చూడు, ఇక్కడ చిత్రఫలకంలో ఏమి లిఖితమై యున్నదో చూడు.

వాస.—[చూచి స్వగతము] ఇతడు ఆర్యపుత్రుడు, ఇది మరి సాగరిక. [ప్రకాశముగా రాజును జూచి సకోపహాసముగా] ఆర్యపుత్రా, దీన్ని ఎవరు వ్రాసినారు?

రాజు.—[సవైలక్ష్యస్మితముతో, అపవారించి] వయస్యా, ఏమి చెప్పుదునోయి?

విదూ.—[అపవారించి] ఓయి చింతించకు. ఇందుకు ఉత్తరం నేను చెప్తాను. [ప్రకాశము వాసవదత్తనుగూర్చి] అమ్మా, వేరువిధంగా తలచకు; ఎవ్వరుగాని తమ్ము తాము వ్రాసుకోలేరని నే ననగా విని ప్రియవయస్యుడు తన చిత్తరువువ్రాతనేర్పును చూపినాడు.

రాజు.—వసంతకుఁడు ఏమి చెప్పినాఁడో అదే వాస్తవము.

వాస.—[ఫలకమును చూచి] ఆర్యపుత్రా, ఈమెకూడా ఇంకొకతె నీ పక్కను చిత్తరువులో నున్నదే ఇదేమి ఆర్య వసంతకుని శిల్పనైపుణ్యమా?

రాజు.—[సవైలక్ష్యస్మితముతో] దేవి, వేఱువిధముగా శంకింపకు. ఈ కన్యక మా నాబుద్ధిచేత కల్పించి వ్రాసినదే గాని పూర్వ మెప్పుడును నేను చూచినది గాదు.

విదూ.—నిజము. నా జందెముసాక్షిగా చెప్తాను, ఇటువంటిదానిని మేము ముందెప్పుడున్ను చూచినవారము గాము.

కాంచ.—[అపవారించి] భట్టిని, ఒకవేళ ఇటువంటిది ఘుణాక్షరంలాగ సరిపడిన సరిపడవచ్చును. కనుక కోపము మాను.

వాస.—[అపవారించి] ఓసి సరళహృదయురాలా, ఇతనివంకరమాటలను ఎఱుగవు. ఇతడు వసంతకుడుగదా. [ప్రకాశము రాజునుగూర్చి] ఆర్యపుత్రా, నాకు మరి ఈచిత్తరువు చూడగా తలనొప్పి వచ్చివున్నది. మరి ఆర్యపుత్రుడు సుఖముండు గాక. నేను వెళ్తాను. [అని పో నుంకించును.

రాజు.—[వస్త్రాంతమునం బట్టుకొని] దేవీ,

చ. ననుఁ గృపఁ జూడుమా యనుట నాయమె టయ్యెడిఁ గిన్కలేనిచోఁ?
బొనరుప నింక నిట్లనుట పొచ్చెము సేసితి నంచు నొప్పుటే;
అనిన ననాగసుండ నని, యూపలుకుల్ మృష యందు; వేమి ప
ల్కిన నుచితంబొ నేఁ దెలియలే కిటుఁ గుందెదఁ బ్రాణనాయికా.

వాస.—[సవినయముగా వస్త్రాంతమును లాగుకొనుచు] ఆర్యపుత్రా, వేరువిధంగా తలచకు. నిజంగానే నన్ను తలనొప్పి బాధిస్తూవున్నది. కనక నేను వెళ్తాను.

[అని నిష్క్రమించును.

విదూ.—సీహో్యి, నీయదృష్టము మంచిది! ఈ అకాలపు పెనుగాలి వాసవద్త నిన్ను క్షేమంగానే వదలి వెళ్లింది.

రాజు.—ఛీ మూర్ఖుఁడా, సంతోషపడెద వేమి? పోవుటలో దేవి పైకి తెలియనీకుండ మనస్సులో వహించిన దీర్ఘకోపమును నీవు కనిపట్టలేవైతివి. చూడు.

ఆ. బొమల ముడిఁచికొనియు మొగముఁ దద్దయు వాంచె,
వెడ నగియుఁ గటూక్తి నుడువదాయె,
అంతరశ్రుజడము నక్షిని విప్పదు,
నెరపెఁ గిన్కఁ జెలి వినీతి విడక. ౪౭

విదూ.—వెళ్లినది దేవి వాసవదత్త. నీ వెందుకు ఇక్కడ అరణ్యరుదితం చేస్తూ వుంటావు?

రాజు.—మూర్ఖుఁడా, దేవికోపమును నీవు కనవైతివి. కావున అన్నివిధములు దేవీప్రసాదనము తప్ప ఇంక వే ఉపాయమును కనలేకున్నాను. మఱి రారమ్ము, దేవి తేర్చుటకు లోఁగిటికి పోవుదము. [అని నిష్క్రమించురు.

కదలీగృహ మనెడుద్వితీయాంకము సమాప్తము.

---

## ప్రవేశకము

[అంతట మదనిక ప్రవేశించును.]

మదనిక.—[ఆకాశమున] కౌశాంబికా, నీవు భట్టినికాడ కాంచనమాలని చూచినావా, లేదా? [చెవి యొగ్గి విని] ఏ మంటావు? ఆమె వచ్చివెళ్లి ఎంతో సేపయింది అంటావా. అయితే ఆమెని ఇప్పుడు ఎక్కడ చూడగల్తును? [ఎదురకాంచి] ఏమి ఇదే కాంచనమాల ఇక్కడికే వస్తూ వుంది. కనక ఈమెదగ్గిరికి వెళ్తాను.

[అంతట కాంచనమాల ప్రవేశించును]

కాంచ.—[సోత్ప్రాసముగా] బలే గట్టివాడవురా వసంతకుడా, బలే. ఈ సంధివిగ్రహచింతలో నీవు అమాత్యయౌగంధరాయణ్ణి మించినావురా.

మద.— [చిఱునగవుతో సమీపించి] ఒసే కాంచనమాలా, ఏమి చేసాడే వసంతకుడు నేడు, ఈ విధంగా అతణ్ణి శ్లాఘించడానికి?

కాంచ.—ఒసే మదనికా, దీన్ని అడగడంచేత నీ కేమి ప్రయోజనం? నీవు రహస్యాన్ని దాచడానికి దంటవు గావు.

మద.—ఎవరియెదటను చెప్ప నని దేవిపాదములమీద ఒట్టుపెట్టుకొంటాను.

కాంచ.—అ టయితే విను మరి, చెప్తాను. నేను రాజగృహమునుంచి మరలి వస్తూ నేను చిత్రశాల ద్వారంలో వసంతకుడు సుసంగతతో ఆడుతున్న మాటలు విన్నాను.

మద.—[కౌతుకముతో] సఖీ, చెప్పు ఆమాటలు ఎటువంటివో.

కాంచ.— వసంతకు డన్న మాట ఇది. అమ్మా సుసంగతా, ప్రియవయస్యుడికి అస్వస్థతకి సాగరిక కన్న వేరే కారణం లేదు. కనక ఈ విషయంలో ప్రతీకారాన్ని ఆలోచించు.

మద.—అందుకు సుసంగత యే మన్న ది?

కాంచ.—అంతట అది యీలా గన్నది.—'నేడు దేవి చిత్రఫలకవృత్తాంతంచేత సందేహపడి సాగరికని నాచేతి కప్పగిస్తూ, నాకు నేపథ్యాన్ని మాటకట్టి బహుమానంగా ప్రసాదించినది; ఆ నేపథ్యంతో నే సాగరికకి దేవీవేషము వేసి నేను కాంచనమాలవేషం వేసుకొని భర్తకడకు వస్తాము. నీవున్ను ఈచిత్రశాల ద్వారాననే కనిపెట్టుకొని వుండవలసింది. అంతట బండిగురివెందతీగలమండపంలో ప్రభువునకు దానితో సంగమము కలుగుతుంది.' అని.

మద.—ఓసి సుసంగతా, పరిజనవమత్సలని దేవిని ఈవిధంగా వంచించి నీవు చెడిపోతావే.

కాంచ.—ఒసే మదనికా, ఇప్పుడు నీ వెక్కడికి వెళ్లుతున్నావు?

మద.—అస్వస్థశరీరు డైనప్రభువుయొక్క కుశలవృత్తాంతాన్ని తెలుసుకొని రమ్మని నిన్ను దేవి పంపితే వెళ్లి నీవు రావడం ఆలస్యం అయిన దని దిగులొందినదై, ఆమె నీకడకే కనుక్కొని రమ్మని నన్ను పంపినది.

కాంచ.—దేవిమనస్సు మిక్కిలి తిన్ననిది. కనక నే యిట్లు నమ్ముతుంది. [పరాక్రమించి చూచి] ఏమి! ప్రభువు ఈలాగ అస్వస్థతామిషచేత మదనబాధను కమ్ముతూ దంతతోరణవలభిమీద కూర్చుండి ఉన్నాడు. రా మరి ఈవృత్తాంతాన్ని దేవికి చెప్పుదాం. [అని నిష్క్రమింతురు.

ప్రవేశకము సమాప్తము.

# తృ తీ యా ం క ము.

---

[అంతట మదనావస్థను నటించుచు రాజు ప్రవేశించును.]

రాజు.— [ఉత్కంఠతో నిశ్వసించి]

ఉ. స్మరశిఖితాపమున్ హృదయమా, సయిరింపుము; యిప్డు దీనికిం
బఱగదు శాంతి, బాలకయి నందురె దేల వృథా సదా యిటుల్!
పారసియు నెట్టకే నపుడు మూఢుఁడ నై యిడనైతి నీపయిం
జిరముగఁ జందనద్రవసుశీతముఁ దత్కరపంకజాతమున్.

అహో ఎంతయాశ్చర్యము! అట్లే గదా.—

తే. ప్రకృతిచేతను మన సస్థిరమ్ము, మఱియు
వీక్షణాగోచరము గుఱివెట్టి యేయ;
అట్టిదాని నాదుమనస్సు నెట్టు లేసె
మారుఁ డొక్కమ్మడినె యెల్లనారసముల!

[ఊర్ధ్వము చూచి] ఓయి కుసుమాయుధుఁడా,

చ. అలుగులు చిత్తజాతునికి నైదె యటంచును, వాని కెందు ల
క్ష్యులుమముఁబోంట్లసంఖ్యులనియున్, జగమందుఁ బ్రసిద్ధమెప్డు నం
తలఁప విరుద్ధ మయ్యె నది దర్పక నీయెడ; నీవు పంచతం
గొలిపితి వొంటిఁ గామిజనుఁ గొట్టి యసంఖ్య శిలీముఖంబులన్.

[ఆలోచించి] నేను నిండుకోపమును లోలోన నడంచుకొన్న దేవికంటి కగ్గమైన యాదీనురాలు సాగరికకోసము ఎంత చింతింతునో అంత ఇట్టియవస్థకు పా... నాకోసము చింతింపను. అట్లే,—

చ. ఎఱుఁగుదు రెల్లరుం దనదువృత్తము నంచు శిరంబు వాంచు, ని
ద్దఱు తమలోనఁ బల్కికొనఁ దన్ను గుఱించియె యంచు నల్కఁ దాఁ,
పెఱకతలన్ సఖు ల్నగినఁ బెల్లుగఁ బూను విలక్షభావమున్;
మఱిఁగెడు నిట్లు ప్రాణసఖి మానసనిమ్నభయంబు పెంపునన్.

ప్రియావార్తను విచారించుటకై వసంతకుని పంపియున్నాను. ఏలతామసించుచున్నాఁడు?

[అంతట హృష్టుఁడు వసంతకుఁడు ప్రవేశించును].

వసంతకుఁడు.—[సంతోషముతో] హీహీ! ఓహోహో! ఆశ్చర్యమాశ్చర్యం. ఇప్పుడు నావల్ల ప్రియవచనం వినడంచేత నాప్రియవయస్యుడికి ఎంతహృదయానందము కలుగుతుందో అంతఆనందము కౌశాంబీరాజ్యము రావడంచేతకూడా కలగలే దని అనుకుంటాను. కనక వెళ్లి ప్రియవయస్యుడికి చెప్తాను. [పరిక్రమించి చూచి] ఏమి! ఇదుగో ప్రియవయస్యుడు ఈదిక్కునే చూస్తూఉండడం చూడగా నాకోసమే ఎదురుచూస్తున్నా డని తోస్తుంది. ఇతణ్ణి సమీపిస్తాను. [అని సమీపించి] జయం జయం ప్రియవయస్యుడికి. వయస్యా, నీఅదృష్టం పండింది; నీకోరిక సిద్ధించింది.

రాజు.—[హర్షముతో] వయస్యా, ప్రియకు సాగరికకు కుశలమా?

విదూ.—[గర్వముతో] ఓహోయి, త్వరలో నీవే చూచి తెలుసుకొంటావు.

రాజు.—[పరితోషముతో] వయస్యుఁడా, ప్రియను చూడనుగూడ చూచెదనా?

విదూ.—[అహంకారముతో] ఓయి, ఎందుకు చూడవు, బృహస్పతిబుద్ధివిభవాన్ని పరిహసించేవాణ్ణి నేను నీకు మంత్రినై ఉండగా?

రాజు.—[నవ్వి] ఇది చిత్రముగాదు, నీప్రభావమునకు మితి యెక్కడిది? చెప్పు మిత్రమా, విస్తరముగా వినఁగోరెద.

[విదూ.—చెవిలో ఇట్లు ఇట్లు అని చెప్పను.

రాజు.—[పరితోషముతో] వయస్యుఁడా, ఇదిగో నీకు పారితోషికము.

[అని చేతినుండి తివిచి కడియము నొసంగును.

విదూ.—[కడియముం దాల్చి తన్ను తాఁ జూచికొని] ఈలా గగుగాక. శుద్ధ సువర్ణకడియముతో అలంకృత మైనయీనాచేతిని ఇంటికి వెళ్లి నాభార్యకి చూపిస్తాను.

రాజు.—[అతనిచేయి పట్టుకొని పోనీక అఁపుచు] మిత్రమా, తర్వాతఁ జూపుదువుగాని, ఇంకను పగలు ఎంతమాత్రము శేషించియున్నదో కనుంగొనుము.

విదూ.—[పరిక్రమించి చూచి సంతోషముతో] ఓయి, చూడు చూడు. మిక్కిలి ఉత్కటమురాగము తనహృదయాన్ని ఈడ్చుస్తూవుండగా ఇదుగో వేయివెల్గుల భగవానులు సంధ్యావధువు ఏర్పరిచినసంకేతస్థానానికి బోలె అస్తాద్రిశిఖరపు అడవికిపోతూవున్నాడు.

రాజు.—[చూచి హర్షముతో] మిత్రుఁడా చక్కఁగా కనుంగొంటివి. పగలు ముగిసినది. అట్లేగదా,—

ఉ. అరద మి దేకచక్రము మహాధ్వము లోకమితంబు దాఁటియుఁ
దిరగున వేకువన్ మరల సాగ సశక్తమ టన్నచింత నాఁ

తరమిడి సంజ త్రెక్కొనఁగఁ దక్కిన రశ్మిలె పైఁడియాకు లౌ
హరిదురుచక్రమున్ నడపు చక్కఁడు నిల్చెను పశ్చిమాద్రిపై.

మఱియు,

తే. సమయ మిది నాకుఁ బద్మాక్షి, చనఁగవలయు,
నిద్రితను నిన్ను మేల్కొల్ప నేనె వత్తు;
ఇట్లని ప్రమాణ మొనరించునట్లు తోఁచు
నస్తమస్తకమునఁ గరం బత్తి హేళి.

మఱి లేలెమ్మ.—ఆ మాధవీలతా మండపమునకే పోయి ప్రియతమా సం
సమయమును నిరీక్షించుచుందము.

విదూ.—శోభనముగా పలికిశావు. [అని లేచి, చూచి] వయస్యుడా, చూ
చూడు. ఇదుగో చీకటిమొత్తము పలపలని వనరాజిసన్నివేశాన్ని దట్టముచేస్తూ, దట్ట
బురదలు ధరించడంచేత వాస్తవంకంటె ఎక్కువబలుపుగా కనబడుతూవుండే ఆ
దులయొక్కను అడవిదున్నలయొక్కను కారునలుపుతో దిక్కుల నన్నిటినీ కన
కుండా చేస్తూ, వ్యాపిస్తూ వున్నది.

రాజు.—[హర్షముతో, కలయం దిలకించి] వయస్యా, చక్కఁగా కంటివి.
సుమా,—

తే. క్రమ్మఁ దొలిఁ దూర్పునే, లాఁతికడను బిదప,
ముంచు నెయ్యన గిరితరుపురభిదలను,
బలుపు గొని మాపు జనులదృక్ఫలము వెనుక,
హరగళద్యుతిఁ గెరలు మోహారపుటిరులు.

మఱి దారి చూపు.

విదూ.—రావయ్యా, రా ప్రియవయస్యుడా. [పరిక్రమించి]

విదూ.—[నిరూపించి] వయస్యుడా ఇదే మకరందోద్యానం, దగ్గరనే
చెట్లబాహుళ్యంచేత ఒకటే చీకటిముద్దగా వుంది. మరి యిందులో దారి యేలాగ
పడుతుంది!

రాజు.—[గంధము నాఘ్రాణించి] వయస్యుడా, ముందు నడువుము. ఇట దారి మనకు చక్కఁగా తెలిసినట్టిదే గదా. అట్లే.—

మ. ఇది సంపెంగలవాటి, యీయదియె యామ్రాద్యంపునిర్గుండి, యీ
యది జీబైనకదంబపాళి, యిది సుమ్మా పాటలాపంక్తి ; యి
ట్లుదితాఘ్రాతవిభిన్నగంధములచే నుర్వీజము ల్పుత్తుగాఁ,
బదవిన్ వ్యక్తముగా నెఱింగితిఁ దమోదైర్గుణ్యసంఛాదిత౯. 77

[పరిక్రమింతురు.

విదూ.—ఓయి, ఇది మకరందపానంచేత మత్తెక్కిన తేంట్లు వాలడంచేత కిందికి రాలుతూవున్న పొగడపువ్వులపరిమళాన్ని దశదిక్కులకు వెలువుతూవున్నది, మృదువైన పచ్చలతోటిన్ని మనశ్శిలలతోటిన్ని కట్టిన రాకట్టుమీఁది యీ నడకలో మన యడుగులకి సుఖం గలిగిస్తూ వున్నది, మాధవీలతామండపం. ఇందు ప్రవేశించాము గదా. ఇక్కడనే వుండు కూర్చో, నేను వెళ్లి దేవివేషము వేసుకొనివున్న సాగరికని క్షణములో తోడ్కొని వస్తాను.

రాజు.—వయస్యుఁడా, అటయిన త్వరపడుము.

విదూ.—వయస్యుడా, ఉత్తలంపడకు. ఇదుగో వస్తున్నాను. [నిష్క్రమించును.

రాజు.—అందాఁక నేనును పచ్చలరాతిన్నియపైఁ గూర్చుండి ప్రియాసంకేత సమయమును నిరీక్షించుచుండెద. [కూర్చుండి సచింతముగా] అహా! కామిజనునికి తన యుల్లాలితూటమిని పరిభవించువానికి క్రొత్తచెలువమీఁద ఏమీ పక్షపాతము! అట్లగదా,

చ. దయితముఖంబుఁ బ్రేమవిశదం బగుచూపునఁ జూడ దల్కునన్,
పాయలుగ నిక్కుఁజన్నుఁగవ నొత్తదు కంఠముఁగౌఁగిలించుచోన్,
నయమునఁ జిక్కఁ బట్టినను న న్నన ని మ్మని పల్కు మాటి, కి
ట్లయినను నిశ్చితస్థలము నందినకామిని ప్రీతిఁ బెంచెడిన్. 78

ఏమి! వసంతకుఁడు ఆలసించుచున్నాఁడే? ఈవృత్తాంతమే మయిన దేవికి వాసవదత్తకు ఎఱుకవడి యుండునా?

[అంతట వాసవదత్తయు కాంచనమాలయు ప్రవేశింతురు]

వాస.—ఒసే కాంచనమాలా, నిజమేనా నావేషముధరించి సాగరిక ఆర్యపుత్రుణ్ణి అభిసరిస్తుం దన్న మాట?

కాంచ.—కాకపోతే భట్టినికి నివేదింతునా? కాక, చిత్రశాలికాద్వారమందు కూర్చున్న విదూషకుడే నీకు తార్కాణ మగును.

వాస.—అటయితే అక్కడికే వెళ్దాము.

కాంచ.—రా భట్టినీ రా. [పరిక్రమింతురు

[అంతట కూర్చున్న వాఁడు ముసుఁగిడికొన్న వాఁడు వసంతకుఁడు ప్రవేశించును.]

విదూ.—[చెవి యొగ్గి] చిత్రశాలికాద్వారాన అడుగులచప్పుడు వినబడుతూన్న కనక సాగరిక వచ్చిం దని తలుస్తాను.

కాంచ.—భట్టినీ, ఇదే ఆచిత్రశాల, ఇందులో ప్రవేశించి వుండు. నేనున్ను వసంతకుడికి సన్న చేస్తాను. [అని చిటిక వైచును

విదూ.—[హర్షముతో సమీపించి చిఱునవ్వుతో] సుసంగతా, నీవు సరీగా వేసు...న్నావే కాంచనమాలవేషాన్ని! మరి సాగరిక ఏదీ?

కాంచ.—[వ్రేలితో చూపుచు] ఇదుగో.

విదూ.—[చూచి ఆశ్చర్యముతో] ఈమె స్ఫుటంగా దేవి వాసవదత్తే.

వాస.—[ఆశంకతో ఆత్మగతము] ఏమి వీడు నన్ను ఆనవాలుపట్టినాడే! కనక వెళ...తాను. [అని పోఁ నుంకించును

విదూ.—అమ్మా, సాగరికా, ఇటు రావమ్మా.

[వాసవదత్త నవ్వి కాంచనమాలను చూచును

కాంచ.— [అపవారించి వ్రేలితో విదూషకుని బెదరించుచు] హతాశుడా, ఈమాట మరవకు.

విదూ.—త్వరగా పద, త్వరగా పద, సాగరికా. ఇదుగో తూర్పుదిక్కున చంద్రుడు ఉదయిస్తున్నాడు.

వాస.—[సంభ్రమముతో అపవారించి] స్వామీ, మృగలాంఛనుడా, నీకు నమస్కారము రవంతసేపు నీదేహమును మఱుగున ఉంచు, ఈలోపల ఇతని భావానుబంధాన్ని చూస్తాను గాక. [అందఱు పరిక్రమింతురు

రాజు.—[ఉత్కంఠతో ఆత్మగతము] ప్రియాసమాగమము సమాసన్న మై యున్నను ఏమి యిది నామనస్సు మిక్కిలి ఉత్తలపడుచున్నది. కా కేమి?

తే. ఇంచువిల్తునిశిఖి తొల్త నేప దట్టు
లెట్లు లేచును పొందుసమీప మగుడు,
కారున న్నికటోదకాగమము దినము
పుటము వెట్టెడుఁ గాదె యపూర్వగరిమ. ౫౭

విదూ.—[విని] అమ్మా సాగరికా, ఇదుగో ప్రియవయస్యుడు నిన్నే గూర్చి బాగాని తాళలేక యీలాగ పలుకుతూవున్నాడు. కనక నీ విట వుండు. నీవు వచ్చినా వని ప్రియవయస్యుడితో చెప్పి వస్తాను.

[వాసవదత్త శిరఃసంజ్ఞ నొసఁగుచున్నది.

విదూ.— [రాజును దరిసి] వయస్యా, ఆహా నీవు వర్ధిల్లుతున్నావు. ఇదుగో నేను సాగరికను తెచ్చినాను.

రాజు.—[హర్షముతో తటాలున లేచి] ఏదీ ఎక్కడ ఎక్కడ?

విదూ.—[భ్రూసంజ్ఞతోఁగూడ] ఇదుగో.

రాజు.—ప్రియా సాగరికా,

మ. అమృతాంశుండు మొగంబు,కల్వలు కనుల్,హస్తంబులంభోజముల్,
విమలోరుల్ కదళోదరంబులు, బిసాభిఖ్యంబు లా బాహువుల్;
రమణీ, హ్లాదకశాఖలాంగకవు, మారక్రూరబాణాగ్ని చేఁ
గమలం గ్రాఁగిన నాదుగాత్రములకాఁక న్గ్రాఁగిట న్మాన్పవే. ౫౮

వాస.—[బాష్పములతో అపవారించి] కాంచనమాలా, ఈలాగు ఆర్యపుత్రుడు ప్రియంగా పలుకుతున్నాడు. మళ్లీ నాతో యేలాగ మాట్లాడుతాడో! ఆహా ఏ మాశ్చర్యము!

కాంచ.—[అపవారించి] భట్టిని, ఈలాగే ఇది. సాహసికు లయినపురుషులు ఏమి చేయరు!

విదూ.—అమ్మా సాగరికా, ఎందుకు విశ్వాసము వహించి ప్రియవయస్యుణ్ణి పలుకరించవు? ఎప్పటికిన్ని నిత్యరోష మైనయావాసవదత్తాదేవి పలికే దుర్వచనాలచేత కలుషమైన చెవులు చేదెక్కి పోయినవి. నీ మధురవచనోపన్యాసము వాటికి సుఖ మొసగుగాక.

వాస.—[అపవారించి సరోషస్మితముగా] ఒసే కాంచనమాలా, నేను ... వంటిదానను చేదులు పల్కెదానను, ఆర్యవసంతకు డైతే ప్రియంవదుడు.

కాంచ.—[అపవారించి, వ్రేలితో బెదరించుచు] హతాశుడా, ... మరవకు.

విదూ.—[చూచి] వయస్యుడా, చూడు చూడు, ఇదుగో కోపగించినకా... చెక్కిలితో సమానుడై మృగలాంఛనభగవానుడు తూర్పుదిక్కును వెలిగించుచు ఉ...యించినాడు.

రాజు.—[చూచి సస్పృహముగా] ప్రియా, చూడు చూడు.

క. తనకాంతి నెల్ల నీయా
ననము హరింపంగ, రజనినాయకుఁడు బదుల్
పొనరింప నెక్కె గిరికోనఁ,
గను మదె నీమ్రోల, నూర్ధ్వకరతఁ దపించున్.

ప్రియురాలో, ఈతఁడు పొడతెంచుచు తనజడత్వమును ప్రకటించుకొన్నా... సుమా. ఎట్లనఁగా,

మ. నయనానందకరుండు గాఁడొ, యరవిందశ్రీని ఖండింపఁడో,
నయనాంతేక్షణమాత్ర దర్పకునికిన్ సామ్రాజ్యముం గూర్పఁడో,
ప్రియకందర్పుఁడు నీముఖేందుఁ డుఱఁ, దా వేఱెందుఁ డుప్పొంగ...
స్మయమేనిన్ సుధచేతఁ, బూర్ణ మది నీసారోష్ఠబింబంబునన్...

వాస.—[రోషముతో మేల్ముసుంగు తివిచి] ఆర్యపుత్రా, నిజంగా ... సాగరికను గాను, నీహృదయాన్ని నీవు సాగరికమీద వేసినందున నీకు సర్వమూ ... రికామయంగానే కనబడుతూ వున్నది.

రాజు.—[చూచి వైలక్ష్యముతో అపవారించి] అయ్యో! అక్కటా! ... ఏమీ దేవి వాసవదత్త! వయస్యుఁడా, ఇదేమి ?

విదూ.—[విషాదముతో] వయస్యా, మరి వేరే మున్నది. ఇది మనకు ... సందేహాకరముగా వచ్చినది.

రాజు.—[కూర్చుండి కేలుమోడ్చి] ప్రియా, వాసవదత్తా, మన్నింపు మన్ని...

వాస.—[అతనిమొదురుగా కన్నీళ్లు కార్చుచు] ఆర్యపుత్రా, ఆలా ... ఈయత్నరాలు వేఱొక తెలా ...

విదూ.—[ఆత్మగతము] ఇందులకు ఇప్పుడు ఏమి చేయుదును? కానీ, ఇట్లు అడుగుగాక. [ప్రకాశము] అమ్మా, నీవు మహానుభావురాలవు; కనుక ప్రియవయస్యుడియొక్క యపరాధమును మన్నించుము.

వాస.—ఆర్యా, వసంతకా, మరి తొలియాటమిలో విఘ్నము చేసి నేనే ఈయన అపరాధము చేసితిని, ఈయన నాకు చేయలేదు.

రాజు.—ఇట్లు నాదోషము ప్రత్యక్షమై యుండఁగా నే నేమి వచింతును! అయినప్పటికి విన్నవించెదను.—

క్షే. దేవి, నీపదముల కెంపు నే వెలార్తు
లాక్షికము నాశిరముచే విలక్షమతిని;
అస్యశిరియందుఁ గోపగ్రహణజనితముఁ
గెడపుదును నీకు నాపయిఁ గృప గలిగిన. ౬౧

[అని పాదముల వ్రాలును.

వాస.—[చేతితో వారించుచు] ఆర్యపుత్రా, లే లే, ఆర్యపుత్రుని యిటువంటి హృదయాన్ని యెరిగియు మళ్లీ కోపగించునది లజ్జ లేనిది గదా. కనక ఆర్యపుత్రా, నీవు సుఖముండు, నేను వెళ్తాను [అని పో నుద్యమించును.

కాంచ.—భట్టిని, మన్నించు. ఈలాగ పాదాలలో పడినమహారాజును వదిలి వెళ్తే నీవు అవశ్యం పశ్చాత్తాపంచేత దుఃఖపడతావు.

వాస.—పోవే బుద్ధిహీనురాలా; ఇక్కడపశ్చాత్తాపాని కేమి కారణ మున్నది? వాలు, వెళ్దాం రా [నిష్క్రమింతురు.

రాజు.—దేవీ, మన్నింపు మన్నింపు. "దేవి, నీపదముల" ఇత్యాది మరల పఠించును.

విదూ.—లేవోయి లే, ఆమె వెళ్లింది దేవి వాసవదత్త.

రాజు.—[మొగమెత్తి] ఏమి! ప్రసాదము సేయకయే పోయినది దేవి!

విదూ.—ప్రసాదం చేయలే దంటా వేమి? ఇప్పటికిన్ని అక్షతశరీరులంగా ఉన్నాము గామా?

రాజు.—ఛీ మూర్ఖుఁడా, ఏమి ఇట్లు నన్ను హేళనము చేసెదవు? ఈ యన క్షేమము నీవలననే సంభవించినది. ఎట్లన,—

చ. ప్రణయబహూకృతిప్రభవబంధురరాగము గల్గి నాపయిన్
గని యిట నాకువాక్యము సకల్పితపూర్వము, ఊచ్చుపాటు గాన్,

దనువు దొరంగ కున్నె దయితామణి మానిని? యేమి సెప్పదు
ఘన మగు ప్రేమలో స్ఖలితకంబును దుస్సహ మౌట క్రొత్తయే

విదూ.—ఓయి, దేవి కోపము చెందినది, ఏమి చేయునో తెలియదు. మరి సాగరిక ఇక ప్రాణాన్ని ధరించడం దుష్కర మని నే ననుకొంటాను.

రాజు.—వయస్యుడా నేనును అట్లే తలంచుచున్నాను. హా! ప్రేయసీ! సాగరికా!

[అంతట వాసవదత్తావేషధారిణి సాగరిక ప్రవేశించును.]

సాగ.—[ఉద్వేగములో] ఈదేవీవేషంతో ఈసంగీతశాలనుంచి వెడలి వున్న నన్ను నాపుణ్యాన ఎవ్వరున్ను చూడరైరి. మరియిక్కడ నే నేమి చేయుదు [అని కన్నీళ్లు విడుచుచు చింతించును.]

విదూ.—ఏ మోయి, మూఢుడిలాగ నిల్చిపోయినావు? ఇందు కేమయినా ప్రతీకార మాలోచించు.

రాజు.—వయస్యుడా అదే ఆలోచించుచున్నాను. దేవిని ప్రసన్నురాలిని చేయుటకన్న వేఱుపాయము కనఁబడదు. రా, అక్కడికే పోదము. [పరిక్రమించును.]

సాగ.—[కన్నీళ్లతో నవ్వి] ఇప్పుడు స్వయంగానే ఉరిబోసుకొని ప్రాణము విడవడం మేలు. అలాగే చేస్తాను. సంకేతవృత్తాంతము తెలిసిపోయినయిప్పుడు గతవలె దేవిచేత అవమానపడి బ్రతికివుండడం సరిగారు. కనక అశోకవృక్షముకింద యీయిష్టం నెరవేర్చుకొంటాను! [అని పరిక్రమించును.]

విదూ.—[విని] ఉండవోయి ఉండు అడుగులచప్పుడు వినబడుతూవుంది. ఏ వేళ దేవియే పశ్చాత్తాపము పొంది మళ్లీ వచ్చినా వచ్చు నని అనుకొంటాను.

రాజు.—వయస్యుడా మహానుభావురాలు సుమీ దేవి, ఒకవేళ అట్లే చేయను చేయును, కావున త్వరగా కనుంగొనుము.

విదూ.—నీయాజ్ఞ. [అని నిమ్మళించును.]

సాగ.—[సమీపించి] కనుక ఈ బండిగురివెందతీగతో ఈ అశోకవృక్షమున ఉరిదీసుకొని ప్రాణము వదలుతాను. [అని తీగతో త్రాడుచేసికొనుచు] అయ్యో నాయనా! అయ్యో అమ్మా! నే నిప్పుడు అశరణ నై మందభాగ్యను చచ్చి పోతున్నాను. [అని మెడను తీగయురిం దగిలించుకొను]

విదూ.—[చూచి] ఎవ రీమె? ఏమి వాసవదత్తాదేవియే! [సంభ్రమముతో బిగ్గరగా] వయస్యా, కావవోయి కావు. ఇదుగో దేవి వాసవదత్త ఉరిబోసుకొని ప్రాణము వదులుతూ వున్నది!

రాజు.—[సంభ్రమముతో సమీపించి] వయస్యా, ఏదీ ఏదీ!

విదూ.—ఇదుగో ఇక్కడ.

రాజు.—[మెడనుండి ఉరిం దివియుచు] ఓసి సాహసకారిణీ, ఏమి యీ యకార్యము చేసెదవు?

తే. కంఠగత మయ్యెఁ బ్రాణంబు కలికి నాకు,
నీకుఁ బాశంబు కంఠసన్నిహిత మగుడు;
అపహతస్వార్థ మగుట నీయత్న మిట్లు
వదలు మీసాహసంబును బ్రాణదయిత! ౬౩

సాగ.—[రాజును చూచి] అహా! ఏమి ప్రభువే! [హర్షముతో ఆత్మగతము] నిజముగా ఈయన్ని చూడగానే నాకు మళ్లీ ప్రాణంమీద ఆశ కలుగుతూవుంది. కానీమి! ఈయన్ని చూచి ధన్యురాలినై సుఖంగా ఉరిబోసుకొని ప్రాణం వదులుతాను. [ప్రకాశము] నన్ను వదులు ప్రభూ, నన్ను వదులు. పరాధీనురాలినిగదా నేను! నాకు మరణానికి ఇటువంటి సమయము మళ్లీ దొరకదు. నీవున్ను దేవియెడల అపరాధివి గాక ఉందువు.

[అని మరల మెడకు పాశమును తగిలించుకొన నుంకించును.

రాజు.—[చూచి హర్షముతో] ఏమి నాప్రియ సాగరికయా! [అని కంఠమునుండి పాశమును తివిచివైచి]

మాలిని.

విడుము విడుము గోలా వెఱ్ఱియీసాహసంబుఁ;
విడుము విడుము దీనిఁ వే లతాపాశకంబుఁ;
వడిఁ దరలిననాజీవంబు నిల్పన్ సుధాంగీ
వడి నిడు మఱుత న్నీ బాహుపాశంబు నాకుఁ. ౬౪

[అని బాహుపాశమును తివిచి తనకంఠంబున నుంచుకొని స్పర్శసుఖము నభినయించి విదూషకుంగూర్చి] సఖుఁడా, ఇది మేఘములేనివృష్టి.

విదూ.—ఓహో! ఆలాగే యిది, అకాలపుసుడిగాలి యై వాసవదత్తాదేవి రాకుంక్షే.

[అంతట వాసవదత్తయు కాంచనమాలయు ప్రవేశింతురు.]

వాస.—ఓసే కాంచనమాలా, ఆలాగున పాదాల్లో బడినఆర్యపుత్రుణ్ణి ధిక్కరించి రావడంచేత నేను మిక్కిలి నిష్ఠురంగా వర్తించితిని. అందుచేత ఇప్పుడు వెళ్లి స్వయంగానే ఆర్యపుత్రుణ్ణి ఊరడిస్తాను.

కాంచ.—దేవి తప్ప యీలాగ చెప్పగలవారు మరెవ్వరున్నారు! ఆతడే దుష్టుడు కావడం మేలుగాని, దేవి కఠినురాలు కాగూడదు. మరి రా దేవీ, రా.

[పరిక్రమింతురు

రాజు.—ఓసీ బేలా, ఏమి ఇప్పుడును నీవు ఉపేక్షచేత నా మనోరథము విఫలము చేయుచున్నావు?

కాంచ.—[చెవి యొగ్గి] భట్టినీ, ఈచెంతనే ప్రభువు మాటలాడుతూవుండడం చూడగా నాకు తోస్తున్నది నిన్నే ఓదార్చడానికి వస్తున్నాడని. కనక భట్టినీసమీపించు.

వాస.—[హర్షముతో]ఆయనకు కనబడకుండా వెనుకవైపు వెళ్లి కంఠము కౌగిలించుకొని ప్రసాదింప జేస్తాను.

విదూ.—అమ్మా సాగరికా, భయము మాని ప్రియవయస్యుణ్ణి పలకరించు.

వాస.—[విని విషాదముతో] కాంచనమాలా, ఏమి! సాగరికకూడా ఇక్కడే ఉన్నది! కనుక విందాముగాక తర్వాత సమీపిస్తాను. [అని అట్లు చేయును.

సాగ.—ప్రభూ ఎందుకు ఈ కపటదాక్షిణ్యము? నీకు ప్రాణముకంటె ప్రియమైన దేవియెడల మళ్లీ యెందుకు అపరాధి వవుతావు?

రాజు.—ఓసి అనృతము పల్కుచున్నావు. ఎట్లనఁగా,

ఉ. ఊరుపులన్ ఘనస్తనము లుద్దవిడన్ వడఁకన్ వడంకిలిన్,
చేరఁగ బొమ్మ లంఘ్రులను జేరితి, మానితఁ దియ్యఁ బల్కితిన్;
ఆరహి దేవి కేఁ గులజత్వార్హతఁ జేసెడి సేవమాత్ర మాఁ,
గూరిమినో రసోద్ధురముఁ, గ్రుచ్చితి నీయెడనే తలోదరీ.

వాస.—[సమీపించి రోషముతో]ఆర్యపుత్రా, ఇది తగును! ఆర్యపుత్రా, తగును!

రాజు.—[చూచి వైలక్ష్యముతో] దేవి, కారణము లేకుండ నన్ను నిందించుట సరిగాదు. నీవే అనుకొని వేషసాదృశ్యముచేత మోసపోయి నేనిక్కడికి వచ్చితిని. క్షమింపుము.

[అని పాదముల వ్రాలును

వాస.—[రోషముతో ఆర్యపుత్రా, లేలే. ఏల యిప్పటికిన్ని సహజాభిజాతజనిత మైన సేవచేత దుఃఖ మనుభవిస్తావు?

రాజు.—[స్వగతము] అహో దీనినికూడ దేవి విన్నదే! కావున ఎల్లవిధములను క్షేమప్రసాదమునుగూర్చి నిరాశుడ నైతిని. [అని యధోముఖుఁడై యుండును.

విదూ.—అమ్మా, నీవే ఉరిబోసుకొని ప్రాణం వదులుతూ వున్నావని వేష సామ్యముచేత మోసపోయి నేను ప్రియవయస్యుణ్ణి ఇక్కడికి తోడ్కొని వచ్చినాను. నామాట నమ్మకపోతే చూచుకో ఈఉరి తీగని. [అని లతాపాశమును చూపును.

వాస.—[కోపముతో] ఒసే కాంచనమాలా, ఈ లతాపాశంతోనే కట్టి యీ బాపణ్ణి పట్టుకో. ఈదుర్వినయపుకన్యను ముందర నడిపించు.

కాంచ.—దేవిగారియాజ్ఞ. [లతాపాశముతో వసంతకుని కంఠమును కట్టి, కొట్టును.] హతాశుడా, నీయవినయానికి ఫలము అనుభవించు. దేవి దుర్వచనములచేత చెవులు చేదెక్కిన వన్నావే ఆమాటని జ్ఞప్తికి తెచ్చుకో. సాగరికా, నీవున్ను ముందర నడువు.

సాగ.—[స్వగతము] పుణ్యము చేసుకోనిదానను నాయిచ్ఛప్రకారము మరణించ డానికీకూడా వల్లపడ దాయెను.

విదూ.—[విషాదముతో] వయస్యుడా, దేవిగారిచెఱలో మృతి చెందేనన్ను తలుచుకో. [అని రాజును చూచును.

[వాసవదత్త రాజును చూచుచు, సాగరికను వసంతకునిం గొని, కాంచనమాలతోఁగూడ నిష్క్రమించును.

రాజు.—[ఖేదముతో] కటకటా! కటకటా!

మ. తలఁగెన్ దేవిముఖంబు బెట్టిదపుఁగాంతాళాన స్నిగ్ధేక్షలన్;
బలుగోపా రిడ దేవి సాగరిక నిర్భగ్నాత్మ యయ్యెన్ వెఱన్;
చెలికానిం జెఱ వైచె దేవి; యిట నేచేతం దలంతుం గటా!
కలగుం డైతిని మువ్వెతన్ మునిఁగి; యింకం గందునో నిర్వృతిన్! ౬౬

మఱి యిప్పుడు ఇక్కడ నుండిన నేమి ప్రయోజనము? దేవినే ప్రసన్నను చేయుటకు లోఁగిటికే పోయెదను. [అందఱు నిష్క్రమింతురు.

సంకేత మనుతృతీయాంకము సమాప్తము.

# ప్ర వే శ క ము

[అంతట రత్నమాలం గేలం గొని సబాష్ప సుసంగత ప్రవేశించును.]

సుసం.—[సకరుణముగా నిశ్వసించి] అయ్యో ప్రియసఖీ సాగరికా, అయ్యో లజ్జాశీలా, హా సఖీజనవత్సలా, అయ్యో ఉదారశీలా, హా సౌమ్యదర్శనా, ఎక్కడికి వెళ్లినావు? నాకు బదులు పలకవే. [అని యేడ్చును. ఊర్ధ్వము చూచి నిశ్వసించి] అయ్యో హతవిధీ! కరుణాహీనుడా! అటువంటి ఆ అరుదైన సౌందర్యంలో సృష్టించినవాడవు ఎందుకోస మని ఇటువంటి అవస్థపాలు చేసినావు. అందువల్లగదా, ప్రియసఖి ప్రాణంమీది ఆశ వదులుకొని ఈరత్నమాలని ఎవడైనా బ్రాహ్మడిచేత పెట్టు మని చెప్పి నాచేత నుంచినది. మరి అందుకోసము ఎవరినైనా ఒకబ్రాహ్మణ్ణి వెదుకుతాను. [నేపథ్యమువైపు చూచి] ఆహా! ఏమి! ఇదుగో బ్రాహ్మడు వసంతకయ్య, ఇక్కడికే వస్తున్నాడు, ఈయనకే ఇస్తాను.

[అంతట హృష్టుండు వసంతకుండు ప్రవేశించును.]

వసం.—హీహీ బళిబళి ప్రియవయస్యుడు అలక తీర్చగా, దేవి వాసవదత్త మహా తల్లి ముత్తైదువరాలు ఇప్పుడు నన్ను చెఱనుండి విడిపించి తనచేతులతో తానే పెట్టినమోదకాలు లడ్డుకాలని కడుపునిండా తినిపించినది. మరి వెళ్లి ప్రియవయస్యుణ్ణి చూస్తాను.

[అని పరిక్రమించును.

సుసం.—[ఏడ్చుచు తటాలున సమీపించి] వసంతకయ్యా, నీవు ఒక్క నిమిషం నిలు.

విదూ.—[చూచి] ఏమి సుసంగతా, సుసంగతా, ఏడుస్తున్నావేమి? సాగరికకే ఏమయిన అపాయం కలిగిందా?

సుసం.—వసంతకయ్యా, చెప్తాను విను. పాపము! దాన్ని దేవి ఉజ్జయినికి పంపి నట్లు ప్రవాద కల్పించి అర్ధరాత్రివేళప్పుడు ఎక్కడికో తెలియదు, తీసికొని పోయింది.

విదూ.—[ఉద్వేగముతో] అయ్యో సాగరికమ్మా! అసాధారణసౌందర్యశోభితురాలా, హామృదుభాషిణీ, ఎక్కడున్నావు? నాకు బదులు పలుకు. నీమీద కొంచెమైనా కనికరం లేక దేవి ఈలాగ చేశింది!

సుసం.—వసంతకయ్యా, చెలి ప్రాణంమీద ఆశ వదులుకొని ఈరత్నమాల వసంతకయ్యచేతులలో అర్పించ మని నాచేతికిచ్చింది. కనుక దీన్ని పుచ్చుకోవయ్యా.

విదూ.—[సభాష్పము సకరుణము చెవులు మూసికొని] సుసంగతా, ఇటువంటి యీ ప్రస్తావంలో దీన్ని పుచ్చుకోవడానికి నాకు చేయి యేలాగు ఆడుతుంది!

[ఇరువురు నేద్తురు.

సుసం.—[అంజలి కూర్చి] అయ్యా ఆమెకే అనుగ్రహం చెయ్యడంగా దీన్ని పుచ్చుకో.

విదూ.—[చింతించి] అలాగే కానీ, తే; దీనితో సాగరికావిరహపీడితుడికి ప్రియ వయస్యుడికి వినోదం కలుగజేస్తాను.

[సుసంగత వసంతకునిచేత రత్నమాల నుంచును.

విదూ.—[గ్రహించి చూచి ఆశ్చర్యముతో] సుసంగతా, ఇటువంటి యీ యలంకారం సాగరికకి ఏలాగ వచ్చింది?

సుసం.—అయ్యా, నేనే ఆమెని కుతూహలపడి అడిగినాను; ఆమె ఈలాగ చెప్పింది.

విదూ.—ఆమె ఏమి చెప్పింది?

సుసం.—అంతట ఆమె మీదు చూచి, నిట్టూర్పు పుచ్చి; 'నీకు దీనికథ ఎందుకే?' అని పలికి ఏడవసాగింది.

విదూ.—ఆమె చెప్పినట్టే, సామాన్యులకి దొరకని యీ యాభరణం చూస్తే నే తెలుస్తూవుంది, ఆమె యెవరో గొప్పయింట పుట్టిం దని. సుసంగతా, ఇప్పుడు ప్రియ వయస్యుడు ఎక్కడున్నాడు?

సుసం.—అయ్యా, ఇల్లిడుగో ప్రభువు దేవిలోగిట్లోనుంచి వెడలి పటికరాతితిన్నె చెంటపానికి వెళ్లి నాడు. నీవున్ను వెళ్లు. నేను వాసవదత్తాదేవి కొలువుకు వెళ్తాను.

[నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

---

# చతుర్థాంకము

[అంతట రాజు ఆసనస్థుఁడు ప్రవేశించును.]

రాజు.—[చింతించి]

చ. హరుసము గొల్పువర్తనము, హాళి, ప్రియోక్తులు, మాయబాసలు
జరణనతుల్, విలక్షతయు, సారెకు నెచ్చెలు లాడుసాంత్వముల్
తెరలుపవాయె నాక్రియను దేవిరుషం దనుఁదానె యేక్రియన్
బ్రరుదితయై తుదిన్ గడిగి వైచెను దేవి నిజాశ్రుధారచేన్. ౬౭

[ఉత్కంఠతో నిట్టూర్పు పుచ్చి] ఇట్లు దేవి ప్రసన్నురాలయినందున ఇప్పుడు కేవలము సాగరికచింత యొక్కటే నన్ను బాధించుచున్నది. ఏల యన—

తే. తామరసగర్భసుకుమారతనువు దయిత
యపుడు నవరాగకంఠగ్రహమునఁ గరఁగి
తోడ మరుముల్కులకు నైనతూంట్లవెంట
నాయెడదఁ జొచ్చిన దటంచు నాతలంపు. ౬౮

[చింతించి] మఱి నావిశ్రామస్థాన మెవఁడో ఆవసంతకుఁడుగూడ దేవి చెఱలో వైచినది. ఇక నెవరితోఁ జెప్పుకొని బాష్పములు విడుతును. [అని నిట్టూర్చును]

[అంతట వసంతకుఁడు ప్రవేశించును.]

వసం.—[పరికించి చూచి ఆశ్చర్యముతో] బలారే, ఇదుగో ప్రియవయస్యుఁడు ఎడతెంపులేని వలవంతచేత కృశించియున్నా అద్భుతమైనలావణ్యాం కలవాఁడై ఉదయించిన విదియచంద్రునిలాగ మరీ ప్రకాశిస్తూవున్నాఁడు. [సమీపించి] నీకు మేలుకలుగుగాక. ఓహో బళీ! వర్ధిల్లుతున్నావు; నేను దేవిచేతులలో బడ్డప్పటికి నాకళ్లతోటే నిన్ను చూచినాను గదా.

రాజు.—[చూచి హర్షముతో] ఆహాహా! వసంతకుఁడు వచ్చినాఁడు! మిత్రమా నన్ను కౌగిలించుకొమ్మ.

విదూ.—[కౌఁగిలించి] వయస్యుఁడా, దేవి నన్ను అనుగ్రహించినది.

రాజు.—దేవీప్రసాదము నీ వేషముచేత నే తెలియుచున్నది. మఱి చెప్పు మిప్పుడు సాగరికవార్త యేమో.

[విదూ.—వైలక్ష్యముతో అధోముఖుఁ డగును.

రాజు.—వయస్యా, చెప్ప వేమి?

విదూ.—నీకు అప్రియాన్ని చెప్పలే కున్నాను.

రాజు.—[ఉద్వేగముతో, సంభ్రమముతో] వయస్యుఁడా అప్రియ మెట్లు? ఏమి దేహమును వదల నే వదలినదా ప్రియ? అక్కటా! ప్రియా సాగరికా!

[అని మూర్ఛను నటించును.

విదూ.—[సంభ్రమముతో] ఊరడిల్లు ఊరడిల్లు ప్రియవయస్యా.

రాజు.—[ఊఱడిల్లి కన్నీళ్లతో]

తే. నను నదక్షిణు విడుఁడు ప్రాణంబులార,
దక్షిణుల రగుఁ డోరి; హితంబు వినుఁడు;
వడిఁ బఱవ రేని చెడుదురో వెడఁగులార,
యిప్పటికె దూర మేఁగు మత్తేభయాన. ౬౫

విదూ.—అయ్యో అంతదూరం శంకించకు. పాపము! ఆమెను దేవి ఉజ్జయినికి పంపిం దని వినికి. అందుచేత నేను అప్రియ మని చెప్పితిని.

రాజు.—ఏమి ఉజ్జయినికి పంపినదా? అహో నాయందు కొంచె మయినను కని కరము లేదాయెను దేవికి! వయస్యుఁడా, అ ట్లని నీతో ఎవరు చెప్పినారు?

విదూ.—సుసంగత చెప్పింది. మరి ఒకటి, ఏఉద్దేశ్యంచేతనో ఆమె నాచేతికి ఈరత్నమాలను పంపించింది.

రాజు.—మ రెందులకు? న న్నూఱడించుటకే. కావున తెమ్ము.

[విదూషకుఁడు అందిచ్చును.

రాజు.—[కైకొని రత్నమాలను పరికించి ఎదయం దుంచుకొని] అహహా!

క. పడఁతుకకంఠాశ్లేషముఁ
బడసియు నీరత్నమాల ప్రభ్రష్టంబై
పడి సమదశలో సఖివలెఁ
దడయక మోదార్చు నాదుతనువుం గంటే. ౭౦

వయస్యా, నీవు దీనిని తాల్పుము, అందువలన నేను దీని నేని కనుచు ధృతిం బెెదను.

విదూ.—నీయాజ్ఞ. [అని కంఠమునం దాల్చును.

రాజు.—[సబాష్పము నిశ్వసించి] వయస్యా, దుర్లభముగదా ప్రియాదర్శనము!

విదూ.—[భయముతో దిక్కులు చూచి] ఓయి ఆలాగని బిగ్గరగా అనకు. ఆ వేళ దేవికి చెప్పేవారు ఎవరైనా ఇక్కడ తిరుగుతూ వుండేరు.

[అంతట బెత్తము కేలం గలది వసుంధర ప్రవేశించును.]

వసుంధర.—[సమీపించి] జయం జయం ఏలినవారికి. ఇదుగో రుమణ్వంతుల గారి మేనల్లుడు విజయవర్మ ఏలినవారి కేమో నివేదించడానికి వచ్చి ద్వారములో ని పెట్టి వున్నాడు.

రాజు.—వెంటనే అతనిం బ్రవేశపెట్టుము.

వసుం.—ఏలినవారి ఆజ్ఞ [అని నిష్క్రమించి విజయవర్మను తోడ్కొని పున ప్రవేశించి] విజయవర్మా వారుగో దొరవారు, దగ్గిరికి వెళ్లు.

విజయవర్మ.—[సమీపించి] జయము జయము ఏలినవారికి. దేవా, రుమణ్వం తుని విజయముచేత ఏలినవారు వర్ధిల్లుచున్నారు.

రాజ.—[పరితోషముతో] విజయవర్మా, కోసలులను జయించితిరా?

విజ.—ఏలినవారి ప్రభావముచేత.

రాజు.—బళీ! రుమణ్వంతుఁడా బళి! స్వల్పకాలములో గొప్పప్రయోజనము సాధించితివి? విజయవర్మా, చెప్పుము కడు విరివిగా వినఁగోరుచున్నాను.

విజ.—దేవరా, చిత్తగింపవలయును. మేము ఇటనుండి ఏలినవారియాజ్ఞ చే కొలఁదిదినములకే అనేకగజతురగపదాతిదుర్భర మయినమహాసేనతో పోయి వింధ్య స్థుఁడైన కోసలరాజు ద్వారము ముట్టడించి సేనలను ఆయాయితావుల పన్నఁదొడంగితిమి.

రాజు.—అంతట? అంతట?

విజ.—అంతట కోసలరాజు అతిగర్వముచేత అవమానము సహింప లేక ప్రధా మైనతనదం డంతయు సన్నద్ధము చేసెను.

విదూ.—ఓయి వడివడిగా చెప్పి ముగించు. నాగుండె అదురుతూ వుంది.

రాజు.—అంతట అంతట?

విజయ.—దేవా, ఆతఁడు నిశ్చయము చేసికొని,—

ఉ. పంత మెలర్ప వింజమును బాసి, యతం డెదిరించి తా రుమ
ణ్వంతుని లాఁతివింజమున నా గజతర్క దశదిక్కు లొత్తుచున్,

దంతులచేఁ బదాతిగమిఁ ద్రచ్చఁగ, నీతఁ డడర్చు చంపకుల్
జింతితసిద్ధిఁ బేర్చి కదిసెన్ రిపు నెక్కటిఁ బోర గ్రక్కునన్ ౨౧

మఱియు,

క. కత్తులు బొమిడికములపై
హత్తి పగిల్చినవి, నెత్తు లగలెన్, మిగులన్
నెత్తురు టేఱులు వాఱెన్,
మొత్తుల మిడుఁగుఱులు దూల మ్రోఁగెన్ మఱువుల్.

తే. గుంటి యుడి కోసి రిరుపరి నెంటరీలు;
క్షణములో ముఖ్యబలములు సదిసిపోయె;

రాజు.—ఏమి! మన బలములు గూడ భగ్నములా?

విజ.—

అంతఁ గోసలుఁ దలఁపడి హరాంతకారి
యెక్కటీఁడు రుమణ్వంతుఁ డుక్కుమడఁచె. ౨౨

విదూ.—జయం జయం నీకు. మనకు జయంవచ్చినది. [అని నృత్యము సేయును.

రాజు.—బళీ! కోసలపతీ! బళీ! శత్రువులు సయితము నీ పురుషకారమును ఇట్లు మెచ్చుచున్నారు! నీ మృత్యువుకూడ శ్లాఘ్యముసుమా తర్వాత తర్వాత?

విజ.—దేవా, అంతట రుమణ్వంతుఁడు కోసలదేశమున నాయన్నను జయవర్మను పట్టమించి ఏనుఁగుపిండ్లు లోనుగా గాయపడిన మనబలము నంతయు తోడ్కొని మెల్లమెల్లనిపయనములతో వచ్చుచున్నాఁడు.

రాజు.—వసుంధరా, నాప్రసాదముయొక్క విభవమును చూపు మని యౌగంధరాయణునితో చెప్పుము.

వసుం.—ఏలినవారియాజ్ఞ. [అని విజయవర్మతో నిష్క్రమించును.

[అంతట కాంచనమాల ప్రవేశించును.]

కాంచ.—దేవి ఆజ్ఞాపించింది,— ఒసే వెళ్లి ఈఐంద్రజాలికుణ్ణి ఆర్యపుత్రుని దర్శనం చేయించు అని. [పరిక్రమించి చూచి] ఇదుగో ప్రభువు. మరి యీయన దగ్గిరికి వెళ్తాను. [సమీపించి] జయం జయం ఏలినవారికి. దేవరా, దేవి విన్నపిస్తున్నది, ఉజ్జయినినుంచి వచ్చినాడు ఈ ఐంద్రజాలికుడు, శంబరసిద్ధి అని యితడిపేరు. ఇతణ్ణి ఏలినవారు చూడవలె నని.

రాజు.—మాకును ఐంద్రజాలికునియందు కుతూహలము కలదు. కావున శీ
ముగా ప్రవేశపెట్టుము.

కాంచ.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించి నెమలికుంచె కేల
యైంద్రజాలికునితోఁ గూడఁ బ్రవేశించి.] ఇటురా అయ్యా, ఇటురా.

[ఐంద్రజాలికుఁడు పరిక్రమించు

కాంచ.—వీరుగో ఏలినవారు. నీవు దగ్గిరికి వెళ్లు.

ఐంద్రజాలికుఁడు.—[సమీపించి] జయం జయం ఏలినవారికి. [కుంచెను త్ర
బహువిధముల హాస్యము గావించి]

క. దండ మిడుం డింద్రునికిన్,
దండ మిడుం డింద్రజాలదైవ మతఁడౌ గా;
దండ మిడుఁడు శంబరునికి,
దండ మిడుఁడు మాయ కర్తఁడౌ దైవతము గదా. 23

దేవరా,

క. ధరణీతలమున శశి, నం
బరమునఁ బర్వతము, నీట వాయువయస్యున్,
సరిమధ్యాహ్నంబున నిసిఁ,
బరఁగించెద, నానతిమ్ము వసుధారమణా. 24

క. హరిహరచతుర్ముఖులనున్,
సురలన్ సురరాజు, నీకుఁ జూపెదనయ్యా;
సురసిద్ధచారణవధూ
వరహల్లీసములఁ జదల వఱలింతు నయా. 25

కాకేమి,

తే. హెచ్చుపల్కు లేల ? హెచ్చరింతువయేని,
యీవు దేనిఁ జూడ నిచ్చ గొనుదొ,
దానిఁ దెచ్చి నీకు దరిసింతు దేవరా,
గురుని మంత్రమహిమ గుఱికి రాఁగ. 26

విదూ.—వయస్యా, హెచ్చరికగా వుండు, ఇతడిధైర్యం చూస్తే ఇతడు ఇంతా చెయ్యగలవాడే.

రాజు.—భద్రా, ఉండు రవంత. కాంచనమాలా, దేవితో విన్నవింపుము. "మీ వాడే యీ యైంద్రజాలికుఁడు. ఈ ప్రదేశమును విజనమును గావించితిమి. కావున నీవును వచ్చి కలసియే చూతము." అని.

చేటి.—ఏలినవారియాజ్ఞ [అని నిష్క్రమించి వాసవదత్తతోఁగూడ ప్రవేశించును.

వాస.—కాంచనమాలా, ఉజ్జయినినుంచి వచ్చినవాడని నాకు ఆ యైంద్రజాలికునిమీద పక్షపాతం కలదు.

కాంచ.—ఇది దేవికి పుట్టింటిమీదిగౌరవం కదా. రా మరి దేవీ రా.

[అని పరిక్రమింతురు.

కాంచ.—భట్టినీ, వీరుగో ఏలినవారు, సమీపించు దేవీ.

వాస.—[సమీపించి] జయం జయం ఆర్యపుత్రునికి.

రాజు.—దేవి, ఈతఁడు పెల్లుగా గర్జిల్లుచున్నాఁడు. ఇతనివిద్యను ఇట నే చూతముగాక.

[వాసవదత్త కూర్చుండును.

రాజు.—భద్రా, చూపుము నానావిధ మయిన యింద్రజాలమును.

ఐంద్ర.—ఏలినవారియాజ్ఞ. [నానావిధముల నాట్యమాడి కుంచెను త్రిప్పుచు "హరిహర" ఇత్యాది మరల పఠించును.

[అందఱును అబ్బురపడి చూతురు.

విదూ.—ఆశ్చర్య మాశ్చర్యం.

రాజు.—దేవీ, చూడు చూడు.

మ. అతఁడే బ్రహ్మ సరోజమందతఁడె చంద్రాపీడుఁ డంబాసఖుం,
డతఁడే శార్ఙ్గగదాసిచక్రగచతుర్హస్తుండు లక్ష్మీయుతుం,
డితఁ డైరావణవాహుఁ డింద్రుఁడు సురాధీశుండు, వీరల్ సురల్,
నుతమంజీరరవల్ నభంబున నటింతు ర్వీరె దేవాంగనల్. 22

వాస.—ఆశ్చర్య మాశ్చర్యం.

విదూ.—[అపవారించి] ఓరిమూర్ఖుడా ఐంద్రజాలికుడా, ఏమి ప్రయోజనం ఈ దేవతలని అచ్చరలని చూపడంచేత? ఈతని సంతోషంతో నీకు పనివుంటే సాగరికని చూపించు.

[అంతట వసుంధర ప్రవేశించును]

వసుం.—[రాజును దఱిసి] మంత్రి యౌగంధరాయణులుగారు ఏలినవారిచరణములకు విన్నవిస్తున్నారు. ఏమంటే "విక్రమబాహువు కంచుకి బాభ్రవ్యునితోడ తనప్రధానమంత్రిని ఈయనను వసుభూతిని పంపించినాఁడు. కావున ఈ శోభనముహూర్తమందే ఏలినవారు ఈయనకు దర్శన మొసంగుట తగును, నేనును కార్యశేషము ముగించుకొని ఇప్పుడే వచ్చెదను." అని.

వాస.—ఆర్యపుత్రా, ఇంద్రజాలము ఉండనీ. మాతులగృహమునుంచి ఆర్యుడు ప్రధానమంత్రి వసుభూతి వచ్చిఉన్నాడు ఆయనను చూడుము ఆర్యపుత్రా.

రాజు.—దేవి చెప్పినట్లే చేసెద. [ఇంద్రజాలికునితో] భద్రా, ఇప్పటికి నీవు విశ్రమింపుము.

ఇంద్ర.—[మరల కుంచెం ద్రిప్పుచు] దేవరయాజ్ఞ [అని నిష్క్రమించుచు] ఇంకొక్కటి నా విద్య ఏలినవారు అవశ్యం చిత్తగించవలెను.

రాజు.—కానీ తర్వాత చూచెదము.

వాస.—కాంచనమాలా, నీవు వెళ్లి ఇతనికి బహుమాన మియ్యి.

చేటి.—దేవియాజ్ఞ. [అని ఇంద్రజాలికునిం దోడ్కొని నిష్క్రమించును

రాజు.—వసంతకా, ఎదురువోయి వసుభూతిని తోడ్కొని రమ్ము.

విదూ.—దేవరయానతి. [అని నిష్క్రమించును.

[అంతట బాభ్రవ్యుఁడును, వసంతకునివలనం బ్రత్యుద్గమన సత్కారముం బొందుచు వసుభూతియు, ప్రవేశింతురు]

విదూ.—రావలెను అమాత్యుడు రావలెను.

వసుభూతి—[కలయం గాంచి] అహా! వత్సేశ్వరుని ప్రభావము! అట్లే గదా.

మ. జయహస్తిం గని డిల్లఁబోయి, కని ఱిచ్చన్ వల్లభాశ్వంబులన్,
ఖయిదైగీతికి రాజగోష్ఠి క్షణ మాకర్ణించి, సాద్యస్కవి
స్మయవిస్మారితసింహళేంద్రమహిమైశ్వర్యుండనై కడునే
యయితి న్గ్రామ్యుఁడ నాకుతూహలితచేతన్యార్థుఁడనైన నవ్వాగా

బాభ్రవ్యుఁడు—వసుభూతీ చిరకాలమున కిప్పుడు ఏలికను చూడనున్నాను అది యేమో గాని ఆనందాతిశయముచేత అనిర్వచనీయమైన దశావిశేషము సమనుభవించుచున్నాను. ఎట్లన—

తే. వణఁకు నెచ్చించె సాధ్వసవశతచేత,
నస్ఫుటను దృష్టి నాఁపిన దశ్రుతతులఁ,
గాదుకునుడి జడపఱిచె డగ్గుత్తిచేతఁ,
దోడ్పడియె నాజరకుఁ బరితోష మిపుడు. 28

విదూ.—[ముందు నడిచి] రావలెను అమాత్యుఁడు రావలెను.

వసు.—[విదూషకుని మెడలో రత్నమాలం గని, అపవారించి] బాభ్రవ్యా, ఈ రత్నమాల తరలినప్పుడు మా యేలినవారు రాజపుత్త్రికి ఇచ్చిన యారత్నమాలయే యని నాకు తోఁచుచున్నది.

బాభ్ర.—అమాత్యా, పోలిక యున్నది. ఇది వచ్చినవిధము వసంతకు నడుగుదునా?

వసు.—బాభ్రవ్యా, వలదు. ఎన్నెన్నియో రత్నము లుండెడి యింతవిభవంపు రాజగృహములో ఆభరణములపోలిక అరుదుగాదు. [అని పరీక్షమింతురు.

విదూ.—[రాజును ఉద్దేశించి] ఈయనే వత్సాధిపుడు అమాత్యుడు సమీపింప వచ్చును.

వసు.—[తటిసి] జయము జయము దేవరకు.

రాజు.—[లేచి] నమస్కారము.

వసు.—అతిశ్రేయస్కుఁడవు అగుదువుగాక.

రాజు.—ఆసన మాసన మార్యునికి.

విదూ.—[ఆసనము తెచ్చి] అయ్యా, ఇదుగో ఆసనము. అమాత్యా, కూర్చుండు. [వసుభూతి కూర్చుండును.

కంచుకి.—దేవరా, బాభ్రవ్యుఁడు ప్రణమిల్లుచున్నాఁడు.

రాజు.—[వీఁపున చే యిడి] బాభ్రవ్యా, ఇటఁ గూర్చుండుము.

కంచు.—[కూర్చుండి] దేవీ, బాభ్రవ్యుఁడు ప్రణమిల్లుచున్నాఁడు.

విదూ.—అమాత్యా, ఇదుగో దేవి వాసవదత్త ప్రణమిల్లుచున్నది.

వాస.—ఆర్యా, మ్రొక్కెదను.

వసు.—ఆయుష్మతి, వత్సరాజునకు తుల్యుఁడగుపుత్త్రునిం బడయుము. [అందఱుం గూర్చుండురు.

రాజు.—ఆర్యా, వసుభూతీ, సింహళేశ్వరునికి కుశలమా?

వసు.—[ఊర్ధ్వము చూచి నిశ్వసించి] దేవా, మందభాగ్యుఁడను ఏమి చెప్పుట కును తెలియక యున్నాను. [అధోముఖుఁడగును.

వాస.—[విషాదముతో ఆత్మగతము] అయ్యో అయ్యో! ఏమి చెప్పనో గదా యిప్పుడు వసుభూతి?

రాజు.—వసుభూతీ, చెప్పుము. ఏమి నన్ను దిగులొందించెదవు?

బాభ్ర.—[అపవారించి] ఎప్పటి కైనను చెప్పక తప్పనిదానిని ఇప్పుడే చెప్పవైవుము.

వసు.—దేవా, నివేదింప శక్యము గాదు. అయినను మందభాగ్యుఁడను వచించెదను. పూజ్యుఁ డైనయా సింహళేశ్వరునికూఁతురు రత్నావళి యను పేరిది, ఆయుష్మతి; అమెం జెండ్లి యగువాఁడు సార్వభౌముఁ డగు నని సిద్ధుఁడు ఆదేశించినాఁడు;

రాజు.—అటు వైని అటు పైని?

వసు.—ఆప్రత్యయముచే యౌగంధరాయణుఁడు ఆమెను దేవరనిమిత్తమై సింహళేశ్వరుని పలుమాఱు ప్రార్థించెను. ఐనను అతఁడు వాసవదత్తకు చిత్తఖేదము నొదవింప నొల్లనివాఁడై ఈయకయే యుండెను.

రాజు.—[అపవారించి] దేవి, ఏమి యిది, నీమామమంత్రి యిప్పుడు అనృతము పల్కుచున్నాఁడు!

వాస.—[విమర్శించి] ఆర్యపుత్రా, ఇందు ఎవరు అనృతము పల్కుచున్నారో నే నెఱుంగను.

విదూ.—తర్వాత ఏమైంది?

వసు.—అంతట లావాణకమున నిప్పులో దేవి కాలిపోయిన దని ప్రవాదము పుట్టించి, దేవర సింహళేశునికడకు బాభ్రవ్యుని పంపి ఆతనిచేత మరల నామెకై వేఁడి పంగా, పూజ్యుఁడు సింహళేశ్వరుఁడు ఆలోచించి దేవరతో మాకు సంబంధలోపము లేకుండును గాక యని, ఆరత్నావళిని దేవరకు ఇచ్చినాఁడు. దేవరకు ప్రతిపాదించుటకు మేము తెచ్చుచుండఁగా సముద్రములో ఓడ పగిలి మునిఁగిపోయినది.

[అని యేడ్చుచు అధోముఖుఁడై యుండును.

వాస.—[బాష్పములతో] అయ్యో! చెడితిని మందభాగ్యను! అయ్యో! చెల్లెలా రత్నావళీ! ఎక్కడ నున్నావే యిప్పుడు? నాకు బదులు పలుక వే?

రాజు.— ఊటఁబడిల్లు మాటఁబడిల్లును. దైవగతి దుర్బోధము! ఓడ పగిలి సముద్రములో పడియు వచ్చినవారు వీరే నీకు నిదర్శనము కాదా.

[అని వసుభూతిబాభ్రవ్యులం జూపును.

వాస.—ఆర్యపుత్రా, ఇదియు సంభవించునదే; అయితే, నాకు అంతటి భాగ్యమా?

రాజు.—[అపవారించి] బాభ్రవ్యా, ఇదేమియు నాకు బోధపడకున్నది.

బాభ్ర.—దేవా వినుము.

[నేపథ్యమున మహాకోలాహలము]

ఉ. జ్వాలల మేలుమచ్చులకు బంగరుఁ గ్రేపులయం గొసంగుచున్,
గేళివనిన్ ద్రుమాగ్రతతిఁ గేరి మహోజ్జ్వల మై కమర్చుచున్,
కేళిగిరిన్ సతోయఘనకృష్ణముఁ జేయుచు సాంద్రధూమ్యచే,
కాలును మంచు స్త్రీ లడలఁ, గాల్చెడిఁ జి చ్చవరోధముం గటా!

మఱియు.

క. లావాణకమునఁ బుట్టెనొ
యేవా దనలుండు దేవి నేర్చె నటంచున్,
ఆవాదు నిజము సేయఁగ
నా వెలసె నతండు దేవినగరం బెలుచన్. ౨౧

[అందఱును సంభ్రాంతులై చూతురు.

రాజు.—ఏమి! అంతఃపురములో నిప్పు! [సంభ్రమముతో లేచి] ఏమి! దేవి వాసవదత్త కాలిపోయినదా!

వాస.—ఆర్యపుత్రా, కావుము కావుము.

రాజు.—అహో, అతిసంభ్రమము చేత పజ్జనున్నదానినే దేవిని ఎఱుంగనైతిని. [దేవిచేతిని పట్టుకొని కౌఁగిలించి] దేవీ, ఊఱడిల్లు మూఱడిల్లుము.

వాస.—ఆర్యపుత్రుడా, నన్ను కావమని నే నడుగలేదు. మఱేమంటే కనికరము లేని నాచేత సాగరిక కాళ్లసంకిళ్లుపడి అంతఃపురములో ఉన్నది. ఈనిప్పుచే మడిసి పోయ్యేని. కనుక రక్షించు. ఆర్యపుత్రా రక్షించు.

రాజు.— ఏమి! దేవీ, ఏమి! సాగరిక మడియునా? ఇదిగో పోవుచున్నాను.

వసు.—దేవ, ఏల యకారణముగా శలభవృత్తి నవలంబించెదవు!

బాభ్ర.—దేవా, వసుభూతి చెప్పినమాట యుక్తము.

విదూ.—[రాజును ఉత్తరీయము పట్టుకొని ఆఁపి] ఓయి సాహసం చెయ్యకు.

రాజు.—[ఉత్తరీయమును లాగికొనుచు] ఓరి మూర్ఖుఁడా, సాగరిక మడిసెను మరా. ఇప్పుడును స్వప్రాణములను కాపాడుకోవలయునా? [జ్వలనప్రవేశము నటించి తన్ను ధూమము గ్రమ్ముకొన్నట్టు నటించుచు-]

(మా లి ని)

వలదు వలదు మండఁగ బాపు మీధూమ మగ్ని,
వెలిఁచెద విటు లేలా పెల్లు జ్వాలోచ్చయంబుల్ ?
కలికివియుతి చిచ్చే కాల్పలేదాయె వేనిఁ
బ్రళయదహనకీలల్, వానిఁ దా మేమి సేయుఁగ ?

వాస.—ఏమి? ఈ దుఃఖభాగిని మాటవలన ఆర్యపుత్రుడు ఈలాగు ప్రా కొన్నాడు. మరి యిక నే నేల ఉండడం! నేనున్ను ఆర్యపుత్రుణ్ణే అనుగమిస్తాను.

విదూ.—[పరిక్రమించి మున్నాడి] అమ్మా, నేనున్ను దారి చూపుతాను.

వసు.—ఏమి! వత్సరాజు అగ్నిలో చొరనే చొచ్చినాఁడే. కనుక రాజపుత్రి విపత్తిని కన్నవాఁడ నైననాఁకును ఇక్కడనే అగ్నికి ఆహుతి యగుట తగును.

కంచు.—[బాష్పములతో] హా మహారాజా, ఏమి యిట్లు అకారణముగా భరతవంశమును సంశయతుల నెక్కించితివి! మఱి ప్రలపించిన నేమి కలదు! నేను భక్తికి తగినట్లు చేసెదను. [అని అందఱును అగ్నిప్రవేశమును నటించు

రాజు.—[కుడిభుజ మదరుటను నిరూపించి] ఈదశలో నున్న నాకు దీనివల మెట్లు కలుగును? [మోలం గని సంతోషోద్వేగములతో] ఏమి! సాగరిక అగ్ని చెంతనే ఉన్నది! త్వరగా పోయి రక్షించెదను.

[అంతట నిగడితచరణ సాగరిక ప్రవేశించును]

సాగ.—[కలయం గని] ఆహాహా! అన్నివైపులా నాలుకలు సాపుతూ మండుతూవున్న యీయగ్ని దేవుడు నాదుఃఖానికి అంతం కలుగజేస్తాడు.

రాజు.—[వడిగాఁ దరిసి] ప్రియా, ఏమి యిప్పటికిని నాయెడ ఉపేక్షతో వర్తిల్లెదవు?

సాగ.—[రాజును గని ఆత్మగతము] ఏమి! ఆర్యపుత్రుడే! ఈయనను కనగా నాకు మళ్లీ ప్రాణంమీద ఆశ కలుగుతూ వున్నది. [ప్రకాశము] ప్రభూ, కావు కావు

రాజు.—ఓసి భయశీలా, భయము మానుము.

తే. ఉద్ధవడిఁ బేర్చుపొగ మొత్త మోర్వు క్షణము ;
[మోలం గని]

ళట్ట! చనుఁ బాసి సుఖసుఖఁ గాలె నెల్ల;

[చూచి]

సారెఁ దడఁబడె దేల? హా! సంకలియలె!

[నిపుణముగా కని]

పాతు నిచ్చటు నెదఁ గొని భామ, రమ్ము. ౮౩

[కంఠమునం గొని కనులుమూసికొని స్పర్శసుఖమును నటించుచు] అహో! క్షణములో నాసంతాపము తీఱినది! ప్రియా, ఊఱడిల్లు మాఱడిల్లుము.

తే. అంటినను నిన్నుఁ గాల్పఁడ హవ్యభుజుఁడు;
నిక్క మిది నమ్ము మెట్లు నా నీరజాక్షి,
నీదుసంస్పర్శ తానె మాన్పెడును గాదె
వెగ్గలపుఁదాపమును సుధావేణివోలె. ౮౪

[కన్నులు దెఱచి చూచి] అహో! ఏమాశ్చర్యము!

తే. అనల మేమాయెఁ! దొలియ ల్లె యంతిపురియు
నలరు!

[వాసవదత్తం గని]

ఇదిగో నవంతినృపాత్మజాత!

వాస.—[రాజుదేహమును నిమురుచు సంతోషముతో] ఏమి పుణ్యము! అక్షతశరీరుడు ఆర్యపుత్రుడు!

రాజు.—చూతు బాభ్రవ్య!

బాభ్ర.—విజయ మగుఁగాక మహారాజునకు. దేవా, ఆహా వర్ధిల్లుచున్నావు! మేము మరల బ్రతికినారము.

రాజు.—బలె! వసుభూతి!

వసు.—దేవా! ఆహాహా వర్ధిల్లుచున్నావు!

రాజు.—సఖుఁడు!

విదూ.—జయము జయము నీకు.

రాజు.—[ఆలోచించి వితర్కముతో]

స్వాప్నికమతిభ్రమమయొ, మైంద్రజాలికంబొ!

విదూ.—ఓయి సందేహం లేదు, ఇంద్రజాలమే యిది. ఆదాసికొడుకు జాలికుడు, వెళ్లేటప్పుడు చెప్పినాడు గదా, అవశ్యం దేవర ఇక నొక్కయాట చూడవలె నని. కనుక అదే యిది.

రాజు.—దేవీ, నీమాటవలన నే నిదె సాగరికను ఇక్కడికి తెచ్చినాడను.

వాస.—[నవ్వి] ఆర్యపుత్రా, నీచిత్తమును నేను చక్కగా ఎఱుగుదును.

వసు.—[సాగరికం గని అపవారించి] బాభ్రవ్యా, ఈబాల రాజపుత్రిని పోలి యున్నది.

బాభ్ర.—అమాత్యా, నాకును అట్లే తోఁచుచున్నది.

వసు.—[ప్రకాశము, రాజు నుద్దేశించి] దేవా, ఈ కన్యక ఎక్కడిది?

వాస.— అమాత్యా, ఈమె సాగరమునుంచి దొరికిం దని చెప్పి అమాత్యయౌగంధరాయణుడు నాచేతిలో నుంచినాడు. అందువల్లనే సాగరిక అని పేరు పెట్టినాను.

రాజు.—[స్వగతము] ఏమీ! యౌగంధరాయణుఁడు ఉంచినాఁడా! ఏ యితఁడు నాకు తెలుపకయే ఏమోమో చేయును.

వసు.—[అపవారించి] బాభ్రవ్యా, వసంతకుని మెడలోని రత్నమాల అంతే కగా నున్నది, ఈమెయు సాగరమునుండి దొరకినది. అందువలన స్పష్టముగా ఈమె సింహళేశ్వరుని కూఁతురు రత్నావళియే. [లేచి ప్రకాశము] ఆయుష్మతీ, రాజపుత్రీ రత్నావళీ, నీవు ఇట్టియవస్థపాలైతివి!

సాగ.—[వసుభూతిం గని బాష్పములతో] ఏమి! అమాత్యుడు వసుభూతి!

వసు.—అయ్యో! చెడితిని మందభాగ్యుఁడను! [అని నేలం బడును

సాగ.—అయ్యో! చెడితిని మందభాగ్యను! అయ్యో నాయనా! అయ్యో అమ్మా! ఎక్కడ ఉన్నావు? నాకు బదులు పలుకు.

[అని తన్నుఁ దాను క్రింద పడవైచికొని మూర్ఛిల్లును

వాస.—[సంభ్రమముతో] కంచుకీ, ఈమె నాచెల్లెలు రత్నావళియా!

కంచుకి.—దేవీ, ఆమెయే యీమె.

వాస.—[రత్నావళిం గౌఁగిలించి] చెల్లెలా, ఊరడిల్లు ఊరడిల్లు.

రాజు.—ఏమీ! ఉన్నతవంశమువాఁడైనసింహళరాజు విక్రమబాహుని కూఁతురా ఈకన్య?

విదూ.—[స్వగతము] రత్నావళిని చూచి ఆదిలోనే నేననుకొంటిని సామాన్య జనానికి ఇటువంటి ఆభరణం ఉండ దని.

వసు.—[లేచి] రాజపుత్రీ, ఊఱడిల్లు మూఱడిల్లుము. ఇదె నీయక్క మిక్కిలి సంతసించుచున్నది. కావున ఈ మెను కౌగిలించుకొమ్ము.

రత్నావళి.—[ఊఱడిల్లి రాజును ఓరచూపునం జూచి స్వగతము] నేను అపరాధము చేసినదాన్ని. దేవికి ముఖము చూప నేరను [అని మొగము వాంచును.

వాస.—[సబాష్పముగా బాహువులు చాఁచి] ఓసి అతినిష్ఠురురాలా అనుగు చెల్లెలా, రావే యిప్పుడు, నెయ్యముం జూపు. [అని కంఠమునం గొనును.

[రత్నావళి తొట్రుపాటు నటించును.

వాస.—[అపవారించి] ఆర్యపుత్రా, ఈ నాకఠినత్వానికి నేను లజ్జపడుతున్నాను. ఇక త్వరగా ఈమె సంకెళ్లని తీసివేయి.

రాజు.—[పరితోషముతో] దేవిమాట చేసెదను.

[అని సాగరిక సంకెలలను తొలఁగించును.

వాస.—ఆర్యపుత్రా, అమాత్యయౌగంధరాయణుడు నన్ను ఇంతకాలము చెడ్డదాన్ని చేసినాడు. ఎందుచేత ననగా ఎఱిఁగియుండిన్ని నాకు చెప్పడాయెను.

[అంతట యౌగంధరాయణుఁడు ప్రవేశించును.]

యౌగం.

ఉ. నావచనంబునన్ హృదయనాయకుఁ బాసెను దేవి యత్తఱిన్;
దేవిని శోకవార్నిధిని దించితి నే సవతాలిఁ దెచ్చుటన్;
దేవికి హర్షమే యగు నధీశుని సర్వమహీశతాప్తిచే;
నీవహిఁ గొల్చియున్ వెఱతు నేఁ ద్రప దేవికి మోము చూపఁగాన్.

కాక పతి యేమి చేయనగును! స్వామిభక్తివ్రత మనఁగా నిట్టిది! అత్యంతమానసీయులయెడల సముచితము అనువర్తనకు అవకాశ మొల్లదు. [చూచి] వీఁడుగో దేవర మహారాజు. సమీపమునకుం బోయెద. జయము జయము దేవరకు. [పాదములందు వ్రాలి] దేవా, నేను దేవర చెప్పక చేసినదానిని దేవర క్షమింపవలయును.

రాజు.—చెప్పక యేమి చేసితివో చెప్పుము.

యౌగం.—దేవరా, ఆసన మలంకరింపుము, సర్వముం జెప్పెదను.

[అందఱును రాజుతోఁ గూడ వారివారిచోటఁ గూర్చుండురు.

యౌగం.—దేవా, వినవలయును. ఈమె గలదే ఆసింహళేశ్వరుని కూతురు. ఈమెనుగూర్చి సిద్ధుఁడు ఆదేశించినాఁడు–ఈమెను చెట్టపట్టువాఁడు సార్వభౌముఁడగు జగు నని. అందువలన ఆనమ్మకముచేత నేను దేవరకొఱకు ఎన్నిమాఱులు ప్రార్థించినను సింహళేశ్వరుఁడు దేవికి వాసవదత్తకు చిత్తఖేదము కావింపనొల్లక కన్యను ఇచ్చి నాఁడు గాఁడు.

రాజు.—అంతట నేమి?

యౌగం.—[లజ్జతో] అంతట లావాణకములో మందిరమున బుట్టినప్పుడే దేవి కాలిపోయిన దని ప్రవాదపుట్టించి మరల సింహళరాజుకడకు బాభ్రవ్యుని బంపితి.

రాజు.—యౌగంధరాయణా, అటుపైవృత్తాంతమును నేను వింటిని. మతి ఈ బాలను ఏ మూహించుకొని దేవిచేతిలో నుంచితివి?

విదూ.—ఓయి చెప్పుకున్నా ఈయనఅభిప్రాయం నాకు తెలియనే తెలుసు. ఏ మంటే అంతఃపురంలో ఉండేది అంతఃపురంలో వుండేవాడికి సులువుగా కన బడుతుం దని.

రాజు.—యౌగంధరాయణా, నీయభిప్రాయమును వసంతకుఁడు సరిగా గ్రహించె నాఁడా?

యౌగం.—దేవర యానతిచ్చినట్లే.

రాజు.—ఇంద్రజాలికవృత్తాంతము కూడ నీప్రయోగమే అని తలంచెద.

యౌగం.—ఒండువిధమున అంతఃపురములో చెలి నున్నయీమెను ఏలినవారు చూచుట యెట్లు? చూడకుండ వసుభూతి యెట్లు తెలిసికొనును? [నవ్వి] తెలిసినచో ఇప్పుడు ఏమి చేయవలయునో అందులకు దేవి ప్రమాణము.

వాస.—[చిఱునవ్వుతో] ఆర్యా అమాత్యా, స్పష్టముగానే చెప్పవేమి! 'రత్నావళిని ఆర్యపుత్రునికి ప్రతిపాదింపుము' అని.

విదూ.—అమ్మా, అమాత్యుడి యభిప్రాయాన్ని నీవు సరిగా కనిపట్టినావు.

వాస.—[రెండుచేతులుం జాఁచి] రావే రత్నావళీ రావే, ఇప్పుడయినా నాకు భగినీసదృశవృత్తము అగునుగాక. [అని తనయాభరణములతో రత్నావళిని అలంకరించి ఆమెచేయి పట్టుకొని రాజుకడకుం దఱిసి] దేవా, పరిగ్రహింపుము ఈమెను రత్నావళిని.

రాజు.—[హర్షముతో చేతులు చాఁచి] దేవిప్రసాదము ఏది బహుమానము గాదు?

[అని సాగరికను కైకొనును

వాస.—ఆర్యపుత్రా. ఈమెపుట్టింటివారు దూరానగదా ఉన్నారు. వారిని ఈమె స్మరింపకుండేలాగున ఆర్యపుత్రుఁడు ఈమెను చూచుకోవలెను.

[అని అర్పించును.

విదూ.—[హర్షముతో నృత్యము సేయును] హీహీ! ఓహో! ఓహో! జయం యం నీకు ప్రియవయస్యుడికి; ఇప్పుడు పృథివియే హస్తగత మైనది గదా!

వసు.—రాజపుత్త్రీ, వాసవదత్తాదేవిని ప్రణామముచేసి అర్పింపుము.

[రత్నావళి అట్లు చేయును.

కాఞ్చ.—దేవీ, నీకు దేవీశబ్దము మిక్కిలి తగియున్నది.

[వాసవదత్త రత్నావళిని కౌఁగిలించుకొని దేవీపదమును అనుగ్రహించును.

కాఞ్చ.—ఇప్పుడు నాపరిశ్రమ సఫలమైనది.

యౌగం.—దేవా, మఱి చెప్పుము, నీకు ఇంకను ఏమి ప్రియమును గావింతును.

రాజు.—ఇంకనుం బ్రియ ముండునా? ఎట్లన,

శా. చెలఁగె న్విక్రమబాహుఁ డాత్మసముఁడై; చేపట్టితిఁ సర్వభూ
వలయప్రాప్తివిధాత్రి సాగరిక; సంభగ్నుల్ఖలుల్ గోసలుల్;
అలరెన్ బ్రీతి వహించి దేవి భగినిం బ్రాణాధికం గూడుటన్;
వెలయ న్నీవ యమాత్యసింహుఁడవుగా, వేతేమి నేఁ గోరుదున్?

అయిన నిది యగుఁ గాక,—

[భరతవాక్యము]

మ. ఇల నింద్రుం డొనరించుతన్ సకలసస్యేద్ధన్ సువర్షంబుచే;
నిలవేల్పుల్ దనియింత్రు గాత విధివద్వ్రాత్తేష్టులన్ వేల్పులన్;
కలకాలం బుఱుఁగాత సాధువులసంగంబు న్సుఖోత్తుంగమై;
ఖలవాగ్దుర్జయవజ్రలేపము లణుం గాతన్ సమూలంబుగాన్. ౮౮

[అందఱును నిష్క్రమింతురు.

[ఇంద్రజాలిక మనెడి చతుర్థాంకము సమాప్తము.]

---

Printed at the Andhra Patrika Press, Madras.—1921.

# ఇందలి పాత్రములు

## పురుషులు

ఉదయనుఁడు — వత్సరాజు.

యౌగంధరాయణుఁడు అతనియమాత్యుఁడు.

వసంతకుఁడు — విదూషకుఁడు.

వసుభూతి — సింహళేశ్వరునియమాత్యుఁడు.

బాభ్రవ్యుఁడు — వత్సరాజుకంచుకి.

శంబరసిద్ధి — ఐంద్రజాలికుఁడు.

విజయవర్మ — వత్సేశసేనానాయకుఁ డగు రుమణ్వంతుని మేనల్లుఁడు.

## స్త్రీలు

వాసవదత్త. — వత్సేశునిదేవేరి.

రత్నావళి (సాగరిక). — కథానాయిక, సింహళేంద్రుని కూఁతురు

కాంచనమాల. — దేవేరికి చేటి.

సుసంగత — మఱియొకచేటి, సాగరికనెచ్చెలి.

నిపుణిక
మదనిక } చేటికలు.
చూతలతిక

వసుంధర — ప్రతీహారి.

## ప్రస్తావితులు

విక్రమబాహువు — సింహళేశ్వరుఁడు.

రుమణ్వంతుఁడు — వత్సేశునిసర్వసేనాపతి.

# ప్రతాపరుద్రీయ నాటకము

(సటిప్పణము)



వేదము - వేంకటరాయశాస్త్రి కృతము

ఐదవ ముద్రణము.



C. M. V. Sharma
Nalgonda

చెన్నపురి:
కేసరి ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1927.

 [వెల రూ. 1-4-0.

శ్రీ

ప్రతాపరుద్రీయమను నీ నాటకము

మదీయగ్రంథములందు సమాదరమువహించి నన్ను పలుమాఱు సత్కరించిన

విద్వత్ప్రకాండకులకు సుకవిమిత్రులకు

శ్రీమద్వేంకటగిరి సింహాసనాధీశ్వరులగు

మహారాజా సర్ వెలుగోటి

శ్రీ రాజగోపాలకృష్ణ యాచేంద్ర

బహద్దర్ కె. సి. ఐ. ఇ.

పంచహజారి మన్సబ్దార్ వారికి

మదీయకృతజ్ఞతాసూచకముగా అంకితము గావింపఁబడినట్టిది.

వేదము. వేంకటరాయశాస్త్రి

శ్రీ

# నాటకకథాసంగ్రహము.

I. ప్రతాపరుద్ర మహారాజు ఓరుఁగల్లు నిజరాజధానిగా త్రిలింగదేశము నేలుచుండెను. అతని మంత్రి యుగంధరుఁడు రామేశ్వరయాత్ర పోయి యుండెను. మంత్రి తమ్ముఁడు జనార్దనుఁడు రాజ్యము విచారించుచుండెను. ప్రతాపరుద్రుఁడు వేటకుఁ బోయి యుండెను. అట్టి సమయములో ఢిల్లీసుల్తాను సర్వసేనాపతి వలీఖానుఁడు, త్రిలింగరాజ్యముమీఁదికి లక్షదండుతో వచ్చి ఓరుఁగంటి దాఁపున విడిసి, సఖ్యముకై వచ్చినవానివలె నభినయించుచు జనార్దనమంత్రిని దర్శించి, తాను ఢిల్లీ సుల్తానుకడనుండి రాయబారము తెచ్చినట్లును, ఢిల్లీ రాజ్యము మీఁదికి ఆఫుగానిస్తాను సుల్తాను దండెత్తి వచ్చుచున్నట్లును. ప్రతాపరుద్రమహారాజు దండు నడపుకొనివచ్చి ఢిల్లీసుల్తానునకు సాహాయ్యపడవలయునని సుల్తాను ప్రార్థించుచున్నాఁడనియు, తెలిపెను. తురక ఈవ్యాజమున రాజును గొనిపోవుటకును ఖయిదు సేయుటకును పిమ్మట సులువుగా త్రిలింగదేశమును పట్టుటకును యత్నించుచున్నాఁడని జనార్దనమంత్రి యూహించి, తానును పైకి సఖ్యమునే అభినయించుచు, నగరమున రాజు లేఁడనియు రాఁగానే దర్శనమిప్పించెద ననియు చెప్పెను. కొందఱు చాకళ్లను కొందఱు మంగళ్లను తమకు నౌకరికి పంపుమని వలీఖానుఁడు జనార్దనుని వేఁడెను. తురక వేషకొలుకు నౌకరులను కోరినాఁడని తలఁచి జనార్దనుఁడు తన వేగులను చాకళ్లుగా మంగళ్లుగా పంపెను. పిమ్మట తనయన్నగారిని రప్పించుటకై బేగీరావుటపా పంపెను. వేటలో నున్న రాజునకు వెంటనే రాజధానికి రమ్మనియు తురకలు దండెత్తి వచ్చియున్నారనియు జాబు పంపెను. తురకలను స్వదేశమునకు పాఱిపోనీయక యిచటనే తెగటార్చువాఁడై జనార్దనుఁడు నది దాఁటు సాధనములను యానపాత్రములను పగులఁగొట్టి పాఱవేయవలసిన దని గోదావరిరేవు లన్నిటికి ఆజ్ఞ పంపెను. రాజును బోలిన చాకలి యొకఁడు పరమమూఢుఁడు నగరమున నుండఁగా వాఁడీసమయమున నెందులకేని పనికివచ్చు నని వానిని తనయింట నుంచుకొనెను. త్రిలింగరాజ్య సర్వసేనాపతిని బేతాళరాయని రప్పించి సన్నాహమున నుండ నాజ్ఞాపించెను.

II. పిమ్మట వలీఖాను తన క్రిందిసర్దార్లతో మంత్రాలోచన చేయుచుండఁగా ఆ సభలోనికి చెకుముకిశాస్త్రి యనునతఁడు జనార్దనుని సహాధ్యాయి యుత్ప్రేరణచేఁ బోయి తాను జోస్యుఁడనియు, పేరు యమధర్మరాజశాస్త్రి యనియు, తాను

రాజద్వేషి యనియు, వారియాశ్రయముచే ఢిల్లీ సుల్తానును దర్శించి ఆతనితో ద్వారక
ఈరాజును సాధింప నభిలషించియున్నాఁడనియు, తెలిపి, వారిని నమ్మించి వారితో
సఖ్యము చేసికొని వారివలన తురకదుస్తు బహుమతి నొంది వెడలిపోయెను. తురకలు
ఓరుఁగల్లు పట్టుట యసాధ్య మని తెలిసికొనిరి. వలీఖాను కడమ సర్దారులను అక్క
డనే నిలిపి తాను రాజును పట్టఁగోరి అడవికిఁ బోయెను.

III. రాజు వేఁటలో నొంటిఁ జిక్కి, బడలి, గోదావరి దక్షిణతీరమున
అడవిముఖమున నొక చెట్టుక్రింద నిద్రించుచుండెను. వలీఖానుని సిపాయీలు అతనిఁ
గని రాజని గ్రహించి వలీకి తెలిపి అతనియాజ్ఞచే నతనిని నిద్రలోనే ఖయిదుచేసి,
మేల్కొనఁగా, సవారిలోనుంచి గోదావరివైపు కొనిపోయిరి. నదిలో ఆసమయమున
కొన్నియోడలు మంత్రియాజ్ఞ అందనివి పోవుచుండఁగా వానిలో ఎక్కి యాత్రి
కలు గోదావరి దాఁటుచుండిరి. దీనినెల్ల విద్యానాథుఁ డనుమహాకవి యొకఁడు కూల
మునఁ గని, హిందూప్రభువును తురకలు గొనిపోవుచున్నట్లూహించి, నిజ మెఱుఁగఁ
గోరి నీటఁబడి, మొసలి తఱిమి నట్లభినయించుచు ఓడలకడకు ఈఁదివచ్చి ప్రవే
శమొంది, రాజుంగనెను. రాజనుగఁగా తాను ప్రతాపరుద్రునిమీఁద గ్రంథముచేసి
నట్లును ఓరుఁగంటిలో రాజు లేనందున రాజదర్శనము కానట్లును తెలిపెను. మరి
యెవరికైన నంకితముచేసి బహుమతి పొందరాదా యని రాజడుగఁగా 'అంతటి
వానినే తగులవేసితి' ననెను. రాజు శ్లోకములు చదివించి విని సంతసించి తన మెఱుఁ
రుంగరమును విద్యానాథుని కిచ్చెను. దానివలన విద్యానాథుఁ డితనిని ప్రతాపరుద్రు
నిఁగా నెఱిఁగి 'ఈ యుంగరమును మరల నీవ్రేల ఓరుఁగంటి సింహాసనమున నే
నుంచెదను.' అని ప్రతిజ్ఞ చేసి వెడలిపోయెను.

IV. ఇంతలో యుగంధరుఁడు ఓరుఁగంటికి వచ్చెను. మంత్రిసభ. రాజు
గనిన మఱునాఁడే కవి నానామాయోపాయములచే అంచెల మీఁద ఓరుఁగల్లు చే
యుగంధరుని దర్శించి తాని వృత్తాంతము తెలిపెను. యుగంధరుఁడు ఇతనిని తనసభ్యు
లకు జోస్యునిఁగా తెలిపి, రాజు వేఁటలో గాయపడి భేఁడదపూడిలో రామానా
నులయింట నున్నట్టు ఇతనిచే జోస్యము చెప్పించి, ఆ యర్థమే గలదిగా ఒకజాబు
రాజు నొద్దనుండి వచ్చినట్లుగా కల్పించి రప్పించి, రాజును తెచ్చుటకు జనార్దను
నియమించి, విద్యానాథుని తమతో నొకమంత్రిని జేసి, సభ చాలించెను. పిమ్మట
ఏకాంతమున, విద్యానాథ జనార్దనులకు 'రాజు లేఁడన్న రాజ్యము నిలువదు, కావు
లిని పేరిగానిని రోగిరాజుగా చేసి కోటకు తెండు.' అని బోధించెను. అట్లే విద్యానా
థుఁడు పేరిగానికి 'నీవు రాజ వగుదు' వని జోస్యముచెప్పి, ఆరాత్రి వానిని భేఁడద
పూడికి కొనిపోయెను.

V. మఱునాఁడు జనార్దనుఁడు విద్యానాథుఁడును వానిని రోగిరాజునుగా వేషము వేసి తెచ్చి కోటలో వేఱుగా నొకమహలులో నుంచిరి. వెంటనే తురక శిబిరములో సర్దారు ఖుస్రూఖానుఁడు రాజు వచ్చె నని చారులవలన నెఱిఁగి పరితపించుచుండెను; వానికడకు వలీఖానుని హర్కారా వచ్చి 'రాజును వలీఖాను ఖయిదుచేసి ఢిల్లీకి కొనిపోయె' నని తెలిపెను. ఖుస్రూ సందేహపడి చెవుముకిశాస్త్రిని (యమధర్మరాజ జోస్యులను) జోస్య మడుగఁగా, రా జనుకొని చాకలి పేరిగానిని వలీఖాను పట్టుకొనిపోయె నని అతఁడు జోస్యముగా చెప్పెను. ఆసమయమున యుగంధరునికడనుండి దుబాసి వచ్చి ఖుస్రూతో, తత్క్షణము యుద్ధమునకు సిద్ధపడు మని రాజాజ్ఞగా చెప్పిపోయెను. ఖుస్రూ ఈ గందరగోళములో ఏమియు తోఁపక, తానింకాలము కోటను పట్టక యూరకున్నందున తన కార్య మిట్లు చెడినదని తలఁచినవాఁడై తన యుద్ధోద్యమములకు ప్రతిఘటిల్లుచుండిన తనక్రిందిసర్దార్లను ముస్తఫాఖాఁజాలను చంపఁ దరలెను. బేతాళరావు తురకదండును ఇరుప్రక్కలం బొదివి నాశముచేసెను. యుగంధరుఁడు తురకలకు చాకలిని పట్టి యిచ్చెదనని నగరమెల్ల కింవదంతి కలిగెను. అది విని పేరిగాని పెండ్లాము ఎల్లి యుగంధరునికడకు వచ్చి మొఱ్ఱపెట్టుకోఁగా, మంత్రి, 'మేము వానిని తెప్పించి నీ కిచ్చెదము పొమ్ము,' అని దానికి కొంత ధనమిచ్చి సమాధానపెట్టి పంపివేసెను. అంతఃపురములో రాణియు రాజుతల్లి ముమ్మడమ్మయు రాజును చూడవచ్చిరి. విద్యానాథ జనార్దనులు కూడదని యాటంకపెట్టిరి. వారిని లక్ష్యపెట్టక, రాణి చూడకమాన నని హఠము చేయఁగా యుగంధరుఁడు పోయి 'రాజును తురక ఖయిదుచేసి ఢిల్లీకి కొనిపోయె' నని ముమ్మడమ్మతో చెప్పి ఏడునెలల పదిదినములలో తెచ్చి తాను అప్పగించువాఁడని ప్రతిజ్ఞ చేసి, వారిని పంపివేసి, రాజ్యమును విద్యానాథ జనార్దనులకు అప్పగించి, తాను ఎవరికిని తెలుపక ఎచటికో పోయెను.

VI. విద్యానాథ జనార్దనులు పేరిగానికి శబ్దశుద్ధియు రాచఠీవియు కొంతకాలము నేర్పిరి. నవీనులయెదుట వాఁడెట్లు వ్యవహరించునో చూడఁగోరి తమలో కొందఱే సంగీతగాండ్రుగాను కవులుగాను వచ్చి దర్శనము చేసిరి. సభ జరిగినది. పేరిగాఁడు మంత్రులబోధన మఱచి చాకలిగానే ప్రవర్తించి రసాభాసము చేసెను. అంతట మంత్రులు వాని యాకారమునుమాత్రము దూరస్థలముల నుపయోగింపను, ఆగంతుకులను రాజదర్శనాపేక్షులను తామే పరితోషపెట్టి పంపను, నిశ్చయించుకొనిరి.

VII. ఢిల్లీలో చెవుముకిశాస్త్రి యుగంధరాజ్ఞచే వలీఖానుతో కుట్రయొకటి సాగించెను. ఆ కుట్రకు పర్యవసాయ మేమన; ఢిల్లీ సుల్తానును [illegible] యమున

లోనికి రాఁబోవు నొకానొక వర్తకుని యోడలోనికి చేర్చి, అచట వారి సందర్భ సంహరించి వలీఖాను సుల్తాను అగుటయు, వెంటనే చెకిముకిశాస్త్రిని ఓరుఁగంటి పాదుషాను చేయుటయు. కుట్ర స్థిరపడినది. నాఁటికి మూఁడు మాసములనుండి ఢిల్లీ వీథులలో 'ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాఁ' అని ఒక వెఱ్ఱివాఁడు అఱచుచు తిరుగు చుండెను. వాఁడు వెఱ్ఱియో కాఁడో కనిపట్టుఁడని సుల్తానుప్రభృతులు చారుల నియమించిరి. చారులు వానిని పరికించుచుండిరి. చెకుముకిశాస్త్రి కుట్రప్రకారము కార్యము సాధించుటకై ప్రతాపరుద్రుని యాభరణములను ఆతని గుఱ్ఱమునాభరణ ములను వలీఖానువలన వర్తకులకు లంచముగాఁ గొని, అవి నిండియున్న పెట్టెను జవానుచేత నెత్తించుకొని వెఱ్ఱివానికనులయెదుట వీథిలో పోయెను. ఖుస్రూఖాను ఓరుఁగంటియుద్ధమునుండి పరారియై వచ్చినవాఁడు వలీఖానును చూడఁబోవుచు రస్తాలో వెఱ్ఱివానిని నిల్చి నిదానించి కని పోయెను. వెఱ్ఱివాఁడు తనకు శిష్యుఁడుగా ఆడుచున్న యొకనిని (తనకుమారునే) ఖుస్రూవెంట చారునిఁగాఁ బంపెను, ఖుస్రూ వలీని కనెను. చాకలిని తెచ్చితి వనెను. ఆమాట సుల్తానుతో చెప్ప నని వెఱచి వానిని సికారి రమ్మని యమునయొడ్డున శ్మశానముకడకుఁ గొనిపోయి అచట తలఁ గొట్టి తలకాయను గట్టువెంబడి పాఁతి, మొండెమును రాయి కట్టి యమునలో వైచెను. శిష్యుఁడు కని పోయి అది యెల్లను వెఱ్ఱివానికి 'తాటికాయ' పాటగా తెల్పెను. ఆ కళేబరమును తెచ్చి తలను అనికి దాఁచియుంపను పిమ్మట పిశాచముగా నుపయోగింపను చెకుముకిశాస్త్రికి తనయాజ్ఞ తెలుపు మని వెఱ్ఱివాఁడు పాటగా శిష్యునికి సూచనచేసెను. పిమ్మట వెఱ్ఱి యేకాకిగా యమునాతీరమున శ్మశానమునకు బోయి వంటచేసికొనెను. చారులు చెట్లపైనుండి వాని కగపడకయే పరికించుచుండిరి. వెఱ్ఱివానికి ఆవులింత వచ్చెను. దానివలన వెఱ్ఱివాఁడు శంకించి అట నెవరో చారులు తన్ను పరికించుచున్నా రని యూహించి, గుడగుడశబ్దం కుండకు నష్టం' అని కుండఁ బుఁగుండ పగులఁగొట్టి, తిండిలేకయే, మరల అఱచుచు ఊరిలోనికి వెడలెను. కనుక గని చారులు వెఱ్ఱియే అని నిశ్చయముచేసికొని, చెట్లు దుమికి, పోయి, (సుల్తాను ప్రభృతులకు అట్లే తెలిపిరి.)

VIII. సుల్తానుదర్శనమునకు కోమట్లు ఓడవర్తకులు వచ్చి, గొప్ప నజరు లుంచి 'ఓడలలో అపారముగా వింతసరకులు మణిమయములు ఉన్నవి. ఇక్కడికి తెచ్చుటకు రెండుమూఁడుమాసములు పట్టును, సుల్తానువారు ఓడలకే వచ్చి వానిం గని కొన వలయును.' అని తెలుపుకొనిరి. అంగీకరించి, వెలలుతీర్చుటకు ప్రతాపరుద్రుని ఖైదు విడిపించి రప్పించి, సుల్తాను, వజీర్లు, అందఱును ఓడలకుఁ బోయిరి. దారిలో వెఱ్ఱి వాఁడును 'ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాఁ, ఇదుగో ఇప్పుడే పట్టుకపోతాఁ,' అని

ప్పుచు కలసి కొనెను. వినోదార్థము సుల్తాను వానినిగూడ తోడ్కొనిపోయెను. ములో వర్తకులు సుల్తానునకు వినోదములు సలుపుచు ప్రొద్దుపుచ్చి, రాత్రిభోజన కు అందఱను అచటనే నిలిపి, భోజనానంతరము వారియెదుట సుల్తానువారి సింగవిజయమును నాటక మాడించిరి. అందులో వలీఖాను చాకలిని పట్టి తెచ్చి రా ని తెలుపుటయు, ఖుస్రూఖానును చంపుటయు, ఖుస్రూ కళేబరముచేతనే పలికిం చి. ప్రకృతము వలీఖాను చేయుచున్న కుట్రనుకూడ వెల్లడిచేసిరి. సుల్తాను ఆగ్రహ పరుఁడై వలీఖానును వానిపక్షము వజీర్లను అందఱను సంహారముచేయించి యము లో వేయించెను. వర్తకులు వలీఖాను తలను తెచ్చి దాఁచిరి. హతశేషులు సుల్తాను, పురు వజీర్లు, ఇరువురు జవానులు, ఓడలోనే నిద్రించిరి. వారిని నిద్రలో ఖైదు చేయించి వెట్టివాఁడును (యుగంధరుఁడును) రాజును మంగళవేషములు ధరించిరి. డలు తెల్లవాఱునప్పటికి కాశి చేరెను.)

IX. రాణి గౌరిపూజ చేయుచున్నది. బ్రాహ్మణ సత్కారము. ప్రతాప రుద్రుని నగరప్రవేశ వ్యూహము: రాజసురత్రాణులు అష్టగజపుష్పకమున, ఖుస్రూ కళేబరము బండిలో, వ్యక్తుల గడమీఁద. విద్యాధరమిథునము గౌర్యాజ్ఞచే ఆకాశ యానమున వచ్చి ఆవిభవమెల్లఁ గని గౌరికి నివేదింపఁబోయెను. యుగంధరుఁడు జును గొనిపోయి ముమ్మడమ్మకు అప్పగించెను. రాణి యుగంధరునిపాదములను ర్ఘ్యములతోను ముత్తెములతోను పూజించినది. పేరిగానిని చాకలిపరివారముతో ఎల్లి కు ఇంటికి పంపిరి. పేరిగాఁడు త్రాగి కైపెక్కి, 'దూడపేడ బఱ్ఱిపేడ లేక కూలిన,'సని యిల్లు వెడలి పాఱిపోయెను. వానికి వెట్టియెత్తినదని తలంచి యెల్లి యి మంత్రితో మొఱ్ఱపెట్టుకొనెను. మంత్రి, 'ఎనిమిదవనాఁడు రాజసభలో చెప్పు మ్మ'ని ఎల్లికి ఆజ్ఞాపించి, పేరని వెదకించి పహరాలో నుంపించెను.)

X. రాజసభ. అన్నమరాజు కటకబల్లహునిఁ గూల్చి మహాధనము తెచ్చెను. వర్తకులును వచ్చిరి. ముమ్మడమ్మ యుగంధరునికి వీరబిరుదాంకితమైన హార మొకటి ంచెను. దానిని సభలో రాజు అతనిమెడలో వైచెను. సుల్తానును వీడ్కొనిరి. రాజు ల్లిపేరాల్చు విని, పేరని చాకలిదొరను, ఎల్లిని చాకలిదొరసానిని, చేసి, వారికి గొప్ప జీవనములు ఇచ్చెను. రాజు విద్యానాథునిఁ గని గౌరవించి ప్రతాపరుద్రీయకృతిని గ్రహించి 'అంతట వానినే తగులవేసితి నంటిరి గదా' యనెను. మీ పేరు ప్రతిశ్లోక మునకు తగిలియున్నదో లేదో చూచుకొనుఁడు' అని కవి యుత్తరము చెప్పెను. ఆ సమయస్ఫూర్తికి ప్రభువు సంతోషించెను. రాజకార్యసాధకులకు గొప్పసత్కారములు.

# నా ట క పా త్ర ము లు.

## పురుషులు.

---

సూత్రధారుఁడు—ప్రస్తావన.

జనార్దనుఁడు (యుగంధరునితమ్ముఁడు.) I, IV, V—6, VI, X.

మంత్రి ప్రతీహారుఁడు. ... ... I, IV, V—4, VI.

వలీఖానుఁడు (ఢిల్లీ సుల్తాను సర్వసేనాధిపతి.) I, II, III—2, VII—1, VIII.

విశ్వాసరావు (రాజమంత్రి శిరస్తా) ... ... I, IV, X.

భేతాళరావు (ప్రతాపరుద్రుని సర్వసేనాపతి.) ... I, IV, X.

10 వేగులు (5 చాకళ్లుగాను, 5 మంగళ్లుగాను), డలాయతు, వలీ శిరస్తా. I.

చెకుముకిశాస్త్రి. II, IV, V—1, 2, 3, 4, VI, VII—1, 2, VIII—5, X.

ఖుస్రూఖాన్ (వలీఖానుని క్రిందసర్దారుఁడు) ... II, V—1, VII—2.

ముస్తఫాఖాన్, ఫిరోజ్ ఖాన్ (ఖుస్రూఖానుక్రిందిసర్దార్లు.) II.

తురకఠేరాకడ దౌవారికుఁడు. ... ... ... II, V—1

11 తురక సిపాయీలు. ... ... ... III—2,3,4,6.

ప్రతాపరుద్రుఁడు (త్రిలింగదేశ మహారాజు) III—2,3,5, VIII, IX—4, X.

5 పడవ వాండ్రు. ... ... III—3, 4, 6, VII—3.

పడవవాఁడు (బాలుఁడు.) ... ... ... III—3, 4, 6.

విద్యానాథుఁడు (కవి.) III—4, 5, 6, 7, IV, V—6, VI, X.

* గుఱ్ఱము (ప్రతాపరుద్రునిది.) ... ... III—2.

యుగంధరుఁడు. IV, V—4,5,6, VII—2,3, VIII—2,3,4,5, IX—4, X.

విజయరామరెడ్డిగారు, నారాయణరాజుగారు (జమీందార్లు.) IV, X.

3 ఉద్యోగస్థులు. ... ... ... IV.

పేరిగాఁడు (ఒక చాకలి.) ... .... IV, VI, IX—5, 6, X.

తురక సిపాయి, హర్కారా, దుబాసి, ... ... V—1.

2 రాతులు, పడవాలు. ... ... ... V—4.

బాలుఁడు (ప్రతాపరుద్రుని కుమారుఁడు). ... V—6, IX—4, X.

2 పహరా జవానులు (ప్రతాపరుద్రుని నగరిలో.) ... ... V—6.

అనుమఁడు, పులిగాఁడు, వైణికుఁడు. ... ... VI.

మార్దంగికుఁడు. ... ... ... ... VI, VIII—4.

మోర్సింగువాఁడు. ... ... VI, VII—2.

4 వేగు సిపాయీలు, వలీ నౌకరు, వర్తకుఁడు, 3 ద్రష్టలు, 3 శిష్యులు. VII—2.

ఖిల్జీసుల్తాన్, పెద్దసెట్టి, 2 వర్తకులు, 2 వజీర్లు. ... VIII, X.
4 సుల్తాన్ జవానులు, 6 వజీర్లు. ... ... ... VIII.
10 సిపాయి పాత్రములు, వలీపాత్రము. ... ... ... VIII—5.
(సుల్తానువారి) దౌవారికుఁడు. ... ... ... VIII—1
పురోహితుఁడు, తత్పుత్త్రుఁడు, అవధానులు, సోమయాజులు, చయనులు. IX—1.
5 సంభావనీయ బ్రాహ్మణులు. ... ... ... IX—1.
1 చాటింపువాఁడు. ... ... ... ... IX—2.
విద్యాధరుఁడు. ... ... ... ... IX—2, 3.
10 చాకళ్లు (పేరిగాని పరివారము.) ... ... ... IX—5, 6.
అన్నమరాజు, నరసింహరాయలు, కంచుకి, అగ్రహారస్థుఁడు ... X.
4 అంగరక్షకులు, ప్రతీహారుఁడు. ... ... ... X.

## స్త్రీలు.

నటి...ప్రస్తావన, VI, X; నటీచతుష్టయము, 3 ఛత్త్రిధారిణులు. VIII—4.
3 చేటికలు—III-1; చేటి-V—4; 2 చేటికలు-V—6; 4 చేటికలు- IX—1.
ఎల్లి (పేరిగాని పెండ్లాము.) ... ... V—4, IX—6, X.
శర్వాణి (ప్రతాపరుద్రుని రాణి.) ... ... V—6, IX—1, 4.
ముమ్మడమ్మ (ప్రతాపరుద్రుని తల్లి.)... ... V—6, IX—4,
భాగ్యశాలిని. — ... ... ... VI1—2.
6 చామరగ్రాహిణులు VIII—4; 2 చామర...VIII—5; 2 చామర. X.
5 ముత్తయిదువులు. పురోహిత భార్య, జగదంబిక, సోమిదేవమ్మ. IX—1.
విద్యాధరి. ... ... ... IX—2, 3.
చాకలిముసలిసునాసిని ... ... ... IX—6.

హెచ్చరిక:—పాత్రసంఖ్య గొప్పదిగా నున్నను, నాటక మెల్ల నాడుటకు, 1 పురుషులు, 11 స్త్రీలు చాలుదురు.

ఈ నాటకము రెండురాత్రులకు ఉద్దేశింపఁబడినది. అట్లు ఆడువారు తొలి 6 అంకములు ఒకరాత్రి, కడమ 4 అంకములు ఒకరాత్రిగా, ఆడుట మంచిది. అటు గాక సంగ్రహించి ఒకరాత్రి ఆడఁగోరికయైన,—3 అం.; 5 అం. 1, 6, స్థ.; 6 అం.; 6 అం.; 8 అం. 2—5 స్థ.—ఆడుట మంచిది.



శ్రీ

# ప్ర తా ప రు ద్రీ య ము.

C. M. V. Sharma, Nalgonda



క. [1]నీటను డాఁగి, [2]కొండతోలి నెక్కొని, [3]నేలను బొత్తి పెట్టి, [4]ప
న్గోటను జక్కఁ జేసి, [5]యడుగు ల్నగ మేదియు దవ్వు దాఁటి, [6]రా
పోటొనరించి, [7]కట్టి, [8]కలుముచ్చయి, [9]దొంగిలి, [10]లేదటంచు, [11]టా
టోటుగఁ [12]గత్తిదూయు టకటా! కరి యాతని యాలు నేలుతన్. ౧

## ప్రస్తావన.

నాంద్యంతమున

సూత్రధారుఁడు——ఏల యతివిస్తరము? ఇన్నాళ్లకుఁగదా తగిన సభ దొరకెఁ బ్రతాపరుద్రీయ మాడనెంచితిని. ఇంటికిఁబోయి గృహిణినిదెచ్చి సంగీతక మారంభించెదను. [పరిక్రమించి తెరవైపు చూచి] పరధ్యానములో ఇల్లుదాఁటిపోయితిని! ఆర్యా, రారమ్మి, రొట్టె విఱిగి నేతిలోఁ బడినది.

నటి——[నేపథ్యార్థ ప్రవిష్టయై, కంపస్వేదములతో] ఎవరు? ఎవరు? [ఎదుటికి వచ్చి] నీవా ఆర్యపుత్త్రా!

సూత్ర.——ఆర్యా, ఏమి యీనృత్యము? ఏమి యీముత్తెసరులు?

నటి.——ఆర్యపుత్త్రా, నేనిపుడీ ద్వారదేశమునకు రాఁగానే, మొన్న నాచెల్లి నా ఆటలోఁజూచి యింటికి వెంబడించి ఆతురక ఈప్రదేశమున నేఁ ఎత్తుకొనిపోయిన

౧. ఇందు నారాయణుని యవతారములు వర్ణింపఁబడినవి. 1. మత్స్యమూర్తియై, 2. మందర పర్వతము యొక్క మొదటిభాగముకడ నుండి-అనఁగా కూర్మమై, 3. వరాహమై, 4. పెద్దనఖము(ల)తో చీల్చి-నరసింహమూర్తియై, 5. (వరాహావతారమునందు నాలుగు పాదములుండఁగా అందులో రెండింటిని వదలి-అనఁగా) రెండే పాదములు గలిగి యొక దూరము లంఘించి-స్వర్గపాతాళములవఱకు అంజ వైచి-వామనమూర్తియై, 6. రాజులం బొడిచి-పరశురాముఁడై, 7. సేతువును గట్టించి-శ్రీరాముఁడై, 8. బలరాముఁడై, 9. వెన్న దొంగిలించి-శ్రీకృష్ణుఁడై, 10. ఆత్మ లేదని వాదము చేసి-బుద్ధుఁడై, 11. మోసముగా, 12. కల్క్యవతారమైన నారాయణుఁడు.

కథాంశసూచనాదితర విషయములను చదువరు ... వలయును.

యడావడి జ్ఞప్తిరైయె అపరధ్యానములో నుంటిని. అంతలో మాట వినఁబడినది. అంతట నామీఁదికిఁగూడ వాఁడు వచ్చినాఁడో యని భయపడితిని. చూడఁగా నీవే.

సూత్ర.—[సహర్షము] అహాహా! ఏమి దివ్యశకునము! నేను సాయెబ్బత్తు కొని పోయిననాటకము నే ఆడుటకై నిన్నుఁబిలువ వచ్చితిని.

నటి.—[సానూయము] సడిసడి! మాకత అప్పుడే నాటకము నేసితివా!

సూత్ర.—ఏమి యాక్షేపము! ‹ నిన్నుఁజూడఁగా తిట్టువానివలె నున్నది నీకే—' అని యారంభించు నీతో నే నేమి చేయవచ్చును?

నటి.—[సభ్రుకుటి] నాటకా లాడవచ్చును, మా చెల్లెలిని గుఱించి.

సూత్ర.—ఆవిషయమే గాదు.

నటి.—మఱి యేవిషయము?

సూత్ర.—నీతోఁ జెప్పినది చాలును.

నటి.—అటయినఁ జెప్పవా?

సూత్ర.—ముఖ మెత్తియెండ గాయుచున్నదే?

నటి.—[మందహాసముతో] అదికుంకుమ తాంబూలముల యారెండలే, చెప్పు.

సూత్ర.—ఒక ముద్దిచ్చినఁ జెప్పెదను.

నటి.—చెప్పినవెంట నే అడిగిన నిచ్చెదను.

సూత్ర.—ఢిల్లీ సుల్తాను సర్దారుఓరుఁగంటిమహారాజునుగొనిపోయిననాటకము.

నటి.—అది శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి విరచితము గదా.

ఉ. అంకెకుఁ దార్చె నేరసికు నంగలభారతి ప్రౌఢనీతి, నా
కింకిరి నాంధ్రి ద్రావిడియుఁ గేరుచు దైవియుఁ గూడి రెవ్వనిన్,
జంకు కళంకు లేనికవిచంద్రుఁడు తోషితకోవిదేంద్రుఁ డా
వేంకటరాయశాస్త్రికృతి వెంగలిమూఁక కెఱుంగ శక్యమే!

దానిస్వారస్యము గ్రహించు రసికశిఖామణులు మన కెక్కడ నౌనఁగూడును!

సూత్ర.—ఇక్కడ కూడియున్నారు.

నటి.—ఈనాటకమును నే నాడునపుడు నాకుఁ జూడఁ గోరిక, చూచు నపుడాడఁగోరిక. ఈమాఱు దీనిని సామాజికులలోఁ జేరి చూచి యానందించవలె.

సూత్ర.—సరిసరి! నీవు లేనియాట రక్తి లేనిపాట.

నటి.—నేను ఆడిన, చక్కఁగా ఆడక తప్పదు. చక్కఁగా ఆడిన—

సూత్ర.—[సోత్ప్రాసము] సాయెబ్బత్తుకొని పోవునని భయమా?

నటి.—[పరిహాసముగా] అవును, అదే భయము. అట్లు జరిగిన నీవేమి చేయఁగలవు?
సూత్ర.—నీచెల్లెలిని విడిపించుకొని వచ్చిన నానేర్పు నీ వెఱుఁగవా? గొప్ప తప్పు చేసిన, వారికత నాటక మాడి పరువు తీసివేయనా?
నటి.—నేను లేనియాట రక్తిలేనిపాట గదా?
సూత్ర.—నీచెల్లెలిని బెట్టుకొని యాడెదను.
నటి.—దానిం గొనిపోయిన?
సూత్ర.—రథం బుడింగి! నీయుక్తి కాళయుక్తిగా నున్నదే!
నటి.—కావున, ఆర్యపుత్రా, నాకు సామాజికులలో నుండ సెల వీయవా?
సూత్ర.—ఇట్టి రసికప్రభుసమాజము నీ కెప్పుడు దొరకును? వీరివలన వచ్చు గదా పేరు.
నటి.—అటయిన నేనును ఆడెదను. ఏఋతువును పాడు మందువో?
సూత్ర.—వేఱుఋతువు నేల, వర్షావిరామసుభగము నీశరదృతువునే పాడుము.
నటి.—సరియే. [అని పాడును.

జంఝూటిరాగము, చాపుతాళము.

వచ్చెఁ జెలియ యంచ లులియు వాసరంబులే
చెచ్చెర వికసిల్లుకల్వ శ్రీసరంబులే! వచ్చె.
1. వెన్నెల బయల్లఁ గలయు వేడ్క లిప్పుడే,
కన్నుల విల్లెక్కు వెట్టుఁ గంతుఁ డిప్పుడే. వచ్చె.
2. రిక్క తెల్లు తమ్మి యంచ రేఁచు వన్నెల
దక్కె నిపుడు నెలయు లేని తటిని వెన్నెల. వచ్చె.
3. సీటిమోఁత తీఱి నింగి నెఱయ నవ్వటో!
కోటిఁ జదలఁ బాలకడలి పొంగి కవ్వటో! వచ్చె.
4. చదురు సేయు లక్ష్మి యిపుడు సరసులం దిటఁ!
జదురు సేయు నటియు నిపుడు సరసులం దిట. వచ్చె.

సూత్ర.—[విస్మయపరవశుఁడై] నిత్యము విను నాకే నీపాట యింత మోహకముగా నున్నదే! [ఆత్మగతము] క్రొత్తగా వినువారు రసోన్మత్తులగుటకు సందేహమా? [ప్రకాశము] మన మిఁక భూమికాగ్రహణము చేయుదము రమ్ము.
నటి.—మంచిది ఆర్యపుత్రా. [అని నిష్క్రమింతురు.

సూత్ర.—[ఆలోచించి] ఏమి మఱచితిని? [స్మరణ మభినయించి, ప్రగ్గా ము] ఆ! ముద్దిమ్ము ముద్దిమ్ము.

నటి.—చెప్పినవెంటనే అడుగు మంటిని, చెప్పి పావుగంటనే పయిన్నది.

[అని నిష్క్రమించును.

సూత్ర.—ఎంత మోసగత్తెరా యిది!

క. కానీ, పరిశీలించెద
దీని న్నెఱజాణ నేను [1]ధీవిభవమునన్,
మానుగ [2]నయసరణిన్ వి
జ్ఞాని జనార్దనుఁ డితండు సాధించుగతిన్. 3

[అని నిష్క్రమించును.

ప్రస్తావన ముగిసినది.

---

# ప్రథమాంకము.

స్థలము:—ఓరుఁగల్లు, నగరము వెలుపల తోఁటలో మంత్రికచ్చేరి.

[అంతట జనార్దనమంత్రి యుపవిష్టుఁడుగాఁ బ్రవేశించును.

పరివారము ఉచితప్రకారములఁ బ్రవేశించును.]

జనార్దనుఁడు.—[ఏమో వ్రాయుచు, చింతించుచు, ఆత్మగతము] చారుల చేఁ గని యూహించినది ప్రత్యక్షమే అయినది. వచ్చినవిధమును మొత్తముగాఁ జూడఁగా ఇది దాడియే, సంశయము లేదు. గడుసుఁదలయే నడుపుచున్నది. వీఁడు అన్న గారును ఏలినవారును లేనిసమయముఁ జూచి వచ్చినాఁడు. వీనికి మంచి వేగులు న్నట్టున్నది. వీనికి చేటికి సెలవిచ్చితినిగదా, రానీ సర్వమును బయటఁబడును. ఎట్లన్—

క. దేనిన్ ధూర్తుఁ డడంచునో
దానినె పొడగాంచు బుద్ధిధనుఁ డెప్పాటన్;
వీనులును గన్నులును [1]నను
మానమునకు సాటి గావు [2]మంత్రపరులకున్.

---

3. 1 బుద్ధిప్రభావముచేత. 2 నీతిమార్గమును.

1. ఊహను. 2. మంత్రాంగమందు ఆసక్తులయినవారికి.

మంచిది; అన్నగారు యాత్రకు వెడలినపుడు సవారిచెంతకు నన్నుఁ బిలిచి 'జనార్దనా, నీ చేత రాజును రాష్ట్రమును, తొమ్మిదిలక్షల విలుకాండ్రను అప్పగించితిని, భద్రము.' అనిరి. ఈ సమస్తమును అన్నగారికి మరల నప్పగించి వారి మెప్పు పొందఁగలనా? [వామాక్షిస్పందనము సూచించి] హా! ఏమి యీయపశకునము! అప్పగింపను గాఁబోలుఁగదా !

ప్రతీహారుడు.——[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

జనా.—[ఆత్మగతము] ఆహా! ఏమి యీశకునములు పరస్పరవిరుద్ధములు. తొలుత శ్రమ గలిగి పిమ్మట మేలు కలుగునఁట ; ముందు కాలకూటము, పిమ్మట నమృతము. [ప్రకాశము] ఏమోయి ఏమి?

ప్రతీ.—తురకసర్దారు వలీఖాను శిరస్త్రాతోను ఒకజవానుతోను వచ్చియున్నాడు! ఆటుపైన దేవరవారి చిత్తము.

జనా.—మంచిది, తోడ్కొనిరా, ఇద్దఱుమాత్రము.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ. [అని నిష్క్రమించి వలీఖానుని, శిరస్త్రాను తోడ్కొని వచ్చి] వారుగో మహామంత్రిగారు. [అని జనార్దనుని చూపును.

[జనార్దనుఁడు లేచి కొన్నియడుగులు వలీఖానునకు ఎదురు పోవును. వలీఖానుఁడు ను శిరస్త్రాయును జనార్దనునికి సలాములు చేయుదురు. జనార్దనుఁడు బదులు సలాములు చేయును. నౌకరులు ఆగంతుకులకు రెండు కుర్చీలను తెచ్చి యుంతురు.

జనా.— కూర్చుండవలయు. [ముప్వురును కూర్చుందురు.

జనా.—కుశలమా మీసుల్తానుగారికి? ఇంతదూరము ప్రయాణశ్రమ నోర్చుటకు గొప్పకారణ ముండవలయును.

వలీ.—[మందహాసముతో] అల్లా కటాచ్ఛంవల్ల మా యేలినవారు ఘయాజుద్దీన్ టోఘ్లాక్ సుల్తానువారికి కుషలమే. తమ యేలినవారు ప్రతాపరుద్రమహారాజావారికి కుషలంగదా?

జనా.—మా యేలినవారికి కుశలమే.

వలీ.—మేము వచ్చినకారణం గొప్పదే. మాసుల్తానువారికి కాబూలువాడికి పేషావర్ పర్గణా మాకీ రావాలా మాకీ రావాలా అని తక్రార్ గల్గి ఇద్దర్కి నమ్మక్ అంగార్ అయింది. ఆటుపైన కాబూల్వాడు మాఢిల్లీమీదికి దాడీ వస్తున్నాడు. ఈ సమయంలో తమయేలినవారు స్వయంగా దండు నడ్పుకొని వచ్చి సహాయపడ్వాలా అని మాసుల్తాన్వారు నానోటితో మనీవ్ చేస్తున్నార్. తమరు మహారాజావారికి మాకీ భేటీ చేయించి మాకోసం వారి నెరవేర్పించవాలా కోరాం.

జనా.—మీసుల్తాను గారితో సఖ్యము మాకు సంతోషమే; కాని, మీ రాక బారమునుగుఱించి కొన్ని సంశయము లడిగెదము, కోపము వహింపక తీర్చెదరా?

వలీ.—వినయత్వంగా తీర్చుతాం.

జనా.—

ఆ. సెలవు లేక మీరు సీమఁ జొచ్చుట యేల?
పగళు లెల్ల నడవిఁ బట్టు టేల?
దం డి దేల? యెక్కడారి సంతయు రాక
చెదరి చెదరి యిట్లు చేరు టేల?

వలీ.—[ఆత్మగతము] ఎంత వేగుచూపు వుందిరా యీయనకి! [ప్రకాశము] అవష్యం షమాధానం మన్వీచేస్తాం. వఖ్టి.— ముందుగా మీకీ తెల్పడానికి ఫు ర్సత్ లేకోయింది. మాసుల్తాన్వారు 'ఓరంగోల్మహారాజావారికి మనమీద చాలా దయా వుంటుంది, అంటే స్నేహం వుంటుంది, ముందు తెల్పకుండా మన్మ వెళ్లినా వారు ఏమీ ఆచ్చేపింఛరులే, వెల్లండి వెల్లండి' అని మాకీ చాలా తొందర పెట్టినార్. రెండు.— మేము చల్లనిదేమంనుండి వచ్చేతప్పుడు ఈదేమంయండాకి నిల్పాటే పగల్ నడ్వటం లేదు; రాత్రినడ్వటం, ప లే ల్లని నీడాకోసం హడ్వులో మకాం చేయుటం. షమాధాన మైందా?

జనా.—[ఆత్మగతము] వీఁడు గడుసువాఁడు, సమయస్ఫూర్తి కలవాఁడు [ప్రకాశము]మంచిదిగాని, మూఁడవవిషయము.—మీ రాజ్యముపైకి దాడివచ్చునప్పుడఁగా, ఢిల్లీకిగొప్పసర్దార్లు మీరు రాజ్యము వదలి గొప్పదండుతో వచ్చుట ఆశ్చర్యముగా నున్నది. రాయబార మైన, ఒకరిద్దఱు గొప్పవారు కొంచెపాటి పరిజనముతో వత్తురు, ఇంత రాణువ యేల?

వలీ.—[ఆత్మగతము]అరే మామోషమిక్క ఈయన బాగా కనిపట్టినాడు! పక్కా మంత్రి! గోదావరికి అవతలనే మాకీ ఆపలేనందుకి చింతిస్తాడు. కానీ ఈలాగ చేసి చూస్తాం.[ప్రకాశము] మహామంత్రులవారు చిత్తగించవాలా. కాబూల్ వాటి ఢిల్లీకి మధ్యలో ఎందర్ నవాబులు అందర్ ఎదిరిస్తార్. అందర్కి దాటుకోని వచ్చి నా, మాకి మించిన సర్దార్లు మాసుల్తాన్వారి హజారంలో వున్నారు. వారికీ ఫౌజ్ దండూమే ఈ హల్కాదండూ యేపాటి! ఇది వుంటే యెంత? లేకోతే యేమి? మేము వెల్లవలసివస్తే(చిటికవైచుచు) ఎంతలో వచ్చినామో [చిటిక వైచుచు ఎం తలో వెల్లలేమా? హల్లాకతాచ్చం చల్లగా వుండి మీదయా బాగా వుండితే మాకి యేమీ తక్కువ? ప్రతాపరు ... వారు ... సర్కార్ అని, వారికీ ...

రాయబారం హల్కా వుండకూడదు అని, మాతో ఈకొద్ది రాణ్వాకి సుల్తాన్వార్ పంపినార్. మరి యీదారి నే వెల్లి ఖట్కాంపట్టుకొమ్మని అందుకే శోషంకూడా సుల్తాన్వార్ పంపినార్. ఆఖాబూల్వాడికీ మనరాజ్యాలులో ఇంసువ సాలామిస్రి పొమ్మని బతికేలాగ చెయ్యావాలా అని సుల్తాన్వారిది సంకల్పం. అందుకే శోషం దుక్క డెక్కడిది దండు జమా చేస్తావున్నార్. మాకి ఇక్కడిక్కి పంపినార్.

వాలుసు.—రస్తుసరఫరాలు జరగవని చెదిరి చెదిరి వచ్చినాం.

జనా.—[ఆత్మగతము] ఏమి ఈనయవంచన! ఏమి ఈనయవంచన! ఇందులకు నయవంచనయే ప్రతిక్రియ. నిప్పులో వేయుటకై కట్టెలమోపును నెత్తిపై మోచుట. [ప్రకాశము] మంచిది గాని, వారిని మీసర్దారునిఁగా దండు తోడ్కొని రమ్మనెద నేమి? ఏమి యిట్టిరాయబారము తెచ్చితిరి?

వలీ.—లేదు అన్నగారూ, స్నేహంచేత సుల్తాన్వారు ఆప్రకారం కోరినార్. పోనీ మహాప్రభువుగారు రాక్పోతే దండుకీ సర్దార్లకీ పంపితే చాల్.

జనా.—[ఆత్మగతము]

ఆ రాజు తోడు సనిన, రాణువ నిడినను,
నతనిఁ గట్టి, దాని నణఁచి పెట్టి,
[1]తద్వియోగదూనఁ ద్రైలింగలక్ష్మిని
[2]జీకుసింహిఁ బోలెఁ జెనకఁ దలఁతు. ౬

[ప్రకాశము] వారిని రమ్మనుమాట ప్రస్తావింపకుఁడు. వారము దినములలో భేటి చేయించెదము.

వలీ.—ఓహో ఆలాగయితే మాకీ చాలా ఆలస్యం అయితుంది. మేము ఇంకా ఘట్కానికి కూడ పోవాల వుంది. మామీద చాలా దయాచేసి, మాకీ రేపే భేటీకి పిలిపించవాలా కోర్తాం.

జనా.—[ఆత్మగతము] వీనికి ఏలినవారు నగరమున లేనిమాట తెలిసియే యుక్తి. వానోట లాగుట కీటకుక్క. కానీ [ప్రకాశము] మాయేలినవారు ఇప్పుడు నగరమున లేరు, నేఁడో రేపో వత్తురు, వచ్చిన వెనుక మీరు దర్శనము చేయవచ్చును.

వలీ.—చాలా షంతోషం. తమవొక్క గొప్పతనం మేము మా దేషంలో నే విన్నాం విన్నాం. ఇప్పుడు ప్రత్యక్షంగా చూచినాం. తమరు ఇంతాషులభులు అని

1. రాజును భాసింపఁజేయు ... అలజడిని ... 2. గుడ్డియాఁడుసింగమును,

మేము తలచలేదు. తమపేరూ అంటే మాదేశంలో కూడా గడ్డడా గదా, ఈబాగ గదా మాదేశంలో బీబీల్ జోల ల్పాడ్తార్.—

గేయము.

వీరయుగంధర్ పేరు చెప్పితే నీరు విడుచు ఘోడా,
రుద్రయుగంధర్ ముద్ర పెట్టితే నిద్రపోదు హాథీ,
బాలయుగంధర్ లీల పల్కితే పేలదుర తుపాకీ,
నూరయుగంధర్ బీరము వింటే పారదుర ఫిరంగీ,
ప్రోడయుగంధర్ దాడి పాడుతా నేడవకుర బాబా.

ఇలాగా ఒబ్లి గసుర్ హయ్యేలాగ హమేషా మేము మాసుల్తాన్వార విన్న మహాతు త్రి యుగంధరుల్వారికి దర్శణం చేస్కాన్న, యీరోజే మాజన్మమ్కి మంచిరోజ్. ఇక మేము శెలవు పుచ్చుకోవచ్చునా?

జనా.—[ఆత్మగతము] ఏమి వీనిమోసము! వీనికి అన్నగారు దేశాంతరము పోయినమాట చక్కఁగా తెలిసియున్నది. నానోటఁ దీయుటకై యీనటన. కానీ, [ప్రకాశము] సాయెబుగారూ, నేను జనార్దనమంత్రిని.

క. కాను యుగంధర దేవుఁడ,
నా [1]నీతినిరస్తకావ్యు ననుజాతుండన్;
మీ [2]నాడువులోకదీపవుఁ
గ్రీనీడం గాఁగ నవధరింపుఁడు నన్నున్.

అన్నగారు కొంచెము ప్రయాణము పోయియున్నారు, త్వరలోనే వచ్చెదరు.

వలీ.—బశిబశి, వినివున్నాం. వారికి మించినవారు తమర్. అందుకే ఇదే దర్శణం. వారూ రాజా యిద్దరూ లేర్. మీరూవున్నార్. వారికి ఇద్దరికి మీరువకటి సమానం. గనుక నే మీకి వఖరికి వుంచి వారు ఇద్దరు వెల్లినార్. ఇది మాకి చాలా మంచి రోజ్. ఇక మేము శెలవు పుచ్చుకొందుమా?

జనా.—చిత్తము. [అందఱు లేతురు.

శిరస్తా—మనకి కొంచెం నౌకర్లకి చాకర్లకి తమరు శెలవిప్పించవాలా. మాకి ఈఘూరంప్రయాణంలోచాలమందిమధ్యమధ్యరోగం గీగం పడి మర్గయా అదివాస్.

ఁ.1. నీతియందు తిరస్కరింపఁబడిన శుక్రాచార్యులు గల [నీతివిద్యయందు శుక్రాచార్యులను మించిన] యాయుగంధరుని తమ్ముఁడను. 2. ప్రస్తావించుచున్న

దురే మాకి యిక్డ వారంరోజులు పడ్తుంది శెలవిచ్చినార్. మరి యిది మాకి కొత్త నోటు, కొంచెం హజాములు, కొంచెం చాకళ్లు దయచెయ్యవాలా వేడుతాం.

జనా.—మీకు సరఫరాలు విచారించుటకు మాశిరస్తా విశ్వాసరావును ఏర్పరచినాము.

వలీ.—చిత్తము. మరి సెలవు.

శిరస్తా.—సలాం సలాం.

జనా.—సలాము, సలాము. [తురకలు నిష్క్రమింతురు.

జనా.—[కూర్చుండి] ఎవరోయి అక్కడ?

ప్రతీ.—[ప్రవేశించి] ఏమి దేవరవారి యాజ్ఞ?

జనా.—విశ్వాసరావును రమ్మను.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

విశ్వాసరావు.—[వచ్చి] ఏమి దేవరవారి యాజ్ఞ?

జనా.—విశ్వాసరావు, ఈ తురకలవిషయములో నీయభిప్రాయ మేమి?

విశ్వా.—ఈ తురకలరాక బలుమోసము; మనము మంచి జాగ్రత్తలో నుండవలయును.

జనా.—'సర్వయత్నేన తత్ కుర్యాత్ సింహో దేకం ప్రచక్షతే' అన్నట్లు సింహక్రమణము చేయవలయును.

విశ్వా.—శరభక్రమణము గండభేరుండక్రమణము గూడ చేయవలయును.

జనా.—ఈ సమయములో అన్నగారిని రప్పింపవలసినదే.

విశ్వా.—తప్పకుండ.

క. ఆయన గాలిని బేనును,
[1] దోయముతో నలుకు, బొగలతో గోడ లిడుఁ,
ఆయనప్రయోగ [2] మభినవ
తోయజభవసృష్టి, [3] పెఱది దుఃస్వప్న మగుఁ. ౮

జనా.—[ఇంచుక ఆలోచించి] మంచిది, ఇట్లు చేయుము.—

విశ్వా.—ఏమి యాజ్ఞ?

జనా.—ఈక్షణమే-[అని సగములో] ఉండుచెప్పెదను, ఎవరోయి అక్కడ?

ప్రతీ.—[ప్రవేశించి] ఏమి దేవరవారి యాజ్ఞ?

౮. 1. నీళ్లతో. 2. క్రొత్తబ్రహ్మసృష్టి. 3. ఇతరుల ప్రయోగము.

జనా.—సేనాపతి బేతాళనాయనింగారిని మేము చూడవలయును.

ప్రతీ.—దేవరవారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

జనా.—విశ్వాసరావూ, ఈక్షణమే మనరాష్ట్రములో నాసిక మొదలు భద్రాచలమువఱకు గోదావరి దాఁటుటకు లేకుండ బల్లకట్లు డింగీలు మొదలగు పాత్రముల నన్నిటిని పగులఁగొట్టింప వలసినది. పడవలు దోనెలు ఓడలు లోనగు పాత్రముల నన్నింటిని భద్రాద్రి కవతల లంగరు వేయవలసినది. ఏప్రాణియు గోదావరి దాఁటఁగూడదు, దాఁటింపఁగూడదు. అతిక్రమణమున సంబంధించిన జనులకు గ్రామగ్రామముగా తల కొజ్ఞ.—ఇట్లుగా సేవుల కన్నింటికిని, సంబంధించు నితరస్థలములకును, తాఖీదులు వ్రాయింపుము.

విశ్వా.—చిత్తము. [అని నిష్క్రమించును. జనా.—చింతించుచుండును.

ప్రతీ.—[సేనాపతిని దోడ్కొనివచ్చి] వారుగో మహామంత్రిగారు.

బేతాళరావు—జయము జయము మహామంత్రిగారికి.

జనా.—[తిరిగి చూచి] బేతాళరావూ, కూర్చుండుము. ధర్మసింగూ, నీవు చూడుము.

బేతా.—[కూర్చుండి] ఏమి? ఈ తురకవానిరాకకై పిలిపించినారా!

జనా.—ఔను. మీసన్నాహ మెట్లున్నది?

బేతా.—సర్వసిద్ధము.

క. యుద్ధ మయినఁ గాకున్నన్
[1] యుద్ధారంభముగ నుండ నుత్తరువు గదా;
[2] యిద్ధాగ్నిగ ననయము స
న్నద్ధుండ [3] శతాంగసైన్యనాగాశ్వములన్.

జనా.—బురుజులపై, అలంగములలో, సొరంగములందు, మాటులలో, కోటలలో, అంతటను దండు సిద్ధమా?

బేతా.—సిద్ధమే.

జనా.—దర్వాజాలకడ యంత్రములు, అగడ్తతిరుగుడులు, సర్వము సన్నాహములోనే యున్నవా?

బేతా.—ఉన్నవి. తమయాజ్ఞ యందినక్షణములోనే తురకశిబిరము ప్రళయము చేసివేసెదము.

---

క. 1. యుద్ధారంభములో నుండునట్లు—అనఁగా యుద్ధసన్నాహముతో సదా ఉండు మని. 2. మండుచున్ననిప్పు. 3. రథములు, సిపాయీలు, ఏనుఁగులు, గుఱ్ఱములు,-వీనితో.

జనా.—లక్షదండే గదా యిచట నున్నది?

వేశా.—అయిన నేమి? అనుమకొండలోనిలక్ష కోటకు కాపు. కడమ
ప్రభు లక్షలకును నరసింహదేవరాయలకును ఇప్పుడే హెచ్చరిక పంపెను. మతి
గామనవి.—నేను కోరఁగా కోరఁగా ఇన్నాళ్లకు యుద్ధప్రసక్తి గలిగినది.
కోట్లు మొదలుకొని విన్నపము—

క. భుజములు [1]రణకండూలత
గజిబిజి గొన్నయవి, యీఁటెగంటులఁ దక్కన్
భజియింపవు శాంతిన్, మము
విజ. [2]యాహవ మొనఁగుచూడ్కి వీక్షింపఁగదే. ౧౦

ఇక్షేయు,

మ. గరడీలే, గడికోటలే, నియమనాగారప్రఘాణంబులే,
[1]యిరవై కొల్చితి మెప్పుడున్ [2]విరతిలేకేవంశ [3]పారంపరిన్;
అరికంఠాద్రిగుహా వినిస్సర దసృక్ప్రాగ్భార వీరాపగా
తరణక్రీడకు నొక్కయాటవిడుపుం దా మియ్యరాదే ప్రభూ?

జి.—యుద్ధమున కాజ్ఞ యీవలయు నని నేనును బ్రార్థించుచున్నాను.—అటు
లైన తమచిత్తము.

జనా.—

ఆ. సందడింప కీవు సన్నాహమున నుండు,
మవసరమున [1]ముదల యంపువాఁడ,
అన్నగారు లేమి [2]యవనీపతియు రామి
[3]కొఱలు గాక మనము కూల్త మనుల. ౧౧

౧౦. 1. యుద్ధముకొఱకైన దురదచే. 2. ఆహవము=యుద్ధము.

౧౧. గర...బులే=తాలీముఖానాలే ఎల్లలలో నుండుదుర్గములే చెరసాలల
ప్రమ్ముళ్లే. 1. ఇల్లుగా. 2. విరామము. 3. పరంపరగా. అరి కంఠ అద్రి గుహా విని
స్సరత్ అసృక్ ప్రాగ్భార వీర ఆపగా తరణ క్రీడకున్=శత్రువులయొక్క గొంతు
లనుగుహలనుండి వెలువడియెడు నెత్తుటి మొత్తములనెడు శూరో
త్తమ నదులయందు ఈఁతయాటకు.

౧౨. 1. ఆజ్ఞ. 2. రాజు, 3. లోపములు. అరులన్ కూల్తము=శత్రువు
లను నాశముచేయుదము.

ఛేతా.—చిత్తము. [అని నిష్క్రమించును.] జనా.—జాబులు వ్రాయు...

విశ్వా.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

జనా.—విశ్వాసరావూ, అంతయు సిద్ధమా ?

విశ్వా.—సిద్ధము. ఇవిగో తాఖీదులు, ఒక్కొక్కటియు అంచెలెం... చేరవలసిన తేది గడియు, జవాబు తెచ్చి ఇక్కడ అప్పగింపవలసిన తేది గడియ... నమూదు. తమ మొహరు దయచేయవలయును.

జనా.—సంతోషము. [అని మొహరిచ్చును. దూరమున జవానుముద్రించు...]

జనా.—[విశ్వాసరావుచేతికి ఒక జాబిచ్చుచు] దీనిని అన్నగారికి బేగీరా... టపామీఁద పంపవలయును. వారు వచ్చుటకు బేగీరావుటపా ఉంపవలయు... [మఱి యొక జాబిచ్చుచు] ఏలినవారికి దీనిని ఎచ్చట నున్న నచ్చటికి వెదకు... పోయి యిచ్చునట్లు టపా పంపవలయును.

విశ్వా.—చిత్తము.

జనా.—తురకకు నౌకర్లు చేకర్లును వలయునఁట; ఎందులకో ఎఱుఁగుదువా?

విశ్వా.—వేగుకొఱకు.

జనా.—మన వేగులను పంపుదము. ఈవ్యవహారము ఇసుకతక్కెడగాని పేఁడతక్కెడగాఁడుగా నున్నది.

విశ్వా.—అప్పుడే హెచ్చరించియున్నాను, సమ్ముఖమునకుఁ బంపుదునా?

జనా.—పంపు, అందఱను మనవాంధ్రనే పంపు.

విశ్వా.—చిత్తము. అందఱు మనవాంధ్రే. హిందూస్తానీ చక్కఁగా వచ్చు వారే, వారిని తురకలకు చేయవలసిన నౌకరిలక్షణములతోనే పంపెద. [జవానును నిర్దేశించి] ఏమోయి మొహర్లయినవా ?

జవాను.—అయినవండి. [అని తాఖీదు లిచ్చును.]

విశ్వా.—[పుచ్చుకొని యాత్మగతము] సుదర్శనమునకు అంచెలెన్నియో అన్ని. దానియంతపని నివియు చేయును గాక. [ప్రకాశము] పోయి వీనినిరవానాచేయుము.

జనా.—మంచిది. కానిమ్ము. [విశ్వాసరావు నిష్క్రమించును.]

జనా.—[స్వగతము] ఇంక నేమి చేయవలయును ? ఆ! జ్ఞప్తి వచ్చినది. ఒకప్పుడు అన్నగారు చెప్పియుండిరి గదా, మాచాకలిని పేరిగానిని చూపి 'సమయార్థుఁడై నను వీఁడు రాజుపోలిక వాఁడు, ఎప్పుడైన గొప్పయిక్కట్టులో ప్రత్యక్షముగా నుపయోగపడును.' అని. వాని నీసమయములో మాయింటనే ప్రచ్ఛన్నముగా నిలిపెదను, అన్నగారు వచ్చి యుపయోగింతురు గాక.

ప్రతీ.—జయము మహామంత్రిగారికి. ఎవరో చాకళ్లు కొందరు మంగళ్లు కొందరు తమరు పిలిపించినారని వచ్చియున్నారు.

జనా.—రమ్మను.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

అంతట చాకళ్లుగాను మంగళ్లుగాను చారులు ప్రవేశింతురు.

చాకర్లు.—దణ్ణం మహాప్పెబో దణ్ణం.

జనా.—ఓరీ, చాకళ్లు, మంగళ్లు, నూఱునూఱుతేరములుగా మీరు ఎవరియన్నము తిని బ్రదుకుచున్నారో ఎఱుఁగుదురా ?

మంగలి యొకఁడు.—అయ్యో మారాజా, అది యరక్కపోతే మాజల్మ మెందుకు మహాప్పెబో ! అంతా మీయన్నమే.

చాకలి యొకఁడు.—ఒకయన్న మేంటి, మాయన్నీ మీయే, మా పానాలు మీపానాలే, మాకొంపలు మీకొంపలే, మావోల్లు మీవోల్లే మాగుడ్డలు మీగుడ్డలే, మాబిడ్డలు మీబిడ్డలే, మా పెళ్లాలు మీ పెళ్లాలే, మాయన్నె మీయే.

జనా.—మూర్ఖా, మూర్ఖప్రసంగము చేసెద వేమిరా ?

ఆచాకలి.—బుద్ధి బుద్ధి. [అని యితరులచాటునకుఁ బోయి, జనాంతికము గా మంగలితో] ఏంటిరా నానన్నాతప్పు ?

ఆమంగలి.—మా పెళ్లాలు మీపెళ్లాలే యేంట్రా సాకలెదవా ?

ఆచాకలి.—[సవిస్మయము] అల్లదా! ఓరినానోటాచ్చేశిందిరా! ఓయిబాబో! మరి కోలాగ నూస్తే మాట యెందూర మెల్లిందిరా! [అని మంత్రిముందఱ నేలఁబడి] నానో టొచ్చేశింది మారాజా, నానాలిక కొయ్యించెయ్యండి బాబూ.

జనా.—మన్నించితిమి లే. ఓరీ మామాటమీఁద ఇప్పుడు మీరు పోయితురకలను కొన్నాళ్లు కొలువ వలయును.

చాకర్లు.—మీరు గోతులో పడమన్నా పడతాం, అగ్గిలో ఉరకమన్నా ఉరుకుతాం.

జనా.—చక్కఁగా కొలువవలయును. విశ్వాసరావు జవాను నిచ్చును. ఆ జవానుతో పొండి.

చాకర్లు.—తురకలపని అయిందనిపించి మరీ వొస్తాం బాబయ్యా! మాకు మేమే శెప్పుకోవట మెందుకు ? ఏరోజు కారోజుకి ఏగడి కాగడికి తమరికి తెలుస్తానే వుంటవి లెండి. అంతా [illegible] యిశ్వాసం.

జనా.—మీరు ఏలినవారి విశేషానుగ్రహము పొందుట కిది సమయమగునా?

నాకర్లు.—శిత్తం మహాప్పెబో.

జనా.—మాసొంతచాకలిని పేరిగానిని వాని పెండ్లామును ఎల్లిని కూడ, మీకు సాయ ముంచుకొండి. వారిచే గొప్పసర్దార్లకే పనిచేయుంపుడు. వాండ్రు చాకలిపని మిక్కిలి బాగుగా జేయుదురు.

నాకర్లు.—శిత్తం మహాప్పెబో.

జనా.—మఱి మీరు పోవచ్చును.

నాకర్లు.—దణ్ణం, దణ్ణం, దణ్ణం, దణ్ణం, [అని పరిక్రమింతురు.] మొగసాల కొచ్చినాం, ఆయన కవుపడంగందా? [అని వెనుకకు తిరిగిచూచి] అవుపడం. మరె వ్వరూలేరు గందా ? [అని కలయఁజూచి] లేరు.

ఈనాకర్లు ఈక్రింది తమతమవాక్యములను ఒకని మించి యొకఁడు పాడుదురు. అట్లు తాము పాడు దానిని తమలో నొకనిమీఁద అభినయించి చూపుదురు.

చాకలి యొకఁడు.—నాను ఈతురకోళ్లని ఉదికేస్తానురా.

,, నాను ఈళ్ల నందఱిని యిస్త్రీశేస్తానురా కొండన్నా.

,, నాను శింపేస్తానురా యెల్లన్నా.

,, నానీళ్ల నందఱిని యెల్లాయిలో యేస్తానురా నాగన్నా.

జనా.—ఎవరక్కడ ?

ప్రతీ.—[ప్రవేశించి] ఏమి దేవరవారియాజ్ఞ ?

జనా.—పోయినచోట వీరికి హిందూస్తానీ యేమైన వచ్చునేమో అడిగిరా.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ. [అని నాకర్లవైపు వచ్చును.

మంగలియొకఁడు.—నా నీతురకోళ్ల నందఱిని డొక్కేస్తానురా.

,, నా నీళ్లబుఱ్ఱలు రసగుండ్లలాగ తళతళ మెరిసేలాగ గొరిగేస్తానురా పుల్లన్నా.

,, నాను కోమటిబ్యాచ్చర్ల మామిడికాయి వూరగాయి లాగ యీళ్లబుఱ్రకాయల్ని గీశేస్తానురా పీసన్నా.

,, నాను మల్లీ యెంట్రిక మొలవకుండా తరిమెన పెడతా నాయినా.

మంగళ్లు కొందఱు.—[పాటమాని అతిత్వరగా] నాను చెక్కేస్తా; నాను తరిగేస్తా; నాను కోశేస్తా; నాను తవ్వేస్తా.

ప్రతీ.—[కొంచెము సమీపించి] ఒరేయేమిరా? మహామంత్రిగా రొకమాట అడగమన్నారు.

చాకలి ఒకఁడు.— [అనాకర్ణితకముగ, మరల పాటగా] నా నీళ్లగడ్డాల్ని
టిలు శేస్తాను రా.

,, నానీళ్ల బుర్రలతో డోర్యాలసిద్దెలు శేసుకొంటానురా.

,, నాను యీళ్ల శెవులని యిలాయి లేస్తా.

మంగలియొకఁడు.— నానీళ్ల బుర్రలు ఉడు కోయిస్తా.

,, నానీళ్ల బొర్రలు నగారా తాసామరపా బేరీ వోయిస్తా.

,, నానీళ్ల పీకలన్నీ ఊదేస్తా. [అని] యొకని మెడ పట్టుకొని
చెవిలో కీ కీ కీ అని యూఁదును.

ప్రతీ.—[ఆగ్రహముతో మరల] ఏమిరా యీయల్లరి? ఇదేమి దివాణ మను
న్నారా, రే వనుకొన్నారా?

చాకళ్లు.—[తిరిగిచూచి] ఏంటయ్యా? మామీద కోపం శేసుకుంటావు?

ప్రతీ.—పోయినచోట మీకు యిందూస్తాని వచ్చునా?

మంగళ్లు.—[పాడుచు] యీసాకలోళ్ల దియిటీ లన్నీ యెలిగించి యెతికినా,
మా పాట్లల్లో యెంత్రికముక్కంత యిందూస్తానీ దొరకదయ్యా దరమశింగూ.

చాకళ్లు.—[పాటగానే] యీమంగలోళ్ల కత్తులన్నిటితోటి మాపాట్లన్నీకో
యీళ్లశిమ్టాలతోటియెత్తి నాగుడ్డపేలికంత యిందుస్తానీ వుండదయ్యా దరమశింగూ.

ప్రతీ.—ఏమిరా యీతలపొగరు మీకు?

చాకళ్లు.—ఏడమంటావా మారాజా? మాపని యెక్కడయినా సావే. యెల్ల
టే మీరు సంపుతారు. యెత్తే ఆళ్లు శెప్పాలిశిందే లేదు. గుండెనిబ్బరం శేసుకు
న్నాం. ఆడతా పాడతా యెల్లిసస్తాం. ఆయెన్క మావెళ్లా లేడుస్తారు, మీరు నవ్వండి.

మంగళ్లు—[చాకళ్ల వీఁపుమీఁద తాళము వాయించుచు]

పాట.

లాయిరే గంజాయిరే సారాయిరే మాహాయిరే,
లాయిరే గంజాయిరే సారాయిరే మాహాయిరే.

సాకలోళ్లు సచ్చి పోతే, మంగలోళ్లు మాశి పోతే,
శిల్లిగవ్వ శెల్లనంత శీమ లేలేసామి కంత. లాయిరే.

చాకళ్లు.—మీ మంగలి డడ్లంక బుద్ది పోయింది గాదురా! 'సచ్చిపోతే' అని
పాట్టం? [మంగళ్ల వీఁపుమీఁద తాళము ఉదుకుచు]

లాయిరే ... ... ... మాహాయిరే.

సాకలోళ్లు సావకుంటే, మంగలోళ్లు మాయకుంటే,
శిల్లిగవ్వ శెల్లినంత శీమ లేలే సామి కంత. లాయిరే.

మంగళ్లు.—మీసాకలి బుద్ధికాలా, యీపులు యిరిగి పోయినయిరా, సేన్న తాళం యేశినార్రా గాడిదలూ! [అని వీఁపు తడవుకొందురు.

ప్రతీ.—కానిండి మీతాళం పట్టిస్తా.

నాకర్లు.—అయ్యకి కోపం వొచ్చింది, యిక సంపేయిస్తాడు, పారిపోర్రా రండిరా రండి. [అని నిష్క్రమింతురు.

ప్రతీ.—[మరలి మంత్రిని దఱిసి] దేవరా, వాళ్లకు హిందూస్తానీ ఏమీ రాకున్నారు. మఱివాళ్లు పెంకితనం వేళాకోళం వెక్కిరింతగా జవాబుచెప్పినారు దేవరా.

జనా.—నీవు వారలను చీవాట్లు పెట్టలేదా?

ప్రతీ—'మా కొక్కడయినా చావే, అందుకోసం ఖుషిగానే పోయి చస్తా' అన్నారు దేవరా.

జనా.—[ఆత్మగతము] పక్కా గడుసువాండ్రు. పరిచితుఁడైన ప్రతిహారియు గనిపట్ట నేరని యట్లుగా వేషభాషలు మార్చుకొని యిట నిట్లు వ్యవహరించుటచేతను నిజకార్యములందు మిగుల జాగరూకతతో మెలఁగుదు మని తెలిపికొన్నారు. [ప్రకాశము] నీచవృత్తిమూర్ఖులు. నీపని నీవు చూడుము. [ప్రతీహారి నిష్క్రమించును.

జనా.—ఈసమయమున మాసహాధ్యాయి చెరుముకిశాస్త్రిలతోడ్పాటు నే వలుచుకొనవలసినదే.

[నేపథ్యమున శంఖధ్వని.]

జనా.—అహో! లేవ సమయ మైనది!

చ. సరసిరుహాస్యకీలుజడచంగమునఁ, [1]మఱువింటిభాతిఁ, [2]శ్రే
మురమణఁ, [3]గీచకంబువలె, భోగివరేణ్యుని మేనిచాడ్పునఁ,
వరుసను శంఖరావము దివంబునఁ బర్వెడుఁ దొల్లితొల్లి వి
స్తరిలి కృశించి [4]మేచి సమతం బరిపాటిగఁ దగ్గి సన్నమై.౧౩

ఇఁక నిప్పటికి కచ్చేరి సరి. [అని అందఱు నిష్క్రమింతురు.

౧౩. సరసిరుహ ఆస్య=తామరవంటి మోముగలది-సుందరి యనుట. 1. చెఱకుగడవలె. 2. బెత్తమువలె. 3. బొంగువెదురువలె. భోగివరేణ్యుని=అనంతునియొక్క... రావ,...దునఁ=ధ్వని ఆకాశమందు వ్యాపించుచున్నది. 4. ఎదిగి.

# ద్వితీయాంకము.

స్థలము:—ఓరుంగల్లు, పఠాణీశిబిరము, వలీఖానునిడేరా.

అంతట వలీఖాను, ఖుస్రూఖాను ముస్తఫాఖాను,
ఫిరోజ్ఖాను, ప్రవేశింతురు.

వలీ.—ముస్తఫాఖాన్, ఏలాగ యీదేశం పట్టడానికి నీకీ యిష్టం?

ముస్తఫా.—సర్దార్ సాహేబ్, రాజ్యానచ్చేతల్కీ, మన్ము పట్ణం పట్టివేస్తే రాజా యిటువైపు మరి రానేరాడు. ఖజానా మన చేతులో పడి పోతుంది. యెల్లి దండూకి డబ్బులేక లడాయి శెయ్యడానికి వీలు వుండదు. అడ్డుఆడ్డుగా మన్ము అన్ని పర్గణాలు కొట్టవచ్చును.

వలీ.—ఖుస్రూఖాన్, నీకీ యిష్టం యేలాగ వుంది?

ఖుస్రూ.—సర్దార్ సాహేబ్, నాకీ యిష్టం యిది. పట్ణంలో దండూ విస్తారం వుంది, ఖజానా విస్తారం వుంది, రస్తు విస్తారం వుంది. వఖుషంవచ్చరమైనా భైటిది దమ్మిడి సామాను అక్కర్లేకుండ ముట్టడికి నిలుస్తుంది. అనుమకొండలష్కర్ ముట్టడి దండూకీ చుట్టుకొంటుంది. నూటికి తొంభైతొమ్మిని దాన్కి రాజా స్వయం నడిపిస్తాడు. అప్పుడు మనఘతి హడకత్తులో వక్షగతి అవుతుంది. అందుచేత సాహేబ్ నాకీ యిష్టం యేమంటే, మన్ము దండంతా నడ్పుకొని, రాజా యెక్డ వున్నాడు అక్డ వెల్లి, రాజాకి వేటశిబ్బంది కొంచెం వుంటుంది గన్క, ఘళభంగా రాజాకి పట్టుకొని, దేసం హంతా స్వాధీనం పుచ్చుకొని, యిక్కడ యీదండుతో తమరునబాబ్ మేము గులాం వుండవచ్చును.

వలీ.—ఫిరోజ్ఖాన్, నీకీ యిష్టం యేమి?

ఫిరోజ్.—ముందు రాజాకి పట్టి సఫాయి శేస్తే తర్వాత ఓరంగోలుకి పట్టవచ్చును. రాజా హసలే లేకుండా వుండే తప్పుడు, తమ్ముడు కూడా లేనప్పుడు, పెద్దమంత్రి కూడా లేనప్పుడు, యెవడూ యెవడికీకోసం యుద్ధం చేస్తాడూ? మనకీ రాజధాని పరగణాల్ దేసం సర్వం ఛణంలో స్వాధీనం అవుతుంది.

వలీ.—మీరు వఖు చెప్పినదానికంటే వఖు చెప్పిందిభాగావుంది. నామతం యేమంటే—

దౌవారికుండు.—[ప్రవేశించి] సర్దార్ సాహేబ్ బొమ్మక్ వఖు దర్శనానికి వచ్చివున్నాడు, 'కొంచెం వుండు' అంటే, 'వుండవం లేదు' అని గడ్బిడా శేస్తాడు. నేను అడ్డం నిలిస్తే నాకి భైటిదర్వాజా అవతల పడేలాగవిసిరి వేసినాడు. సాహేబ్. వాడు సూడడానికి బొమ్మక్, తొయ్యడానికి సింహం వున్నాడు! నేను పొడిచెయ్యాలా వుంటాను సాహేబ్

అంతట చెకుముకిశాస్త్రి ప్రవేశించును.

చెకు.—పోరా, పూర్వసువాసినీ! నీవా నన్ను పొడచువాఁడవు? [ఆత్మగతము] నేనే చెకుముకి నఁట, నీబోంట్లను వేనవేలను భస్మీకరింపనా? [అందఱను జూచి, వలీ ఖానునిఁ జూచి, ఆత్మగతము] వీ రందఱు నన్నుఁ జూచుటయు వీనిముఖము చూచుటయు. వీఁడే వీరిలో ప్రభువు. [వలీఖానుని నిర్దేశించి, ప్రకాశము] సలాము వలీఖాను బహద్దరు గారు, మీకు అఖండదిగ్విజయ మున్నది.

ఉ. సాహెబ, [1]నీకుఁ జంద్రుఁడు మషాలు, దినేంద్రుఁడు డాలు, వాలునా
లోహితుఁ, [2]డుక్తి గీష్పతి, [3]యులు త్తవిలు త్తదృశుండు మంత్రముల్,
రాహువు [4]పట్టుఁ, గేతువపరాజిత [5]కేతువు, [6]సౌమ్యుఁడా ప్తుఁడుల్,
సాహస[7] మర్కజుండు, నయి[8] శాశ్వతికప్రభుతల్ రచించుతల్. ౧

వలీ.—[ఆత్మగతము] అరే, ఇత నెవరు? నాకీ యేలాగా తెల్సుకొన్నాడు! జనార్దనమంత్రి యేమయినా పంపినాడా? [ప్రకాశము] ఎవరు పంతులూ, మీరు?

చెకు.—మేము పంతుళ్లము గాము. మేము జోస్యులము, శాస్త్రులవారము. పేరు యమధర్మరాజశాస్త్రులు. నాబాల్యములో,

క. ఆట నరఁటిపండుగ నా
వ్రేటుఁబిడుగు వడినప్రాణి వెంటనె నీల్గున్;
సాటికి విబుధులు నను నవు
లాటగ యముఁ డనఁగ నాకు నదె పేరయ్యెన్.

౧ 1. చంద్రునికన్న వేఱు దివిటీ లేక అల్లాడెదవని ధ్వని. ఇట్లే పద్యము తటను గూఢాభిప్రాయము నూహించుకొనవలయును. లోహితుఁడు=అంగారకుఁడు ఆలోహితుఁడు కొంచెము ఎఱ్ఱనివాఁడు, కొంచెమే నెత్తు రంటినట్టిది-సరిగా శత్రు సంహారము చేయఁజాలనిది-అని ధ్వనితము. 2. మాట బృహస్పతి-వాక్పటిమయేగాని క్రియా కౌశలము ఉండదని గూఢ భా. 3. పోయిన కన్నొకటి పోని కన్నొకటి యు ఎవనివో ఆతఁడు-శుక్రాచార్యులు-మంత్రాంగము అరగ్రుడ్డిగా నుండు నని తాత్పర్యము. 4. నిన్ను పట్టునని గూఢ భా. అ+పరాజిత=ఓడినది కాని-అ+పర+అజిత=ఇతరులచే జయింపఁబడినది కానట్టి, కేతువు=జెండా. 5. బుధుఁడు మెత్తనివాఁడు-యుద్ధమునకు పనికిరాఁడు-అని ధ్వని. అర్కజుండు=శని-శని మందుఁడు వాఁడు గాన సాయెబు సాహసము కుంటువడు నని ధ్వని. అర్కజుఁడు యముఁడు గావున నీసాహసముచేత చత్తు వనియు భావము.

వలీ.—మీకి మంత్రిగారు పంపినారా యేమి?

చెరు.—వాఁడెవఁడు నన్నుఁబంపుటకు? వాఁడు పంపిన నేనేల వత్తును? నేనేమి వాని నౌకరనా? నేను నాస్వబుద్ధిచేత నే వచ్చితిని.

వలీ.—[ఇతరులం జూచి] దివానా క్యా?

చెరు.—దివానా కచ్చేరి తీరి యున్నాఁడు.

ఇతరులు మువ్వురు.—[నవ్వి] మనభాత్ తెలియదు. దివానా అంటే, దివాణా అనుకున్నాడు.

చెరు.—ఉన్నమాటకు నవ్వనేల?

వలీ.—[మరల నవ్వి] కూర్చోండి సాస్తుర్లూ, మీరు చాలా తమాషామనిషి వున్నారు. మీకి మేము ఫలానా యేలాగ తెల్సింది?

చెరు.—మతి నా దేమి వంకాయల జోస్యము బెండకాయలజోస్యము అనుకొన్నారా?

వలీ.—మీరు సెలవు లేనిదీ మామభలోకి రావడం సరేనా?

చెరు.—ఓహో! ఏమి పరోపదేశపాండిత్యము! మీరు ఎవరి సెలవుమీఁద వచ్చినారు ఈప్రతాపరుద్రుని రాష్ట్రములోనికి? ఎవరిపని వచ్చినప్పుడు వారు ఆలాగే అనుకొండి చూచినారా నాజోస్యముదెబ్బ?

వలీ.—[ఆత్మగతము] అరే 'ప్రతాపరుద్రుని' అంటాడు. 'గారూ' చెప్పలేదు. 'రాజా' చెప్పలేదు. ఇత డేమి ఆయన్కి ద్వేషుడా? [ప్రకాశము] అయ్యా, మీరు సామాన్యపుజోస్యులు, ఏకాకి, మీకి యింత సాహసం మంచిది వుండ లేదు. మహారా జవాబ్ పొడిచేసివుంటే మీపని యేమై వుండును?

చెరు.—నేను ఎమాన్యపు జోస్యుఁడనుం గాను. నాకు మాన్యాలు లేవు, సంపాదించుకొనుటకే మీదగ్గఱకు వచ్చితిని. నేను ఏకాకినిం గాను, హోష్ అన్న పాము. పొడిచేసిన పొట్లము దమ్మిడి. నేనే యమధర్మరాజనే నన్ను పొడిచేయువాఁడెవఁడు? నామీఁద మొదట ఆయుధములు ప్రయోగించువారు ఐదుగురు నా చేతచత్తురు, వారిచే నేను చావను అని నా జాతకము. ఆపైమాట చూచుకొందము. పంజా పట్టిన, నేను విడిచినచేయి ఎప్పటికి కుదురునో నేనే చెప్పవలయుఁగదా.

వలీ.—[కుతూహలముతో] అయితే సాస్తుర్లూ, మీరు వచ్చినపని యేమో తొందరగా చెప్పివెళ్లండి, మేము జరూర్ పనిలో వుంటాం.

చెరు.—ఇంతేగదా మీశక్తి? నాపని మీకు తెలియదు. మీపని నేనుచెప్పెదను, చూడుఁడు—'రాజును ముందుపట్టుదుమా, రాజధానిని ముందు పట్టుదుమా?' అని మంత్రాంగము చేయుచున్నారు. [ఖానులు ఒకరిమొగ మొకరు చూచుచున్నారు].

చెను.—మతి నేను వచ్చినపని చెప్పుదునా ?

వలీ.—చెప్పండి సాస్తుర్లూ చెప్పండి.

చెను.—[దౌవారికుని నిర్దేశించి] వీని నవలికి పొమ్మనుఁడు, లేదా, వ్వే పంపుదునా ?

వలీ.—జావురే జావు. [దౌవారికుఁడు నిష్క్రమించును]

చెను.—[దౌవారికు నుద్దేశించి] ఓరీ. ఇఁక నెప్పుడును నన్నడ్డకు. తప్పక ముందుగా నాకొక ఖబరారు చేయవలయును. నాకు ప్రాణముమీఁద ఆశలేనేలేదుగాని,

ఖానులు.—[ఆత్మగతము] అది తెలుస్తూనే వుం?.

చెను.—మానముమీఁదమాత్రము ఆశ బలిష్ఠము.

ఖానులు.—[ఆత్మగతము] అదిన్ని తెలుస్తూనే వుంది.

చెను.—జోస్యము రెండు భాగములు. సిద్ధాంతము విద్ధాంతము అని. అం లో నేను మొదటిభాగముమాత్రమే చదివితిని. ఈప్రతాపుని జోస్యుఁడు రెండవ భాగముమాత్రమే చదివినాఁడు.

వలీ.—[ఆత్మగతము] మల్లీ 'ప్రతాపుడు' అని బలే హగౌరవం చేస్తాడు!

ఫీరోజు.—మీరెందుకు రెండుభాగాల్ సద్వకుండా జోస్యం చెప్తా వస్తారు మాకాడికి ?

చెను.—రెండవభాగము చదివినయెడల మీదగ్గఱకు ఎవరు వత్తురు ?

ఖుస్రూ.—ఆరెండోభాఘం మాకీ పన్కిరాదా ?

చెను.—మతీ అదేమో దానిస్వరూపము చెప్పెదను, పనికి వచ్చునో రా మీరే తెలిసికొండి.

వలీ.—క్యారే! చాపఅని ముసలినోట చెయ్యిపెట్టినాం.[శాస్త్రి నుద్దేశించి] మీ రెండోభాఘం అంతా ఇక్కడ వప్పగిస్తారా యేమి సాస్తుర్లూ ?

చెను.—ఆ రెండవభాగము నాకు రాదయ్యా అనుచుండఁగా దాని నప్ప చెదనని భయపడెద రేమయ్యా !

వలీ.—పోనీపోనీ. అయితే చాలా సంతోసం. అది మాపుణ్యాం.

చెను.—ఆ రెండవభాగమే మనఁగా ?

వలీ.—మల్లీ ఆ రెండోభాఘం ఆరంభించినావే సాస్తుర్లూ!

చెను.—అయ్యో, రెండుమాటలు విని తర్వాత ఆక్షేపింపుము.

వలీ.—మతీ యేమిగతి ? కానీ.

చెను.—ఆ రెండవభాగము మొదటిభాగమును ఖండించును. మొదటిభాగము రెండవభాగమును ఖండించును, రెంటిని చదివినవానికి మొత్తము జోస్యమునందు

వలీ.—హాల్లా ! హాల్లా !

చెరు.—శివ శివా ! శివ శివా !

వలీ.—సాస్త్రుల్లూ, మాకి ఆమొత్తం సున్న చెప్పి వెల్లండి, చాలును.

చెరు.—అట్లే చేసెదను. ఒకటొకటిగా చెప్పి మొత్తము చేసి సున్న చేసి చెప్పెదను. కనుక, విను, ఆరెండవభాగము మరల రెండుభాగాలు.

వలీ.—హాల్లా ! హాల్లా ! ఏమి గహచారం వచ్చిందిరా యీరోజ్ !

చెరు.—శివశివా! శివశివా! ఏమియోగదినమురా యీదినము! ఆరెండుభాగాలు ఏవనఁగా—(1) ఉన్నది లేనట్లు చెప్పుట. (2) లేనిది ఉన్నట్లు చెప్పుట.

ఖానులు.—[ఆశ్చర్యపడి, కడుపులు పట్టుకొని నవ్వుచు] అరే బలే తమాషా బ్రాహ్మణ్ ! బలే తమాషాబ్రాహ్మణ్ !

చెరు.—తమాషా బ్రాహ్మణుఁడను నేను గాను, తమాషాబ్రాహ్మణులు మీ యూరిపు గాడబ్రాహ్మణులు.

ఖానులు.—కానీ పండత్ సాబ్.

చెరు.—మొదటిభాగమే మనఁగా. అదియు రెండుభాగాలు.

వలీ.—(1) ఉన్నది ఉన్నట్టు చప్పడం, (2) లేనిది లేనట్టు చప్పడం, అదే నా సాస్త్రుల్లు సాబ్ ?

చెరు.—సందేహ మేమి? ఆహా !ఆవులించినఁ బేవులు లెక్కపెట్టు బుద్ధిగాని సాహస్యమా ! మఱి మొదట అవసరపడ్డారే? ఇది సిద్ధాంతము, అది విద్ధాంతము.

ఖానులు.—అచ్చా ! అచ్చా !

చెరు.—మఱి యిప్పుడు చెప్పుండు, మొదటిది మాని రెండవదిమాత్రము తెలిసి వచ్చిన మీకు పనికి వచ్చునా ?

ఇత. ముప్పు.—నకో నకో.

చెరు.—మఱి నేను కోరుకోరికను మీరు నెఱవేర్చినను మానినను సరియే గాని, నేను మీకడకు వచ్చుట ఈపట్టణమువారి కెవ్వరికిని ఈదేశపు హిందూప్రా ణి ఎవ్వనికిని మీరు తెలియనీయఁగూడదు. ఇది నేను కోరినఖరారు. ఈఖరారు భంగము చేసిన, నా కథ నేను క్షణములో ముగించిపోయెద. పహారాజవానును కేకే సర్దుకొనెదను లెండి.

ఖానులు.—ఖరార్ సాస్త్రుల్లూ, ఖరార్. మేం ఎవరికీ చెప్పం.

చెరు.—మఱి వినుండి. ఆస్థానపుజోస్యుఁడు అది చదివినాఁడు. ఈస్థానపు జోస్యుఁడను ఇది చదివితిని. ఇందువలన అతనికి నామీఁద బద్ధద్వేషము కలిగినది ; ఆ జోస్యులలోనే ధాయచకుఁ నాఁడు. యాచకో యాచకః శత్రుః తెలియదా? నేను

ఆఱుసంవత్సరాలు ఆతని నాశ్రయించితిని, రాజదర్శనము చేయింపు మని. చేయిం నాఁడు గాఁడు. ఒకనాఁడు తెగఁబడి రాజునెదుటికిఁ బోయి ఆశీర్వచనశ్లోకము పలికితిని. అంత నతఁడును ఈజోస్యునిమాటమీఁద నన్ను 'ఏమి యీబోడిబాపని సాహసము!' అని తిట్టినాఁడు. అంత నేనును 'బోడియే నీపాగ రణచునట్లు' అని ప్రతిజ్ఞ చేసి వెడలి వచ్చితిని. బ్రాహ్మణుఁడనని రాజు నన్ను మిక్కిలియు చేయ లేదు. యమధర్మరాజనని బంట్లెవ్వరును నామీఁదికి రాలేదు. మీరు మహాప్రాజ్ఞులు ముందు నీ కీయవమానప్రాప్తి జోస్యమువలన తెలియలేదా? అని యడుగ వచ్చు

ఇత. ముప్వ.—అచ్ఛా! అచ్ఛా! అదే అడ్డవాలా వుంటాం.

చెను.—ముందు తెలిసినందుననే తప్పదుగదా అని పోయి అనుభవించితి.

ఇత. ముప్వ.—అచ్ఛా! అచ్ఛా! వహవ్వా! వహవ్వా!

చెను.—నాప్రతిజ్ఞ కూడ జోస్యమువలన చేసినదే.

ఖానులు.—అచ్ఛా! అచ్ఛా!

చెను.—మఱి నాప్రార్థన యేమనఁగా,

క. మీ కేఁ జెప్పెద జోస్యము,
నాకున్ సుల్తానుదర్శన మిడుఁడు మీరల్,
లోకేశు నతనిఁ గాని నే
నీ [1]కుటిలమతుల [2]వెలార్తు నిర్వర [3]నుడిలోన్.

ఇత. ముప్వ.—[సచమత్కారము] మీకీ మేం జోస్యులా వుంచుకొంటే మాకిసిద్ధాంతంజోస్యంచేప్తారా, లేక్పో తేదానిపేర్ రాలేదు ఆరెండోభాగుంచెప్తారా

చెను.—ఆహా! ఆహా! మీ కే మయ్యా క్షణములో నే యింతపరాక్రమై ఆరెం డవ భాగము నాకు రాదయ్యా;

ఖుస్రూ.—హౌను, హౌను. అచ్ఛా, అచ్ఛా.

వలీ.—మంచిది. మీకీ మేం అవలంబిస్తే మాకీ యేమీ ప్రయోజనం? మీరు జరిగేది చెప్తారు. దానిచే ముందు మేం ఎర్గినా అదే జర్గుతుంది. ఎర్గకా పోయినా అదే జర్గుతుంది. మీజోస్యంవల్ల మాకీ యేమి కిఫాయిత్ ?

చెను.—అటయిన జరుగనిదానిని చెప్పవలయునా? ముందు తెలిసిన అను లోపమే ఆధైర్యమే ఫలము. మఱి,

మ. నను రక్షింపుఁ డటంచు డాయను మిము, న్నాకింక మే లేయగున్, బనిగొందు న్నృపు భక్తుఁగా నతఁడు న న్నాట్రించుఁబో వేల్పుగన్



టి. 1. దుష్టబుద్ధులను. 2. నాశముచేయుదును. 3. మాటలో-క్షణములోననే

మును ము న్వానికి నన్ని జోస్యపువహీఁ బోధించి యాప్తుండనై,
నెనువెంటఁ మెడఁబట్టి గెంటెనఁ జుమీ విద్ధాంతి రాద్ధాంతినై.

వలీ.—అప్పటికి మీప్రతిజ్ఞ అబద్ధం కాదా?

చెసు.—అ దెట్లు? నాకు పాదాక్రాంతుఁ డయిన, బోడివలన పొగ రణఁ చు కాదా? బోడిబాపనవాఁడని నన్ను తిట్టలేదా? నాకు విద్ధాంతము రానిమాట క్షణములో మీకు పరా కౌను గాని, మీరు ప్రశ్నలుమాత్రము కడు చాకచక్య ముగా వేయుచున్నారు. చెప్పఁడు మఱి, 'బోడి పొగ రణఁచు' ననఁ గా ఎవరని తర్కము చేసెదరు?

వలీ.—ఊరేఁ మాటవరసాకీ చెప్తాం. ఎవరైనాతురకలే యెందుకు కాదు?

చెసు.—బోడిబాపనవాఁడను గాన మొదలు నే నొకబోడిని; నాకన్నమీరు ...డి, నాకు జుట్టున్నది, మీకు అది లేదు; మీకన్న మాసన్న్యాసులు బోడి,మీకు ...మున్నది, వారికి అది లేదు; అందఱికన్న మాపూర్వాసువాసినులు బోడి. వారికి ...ము మొలవ నే మొలవదు. ఇందఱిలో ఆజోస్యపుబోడి యేబోడి గారాదు?

వలీ.—మీతో మేం మాటాకి మాటా చెప్పలేం సాస్తార్లూ.

చెసు.—కనుక. నాతో వాదము పెంపకుఁడు, ఏబోడియో నే నిప్పుడు ...ప్పను. నన్ను మీ రవలంబించెద మని ఖరారు చేసిన, అప్పుడు మీనము మేషము ...ంచి చెప్పెదను; చేయనియెడల రెండవమార్గమును చెప్ప నే చెప్పితివి. ఆయన ...ను ఓడినను మిమ్ము గెలిచినను నాకు పాదాక్రాంతుఁ డగుట తప్పదు.

వలీ.—[జనాంతికము] ఖుస్రూఖాఁ, ఇతడు మనకీ పనికి వచ్చునా?

ఖుస్రూ.—[జనాంతికము] బలేసామర్థ్యుడు, రాజాకి ద్వేషి. మనవల్ల గొప్ప కార్యం కోరినాడు, మనం ఖరార్ చేస్తే మనపచ్చం వుంటాడు, అక్కడవి సంగ ...లు శీదా మనకీ చెప్తాడు. ఈ డోబీలు హజాంలు ఇతనిముందరా ఏపాటి?

వలీ.—[జనాంతికము] అటయితే వుంచుకొందుమా?

ఖుస్రూ.—[జనాంతికము] నామతం అదే.

ముస్తాఫా ఫిరోజులు.—[జనాంతికము] మామతం కూడా అదే.

చెసు.—సమ్ముఖమున రాయబార మేమి? ఇఁక మీ యాలస్యమే గాని నా యాలస్యము లేదు. నన్ను పంపివేసి మీపని మీరు చూచుకొనుఁడు.

వలీ.—సాస్తుర్లూ. ఏబోడీ అయితే మాకి యేమి? మేం మహారాజావారితో ...నానికి వచ్చినాం గాని లడాయికీ రాలేదు.

చెసు.—నావగ్గఱనా టక్కులు? పాపము! మీరు రాజమిత్త్రులు, రాజ ...నిని నన్ను చేర్చుకొన సంకోచించుచున్నారు! నన్ను తమాషాబ్రాహ్మణుఁ ...న్నారు, మీరెం... ...సాయము అయ్యా?

వలీ.—[జనాంతికము. ఖుస్రూతో] ఇతడు బలే దుర్మార్గుడు, బలే పగపట్టే వాడు, మనం తిరస్కారం చేస్తే మన సరంజాం లడాయికి అని యితనికి యిప్పటి తెలిసేవుంది గనక వాళ్లకీ చెప్పి వాళ్లకీ మస్మీదికి తయ్యార్ చేస్తాడు; అందు కోసం యితనికి మనపచ్చంలో వుంచుకోవడమే షరి, అని మాకీ తోస్తుంది.

ఇత. ముప్వ.—అచ్ఛా. అచ్ఛా.

వలీ.—సాస్తుర్లూ, మీరు మాతో భాయిభాయి వుండవాలా. మీరు అడిగే దంతా మేం చేస్తాం, మీరు షరీ జోస్యం చప్తే మీాకి బంగారంలో పాతీయేస్తాం, ఝూటాజోష్యం చప్తే మట్టిలో పాతీ యేస్తాం.

చెకు.—'నిప్పులో' అనుఁడు. మట్టిలో పాఁతుట తురకలనే.

వలీ.—పోనీ, ఆలాగే కానీ.

చెకు.—నేను మీాబంగారముకోసము రాలేదు. మఱి నేను సరిజోస్యత చెప్పిన, నాకు సుల్తానువారిదర్శనము మీరు చేయింపకపోయిన, మీా కేమి నియ మము? నా రాక నిచట బయలువుచ్చినను, అందుల కేమి నియమము?

వలీ.—మీారే కోరుకోండి.

చెకు.—కోరినట్లు ఒప్పుకొందురుగదా, మాట తప్పరుగదా?

ఖానులు.—మేము మాటా తప్తామూ?

చెకు.—అటయిన మీా రయిదుగురు ప్రత్యేకముగాని కలసిగాని నాతో కత్తియుద్ధము చేయవలసినది. [ఖానులు మొగములు చూచుకొందురు.

చెకు.—మఱి తప్పదు.

వలీ.—ఖరార్, ఆలాగే మీాతో యుద్ధం చేస్తాం.

చెకు.—వారినోట రాలేదే ఆమాట.

ఇత. ముప్వ.—ఖరార్, ఆలాగే మీాతో యుద్ధం చేస్తాం.

చెకు.—మఱి రండి, భాయి భాయి భాయి భాయి. [అందఱిచేతను చేయి చేయివేయించుకొని] మఱి యీచాకళ్ళకు మంగళ్ళకు నేను తెలియఁగూడదు. నా ము దారిలో వేషము మార్చుకొని తురక వేషమున వచ్చి తురక వేషమునే యుం దును. నాకు తురకదుస్తు తెప్పింపుఁడు భాయి.

వలీ.—అచ్ఛా బహద్దర్! అచ్ఛా బహద్దర్! మేమే ఆపని చెయ్యవాలా వుండింది, మాకీ మీాగడ్బిడాలో ఏమితోచలేదు, బాగా జ్ఞాపకంచేసినార్ సాస్తుర్లూ,

చెకు.—శాస్త్రులు అనకుఁడు, భాయి అనుఁడు,

వలీ.—అచ్ఛా అచ్ఛా! బాగా జ్ఞాపకం చేసినార్ బడాభాయి. [అని స్వగతము గా పోయి, చేటలు ... దుస్తు తెచ్చి చెకుముకి శాస్త్రికి ... డుగును.

చెకు.—[ఆత్మగతము] ఇట్లు సద్యఃఫల ముండవలయును. [ప్రకాశము] ఇఁక మీకు నావలన నాలస్యము వలదు. నేను మీకు భాయినే గాని నౌకరను గాను గదా, కావలసిన దైనప్పుడు మీదర్శనానకు వచ్చెదను. ఇప్పటికి సెలవు. సలాము, సలాము, సలాము, సలాము.

ఖానులు.—సలాం.

వలీ.—ఖరార్ చేసినాం, భాయి అయినాం; ఆజోష్యపుబోడి యెవరో చెప్పండి భాయి.

చెకు.—[సోత్ప్రాసము] మీరు సఖ్యానికి వచ్చినారు గదా. జోస్యపుబోడి బోడియైన మీకేమి? [అని నిర్గమించుచు, పహరాజవానుం గని] ఏమిరోయి, [కనుస్తుచూపుచు] నాదెబ్బ చూచితివా? ఇం కొకమాటు పంజా పట్టెదవా? పోపో, నాతో కొంచెము కత్తి త్రిప్పుదువా? విక్రమార్కుని బుట్టి ఉజ్జయినిలోఁ బడిన, నీబుట్టి గిజగిజ తిరుగుచు, నన్ను వెక్కిరించుచునే లే, పోయి ఢిల్లీలో నీ పెండ్లాము నోడిలోఁ బడును.

జవాన్.— సలాం పండత్ సాబ్ సలాం.

చెకు.—ఆ, అట్లు పలుకు. ఇప్పుడు బుద్ధి మంతుఁడవు. [ఆత్మగతము] అబ్బ!

క. తెలివి నభినయించెద రీ
తులువలు, వీరలను గంట దుమ్మున వైతున్,
గులగుల తెక్కలు దూసిన
[1]పులుఁగులఁ గావింతు, [2]గడిఁదిబూమెల నొంతున్. 22

[అని నిష్క్రమించును.

ఇత. ముప్పు.—ఇత డెవరో అసాధ్యుకు సర్దార్సాహేబ్!

వలీ.—ఔను. ఇతడు మనపచ్చంవుంటే జనార్దనుడికి సాధించవచ్చును. తప్పు; ము. లీవస్తే మనపచ్చం వుంచడాన్కి జాగ్రత్తగా చాలాన్ణేమ్హం చెయ్యండి. ప్రస్తుతంయితని జోస్యంవల్ల మనకీ యేమీ ప్రవోజనం లేక్పోయింది ఇతడు యెప్డు వస్తాడో, వస్తాడో రాడో కూడా తెల్వదు. ఇతనికి యెదు ర్చూచి మనయేర్పాట్లు చూపడం మార్చుకోవడం బాగా లేదూ. గన్కా మాయేర్పాట్లు యేమంటే—

ఇత. ముప్పు.—సర్దార్, శెలవియ్యవాలా.

వలీ.—పట్నం పట్టడం మనకీ అసాధ్యం. కనక మేం కొంచెం దండుతో జంగలికి వెళ్లి, రాజా కి ఖైదీపట్టి డిల్లీకి వెళ్లి పోతాం. మీకీ కభుర్ చేసాం. మీరు తచ్చ తం ఖుస్రూ సర్దార్ వుండి పట్నం పట్టుకోండి. పర్గణాల్ పట్టుకోండి; రాజావచ్చి మేము

ప. 1. పక్షులను, 2. గడ్డ ... సాధించెదను.

రాకపోతే ఆరాయబారం జరపండి. పైయాలోచన మీకే తెల్సును. ఇంతలో మే కల్సుకొంటాం.

ఇత. ముప్ప.—అచ్ఛా, సర్దారిచ్చిత్తం.

వలీ.—మేం లేనప్పుడు ఖుస్రూ సర్దార్, దేషం గీషం పత్తే ఖుస్రూ సర్దార్. మా ప్రయాణానికి సరంజాం చేయించు ఖుస్రూఖాన్. ఇక కచేరి మర్ఖస్.

ఖుస్రూ.—ఇప్పుడే సరంజాం సిద్ధం చేస్తాన్.

ఇత. ముప్ప.—సలాం సలాం సలాం.

[అందఱు నిష్క్రమింతురు.

ద్వితీయాంకము సమాప్తము.

---

# ప్ర వే శ క ము.

---

స్థలము.—ఓరుగల్లు, కోటలో రాచనగరు.

అంతట ఇద్దఱు చేటికలు ప్రవేశింతురు.

ప్రథమ.—అక్కా జయా, యేమే నీ వేమో దిగులుపడుచున్నావు?

ద్వితీయ.—వొశే కళావతీ, నీతో చెప్తే నీవు కూడ దిగులు పడుతావు.

కళా.—అటయితే నీదిగులు సగంతగ్గుతుంది. కనకమణి చెప్పకుండా వొట్టి

జయ.—వొట్టెందుకే, చెప్తాను విను.

కళా.—యిదుగో నాగస్వరాన్ని పాము ఆలకించేలాగ ఆలకిస్తూవున్నాను.

జయ.—రాణీగారికి దుస్వప్నమైయింది. దానివల్ల యేలినవారికి కీడు వస్తుందని రాణీగారు దిగులు పడుతున్నారు; అందుచేత నేనున్ను దిగులుపడి వున్నాను.

కళా.—యీ రెండింటిచేత నేనున్ను దిగులుపడుతూవున్నాను.

జయ.—నన్ను తక్షణం వెళ్లి, శాంతి చెయ్యించడానికి పురోహితుడు మహాదేవయ్యని తీసుకొని రమ్మన్నారు.

కళా.—మహాదేవయ్యని పిలుతాం రా మరి.

జయ.—పిలిచివొస్తిని, పద వొస్తా నన్నాడు.

మఱియొకచేటి రోజుచు ప్రవేశించును.

జయ.—వొశే కాశీ, యెక్కడినుంచే యీ రోజుతూ రావడం?

కాశి.—ఓహో జయాకళావతులా!

జయ.—నే నడిగిన మాట చెప్పు.

కాశి.—యీ యడావిడిలో రహస్య మేమి? చెప్తాను. దేవిగారు మంత్రి గారికి కబురు పంపినారు: 'యీతురకదాణువును మనసైన్యములు కంటగిస్తూవున్న

యిక్కడికి రానియ్యడ మేమి? యిన్నాళ్లు యిక్కడ వుండనియ్యడ మేమి? మా దేశం వెళ్లగొట్టవలసింది.' అని.

ఇతరులు.—మంత్రిగారే మన్నారు?

కాశి.—పెద్దాయన వూళ్లో లేరుగదా. చిన్నాయన యీమాట చెప్పినారు:- రేపో అన్నగారొస్తారు. వారొస్తానే వీళ్లని యీలోకంనుంచే పంపించే అందాకా వోపిక చెయ్యండి.' అని. మరి నేను మసలరాదు; ఆవిడకు తక్షణం చెప్తాను.

జయ.—అల్లడుగో కలకి శాంతి చెయ్యడానికి మహాదేవయ్య వొస్తున్నాడు. వెళ్దాం రండి ఆవిడదగ్గిరికే. కన్నతల్లి రుణమైనా తీర్చుకోగలంగాని యీతల్లి తీర్చుకోలేము, రండి రండి. [అని నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

---

# తృతీయాంకము.



స్థలము 1:—గోదావరిదక్షిణతీరమున అడవిముఖము, ముగ్గురు తురకసిపాయిలు ప్రవేశింతురు.

ప్రథముఁడు—[మూడ్కి నిగిడించి] అరే! బలారే! ఆమైధానంలో యెట్వంటి వుందిరా!

ద్వితీయుఁడు.—[చూడ్కి సారించి] ఔనారీ! అ దేమిరా అంతా ఆకుప వరణం వుంది?

తృతీయుఁడు.—అది యేమి హందం వుంది రా! నెమ్లిపిట్టలాగా వుంది. సవార్ అదీ మేఘూత్మే యెగ్రీ పోతుంది నాకీ తోస్తుంది భాయి.

ద్వితీ.—ఇది రాజాపక్షిం కావాలా, యేటామేషం అంతా ఆకుపసర్, జీన్ పచ్చల్ నగల్ వేసి వుండవాలా భాయి; లేదా—

తృతీ.—ఏమి పచ్ఛాంతరం?

ద్వితీ.—పచ్ఛాంతరంలో మనకీ ఖలో, స్వప్నమో, పన్నీపాతమో, కావా లేదా—

ప్రథ—లేదా, అదీ దయ్యం, జిన్, పిసాసీ, సైతాన్, కావాలా.

తృతీ.—అదీ దేవుడీ హావతారం కావాలా.

ద్వితీ.—అదీ [illegible] భాయ్!

తృతీ.—దాన్కి రెక్కల్ వుంటే అదీ చిల్కా అయితుంది, కల్కల్కల్కల్లుక్కుతుంది. దాన్కి పరికిణీ కట్టి తాబొందూ కుడితే అదీ కంచెన్ అయి తైతై తైతై తకతై తకతై నాట్య మాడుతుంది. అదీ పక్లిస్తే పంగీతం అయితుంది తే

ప్రథ.—మొహంతో పక్లిస్తే మొహానా.

ద్వితీ.—నోటితో పక్లిస్తే నౌవ్రోజ్.

ప్రథ.—కంఠం ధుల్పితే ఖమాజ్.

ద్వితీ.—కాలితో తంతే ఘంటా.

తృతీ.—అదీ రస్తామే ఖుపం తొక్కితే రస్తా అంతా ఖంగ్ ఖంగ్ ఖంగ్ ఖంగ్ మార్చింగ్ వాయిస్తుంది; దాన్కి భూమీ అంతా వీణా పాడుతుంది.

ప్రథ.—ఆ పంలోపానికి హాశ్చర్యానికి చెట్లూ అంతా తలా ఆడించవు.

ద్వితీ.—అపంలోపానికి హాశ్చర్యానికి మన్ము అంతా గడ్డం ఆడించవు.

తృతీ.—అరే యిదీ సుల్తాన్ వారికి నజర్ చెయ్యవాలా.

ద్వితీ.—[తృతీయునితో] ఆరే సర్దార్ బహద్దర్‌తో తచ్ఛనం వెల్లీ నీవు చెప్పరా. నీవైతే బాగా చెప్పగల్తువు.

తృతీ.—నేను తచ్ఛనం వెల్లీ, "సర్దార్ సాహెబ్ ఘోడా, ఆరబ్బీ గాదు పార్సీ గాదు, అజాన్ గాను, తుక్షార్ గాదు; హిందూకే పాతాళంలో నాఘేంద్రుడు వుంటాడే, వాడిదీ నడిమితల్కామణీ చెక్కి ఘోడా చేసి, దాన్ని వాళ్ల దెంపి దేవుడు ముక్కులో వూధి ప్రాణం చేసింది; మైధానంలో మేస్తూ వుంది; పట్టుకుం?" అని అడ్గుతాన్.

ప్ర. ద్వి.—హారే నీవు ఫెద్దూషికన్నా యెక్వా కవి. జల్దీ పోరా.

[తృతీయుఁడు తెరలో, ఘోడా ఘోడా అని అఱచుచు పోవును.

వెంటనే మఱియిద్దఱు సిపాయీలు ప్రవేశింతురు.

చతుర్థ పంచములు.—గోడా క్యారే? గోడా క్యారే?

ప్రథ.—అల్లద్గో చూడు.

చతు. పంచ.—[చూచి, ఆశ్చర్యపడి, మఱియొకవైపున చూచి నిగిడించి] అరే, అద్దా చెట్టుకింద మన్సీ వఖ్ డు పరుండి నిద్రపోతూ వున్నాడు భాయ్. వాని కోడా అంతా పచ్చల్ దుస్తు; జిగ్ జిగ్ జిగా మెరుస్తాడు.

ద్వితీ.—అరే నాకీ తోస్తుంది, వాడు రాజా, ఇది వారిదీ ఘోడా, అంతే యేటాయేషం.

అందఱు.—[కలయం గని] దండు గిండు శేదు భాయ్. [హర్షాశ్చర్యములతో] అరే! మన్ము రాజాకి పట్టినట్టేనా!

ప్ర. ద్వి.—మీరు పోయి సర్దారుకు చెప్పా వేసి హుకుం పుచ్చుకొని రండి. మేము వారికి పోకుండా చూస్తా వున్నాం.

చతు. పంచ.—అచ్ఛా, అచ్ఛా. [అని నిష్క్రమింతురు.

తృతీ.—[ప్రవేశించి]మన్సీ యెవరైనా దగ్గిర వున్నాడో చూడ మనిసర్దార్ చెప్పినార్.

ప్రథ. వఖ్మన్సీ వున్నాఁడు. ఇద్దరు సిఫాయిలు చూచినార్, చెప్పడానికి పోయినార్.

చతు. పంచ.—[ప్రవేశించి]పత్యేఖం పత్యేఖం ఖయిద్ చెయ్యమనిహుకుం.

చతు.—[మొదటిత్రయము నుద్దేశించి] మన్ము నల్గురు రాజాకి పట్టవాలా! [పంచముని నిర్దేశించి] వీడు వఖ్ తుఖ్డీతో పోయి గుఱ్ఱాన్కి పట్టవాలా.

[పంచముఁడు నిష్క్రమించును.

అంత మఱ్ఱిచెట్టుక్రింద నిద్రితుఁడు రాజు ప్రవేశించును.

[ఆనలువురు సిపాయిలు రాజునకు కాలుసేతుల బంగారు సంకెలలు తగిలించి ఆయుధములను తీసి కైతురు.

రాజు.—[చేతులు కాళ్ళు దులుపుచు మేల్కొని లేచి కూర్చుండి] ఏమియీ కల! మాకాలుసేతులు నాగుఁబాము చుట్టుకొన్నట్టు స్వప్నమైనది. [చేతులు కాళ్ళు చూచుకొని మహాశ్చర్యముగా] ఏమి యిది! పాము గాదు, బంగారుసంకెలలు! ఏమి యిది! ఇంకనుం గలయే? [కలయఁ జూచి సిపాయిలం గని]ఏమిరాయిది? మీరెవరు?

సిపాయిలు.—[దద్దిరిల్లి వెనుకకు విఱుగఁబడి సరుకుకొని] మహారాజా సాహేబ్, మేం వలీఖాన్ సిఫాయిలం. మాసర్దార్ హుకుంచేత ఈపని చేసినాం.

రాజు.—ఏమీ![కత్తి దూయం బోయి, బాకు తీయం బోయి, లేమిని చేతులు కామిని ఎఱిఁగి] ఏమిరా ఆఁడుదానిపని చేసినారు? మీఖాను ఉన్నాఁడా యిక్కడ?

సిపాయిలు.—ఉన్నారు మాసర్దార్.

రాజు.—ఇక్కడికి రమ్మను.

తృతీ.—సర్దార్తో చెప్తాన్ మహారాజాసాహేబ్. [అని నిష్క్రమించును.

రాజు.—మాగుఱ్ఱ మేదిరా?

సిపాయిలు.—గుఱ్ఱాన్కిపట్టి ఖయిద్ చేసినార్ మహాప్రభో.

రాజు.—ఖయిదు పడదే అది?

సిపాయిలు.—మాకీ తెల్వదు మహారాజ్.

రాజు.—ఓరీ, ఈవలీని కొలిచిన మీకు పిడికెఁడు రొట్టెకన్న నేమున్నది? [సంకెలలను సూచించి] వీనిని వదలించి, మాతో రండి, చాటుదారులఁ బోదము. మీకు చెఱియొకపరగణా యిచ్చి మిమ్ము నబాబులను చేసెదము.

[సిపాయిలు మొగమొగాలు చూచుకొనుచుదురు.

తృతీ.—[మఱి నలువురు సిపాయీలఁ దోడ్కొని వచ్చి] రండి మహరాజ్, రండి మాసర్దార్ దగ్గాకి.

రాజు.—మేము రాము. మమ్ము పొడిచి వేయుఁడు.

తృతీ.—మాకీ పొడ్వడాన్కి హుకుం లేదు. తీస్కొని రమ్మని హుకుం.

అందఱు.—రండి మహరాజ్ రండి. వచ్చి అక్కడ సర్దార్కు అడ్గితే వాడు విడిచిపెడ్తార్.

రాజు.—మీసర్దార్ దొంగ, మీసర్దార్ ఆఁడుది; వాని ముఖము చూచ మాకిష్టము కాదు.

తృతీ.—ఇష్టం లేకోపోతే కష్టం వుంది. మీరు తిర్గబాట్ చేస్తే ప్రయోజనం లేదు. మీ ధౌలత్ పోయింది. మీరు మాఖయిదీ, మేం రమ్మంటే రావాలా. పొమ్మంటే పోవాలా. మీరు రాకోపోతే మేము ఇర్వై నల్భై మంది జులుం చేసి మిమ్మి పట్టి యీడ్చుకొని పోతాం; అది మహారాజాకి బలే గౌరవం? మర్యాదాగా రండి. తమరికి అక్డమర్యాదా సర్దార్ ఖుషి, తమరి అద్రుష్టం.

రాజు:—మీరు మనిసికి ఒకసర్కా రిచ్చెదము. [కాలు సేతులుసూచించి]వీనిని వదలించి మాతో రండి [సిపాయీ లందఱు మొగ మొగంబులు సూచుకొనుచుండ.

[దూరమున చెట్లచాటునుండి వలీఖాను తొంగిచూచు చుండును.

తృతీ.—[వలీఖానుం బొడగాంచి] అరే సర్దార్ దేఖ్తారే.

అందఱు.—[వలీఖానుం గని, రాజుతో] మేము నమ్మక్ ద్రోహం చెయ్యము మహరాజ్.

రాజు.—అటైతే మాగుఱ్ఱమును తెండి, దానిమీఁద వచ్చెదము.

పలువురు.—అచ్ఛా! అచ్ఛా!

తృతీ.—[సతిరస్కారము] గిచ్ఛా! గిచ్ఛా! ఆగుఱ్ఱంమీద ఈయ్న యెక్కితే క్షణంలో అది వోరుగల్లుమే వుంటుంది, మమ్ము యిక్డ జంగల్మే వెతుకుతూ వుంటాం. వేరేగుఱ్ఱం తెండి. [ఆలోచించి] వద్దు, టాంజాన్ తెండి.

[నలువురు పోయి టాంజాన్ తెత్తురు. రాజు అంగలో కూర్చుండును.

తృతీ.—అరే మమ్ము హర్ఖత్ చేస్తే ఈయ్నదండూ వస్తుంది. ఈయన లేస్తే చంపు కొంటాడు;యెత్తండిరా, యెత్తండి, యెత్తండి.

[సిపాయీలు రాజును టాంజానులో కొనిపోవుదురు.

రాజు.—[స్వగతము] ఆ! ఈపాటు నావంటి వానికేమి కారణము!

ఉ. కల్ల వచించినాఁడనొ ? విఘాత మొనర్చితినో సురార్చకుల్ ?
దల్లిమనంబు నేయనొ? యదండ్యుల దండన వెట్టినాఁడనో?
[1]యుల్లము నొంతునో ద్విజున?[2]క్షోమనొ యార్తుని?వింటినో ఖలుల్?
బల్లిద మైన [3]వైశసము పాటిలఁగాఁ గత మేమి యాక్రియల్ ?౧

అట్లు గాదేని,

క. అటవి నిరపరాధుల మృగ
ఘటలం బొరిగొన్న పాతకము దాఁకెనొకో?
కటకటఁబశిరో వేఁటకుఁ
బటుయోగాదృశ్యులై తపము సేయుమునుల్? ౨

హా! లక్ష్మి యఁట! యెంత మోసగత్తివు!

సీ. అంచెల వైరుల దునుమున ప్డసిధారను దోడు నిల్పి, ప్రే
మించి, కవీంద్రభాషణల మెచ్చుతరిఁ గనుసన్నఁ గొల్చి, న
మ్మించి, యకాండ మిప్డు విషమించి, త్యజించెను సుపుత్రఁ గానలోఁ
[1]జంచలకన్నఁ జంచల నిజంబుగ లచ్చి, యిదే గ్రహించితిన్. ౩

ఉ. నాకథ విన్న నే మగునొ నా [1]జనయిత్రి? [2]మదీయరక్షణే
చ్ఛాకలితవ్రతాకృతి కులాంగన యేగతి నొంది డిందునో?
రే కిడుతమ్మిమొగ్గ[3] కెల రేదొరబుగ్గకు నాదుపట్టికిన్
గాకతివంశవీరునికి [1]గంజజుఁ డేమిగతిన్ లిఖంచెనో? ౪

తే. కూలినాలి చేసి కుడుచు పేదసుఖంబు
దక్క దిలను [1]మకుటధారి కెపుడు ;
తలకుఁ దాఁక కున్నఁ దన కేమి తెలియదు,
ఫలముఁ గంటి రాజభావమునకు. ౫.

౧. 1. హృదయమును బాధింతునో. 2. ఓమనో=రక్షింపనో, 3. చేటు.
౩. అసి ధారల=కత్తి వాదరయందు. 1. మెఱుపుఁదీఁగకంటె.
౪. 1. తల్లి. 2. నా|నేమమందలి కోరికచేత నోఁచఁబడు నోముల ఆకారము గాఁగలది. 3. బాల చంద్రుని చెక్కిటివంటి కోమలాంగునికి. 4. బ్రహ్మ.
౫. 1. కిరీటము దాల్చినవానికి - రాజునకు.

హాహా! ఏమి తోఁచుచున్నది! నాగతి ఢిల్లి నడివీథులలో బోనులో ఊరేగింపు! ధన్యుణము మేలుగదా! ఆహా! ఎట్టి కులపాంసనుండను బుట్టితిని! ఓరి వల్లిఖానుఁడా!

చ. శుకముల, గోరువంకల, వసుంధర లాతివిహంగమంబులన్,
[1]మెకములఁ బంజరాన నిడు మిక్కిలివేఁటరు లుందు రెందఱో,
వికలితవైరి నేకశిలవీరనరేంద్రుని బంజరంబులోఁ
బ్రకటితశక్తి నిట్టిడిన [2]వ్యాధశిఖామణి వీ వొకండవే!

ఆహా! హతవిధి! ఈమలకలు నాదేశ మేల చొరవలయును!

క. కొలలు, న్గొల్లలు, చెఱులన్,
జెలువలఁ జెఱుచుటయు, జాతిఁ జెడఁగొట్టుటయున్,
[1]మలకలచే నాప్రజలకుఁ
గలుగవె? యాపాప మెల్లఁ గలుగదె నాకున్?

ఆహాహా! ఈపాటున కెల్ల నాదోషమే మూలము. ఆమహామహుఁడు యుగంధరుని పలుకుఁ బాటింపక వేఁట కరిగిన ఫల మిది. మహానుభావా, నీతలంపుచేఁ కనుచుండ. నాతప్పుచే విధి బలీయమైనది. విధి నడంచు పురుషకారము తమదే! ఇప్పటికి కర్తవ్యతాజ్ఞానము కలుగుచున్నది.

ఉ. చింతిల నేమి గల్గు? విధి [1]చేఁత బలీయము! తొంటికర్మముల్
శాంతిలు [2]భుక్తిమాత్రమున; [3]సత్త్వవిహీనత నొంది యాక్రియన్
[4]వంతలఁ బొక యింతులకు [5]వాటము, తేఁకువ నూపుమార్గమున్
సంతతధైర్యవృత్తి నిట [6]శత్రువశంవదత న్మెలంగెదన్.

[చూడ్కి సారించి] ఆహా గోదావరి అగపడుచున్నది! నమో నమస్తే సాగరధర్మచారిణి!

జమాదార్.—అరే! యేమి గుఱ్ఱంరా యిది! ఇప్పటికి నూరుతల్కాయల్ బద్దల్ చేసింగి. కాళ్ళు చేతులూ లెక్కలేదు. అరే రాజాకిపట్టడం ఛణం, దీనికిపట్టిన

౬. 1. మృగములను 2. వేఁటరులలో శ్రేష్ఠుఁడవు.
౭. 1. తురకలచేత.
౮. 1. కృత్యము. 2. అనుభవముచేతమాత్రమే. 3. ధైర్యము లేమిని. 4. పడుట, 5. తగినది. 6. శత్రువులకు స్వాధీనుఁడనై.

యుగం. యేమైనా సరే, యెందరు సచ్చినా సరే. దీన్కి సంపకూడదు. అని సర్దార్ హుకుం. దీన్కి సంపకుంటే మన్మంతా దీనిచేత సస్తాం. సంపితేనా మన్మంతా సర్దార్చేత సస్తాం. ఈ గహచారంలో యేమి శెయ్యమంటార్ భాయ్ ?

దేహవ్రణితుఁడు.—ఇద్గో భాయ్ [గాయాలుచూపుచు] నావొల్లంతాగాయాల్.

పాద ,, [కాళ్లు చూపుచు] ఇద్గో నాకాళ్లు నహి.

బాహు ,, [చేతులు చూపుచు] ఇద్గో నాచేతులు గయా.

నాసికా ,, [మొగాన చేయి యుంచుకొని అను నాసికోచ్చారణగా] అల్లా! అల్లా ! నాముక్కు మోయింది, ఎజీరి మోయింది.

నేత్ర ,, [చీకురించుకొని చూచుచు] అల్లా! అల్లా! నాకన్ను పోయింది.

వ్రణితు లందఱు.—మే మిక దాని మొఘానికి చూడం భాయి,సచ్చిపోతాం గాని.

రాజు.—ఓరి సిపాయీలు, మీరు దానిని పట్టలేరు, చంప లేరు. దానియొద్ద కుమును మమ్ము సెలవు పుచ్చుకొనీయరా. మేము పిలిచిన అది వచ్చును. మా పాటకు నిలుచును. మాకొకమాఱు దానిని చూపి మీరు దాని నగలు తీసికొండి; కన్నరు, ఎగురదు. సమ్మత మేని టాంజాణ్ దాని వైపు త్రిప్పుఁడు.

జమాదార్.—[సిపాయీలతో] ఆలాగ చేతామా భాయి? చేతాం. నగల్ను చ్చుకొని పోయి సర్దార్ యెద్ద పెద్దాం, మన్మ తినే నగల్కావ్, మనకీ చాలా శిక్షలు తప్పును.

దేహ.—[ముక్కుపోయిన వానిం జూచుచు] శానా ముక్కులు నిలుచును.

[కన్ను పోయిన వానిం జూచుచు] శానా కన్నులు దక్కును.

జమాదార్.—తిప్పండిరా టాంజాణ్ తిప్పండి. [త్రిప్పుదురు.

రాజు.—[గుఱ్ఱముం గాంచి] రారా బాబా, రారా నా యింద్రాయుధమా.

[గుఱ్ఱమువచ్చి రాజుప్రక్క తల ఆడించుచు కాళ్లుబాడించుచుఉండును.]

రాజు.—బాబా, నీనగలు వీరి కిచ్చి వేయుము.

[అని గుఱ్ఱము మెడను తట్టుచున్నాఁడు, గుఱ్ఱము కదలక నిలుచును.

సిపాయీలు.—[ఆశ్చర్యముతో] అహో యేమి దీనివిశ్వాసం? యేమి యీ విశ్వాసం? [అని గుఱ్ఱము నగలన్ని ఒలిచివైచి] అరే, మన్సీ సామిద్రోహీ, నాల్గు కాళ్ల జంతూ సామిరక్షీ భాయ్.

[అని కొందఱు దానికి 'సలాం గోడాసాహెబ్' అని సలాము లిడుచు, కొందఱు దానిని తట్టుచు, కొందఱు ముద్దుగొనుచు ఉందురు.

ముక్కుపోయిన సిపాయి.—నాకుజ్జు, నెజనన్నినవాన్ని యీముజ్జానా ఇంజు సిపాయీలు సలాముల మున్నుల్ శేస్నావున్నార్.

కన్నుపోయిన సిపాయి—లేదు, నాకన్నూకి తెగతన్నినందుకోసం వీళ్లిట్టి సలాములు ముద్దుల్ చేస్తావున్నారు.

ముక్కు.—[కోపముతో]అరే,నీజుణ్ని జన్నూయెజ్వారే నామజ్గార్ముజా జణ్ణే ?

కన్ను.—[కోపావేశముతో] అరే పిసాసీ, నీతొ(రముక్కుయెక్వాలే నా (జంసీలం ఆఖీకంటే ?

రాజు.—బాబా, మాకు సలాము చేయుము. [గుఱ్ఱముసకలించితలఆడించును.

రాజు.—

ఉ. మాదశ నీ వెఱుంగక హుమాదార, డస్సితివయ్య వీరిచే?
మాదశఁ జూడు, నీవలన మానదు ; నీ [2]పార గాదు; [3]మన్మనో
వేదివి, ప్రాణదాత, విట వేఱులు నీకును మాకు నయ్యెఁ; [4]గుః
దేది పయోదవీథిఁ బురి కేఁగుము; వెండియుఁ గాంతువో మముఁ!

[అని గుఱ్ఱమును ముద్దుకొని చిటికవైచును. గుఱ్ఱము పరారి యగును. రాజు సబాష్పము చిఁతాజడుఁడై గుఱ్ఱముపోయిన దిక్కు చూచుచుండును.

సిపాయీలు.—[పరస్పరము] క్యారే! క్యారే! గోడా ఏదిరా! గోడా ఏదిరా! [రాజుతో] ఏం మహారాజ్, ఈలాగ చేసినార్ ?

రాజు.—నన్నుఁ దప్ప ఎక్కనీయదు. ఒకరిచేత చావదు, పట్టుపడదు. అది పోయినందున మీతలలు నిలిచినవి, సంతోషపడుఁడు.

జమాదార్.—అరేభాయి, ఈనగల్ సర్దార్సాహేబ్కు అప్పగించి, యీ మాట సర్దార్సాహేబ్కు చెప్దాంరండి. దాన్కి పట్టి తెమ్మని ఆయన ఖుద్రాఖాన్ బహద్దరుకు కభుర్ చేస్తాడు. [అని నిష్క్రమించి మరల ప్రవేశించి నిగిడి చూచి] అరే! పడవల్! పడవల్! పడవల్!

దేవ.—పడవల్, డింగీల్, దోనెల్, వాడల్, అన్నీ వున్నయి! మనకోసం హల్లా పంపినార్రా యివి! యేమిరా మన హద్రుష్టం, మన సర్దార్ హద్రుష్టం!

రాజు.—[ఆత్మగతము] సత్యము సత్యము! మీకాలము మంచిది!

దేవ.—సర్దార్కు చెప్పవేస్తాక. అని నిష్క్రమింతురు.

ఓ. 1. గుఱ్ఱము. 2. తప్పు. 3. నామనస్సును ఎఱింగినవాఁడవు. 4. మఘ మును మాని. 5. మేఘమార్గమున.

అంత వలీఖానుఁడు కొంత పరివారమును ప్రవేశింతురు.

శ్రీ—అరే జల్దీ ! జల్దీ! గట్టుకు ధవుడు ! ఆపడవలకీ ఆపండి ఆపండి !

[అందఱు త్వరగా పరిక్రమింతురు.

---

## స్థలము 2. గోదావరిగట్టు.

సిపాయీలు.—[ఎక్కడివాఁడక్కడనుండి]ఓపడవ! ఓపడవ! పడవోయిపడవ, శ్రీకళాసుల్, ఓహోయిసరంగ్, ఈలాగారండి; ఈలాగారండి, పడవల్ దరికి తెండి.

అంతట పడవలు గడలతో నడుపుకొనుచు పాడుచు
పడవవాండ్రు ప్రవేశింతురు.

తండేలు.—[ముందుగడ వేయుచు]

గంగమ్మ తల్లీకి శెంగల్వ పూదండ,
కాలింది కీ తెల్ల గల్వాదండా.

కళాసులు —[వానివెనుక గడ వేయుచు] గంగమ్మ ...

అందఱు.— జోర్సాయ్, బార్సాయ్, జోర్సాయ్, బార్సాయ్.

తండేలు.— గోదారి తల్లీకి గొజ్జంగి పూదండ,
సరసోతి కీ సన్న జాజిదండా.

కళాసులు.— గోదారీ ... ...

అందఱు.— జోర్సాయ్ ...

సిపాయీలు.—పడవోయి పడవ, ఓయిసరంగ్, కళాసుల్, అరే మీకి చెవులు లేవా? దరికీ రండి అంటే.

పడ.—[చూచి, గడలు నిలిపి] ఎందు కయ్యా!

జమాదార్.—మాకి దాటేండీ, కే విస్తాం.

తండేలు:—ఎక్కడైనా బల్లగట్టు నూసుకొని దాటండి, మేము నిలము.

[అని మరల గడలు వేయుదురు.

రాజు.—[ఆత్మగతము]ఇక్కడ నయిన కొంచెము విలంబము కాఁగూడదా? హుసేండు వచ్చి కలసికోరాదా ? ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో ?.

జమాదార్.—అరే మేము ఎంత కేవయినా యిస్తాం.

తండేలు.—ఏ మిస్తారు ?

జమాదార్.—మీ రడండిరా.

తండేలు.—మీరు శెప్పండి.

జమాదార్,—నూరువరాలు యిస్తాం. మేము ఐదువందలమందిమి. ఆజ్ఞ వఖటే ఛణంలో దా టెయ్యాల.

తంజేలు.—దండా యేంటి ?

జమాదార్.—అవును. మరి మాట్లాడకండి, హర్కత్ శెయ్యకండి. పున్నెంపండింది పొండిరా యీ వేళా.

తంజేలు.—దాటేశినాక యెగొయ్యరు గందా సాయబుమారాజులు ?

జమాదార్.—యెర్రివాడా నీడబ్బు మేము యెగేస్తాం ? నీకీ యింకా యిస్తార్ సర్దార్. యిద్దో కేవు ముందే పుచ్చుకో.

[అని సంచి గలగల లాడించును, పడవవాండ్రు కలయఁ బలికి కొనుచుండ

రాజు.—[ఆత్మగతము] వీరికి మమ్ము తెలిపిన వీరు దాఁటవేయరు. ఆంతట సిపాయీలు ఈఁది పోయి వీరిని చంపి పడవలను గట్టునకుఁ దెచ్చి,యెక్కించుకొని తామే నడుపుకొని దాఁటి పోదురు. మా దం డెక్కడను దృష్టిపథములో లేదు. మాకై వీరేల చావవలయును.

తంజేలు.—[పడవలను దగ్గఱకు తెచ్చుట నభినయించి] మ ఎక్కండి.

దేహ.—[ప్రవేశించి] రాజాకి దోనెకడ్పులో పెట్టమని సర్దార్ హుకుం.

[అట్లే చేయుదురు. అందఱు తప్పెక్కి కూర్చుందురు. వలీఖాన్ కొంత పరివారముతో మఱియొక పడవ యెక్కును. సిపాయీలు సర్దుకొని కూర్చుండి కొందఱు పరుండి చుట్టలు గుడాకులు త్రాగుచుందురు.

## స్థలము ౪. దోనెతట్టు.

దేహ.—అరే భాయి, యీరోజ్ ఎంత ప్రాణానికీ సాలి వచ్చిందిరా యీ పాడు గోడాచేత ? ప్రాణం బీజా రైంది భాయి.

నేత్ర.—[అంగరక్కా విప్పుకొనుచు] అరే పోయిన ప్రాణం వస్తావుందిరా యీచల్లాగాలికి.

పాద.—అరే గోధారీలో పడ్డా నన్ను లేపకండి ; యేంగాని సరే, నేను నిద్రాపోతాన్.

[అని మాటఁకు జేరగిలఁబడి నిద్రించును.

బాహు.—యీ చల్లనీళ్లలో పడి చచ్చిపోవడానికి నాకి సర్దార్ శెలవు యిస్తే బాగా వుంటుంది భాయి.

పాద.—అరే సావడాన్కి శెలవూ యెందుకూ భాయ్ ?

పడ.—[గడలు వేసి] ఏలెస్సా, ఓలెస్సా, ఏలెస్సా, ఓలెస్సా, ఏలెస్సాలోబోలెస్సా, ఏలెస్సాబో, బోలెస్సా. [మరల మరల అనే

ప్రథమ ద్వితీయులు.—అరే పడవవాళ్లు, పాడండిరా పాడండి.
పడ.—యేలా యేలా యేలా యేలా యేలా యేలా యేలేలా,
యేలా యేలా యేలా యేలా యేలా యేలా దండేలా.
(ప్ర. ద్వి.)సిపా.—ఇందాక పాడ్తా వుండినారే అదే పాడండిరా.
దండేలు.—పాడతాం. ఇనాం యియ్యాలా సాయిబులు.
గంగమ్మ ... ...
కొసులు.— గంగమ్మ ... ...
అందఱు.— జో'ర్నాయ్ ...
(ప్ర. ద్వి.)సిపా.—వహవ్వా! వహవ్వా! బలే ఘసందు వుంది.
ప్రథ.— అరే మాకీ కూడా చెప్పండి, మేమూ పాడ్తాం.
ద్వితీ.— వాళ్లు పాడనీరా భాయ్, మనకీ రాదూ అది.
దండేలు.— గోదారీ తల్లికి ... ...
కొసులు.— గోదారీ తల్లికి ... ...
అందఱు.— జో'ర్నాయ్ ...
(ప్ర. ద్వి.) సిపా— జో'ర్నాయ్ ...
దండేలు.— కిష్టాయే ణమ్మాకి గేదంగి పూదండ,
కాయేరి కీ శంగ్ర కాంతిదండా.
కొసులు.— కిష్టమ్మ తల్లీకి ... ...
(ప్ర. ద్వి.)సిపా. పడ.— జో'ర్నాయ్ ...
దండేలు.— సుల్లు దో పుల్లు ము సల్లు ద ప్పించి, మ
మ్మిల్లు సే ర్సండి వో తల్లులారా.
కొసులు— సుల్లు ... మ్మిల్లు శెర సండివో
(ప్ర. ద్వి.) పడ.— జో'ర్నాయ్ ...
దండేలు.—
పిల్లా జెల్లా అంతా సల్లంగా రచ్చించి,
యిల్లూ సే ర్సండి వో తల్లులారా.
కొసులు.—పిల్ల మేకా ... యిల్లు శెరసండి మా ...
(ప్ర. ద్వి.)సిపా. పడ.— జో'ర్నాయ్ ...
దండేలు.—
శిక్కాలూ నిండించి శింగాలూ నిండించి,
యిల్లూ సే ర్సండి వో తల్లులారా.

కళాసులు.— శిక్కాలూ ... మాతల్లూలారా.

(ప్ర. ద్వి.) సిపా. పడ.— జోర్సెయ్ ...

తండేలు.— గోదారీ తల్లీకి కొట్టారా టెంకాయ

కోరి దణ్ణా లెట్టి కుంకూ మెట్టి.

కళాసులు!— గోదారీ ... కోటీదణ్ణా ...

(ప్ర. ద్వి.)సిపా. పడ.— జోర్సెయ్ ...

పడ.— యేలా యేలా ... ... ...

తృతీ. సిపా.—అరే, యింకొక పాటా పాడండి. యిదేమ్టి గంగమ్మ యెమ్మాళీ పడుచుపిల్ల మీదా పాడండి వోయ్.

తండేలు.—అలాగే పాడతాం సాయిబులు. [కళాసులతో]యేది పాడరా? పాడండి రాః

బజారు యెంటా మిటాయి తింటా

రాయే గుంటా నాయెంటా.

కళాసులు.— బజారు ... ... ...

కళా సాకుడు.—అది పచ్చిబూతురా, లో నావలో మారా జున్నాద్రా.

తండేలు—మ రేదిరా? 'మల్లీ వొచ్చిందాకా' పాడదాం.

పడ.—అచ్చురా! అచ్చుర!

[తండేలు పాడినదానిని కళాసులు అనువదింతురు. కళాసీయిలు కూడ 'జోర్సెయ్ బార్సెయ్' పలుకుదురు.

మల్లీ వొచ్చిందాక మర్లూ మ రవ నంటూ,

శేతూలో శెయ్యేశి శెప్పాలే శెంచు. జోర్సెయ్ ...

కూ డొండి పెడతాను, గు డ్డుదికి పెడతాను,

కూడా తొడక పోవా జోడుగా మామా? జోర్సెయ్...

సీమణుచు నామణుచు నిరకూ ద ప్పా రుంటే,

యెడబాశి నెల వుంటే నేమోలే శెంచు? జోర్సెయ్...

ఎవూర నేవల్లె నేమీా క న్నే శినవో?

యెందు... ...సవు ...ంటా... మామా. జోర్సెయ్...

క్షోకాజరీ తెస్తా, కొవ్వాబిళ్లా తెస్తా,
నవ్వూవాళా శలవిచ్చి నన్నంపే శెంచు. జోర్కెయ్ ...
క్షోకాజరీ వొద్దు, కొవ్వాబిళ్లా వొద్దు,
రానీవా నీతోటి కానీ వో మామా? జోర్కెయ్...
శెంపాము ద్దెట్టుకొని, శెల్లో బాయ్, యాడవకు,
అల్లాడే సారంగు, యెల్లిపో శెంచు. జోర్కెయ్ ...

సరంగు.—[చూడిక్కా సారించి] సూడ్రా! అల్లదుగో ఎంతముసలో.

తండేలు.—[చూడిక్కా సారించి] ముసలి గాదు. సుత్తికాపలా గుందిరా.

సరంగు.—కాదు మనిసిరా; బలే యీతగాడ్రా.

తండేలు.—అవునురా. తెగబడ్డాడు. అలిశిపోయినాడు, సావుబతుకుల్లో వున్నాడు, సైగ శేస్తున్నాడు.

సరంగు.—ఆడుతనుసలాట్టంనూ స్తేముసల్నితప్పించుకొంటా వొస్తున్నాడ్రా.

తండేలు.—నారాయణా! వొవరో బాపనయ్యరా పాపం!

[నేపథ్యమున]

ఓరి పడవవాండ్రూ, ఓ సాయెబులూ, పుణ్యము కట్టుకొండి! చచ్చితిని చచ్చితిని! మొసలి! మొసలి! మొసలి!

పడ.—యేమి సాయెబుగార్లూ, ఆయ న్నెక్కిచ్చుంతుమా? అయ్యవోరు.ఆమాంతంగా ముసలి సంపేస్తది?

అంతట విద్యానాథుఁడు ఈఁదుచు ప్రవేశించును.

విద్యా.—ఓరి పడవ వాండ్రూ ... మొసలి!

జమాదార్.—పోనీ, పాపం! బతికించండి.

[పడవవాండ్రు త్రాడు వేయుదురు. విద్యానాథుఁడు దానిం బట్టుకొనును. పడవవాండ్రు చేదుకొనుదురు.

విద్యా.—[పడవ యెక్కి, వడవడ వడంకుచు, మహాభీతి నభినయించుచు, ఏడుచు, తట్టంతయు తడిచేయుచు, గుడ్డలుపిడుచుకొనుచు, తలతుడుచుకొనుచు] ఓసి పడవవాండ్రారా, మీధర్మాన బ్రతికితిని, ఆచంద్రార్కము మీయిండ్లు వర్ధిల్లఁగాక, సాయెబులారా, మీదయవలన బ్రతికితిని. ఎంత మొసలి! ఎంత మొసలి!

(ప్ర.) సిపా.—[నోటనుండి చుట్ట తీయకయే]అయ్యా బొమ్మఁడా,నీవు నీళ్లలో కశే నాట్య మాడినావు!

విద్యా.—నాట్యమా? క్షణము తప్పిన ఈపాటికి మీయెదుటఁగాదు యమధ
ర్మరాజునెదుట నాట్యము చేయుచుందును. [అని కూర్చుండి సరుసుకొను.

(ద్వి.) సిపా.—[నోటినుండి చుట్టతివిసి] ఎందుకయ్యా పంతులూ, అంత
సాహసం శేచినావు?

విద్యా.—[ఆత్మగతము] పెద్దబొంకు బొంకవలయు; ప్రాణవిత్తమానభంగ
ములలోఁ జేరవచ్చును. [ప్రకాశము] ఎందునకా? అద్దరిని మాగ్రామము, మాయక్క
ప్రాణముమీఁదికి వచ్చియున్నది. వైద్యుఁడు పచ్చిగరళము తెమ్మన్నాఁడు! దాని
కోసము ఇక్కడికి రెండుక్రోసుల్క్రింద డింగీమీఁద గోదావరి దాఁటి, అన్నము నీళ్ళు
లేక యెకాయెకి అయిదామడ రావులూరికి పోయి, గరళము సంపాదించుకొని, స్నా
నము లేకయే, వాయువేగమనోవేగముల, మరల, గోదావరి దాఁటుటకు వచ్చునప్పటికి
ఎక్కడను బల్లగట్టుగాని డింగీగాని ఏమియులేదు.

(ద్వి.) సిపా.—మొదటూ దాటినానే అదీ యేమైంది?

విద్యా.—ఇరువది రేవులు తిరిగితిని, అన్నిటను పగులఁగొట్టివేసినారు. ఈత
కాయతో దాఁటించినను, దాఁటించినవారికిని దాఁటినవారికిని తల పోవునన్నారు.

సిపాయీలు.—ఏమి హాశ్చర్యం! ఏమి హాశ్చర్యం!

విద్యా.—వాఁడెవ్వఁడో రాజమంత్రి యఁట, ఆదిక్కుమాలినవాఁడు నీ
యాజ్ఞ చేసినాఁడఁట. ఎందుకోసమని యడిగిన, ఎందులకో ఎవరైన నెఱుఁగుదురా?

సిపాయీలు.—ఆదివానా బల్లగట్లకి పగల్గొట్టకపోతే తనతల్కాయికి పగ
ల్గొట్టుకోరాదా?

(ద్వి.) సిపా.—తర్వాతా చెప్పు పంతులూ.

విద్యా.—తర్వాత, ఏలాగయిన ఈయస్తమయములోపల మాయమ్మకీమందు
వేయవలయునని ఏటి కడ్డమీఁద తెగఁబడితిని. ఇక్కడ మడుఁగు, మొసళ్లు పుట్టలు,
వ్యాకులతలో ఆమాట మఱచితిని. గడియమూర మీఁదునప్పటికి మొసళ్లు తఱుమవా!
నవి. అయ్యా! తలఁచుకొన్న ఇప్పటికి ఒడలు జలబరించుచున్నది సాయెబూ.

[అని జలబరించుట నభినయించును.

(ద్వి.) సిపా.—[జలబరించుట నభినయించుచు] వాటితో లడాయిచేసినవానీ
నీకి జలబరించడం హాశ్చర్యమా, వుూర్కే వినేవాడ్కి నాకే జలబరిస్తావుందే!

[మఱికొందఱు సిపాయీలు జలబరింతురు.

విద్యా.—ఈ మొసళ్ల నన్నిటిని తప్పించుకొని రెండు బుటకలలో దాటి
పోయియే యుందునుగాని—



(ద్వి.) సిపా.—అంత యీతమన్సివా బొమ్మకే నువు?

విద్యా.—మీదయ యున్న, దేవుఁడు మేలు చేసిన, నేను కాలుసేతులు కట్టించుకొని మొగముమీఁద గుమ్మడికాయ పెట్టించుకొని గట్లకడ నేల యంటక యేడుమాలులు గోదావరి కడ్డమీఁదినవాఁడను సాయెబూ.

పడ.—మూడేళ్ల కితం యేడుతూర్లు దాటి యెయ్యివరాలు గెలిశిన సాస్తుల్లవా బాబూ నువ్వు?

విద్యా.—ఔను రా.

పడ.—నిన్ను సూశినాం బ్యామ్మడా మేము. దండ మెడతాం.

విద్యా.—నూరేండ్లు బ్రదుకుఁడు.

(ద్వి.) సిపా.—అయ్యా, నీకి యేలాకోలం చేసినవాళ్లకీ బుద్ధిలేదు. నీతల్లి కినీవు తండిచ్చి బలికించకపోయినా, నీ తల్లిరుణం నీవు తీర్చుకొన్నావు పంతులూ.

(ప్ర.) (వేళాకోళము చేసిన సిపాయి)—ఈపడ్వా దొరక్క పోతే యీపాటి మీతల్లికి చావు అబ్ధం నీకి చావు నిబ్ధం అయి వుండీని లే.

విద్యా.—[ఆత్మగతము] పూర్వసువాసినీ, ఇంకను హేళన మేనా? [ప్రకాశము] సందేహ మేమి? మీదయవలన బ్రతికితిని. [ఆత్మగతము] ఇక్కడ నందఱు మహమ్మదీయులే. విశేష మేమియు లేదు. దోనెకడుపులో నేమున్నదో? [అని తట్టంత తడుపేయు, వడవడ వణఁకుచు] జ్వరము జ్వరము! అమ్మో! గోరుచుట్టుమీఁద రోఁకటి పోటైనది! చలి చలి చలి! ఉహుహుహుహుహుహూ.

(ద్వి.) సిపా.—పండత్, ఇక్కడ తడి చెయ్యకు. లోపల్కి పో. అక్కడ హాయిగా బైటో, చలి వుండదు. ఇద్గో దారి.

విద్యా.—[లేచి] ఏది? ఊ, ఊ, ఊ, హుహుహుహు. [అని కని దిగి మరల పైకి లేచి] ఓయి నాయనో! అంతయు చీకటికోణమే!

పడ.—చణముకంటె శీకటుండదులే సామీ.

## స్థలము 4. దోనెకడుపు.

విద్యా.—అటైన సరియే.

[అని దిగి క్షణముండి కలయఁ జూచి, డబ్బీలోనుండి విభూతి తీసి, చలిపోవు నట్లు విస్తారము గాధరించి, పుస్తక మొకటి తడి తుడిచి చక్కఁజేసికొనును.

రాజు.—[విద్యానాథుం గాంచి, ఆత్మగతము] ఏమి! అగ్నిదేవునివలె వెలుఁగుచున్నాఁడీ బ్రాహ్మణుఁడు! ఈయనరాకవలన జనార్దనమంత్రి తురకలను గోదావరి దాఁట నీయక ఇచటనే హలిక్కి గావించుటకై చేయుప్రయత్నము తెలిసినది గదా. నా మంత్రులయందు దోషము లేదు. ఇది కేవలము దైవగతి. దీనికి ప్రతివిధానము యొగంధరులే చేయవలయును. [సమీపమున్న ... వలన వృత్తాంతము

మంత్రులకు తెలియును.

విద్యా.—[పుస్తకము విప్పి రాగముగా]

* శ్లో. కతిపయదివసైః క్షయం ప్రయాయాత్
కనకగిరిః కృతవాసరావసానః,
ఇతి ముద ముపయాతి చక్రవాకీ,
వితరణశాలిని వీరరుద్ర దేవే.

రాజు.—ఆహాహా! ఏమిశ్లోకము! ఏమి గ్రంథము శాస్త్రిలవారూ అదికే

విద్యా.—ఇంటిలో పిశాచము లేమయిన నున్నవా?[అంతటఁ గలయఁజూచి] ఈమూల నింత వెలుతు రేమి? [అని రాజుం గాంచి] ఈదోనె కడుపులో నున్నా యేమి? అయ్యా మీరొక రున్నారా ఇక్కడ నాకుఁ దోడు?

రాజు.—ఆగ్రంథ మేమి?

విద్యా.—[ఆత్మగతము]|ఎవ రితఁడు? బాలభాస్కరునివలె చీకటిం జీల్చుచున్నాఁడు! కానీ. [ప్రకాశము] అయ్యా, ఈగ్రంథమా? ఇది అలంకారశాస్త్రము. ప్రతాపరుద్రమహారాజుమీఁద నేను కవనముచేసితిని.

రాజు.—వారిమీఁద నేల చేసితిరి?

విద్యా.—ఏమయిన సమ్మానము కలిగిన కొమారితకు పెండ్లి చేసికొందమని.

రాజు.—సమ్మాన మే మయిన జరిగినదా?

విద్యా.—సమ్మానమే? దర్శనమే పూర్ణానుస్వారము.

రాజు.—అదేమి?

విద్యా.—రాజు నగరములో లేఁడు. నెలదినములు వేచి యుంటిని. రాడు.

రాజు.—ఏ మయినాఁడు?

విద్యా.—ఏమైనాఁడో? వేఁట కని కొందఱు, కాశి కని కొందఱు, లేడని కొందఱు, నోటి కొకమాట. అంతట ప్రాణము విసిగి, చాలు రాజాశ్రయమని వచ్చినదారి నే యింటికి మరలితిని.

రాజు.—పోనీ మఱియెవరికైన దానినంకితముచేసిసత్కారము పొందరాదా?

విద్యా.—అయ్యా, అంతపుణ్యమా? అంతటను వాని నే తగుల వేసితిని.

రాజు.—[ఆత్మగతము] ఆహాహా! ఇట్టిమాట వినవలసిన యాదవకోటి!

---

*ప్రతాపరుద్రమహారాజుయొక్క యీవిని కని చక్రవాకి లేనకు వగదుం అంతః మొందించి ప్రియునితో ఎడఁబాపు కలిగించుచున్న బంగారుకొండ శీఘ్రములో నే తరిగిపోవునుగదా యని సంతోషపడుచున్నది.

యె ట్లుండును! [ప్రకాశము] శాస్త్రిలవారూ, దయ చేసి ఒకటి రెండు శ్లోకములు చదువుఁడు, విని యానందించెదను.

విద్యా.—అహా! రసజ్ఞులు వినుటకన్న మాకేమి కావలయును? వినుఁడు.

స్ర గ్ధ ర.

*శ్లో. దూరా దాకర్ణ్య విశ్వప్రసృమరమహసో వీరరుద్రస్య జైత్ర
ప్రస్థానారమ్భభేరీనినద మరినృపాః పూర్ణకర్ణజ్వరార్తాః
ఆరు హ్యాద్రీ న్విశన్తో గహనమతిమహత్ కణ్టకాకృష్టకేశాః
త్రాయధ్వం ముఞ్చ తేతి ప్రతినృపతిధియా పాదపా న్ప్రార్థయన్తే.

రాజు.—ఆహాహా? ఆహాహా! అమృతమా కవనమా యిది?

విద్యా.—దీనిని వినుఁడు.

స్ర గ్ధ ర.

†శ్లో. ఉద్యద్దోస్సమ్భఖడ్గత్రుటదరిమకుటాటోపసంజాతరాహు
భ్రాన్తిభ్రశ్యత్ప్రతజ్ఞాభయకరణచణః స్ఫారనాసీరరేణుః
అన్ధత్రిష్మాభర్తృ రాసీ దధికరణధురాభిన్నమత్తేభకుమ్భ
ప్రోద్యన్ముక్తౌఘతారానికరపరివృతః స్వర్వ్యహూవ క్త్రిచన్ద్రాః.

రాజు.—మీరు సాక్షాత్తు విద్యానాథులరయ్యా. స్వామీ, ఇచ్చుటకు లేవు గదా నమస్కరించుటకైన నాకు చేతులు లేవు. నాదుస్తులో జేబులో మొహరుంగర మున్నది. దానిం బుచ్చుకొని, కవి గానని దే మున్నది, ఉపయోగింపుఁడు.

విద్యా.—[పుచ్చుకొని, 'ప్రతాపరుద్రమహారాజు' అని పేరు చదువుకొని, ఆశ్చర్యముతో] మహారాజా,

క. నాపేరు నీవు పల్కితి,
నీపే రేఁ గంటి, దీని నీ వ్రేలను నే

*జగద్వ్యాపక తేజుఁడైన ప్రతాపరుద్రునిదిగ్విజయ యాత్రాభేరీభాంకారమును దూరమునుండి విని శత్రురాజులు కర్ణజ్వర పీడితులై కొండ లెక్కి కాఱడవులం జొచ్చుచో ముండ్లకొమ్మలు జుట్టుపట్టి లాగఁగా ప్రతాపరుద్రుఁ డే లాగుచున్నాఁడనుకొని 'మమ్ము రక్షింపుఁడు, వదలుఁడు' అని ఆముండ్ల చెట్లను వేఁడుకొనుదురు.

† ప్రతాపరుద్రుని కత్తివ్రేటునకు తెగి యెగసిన శత్రురాజులకిరీటములం గాంచి రాహువు లనుకొని సూర్యుఁడు పలాయనమునకు ఉంకింప, సూర్యునికి ప్రతాపరుద్రుని సేనాధూళ్యంధకారము అభయ మిచ్చినది; ప్రతాపరుద్రుఁడు చీల్చినయేనుఁగుల కుంభస్థలములనుండి ఎగసిన ముత్తెము లనెడునక్షత్రములు (యుద్ధము చూడను, యుద్ధవీరులను వరించను వచ్చిన) సురాంగనల ముఖచంద్రుల చుట్టును ఒప్పారినవి.

నే పెట్టువాఁడ, ధర్మ
శ్రీపాలిత, యోరుఁగంటిసింగపుఁబీఠిక.

[అని యుంగరమును మూటకట్టుకొను

రాజు.—[ఆత్మగతము] ఆహా! విద్యానాథుఁడా యీయనపేరు! మహాత్ము ఈయనప్రతిజ్ఞ చాణక్యప్రతిజ్ఞయే యగును. ఈశ్వరుఁడు చేయూఁత యిచ్చి వాడు

విద్యా.—ఇదిగో తరలితిని.

రాజు.—సాష్టాంగనమస్కారములు.

విద్యా.—అభ్యుదయోఽస్తు. [పుస్తకము కట్టుకొనుచు మూటలో కొనుచు ఆత్మగతము]ఏఱు దాఁట వచ్చి సాధనములు లేక వెనుకకు మరలువాడ ఇచట నాకస్మికముగా గుఱ్ఱము మెఱపు మెఱసినగతిం బలాయమాన మగుటం కుతూహలితుండనై యిటు నడచి, హిందూప్రభువును తురకలు గొనిపోవుట శంకించి, ప్రవేశార్థమై నాపన్నినమాయలు నాపలికినబొంకులును ఎట్లు ఫలించు అహో నైమఱపు గలుగుచున్నది. దాలి త్రవ్వఁగా గనియు పుట్టయు నైనది. ప్రకృతము.

స్థలము. 5 దోనెతట్టు.

[అని తట్టెక్కి] అబ్బబ్బబ్బబ్బ! అయ్యో! అయ్యయ్యో! అమ్మయో! అమ్మా అమ్మా! పోయె! చేయి పగిలిపోయె. ఈశ్వరా! ఈచేయి యిక్కడి రును తెగఁగొట్టలేరా? అయ్యో! అప్పుడే బుజ మెక్కినది. ఓయి నాయనా! బొంగు చీల్చినట్టు చీల్చుచున్నదిరా![అని తన్ను కొనుచు కొట్టుకొనుచు

(ప్ర. ద్వి.) సిపా.—[చూచి ఉలికిపడి] అరే యేమిరా యీబూడిదాభూ

పడవవాండ్రపిల్లవాఁడు.—ఓయిబాబో! బేతాళుఁడా మామో!

[అని కన్నులు మూఁతపడి తండేలును కౌఁగిలించుకొని నిలుచు

(ప్ర. ద్వి.) కాదురా ఆసాస్తుల్లురా.

తండేలు.—బయం లేదులే అమ్మా, బయం లేదులే, బేతాళుడు గాదు

[పిల్లవాఁడు అవ్వలి

(ప్ర. ద్వి.) సిపా.—ఏమి పంతులూ నీ కీ గహచారం ?

విద్యా.—[ఒకచేతితో రెండవచేయి పట్టుకొని మిక్కిలి శ్రమతో] అబ్బా, అబ్బా. తేలు సాయెబూ, తేలు!

(ప్ర. ద్వి.)సిపా.—ఏమి గహచారం!

విద్యా.—... కుట్టినప్పు, ఔగ పలరయను, మా...

సరంగు.—సామీ, యీమూల నీలలో కూకోండి.

విద్యా.—అయ్యో అయ్యో! నేను గోదావరిలో ఆపని చేయను.

సరంగు.—సరి! మ రెలాగ మరి!

విద్యా.—[పాదుకలు మట్లమును నీటజారి విడిచి] అయ్యోఅయ్యో! నామందు పడిపోయినది; అయ్యో! మునింగిపోయితిని! ఏమిపాడుదినము రా! ఎవరి మొగముచూచి లేచితిరా! ఈగ్రహచారము చూడఁగా, మాయమ్మ చచ్చియే పోవునేమో! పడవ వాండ్రారా, సాయెబులారా, పడవను దరికి పట్టింపుఁడు.

జమా.—దరికి పట్టింపుడూ? నీళ్లలో పడిపోవనీ, మాప్రాణాలు తినడానికి వచ్చినావ్.

విద్యా.—నామందు పడిపోయినది, నామందు పడిపోయినది. అబ్బబ్బా! విష మ, కడుపునొప్పి, మూత్రము. నేను మరల మందు తెచ్చుకొనెదమ, ఈ దక్షిణపు దరికే పట్టుఁడు.

జమా.—అరే బొమ్మన్ పిసాసీ, నీకీకోపం మల్లీ రెండూమూడూ గడియల్ యెన్కాకీ యెల్తాం ?

విద్యా.—అయ్యో చచ్చిపోవుచున్నాను! చచ్చిపోవుచున్నాను ?

[అని మొదట పడుక వేసిన సిపాయికడ (పాదబ్రహ్మణితునికడ) రొద పెట్టును.

పాద.—[దద్దిరిల్లి లేచి, చింతనిప్పులవంటికన్నులతో] ఎవఁడ్రా యీ పనే శ్వరుడు సైతాన్ ముండాకొడుకు? [అని విద్యానాధుని నీళ్లలోనికి త్రోయును.

విద్యా.—శివశివా. [అని నీటఁబడి మునిఁగి తేలి తన్నుకొని మరల మునుఁగును.

తంతేలు.—[చూచి] బుటకేసినాడు. తెప్పిరిల్లినాడు గాని, మల్లీ మునిగి నాడు. ఈపాలి మొసలే సంపేస్తదో, నీలు దాగే సస్తాడో? ఇం తీతిగాడికే నీటి గండమైతే యింతకంటె యేంటింత !

పాద.—ఈపాలి వాడియీత గడ్డపార యీతే. ఆముండాకొడుకు యేమైతే యేం? తొరగా పోనీండి పడవ.

తంతేలు.—యెయ్యండ్రా గడెయ్యండి. [వేసి] ఏలెస్సా, బేలెస్సా, ఏలెస్సా, బేలెస్సా, ఏలెస్సాబో బేలెస్సా, ఏలెస్సాబో బేలెస్సా. యేలా...

[పడవ నిష్క్రమించును.

## స్థలము 6. గోదావరి గట్టు.

విద్యా.—[గట్టెక్కి ఒడలు తుడుచుకొని, గుడ్డలు పిడుచుకొని చెట్లకు ఆఱ వేసికొని] ఎంత ? ఈగాలికి క్షణము. [నిక్కి నలుగడం జూచి] ఎక్కడను ఊరగ పడదు. నీటిపై మరల] శరత్ నిప్పు నీళ్లలో ... ఏమిదప్పి! [సవితర్కము]

డప్పియో, చిత్తవికారమో, కార్యభారమో? [విభూతి దాల్చి] ఆహా! శస్త్రియున్న నవి, ధరించెదను. [విప్పి పుచ్చుకొని ధరించి] అస్తమయము కానున్నది. చీకటి పడ గడియదూరమే ఆమడ యగును. [పరిక్రమించి, పడవలదిక్కు చూచి] శివశివా! దాఁటించిరి గదా తురకలు మహారాజును గోదావరిని, యమకింకరులు యాతన ప్రాణిని వైతరణిని దాఁటించునట్లు! హా! దైవమా! హా! దైవమా! ఎట్టి ప్రభువు కెట్టిగతి పెట్టితివి.

ఉ. కట్టిఁడిదైవమా, యెటులు [1]కాఱియ వెట్టితి రాజశేఖరుఁ!
గుట్టనె కన్ను చెంపపయిఁ గొట్టెనె తన్మహిమాతిరేకముల్!
[2]చెట్టలు లేరె నీ చెనఁటిచేష్టల కగ్గము సేయ? నిస్సిరో!
దిట్టవు, మొండికట్టియవు, తిట్టులకే యొడిగట్టె దెప్పుడుఁ! ౧౧

ఆ. ఈఁగకూన చెనకు నింక [1]విష్ణురథంబు,
శరభరాజు నణఁచు సాలెపురువు,
పార్థివేంద్ర, నిన్ను బందిఁ జేసెఁ బటాణి,
తరము గాని దొకటి ధరణిఁ గలదె! ౧౨

చ. పరముఁడు వేదపూరుషుఁడు పాదలిసోమకుచేతఁ జిక్కఁడే!
హరిహరపద్మభూమయుఁ డహస్కరుఁ డాఁగఁడెవింధ్యుఁడాఁపఁగా!
ధరఁ గలరుద్రదేవతవు దక్కితి వీవు కటా పటాణికిఁ!
[1]దరళవిధిప్రతారణలు దప్పునె మేదిని నెట్టివారికిఁ! ౧౩

ఉ. ప్రోడకళాసులుఁ, దెలివిప్రో వగుమాలిమి, మార్తురఁ యమ
[2]క్రోడము సేర్చుబంట్లు, [2]తెరకోకలు, గ్రాలఁగ లీల నేఁగుచుఁ,
ఓడ విరుద్ధవాయుహతి నుత్తర [3]వార్నిధిఁ జొచ్చి వ్రేల్మిడిఁ
బూడెను బో[4]శిలాహిమసమూహమునఁ! విధి యెంతధూర్తమో,

౧౧. 1. బాధ. 2. దుర్మార్గులు. అగ్గము=పాలు.

౧౨. 1. గరుత్మంతుని. శరభము=ఎనిమిది కాళ్ల జంతువు, సింహముమకొట్టును.

౧౩. పాడుసోమకుఁడు వేదమును దొంగిలించినాఁడు, త్రిమూర్త్యాత్మకుఁ సూర్యుని వింధ్యపర్వతము ఆఁపివైచినది...చపలమయిన దైవముయొక్క వంచనల

౧౪. 1. ఱొమ్మున. 2. తెరచాఁపలు. 3. సముద్రము. 4. రాతిమంచు మొత్తముల్లో. సేనానాయకులు, దండు, మహామంత్రి, విజయధ్వజములు, లోనగునంగములు బలిష్ఠముగాఁగలిగియు, ప్రతాపరుద్రుఁడు, దుష్టదైవప్రేరణచే వేఁటకై గోదావరీతీరా ణ్యామున కేగి ... తురకల రాణువలో చిక్కెను.—అనిభావము.

[వరల నలుదెసల చూడ్కి నిగిడించి] ఎక్కడను మనుష్యప్రాణి యగపడదు. [మతి యొక దెసఁ గని] ఆహా! ఏమి యిది, అడవి మొగాళమున అందఱు జనులు! దండు; తరకలుగారు, వేఁట సిబ్బంది. అయ్యో! రాజపరిహారము! రాజును వెదకుచున్నారు. ఆహా! యిందాఁకటిగుఱ్ఱము ముందు దుముకుచున్నది. ఆదండును రాజు దోనియం జీవహోటికిఁ దెచ్చుచున్నది. అక్కటా! రెండు గడియలకు ముందు ఈదండు వచ్చి యుండరాదా! ఏమి హతవిధివిలసితము! ఏమి యీగుఱ్ఱము విస్వాసము! కాలకూటము హరుని కంఠమున, ఔర్వానలము సముద్రుని కడుపున, ప్రతాపరుద్రమహారాజు కా ర్యము నాహృదయమున, తిర్యగ్జంతు వింత యుపకరించినదఁట, మహాకవి నఁట, ఏల యుపకరింపరాదు! బార్హస్పత్యౌశనస చాకణ్య తంత్రాధ్యయనము పండల కు సంపడింపనా! ప్రతిభకు ఏయల్లిక కష్టము? కావ్యధోరణిని కార్యధోరణిం జేసెద. ఈదండుం గలయుదునా? వలదు. ఈమూఁకనోట నుపుగింజ నానదు. వెళ్లిపోయి యేదేనొక గ్రామముచేరి కార్యప్రబంధము నిబంధించెదఁగాక. అమ్మా యి పెండ్లి కేమి తొందర? రాజకార్యధురంధరునకు నాకు ఇఁక యోగకాలము. అమ్మాయి పుట్టకమునుపే ఈకృతిని సంకల్పించితిని. కావున ఈకృతియే నా పెద్ద కొమారిత దీనిని ఓరుంగోలు సింహాసన వివాహపీఠమున రాజునకు పెండ్లిచేసి పిమ్మట పురందరగురు విభవముతో చిన్నమ్మాయికి పెండ్లిగావించెదను. [గోదావరి యుత్తర తటముదెస దృష్టి సారించి] రాజప్పుడే తనరాష్ట్రముం బాసెఁ గావలయు. ఉజ్జ్వలం బైన తదీయహృదయాంధకారమా లోకమెల్ల నాక్రమించుచున్నది! నలుదెస లం గని] అహా! ఎటు గన్నను లోకము రాజుకై వగలఁ బొగులుచున్నది.

ఉ. దండితవైరివీరునిఁ బ్రతాపనరేంద్రుని ముల్లెమూటగాఁ
గొండని దైవమీతురకకూళలకీఁ గనుఁగొన్నమింటికిన్
గుండియ వ్రీల నెత్తురుల గుజ్జగుకండలు రెండునుం బలే
చండగభస్తిమండలము. శైవలినీకలితార్కబింబముల్! ౧౫

ఓ గోదావరీ,

ఉ. వేసర కేడ్చె దేల. యరవిందసఖప్రతిమారుణాస్యముల్
మూసికొనంగ శైవలపుమూర్ధజముల్, గడు గాలి నూర్చుచున్,

౧౫. శత్రువీరులను దండించిన ప్రతాపరుద్ర మహారాజును ధనపు మూటగా 'ఇదిగో పుచ్చుకొండి' అని దైవము క్రూరులగు నీతురకలకు ఇయ్యఁగాఁజూచిన యా కాశమునకు గుండె పగులఁగా నేర్పడిన నెత్తుటిగుజ్జుతోడి రెండుబద్దలునుమాఆకాశ మందలి(యీసాయంకాలపు)సూర్యబింబమునుగోదావరిలోని(యీ)ప్రతిబింబమును,

భాసురవీచికాత్రివళి పై పయిఁ దోఁవ రథాంగయుక్ స్తనో
చ్ఛ్వాసము మీఱ, మాధుకరఝంకృతిమూల్గున, నంచ మెల్లునన్!

తే. అహితవిధి కిట్లు రోషారుణాత్ముఁ డగుచుఁ,
కుతలపతిపాటునకుఁ [1]గాఁక, క్రుంకు మెట్టఁ
జరమ కాష్ఠా చిత సమిద్ధ సాంధ్యరాగ
వహ్నికుండానఁ బడె [2] లోకబాంధవుండు. ౧౭

క. కువకువ [1]వాపోవుఁ [2] దరుల్,
సవసవ [3]బాష్పాంబువృష్టిఁ [4]జదలుం గురియున్,
[5]శివలవిరుతి నేడ్చు దిశల్,
[6]పొవసి నవసి పేదవడియె భువి నెమ్మొగమున్. ౧౮

ఆ. [1]జ్యోత్స్న గలుగ వెలిఁగి జోత్స్న వీడి చనంగ
విన్ననైనపూర్ణ [2]విధునిపగిది,
సిరి గలుగ వెలింగి సిరి వాయ క్షణములోఁ
దేజ మెడలె రుద్రదేవుముఖము. ౧౯

౧౬. సూర్యప్రతిబింబమనెడు కందిన ముఖమును నాఁచనెడు తల వెండ్రు కలు క్రమ్మకొనఁగా, (ఈ సాయంకాలపు) గాలియను మిషచేత నిట్టూర్పులు విడుచు, ప్రకాశమానములయిన యలలనెడు వళిత్రయము మాటిమాటికి పయికి అగపడుచుండఁగా జక్కవదంపతు లనెడి పాలిండ్లయుబుకు అతిశయిల్లుచుండఁగా తుమ్మెదల ఝుంకారమనెడు మూలుగుతోను హంసకూఁతలనెడు, కంఠధ్వనితోను వినువక ఏల యేడ్చెదవు ?

౧౭. కుతలపతి=రాజుయొక్క. 1. ఓపక. 2. సూర్యుఁడు, చర...మిద్ధ చరమ=కడపటి-కాష్ఠా=దిక్కునందు-చిత=పేర్పఁబడిన (కాష్ఠ=కట్టెలతో-చిత =పేర్పఁబడిన) సమిద్ధ=మండిన-సాం...డానన్=సంజకెంజాయ యనెడు నిప్పు గుండములో.

౧౮. 1. ఏడ్చెడును. 2. చెట్లు. 3. కన్నీటివర్షమును. 4. ఆకాశము 5. నక్కల యూళలచే. 6. భూమియొక్క యందంపుమోము పొగలు క్రమ్మ కృశించి కళదప్పినది. పక్షులు చెట్లలో చేరి కూయుట, సంజమంచు పడుట నక్కలు అఱచుట, రాత్రి వంటలకై నిప్పు రాజవేసికొనెడు పొగలు వ్యాపించుచుండుట, చీకట్లు పడుటయు, ఇటు వర్ణింపఁబడినవి.



౧౯. 1. వెన్నెల. 2. చంద్రునివలె,

క. కత సేయుట, కత సెప్పుట,
కత వ్రాయుట, కతను నాటకం బాడుటయుఁ,
గత నెఱుఁగుటయును, వేఱే;
కతయ యగుట వేఱె; దైవగతి వింత గదా! ౨౦

క. కతగా నేనియు నీభూ
పతిగతి యాలింప గుండె పట్టున వ్రీలుఁ,
వెతకు మితియె కంటఁ గనఁ?
మతి నాకుఁ భ్రమియు జడియు మఱచుం బఱచుఁ. ౨౧

క. తబ్బిబ్బయినం బని చెడు;
నబ్బురపా టైన నీతి యందదుకు లగుఁ;
మబ్బు తొలఁగించుకొని యిదె
గబ్బితనము దాల్చి రాజుకార్య మరసెదఁ. ౨౨

అహో! నాహృదయము * జగన్మిథ్యాత్వ రాద్ధాంత నిశాంతం బయ్యె నిట కాహావిఃపిండంబువోలె పేలవతాభాజనం బైనది, దేనిం గాంచినను క్షణములో లు క్షణములోవగపును గలుగుచున్నవి. అరాజకలక్షణమా? మంచిది; †విషాదము స్త్రైణము, §వ్యవసాయము ††పౌరుషము. అనభ్యస్తరాజకార్యుండను ఎట్లు కార్య రణిం బాటింతును! [ఇంచుక ఆలోచించి] ఇట్లగుంగాక.— ఈ కొణితివాడ కరిగి కరణప్రభృతి రాజకీయుల నిడిత్రిప్పి రేపు మధ్యాహ్నము మంత్రిసన్నిధినుండెద. కరణ మింట ఆతని గ్రామాధికరణకప్రభృతులం దేరఁ బంపి వేసి, అతఁడు వారిందోడ్కొని వచ్చునంతలో రాజదత్తములుగా శ్రీప్రతాపరుద్రమహారాజ నియుక్త త్రిలింగరాష్ట్రీయధర్మ విచారణాధ్యక్షుం డని యధికారమును నిర్దేశించు శాసన మొకటి, సర్వ గ్రామముల మంత్రిసమానముగా సన్మానములు జరిపి ఏలినవారిముడుపులో వ్యయము వ్రాసికొనవలసినదిగా గ్రామాధికారులకు రాజశాసన మొకటియు, వ్రాసి, కాల ల్లు గుచ్చుకొన్న దని జీడిగింజ తెప్పించి, రెంటికిని రాజముద్రికలు వేసి యుంచుకొని, గ్రామాధికారులకు చూపెదను. సన్మానశాసనమునకు నిరువది ప్రతులు వ్రాయించెద. అందులోనే ప్రతిగ్రామాధికరణకుఁడును తనశాసనము తాను పుచ్చుకొని

* ప్రపంచము అసత్య మనెడు సిద్ధాంతమునకు చోటు, † దుఃఖించుట, ‡ స్త్రీలది, § ప్రయత్నించుట, †† పురుషులది.

కడమవానిని పైగ్రామాధికరణమునకు తత్క్షణమే పరుగుటపా మీఁద పంపుట వ్రాయించెద. అన్నిటికిని ఇతరులను కనుమొఱఁగి రాజముద్రికయే వేసెద. ఈ ప్రయోగముచే గ్రామగ్రామంబునను సవారి, పదునార్గురు బోయలు, వెంటరా బ్రాహ్మణులు, జోడు దివ్వటిగాండ్రు, వీరినెల్ల నేను చేరకముందే పుట్టించియుంచెద. ఆహా రాజముద్రికాప్రభావము! ఈ కరణముపేరు కొంణకంచి బుచ్చన్నయఁట. ఈనిమ్మ కనులకు మెలఁకువగా గంత వేయవలయును. ఆవులించినఁ బ్రేవు లెన్నగల యిది. నాకవనమునకు మెచ్చి రా జిచ్చిన యీయధికారమును చెల్లింపకముందే అద్దరిని తల్లిం గనఁగోరి వినీతవేషాభిలాషినై నిష్పరివారముగా వచ్చి, ఏయితర సాధనములు లేక, మరలితి నని బొంకి కరణమును సమాధాన పెట్టెదను.

క. కుదిరెఁ బదక మిప్పటికిన్,
బదిలముగా మంత్రి కెఱుకపడు రేపటికిన్;
సదమదము గలదు పిమ్మట;
మది కరఁగదొ యింక నైన మలఁకల విధికిన్?

గట్టు దిగి ఆయూరిదారి వెదకెద. [అని నిష్క్రమించును.

# చతుర్థాంకము



స్థలము;—ఓరుఁగల్లు, యుగంధరమంత్రిహవేలి, కచ్చేరిశాల.

అంతట యుగంధర జనార్దనులు ప్రవేశింతురు.

యుగం.—వచ్చావా జనార్దనా, నీజాగ్రత్తకు సంతోషమే, కాని,

ఉ. ఏల చొరంగనిచ్చితివొ యీతురకన్ మనసీమలోనికిన్!
చీఁకుప వేమి యి ట్లగడు చేసినవీని నెఱింగినప్పుడే!
ఏల పటాణినేతలకు నీసులు వెట్టి పరస్పరంబు ఖూ
నీ లొనరింపఁ జేయవు? మనీషివి, నీతలఁ పేమి బాలకా!

జనా.— వారియందు సప్రయత్నుఁడను గానే యున్నాను.

యుగం.—చెనుముకి దొరకినాఁడా యేమి!

జనా.—అవును.

ప్రతీహారి.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి, వేతాళ భేతాళగారలు వచ్చియున్నారు.

యుగం.—రమ్మను.

ప్రతీ.—మహామంత్రి గారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

యుగం.—[చింతించుచు ఆత్మగతము] చీలినతురకదండు రాలేదు, పోయిన ప్రభువు రాలేదు. అదం జేమయిన ప్రభువును పట్టుకొనిపోయియుండునా? [వామాక్షి స్పందనము సూచించి] అక్కటా! వామాక్షి పట్టువడె ననుచున్నది!

అంతట బేతాళరావు ప్రవేశించును.

బేతా.—జయము జయము మహామంత్రిగారికి.

యుగం.—బేతాళరావూ, కూర్చుండుము. నీజాగ్రత్తకు మిగుల సంతోషము. కమ్మఁడు నీపనిని సులభపఱుచుచున్నాఁడు.

బేతా.—దేవరవారు పెట్టినంతపనికే మిక్కిలి కృతజ్ఞుఁడ నయ్యెదను.

యుగం.—మానీతికి శేషించినది నీది, నీచేతికి శేషించినది మాది.

బేతా.—తమ రట్లు చెప్పుటయే. తమరు రాఁగానే మాకేమియు శేషింపని నిరాశచేసికొంటిని.

యుగం.—న్యాయ్యమే.

క. మానులకుఁ దపము లెట్లో
భూనాథుల కట్లె సైన్యములు, కరణీయం
బైనవి, వ్యయ మొనరింపక
గానివి, మఱి తీఱనికొఱగాములఁ దక్కన్.

అయినను ఈమాటు మాయాజ్ఞ కాఁగానే నీదండు అనుమకొండదండు రెండు ప్రక్కలం బొదివి, యీతురకదండును రూపు మాపవలసినది.

బేతా.....మహాప్రసాదము.

ప్రతి.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి. శిరస్తా విశ్వాసరావుగారు, సురపురం జమీన్దార్ విజయరామరెడ్డిగారు, రెడ్డిసముద్రం జమీన్దార్ నారాయణరాజుగారు, చెకుముకిశాస్త్రి, ఇంకననేకమంది జమీన్దారులు, ఉద్యోగస్థులును, వచ్చియున్నారు; అందరు దర్శనానికి మామూలుగా శెలవు గలవారే.

యుగం.—అందఱను రమ్మను.

అందఱు:—[వచ్చి] జయము జయము మహామంత్రిగారికి.
[వచ్చినవారు కూర్చుందురు.

యుగం.—కూర్చుండుఁడు.

యుగం.—మీ రందఱు స్వప్రయోజనములకై వచ్చితిరా? విశేష మేమి?

జమీన్దారులు.—తమరాక రాజ్యాంగముల భయసన్నిపాతమునకు ఔ
షధ మైనది.

బేతా. విశ్వా.—తమరాక వాడినచేనికి వర్ష మైనది.

యుగం.—[ఆత్మగతము] మఱి ప్రభువుస్థితి?

ప్రతీ.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

[అని చేతికి చీటి యిచ్చును

యుగం.—[ఆత్మగతము] ప్రభువుస్థితి జయమఁట. వాహాత్మ్మీ పట్టువడె నన్న
ఇందు నాప్రయత్నము వలయునా? [దక్షిణ బాహుస్ఫురణమును సూచించి] ఆహా
సర్వము నాప్రయత్నమున నే సాధనీయ మని దక్షిణబాహు వెచ్చరించుచున్నది! [చీ
పుచ్చుకొని చదివి ఆత్మగతము] "మంత్రసహాయుఁడను, కార్యము చెడినది, తత్క్ష
ణము దర్శన మీయవలయును." అని చీటి. విద్యానాథమహాకవి అని చేవ్రాలు.
ఇతఁడెవరో పరమనిపుణుఁడు, రాజుస్థితిని ఎఱిఁగి వచ్చినాఁడు, గార్యము చెడిన
నా యూహ తప్పలేదు. [ప్రకాశము] ధర్మసింగ్ ఆయనను తోడ్కొనిరా.

ప్రతీ.—[విద్యానాథునిం దోడ్కొని వచ్చి] వారుగో మహామంత్రిగారు.

యుగం.—[విద్యానాథుని పరికించి స్వగతము] మంచి వర్చస్వి, మహా
మంత్రరక్షకుఁడు, ప్రయోగభంగము చేయఁడు. [ప్రకాశము] ఇక్కడ ఇక్కడ [న
దగ్గఱకు పిలిచి] ఎవరురా అక్కడ? కుర్చీ కుర్చీ!

[నౌకరు కుర్చీ తెచ్చి యుగంధరుని ప్రక్క నుంచును

యుగం.—[విద్యానాథుని నిదానించి చూచి లేచి] విద్యానాథ మహా
యనఁగా నెవరో అనుకొంటిని. నాప్రాణమే. [అని కౌఁగిలించుకొను

విద్యా.—[కౌఁగిలింతలో నే చెవిలో] రాజును తురకఢిల్లీకి కొనిపోయినారు

యుగం.—ఎన్నాళ్లకు! ఎన్నాళ్లకు! [అని మరల కౌఁగిలించుకొని చెవిలో
వేఁటగాయములతో రాజు శెడఁదపూడిలో రామావధానులయింట నున్నట్టు
తెప్పింపుము.

విద్యా.—[కౌఁగిలింతలో నే చెవిలో] చిత్తము.

యుగం.—కూర్చుండు తమ్ముఁడు కూర్చుండు.

[విద్యానాథుఁడు కూర్చుండును

యుగం.—జనార్దనా, ఎవరో ఎఱుఁగుదువా?

జనా.—[హర్షాశ్చర్యములతో] ఆహా చిన్నన్నయ్యా!

[అని లేచి వచ్చి పాదముల వ్రాలును. విద్యానాథుఁ
లేపి కౌఁగలించును. జనార్దనుఁడు కూర్చుండును

యుగం.—ఇరువదియేండ్లకా అన్న జ్ఞప్తికి వచ్చుట?

విద్యా.—అర్థాత సంపాదించుకొనిగదా సన్నిధి నుండవలయును?

యుగం.—తమ్ముఁడు తిరుగవేయనితాళపత్త్రము సాత్త్వరముఇఁక లేదుగదా?

విద్యా.—అంతయు తమ యాశీఃప్రభావము,తమకు నెల పట్టినవిద్య నాకుసం వత్సరము పట్టినది.

యుగం.—పదేండ్లు నీవార్తయే తెలియక అమ్మ పడినదుఃఖము చెప్పరేము. వు కటకములో ప్రభాకరజ్యౌతిషికుల తోడాలు లాగుకొన్నప్పుడు గదా మాకు వార్త తెలియుట?

విద్యా.— ఏమో బాల్యచాపలము.

యుగం.—ఇప్పుడు ముసలివైతివి గాఁబోలు? నీప్రథమోపాధ్యాయులు ఘన పండా దిగ్విజయజ్యౌతిషికులు క్షేమమా?

విద్యా.— క్షేమముగా నున్నారు. దర్శనముచేసికొని వచ్చితిని.

యుగం.—ఆతోడాలు చేతుల నున్నవా? [అని చేయి పట్టుకొనఁ బోవును.

విద్యా.—ప్రయాణములో తీసిపెట్టి వచ్చితిని.

యుగం.—పదునెనిమి దేండ్లకు పదునెనిమిది విద్యలు ముగించి, రెండేండ్లు దేశాటన రాజసభాప్రవేశములు గావించి యిప్పుడు అన్నకడకువచ్చితివి. [జనార్దను తో] తమ్ముఁడూ మీ చిన్నన్నయ్యను అమ్మకు చూపింపుము.

ఆ. అమ్మ నేఁడు ముఖువు లంపుఁ బో చెటి లక్ష
విశ్వనాథునకును వేంకటాద్రి
నాయకునకు రంగనాయకునకు రామ
నాథునకును సోమనాథునకును 3

చిన్నన్నయ్యకు భోజనాదికము విచారించుకో, మరల పోనీపండ సేవించుకో, భోజనము కానిచ్చి తీసికొని రా, జ్యౌతిషవినోదము కొంచెము చూడవచ్చును.

[జనార్దన విద్యానాథులు నిష్క్రమింతురు.

యుగం.—[సభ్యులతో] ఇతఁడు మా పినతల్లి కుమారుఁడు.

క. ఈతని జన్ననితోడన్
మాతల్లియె పెంచెఁ గవలమాడ్కిన్; మహో వి
ఖ్యాతి గలజోస్యుఁ; డీతని
చేత మనము దెలియవచ్చు క్షితిపతివిధమున్. ౪

సభ్యులు.—తమదర్శన మైనప్పుడేట దారి యేర్పడక తప్పునా! ఇఁక మేము కోటిలు భాంగగములు ఆడుచుండవచ్చును.

యుగం.—ఏమి చెఱకుకిశాస్త్రీ, వీరాంజనేయు మేమి చేసినది?

చెఱు.—తోఁక జాడించి కన్నులలో మన్ను కొట్టుచున్నది.

యుగం.—ఎంతసేపు కావలయు మన్ను కొట్టుటకు?

చెఱు.—గరుత్మంతుని దృష్టి గద్దలకుఁ గలుగునా?

[విద్యానాథ జనార్దనులు వచ్చి కూర్చుందురు. పేరిగాఁడు
ను వచ్చి యుగంధరునికి విసనకఱ్ఱతో విసరుచుండును.

యుగం.—విద్యానాథా, కొంచెము వీరికి జ్యోతిషవినోద మొసంగుఁడు.

విద్యా.—తమయాజ్ఞ. [బేతాళరావును జూచి] మీచేయి చూపుఁడు.

[బేతాళరావు చూపును.

యుగం.—మీరు కానిచ్చుచుండుఁడు. [అని వ్రాయుట నభినయించును.

విద్యా.—మాది ఓఢ్రిజ్యోతిషము. మాకు చేయి చాలు, జాతక మనావశ్యకము. వేయేండ్ల క్రిందటివారిదైనను సరియే, సరిగా చేతిలితస్వీరు తీసియుంచినవారి చర్య యావత్తు చెప్పఁగలము. మీకిప్పుడు సూర్యునిలో అంగారకుఁడు. మీనామధేయము?

బేతా.—బే [అని సగములో]

విద్యా.—మీరు చెప్పకుఁడు, బేతాళరాజు.

సభ్యులు.—ఏమాశ్చర్యము! ఏమాశ్చర్యము!

విద్యా.—యుద్ధము, జయము, ఓపు.

బేతా.—సంతోషము. గతము చెప్పుఁడు తాగ్రాణగా.

విద్యా.—[చెవిలో] మీరు అయిదేండ్ల క్రిందట విజయనగరమునుండి దండులో వచ్చుచు తుంగభద్రకడ విడిసి గట్టుమీఁద ఒంటిగా సికారిపోయినప్పుడు గొల్లపడుచు చే చీవాట్లుపడిన చరిత్రము చెప్పుదునా?

బేతా.—స్వామీ, ఈయన యెవరో దేవుఁడు కాని మనుష్యుఁడు గాఁడు. ఘ దివ్యదృష్టిగాని జోస్యము గాదు. స్వామీ, ఇఁక నాకు చాలును.

విశ్వా.—ఆహా అంతటివాక్సిద్ధియేని నాజాతకము కొంచెము చెప్పుఁడు.

[అని చేయి చూపును. పేరిగాఁడు తెలిచినవో
మూయక ఆశ్చర్యపడుచు పరికించుచుండును.

విద్యా.—[విశ్వాసరావుచేయి చూచి] పంతులకు గురువు ఉచ్చ, వాక్స్థానమున; మహాయోగజాతకము; మహావాగ్మి.

బేతా. ప్రభృతి సభ్యులు.—బళిబళి, ఏమి విశ్వాసరావుగారు? అనుభవసిద్ధమా? ఇప్పుడైన మామాట ఒప్పుకొందురా? [విశ్వాసరావు సభ్యుల

విద్యా.—బహుసమర్థుఁడీయన. గుండెలు తీసిన బంటు. ముగ్గురు కుమారులు. పెద్దవాని జాతకమునమీనలగ్నములో గురువు. వాఁడును ఇంతటినోఁటివాఁడే. భార్య మహాపతివ్రత. పంతులవు కూడ ఏమయిన తార్కాణ గావలయునా ?

విశ్వా.—చెప్పుఁడు.

విద్యా.—[చెవిలో] పంతులూ, నీవు మూఁడేండ్లక్రిందట సురపురము జమీను కాపాడుటకై మాయన్నగారి చేవ్రాలు చేసి పెద్దపెట్టికడనుండి యెనుబది లక్షల వరహాలు తెప్పించి సర్కారుకు ఖజానాకు చెల్లించి మూఁడవనాఁడు మరల మాయన్నగారే పంపినట్లు ఆతనికి పంపలేదా ?

విశ్వా.—[తటాలున కుర్చీనుండి దుమికి విద్యానాధునిపాదములు పట్టుకొని] మహానుభావా, నాగుట్టు దాఁచి నా తల కాచెద నని వర మిచ్చిన ఈ పాదములు వదలెదను. [పేరిగాఁడు ఆశ్చర్యముతో తెఱచిననోరుమూయక చూచుచుండును.

విద్యా.—వర మిచ్చితిని పో.

విశ్వా.—[తనకుర్చీలో కూర్చుండి ఆత్మగతము] ఇతని జోస్యము ప్రాణోపద్రవముగానున్నదే! పోయెకుభూతమ మీకెట్టుకొమ్మను విఱుచుకొని పోవునుగాక. [ప్రకాశము]సర్వజ్ఞమూర్తీ, బ్రహ్మవాక్యమైనను తప్పునుగానిమీవాక్యతప్పదు. పోనీ నేనధికప్రసంగి నని తమరు ముందే సెలవిచ్చినారుగదా. వీనిచేయి చూడుఁడు.

[అని పేరిగానిని చూపును,

పేరి.—[వణఁకుచు తబ్బిబ్బుగా వచ్చి] యిదుగో సూసుకోండి నే నే మెరగను. [అని రెండుచేతులు బోరగించి చూపును.

విద్యా.—[ఆత్మగతము]ఈమహానుభావుఁడేమో వేఱే దారితీయుచున్నాడు. [ప్రకాశము] వీఁడు చాకలి, పేరు పేరిగాఁడు; వీని పెండ్లాము ఎల్లి.

పేరి.—[భయముతో వడఁకుచు వెనుకకుఁ బోయి తనతావున నిలిచి] మహా ప్రెబో, నాను సత్తెప్రెమానకంగా శెప్తా. నాను తీలేదుండి, అదీ తీలేసుండి.

జనా.—ఏమిరా నీవును అదియు తీయలేదు ?

పేరి.—వుంగరం మారాజా ?

జనా.—ఏ యుంగరమురా ?

పేరి.—[విద్యానాధునిచూపుచు]ఆమారాజుపోంగొట్టుకున్నా వుంగరముండి.

జనా.—నీవు తీయకపోయిన, ఆయన యుంగరము పోఁగొట్టుకొనె నని నీ కెట్లు తెలిసినది ?

పేరి.—ఆరి శేతులోది తందేమో అని, యీరి శేతులోది తందేమో అని, ఒక రొకరి శెయ్యూ సూడటం, [విశ్వాసరావును చూపుచు] యీమారాజుఆయన కాళ్లట్టు

కాని 'నాగుట్టు దాసండి నాతల కొాసండి' అని, నామీ దెట్టి నన్ను మాపట్క,
యిదంతా నాను నూ ల్లేదండీ?

బేతా. జమీన్దార్లు.—[నవ్వుచు] ఏమయ్యా ఉంగరము చోరీ చేసి,పాపపు
లోఁకువ యని వానిమీఁద పెట్టుట న్యాయ్యమా?

విశ్వా.—నే నఁటరా నీమీఁద పెట్టినాఁడను?

పేరి.—రచ్చించుండి మారాజా, నా నెరగనుండి. [అనివంగివండాలుపెట్టును.

జనా.—ఓరి|మూర్ఖుఁడా, ఉంగరము గాదురా, జోస్యము చెప్పుచున్నారురా,
చేయి చూచి.

పేరి.—తెలక తూశినా, నన్ను కొాయండి మహాప్పెబో.

విశ్వా.—ఈమాఱుమన్నించితిమి. ఇంకొకమాఱుఇట్టితప్పుచేయము, తెలియును.

జనా.—మన్నించినారులే. భయపడకు. చేయి చూపించుకొానెదవా?

పేరి.—పెబువుల మణుచు. [అని యెడమచేయి చూపును.

విద్యా.—కుడిచేయి చూపురా.

పేరి.—యేశెయ్యైతే యామని పుట్టిశెయ్యి నూపినాను సామీ. తెలిలోక్క
[అని కుడిచేయి బోరగించి చూపును.

విద్యా.—అఱచేయి చూపరాఁ? [పేరిగాఁడు అఱచేయి చూపును.

విద్యా.—[చూచి] ఈనడుమ వీఁడు ఎల్లితో జగడమాడినాఁడు. అంతట ఆ
[అనఁగానే సగములో]

పేరి.—[వంగి దండ మిడుచు] అది శెప్పకుండి సామే, అది శెప్పకుండి.
నాను శిత్తగించుకొన్నమాట పెబువులు మనవి శేసుకోండి.

జనా.—మీకు జగడమేల వచ్చినదిరా?

పేరి.—నానుండి దాన్ని 'మామా' అని పిలమన్నానండి. 'నాను పిల్నా'
అన్నదుండి.

విశ్వా.—మఱేమని పిలిచినదిరా?

పేరి.—పేరిగా పేరిగా పేరిగా, అని పిలిశించుండి. ఇదేనుండి నాను కొట్టి
ద్దని శిత్తగించుకొన్నదుండి.

విద్యా.—దీని నేనెంతమాత్రము చెప్పను.

విశ్వా.—దానిచేత ఆలాగు పిలిపించుకొని ఊరకున్నావా? నీవు అన్నమాటలో
ఉప్పువేసికొానుట లేదఁటరా?

పేరి.—[సగర్వము] నానుండి, ఆపాటున్కా,[సవ్రీడము]ఓ క్కాని మాట
అన్నానుండి.



విశ్వా.—నీమాట పడి ఊరకున్నదిరా అదిి?

పేరి.—అదుండి ఆపాట్కా మైలగుడ్డలమూ పెత్తి నానెత్తిమీా దేశిందుండి.

జనా.—జోస్యులనారు, ఇది కూడ వాఁడు చెప్పవలదని చిత్తగించుకొన్న డే. చక్కఁగా మనవిచేసికొండి.

పేరి.—ఇది శెప్పొద్దని నాను మరీ అగిత్తెంగా శిత్తగించుకొన్నానుండి.

విద్యా.—ఓరీ, ఇందుకోసము ఎల్లిమీఁద నీకు కోపమా?

పేరి.—కోపం లేదుండి. ఒకపాలి గశిరినా ఒకపాలి మంచిమాటాడుద్దుండి.

విశ్వా.—వాఁడు వలసిని చిత్తగించుకొన్నది మాని కడమ యేమయినఁ జెప్పఁడు, పాపము!

పేరి.—అవును మహాప్పెబో.

విద్యా.—[చేయి నిదానించి చూచి] అయ్యో![అని వానిముఖముం గనుచు] పాపము! ఏమి గ్రహచారము రా! ఇఁక నిప్పుడు చెప్పఁగూడదుపో.

[పేరిగాఁడు దూరముగా పోయి దినులు పడుచు గుటకలు మ్రింగుచుండును.

విశ్వా.—[జనాంతికము] ఏమి విశేషము?

విద్యా.—[జనాంతిక మభినయించి పేరిగానికి వినంబడునట్లుగానే] వీనికి రేపు ఈవేళకు మరణగండ మున్నది. తప్పెనేని ఖయిదు. విడిచిపెట్టుఁడు వాని సంగతి, రసము లేదు.

యుగం.—[వ్రాఁత ముగించి] విద్యానాథా, ఒకానొక యవశ్యవిషయమునఁ బ్రశ్న చూడుము.

విద్యా.—రాజునుగుఱించి యడుగుచున్నారు. నాజోస్యమే నాజోస్యమును పూర్వపక్షము చేయుచున్నది!

యుగం.—ఎట్లు?

విద్యా.—ఏలినవారియొద్దనుండి తమ్మునికి జాబువచ్చుచున్నది,అంచెలమీఁద; గడియకారములో నున్నది. మఱి నాజోస్య మేల?

యుగం.—సారాంశము. రెండుమాటలు చిత్రమునకు.

విద్యా. (మత్తకోకిల)

దండుఁ బాయుట, యొంటి నొక్కటఁ దాఁకెఁ గైదువు లేక యే
రెండు బెబ్బులుల న్వధించి [1]కిరి న్గర న్బడఁ జేతయుర్,
కండ నెత్తురు మెండు వోవుట, గానలోపల మూర్ఛయుర్,
దండలో నొకపల్లియ న్శయనంబు విప్రగృహంబునర్. 71

1. పంది.

వచ్చినది జాబు. [అందఱు ఆశ్చర్యముతో ద్వారమువైపు చూతురు.

ప్రతీ.—[ప్రవేశించి]జయము జయము మహామంత్రి గారికి.[అని యుగంధరుని చేతికి జాబిచ్చి] ఆం చెమనిసి జడివానలో తడిసినట్లు జోరుచెమటలతోటి వాకి వున ఇది నాచేత బెట్టి నేల బడిపోయినాడు.

యుగం.—పోయి వానిని దేర్పుము.

ప్రతీ.—చిత్తము. [అని నిష్క్రమించును.

యుగం.—[జాబు విప్పి చూచుకొని] విశ్వాసరావు, సునామణి.

విశ్వా.—[లేచి పుచ్చుకొని చదువుచున్నాఁడు.]

"శ్రీమ జ్జగద్విఖ్యాత లోకాతీత నీతిప్రతాప దేదీప్యమానులకు శ్రీమ త్కాకతీయ రాజ్యలక్ష్మీసగర్భ్యులకు జనార్దనమహామాత్యులకు.—

రచితాంజలిబంధుండై ప్రతాపరుద్రమహారాజు విన్నవించుట:—వేటలో నొంటిఁజిక్కి వ్రణితులమై బెడఁదపూడిలో బ్రహ్మశ్రీ రామావధానులవారియింట నున్నారము. తమరు వచ్చి మమ్ము రేపే నగరు చేర్పవలయును.

[మొహరు] "ప్రతాపరుద్ర మహారాజు."

[అందఱు విద్యానాథుని, యుగంధరుని, పరస్పరమును,

చూచుచు హెచ్చరిక సంజ్ఞలతో ఆశ్చర్యపడుదురు.

విద్యా.—[పరమానంద మభినయించుచు]మ రేమి భయము లేదు. కొంచెము కాలయాపనగాని కుదిరి స్వస్థ మగును.

యుగం.—మఱి యేలినవారివార్త వచ్చినదిగదా.అస్వాస్థ్యమునకు ఖేదమేల చున్నది. దైవగతి! జనార్దనా, చిన్నదండుతో నీవును విద్యానాథుఁడును పోయి వారిని తెండి. [సభ్యులతో] మీయందఱియెదుటను మా పెద్దతమ్ముని విద్యానాథుని మాతో నొక మంత్రిగా నియమించితిని. మీకు సమ్మత మగునా?

అందఱు.—మహాప్రసాదము.

యుగం.—అటయినవిదిగో ఫర్మానా.[అని తానువ్రాసినఫర్మానాయిచ్చును.

విద్యా.—మహాప్రసాదము. [అని పుచ్చుకొని కన్నుల నద్దుకొనును.

యుగం.—ఏలినవారి యస్వాస్థ్యముచే చిత్తము వ్యాకులముగానున్నది.మఱి యిప్పటికి సభ చాలింతము. [అందఱును లేతురు.

బేతా. ప్రభృతులు.—ఏలినవారికి క్షేమము కలుగవలయును.

[అని మంత్రులకు నమస్కరింతురు.

మంత్రులు.—స్వస్తి స్వస్తి స్వస్తి. [ఇతరులు నిష్క్రమింతురు.

యుగం.—కార్ఛండుఁడు. [యుగ్గరును కూర్చుందురు.

యుగం.—మీరు ఈ పేరిగానిని రోగి ప్రతాపరుద్రమహారాజును చేయవలసి నది.ముందుగా,మహాకవీ,నీవు ఈరాత్రి వీనిని రామావధానులచావడి చేర్పవలయును. జనార్దనా, నీవు సపరివారముగా పోయి ఏలినవారి బంగారపుసవారిలో వీనిని తెచ్చి కేపు నగరు చేర్పవలసినది, రామావధానులకు పేరిగానిచేత ఈశ్రోత్రియమిప్పింప వలసినది. ఇదే దానశాసనము.[అని జనార్దనునిచేతికి కాగిత మిచ్చుచు] కృత్యవిశేష ములు వచ్చి చేరినపిమ్మట తెలియును.

విద్యా.

ఉ. రాజు నొనర్చె, [1]విక్రము, దిరంబుగ దేవత వేయివర్షముల్,
భ్రాజితబుద్ధి దాని నలభట్టి రచించెను రెండువేలుగా;
నా [2]జనయిత్రి యొక్కనినె నగ్గనియెన్; మహనీయ, యుష్మద
వ్యాజకృపాకటాక్షమున నైతిని ముప్పుర [3]మాశ్రితావనా. ౬

నీమనియందుంచిన నమ్మకమునకు లజ్జితుఁడనగుచున్నాను.

యుగం.—నీప్రజ్ఞకు ఫల మిది, నీవు కవివి గావు, కవిని అనఁగా ఉశనుని మించినవాఁడవు. నానమ్మకము అపాత్రన్యస్తము గాదు.

విద్యా.—ప్రీతివిస్రంభముల కర్హుఁడ నయ్యెదను.

యుగం.—సరి. [పేరిగాఁడు తొంగిచూచును.

యుగం.—[జనాంతికము] వీఁడు నిన్ను వదలఁడు. వీనిని పేనుము. [ప్రకా శము] మతి లోపలికి పోదము. [పోవుదురు.

పేరి.—[ప్రవేశించి విద్యానాథునికాళ్లఁబడి] మహప్పెబో ఆగండమేంటో సెప్పండి సామీ, తప్పించుకొని బదుకుతా.

విద్యా.—లేవరా, లే.

యుగం.—విద్యానాథా, నిలిచి చెప్పి రా, పాపము! తప్పింపుము సాధ్య మైన. వాఁడు మాకు మిక్కిలి నమ్మక మైన నౌకరు.[అని ఇద్దఱు నిష్క్రమింతురు.

విద్యా.—ఇటు రారా. ఇక్కడ ఏకాంతమునకు రా.

[అని పరిక్రమించును. పేరిగాఁడు పరుగునఁ బోయి కుర్చీ తెచ్చి విద్యా నాథునికి వేయును. విద్యానాథుఁడు కూర్చుండును. చాకలి మరల పరుగునఁ బోయి విసనకఱ్ఱ తెచ్చి విద్యానాథునికి విసరుచుండును.

విద్యా.—ఓరీ, తురకసర్దారుని శేరాకడ నుండు పహరాసిపాయి నిన్ను చటుకిపెసి యెల్లిని తీసికొని ఢిల్లీకి పాటిపోఁ దలఁచియున్నాఁడు.

౬. 1. విక్రమార్కుని. 2. తల్లి. 3. ఆశ్రితులను రక్షించువాఁడా.

పేరి.—ఓయి బాబో, తాతల్లో! అమ్మల్లో! నన్ను నరికేశినా నాను బదు
తాను గాని, యెల్లి లేకపోతే నాను బదకలేను మారాజా. రచ్చించాల రచ్చించా

విద్యా.—అల్లరిచేయకు మూర్ఖా. నిన్ను బయటికి పోనీక ఇచటనే నిలుపుట
నీచావుతప్పినదిగదా. నీవు సదా మాతో నేఉండుము. నిన్నెవండును ఏమియుచేయలేడు.

పేరి.—బుద్దిబుద్ది, మ ఎల్లిగతి యేలాగ నాసామే!

విద్యా.—ఎల్లిని మేము కాపాడెదము. మేము నీకు సెలవిచ్చినప్పుడు నీవు
ఎల్లిని గలసికొనుము.

పేరి.— నాగండం తప్పింది బాబూ! నాగండం తప్పింది నాసురుడా!

విద్యా.—గండము తప్పిన యోగము పట్టవలయునుగా.

పేరి.—గుడ్డ లుదుక్కొనే ముండావోడికి నా కేమి ఓగం సామీ!

విద్యా.—అటయిన మామాట తప్పునంటరా?

పేరి.—అమ్మా! బెమ్మదేవుడిమాట తప్పట చే! మరి శెప్ప సామీ ఆ
మేంటో పట్టించుకొంటా.

విద్యా.—రాజయోగము రా.

పేరి.—అట్లంటే తెలీలేదు మారాజా.

విద్యా.—నీవు రాజ వవుదువురా.

పేరి.—నిజమేనా సామే? నిజమేనా? వొల్లు దెలలేదు సామీ! వొల్లు
లేదు! [అని నిశ్చేష్టుండుగానుండి] మరి నాను రాజు నైతే యెల్లేమాద్ది మారాజా!

విద్యా.—రాణి యగును.

పేరి.—[మీందం జూచుచు ఆత్మగతము] వవ్వా నారంగా! [విద్యానాథు
వైపు] రాసోళ్ల గీసోళ్ల ఆడ్డోళ్లూ వోళ్లూ, నాకాడికి రారుగందా! ఆల్లని మా
నాకు బయి మేస్తది మహాప్పెబో.

విద్యా.—నీ యెల్లియే నీకు రాణి యగును. అదే నీతో సింహాసనము మీద
గూర్చుండును.

పేరి.—శింవాసోనంకాడి కెత్తే నాకేమో బయిమేస్తదుండి సామ్లుల్లుగారూ.

విద్యా.—ఇంక నేమి భయము?

పేరి.—అవును. ఇంకేం బయిం? ముంగటిమాట శెప్పినా. [ఆత్మగతము] శింవా
సోనం మీద టక్కు శేళి వోరికీ తెల్నీకుండా యెల్లిని లంజెని ముద్దేస్తాంటా
నారంగా.

[అని ముద్దుగొనుట నభినయించును.

విద్యా.—[ఆత్మగతము] పురి యెక్కినది, చాలును. (ప్రకాశము) ఓరీ, నేను
గురునాథుండను కదా, నాయాజ్ఞ తప్పువుగదా?

షేరి.—తప్పను సామే, గురునాదుడా, నీయాగ్గితప్పను గురుడా. నాసత్తెప్పె మానకం శేస్తా.

విద్యా.—మఱి చీకటిపడునందాఁక ఎవరితోను మాటలాడక మౌనముగా ఉండు. మౌనము తప్పిన యోగము పట్టదు.

[షేరిగాఁడు చేతులతో మాత్రమే దండము చూపును.

విద్యా.—ఆ! అది సరి, యోగము పట్టించుకొనులక్షణము.

[అని నిష్క్రమించును.

షేరి.—నాను రాజయ్యేవోణ్ణి, ఇక అందరూ నాగులాములేఅవుతారు. ఈళ్ల తోటి నా నెందుకు పలకటం? అయ్యవోరు అయ్యవోరుగాదు. గురునాదుడు; ఆయ్యోరు శెప్పినమానం బలే చరే.

మెల్లి నా తో గద్ది యెక్కుంటదీ!—జాఁటీ
మల్లి నా తోటి గద్ది మానుంటదీ!
పేరయ్య రాజంట! పే రెల్లి రాణంట;
తనకు మా మావోళ్లు దండ మెడ్తారంట! మెల్లి నాతో...
సందుట్లో సమయామము శేస్తానురా!—నాను
అందుట్లో సడసాము లాడ్తానురా! మెల్లి నాతో...

ఇంకేమి గావాలరా నా గురుడా! శీక టొడ్డదాకా నరమానవుడితో మాటాణ్ణు.

[అని దుముకుచు ఆడుచు నిష్క్రమించును.

# పంచమాంకము



స్థలము 1.—ఓరుఁగంటికడ ఖుస్రూఖానుని డేరా.

అంతట ఖుస్రూ ఉపవిష్టుఁడై ప్రవేశించును.

ఖుస్రూ.—రాజా వచ్చినాడని నా వేసుల్ చెప్పినార్. ఆమసాల్జీల్ హజాము ఇష్షు, ఆలాగే చెప్పినార్. వలీ ఖాన్ రాలేదు. ఆయన రాజాకి కల్సుకోలేదూ గావాలె? మరి నేనే రాయ్బారం జర్పవాలా. వలీఖాన్ యింకా రాకోవడానికి కారణం యేమి?

సిపాయి యొకఁడు.—[చాకిమాట మోచికొని ప్రవేశించి] సర్దార్ సాహేబ్, ఖ్వాం తెచ్చి దున్తు.

ఖుస్రూ.—ఆర్, యి దేమి! యిది ఉలక నే లేదే?

సిపా.—మనచాకల్దానీ లేదూ యెల్లి? అదికి మొగుడీకి వలీఖాన్ సర్దార్ పట్టుకొని ఢిల్లీకి పోయినార్, అంటుంది. అందుకోసం అది తన్ను సంపీయేస్తా మనకీ నాకరీశెయ్యడం లేదూ అంటుంది. యేడుస్తావుంది ముండా. నేను యీదుష్టు ఎవరితో నైనా ఉక్కుడామ్కు తెచ్చినాను. ఊరంతా యిదే పుఖార్,

ఖుస్రూ.—ఏం పుఖార్?

సిపా.—బడామంతిర్ యుఘందర్ వచ్చినార్, వలీఖాన్ సర్దార్ పోయే రాస్తామే జంగల్మే గాళంమే మన పేరిగాడ్కి రాజా వేషం వేసి బైఠాయించేసినార్. రాజా గోడాకి కూడ వేటా వేషం వేశి ఘూజ్ మైధానంలో వుంచినార్: వలీఖాన్ సర్దార్ మోసంపోయి మసాల్వాలా పేరిగాడ్కి రాజా తల్చి పకడ్లేవు చేశినార్; లేస్కొని పోయినార్. ఇదే ఊరంతా పుఖార్.

ఖుస్రూ.—[ఆత్మగతము] అహో! యేమి హాశ్చర్యం! యేమి యుఘందర్ మంతిరి బుద్ధిశక్తి! అలాగై తే వలీఖాన్ యీదేశంలో లేడు. హా! హా! హా! తెల్సింది బడామంతిరి వచ్చినాడు మొదల్ పేరిగాడు మానౌఖరీకి రానేలేదు! అహో మంతి యుఘందర్ ఎంతయుక్తిచేసినాడు! మాసర్దార్ గయా, రాజా ఆయా! హా! యుఘందర్! యుఘందర్.

సిపా.—సర్దార్సాహేబ్, ఆఘోడా వొళ్లంతా శానాగాయాల్పడి తప్పించుకొనివొచ్చి రాజా తబేలామే చేరింది అని మాట. ఈరోజ్ వుధయమేమహారాజా కూడా వొచ్చినార్ అని పుఖార్.

ఖుస్రూ.—[స్వగతము] యిక మంతిరి యుఘందర్ మాకీ మాలమ్కు రీకు ఘడిలోనో ఛణంలోనో సఫాయి చేస్తాడు. బడామంతిరికి మారాయభారం మోసం చేస్తే పోయింది. [ప్రకాశము] అరే, ఇంకా యేమీ తెల్సునూ నీకీ?

సిపా.—రాజాకి వేటాలో ఘాయం అయింది, ఖాయిలా చెప్తార్.

ఖుస్రూ.—హా! యీసమయంలో యంధరంరాజ్ సాత్తురుల్ భాయి వుంటే యెంతా సహాయం వుండును!

అంతట చెకుముకిశాస్త్రి ప్రవేశించును.

చెకు.—సాయముగా నుండుటెడల సిద్ధముగా నున్నాను.

సిపా.—సలాం. [అని నిష్క్రమించును.

ఖుస్రూ.—సాత్తుల్లుభాయి, సర్దార్ వలీఖాన్ యెక్కడావుంటేదీ జోస్యం చెప్పండీ మాకీ అపాయం వుందీ లేదు, జయం వుందీ లేదు కూడా జోస్యం చెప్పండీ.

చెకు.—వలీఖాను గోదావరి దాటి ఎనిమిదామడ నడచినాడు. ఢిల్లీ మేఖాలసిరదరి వేగిరపోవుచున్నాడు.

ఖుస్రూ.—అంత జల్దీ పోవడాన్కి కారణం యేమి?

చెకు.—రాజనుకొని చాకలిని ఇక్కడ నౌకరీచేయుచున్నవానినే పేరిగాసిని పట్టుకొన్నాఁడు. వెనుకనుండి రాజుసిబ్బంది తలుసుకొని వచ్చు నని భయము. త్వరగా సుల్తానువారికి ఆఖుయిదీని అప్పగింపవలయునని కోరిక.

ప్రతీ.—[ప్రవేశించి] సర్దార్సాహేబ్, వలీఖాఁ సర్దార్సాహేబ్ దగ్గర నుంచి తురుఫ్ జవాను కబుర్తెచ్చినాడు.

ఖుస్రూ.—తచ్ఛనం రమ్మను.

ప్రతీ.—చిత్తం. [అని నిష్క్రమించును.

జవాను.—[ప్రవేశించి] సలాం సర్దార్ సాహేబ్. సర్దార్ వలీఖాఁ ఈదేశం రాజాకి పట్టినార్, ఢిల్లీ కి తీస్కాని యెల్లీ పోయినార్. తమకీచెప్పినార్—ముట్టడీ చేసి వోరంగోలు పట్టవల్సింది, రాజాఘోడాకి పట్టి ఢిల్లీ కిమాకాడ్కి పంపవల్సింది. దాన్కి మేము సుల్తానువారికి నజర్ చేస్తాం.

ఖుస్రూ.—ఏమి సాస్తుల్లు బాయి? జవాఁ యీలాగ చెప్తున్నాడు ?

చెకు.—ఇతని కేమి తెలియును! ఎవఁ డేమిచెప్పినను సరియే, మాజోస్యము తప్పదు.

జవాఁ.—[ఆత్మగతము] ముసల్మానీ వేషం, బొమ్మఁ మాట! ఎవరీన? [ప్రకాశము] ఏమి మీజోస్యం బొమ్మఁ సాబ్?

చెకు.—రా జనుకొని చాకలిని మీసర్దార్ పట్టుకొనిపోయి నాఁడు.

జవాఁ.—ఛీ ఛీ ఛీ ఛీ! జూటాభాత్ జూటాభాత్! నా శేతుల్తో నేను రాజాకి సంకిళ్లు వేసినాను వోయి?

చెకు.—థూ థూ థూ థూ! డోబీకి పేరిగాడ్కి నీశేతుల్తో సంకిళ్లు వేసినావు రోయి.

జవాఁ.—అరే నీవు యిట్లా మాటా చప్తే నాకీ బలే మంటా వస్తుందీ:

చెకు.—గోదావరిలో పడు చల్లార్చును.

జవాఁ.—కబడ్దార్ బొమ్మఁ.

చెకు.—బొమ్మఁ కబడ్దారే. నీవే డబద్కార్, బడక్దార్, బకడ్దార్, ఒకనిఁ బట్టి ఒకనిఁ జెప్పుచున్నావు.

జవాఁ.—మేము రాజాకి......

చెకు.—మీరు పేరిగానికి......

జవాఁ.—సర్దార్సాహేబ్, ఈబొమ్మనుక్ పాడీచేస్తాఁ.

చెకు.—తురకపాడుము మేము తాఁకము.

ఖుస్రూ.—ఆయనమాట నీవు వినకు, నీమాట నీవు చెప్పు.

చెకు.—వీనిమాట చెప్పే.

జవాన్.—మేము రాజాకి ...

చెను.—మీరు పేరిగానికి ...

జవాన్.—[చెనుకుని రోషరూక్షముగా చూచుచు] మేమూ రాజాకి ...
జాన్ మే మోస్కాని పోయి సడ్వాలో పెట్టినాం.

చెను.—[బిగ్గరగా నవ్వుచు] అరే జవాన్ నీవు చాకలికి సవారి మోసితివా,

జవాన్.—[బాకు దూసి] మేము చాకలికి సవారీ మోస్తాం?

[అని పొడువఁబోవును. చెనుముకిశాస్త్రి అలక్ష్యముగా నవ్వును. ఖుస్రూ కత్తి దూసి జవానును నఱకఁబోవును. జవాను అల్లా అల్లా అని పాఱిపోవును.

ఖుస్రూ.—మాభుద్ధి చాలా గంధగ్ఘోళం అయింది జోష్యులు భాయి. యీ ముండాకొడుసల్ యీ ముస్తఫా ఫిరోజులు మేము లడాయి అంటే ... య్యారం చెప్తార్, మేము రాయభారం చెస్తే వీళ్లు లడాయి మొర్గతార్. క్యా కర్నా భాయి?

చెను.—వారిద్దఱు కేవలభ్రష్టు లని నేను మొదటనే చెప్పలేదా?

క. వారికి హుక్కా, [1]కంచెన్,
సారాయి రహస్యగోష్ఠి, [2]షామాత్, భంగీ;
వారికి లడాయి తెలియునె ?
వారిమొగంబులకు రాయబార మెఱుకయే?

ఖుస్రూ.—యీముండాకొడుకులబుఱ్ఱల్ తీయించివేతునా?

చెను.—వారివలననే యీయాలస్యము, లేదా, వలీఖాన్ పోయిన మఱునాఁడే మీరు కోటను పట్టియుండవచ్చును, మఱి యిప్పుడైననో? నీ సేనావఘాటిని,

ఉ. ముందు ఫిరోజు ముస్తఫ [1]సముత్థకుచాకృతి [2]మ్రొగ్గఁజేయఁగా,
మందత వెన్క [3]శ్రోణియుపమా [4]దుముదార్ధోరవీవు[5] నిల్వఁగాన్,
[6]అందువు గల్లుగల్లు రన నట్టిటు తొట్రిలు కామపీడితన్
[7]మందవిచార [8]నంధ్రపృతనాపతి [9]క్రాఁగిటిలోఁ [10]గరంచుఁబో.

౧. 1. వేశ్య. 2. చదరంగము అని భా.

౨. 1. నిక్కఁజన్నులవలె. 2. ముందటికి వాల్పఁగా, యుద్ధమునకు ... కొల్పఁగా నని భా. 3. పిఱుఁదుబలె. 4. సేనయొక్క వెనుకటిభాగమును ... వాఁడవు. 5. యుద్ధము వలదని మాన్పఁగా 6. ఏనుఁగులకాళ్లకు కట్టుగొలుసు. ... జయేచ్ఛ సంభోగేచ్ఛ. 7. ఆలోచన చాలని దానిని. ఆంధ్రసేనానాయకుఁడు ... బేతాళనాయుఁడు. 9. అన్నిప్రక్కలం బాఁడవి. 10. ... పును జూమా.

ఖుస్రూ.—హా! అల్లా! అల్లా!

చెకు.—మఱియొక మాట, దిగులుపడవలదు. యుగంధరునికి మీరు గడియకాలమిచ్చినది కూడ తప్పే.

ఖుస్రూ.—యేమి చేసినాడు! యేమిచేసినాడు! యేమిచేసినాడు!

చెకు.—మీమీఁదికి రెండువైపుల రెండు లక్షలు పంపినాడు, మిమ్ము రూపుమాపుటకు. మఱి,—

ఖుస్రూ.—మఱి యింకాయేమి?

చెకు.—శ్రద్ధగా వినవలయును. మఱి, కోటలోనుండి మీశిబిరముక్రిందికి సొరంగము త్రవ్వించి దానినిండ తుపాకిమందు నిండించినాఁడు. ఇఁక గడియలో మీశిబిరము నుండదు. పాఱిపోయిన లక్షలు లక్షలు దండు పొదివి నఱుకనున్నది.

ప్రతీ.—[ప్రవేశించి] సర్దార్ సాహేబ్, రాజావారిదుబాసి.

ఖుస్రూ.—రమ్మను.

ప్రతీ.—సర్దార్సాహేబ్ హుకుం. [అని నిష్క్రమించును.

దుబాసి.—[ప్రవేశించి] సలాం ఖుస్రూఖాన్ బహద్దరువారికి. మాయేలినవారు ప్రతాపరుద్ర మహారాజుగారు వేఁటనుండి ఈ యుదయమే వచ్చినారు. వారికి మహామంత్రులు మీరాక రాయబారము తెలిపినారు. వారు మీరాయబారము మోసమని తలఁచినారు. 'కాకుండిన చాకలిని ఏల పట్టుకొనిపోవలయును?' అన్నారు. ఇప్పుడు మహామంత్రి యుగంధరులవారు మీకు తెలుపుట యేమనఁగా—"మాచాకలిని మరల మాకు సురక్షితునిఁగా అప్పగింపుమని మీరు మీసుల్తానువారికి కబురు చేయవలసినది. మమ్ము మోసము చేసినందుకై వలీఖానుతల కొట్టి మాకు పంపవలసినదనియును మీసుల్తానువారికి కబురు పంపవలసినది. చాకలియు వలీతలయు మాకు చేరువఱకు మీరు మీక్రిందిసర్దార్లు మాఖైదీలు. ఈదండంతయు మాబందిఖానాలో వరకము. మీ యుద్ధములు సామానులు యావత్తు మావి. లేదా యుద్ధము. కాలము ఇయ్యదు," అని.—ఏమి జవాబు? [ఖుస్రూ ఏమియులోఁచక యూరకుండును.

చెకు.—వారూ స్వయంగా మహామంత్రిగారికి మహారాజాగారికి దర్శనం ఖరాబ్ చప్తార్.

దుబాసి.—[చెకుముకిని నిదానించి చూచి]ఓరి కాలయముఁడా, ఏమోయి తురకలలో కలసితివి? ఏమి నీకు వచ్చిన వినాశకాలము? చీ! పాపీ? చీ! పాపీ?

చెకు.—వినాషా కాలంనీకీవచ్చింది. కభుత్రచ్చేజవాబ్ గాద్దేకియింతాపాగర్! [అని దుబాసికి ఒక చెంపకాయ యిచ్చును. దుబాసి చెకుముకికి ఒక చెంపకాయ యిచ్చును. అది తలపాగకు తగులును. పాగ పడిపోవును, జుట్టు అగపడును.

దుబాసి.—[జుట్టును సూచించి]జుట్టున్నదీ! బోడి యనుకొంటిని! ఏమి యింత బ్రాహ్మణునికి వచ్చిన యీవినాశకాలము! [అని అంగ... దెమును

సూచించి] జంధెముకూడ నున్నదీ! మతములో కలియలేదా? మంత్రములో కలిసితివా! కడుపుకోసమా? ఉండు నిన్ను మహామంత్రియుగంధరులవారితో చెప్పి మహమ్మా... చేయించెదను. సర్దార్ సాహేబ్, ఏమి జవాబ్? జవాబు లేదు? నేను పోయెదను.

[అనినిష్క్రమించును.

చెకు.—ఈ సంకుమూతి తంట లోంద్రపెట్టును. నేనును బోయెదను.

ఖుస్రూ.—అరే, యీగడ్బిడాలో మాభుద్దీ బుఱ్ఱకీ ఖాలీ చేశింది. ఏమి భాయి పొడుచుకొని సచ్చీపోదునా?

చెకు.—ఇసీ! ఇసీ! ఇసీ! నీయాజ్ఞకు తిరుగఁబడినవారిని పొడిచివేయవలయును గాని, నీ వేల పొడుచుకోవలయు! [ఆత్మగతము] వారు నిన్ను పొడిచివేయుదురు. [ప్రకాశము] మఱి యీయుద్ధములో నన్ను మఱవవలదు. సుల్తానువారికి సిపాయిలు యుద్ధమైనవెంటనే నిన్ను కలిసికొనెదను. కొంచెము జోస్యము మిగత. యుద్ధ మారంభమగుచున్నది. మీకు అపజయము. మీదంతయు నాశము. క్రిందినిప్పు మాట మఱవవలదు. ఈదుబాసిగానిని నేను కలసికొని నామాట చెప్ప నని ఖరారు చేయు చుకోవలయును. ఒప్పనియెడల వానిబుఱ్ఱ తెగవేసి రావలయును. నీకత్తి కొంచెము దయచేయుము. [అని నిశ్చేష్టుఁడగు ఖుస్రూఖానునియొరనుండి కత్తిపుచ్చుకొని] నీ గుఱ్ఱముమీఁదనే వీనిని కలసికొని మరలెదను. సలాము భాయి సలాము. సయించవలయును. ఏమట్లు నిశ్చేతనుఁడవుగా నున్నావు భాయి? ఈస్థితిలోనున్న నిన్ను వదలియెట్లు పోదును భాయి? మాటలాడు భాయి. ప్రాణ మున్నదా లేదా?

[అని ఖుస్రూను పట్టి యూఁచును.

ఖుస్రూ.—[నిట్టూర్పు విడిచి] ఏంభాయి, వెల్లండి భాయి, లక్ష సలాము. మేం ఈపాపిముస్తఫాఫిరోజుల బుర్రల్ తీసి యుద్ధంచేస్తాం, లేదా, పరారియౌతాం.

చెకు.—ఏలోకమునసైన సరియేమనము మరలకలసికోవలయు, కత్తినిప్పుడే మహారాజవాసున కొప్పగించి పోయెద. సెలవు సెలవు. క్రిందినిప్పును మఱవవలదు.

ఖుస్రూ.—అరే రే రే! నావల్లు అంతా వేడిగా వుంది భాయి!

చెకు.—ఇఁక బొబ్బలు లేచును. తరువాత కాలిపోవును. సదా కడుపుచల్లగా నాపాదాలు అప్పుడే మండుచున్నవి!

ఖుస్రూ.—[వెఱ్ఱియావేశముతో కటారి దూసికొని] ముస్తఫాఫిరోజ్ సఖాలు

[అని పరుగున నిష్క్రమించును.

## స్థలము 2. ఓరుఁగంటి వెలుపల బయలు.

చెకు.—[గుఱ్ఱమెక్కుటను దౌడును అభినయించి] ఈముగ్గురిలో బుద్ధిలో ... ప్రవేశము కవసరమైన విద్యము. ఏమి యీగుఱ్ఱమునో వేగి! [పరిక్రమించి]

నగరము చెంతకు వచ్చితిని. బళీ! ఈగుఱ్ఱము ఈకత్తియు వీనికి ఢిల్లీ సుల్తాను ఇచ్చినవఁట. మాయేలినవారిగుఱ్ఱమును సుల్తానుగానికి నజరు పెట్టఁ గోరినందులకు సుల్తానుగుఱ్ఱమును ఏలినవారికి నజరుపెట్టెదను. ఈకత్తి నాప్రజ్ఞాధ్వజముగా నాయొద్దనే యుండుఁగాక. ఈరెండును లేమి ఖుస్రూఖానునకు రెండుచేతులు లేమియే. ఆ! వేతాళరావుయోగము! ఓరంగోలునగరిపుణ్యము! [వెనుకకు తిరిగిచూచి] అహో ఇప్పుడే యేమి యుద్ధము! ఏమియుద్ధము!

క. సుడులు దిరుగు, విడఁబడు, నె
వ్వడి నేఱులు వాఱు, కొండవాఁకలు దూఁకుఁ,
పొడ వలలు లేచు, వెల్లువ
పొడుచు, న్నిముసమున నింకి పోవుఁ, బోవుఁ: 3

అహో యేమి యిది! శిబిర మెల్లనంటుకొని దావాగ్ని యైనది! రామరామా! ఏమి యుగంధరుల శత్రునాశనప్రకారము! నాకవనపు సారంగములు నిజమే? ఏమి మిడుశంబట్ల జోస్యము! హా యుగంధరా! నాకే విభ్రాంతి యగుచున్నది! నాప్రయోగమువలన ఈరణములో తురకసర్దారు డెవఁడును దండు నడపఁడుగదా.

క. మా రెండుసేనలే యల
[1]మారునిదంష్ట్రాళియుగళి, మధ్యఁ బఠాణీ
వారు బఠాణీలఫలా
హారము లయినారు [2]కంచుకావృతితుషతోఁ. ౪

ఆ. పొంగుకడలినడిమి భూరేఖ యుప్పెనఁ
గరఁగి పగిలి కూలి కానఁబడదు;
ఈఁటెమెఱవు లేమి! యేటుంబిడుగు లేమి!
వెలితి యేది దీన విలయమునకు! ౫

అప్పుడే మైదానమెల్ల తెల్ల డేరాలకు బదులు నల్లనిగ్రద్దడేరా లగుచున్నది. ...ముల కొంచె మెవఁడో సర్దారుఁడు నడుపు చున్నట్లున్నది. బళీ! మనరాణువలే

౪. 1. యమునియొక్క కోఱలవరుసల జంట. 2. తొడిగికొన్న కవచములు (పొట్టు అనియుం జెప్పవచ్చును) అనెడు పొట్టుతో.

౫. వేతాళనాయని దండు సముద్రమువలెను, తురక రాణువ భూమివలెను, ...దీనిం బొదివి రూపుమాపుట మహాప్రళయములో సముద్రము భూమిని ముంచి వేయుటవలెను,.. ఈయుద్ధము ప్రళయమువలెను, ఉన్నవని భా...

రెండును తురకమును రూపు మాపి ఆయావేశమున ఒండొంటి పైఁ బడి కసిమసంగ గాఁబోలు. అవేమి ప్రళయ కల్లోలములా గుఱ్ఱపుబారులా? ప్రళయఝంఝూత్పాటిత విశీర్ణ గిరిశిఖరములా యేనుంగులా? శివశివా! తురకసేన రెండువ్యాఘ్రముల నడుమ సారంగి యైనది! అప్పుడే గ్రద్దలు బుఱ్ఱబొండ్లములను గడ్డపుఁదొడిమలతో తన్నుకొని వచ్చి యిక్కడ నంత పెట్టుకొని పండువు గావించుచున్నవి. హా! దావాగ్ని వడి చెదలపుట్ట!

ఉ. వైదికుఁడం [2]కృతాత్ముఁడఁ [3]దపఃపరతంత్రుఁడ, [4]నీనియోగ్యులై
గైదువుబంట్లసంగడి [1]నఘంబున మున్గనొ?—[6]ధర్మ మాక్రియ
గాదు; మహాపద న్జగముఁ గాచుమహాత్ములు వీరు; మా కిటన్
లేదఘ మించుకేని, కడ లేని శుభంబు యశంబుఁ దక్కఁగా
మఱియును,

మ. తొలి నీధారుణి జామదగ్న్యునిది; తద్దోర్దత్తమై కశ్యపా
దుల మా విప్రుల దయ్యె; నుంచితిమి సాధుక్షత్రిహస్తంబునన్
కలి నాపుణ్యుల ధూర్తదైవము వెస న్గారెంచినన్, వారలన్
బలుచెట్ట ల్పడియేని కావఁగఁ బటుబ్రహ్మాధికారం బగున్.

కావున అపరిహార్యమై చేతులార చేసినదానికి చింతిల నేల! కంటికి వెక్కసమైన పోయి మహామంత్రి యుగంధరులవారికి వృత్తాంతము నివేదించెద. [అనిపరిక్రమించి

---

## స్థలము 3. ఓరుఁగల్లు నగరము.

చూచి] అహో! నగరమెల్ల కోటబురుజులు గోపురములు చెట్లు ఇండ్లకప్పులు సర్వము నరమయము! గుండెగలవారెల్ల యుద్ధము చూచుచున్నారు. ఇదే మహామంత్రి యగు

---

ఔ. 1. వేదము చదివినవాఁడను. 2. ఆత్మసంస్కారము చేసికొన్న వాఁడను. 3. శ్రద్ధతో తపస్సుచేయువాఁడను. 4 యుద్ధ శూరు లయిన యీ నియోగుల(రాజోద్యోగస్థుల) సాంగత్యముచేత. 5. పాపమున. 6. ధర్మము అట్లుగాదు.(లోకస్థ మార్గము క్లేశించుట ధర్మముగాని, లోక మేమయినను మనకేమి అని సదా ముక్కు పట్టుకొని మూలనే కూర్చుండుట ధర్మముగాదు). అఘము = పాపము.

2. ఆదిలో నీభూమి పరశురామునిది, అతఁడు తనచేతితో నీయఁగా కశ్యపుఁడు లోనగు మాకు బ్రాహ్మణులకు వచ్చినది. మేము దానిని యోగ్యు లగు క్షత్రియులచేత పెట్టితిమి. ఈ కలికాలములో ఆపుణ్యాత్ములను (ఆ సత్క్షత్రియులను) వంచక మయినవిధి బాధింపఁగా వారిని ఎన్నికష్టము లేనియుం బడి కాపాడుట సమర్థులయిన బ్రాహ్మణులు చేయవలసినపని.

ధర్మరాజువారి హవేలీ సంయమని. ప్రవేశించెదను. [అని యశ్వావరోహణ మభినయించి] ఈయశ్వమును ఈతబేలాలో నుంచెద.[అని యశ్వమును తట్టి వదలుట నభినయించి పరిక్రమించి] ఈ హవేలీలోనే యూరంత తిరుగవలసియున్నది. మహామంత్రిగారిం గనుటకు. [పరిక్రమించి చూచి]వీరుగో మహామంత్రిగారు. కూడ నెవరున్నారు? [చూచి] ఆఁడుది.ఎల్లి, కానీ, ప్రక్రాంతము నెఱిఁగి మఱి ప్రవేశించెద.

---

## స్థలము 4. ఓరుఁగల్లు, మంత్రిహవేలీ, కచ్చేరిశాల.

అంతట యథానిర్దిష్టముగా యుగంధరుఁడు. ఎల్లియు, ద్వారభూమిని ప్రతీహారియు ప్రవేశింతురు.

[చెకుముకిశాస్త్రి పొంచి వినును.

ఎల్లి.—[వెక్కి వెక్కి యేడ్చుచు]మహాప్రభో, మీరేతల్లి మీరేతండ్రి అని, మీరే సామి మీరే నారాయణమూర్తి అని, మీపాదాలు కొలుచుకొంటా వున్నందుకు, నామొగోణ్ణి తురకలకి తమరు పట్టిచ్చినారంట సామీ, ఇక నాను బతకలేను మారాజా!

యుగం.—ఎవరే మేము పట్టియిచ్చితిమని చెప్పినవారు?

ఎల్లి.—[భయముతో గడగడ వణఁకుచు]పట్టమంతా అదేమాట మారాజా.

యుగం.—తురకలు పట్టుకొని పోయినమాట వాస్తవమే గాని మేము పట్టియిచ్చుట అబద్ధము. ఏలినవారికి నౌకరీ చేయుమని పంపితిమి,ఉదుకు మని యేలినవారు దుస్తు వీనికి వేయఁగా ఈనిర్భాగ్యుఁడు దానిని తాను తొడుగుకొని తురకల యెదుట తానేరాజనిప్రజ్ఞలు నటికినాఁడు.అంతట వారువీనినిపట్టుకొనిపోయినారు.

ఎల్లి.—అయ్యోమా రాజా,అయ్యోమామా,మామా,మామా.[అని యేడ్చును.

చెకు.—ప్రతీహారీ, పోవచ్చునా?

ప్రతీ.—ఎరిగిన వారి కల్లా దర్శనానికి శెలవు.

చెకు.—పరమసంతోషము.[ప్రవేశించి]జయము జయము మహామంత్రిగారికి.

యుగం.—చెకుముకిశాస్త్రీ, కూర్చుండుము. [చెకుముకి కూర్చుండును.

యుగం.—ఏమి విశేషము? సంగ్రహము.[ఎల్లినిచూపి] వినవే, పేరిగానికై మేము చేయుప్రయత్నములను ఈయన చెప్పును. [ఎల్లి శ్రద్ధగా వినును.

చెకు.—నేనచట నుండఁగానే తమదుబాసివచ్చి ఖుస్రూఖానుతో తమ యాజ్ఞగా మాచాకలిని వలీఖానుతలను తెప్పించి అప్పగింపుఁడు.అంతవఱకుమీరు మా ఖైదీలు, మీయాయుద్ధము లెప్పటికిని మావే,'అని చెప్పి, వానివలన ప్రత్యుత్తరము రాకపూర్వమే... నాయనికి యుద్ధార్థము హెచ్చరిక చేయుటకుఁ బోయినాఁడు.

యుగం.—తర్వాత?

చెకు.—తర్వాత ముస్తఫాఫిరోజులను ఖుస్రూ చంపఁదలచినాఁడు. ప్రతిష్ఠా రునికిని ఈదినము గండము చెప్పితిని. ఎవఁడును నడపలేడు, తురకరాణువ ఆవశ రైనది. యుద్ధము జరుగుచున్నది.

యుగం.—ఏపాటి యుద్ధ మైనది?

చెకు.—సంగ్రహము.—

ఉ. తూరుపుసంధ్య [1]యొక్కకోనఁ దూరెడు, నా[2]కడసంధ్య యల్లెయా
[3]వారుణకోణమం దడఁగు, వన్నెయుఁ దక్కువె, యంచు మధ్యసం
ధ్యారమ యెల్ల[4]ఘస్రముల [5]తామ్రత నొక్కటఁ దాల్చి యెల్లెడం
[6]గేరె ననంగ నెత్తురుల[6]కెంపున[7]నిండె[8]నజాండ మంతయున్.

యుగం.—నీప్రయాసకు ప్రజ్ఞకు పరమ సంతోషము.

చెకు.—ఖుస్రూగాని గుఱ్ఱమును కత్తిని తెచ్చితిని,

యుగం.—గుఱ్ఱమును ప్రభువుతబేలావు మేము పంపెదము. కత్తిని నీప్రజ్ఞార్థ్యా ముగా నుంచుకొమ్ము. [ఎల్లి నిచూచి] చూడు నీకోసము ఎంతయుద్ధము జరిగించి పేరి మేమా పట్టి యిచ్చినారము? ఇంద ఈధనము తీసికో, ఈనగలు తీసికో. [అనిఇచ్చును.

ఎల్లి.—నాకెందుకు మారాజా యియ్య ముండమోపికి?

యుగం.—తప్పుమాట అనుకొనకు, పుచ్చుకో.

చెకు.—పుచ్చుకో, పుచ్చుకో. [ఎల్లి పుచ్చుకొని దంప మిడును.

యుగం.—చిరకాలము ముత్తయిదువుగానుందువుపో. పేరిగానికేమియుభయ ముండదు. వానివంటి నమ్మక మయిన నౌకరు మాకు మఱిలేఁడు. మేము వానిని పోని యము, ఢిల్లీసుల్తానే వానిని మాకు అప్పగించును.

ఎల్లి.—తురకలు సంపెయ్యకుంటెగంవా బాబయ్యా?

యుగం.—చంపువా రయిన అప్పుడే యేల చంపరురా. జనుకొనిగ రాపట్టు కొని పోయినారు, రాజోపచారములు చేయుచుండెదరు. చెకుముకీ, జోస్యము చెప్పు.

చెకు.—దేవతార్చనపెట్టెలో సాలగ్రామమువలె పేరిగానినిసవారిలో కూర్చుం డుచున్నారు. ఖయిదులో నున్నాఁడేగాని రా జయినాఁడు. వాని కేమి లోపము!

ఒకపడవాలు.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

---

ఎ. 1. ఒకమూలయందు (తూర్పునమాత్రమె యనుట). 2. సాయంసంధ్య 3. పడమటిమూలలో. 4. దినముల. 5. ఎఱుపును. 6. విజృంభించెను. 7. ఎఱుపులో. 8. అజాండము=బ్రహ్మాండము.

యుగం.—ఏమోయి యేమి జరిగినది?

పడవా.—తమ యాజ్ఞ ప్రకారము బేతాళరావు నరసింహరాయలు ఇద్దఱు కుంభునైపుల తురకలను కమ్మి నఱికివేసినారు, హతశేషులను ఖైదు చేసినారు.

యుగం.—మిక్కిలి ఏలినవారిని కొలిచినారు. బేతాళరావునకుతృప్తియైనదా!

పడవా.—అతఁడు వీరావేశముచే యుద్ధము ముగిసిన గడియఁదాక కంటి బురయాన చెట్టును గుట్టనుకూడ నఱుక సాగినాఁడు. ఎవరము, హిరణ్యకశిపు వధానంతరము దేవతలు ఉగ్రనరసింహమూర్తిని దఱియలేనట్లు అతనికడకు పోలేమైతిమి. మనవారినే శూన్యము చేయునో అని అందఱము భయపడి, యెట్లు హెచ్చరించినను వినికొనఁడాయెను. చివరకు తమ పేరట దురాయి పెట్టఁగా తెలివి వచ్చి నిలిచినాఁడు, అంతట నే నిట్లు వచ్చితిని.

యుగం.—బళిబళి, మహాశూరుఁడు. వీరుల లెక్క!

పడవా.—మనవాండ్రు రమారమి వేయిమంది. రమారమి తొంబదివేల తురక తలలు రాలినవి. మైదాన మెల్ల రక్తసముద్రము.

చెకు.—అందులో తురక బొందుల రాసులే దీవులు. ఇఁక నొకటి రెండు రోజాలలో ఆటు గాలి యిటు కొట్టినా మఱియొకరి ఘ్రాణేంద్రియములను మనము ఎరవు తెచ్చుకొనవలసినదే. ఆ కంపుచే ఈయూరు నాశము. తురకలు బ్రతికి సాధింపక పోయినను చచ్చి సాధింతురు. ఇప్పటికి నాప్రతిజ్ఞ నెఱవేఱినది.

యుగం.—ఏమి నీప్రతిజ్ఞ ? [అని వినుచు చీటి వ్రాయుచుండును.

చెకు.—కోటబురుజులకు రాత్రులలో లక్ష కొఱవిదయ్యములను చూపెదనంటిని. అది యింక నూఱేండ్ల దాఁక సిద్ధించినది. మఱియొకటి కూడ సిద్ధించినది.

యుగం.—అ దేమి ? [అని వినుచు ఆ చీటియే వ్రాయుచుండును.

చెకు.—ఇఁక నూరేండ్ల దాఁక ఈనగరములో స్త్రీలకందఱకును తురకపిశాచములేగాని హిందూపిశాచములు పట్టవు ?

యుగం.—[ఎల్లితో] పేరిగానికోసము మేము పడుచున్నప్రయాసచూచితివి గదా. వానిని తెచ్చి నీకిచ్చుట మాభారము. నీవిఁక చాకిపని చేయకు. మే మిచ్చిన కానుకలతో సుఖముగా బ్రతుకుచు గవరమ్మను పూజించుకొనుచు ఉండుము.

ఎల్లి.—నాను తమ లోగిట్లో నే గంజి దాగుతా నాకిష్టమైన పనిపాట చేసుకొంటా పడుంటాను.

యుగం.—నీకిష్టమైనట్లుండు. ఇప్పటికి పో.

[ఎల్లి సాగిలఁబడి లేచి నిష్క్రమించును.

యుగం.—పడవాలూ, మీరందఱును మీప్రయాసమునకు ననంతఫలము ననుభ

వించెదరు. పోయి బేతాళరావుతోను నరసింహరాయలతోను మామాటగా ఏలినవారి మిగుల గణనీయుల రై తిరని చెప్పుము. ఈచీటి బేతాళరాయనికిమ్ము. [చీటి ఇచ్చును.

పడవా.—[చీటి కైకొని] మహామంత్రిగారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

యుగం.—చెకుముకీ, నీవు తత్క్షణమే [చెవిలో ఏమో చెప్పి] ఈమాటను పెద్ద సెట్టికి చెప్పి, ప్రకృతము నగరిలో రాజసన్నిధిని మాతమ్ములతోఁ జేరుము.

చెకు.—మహాప్రసాదము. [అని నిష్క్రమించును.

యుగం.—అహా! ఈయెల్లి కష్టమే యిట్లున్నదే, అంతఃపురములో నేమి యడావడిగా నున్నదో!

అంతట ఒకరౌతు రోఁజుచు ప్రవేశించును.

రౌతు.—జయం జయం మహామంత్రిగారికి. రాణీగారు ఏలినవారిదర్శనానికి వచ్చినారు. మంత్రులున్ను వైద్యులున్ను వల్ల పడదన్నారు. మేము చూడకమాన మని దేవిగారు తమతమ్ములమీద కోపం చేస్తున్నారు. నన్ను వారిద్దరున్ను ఇక్కడికి తరిమినారు. తమరాక నెదురు చూస్తున్నారు.

ఒకచేటి.—[రోఁజుచు ప్రవేశించి] జయం జయం మహామంత్రిగారికి. దేవిగారు తమతో మనవిచేయుచున్నారు.—'తమతమ్ములు మమ్మలిని మాప్రాణేశ్వరుల దర్శనానికి నిషేధించినారు. మేము అవశ్యం దర్శనం చేయునున్నాము,' అని. జవాబు తెమ్మన్నారు.

మఱియొకరౌతు.—[ప్రవేశించి] తమ్ములమనవి. "రాణీగారిని నిలుపలేకున్నాము. వారు సాక్షాత్తు మహిషాసురమర్దిని యవుతున్నారు. తమరు త్వరగా రాకుంటే అపాయము,' అని.

యుగం.—మీ రందఱు పొండి, మీకన్న ముందే మేము వారిసన్నిధిలో నుండెదము. [రౌతులు చేటియు నిష్క్రమింతురు.

యుగం.—[లేచి పరిక్రమించి]—క్రొత్తగుఱ్ఱము యోగ్యత కనియెదను.

స్థలము 5 ఓరుఁగల్లు, వీథి.

[చూచి] చూపునకు మేపునకు మంచిదే. [తట్టుటను ఆరోహణమును అభినయించి] దౌడునకును మంచిదే, మెఱుపుఁదీఁగ యనిపేరుపెట్టవచ్చును. [ధాటునభినయించి] రాణిసన్నిధికి వచ్చితిని, రౌతులు ఇంకను మావావేలికడనే యుందురు. [అశ్వావరోహణ మభినయించి] ఈనౌకరులు దీనిని చూచుకొనియెదరు. నేను రాణియొద్దకుఁ బోయెదను. [అని పరిక్రమించును.

## స్థలము. 6. ఓరుఁగల్లు, రాచనగరు.

అంతట రాణి, ముమ్మడమ్మ, బాలుఁడు, పరివారము, పహరా జవానులు, విద్యానాథజనార్దనులును, ప్రవేశింతురు.

బాలుఁడు.—మాబాబయ్యగారిని మేము చూడడానికి నీయాటంకమేమిరా ?
[అని పహరాజవానును తన్నును.

జవాను.—[అక్షాదమునకు మ్రొక్కి ముద్దుపెట్టుకొని చేతులు మోడ్చి] తమ ...టి మహాప్రభువులు మంత్రులమాట దాటకాదు.

బాలుఁడు.—అమ్మగారూ రండి.[కత్తిదూసి] అడ్డమైనవారినెల్ల పొడిచేస్తాను, ...బాబయ్యగారిని చూతాం.

యుగం.—[స్వగతము] అహో! బాలుఁడు కూడ పరాక్రమించుచున్నాఁడు!

రాణి.—బ్రాహ్మణు లడ్డమున్నారు నాకూనా.

బాలుఁడు.—వారికి నమస్కరించి లోపలికి పోదాం.

రాణి.—నమస్కరించినమాత్రాన నెట్లు పోఁగలము బాలకా ?

బాలుఁడు.—నమస్కరిస్తే 'నీకోరిక సిద్ధిస్తుంది' అంటారుగదా, మనకోరిక ...బయ్యగారిదర్శనమే, అది యేలాగ కాకపోతుందో చూతాం గదా.

ముమ్మడమ్మ.—మాబాబును అస్వస్థుని మేము చూడఁగూడదా మంత్రిబృహస్పతులారా ?

విద్యా. జనా.—అమ్మా, కబళికామంత్రప్రయోగము, మృతసంజీవనీమంత్రప్రయోగము చేసితిమి. రెంటికిని మూఁడుదినములు స్త్రీలకంటను బాలురకంటను పడఁ...దని నియమములు. నియమములు దప్పిన ప్రాణాపాయము. పిమ్మట తమచిత్తము.

రాణి.—ఈకవనము వీరికి ఇంతసేపటికి తోఁచినది, ఎంతమాత్రము మేము ...ము. ఈదేశక్షోభములలో యుద్ధసంరంభములలో మృగయావ్రణితాగతులను మా ...శ్వరులను మేము గనుటకు వీరి యాటంకమా ? మేయు చూచికమానము.

విద్యా. జనా.—'స్త్రీబుద్ధిః ప్రళయాన్తకః!'.—ఏమయినఁగాని, అన్నగారు ...ను మనము లోపలికి పోనీయవలదు.

యుగం.—[స్వగతము] ఆహా! మంత్రులసమాధానము లెక్కలేదు.

ముమ్మ.—సాహసము చేయుటవమ్మా, మనయందఱప్రాణములును మాతమ్ముఁడు యుగంధరుని రక్షణలోనివి. అతనిని రానిమ్ము.

అందఱు.—[చూచి, అత్యాదరముతో] వారుగో యుగంధరులవారు! వారుగో యుగంధరులవారు !

యుగం.—[సమీపించి] అక్కగారు, కొమార్త, బాలుఁడు, తప్ప గక్క
యందఱు పొండి.

విద్యా.—[ఆత్మగతము] బ్రదికిలిమిరా.

క. ఈయన [1]మమ్మూర్తులపై
జే యనఁగఁ [2]దురీయమూర్తి, సృష్టిస్థితి [3]సం
ప్రాయముల కొఁడె విభుఁ, డిఁక
నీ[4]యావడి యడఁగు [5]వార్ధి యింకినకరణిన్.

[అని విద్యానాథప్రభృతులు నిష్క్రమింతురు.

రాణి.—[యుగంధరునిపాదములకుఁ బ్రణమిల్లి] మాకు దర్శనము లేదా!

యుగం.—దీర్ఘసుమంగలివి కమ్మ. నాపట్టీ, నీకు దర్శనమున కాటంకమా
నే నిప్పించువఱకు వేచి యుండుము.

బాలుఁడు.—నమస్కారము తాతగారూ.

యుగం.—చిరం జీవ. [బాలుని ఎత్తుకొని] బాబూ, మేము లేనప్పుడు వా
రల మీఁదికి కత్తి దూసెదవా ? మనబిడ్డలను మనము చంపవచ్చునా ?

బాలుఁడు.—బాబయ్యగారిదగ్గిరికి పోనిచ్చినారుగారు తాతయ్యా.

ముమ్మ.—తమ్ముఁడూ, ఏమి యీ యపూర్వము ?

యుగం.—అక్కగారూ, [చెవిలో] స్త్రీలకురహస్యము చెప్పఁగూడదు.ఐనా
నను సకల మెఱిఁగిన సాక్షాల్లోకజననికి తమకు ఒకరహస్యము చెప్పెదను, అదే వార
కందఱకు ప్రాణబీజము. మూర్ఛిల్లవలదు.

క. కొనిపోయె నమ్మనీ ప
ట్టిని యవనుఁడు దైవఘటన ఢిల్లీపురికిన్
[1]వనరకు, మేదునెలల పది
దినములలోఁ దెచ్చి యిత్తు దేవీ నీకున్.

ముమ్మ.—[స్వగతము]కడుపులోపిడుగుపడినది! ధైర్యనాటకము సాధ్యమా!
మఱి గతి యేమి! [ప్రకాశము] మాతల్లి గర్భములో నే మాతోఁగూడ ఏల పుట్టవా
తివి? నీఋణమును మేమెట్లు తీర్చుకొందుము ?

యుగం.—తమకుఁగూడ పామరత్వమా? ఆమాట లిప్పుడు గావు, మఱిపోం...

౯. 1. త్రిమూర్తులపై 2. నాలవ. 3. లయము. 4. అల్లరి. 5. సముద్ర...
౧౦. 1. దుఃఖపడకుము.

మమ్మ.—రావమ్మా, రావోయి బాబూ, ఇప్పుడు గాదు, తర్వాత నేను తీసి
కొనివచ్చెదను రండి బాబయ్యకడకు. [అని యాయిరువురతో నిష్క్రమించును.

విద్యా. జనా.—[ప్రవేశించి] ఈప్రళయముతప్పించితిరి. మఱిమాకాజ్ఞ యేమి?

యుగం.—ఈప్రళయమిఁకరాదు. క్రొత్తలేమయిన వచ్చిన, మీనీతివిభవము.
రాజ్యము చేతుముకి చేరును. పేరిగాఁడు రాజుగా, మీరు ప్రతాపరుద్రనాటక మాడవల
యును. ఇఁక ఏడుమాసముల పదిదినములకు మరల మీకు మాదర్శనము. మేము ఎక్క
డ నుందుమో? ఓరుగల్లో! మాసంకేతము గలచారులు దెలుపు మాయాజ్ఞలు నెఱవేర్పవలసినది.
ధనము నవనిధులుగా నవనిధులు తృణముగాఁ జూడుఁడు. అన్నమరాజు కటకము
నుండి వచ్చిన, మీకు సర్వ సాహాయ్యము.

విద్యా. జనా.—[యుగంధరుని పాదముల వ్రాలి లేచి కన్నీళ్లతో]

క. తమరూపమె ధ్యానం బగుఁ
దమపేరె జపంబు, సర్వదా యిఁక మాకున్,
దమరు ప్రసన్నతఁ బ్రత్యే
కమ్మై మముం బ్రోచువఱకుఁ గడిఁదితపముగాన్. ౧౧

యుగం.—చిరం జీవతమ్. చిరం జీవతమ్. 'బ్రతికియుండిన సుఖములు పడయ
వచ్చు' ఇఁక మీపని చూచుకొనుఁడు.

విద్యా. జనా.—చిత్తము. [అని నిష్క్రమింతురు.

యుగం.—ఆడఁబోవు మహానాటకమునకు ప్రస్తావనయైనది. బేతాళరాయ
ప్రతీతి చాలును. పెద్దసెట్టికి ఆమాట చాలును. పడుగు వేయుట క్షణము, పేక
నేయుటకు మాసములు. మంచిది! నేను లేనప్పుడుగదా వీఁడు పట్టినాఁడు! నే
నుండ లేక పోదునో చూచును గాక. [సచింతము, సబాష్పము] హా! నారాజును
విడిపించువాఁడు! [సావష్టంభము]

స్రగ్ధర.

పాతాళంబందుఁ గానీ, ప్రళయపవనగర్భంబునం దైనఁ గానీ,
శ్రోతుర్గాత న్మహీశు న్దురకలు బలవద్దుష్టదైవావచేష్టన్;
జేత న్నే నందికొందున్; సిరి మెఱయ నిటన్ సింహపీఠాన నుంతున్,
ఖ్యాతి న్ఢిల్లీపురీశు న్గరువ మెడల నా ఖైదిగాఁ గట్టి తెత్తున్. ౧౨.

[అని నిష్క్రమించును.

౧౨. తురకలు బలీయమయిన దుష్టవిధియొక్క దుశ్చేష్టచేత రాజును పాతాళ
మందు దాఁచిన దాఁతురుగాక ... బెట్టుదురు
గాక, నారాజును నేను చేతితో అందుకొని తెచ్చెదను....

# షష్ఠాంకము

స్థలము.—ఓరుఁగల్లు, రాచనగరు.

అంతట ఇద్దఱు నౌకరులు ప్రవేశించి తివాసులు మొదలగు నాస్తరణములను పఱచి నడుదురు.

ప్రథముఁడు.—ఓరి వ్యాఘ్రపాదా, ఈదినము మంచి వినోదమురా.

ద్వితీ.—ఆంజనేయులూ, ఇన్నాళ్లు మంత్రులు తల బ్రద్దలు కొట్టుకొని పోసి నూఱిపోసిన యుపదేశము నేఁ డేమయిన ఫలించునా!

ప్రథ.—ఫలించును, వీనిని పుటము వేసిన.

అంతట విద్యానాథ జనార్దనులు పేరిగాఁడును ప్రవిష్టులై కూర్చుందురు.

జనా.—పేరిగా, మాయుపదేశ మేమి చేసితివి ?

పేరి.—శిరుతలకాయంతై నావొదలకుండాయిాడొక్కలోయెట్టుకొనున్నా.

విద్యా.—ఏలినవారిని సిద్ధము చేయుదము. గాయకులు వచ్చియుందురు.

ప్రతీహారి.—[ప్రవేశించి] జయము జయము యేలినవారికి, గవాయీలు వచ్చి వున్నారు.

మంత్రులు.—శ్రుతి గితి చేసికొని సిద్ధముగా నుండు మను.

జనా.—పులిగా, ఏలినవారికి స్వారస్యపుఁద్రాడు కట్టు.

[ద్వితీయుఁడు పేరిగానిజుట్టునకు పొడుగుపాటిత్రాడు కట్టును.

విద్యా.—అనుమా, పంకా లాగు. [ప్రథముఁడు స్వారస్యపుఁద్రాడు లాగును.

పేరి.—[తల యూఁచుచు, అర్ధనిమీలితలోచనుఁడై] వవ్వా! వవ్వా! యేమి సారాశెంబు! యేమి సారాశెంబు!

విద్యా.—[నవ్వుచు జనార్దనునితో] చూచితివా ప్రహసనమే. ఏలినవారప్పుడే స్వారస్యగ్రహణ మారంభించినారు.

జనా.—[నవ్వుచు] ఇట్టి యేలినవారల నెందఱినో గనిగదా యతఁడు 'కనకపు సింహాసనమున' అని పద్యము చెప్పెఁనాడు.

మంత్రులు.—ఓరీ, ఇంకను గాయకులు రానేలేదు, అప్పుడే స్వారస్యగ్రహణ మారంభించితి వేమిరా ? నీకు చెప్పిన దెల్ల బూడిదలో హోమమురా.



పేరి.—[సరోషము] ఈతప్పు యేలంజకొడుకుదో మాకు తెల్పునా ?

జనా.—తెలియ లేదు చెప్పూ.

శేరి.—నా నే అనుకొంటే [అనుమని చూపుచు] నాకంటా లంజకొడుకు వాళ్ళు దీనికి యీణ్ణి తన్నండి.

జనా.—నీకంటె లంజకొడుకా వీఁడు?

శేరి.—అడ్డ మేమి?

జనా.—[అనుమనితో] నీ వేమి చేసితివిరా?

అనుమ.—[చిఱునగవుతో] నేను తడబడి పంకా తా డనుకొని సారశ్యం గాసు లాగినానండి.

విద్యా. జనా.—[చిఱునగవుతో] ఓరీ, నీవు కావలయు ననియే చేసితివా కేమి యీపని? [అనుమఁడు నవ్వుచు నవలికి పోవును.

శేరి.—మ టిప్పు డీణ్ణి యెల్లాయిలో యెయ్యండి.

విద్యా.—పులిగా, నీపనికి నీవు రారా.

పులి.—శిత్తం [అని స్వారస్యపుఁ ద్రాటిని చేతఁ బట్టుకొని కూర్చుండును

జనా.—ఎవరోయి అక్కడ?

ప్రతీ.—[ప్రవేశించి] ఏమి దేవరవారి యాజ్ఞ?

జనా.—గాయకులను రమ్మను.

ప్రతీ.—చిత్తము. [అని నిష్క్రమించును.

అంతట వైణికుఁడు, గాయకుఁడు, మార్దంగికుఁడు,
మోర్సింగువాఁడును ప్రవేశింతురు.

మంత్రులు.—కూర్చుండి మీవిద్య చూపుఁడు.

[ముప్వురును సభావందనముచేసి కూర్చుండురు. వైణికుఁడు 'చంద్ర కళాధర సాంబ సదాశివ' అని పల్లవి పాడి వాయించును.

శేరి.—వవ్వా! వవ్వా! [అనుచు వినుచుండును.

శేరి.—ఒకపాలి నా నొకబేపిని పెంచినా, అది కార్తిలో అడబేపిని సూస్తే మదికంటా యెయ్యీఁతలు కుయి కుయి కుయి కుయి అనేది. దానికంటా దీని యిఁనే పయేంటి అంటా,

విద్యా.—[శేరిగానితో] ఏలినవారు చమత్కారముగా పలుకుచున్నారు. దేనికి తగ్గ ఉత్తరము చెప్పెదము, దీనికి ఆఁడుబేపి అక్కఱలేదు. అది లేకుండనే కుయి కుయి కుయి కుయి అనును, మఱి దీనికి గంజి అక్కఱలేదు.

పేరి.—ఆమాట నాను నమ్మను. గంజి తాక్కుంటే, అంత అకడు ఏలా గొస్తది? అంత అది ఆకిందిది యేలాగొస్తది?

విద్యా.—[వికటముగా నవ్వుచు] ఏలినవారు అచ్చ మాజాతీయమే పలుకుచున్నారు, కానిండు, కడుపును, అదియు, దీనికి గంజి త్రాగకయే వచ్చినవి. ఏలినవారితో కానిది చెప్పదుమా?

పేరి.—[ఇంచుకంత విమర్శించి, ఆశ్చర్యహర్షోత్కర్షముతో] ఆ ఆ ఆ తెల్సిందయ్యా? గంజితాక్కుండానే కడుప్పెరిగిందీ అన్నారు. గంజెందుకయ్యా దానికి? ఎంత మావసమైనా తినేస్తది, మూసుళ్లు మూసుళ్లే మాయం చేశేస్తది?

మంత్రులు.—అది మాంసము తిను నని యేలినవారి కెట్లు తెలిసినది?

పేరి.—మఱిమావసం తినకుంటే ఆకోరలెందుకు? అప శ్లెందుకు నోటినిండా?

మంత్రులు.—అవి అలంకారార్థము. అ దేమియు తినదు.

పేరి.—[ఆశ్చర్యముతో] నిజమే? నిజమే? మీపత్తె ప్పెమానకంగా నిజమే?

మంత్రులు.—నిశ్చయము. [పేరిగాఁడు వణఁకుచు వీణకు దండ మిడును.

మంత్రులు.—అది దివ్యముగా పాడఁగలదు.

పేరి.—ఆపాట గీట నాకు తెల్దుగాని, నాచేపిలాగ మొరిగించండి మాతో.

[వైణికుఁడు మొఱిగించును. మార్దంగికుఁడు అనుసరించును. పులి. స్వారస్యపుఁ ద్రాటిని లాగును.

పేరి.—[పకపక నవ్వి] వవ్వా వవ్వా! వవ్వా వవ్వా! అచ్చరి అచ్చరి; ఒక అచ్చరనచ్చయినాం, ఒక అచ్చరనచ్చయినాం, ఒక అచ్చరనచ్చయినాం.అదీసారాశెంబు! అద్దదీ సారా శెంబు! [అందఱు గొల్లు మని నవ్వుదురు.

[పేరిగాఁడును తన ప్రజ్ఞకు సంతుష్టి తెలుపుచు నవ్వును.

మంత్రులు.—ఆహాహా! ఏమి యేలినవారి బుద్ధిప్రభావము! ఏరాత్రి యుగంధర ద్వితీయులై మాఱువేషమున పేటలు తిరిగినప్పుడు నేర్చినారో యీజాతీయమా! అదే విష్ణ్వంశ. 'నావిష్ణుః పృథివీపతిః' అన్నారు. పాట కానిండు.

పేరి.—[నవ్వుచు] ఇచ్చాలు. నాకు కడుపునొస్తుంది. ఇంక నాను నవ్వలేను. ఆ అయ్యవోరిని పాడమనండి.

[గాయకుఁడు పాడును, అనుమఁడు కర్పూరశలాకను తెచ్చి పేరిగాని చేతిలో పెట్టును.

పేరి.—[ఆడంబరముగా దానిని చేత నెత్తి] ఉండవయ్యా రవం తుంటే ఊరిక పాడుకపోవటమే? కళ్లకి కప్పూరసలాక అంటించుకోనియ్యావేమి? నీపాటకి అనంధ బాష్పాలు ఆక్కల్లేదా యేమి?

గాయ.—[స్వగతము] ఈపిరవుచరియ వింతెగా నున్నదే? [అని పాడును.

[మార్దంగికుఁడు, మోర్సింగువాఁడును, వాయింతురు. పులి. స్వారస్యపుఁద్రాటిని లాగును. పేరిగాఁడు తల యాడించును, కర్పూరశలాకచే ఆనందబాష్పములు విడుచును.

పేరి.—అబ్బ! నాకళ్లంతా పోతున్నయ్యయ్యా యీ ఆనంధబాస్పాలశాత! ...కృత్నీ యీనసెత్తిమాఁదకొవ్వంతకొప్పు, మెళ్లో ఒకటే ఆదేంటోతాటిపిందంతగింజ; ...ప్యా మెయ్యలేక యీనబుఱ్ఱ యిసిరియిసిరి, మెడతిప్పితిప్పి, కళ్లు మూతపడి, నాలి ...బెట్టి, శనుకులాడతావున్నాడుగందా, నా గాడిద నదురుబెదురు లేకుండా యెన్ని ...పాట్లు మోశేదిరా నారంగా! దానిముంగట యీనెందుకు పనికొస్తాడూ అంటా?

మంత్రులు.—[పేరిగానితో] పాటచిత్తగింపవలయును. [గాయకునితో] పాడ ...వ్వ. [గాయకుఁడు మంద్రముపాడును. మృదంగము, మోర్సింగు, అనుసరించును.

పేరి.—పాటలోమాత్రం యీనెచ్చేంటీ అంటా! నాగాడిద ఓంద్ర మెడితే ...శ్వరేవంతా రోయి రోయి రోయి అంటా మోగిపొయ్యేదే! ఈన పాడితే యేదీ ...గమను, యిక్కడికే యినపట్టంలేదే!

గాయ.—[స్వగతము] ఏమిగ్రహచారం వచ్చెరా యీశ్వరా!

[అని మధ్యమము పాడును. పులిగాఁడు దారము లాగును.

పేరి.—[తలయూఁచి] అద్దదీ! యిప్పుడు కొంచెం వోంద్రానికి శేరు పాతా ...వది పాట. మాగాడిదికి శేరు పాతా వున్నా డీయన.

[గాయకుఁడు మఱియు స్వారస్యముగా తారము పాడును. మోర్సింగువాఁడు వాయించును.

పేరి.—[నవ్వుచు] వవ్వా! వవ్వా! మాగాడిదే! మాగాడిదే! అచ్చం మాగా ...డిదే యేదే మళ్లీ!

[గాయకుఁడు మఱియు స్వారస్యముగా పాడును.

పేరి.—[అట్టహాసముతో] వవ్వావవ్వా! యెంతటి బ్యామ్మడవయ్యా! ఎంతటి ...మ్మడవయ్యా! మాగాడిదికి నువ్వు అన్నవో తమ్ముడివో కావాలగాని మరికోడివి ...వయ్యా. నీకు అచ్చరనచ్చ లిచ్చేశినా.

గాయ.—మగాప్పిరవూ, వూలోకతేవేంతిరా, నేను ఇంకెనూ వెగు చెక్క ...పాడుతును. తగిన వెగుమతి యియ్యవల్యె.

పేరి.—నాదంతా, పాడు, యిచ్చేస్తా. [గాయకుఁడు ఓంద్రపెట్టును.

పేరి.—[విభ్రాంతుఁడై ఆశ్చర్యపడుచు] ఏమి బ్యామ్మలపెబావం! ఏమీబ్యా ...పెబావం! యీయిద్దిలకే 'బ్యామ్మడ ... బిష్మటమడ ...' అన్నారా? నేను పుట్టినప్ప ...టించి ఆటిమద్ది నే పెరిగినానుగందా, నాకు రాలేదు. యీళ్లు దాన్ని దగ్గిరికేరా

నీరు, శేవులో అడుగెట్టనే యెట్టగు! యీళ్ల కేలావొచ్చిందిరాఅంటా. సామీ దణ్ణా. నీకు కోటివరాలు నాసత్తెప్పెమానకంగా యిచ్చేసినా. [అని తనలో ఆశ్చర్యపడును.

మంత్రులు.—ఇట్లురసాభాసము చేసిన విద్యావంతులు తమకడ కేలవచ్చిరి?

పేరి.—ముందత్తిగా ఆయనకి కోటివొరాలిచ్చి మరి నాతో మాట్లాడాలి.

మంత్రులు.—సిద్ధము. కచ్చేరీ లేమనప్పుడిచ్చెదము.

ప్రతీ.—[ప్రవేశించి] జయం జయం ఏలిన వారికి. ఆటగత్తెవచ్చి వుంది.

గాయ.—అః మాతో వచ్చిందిదా.

జనా.—ఆలాగా? మంచిది. [ప్రతీహారితో] రమ్మను.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ.

పేరి.—ఆట కత్తేంటి? కత్తి ఆడుద్దా?

విద్యా.—కత్తి గాదు.

పేరి.—కత్తొట్టుకొని మనిసి ఆడుద్దా యేంటి?

విద్యా.—[చెవిలో] ఛీ! ఊరకుండు!

అంతట నటి ప్రవేశించును.

పేరి.—యేంటయ్యా, అప్పుడే రమ్మన్నారు? ఈసారాశెంబుతాడు, ఆ ఆనంథబాస్పాలు, ఈటితోటి నాపానం పోతావుందయ్యా. [నటితో] రొవ్వంత సేపు ఆడక పాడక వూరుకో. [నటి సభావందనము చేసి నిలుచును.

పేరి.—యియ్యాణ, యీపాట, యీటికాలత నావొల్లంతా సందేగాలే ఆయ్యడీం. ఆడుగుతాను తీరస్తారా?

జనా.— సందేహములు ఆవతల తీర్చుకోవచ్చును.

పేరి.—ఇప్పుడు గావాల. లేకపోతే సారాశెంబు శెపతది. యీళ్లు పాడతా వున్నా, వోయిస్తావున్నా, నాను సూస్తానూ వున్నా, యింటానువున్నా. యీపాట నా కళ్ల కవుపడ్డదా? నా శెవుల కినపడ్డదా? శప్పండి.

జనా.—ఈసందేహాలు తర్వాత తీర్చుకొందము.

పేరి.—నావొల్ల కాదు. నాకళ్లల్లోయింక బొట్టయి నాఆనంథబాస్పాలు లేవు. ఈసారాశెంబుతాటికి నామె డడిపోయిఁది. గడసేపుంటే నేగాని నావొల్ల గాదు.

విద్యా.—చిత్తము. ఆలాగే కానిండు. కన్నులు మూసికొన్నను వినఁబడును గావున పాట చెవులకు వినఁబడినదే.

పేరి.—వవ్వా! వవ్వా! అలా శెప్పాల. యింకోటి—యీరొండో అయ్యొకాయ పాడతావుంటే ఆసుర్రోడు ఆడబ్బ సచ్చినట్టు లబ లబ లబ లబ నోట కొట్టుకున్నాడే అదెందుకు?

విద్యా.—మోర్సిం గని అదొక వాద్యము, దానిని నోట పెట్టుకొని వాయించినాఁడు,

పేరి.—మోరచిం గేంటి? ఆ తెలిచింది. చింగ్ చింగ్ చింగ్ అని మోర నేశి గ్గు కోటమా? అందుకూ డా ఒకవోయిద్దికం గావాలా? యిదీ వొకింతే. మటి గుడ్డే ఆయన యీణే ప్రీకట మేంటి. యిఝ్యన నోట్నే అరవట మేంటి? ఆయీణే సగమోడు పంచుకొని యిద్దరు వోయిస్తా యిద్దరు పాడరాదా ?

విద్యా.—అయిదు వ్రేళ్లతో తగిలినంత బాగుగా తగులునా చెంపకాయ రెండు వ్రేళ్లతో మాత్రమే కొట్టిన ?

పేరి.—ఇదీ అంతేనా; చరే! శిన్నప్పుడు మా అవ్వ ఒక కత శెప్పిందండీ. కలికాలంలో కూడా అలాగ జరిగితేనా, వవ్వా! యీళ్లని తంజావూరినుంచి గింజా వూరునుంచి పిలిపించ నక్కరలేదు.

విద్యా.—అది యెట్లు ?

పేరి.—యీళ్లని భూమిలో పాతేస్తే శెట్లు మొలిశి యీణోయించోళ్లు, శెట్ల పాడేవోళ్లు, కడుపుమీద బాదుకొనేవోళ్లు, లబలబ కొట్టుకొనోళ్లు, వొందలు వొందలు కాయలు కాయవా శెప్పండీ ?

సైణిక గాయకులు.—[అన్యోన్యము] కడేశిల్ యిద్దాన్ కుడుప్పాన్. [ప్రకాశము] మాకు వెగుమతి పనిల్యా. [అని లేచిపోఁజూతురు. మోర్సి. అడలి పాటిపోవును.

విద్యా.—భయపడకుఁడు కూర్చుండుఁడు. ఏలినవారు మహారసికులు. [పేరి శాస్త్రితో] ఈకాలములో మనుష్యులను పాఁతి వేసిన ఊపిరి తిరుగదు.

పేరి.—ఔను తిరగదు.

విద్యా.—అంతట చచ్చిపోదురు.

పేరి.—ఔను ఊపిరి తిరక్కుంటే సస్తారు, నిజమే. అది నాకు తెల్దా ?

విద్యా.—చచ్చిన గింజ మొలవదు.

పేరి.—ఆ, అద్గదీ! బాగా శెప్పినావయ్యా. ఏమడిగినా 'శెప్తావండీ నువ్వె పెద్ద మంత్రివోగాని? మటింక నాట్టకం కానీండి. తాడుణ్ణిండిగాని బాస్పాలు నా కొళ్లగాదు.

మంత్రులు.—[నటితో] ఆట కానిమ్ము.

[నటి పాడుచు ఆడును. మద్దెల. వాయించుచు అనుసరించును.

పేరి.—ఒలే, ఆడు ఆడికడుపుమీద్దాన్ని కొట్టుకొంటే నువ్వెందుకే యాడ వటం, యగరటం, దుమకటం, శేతు లిసురుకోట్టం ? నాకాణ్ణా నీటక్కులు? నీకే దెబ్బ తగిలిందా ? పోనీ, [కనికరముతో] నీ కేం వోయివా, శేతు లలా యగశే శేస్తావు? ఓత శేయిస్తాలే యాడవకు. అయినా గానీ, నువ్వు అడికా డుండొద్దు, ను వాణ్ణి సూస్తున్నాడు. కాకిని కొడితే గద్ద సచ్చిం దంట! [మద్దెల గానితో] ఒరే, నువ్వ మొగోణ్ణి కొట్టుకు ఆరిబడి తిరగటం యేంట్రా? యెంకటయ్య కడుపులాగ అదొక్కటి ముంగ శేసు కొని ఆడపిల్లని దాన్నెందుకురా జడిపిస్తావు? డమా అనిపిస్తావు! డుమా అనిపిస్తావు! డుమ్మటాం అంటావు! టమటమ అంటావు! ... ...కరి మొకం సూడకండి. [నటిమార్ధంగికులు అట్లే చేయుదురు.] పేరి.—మరింక కానిండి.

నటి.—[మంత్రులకు చేతులు మోడ్చి] స్వామీ, యేలినవారి అభిప్రాయ తెలియ లేదండి.

విద్యా.—[పేరిగాని చెవిలో] తిన్నగా ఆడనీయకపోయితివా తర్వాత ధర్మరాజశాస్త్రులతో చెప్పి డొక్క బ్రద్దలు చేయించెద.

పేరి.—[జనాంతికము] బుద్ధిబుద్ధి. [ప్రకాశము] మరేమీ లేదు ఆడండి.

[నటి ఆడుచు పాడును.

అఠాణా, ఏకతాళము.

నిన్నుఁ గని యెన్నుకొను కన్నె మది సున్న,
ఆ కన్నె మది సున్న, ఆ కన్నె..., ఆ కన్నె..., ఆ కన్నె...
ఎవ్వరిది దోస మిది ? ఎవ్వగను మాను నిది ?
మవ్వమునకన్న, నీ మవ్వ...నీ మవ్వ...నీ మవ్వ...

[నటి ఆడును. స్వారస్యము హెచ్చును. మార్దంగికుఁడు అనుసరించును. పులిగాఁడు దారము లాగును. పేరిగాఁడు తల ఆడించుచుండును.

పేరి.—మారేవంత్రా వొక్కపాలే వుదికినా యీయెంకటయ్యకడుపు! చ రాదురా! [అని మిక్కిలి తల యాడించును. స్వారస్యపుఁద్రాడు తెగును.

పేరి.—హాహా! నిలునిలు. నిలవోసి నిలు, సారాకెంబు తాడు తెగిపోయిం

[అని జుట్టు తడవుకొనును. కొందఱు గొల్లున నవ్వుదురు. కొందఱు ఆశ్చర్యపడుదురు.

పేరి.—[మంత్రులతో] అయ్యా. మరి సబయెలాగ ? తాడు తెగిపోయిం

జనా.—ఇఁక త్రాడక్కఱలేదు. [నటితో] ఈపాటచేసినమహాకవి యెవరు మంచితేనెకు చెంచెతను పొగడుదురుగాని తేఁటిని దలఁపరు.

నటి.—మహాకవి పీయూషవర్షులవారు. వారిశిష్యురాలిని నేను. వారున్న వచ్చియున్నారు. దర్శనానికి సెలవైతే వస్తారు.

జనా.—అవశ్యము రావలయును. ప్రతీహారి, మహాకవి పీయూషవర్షులవారు వచ్చియున్నారఁట తోడ్కొనిరా.

ప్రతీ.—చిత్తము. [అని పోయి కవిని తోడ్కొనివచ్చి] అట్లాదయ చేయండి

మంత్రులు.—ఇట్లు దయచేయుఁడు. పీయూషవర్షుఁడు కూర్చుండును.

పేరి.—నమస్కారములు. మరిగంటే కయీస్సర్లూ, నాను మెచ్చుకొ కయిత్తం శేస్తే ఆబోజనరాజు తను బోంచేస్తుండేయాల తనకాళ్లగుద్దేవోడు! దాకు! యిచ్చి నను అచ్చెరనచ్చ లిస్తా.

కవి.—ఏలినవారివచనశుద్ధి వింతగానున్నది. [అని క్రిందియట్లు ఆశీర్వదించును.

శ్రేయసిఁ జేయుచుఁ 3గమలసంభవు బ్రహ్మ మోలను 4దత్కళత్రముఁ,
నాయన, మ్రొక్కఁగొమ్మ'ని 6యనారతము న్బలికించుచున్నరిఁ,
7యగజాతకుఁ సవతి 8యాలము వెట్టుచు నెట్లు సూచిరఁ,
నీయశ మెల్లలోకముల 9నిందలు వొందు 1నరేంద్రచంద్రమా. ౧

మంత్రులు.—ఆహాహా! ఆహాహా!

పేరి.—[హాసన్ముఖుఁడై తల యూఁచియూఁచివిని] దీనికినానుసాయింపాక యూను. యిదేం కయిత్తం యిది! సీత్!

కవి.—[స్వగతము] మంచి మెడవాయువు. [ప్రకాశము] ఏలినవారు ఈమాఱు క్షేమింపవలయును. [అని మరల ఆశీర్వదించును.

హెచ్చుగ నీవు సత్కవుల కిచ్చు 1పసిండిని రాలు 2రంజకం
బచ్చుగ నీదు 4దానసలిలాపగలం బడి యా 5మహాబ్ధిలోఁ
జొచ్చి 6శయానశౌరిహృది 7జోటిగఁ జిట్టెము గట్ట, దానినే
లచ్చియు, బుచ్చి, పాల్కడలిలక్కమ, యంచువచింత్రుశ్రీ కాకవుల్.

మంత్రులు.—బళి బళి.

పేరి.—[మరల హాసన్ముఖుఁడై తలయూఁచి యూఁచి విని] దీనికొకసాయిం మిస్తా! కయిత్తమంటే యిలాగా? పెతిమనిసికీ తెలియాల. సాకలోడికి మంగ కూడా తెలియాల.

---

౧. 1. ఓరాజశ్రేష్ఠుఁడా, 2. నీకీర్తి, బ్రహ్మలోకమునవ్యాపించి, 3. బ్రహ్మయొదు 4. ఆయనభార్యను (సరస్వతిని) ఆమెయొక్క నల్లని తలవెంద్రుకలను తెల్లగా బ్రహ్మకు, 5. ముసలిదిగా అగపడునట్లు చేయుచున్నది; అట్లే వైకుంఠమున లక్ష్మికి తనతండ్రి పాలసముద్రము తన్నుఁజూడ వచ్చె ననుభ్రమను పుట్టించి 'నాయనా నమస్కారమును గ్రహింపుము' అని, 6. మాటిమాటికి పలికించు అట్లే కైలాసమున వ్యాపించి, 7. గౌరికి తనమీఁదికి గంగ అన్నిదిక్కుల వెల్లి విరిసిన దను భ్రమను గలిగించి ఆమెకు సవతి, 8. పోరు కల్పించు ఇదియెల్లను నీకీర్తి చేసిన చిలువిష మని ఎఱింగినంతట వారు నీకీర్తిని ఆడి చున్నారు.—కీర్తి తెలుపని కవిసమయము. విశ్వవ్యాపకకీర్తిశాలి అని భా
౨. 1. బంగారములోనుండి. 2. పాడుము. 3. చక్కఁగా. దానోదకనదుల 5. మహాసముద్రము 6. (అచ్చట) నిద్రించుచున్న నారాయణుని అందు 7. స్త్రీరూపముగా. 8. పనికిమాలిన కవీశ్వరులు (వ్యాసాదులు).

కవి.—[స్వగతము] సరి. ఇఁక ధౌర్త్యము చేసెదను. [ప్రకాశము]

క. నలవమడతలకి మలెనే,
మెలిబూడిద సౌదు సున్న మెల్లల మలెనే,
కలునీలమలె, మడేలా,
మెలిగే నీయసము నేల కెలికో కవురా.

మంత్రులు.—బళి! బళి!

పేరి.—[తెలియనోరు మూయక, తలయూఁచి యూఁచి విని] వవ్వా వవ్వా బలే! బలే! బాపనయ్యా. అచ్చరనచ్చలు, అచ్చరనచ్చలు, అచ్చరనచ్చలు. కయ్యరుడా, యీలాంటియిత్తం యింకెవరైయినా శెప్పగల్తురా ?

కవి.—ఇంతవఱకు లేరు, నేనే మొదటివాఁడను. ఇట్టికవులు సాధారణముగా పుట్టరు.

పేరి.—మరి నువ్వేలాగ పుట్టినావయ్యా ?

కవి.—శ్రీరాములవారికి వాల్మీకిమహాముని, ధర్మరాజువారికివ్యాసమహాముని, శే వేలినవారికి నేనును, అవతార మెత్తినారము.

పేరి.—నువ్వెవరవతారం బ్యామ్మడా ?

కవి.—నేను కాళీవాహుని యవతారమను.

పేరి.—[స్వగతము] అదేం మొట్టో! [ప్రకాశము] మరీ నానో ?

కవి.—శే వేలినవారు శ్రీమహావిష్ణువు నవతారము.

పేరి.—ఐతే యిష్ణుమూర్తికి గూనుంటదా ? [అని మెడ తడవుకొనును

కవి.—పూర్వము విష్ణుమూర్తికి మందరమును మోచుటకై వీఁపునవంచి కూర్మమైనప్పుడు గూను వచ్చినది. అదే యీ శేవేలినయవతారములో మాటిమోచి మోచి వచ్చినది. రెండును నీళ్లతో సంబంధపడిన యవతారములే గదా.

విద్యా.—[జనార్దనునితో జనాంతికము] చూడవోయి తమ్ముఁడా, చెముటశాస్త్రులగడుసుఁదనము. [ప్రకాశము] కవిగారూ, ఏలినవా రేమిమాటలు మోసినారు ?

కవి.—* భూదేవి ముఖ్యాలంకారముల మాటలు.

జనా.—మఱి, శే వేలినవా రేమి ?

కవి.—కడమరాజులరాష్ట్రములచుట్టును దేశములున్నవి. ఏలినవారిరాష్ట్రము గోదావరీ సాగరత్రయ పరివృతముగదా, కావున ఎటు చూచినను శేవే.

3. ఎల్లలమలెనే=(గోడలకు వేయునట్టి) వెల్లవలె. ఎలికోక=తెల్లచీర.

* "ఏలినవారి రాష్ట్రము... స్త్రీముఖ్య స్వలంకారము."

మంత్రులు.—మహాకవివయ్యా!

సేరి.—యీమాట లుంచండయ్యా. కయిాస్సర్గూ శెప్పవయ్యా, యీలాంటి కయిత్తం శెప్పేవోళ్ళు యింకమీదయినా వుంటారావుండరా?

కవి.—ఇట్టికవులు ఇఁక పుట్టఁగలరు.

సేరి.—యప్పుడు? యక్కడ? నా కిట్టాంటికవులే గావాల, యివరంగా శెప్పు.

కవి.—ఇంక ఆఱునూ ఱేండ్లకు వేఱుకొఱతనములలో కొన్ని తావుల మీబోఁటి రసజ్ఞులే బహుళ మగుదురు. వారికై మీబోఁటిరసికులే కవనములు సేయుదురు. మీ వంటివా రుభయులు చదువుకొన్న వారికన్న తామే మే లని తలఁచువారే.

సేరి.—అయ్యా, కయిాస్సరయ్యా, మేము సదువుకొన్నోళ్ళకంటె యెచ్చని ప్రాకులం గుట్టు నీ కేలాగ తెల్సిందయ్యా?

కవి.—వరప్రసాదము. మఱి ప్రకృతము. ఆ కవులు మీకుఁదగినకవనము చేయుదురు. అది అతినీరసముగా నుండును. అందుల కొరసజ్ఞులు, ఇందులకు మీ రట్లో ఆనందసాగరములో మునిఁగి ఊపిరి తిరుగక ఉక్కిరిబిక్కిరి యై డొంక తప్పి ఏక కొట్టుదురు.

సేరి.—అయితే కయిాస్సరయ్యా, ఒల్లు నీరసంగా వుంటే బాగుండదే, కయిత్తం నీరసంగా వుంటే బాగుంటదా?

కవి.—నీరస మనఁగా నేమి? నీవు ఆనందించురసము నీరసము.

సేరి.—వవ్వా వవ్వా! నీనోట్నొచ్చేదంతా కయిత్తమేనయ్యా! † దెర్ది శేశి నావు! నాను అన్నందించేరసంలో ఆళ్ళు శేస్తారుగా కయిత్తం! బలే బలారే! కయిాస్సరయ్యా, నీ కయిత్తానికీ, నీపగ్గాకి, నీదెర్దికీ, నువ్వు శెప్పిన ఆ సుబమైనమాటకీ నీకు సొవ్వరనచ్చలు గావయ్యా అచ్చరకో ట్లిచ్చేశినాను తీస్కెల్లు.

కవి.—ఏలినవారికటాక్షము! ఇట్టి రసజ్ఞులవలన మాకు దేవేంద్రైశ్వర్యము రాకపోయెఁగాని! కనుక నే పెద్దలు చెప్పినారు—

* ఆ. ఇతర పాపఫలము లిచ్చు వచ్చినయట్లు
      వ్రాయవయ్య మిత్త్రి, [1]వనజభవుఁడ ;
   అరసికాళిమ్రోల సరసకావ్యము సెప్పఁ
      దలను వ్రాయవలదు, వలదు, వలదు. ౪

మంత్రులు.—ఇప్పటికి సభ చాలును.

† దెర్ది=ద్వర్ది.

* 1, ఓబ్రహ్మ. 2. మూర్ఖ సంఘము నెదుర.

[పులి, అనుమఁడును బహుమానములు, తాంబూలములు, అత్తరు, పన్నీరు, తెచ్చి యుంతురు. మంత్రులు విద్యావంతుల కిప్పించి సత్కరింతురు. కవి నటిచేత పన్నీటికూజా పెట్టి మంత్రులకును పేరిగానికిని చల్లించును.

పేరి.—[నటిని చూచుచు ఒడలు తడుచుకొనుచు నవ్వుచు సరసముగా] పన్నీ వో తన్నుకున్నా వా యేంటికి? వోన గురిపిస్తా వున్నావు. [అని యిగిలించును.

వైణిక గాయకులు.—పోయుచ్చేండా అప్పా, అమ్మణి కడాచిత్తాళ్.

[వైణికాదులు సభావందనముచేసి నిష్క్రమింతురు. కవి నమస్కృతు లంది నిష్క్రమించును.

జనా.—ఏమిరా పేరిగా, చిలుకకు నేర్పినట్లు నేర్పితిమి. అంతయు సమయమున వ్యర్థము చేసితివిగదా.

పేరి.—సామీ, మీకు దండ మెడతా. నాకి దంతా తెల్దు బాబూ. నాకు సదువొద్దు. సదువుకొన్నోళ్లకంటా నా నెచ్చేగందా, నన్నెందుకు మారాజా, సదువు శెప్పి కులం శెరుపుతారు?

జనా.—రాజపుత్త్రిలు నీవాక్కు విన్న పొడిచి వేయరఁటరా?

పేరి.—ఆళ్ల కంటి కాపడకుండా నన్ను రచ్చించడం మీభారం.

విద్యా.—పులిగా, అనుమా, వీనిని గొనిపోయి విశ్రమింపుఁడు. [మువ్వురు నిష్క్రమింతురు.

విద్యా.—ఏమి తమ్ముఁడా, దివ్యమైన ప్రహసనము!

జనా.—మనయాంతరంగికులనే వైణికాదివేషములరప్పించియుండఁ గాపయ్య దక్కనదిగాని, ఇతరులకే దర్శన మిప్పించియుండిన ఎంత రసాభాసము! వీనిదర్శనమే మేల! ఆగంతుకులకును ఆశ్రితులకును మనదర్శనములే చాలును.

విద్యా.—బయటిపరగణాలలో మాత్రము వీనియాకారము నుపయోగింతము. వీఁడు ఇంతకన్న వివేకి యైన, కష్టము గదా. వీఁ డిట్టిమూఢుఁ డగుటయే మనకు మహోపకారము.

* ఆ. అరయఁగా నమంత్ర మానక్షరము లేదు,
మందు గానివేరు మఱియు లేదు.
భువి నయోగ్యుఁ డైనపురుషుం డొకఁడు లేడు,
కూర్చువాఁ డొకండె కొదువ గాని.—

అని గదా శుక్రాచార్యులు చెప్పినారు. వారుగో చెకుముకిశాస్త్రి ప్రభృతుల వలన మనము పని మానివచ్చుచున్నారు. వారితోఁ గలసిగోష్ఠీవినోద మొందుదము. మన కప్పటికి కడుపు వీరణమై యున్నది. జాగ్రత్తగా నవ్వవలయును. [అని నిష్క్రమింతురు.

---

*. కూర్చువాఁడు=వర్ణములను మంత్రముగాను, వేరులను మందుగాను, పురుషుని వానికి తగినపనికిని, జత పెట్టువాఁడు.

# సప్తమాంకము.

---

స్థలము. 1.—ఢిల్లీ, వలీఖానుని దర్బారు చావడి.

చెకుముకిశాస్త్రి తురకవేషమున ప్రవేశించును.

చెకు.—[ఆత్మగతము] ఆహా! ఓరుఁగంటిలో కొట్టినచెంపకాయ ఎంత యక్కరకు వచ్చినది! ఆపహారాజవానే వీఁడు, నన్ను జూడఁగానే తెచ్చి కూర్చుండఁబెట్టి సుల్తానుగారికి కబురుకూడ చేయించినాఁడు. బళి! రానీ మంత్రిబృహస్పతిప్రయోగము సఫలము చేసెను. ఏమి యీయనప్రజ్ఞ, మే మెంత తెలివి నేని వినియోగింతుము గాక, ఈయన వంటి శాస్త్రుఁడయిన మే మీయన కాఁగలము. ఈయనకు 'ఇచ్ఛామాత్రం ప్రభోః సృష్టిః' ఈ మహానుభావుఁడు సాక్షాద్రుద్రావతారము కావలయును.

అంతట వలీఖాన్ దుస్తు తొడుగుకొనుచు ప్రవేశించును.

వలీఖాన్.—సలాం సలాం యమధర్మరాజుజోస్యులుభాయిగారికి.

చెకు.—[లేవకయే] ఈమర్యాదలకు టక్కులకు ఏమి లెండి? కూర్చుండుఁడు.

[వలీఖాన్ కూర్చుండును.

చెకు.—మీరు మోసము చేసిన నేను మోసపోయెదను గాఁబోలు. 'ఢిల్లీకి తీసికొనిపోయెదము, సుల్తానువారిదర్శనము చేయించెదము,' అన్నమాటలు ఎవరివో? మీము ఖరారు తప్పుతామా?' తప్పరు. నన్ను మీరు వదలినను మిమ్ము నేను వదలలేదు. యమధర్మరాజు వదలదు.

వలీ.—భాయి, నేను బలే హావషరంలో వచ్చినమాట మీకీ తెల్సే వుంటుంది.

చెకు.—నే నుండఁగానే మీహర్కారా ఖుస్రూఖాన్ కడకు వచ్చి [హేళన చేయుచు] మీప్రతాపము వెడలఁబుచ్చినాఁడు.

వలీ.—హేళనం చేస్తా వేమి భాయి?

చెకు.—చాకలిని పట్టి తెచ్చితి వని నిన్నక్కడ లోక మంతయు హేళనము చేయుచున్నారు. అప్పుడే ఖుస్రూఖానునికిఁ గూడ తెలిసినది. నీవు ఓరుఁగంటినుండి కదలఁగానే యుగంధరుఁడు వచ్చి చాకలి నొకని బోధించి రాజువేషమున నీ యడవి దారిలో నిలిపినాఁడు. వాఁడు కావలయుననియే నీకు పట్టుపడినాఁడు. నీయోగము దౌర్భాగ్యమే. వానియోగము రాజభోగమే. నాతో మాటలు పెంపకు.

వలీ.—మతి అక్కడిగతి?

చెకు.—యుద్ధము, ఖు[illegible] కడమ మోస [illegible] కొట్టినారు.

వలీ.—రాజాకథా యేమి ?

చెకు.—రాజు మొదట చచ్చినాఁడు, తర్వాత వచ్చినాఁడు.

వలీ.—తెల్సేలాగ చెప్పుభాయి.

చెకు.—రాజు వేటలో చచ్చె నని నేనొక దొంగజాబు మంత్రులకు వ్రాసి అట్లే దేశ మంతట కింవదంతి పుట్టించి కొంత దుఃఖశాంతి చేసికొంటిని. పిమ్మట వారము రోజులకు రాజు వచ్చెను.

వలీ.—మరి మంత్రియుగంధర్ కథా యేమి ?

చెకు.—ఆయన రాజు వచ్చినవెనుక రామేశ్వరము పోయి అచట చలి జాడ్యమువలన చచ్చినాఁడు.

వలీ.—అల్లా! అల్లా! అల్లా! హాశ్చర్యం! [హర్షముతో ప్రకాశము] ఇక ఓరంగోలు మాకి ఏక్ లాడూ. అచ్ఛా!ఆయ్నా రామేసరంపోవడం హమారే పేట చెప్పినారు. ఆయన సావడం మాదేపుణ్ణెం.

చెకు.—మఱి ప్రకృతము.

వలీ.—నాకి యిప్పటికి యోగం చెప్పు భాయి.

చెకు.—నిన్ను నేను ప్రేమించితినని బొంకవుగదా? మఱి, ఒక్కొక్క మాట చెప్పఁగానే నిజము నిజ మని పలుక వేని నేను పైని చెప్పను. పూర్వము నీవు ఔను యికిఁ గాదని బొంకలేదా? నిన్ను నమ్మరాదు.

వలీ.—నీవు శాకీద్రోఘంచెయ్యనని ఖరార్ చేస్తే అంతాయథార్థ్ పదరాక్.

చెకు.—ఇప్పుడేల ఖరారు? నేను ఓరుఁగంటిలో నీ డేరాలో నే చేసితిని. వేఱే ఖరారు నేను మరల చేయను.

వలీ.—అట్లైతే వొప్పుకొంటాఁ చెప్పు.

చెకు.—ఖుస్రూ వచ్చియున్నాఁడు. నిన్ను దర్శించును. చాకలిని తెచ్చితి వని నీతో పలుకును. సుల్తానుతో చెప్పు నని వెఱచి నీవు వానిని చంపివేయుమని చెప్పుము, చంపఁ దలఁచితివా లేదా ?

వలీ.—జోస్యులు భాయి, నాప్రాణాన్కి నీచేతా పెడుతున్నాను. చేత చాకలికి తెచ్చినమాట ఖుస్రూకి తెల్సిందని నీవు చెప్పినప్పుడే వాడికి సఫాయి చేయ వల్సింది తల్చినాను.

చెకు.—నీవు ఈఢిల్లీ సింహాసనము నెక్కఁగోరి యున్నావు. నిజము పలుకుము.

వలీ.—సాస్తుర్లుభాయి, నాప్రాణం నీచేతా వుంది. కోర్తున్నాను.

చెకు.—నాకు ఒకఖరారు వ్రాసియిచ్చిననేగాని, నీకు అది వచ్చునో, రాదో, ఎప్పుడు వచ్చునో, ఎట్లు వచ్చునో, చెప్పను.

వలీ.—చెప్పు, రాశి యిస్తాను.

చెరు.—“నేను నేటికి తొంభై రోజు రాత్రి సుల్తాన్ కాగానే నీకీ నాచె
ల్లెలి యిచ్చి పెళ్లీ చేశి వోరంగోల్ పట్టి ప్రతాపుడుకి ఖైద్ చేసి ఆరాజ్యానికి నీకీ
పాద్చాచేస్తాను.” అని వ్రాసి నేటితేది వేసి దస్కత్తు చేసి యిమ్ము.

వలీ.—అరే బొమ్మన్కి నీకీ నాచెల్లెల్కి యేలాగ యిచ్చేది. భాయి ?

చెరు.—నేను నీమతములో చేరెదను.

[వలీ వ్రాసి యిచ్చుట నభినయించును.

చెరు.—[పుచ్చుకొని చదువుకొని] మంచిది. ఈ ఖరారులోనే చెప్పితిని.

వలీ.—యేలాగా వస్తుంది?

చెరు.—ఖూనీలు చేసి సంపాదించెదవు.

వలీ.—చెయ్యడాన్కి తయ్యార్ వున్నాను. ఎవర్కీ ఎవర్కీ?

చెరు.—నీకు విరోధులగు వజీర్ల నందఱను సుల్తానును గూడ.

వలీ.—అందర్కీ చంపడాన్కి తయ్యార్. సుల్తాన్కు కూడా చంపడాన్కి
తయ్యార్. వీడు తన అన్నా కొమారుడ్కి సిషువుకీ చంపి తఖ్తా యెక్కినవాడే.
అందఱున్న నాకీ యేలాగ దొరకుతార్ భాయి?

చెరు.—ఇందఱును ఆరాత్రి ఒకయోడలో చేరుదురు! అప్పుడు నీకుదొరకుదురు.

వలీ.—నమ్మడానికి అసాధ్యం వుంది. హాశ్చర్యం వుంది. మరి యిందుకీ నా
కోమ్మక్ యేమీ జరూ ర్లేదా?

చెరు.—సర్వము యత్నాధీనమే. యత్నము లేక గ్రహములు ఫలము నీయవు;
స్వప్నమందుఁగాని, మనోరథమాత్రమునఁగాని, జన్మాంతరమునఁగాని, ఇచ్చును.
కావున పూర్ణయత్నము వలయును.

వలీ.—ఆయత్నం యేలాగో చెప్పు. నేనే యత్నం చేస్తే వక్టీతప్పి వక్టీ చెయ్య
బ్బి వచ్చును. నీవు జోస్యానికి సరిగా ఇదీ చేయి చెప్తే అదీ చేస్తాను. ఫలం నిఛ్ఛయం.

చెరు.—అవును, అట్లు చేసిన, ఫలం నిశ్చయమే. అవునుగాని ‘నాపొట్టా పెరగా
వాలా నానోరు తియ్య కావాల, నీవే లడ్డు వవిలిపెట్టు నీవే లడ్డు మింగిపెట్టు,’ అను
సన్నా వేశి?

వలీ.—భాయి, నీకీ చూడగానే నాకీ ఖాసాబుద్ధి వుండదు. నీవు జోస్యం
చెప్తావో వుపాయం చెప్తావో నాకీ తెల్వాదు, నేను కబోదీ వుంటాను.

చెరు.—రెండును కలిపి చెప్పెదను. ఆదినము పగలు మూఁడవజామున
సభకు—[అని సగములో] మంచిది.

ఉ. ఈ [1]మత మీవు సేయు దని యేమి నిజంబు? బడావజీర వై
భూముల సీమలం బొగడు వొందిన [2]మేటివి, నీకుఁ బాదుషా
గామి య దంతగాఁ గొదువ గాదు; పకీరను నే నమీరు గా
కీమెయి నుందునొక్కొ? గిర వి మ్మిటఁ జొచ్చెద నమ్మి నీనుడిన్. ౧

వలీ.—నాచెల్లెలికి యిష్టే నీఘుర్కు తీస్కానిపో.

చెరు.—విస్తారము భోజనము చేయునా యేమి? నీచెల్లెలిని పాచ్ఛా పెండ్లిగా పెండ్లియాడుదు నేగాని పకీరు పెండ్లి గా పెండ్లియాడను. అందుల కిదిగో, జవాను జామీను పుచ్చుకొనియెదను, వినుము.

వలీ.—అచ్ఛా, తయ్యార్, చెప్పు.

చెరు.—నన్ను, ముందు సుల్తానుసభకు చేర్పుము. నీపెద్దకొమారితను సుల్తానకు, చిన్నకొమారితను నీవిరోధి సేనాపతికిని,ఇచ్చెద నని వారికిచెప్పు.[ఆత్మగతము]

ఆ. భరతఖండ మేలుఁ [1]బంచాశదబ్దముల్
పరఁగ నాకుమారిపతి యటంచుఁ
బిట్టపిడుగు జ్యోతిషాట్టహాసములతో
నతఁడె వీని వేఁడున ట్లొనర్తు.

[ప్రకాశము] దానిని తప్పకుండ అతఁడు కోరునట్లు చేయుపని నాది. నే నేర్పరించిన తొంబదవ దినము నిశ్చితార్థము సుల్తానువారిసభలో చేయుము. ఆయుత్సవముకై వజీర్లను సేనాపతులను కడమగొప్ప యుద్యోగస్థులను అందఱను పిలువుము.[ఆత్మగతము]

(మత్తకోకిల)

'నీకుఁ బాదుషహా యొసంగును నేఁడు చూడు [1] పెషావరుఁ;
నీకు [2]వంగము; నీకు [3]నంగము; నీకు [4]లాహొరుఫర్గణా;
రాక తప్పదు' మంచు జోస్యము రాణఁ బల్కి వజీర్ల నే
నేకసంఘము గూర్తు నాఁటికి నిందు ఢిల్లిపురిందుతోన్.

[ప్రకాశము] అందఱను నేను రప్పించెదను. మూఁడవజామున గోవావర్తకులు వచ్చి నజరులుంచి సుల్తానును తమమోడలకు సరకులు చూడరమ్మని పిలుతురు. వెలతీర్పరికే

౧. 1. ఒప్పుకొన్నపని. 2. గొప్పవాఁడవు. అమీరు=ప్రభువు. ఈ మెయిన్=ఈవిధముగా. గిరవు=కుదువ.

౨. 1. ౫౦ సంవత్సరములు.

౩. 1. 2. 3. 4. పెషావరు, అంగము, వంగము, లాహోరును దేశముల పేరులు

గొను తెస్తుంది? మన మడివేలు ప్రతాపుని వెలతీర్ప రప్పింతురు. నజరులకు వాఁడు జేయు వెలలు వర్తకులొప్పి రేని సభయెల్ల ఓడలకుఁ బోవును. కావున, వర్తకులకు,

(తరళము.)

సబుసుఖర్చు, నజర్లకు న్వెల, సర్వవిక్రయలాభమున్,
బ్రబలమై త్రిగ నావలో మనపక్ష మున్కకి లంచమున్,
[1]నిబిడరాశి [2]యొనర్చి యిత్తువు నీవు; వారిని దాన నే
సొబగు మీఱఁగ [3]డక్కఁగొందును, సొంపుగాఁ బని తీర్పుమున్. ౮

వలీ.—ఆమొత్తం యింతా చెప్తే, యిప్డే నీచేతికి యిచ్చివేస్తాన్.

చెరు.—నీసొత్తంతయు నిచ్చినను చాలదు. నేను పాచ్ఛా అగునప్పుడు ప్రతాపుని నగలు ధరించి ఆతనిగుఱ్ఱమునకు పూర్వమది ధరించిననగలు వేసి ఆతనియెదుట నే స్వారి చేయవలయును. అందుకై నాకప్పటికి ఆవర్తకులే అమ్మునట్లుగా, వారి కిపుడు ధనముగా ప్రతాపుని భూషణములును వానిగుఱ్ఱము భూషణములును అన్నియు నాచేతికి ఇచ్చివేయుదువు. ఇది నాకు జామీను.

[వలీఖాను తటాలున లోపలికి పోయి ఒకపెట్టె తెప్పించి తాళపుఁజెవితోఁగూడ ఇచ్చును.

చెరు.—[తెఱచి చూచి] సరియే.

వలీ.—రేపు భాయికి సుల్తానువారి దర్శనం.

చెరు.—సరి. నేను నడచెద. నీవు నీపనిచూచుకో. సలాము ఢిల్లీసుల్తాన్.

వలీ.—సలాం వోరంగోల్పాచ్ఛా.

[పెట్టెను తెచ్చిననౌకరు పెట్టె నెత్తుకొని చెరుముకితోఁ గూడఁ బోవును. వలీఖాను నిష్క్రమించును.

చెరు.—[పరిక్రమించుచు ఆత్మగతము] నన్ను వలీకడకుఁ బంపుచో నా నీతి విద్యాగురువు ప్రయోగసిద్ధిని ఈచెంత నే తనకుఁ దెలుపు మని సంకేత మేర్పరించి నాఁడు. కావున ఆతని నే అరసెద. [శ్రవణ మభినయించి] ఎవరు వీరు? వెట్టివాఁ డగపడలేదని చింతిల్లుచున్నారు. మరల విని కనియెదను. [అని పరిక్రమించును.

---

## స్థలము 2. ఢిల్లీలో ఒకవీధి.

### అంతట ఇద్దఱు తురకజవానులు ప్రవేశింతురు.

[ఉభయులు పరిక్రమించుచు సంభాషింతురు.

ప్రథ.—ఆరే అమీనుద్దీన్, యీదివానా మనకీ యెక్కడరా దొరుకుతాడు? యిన్నిగల్లీల్ తిరిగనాం, యిప్పటి కింకా వాగ్పడలేదు.

౮. 1. దట్టమైనప్రోగు 2. చేసి. 3. వశపఱుచుకొందును.

ద్వితీ.—అరే అబిబుడీన్, యెందుకోపంరా వీడ్కీదగోడ్గ స్తీ పంపినార్ వస్తే

చెకు.—[ఆత్మగతము] ఈపిల్లి గ స్తీలవలననా ఆ ప్రళయరుద్రుని సాధించుట

ప్రథ.—వీడు దివానా వుంటాదో వుండడో, సుల్తానువారు కన్పట్టి రమ్మం టార్, వీడు ఢిల్లీ సుల్తాన్కు పట్టుకపోతాన్ అరుస్తాడుగదా, ఆయన సుల్తాన్ గదా, దానికి ఆయన వజీర్లు అంతా గాభరా ఆయినారు. దివానా కాకపోతే, వీడు సుల్తా న్కి పకర్డేవు చేస్తాడు అని అంధర్కి భయం. వజీర్లు వీడు ఖానాతినడం కనిపట్ట మంటార్.

చెకు.—[ఆత్మగతము] పకర్డేవు తప్పదు. కనిపట్టుట సాధ్యపడదు. వైపీకిలో నుండును. వీరిమొత్తి యేమో వినుచు వీరితోనే పోయి, మంత్రిబృహస్పతికి లనయోగ ను మనోరథాతీతముగా నెఱవేర్చితి నని అనన్యగోచరసంకేతముగా ఈ పెట్టెలో యెదుటనగపడి పిమ్మట నీయాభరణరాశిని ఇల్లు సేర్చెద. [అని వారివెంటనే చనును.

ద్వితీ.—మనం యిది మొదల్ ఈరాత్రి అంతా, వీడ్కి తెలియకుండా వీ రొంటూ తిరుగుతా వుండవాలా. మనకీ యెంతా ఖష్టం వచ్చిందిరా వీడికీకోపం!

ప్రథ.—అరే అమీన్, నీవు యక్కడ్రాం? మూడు చందుల్ ఆయింది నా! హాగ్పడి?

ద్వితీ.—భాయి, నేను ఆ తెలంగిరాజా ఖైదీ వున్నాడే ఆయన్కి పహరా. ఈ రోజు నాకీ వంతూ లేదు, రేపు నాకీ వంతు.

ప్రథ.—ఎందుకు భాయి ఆరాజాకి ఖైదుచేసినార్!

ద్వితీ.—అది నాకీ మాలుం నహి. ఆయన్కి మోసంచేసి పట్టినారు తోస్తుంది. అరే ఆమహారాజాకి యేమి బడాగుణాలు వుంటవిరా! ఎప్పుడు అతడు ఖయిదీ, నేను పహరాజనాన్ వుంటానుకోసం నేను నమాజుమేకూడా కోర్తాన్.

ప్రథ.—ఏమి అతన్కి గుణాలు భాయి?

ద్వితీ.—ఆగుణాలు గిణాలు చెప్పడానికి నాకీ తెల్వాదు. వఖ్టి చెప్తా:—

క. ఆయన యిందర్, చందర్,
ఆయన జూలీసుసీజ, రాలీసాందర్;
ఆయనమోమ్ చూస్తుంటే,
ఆయనభా త్వింటువుంటె, అదె చాల్ నాకీ.

ఆయన రాజు నేను గులాం ఐతే ఆయన నాకి నబాబ్చేస్తాడు, వజీర్ చేస్తాడు, పట్టల్ హోమ్రా చేస్తాడు. వఖ్మాటా చెప్తా, ఆయనే కాలీఫ్ హారూనల్ రషీద్! ఆయన్కిముందర హామారే సుల్తాన్ పఖీర్ బిఖార్.

ప్రథ.—అరే [illegible] వఖ్తుస్మే [illegible] తింటావ్, [illegible] పోయుతావ్, యెంభాయి!

ద్వితీ.—అరే నమ్మక్ యిస్తే గుణం వస్తుందీ? నమ్మక్ ఇయ్యకోపోతే గుణం పోతుందీ? నమ్మకినాం, నౌఖరీ చేస్తాం? గుణం దాస్తాం? ఇది నాలిక వక్టి భాయ్, వుణ్టా కాదూ.

చెను.—[ఆత్మగతము] సిపాయిగాఁడ వైన నై తివిగాని, నీయందు గొప్పతన మున్నదిరా!

ప్రథ.—అచ్ఛా భాయి, అచ్ఛా. గుణం గుణమే, నాలికా నాలికే. భాయి, ఆహా పెళ్లానికి, బిడ్డాకి, రాజ్యానికి, కంచెకా గించెన్కి, తల్చుకొని యేడుస్తాడూ?

ద్వితీ.—పల్కకూడదు. మహారాజ్ తఖ్తుమీదవున్నాడులా గాదిల్ఖుషివుంటాడ్.

చెను.—[ఆత్మగతము] హా! మహాప్రభూ!

[నేపథ్యమున]

ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్ ;
మూడే నెల్లాకూ పట్టూకపోతాన్ ;
వీరణ్ణి రాగణ్ణి మన్ను చేయిస్తాన్.
గోతులోపాతించి గోరీ కట్టిస్తాన్. [మరల అదే చెప్పును.

చెను.—[ఆత్మగతము] వాఁడుగో, మహానుభావుఁడు వచ్చుచున్నాఁడు.

ప్రథ.—అరే అమీన్, దివానా, అరేదివానా, అమీన్, దివానావస్తున్నాడు ద్వితీ, వాడిపాటా యిన్పడ్తుంది. మన్మయిక్కడే వుందాం. మన గస్తీజవాన్లు అరుగో.

[నేపథ్యమున]

ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్ మూడే నెల్లాకు పట్టూకపోతాన్.

[మరల అదే చెప్పును.

ప్రథ.—అరే అమీన్, వీడు మూడు నెల్లు అరుస్తాడు వింటావా? వీడురోజ్ ... లేదు అంటారు.

ద్వితీ.—వీడు మూడు చందుల్నుంచి యిలాగా అరుస్తున్నాడు చెప్తారు; మొ ... ఆసుమాషాల్కి పట్టుకపోతాన్ అరిచినాడు చెప్తార్?

ప్రథ.—అరె నీకీ యెవ్వర్ చెప్పినార్?

ద్వితీ.—మహారాజవాన్లు చెప్పుకొంటాల్. నేను వింటాన్.

ప్రథ.—ఆ రాజాకి వీడ్కి యేమైనా సంభందం వుండునా భాయి? వాడూ ... వీడూ తెలంగి.

ద్వితీ.—వీడిది భాత్ వస్తే, 'దివానాభాత్ వల్ల మనకీ యేమి కిఫాయత్? ... యేదైనా మంచిఖమాయిష్ చెప్పండి,' అడ్గుతాడు మహారాజా,

అంతట పెట్టివాఁడు పెద్దగుంపుతో ప్రవేశించును.

[పెట్టివాఁడు గుంపును కొట్టును. గుంపు వానిమీఁద(బడును.

జవానులు.—అరే దివానా! అరే దివానా! బలే తమాష్! బలే తమాష్! … వాడివెంటా గుంపు! ఆరే వాడు యెంత గడ్బిడా చేస్తాడూ! మన్ము యిక్క… వాడికి తెల్వకుండా దొంగా వుండి చూస్తాం. [అని పొంచి చూచు…

[చెరుముకి పెట్టివాఁడు కనునట్లుగా వాని వ్రేల పెట్టెవానితో నడచును.

ఇద్దఱుజవానులు—[పెట్టివానిగుంపునుండి చీలియీజవానులకడకు వచ్చి] సలాం భాయి. వీడు దివానా సందేగం లేదు. తెల్వార్జాంనుంచి యిప్పట్కి తిన్న… కూడూ లేదు. వీడికి సైతాన్ బలం వుంది. అయినా కబడ్దారుగా చూడండి. కూడు తింటాడూ లేదు కన్పట్టండి. మేం పోతాం.

క్రొత్తజవానులు.—పొండి, సలాం సలాం. [ప్రాఁతగ స్త్రీవాండ్రు నిష్క్ర…

పెట్టి.—ఢిల్లీ సుల్తాన్... [రస్తాలోపొట్లపువిస్తరాకుదొరకఁగాదానింగైకొ… వహవ్వా! నాకు జయకాలం జయకాలం. బళీ! యెటువంటికిరీటం దొరికింది! నాకు [అని దానిని టోపిగా ధరించి] బలారే! దీనితో నేను ఈ భూచక్రమంతాయేలుతా [అని గిరగిర నృత్యము సేయుచు] ఢిల్లీ సుల్తాన్ ... [చెరుముకి నిష్క్రమించును

ఒకవర్తకుఁడు.—పాపం, అన్నం లేక అరిచరిచి చస్తాడు. పెట్టినా తిన… ఎందుకైనా పనికిగాదా, వంట చేసుకుంటాడేమో? వీడి జేబులో యీ బియ్యము… పడేస్తా. [అని అట్లు చేసి] ఈలాంటి అనాథలకు చేసిందే పుణ్యం.

పెట్టి.— నాకు రేగుతూవుంది రేగుతూవుంది రేగుతూవుంది. సున్నంలింబే కో… పొక్కుతుంది. కుక్కకాటుకు చెప్పుదెబ్బ. తాటిచెట్లు కొబ్బరిచెట్లు చింతచెట్లు మామి… డిచెట్లు అరిటిచెట్లు అన్నీ చెల్లే; తుమ్మచెట్లంతా ముళ్లు, కండచీమలు. నేను కండచీమను ఏమనుకొన్నావోః పట్టుకొంటేవదలను. చుట్టకాల్చడంలో తెలివితక్కువై తేలు… కషాయం. పొడుము పీల్చడంలో వెంగళపైతే తననోటికి చెరుపు, దగ్గిరున్న వాళ్ల కళ్లకి కలికం. ఓంభాయి, ఓంభాయి, ఓంభాయి; నాతలకాయకు నేనే సవాయి… స్తాను. నన్ను వెక్కిరిస్తే చెకడాలెక్కదీస్తా. రాగా, బోరువగద్దా, నాకెందుకు తోడుబోతు పెట్టినావు? అమ్మో! బాబో! తాతో! నాయనో! వీరదు … చేరినాడు. కళ్లు మూసుకొంటా [అని మూసికొని] ఢిల్లీ సుల్తాన్... [ఒకవైపున చూచి] అరే యింటితూము ఢిల్లీసుల్తాన్; పాపం! యెందుకు కన్నీళ్లు కడవలు గారుస్తావు అన్నంలేదా నీకు? యిందా తిను అప్పచ్చికొండా. [అనితూముముఖమున జేబులోని బియ్యమువేసి ఒకరాయి పట్టుకొని [ఢిల్లీసుల్తాన్... [అనుచు పరువెత్తును, ఎవడో అరాతిని తీసికొనును.

వెట్టి.—అరే నాకు నాఢిల్లీ సుల్తానును ఇచ్చెయ్యి, లేకపోతే గుండెలు పగల
[అని వానిని తన్నును.

రాయి తీసికొన్నవాఁడు.—ఏమి బల మబ్బా యీడికి! [అని రాయి పాఱవేసి, పిఱ్ఱ పిసికికొనుచు] ఎంత తన్నుతన్ని నా డ్రాశం డాలుడు. నిద్రాహారాలు లేకుండా పడుతాడు, యీడి కీబలం యేలా గొచ్చిందిరా ?

మఱియొకఁడు.—యెట్టి బలమనంగాయిన లేదంటయ్యా? [వెట్టివానింగూర్చి]
[అని మఱియొక రాయి యిచ్చును.

వెట్టి.—నాకు ఆ బంగారుసుల్తాన్ మాణిక్యంసుల్తాన్ వన్నెవాడపులిసుల్తానే గావాలి, యీరాయిసుల్తాన్ రప్పసుల్తాన్ కోడిసుల్తాన్ కొంగసుల్తాన్ నాకక్కర లేదు. [అని పటపట పండ్లుకొఱుకుచు, ఆరాయి పాఱవేసి మొదలిరాతి నే తెచ్చు కొని] సుల్తాన్, నీకు దెబ్బతగిలిందా బాబూ, మందు వేస్తాలే. [అని తనయొంటికళ్ళ కదానికి పూసి ఢిల్లీ సుల్తాన్ ...[నేలఁబడి పొరలుచు, పొరలుదండములు పెట్టి, కొంతసేపటికి తనలో తాను నవ్వుకొని లేచి] నే నెవరనుకొన్నావు? నేను యోగీశ్వరుణ్ణి, అంజనం నేర్పుతా. తురకాణ్ణి, గాడిదను, మనిషిని, గుఱ్ఱాన్ని, కాలభైరవుణ్ణి, ఏనుగుతొండాన్ని, లొట్టిపిట్టను. [త్వర త్వరగా] కాకిని గద్దను కోడిని కొంగను పెట్టను పొట్టిని కుట్టను. ఏవిద్య నేర్పమన్నా నేర్పుతాను రండి. నాశిష్యు లైనవారు నాతోరండి. నాకుశూన్యం పెట్టక ముందు చదువులబరికూడా చెప్పినాను. చదువు, చదువు.
[అని పిల్లవాండ్రను చావఁగొట్టుట నభినయించును.

ఒకపడుచువాఁడు.—[తనయిరువురుమిత్త్రులతో] వెఱ్ఱివేషాన ఈయన వాస్త వంగా యోగీశ్వరుడే అయినా గావచ్చును. ఇట్టివాళ్లకి బంగారంచేయడం, ఆకాశ గమనం, పరకాయప్రవేశం, ఈమహిమలుకూడా వుంటాయి. మనం మెల్లిగా యీయ నాశ్రయించిసత్త యేమైనా వుంటే గ్రహిస్తాం. మనకు ఈదేశంలో తల్లితండ్రీ యెవరూ లేరుగదా రండి.

ఇతరులు ఇరువురు.—మంచిదిరా ఆలాగే చేతాం. మనలో యెవడికి నేర్పినా వాడు కడమ యిద్దరికి నేర్పవలిశింది.

ప్రథ.—ఈయన తన్నినా చంపినా మనం పడదాం. లేకపోతే చెప్పడు.

ఇతరులు ఇరువురు.—సరిసరి.

ముగ్గురును.—[వెట్టివానితో] స్వామీ, యోగీశ్వరులూ, మేము శిష్యులంగా వుంటాం.

వెట్టి.—బళీ, అయితే రండి. [అని వారిని చావఁగొట్టును.

రాయితీసికొన్నవాడును రాయి యిచ్చినవాఁడును కడమచూపరులు—[పకపక నవ్వుచు] బలేబలే! సదువువొంటపడతావుంది! సదువువొంటపడతావుంది! వాడం టారు. యెధవముండకి మొక్కితే తనకిమళ్లే యెద్యేళ్లు వొర్ధిల్ల మన్నదంట.

వట్టి.—ఆవెధవముండలమాట మీకేమి రండి. వేదాంతం నేర్పుతా.

శిష్యులు.—తమచిత్తం.

వట్టి.—మరి నేర్చుకొండి [అనివికటనృత్యముతో నభినయముతో నుచెప్పను.

అన్నమైతే నేమిరా, మరి సున్నమైతే నేమిరా.

శిష్యులు.—అన్నమైతే ...

వట్టి.— అందుచే తీ పాడుపొట్టకి అన్న మే వేతామురా.

[శిష్యులు నవ్వుచు, ఒకరినొకరు చూచుకొనుచు

వట్టి.—[తన్నుచు] దిక్కులు చూస్తారూ? దిక్కులు చూస్తారూ?

[అని జుట్టు పట్టుకొనును

శిష్యు.—లేదు స్వామీ, లేదు, చూడము, చెప్తాము.

వట్టి.—[జుట్టు వదలి] చెప్పండి మరి. అందుచేతీ ...

శిష్యు.—[తమలో తాము నవ్వుకొనుచు, కొట్టునేమో అని బెదరిబెదరి వానిని చూచుచు] అందుచేతీ. ...

వట్టి.— మేడలైతే నేమిరా, కరగోడలైతే నేమిరా,

అందుచేతా మేడనే యీ బొందిని వేతామురా.

శిష్యు.— మేడ ... నేమిరా, [అని గురువువైపు చూచును

వట్టి.—అందుచేతా ...

శిష్యు.—[నవ్వుకొనుచు] అందుచేతా ...

వట్టి.— మెత్తలైతే నేమిరా, మరి చెత్తలైతే నేమిరా,

శిష్యు.—[నవ్వుచు] మెత్తలైతే ...

వట్టి.—చిత్తుగా యీ పాడుకట్టెని మెత్తనే వేతామురా,

శిష్యు.—[నవ్వుచు] చిత్తుగా ...

వట్టి.— సారమైతే నేమిరా, మరి నీరులైతే నేమిరా,

నీరుబొట్టు కలవనీక సారమే కొడ్దాముర.

శిష్యు.—సారమైతే ...

వట్టి.— అప్పులైతే నేమిరా, మరి పప్పులైతే నేమిరా,

అప్పునప్పు చేసి పప్పు ధప్పళమె కొడ్దాముర,

శిష్యు.—[నవ్వుచు] అప్పులైతే ...

వెట్టి.— జుట్టు పెడితే నేమిరా, మరి మొట్ట కొడితే నేమిరా,
జుట్టు పెట్టుక పూలు చుట్టుక చిట్టకా లాడ్దామురా,

శిష్యు.— [నవ్వుచు] జుట్టు ...

వెట్టి.— వెట్టి పడితే నేమిరా, మరి తొట్టి పుడితే నేమిరా,
వెట్టి తొట్టి వెంగళప్ప వెట్టివేదాం తామురా.

శిష్యు.—[నవ్వుచు] వెట్టి ...

వెట్టి.—నాకుదీన్ని చిన్నప్పుడువీర బ్రంహం నేర్పినాడు. నేను మీకు నేర్పినా.

ప్రథ.—[ఇతరు లిరువురతో జనాంతికము] యోగీశ్వరుడని నేను మొదటనే చెప్పలేదా ?

వెట్టి.—ఢిల్లీ సుల్తాన్ ... ...[అని పరుగు. శిష్యులు కూడ పరుగు.

వెట్టి.—వైరివాడికి అన్నిమతాలు ఒకటే,అయినా నాకు ఒకవిధంగా తురక మతం అబ్బింది. అది మీకు బోధచేస్తాను రండి.

శిష్యు.—మా కక్కుర లేదండి.

వెట్టి.—కక్కురలేదా? కక్కురలేదా? మరి శిష్యుల మని యెందుకు చేరినారు?

శిష్యు.— నేర్చుకొంటాం స్వామీ, నేర్చుకొంటాం.

వెట్టి.—[వడిగా నడుచుచు] మా తాతా, తురకాడున్ను ఒక యేట్లోనే మునిగడుకొంటున్నారు.తురకాడు అద్దరిని,మా తాత యిద్దరిని.మనమంతా ఉద్దరిని. అక్కడ కప్పలు కుప్పలుకుప్పలు; ఆమూలాన వాడి తురకమతం [గంతువేయుచు] ఒక్కగంతు వేసి మా తాతమీదుగా నాకొచ్చింది. నన్నుంచిమీకు వస్తావుంది.మరిచెప్పండి,లేకపోతే చంపేస్తా. [అని పాడును. ద్రష్టయొకఁడు మోర్సింగు వాయించును.

హావూపేడా మీారూ హాల్కికొంటార్.
హావుపూతీ మీారూ తాగీకొంటార్.
హావు మెక్కా మీాకీ మస్సీ తక్కా!
యెబ్బబ్బ యెబ్బబ్బ యేమీామతం !

[శిష్యులు నవ్వుదురు.

వెట్టి.—[అతికోపముతో] చెప్పరేమి? చెప్పరేమి? [అని కొట్టును

శిష్యు.—స్వామీ, చెప్పకొంటాం, ఈమాటు చెప్పండి. [యథాపూర్వము.

కుక్కా సామీ మీకీ ఛీ! ఛీ! ఛీ!
కోతీ సామీ మీకీ థూ! థూ! థూ!
కుక్కా కోతీ మెక్కావె మన్నీ తక్కా!
మెబ్బబ్బె మెబ్బబ్బె మేమీామతం!
బూడ్దేలో పొర్లేది గాడ్దేగదా
బూడ్దే పూస్కొంటావు రే బొమ్మర్,
గాడ్దేబొమ్మర్ నీకి సూవర్ హల్లా!
మెబ్బబ్బె మెబ్బబ్బె మేమీామతం!

వెట్టి.—అరే శిష్యులు, నేను మీకు ఖాజీనిగదా. నాప్రశ్నలకు జవాబు చెప్పి మీమతం నిలుపుకొంటారా?

శిష్యు.—నిలుపుకొంటాం.

వెట్టి.—నిలుపుకోకపోతే, నామతంలో కలిశిపోతారుగదా?

[శిష్యులు మొగాలు చూచుకొనుదురు.

వెట్టి.—కలిశిపోతా మనండి. [అనియిద్దఱను చెవులుపట్టుకొని యీడ్చుకొని పోవుచు] డిల్లీసుల్తాన్ ...

శిష్యు.—కలిశిపోతాం, కలిశిపోతాం.

వెట్టి.—జంద మెందుకురా పనికొస్తుందీ?

ప్రథ.—అది మాగాయత్రి.

వెట్టి—మూర్ఖా, వీపుగోక్కోడానికిరా అది పనికొస్తుంది.

ద్వితీ.— ఆడవాళ్లకు దురదలేదా?

వెట్టి.—వాళ్లకుండేది వాళ్లకుంది, నీకుండేది నీకుంది. నాతో వాదిస్తావూ! నేను ఖాజీని నీవు ఫాజీవి. [అని కొట్టును.

శిష్యు.—లేదండి, లేదండి.

వెట్టి.—మీమతంలో జుట్టెందుకు?

ప్రథ.—నరకకూపంనుంచి స్వర్గానికి లేవనెత్తడానికి.

ద్వితీ.—మీమతంలో గడ్డ మెందుకు?

వెట్టి.—చంపేస్తాను నాతో వాదిస్తే. జుట్టెందుకో నేను చెప్తాను నిమ్ము పట్టుకొని తన్నడానికి. [అని పట్టుకొని తన్నును.

తృతీ.—గడ్డ మెందుకో నేనున్ను చెప్తాను; పట్టుకొని ఊగడానికి.

[అని గడ్డము పట్టుకొని ఊఁగును. వెట్టివాఁడు ఆగ్రహముతో కొట్టఁబోవును. తృతీయుఁడు తప్పించుకొని దాఁటును.

ద్వి. తృ.—చాలునురా మన కీశిష్యత్వము. ఎన్నడూ నాయనచేత అమ్మచేతకూడా దెబ్బ లెరగము, ఈ వెర్రిముండాకొడుకుచేత తన్నులగ్రహచార మేమిరా! వీ డెవడో యినుముగాడు గాని మనిషి కాడు.

ప్రథ.—కాయసిద్ధి అయిన యోగీశ్వరుడురా, ఈయన దయచేత మనకున్ను కాయసిద్ధి కావచ్చును.

ద్వితీ.—మనకు సధ్యా కాయశుద్ధి అవుతూవుంది.

చారులు.—అరే వీడికి సూడడం తమాషాగానే వుంది. వాడికోపం సూడు.

వెట్టి.—[మహోగ్రహముతో] వెర్రిముండాకొడుకా? ఎవ్వడా? నాకు శూన్యం పెడితే నేను యీలాగయినాను. నాకు వెర్రేమి? వీరడు రాగడు నాకు శూన్యంపెట్టినారు. వాళ్లకి నాశాపం చూడు. [అని పాడును. ద్రష్ట యొకఁడు మోర్సింగు వాయించును.

వీరడికి రాగడికి నాశమంగళం,
నాశమంగళం గ్యం నాశమంగళం బ్యం. వీర.
గ్యంబ్యంగ్యంబ్యం గ్యంబ్యంగ్యంబ్యం గ్యంబ్యంగ్యంబ్యం గ్యంబ్యంగ్యంబ్యం
గ్యంబ్యంగ్యంబ్యం గ్యంబ్యంగ్యంబ్యం నాశమంగళమ్. వీర
వెర్రివాణ్ణి నన్ను పట్టి వెక్కి వెక్కి నవ్వినట్టి వీర.
తొఱ్ఱివాణ్ణి నన్ను మొట్టి తోశితోశి నవ్వినట్టి వీర.
బొఱ్ఱవాణ్ణి నన్ను నెట్టి బొంకి బొంకి నవ్వినట్టి వీర.
కుఱ్ఱవాణ్ణి నన్ను కొట్టి కూశి కూశి నవ్వినట్టి వీర.

నాకు వెర్రేమి? వెర్రంటే చెప్పట్టుకొ్కడతా.
వడ్లపూడివారి సంస్థానం వల్లకాడై పోయింది.
భోగవసంతరాయడి సంస్థానం బొగ్గులై పోయింది.
బందిరెడ్డివారి భాగ్యం బగ్గయి పోయింది.
కోనేటిపల్లి వారి పటాటోపం గోదావరిలో గలిశింది.
మహామహావాళ్లంతా మట్టిగొట్టుకపోయినారు;
ఈరాగడు ఈవీరడూనా యీదేరేవాళ్లు?
నాకు శూన్యం పెట్టినవాళ్లు నాశమై పోతారు.
తోడ్బుట్టు పెట్టినవాళ్లు [illegible] పోతారు.
శాతపాడి చేసినవాళ్లు సర్వనాశ మౌతారు.

మేము ఆదివారమునాడు అందలె మెక్కనూ లేదు,
సోమవారంనాడు జోలె కట్టనూ లేదు.
సూదిగా వచ్చి దబ్బనమై తేలడం యెరగవా ?
అరటి తడ పని పారేస్తే మిణ్ణాగై కరవడం యెరగవా ?

నాకు వెర్రేమి? వెర్రి వాడికి మాట లొస్తాయా? నాకు పిల్ల నిస్తే పెళ్లిచేస్తా లేవా? [చంకలు గ్రుద్దుకొనుచు దుముకుచు] హిహిహిహిహిహిహిహి. ఆడవాళ్లోయి ఆడవాళ్లోయి! పెళ్లోయి పెళ్లోయి! పెళ్లామోయి పెళ్లామోయి. దుముకు, ఎక్కు. [నోటికడ చేయి పెట్టుకొని] విను నా పెళ్లి సన్నాయి. కీకీకీకీ. చూడు నాక్లో. [తొడతాళము వాయించుచు] డాండాండాండాం. [తృతీయశిష్యుని ఉగ్రముగా జూచి] నీకళ్లుచూస్తే నీమనస్సులో నాకు వెఱ్ఱినే ఉంది. నిన్ను చంపేస్తా. ఢిల్లీ సుల్తాన్ ... [అని వానిని తఱుముకొనిపోవును.

[ఖుస్రూఖాన్ ఆదారిని పోవును.

చారులు.—[చూచి] అరే ఖుస్రూఖాన్ బహద్దర్! తెలింగీదేశంనుంచి వచ్చినాడు. అదే వలీఖాన్ యింటికి కావాలా పోతాడు.

[ఖుస్రూ నిలిచి వెఱ్ఱివానిని నిదానించి కని వెడలిపోవును.

వెఱ్ఱి.—[తృతీయశిష్యుని చెవిపట్టి లాగి తెచ్చి] ఇక పారిపోవుగదా? ఇక పారిపోవుగదా? [అని చెవి నులిమినట్లు అభినయించుచు] రహస్యం చెప్తా. [అని చెవిలో] నాయనా, ఈఖుస్రూగానితో పోయి వృత్తాంతముగని వచ్చి చెప్పుము [అని చెవికఱచి ప్రకాశము] ఇక నిన్ను నాశిష్యులలో చేర్చను పో. నాకిక్కడ అగపడితే చంపేస్తా.

తృతీ.—[కీ అని యేడ్చుచు] మా అమ్మో నాయనా చేసుకొన్న పుణ్యం. దొంగవెధవ! రహస్య మని వంక పెట్టి చెవి కరిచేశాడు. [ఆత్మగతము] హా! ఏమి మహానాయన జాగరూకత ! ఏమిప్రతిభ ! ఆహా ! రాజుకై ఎట్టికష్టములను పాల్పడుచున్నాఁడు ! [అని పాఱిపోవును.

వెఱ్ఱి.—నాశక్తి యీనాగమ్మకు తెలుసునా? నేను బారువ మిరపకాయల మంగలంలో వేయించి దంచినా దగ్గను. ఒళ్లంతా గొంగళీ పురుగుల అంగీ తొడిగినా గోక్కొను. గాడిదకంటే ఓంద్ర పెడతాను, గడ్డి మేయను. గుఱ్ఱానికంటే పరుగెత్తాను, గూటాలు పెరకను.

ప్రథ.—[ద్వితీయునితో జనాంతికము] ఇదంతయు కార్యసిద్ధికి ఫలం.

వెఱ్ఱి.—[ప్రథముని జుట్టుపట్టుకొని] ఢిల్లీ సుల్తాన్ ...

[ప్రథముఁడు తప్పించుకోక ఊరకుండును. వెఱ్ఱివాఁడు వదలును.

వెఱ్ఱి.—నాకేమి ఉత్తపిచ్చనుకొన్నావా? జ్ఞానపిచ్చి. నాకు శూన్యం కట్టిన

ర్వార ఆడవాణ్ణో మొగవాణ్ణో మరిచిపోయినాను. ఉపదేశం చేస్తాను పట్టు. పోనీ, చిత్తం వచ్చేటట్టు పాడితే నీకు వెయిన్నినూటపదహార్లూ దుశ్శాలువలూ యిస్తాను.

ప్రథ.—[జనాంతికము ద్వితీయునితో] ఈయన యోగి, బంగారం చేస్తా డని నేను చెప్పలేదా? ఈయన చంపినా యీయన్ని వదలను.

వెఙ్కి.—[ఆత్మగతము] అబ్బాయి ఇంకను రాలేదు. కరము వ్యాపృతుఁడై యుంటఁబోలును. కానీ, నాప్రతిభముందఱ ఇతరులనీతిప్రయోగము ఏపాటియో వర్ణింప లోగుట్టెఱుంగనివారు కవులను దూషించితి నని తలంతురుగాక. [ప్రకాశము] పూర్వజన్మంలో నేను కవీశ్వరుణ్ణి, అప్పుడు నాకవిత్వాన్ని నేనే వర్ణించాను. పాడండి.

[గురుశిష్యులు యథాపూర్వముగా ఖండఖండోపదేశముగా పునరుక్తిపూర్ణముగా సనృత్యముగా పాడుదురు. ఒక ద్రష్ట మోర్సింగ్ వాయించును.

మొద్దుమొ ద్దూకవుల
బొద్దుబు ట్టలమీద
బొద్దుబొట్టలమీద
గుద్దు నా ముద్దుపాట
గుద్దు నా ముద్దుమాట.

జబ్బుజ బ్బూకవుల
గబ్బుపా టలమీద
గబ్బుమా టలమీద
దెబ్బ నా లిబ్బిపాట
దెబ్బ నా లిబ్బిమాట.

పుచ్చుపు చ్చూకవుల
చచ్చుపా టలమీద
చచ్చుమా టలమీద
చిచ్చు నా మెచ్చుపాట
చిచ్చు నా మెచ్చుమాట.

టప్పట ప్పాకవుల
కప్పపా టలమీద
కప్పమా టలమీద
డప్పు నా యొప్పుపాట
డప్పు నా యొప్పుమాట.

కీతకీ తాకవుల
శేతపా టలమీద
శేతమా టలమీద
వాత నా జాతిపాట
వాత నా జాతిమాట

కూలికూ లీకవుల
బోలుపా టలమీద
బోలుమా టలమీద
డోలు నా మేలుపాట
డోలు నా మేలుమాట.

మడ్డిమ డ్డీకవుల
రొడ్డుపా టలమీద
రొడ్డుమా టలమీద
సొడ్డు నా లడ్డుపాట
సొడ్డు నా లడ్డుమాట.

శిష్యులు.—స్వామీ, యిది ముగియడ మెప్పటికి ?

వెట్టి.—ఇది అనంతం, మనము బతికుండగా ముగియదు.

ద్వితీ.—నాకు చాలును స్వామీ; దుశ్శాలువ, ౧౧౧౬ర్లు, ఇప్పించండి.

వెట్టి.—ఇస్తానురా. [అని జుట్టు పట్టుకొని పరుగున ఈడ్చుకొని పోవును]

ఢిల్లీ సుల్తాన్ ...

ద్వితీ.—[జుట్టు వదలించుకొని] బహుమతి స్వామీ, దుశ్శాలువ.

వెట్టి.—మూర్ఖా, దుః అని సరిగా ఉచ్చరించు, దుః, దుః, దుః, అను.
[అని జుట్టుపట్టుకొని వానితలను కదిలించును.

ద్వితీ.—దుః, దుః, దుః.

వెట్టి.—ఆవిసర్గని వేరే ఉచ్చరించు, మూడుమాట్లు.

ద్వితీ.—విసర్గను వేరే ఉచ్చరించడ మెరగను స్వామీ.

వెట్టి.—ఎవడ్రా నీకు చదువుచెప్పినవాడు? నీవు దుశ్శాలువలో మట్టే.

ప్రథ.—ఉహ్, ఉహ్, ఉహ్.

వెట్టి.—వాడు విసర్గ నుచ్చరించాడుచూచావా? వాడూ నాశిష్యుడంచే వానికి దుశ్శాలువ, ౧౧౧౬ర్లు. నీకు పూర్ణానుస్వారమే. [అని వానిని వదలి ప్రథముని

ట్టుకొని ఈడ్చుకొని పోవుచు]ఢిల్లీసుల్తాన్... [వానిని వదలి అగపడినవారి
స్వామీ, దండం; [అని దండాలు పెట్టును. వారు నవ్వుదురు.

వెట్టి.—ఈనరమానవుల కందరికి నామీద నే కన్ను. [అని అవలికి పోవును.

ద్వితీ.—శాలువ స్వామీ. [అని వెంబడించును.

తృతీయుడు.— [మరల ప్రవేశించి] రండిరా, మీకోసం వచ్చాను. ఎంత
ఈబొమ్మరాట? వస్తారా రారా ?

వెట్టి.—[తటాలున వానిగొంతు పట్టుకొని] నాపాటకు బదులుపాట నేర్ప
చేస్తా.

తృతీ.—స్వామీ, చెప్తా. స్వామీ చెప్తా. మీకు తగినదే నాకున్న ఒకటి
చెప్పకోండి మరి. [వెట్టివాఁడు గొంతు వదలును.

తృతీ.—[జనాంతికము] రండిరా ఓరి పాపాత్ములారా, రండి,పారిపోదాం.

ప్ర. ద్వి.—[జనాంతికము] రవంతుండరా.శాలువా, ౧౧౧౽ర్లూ పుచ్చుకొని
స్తాం.

తృతీ.—[జనాంతికము] నాకుకూడావంతు.[ప్రకాశము]చెప్పకోండిస్వామీ.
కోండి. [ఖండోపదేశముగా శిష్యుఁడు చెప్పి గురువు చెప్పకొనును.

[1]తాటికాయ నీటికాడ నాటినారయా,
తాటిబొంద నీటిలోన మీటినారయా.
కోపగించు తాటికాయ, కొంపమాపు తాటికాయ,
మాటలాడు తాటికాయ, మంత్రమాడు తాటికాయ, తాటి.
[3]రాయి గట్టి రప్ప గట్టి, రాంబొందు రాత గొట్టి, తాటి.
తాటికాయ [4]నక్క యింక, తాటిబొంద [5]చేప యింక, తాటి.
[6]వల్ల కాటి నల్లసామి చెల్లె లల్ల చూచుచుండ, తాటి.

వెట్టి.—భేష్! శబాస్! బళీ! దివ్యం! అద్భుతం! ఆశ్చర్యం! వహవ్వా! యేమి
పాటరా! ఏమిపాటరా! నీకు ౧౧౧౽ర్లు దుశ్శాలువ. అయిపోయిందా ఇంకా వుందా?

తృతీ.—ఇంద్రి, బహుమాన మియ్యండి.

[అని ఇతరశిష్యులను వెనుకకు ద్రోచి తాను వెట్టివాని దగ్గఱ ముందు
నిలుచును. ఆశిష్యులు త్రోసికొని ముందునకు వచ్చి నిలుతురు.

1. ఖుస్రూ తలకాయ. 2. ఖుస్రూ మొండెము. 3. రాయి రప్ప కట్టుట మొం
చేట తేలకుండుటకు. 4. [illegible] 5. మొండెమును
తినును, 6. యమున.

వెట్టి.—[రాయి యొకటి యెత్తి తృతీయునితల పగులఁగొట్టఁ బోవుచు కా గుందంటే, అయిపోయిఁ దంటావూ ?

తృతీ.—[ఆచేయి పట్టుకొన యత్నించుచు భీతినాటితకముతో] లేదు, లేదు, ఉంది, ఉంది, చెప్పకోండి, వద్దండి, చెప్పకోండి.

వెట్టి.—[రాయి క్రిందవేసి] మరిచెప్పు. [శిష్యుఁడును గురువునుయథాపూర్వము.

తాటిబొంద నీటిలోన మీటినారయా,

తాటికాయ నీటికాడ నాటినారయా.

కొండ లెక్క తాటిబొంద, కోటలెక్క తాటిబొంద,

గోడ లెక్క తాటిబొంద, కొంప లెక్క తాటిబొంద, తాటి.

రాయి గట్టి రప్ప గట్టి, రాంబొందు రాత గొట్టి, తాటి.

తాటికాయ నక్క యింక, తాటిబొంద చేప యింక, తాటి.

వల్లకాటి నల్లసామి చెల్లె లల్ల చూచుచుండ, తాటి.

తృతీ.—దుశ్శాలువు, ౧౧౧౭ర్లు.

వెట్టి.—నాపాట యిం కొకటి చెప్పకొంటే యిస్తా.

ప్ర. ద్వి. చెప్పకొంటాం.

తృతీ.—[ఆర్తితో] మీకు కూడా వెట్టి పట్టిందట్రా ? రా రేమిరా ?

వెట్టి.—ఏమిరా, చెప్పకొంటావా, దుశ్శాలువు పోగొట్టు కొంటావా ?

తృతీ.—చెప్పండి గురోజీ. [గురుశిష్యులు యథాపూర్వము.

తాటికాయ గోతినుండి తవ్వి వేయురా,

తాటిబొంద నీటినుండి దాటి యెత్తురా.

తాటికాయ నక్క గాదు, తాటిబొంద చేప గాదు,

తాడు లేక కట్ట రాదు, తగులఁగొట్ట కుండరాదు, తాటి.

రాయి విప్పి రప్ప విప్పి, [1]రాచనక్క రాత గుప్పి, తాటి.

తాటిబొంద తాటికాయ, తాచికట్ట దయ్య మాను. తాటి.

వల్లకాటి నల్లసామి చెల్లెలల్ల తూగుచుఁడ, తాటి.

తాటిబొంద మారుమూల నాటివేయరా,

తాటికాయ బొందతోటి తాచి కొట్టరా.

1. రాచనక్క ... అంచము లిచ్చి.

కాటికాయ మెండకుండ, తాటిబొంద చివకకుండ,
కాటికట్టు తెలియకుండ, తప్పు గిప్పు దొరకకుండ, తాటి.
కాయి విప్పి రప్పు విప్పి రాచ నక్క రాత గప్పి, తాటి.
కాటిబొంద తాటికాయ [1]తాచి కట్ట [2]దయ్య మౌను, తాటి.
వల్లకాటి నల్లసామి చెల్లెలల్ల తూగు చుండ, తాటి.

వెట్టి.—చాలునా? [అని తనగోనెసుస్తునుండి రవంత పీచు పీకి తృతీయుని ... దీన్ని చెవుమికికి తగిలించి యినుముతో కొట్టు, ఎంతనిప్పు పుకుతుందో ... ౧౧౧౯ ఇళ్లు కాల్చేస్తుందో లేదో, లెక్క పెట్టుకో. ఇదుగో నీకు దుశ్శాలువ. [అని తన గోనెచొక్కా తీయును.

ప్రథ.—స్వామీ, నాకో? [ఇతరులం గూర్చి] యోగంచేత యీగోనెలో ... చుంటాదురా శాలువ.

ద్వితీ.—స్వామీ, నాకో? [ఇతరశిష్యులం గూర్చి] అవునురా.

వెట్టి.—[గోనెచొక్కా తీసి తృతీయుని మొగాన వేసి] పుచ్చుకో. [అని] ఢిల్లీ సుల్తాన్ ... [అనుచు తిరుగును.

తృతీ.—ఇందండ్రా పుచ్చుకోండి. [అని రెండు గాచింపివారి మొగాన వేయును.

ప్ర. ద్వి.—ఏమిరా నీపొగరు? [అని వాని నతికోపముతో చూతురు.

తృతీ.—దుశ్శాలువ అంటే, రెండుశాలువలు. మీకంతు తలా ఒకటి. [పీచు ... చూపుచు] ఇదిగో, ౧౧౧౯ ర్లు, ఇవి నావంతు. [ద్వితీయునితో] ఒరే, ఆ ... ంతాన్ని ఇక్కడ అఘోరిస్తూవుండనీ, నీపైన వస్తావా లేదా?

ద్వితీ.—అందరం వెళ్దాం.

[ద్రష్ట యొకఁడు గోనెచొక్కా వెట్టివానికి తొడుగును.

వెట్టి.—నాకింకా వేయిపాటలువచ్చును, అవన్నీ సరిగా పాడితే, వెయ్యిన్ని ... సహస్రశాలువలున్న యిస్తా.

ద్వి. తృ.—మాకక్కరలేదు.                [అని పాటిపోఁ జూతురు.

వెట్టి.—[ఆయిరువుఁనుజుట్టుపట్టి] చెప్పకోండి [గురుశిష్యులు యథాపూర్వము.

గు. అంజభీము డండ డడడండ డడండడడ డండడండ, డం
డండ డడండడండ డడడండ డడండడడ డండడండడ డం
... ... ... ... ...

శిష్యులు.—[కొంత చెప్పి] సుబ్నాజీ, ఇది ముగియడ మెప్పటికి?

1. తలను మొండెమును కలిపి మేపబంధి చేసి, 2. పిమ్మట సమయమువచ్చి ... నా సాధ్యముగా నుపయోగింపవలసినది, అని గూఢోపదేశము. ... దేహమును తలను కాపాడు మనునాజ్ఞను చెవుమికి స్త్రీకి తెలుపుచున్న ...

వెట్టి.—మీరు చస్తే అప్పటికి.

ద్వి. తృ.—అయితే, యిదుగో చచ్చినాము.

[అని చచ్చినట్టు అభినయించుచు కూలుదురు, వెట్టి వాఁడు జుట్టు వదలును. వారు పాఱిపోవుదురు.

వెట్టి.—ఒరే, దాని యర్థము. [అని తఱుముచు.

ద్వి తృ.—మా కక్కరలేదు. [అని పాఱిపోవుదురు.

వెట్టి.—ఎందుకురా వాళ్లను పోనిచ్చావు? చంపేస్తా నిన్ను.

[అని ప్రథముని ఎత్తిపాఱవేయును.

ప్రథ.—గురోజీ, మళ్లీ వచ్చి మీ సేవ చేసుకొంటాను. నన్ను కడతేర్చవలెను.

[అని కుంటుచు పాఱిపోవు.

ద్రష్టలు.—చాలురా వీడితమాషా, వీడివల్ల బాగా పనిచెడ్డాం యీవేళ.

[అని నిష్క్రమింతురు.

వెట్టి.—అందాక నేనే చెప్పకొంటా. [అని సతాళనృత్యముగా చెప్పను.

*హరిహరీ నారాయ ణాదినా రాయణో,
కరుణించ వొయ్యమ్మ కమలలో శనుడా. కమలలోశనుడా.
దుంప లడి గీతేని దురబాస లాఁడేవు,
నిన్ను నక్కలు గరవ నిరయాల గురవా. నిరయాలగురవా.
బళిబళీ! మీతాత బల్లెంబు శేపట్టి,
పుల్లాపు తూటుగా పొడిచేశి నాడోయ్. పొడిచేశినాడోయ్.
యాదవుడి గోపులా మాదవుడు గాయగా,
మాదవుడు మచ్చావ తారమై నాడో. తారమైనాడోయ్.
యొద్దుచ్చ పొయ్యంగ యేరులై పారంగ,
వుంకించి వుంకించి దాశేశి నాడోయ్. దాశేశినాడోయ్.

[వీరావేశముతో] డిల్లీసుల్తాన్ ....

చారులు.—ఈ అద్మీకి యిప్పట్కీ ఖానా నహీ. మనం ఏక్ దోన్ రెండు తూర్లు తిన్నాం. మూఢో తూరికి హాకలి వుంది. వీను యేలాగ బతుకుతాడు!

ఒకతల్లి.—ఒరే, అబ్బీ, అన్నంపెడతాను పట్టు. [అని పెట్టును.

[వెట్టివాఁడు పరుగున పోయి గోనెలో గ్రహించి బట్ట కుక్కను దో, దో, దో, అని పిలిచి, దానికి వేయును.

ద్వితీయ చారుఁడు.—ఒరే వీడూ తింటాడూ తలచినాను. వీను పక్కా సైతాన్ వున్నాడు.

ప్రథమ చారుఁడు.—భాయి, వీను కులం చెడుతుందికోసం ఖానా తినడు వాళ్లాపుంది. వీను బొమ్మన్ తో స్తుంది సాకీ.

ద్వితీ.—వీడితోటి మనం వూరంతా తిరిగినాం. హాస్యమానం ఐంది. ఇంకా ఏమి పోయాసం వుంది.

ప్రథ.—అరే వీడూ వల్లకాట్కి పోతాడు. అక్కడ నిప్పు గిప్పు పెట్టి గీనా చేస్కుంటాడూ సూడావాలా.

[వెట్టివాఁడు ముఖమునకు మన్ను పూసికొనును.

ద్వితీ.—వీడూ మొఖం చేస్కుంటాడు, సూడు.

ప్రథ.—అరేవీడూజమునాకిపోతాడు.బొమ్మణానమాజ్ చేస్తాడూచూడవాలా.

వెట్టి.—ఢిల్లీసుల్తాన్... [అనుచు పరిక్రమించుచు] నేను కాకినో మనిషినో జ్ఞాపకం రాలేదు. ఎగిరి చూస్తా. [అని యెగిరి] బ్రాహ్మణ్ణో మనిషినో జ్ఞాపకం లేదు. ఎవరివో మాటలు వినబడుతూవున్నవి.ఆ వెధవలే, ఆయిద్దలే, వీరడు, రాగడు; భూమి లాక్కున్నారు, నా పెళ్లాన్ని దాచేశారు.ఏనూరుసంవత్సరాలునన్ను కట్టేసి, వాచేత రెండువేల పచ్చివంకాయలు తినిపించారు, నాకంఠానికిఉరిబిగించారు, ముడేళ్లకుట్టిపై తాన్ను నామీదికి పంపారు. అది నాకీలుకీలు కరవసం. ఈ ముసళ్లు నుపారాయేమిటి? కదిలితే యివి నాకాళ్లుపట్టుకోవడమేమిటి? నాకేమిసాష్టాంగం పెడుతున్నవా? ఎన్ని యేనుగులు! ఎంతసింహం! ఎంతపులి! ఇది నామీద పడితే నేను అంతర్ధానమౌతా. వీటిమీదికి జాగిలాలను యిసుకొలఁపుతా. ఇసుకో! ఇసుకో! ఇసుకో! నేను కుక్కను గానని నాకు తెలియడ మేలాగో? మొరక్కపోతే కుక్కను కానా? మొరగ లేదని దాఖలా యేమిటి? అదుగో యమున, నీళ్లు నలుపంటారు.ఒకరికి తెలికి నలుపైతే ఒకరికంటికి తెలు పెందుచేత కాగూడదు? నేను నాతో తేలుస్తాను. నేను బతికున్నానా చచ్చిపోతినా! ఇదేలోకం? మనుష్యలోకమా, యమలోకమా? ఇదే చావు, చావే బతుకు, ఏల గారాదు? నాకు సర్వమూ సందేహమే. బలి బలీ! యమున! ఎంతనీరు! ఎంత నీరు! ఈ నీళ్లన్నీ పుక్కిలించుమేస్తా [అని పలుమారు పుక్కిలించి యుమిసి] నన్ను కత్తితో పొడిచేస్తే ప్రాణం యేదారిని పోతుంది? నాకంటి కగుపడుతుందా? లావా సన్నమా? హా! యెవరు మీరు? రాగడిచేతను వీరడిచేతను మోసపోయిన వారా? ఏడవకండి, నేను ఢిల్లీ సుల్తాన్ని పట్టుకొనిపోయి రాగణ్ణి వీరణ్ణి తొక్కించేస్తా, దంపించేస్తా, పచ్చడి చేయిస్తా. ఢిల్లీసుల్తాన్... కోతికితోకుం శేగోదావరీత్తుందా? వంటచేసిమీకన్నంపెడతా, ఏడవకండి. ఈకుండపెంకు సమయానికి దొరికింది.[అని కుండపెంకుచేతఁగొని వంటచేయుచుంచుటనభినయించి] ఈనీళ్లుచాలు.ఢిల్లీ సుల్తాన్....[అనుచుపరిక్రమించును.

రాదులు.—మన్ను వాడువచ్చేతల్కియాచెప్లెక్కి దఖల్ లేకుండా వుందాం. బాగా చూడవచ్చును. [అని అట్లే చేయుదురు.

వెట్టి.—[కుండపెంకులో ఎసరు పెట్టి, రాలతో ప్రొయ్యిచేసి, ఎసరెక్కించి] ఈ కొష్ఠంలోది యీకోరివి, యీకొష్ఠంలోది యీకోరివి. [అని ఒకటిరెండు చితి నుండి కొఱవులు తెచ్చి ప్రొయ్యిలో పెట్టి మంట చేసి, ప్రొయ్యికడ కూర్చుండి] ఢిల్లీ సుల్తాన్... ఇదేమి! యీదయ్యాలు నన్ను చుట్టుకొన్నవి! నేను వండుకొంటూవున్న యీరవంత అన్నము, పీటికి గావాలట. [ఒకవైపు చూచి] ఓయి వెంగళప్పా, ఎప్పుడు చచ్చినావో మరిచి నన్నడగుతా వేమి? నీప్రాణం పోయినప్పుడే నీవు చచ్చినావు. పొండి మీరంతా. మీతస్సా గొయ్యా! పోరుగా? ఉండండి మిమ్మల్ని ఉచ్చాటన చేస్తా. ఢిల్లీ సుల్తానును పిలిపించి మిమ్మల్ని గోరీలో పెట్టిస్తా. [అని ఎసటిలో బియ్యము పోసి ఢిల్లీ సుల్తాన్...

ద్వితీ.—భాయి, వాడు ఖానాకి మన్ను పోశి వండుతాడు సూడు.

ప్రథ.—మన్ను కాదు, బియ్యము.

వెట్టి.—వీరడికి రాగడికి... [ఒకకొఱవి చేతఁగొని] ఈవల్ల కాటికి నేను చక్రవర్తిని. చూడండి చక్రం తిప్పుతాను. [అని బాణా త్రిప్పిత్రిప్పి కూర్చుండి,

* ఆవులింత సూచించి,

ఆత్మగతము] ఏసౌఖ్య మెఱుఁగని నాకు ఆవులింత యేమి? ఎటుప్రక్కను నరుఁడెవఁడు నాకంటి కగపడఁడు. ఈచెట్లమీఁద దాఁగి చారు లెవరో నన్ను పరికించుచున్నారు. కానీ, వారికంట మిరియపుంబొడుము చల్లెదను. [ప్రకాశము] వింతలేని యాలింతవుండదు. గుడగుడశబ్దం కుండకు నష్టం [అని బాణాకొఱవితో కుండపసులఁగొట్టి ఆ పెంకులు మెదుకులు చితిలమీఁద చల్లి] ఢిల్లీ సుల్తా... [అని ఆటుచుచు తిరుగును.

చారులు.—అల్లా అల్లా అల్లా! ఆరేవీకు దివానా నిశ్చయం. [అని దుమ్మీ] మన మెందుకు వీడితో సావడం? పోనాం రారా.

ప్రథ.—ఖానావద్దువాడు దివానా కాకపోతే, నీవూ నేను దివానా? భాయి నేను రేపు యీతమామ్ సుల్తాన్ వారిదర్బారులో యింకా పట్నం అంతా చెప్తాన్.

ద్వితీ.—నేను మాఖైదీమహారాజాకి చెప్తాన్, ఆయన్కి వఖ్మాటు నవ్వించితె నవ్వుమొఖం సూస్తే నాకి కోటివరహాల్ యినాంగా వుంటుది.

చారులు.—[పోవుచు హేళనముగా] అరే దివానాసాబ్. సలాం నీకీ.

వెట్టి.—హాహా! తురకదయ్యాలుకూడా నావెంటబడుడమేనా? భేతాళుణ్ణయిన నుండె పగలదంతా [అని చెటిరయొక తన్ను తన్ని] గీయబ్బసై తానుతో చెప్పుకోండి.

ప్రథ.—అరే, నాడొక్కాఁ పగిలింది, నేను కదలలేకున్నాను భాయ్.

---

*ఇంతొకరు దగ్గఱలేక ఆవులింత రాదు గావున, ఆవులింతవలన సమీపమున నెవరో ఉన్నారని యూహించి కనిపెట్టినాఁడని యభిప్రాయము.

ఢిల్లీ.—అరే బాబూ, నాతుంటీ విరిగిందీ. నేను మెదలలేకున్నాను. క్యా కర్నా! మళ్లీ వాడు తన్నకముందే పోదాంరా. [ఇరువురు నిష్క్రమింతురు.

వజీ.—[ఆత్మగతము] దివానా యెవరో, మూడుమాసాలకు తెలియును లెండి ...రా! [ప్రకాశము] నేను మాత్రము మేలుకోవడ మేల? ఈ పట్టణమంతా నిద్ర ...మేమి? నే నేమి వీళ్లకి కాపాడాలునా? ఒక్క ప్రాణి నైనా నిద్ర పోనియ్యను. ...ఊళ్లో ప్రవేశిస్తునాను. ఢిల్లీ సుల్తాన్ .... [అని నిష్క్రమించును.

# అష్టమాంకము.



## స్థలము 1. ఢిల్లీ, కోటలో సుల్తాన్ దర్బార్.

సుల్తాన్, పలువురు వజీర్లును, సేనాపతులును, ఉపవిష్టులై ప్రవేశింతురు. యథావిభవము పరివారము కృపాణపాణి.

సుల్తాన్.—వలీఖాన్ బహద్దర్, నీవు మాకి యీరోజ్ నిక్హా చెప్తావు. ఆ ... దివానా మాకి యీరోజు పకడ్లేవు చెప్తాడు. వాడు దివానా మనకీనిశ్చయం ...దా. తర్వాత మళ్లీ యేమైనా దర్యాప్తు చేసినావా?

వలీ.—రోజ్ రోజ్ దర్యాప్తు చేస్తూనే వున్నాను, బందగానెఆలీ. వాడు ...గే పట్టుకపోతాన్ అరుస్తూ తిరుగుతాడు. అప్పుడే హుజూర్ శెలవు చెయ్యలేదా, ...మా మేల్కొంటే వాడూ దివానా, వాడూ మేల్కొంటే మనమూ దివానా;'

సు.—అచ్ఛా! అచ్ఛా! నీకీ బలే జ్ఞాపకం శక్తి వుంది.

వలీ.—యిది వుత్త అర్థం పెంకు, హుజూర్ తేజంలోది వక్టి గీత [తనహృదయంపుచు] యిక్డ పడి తళుకుతూవుంది.

సు.—[పరితోషముతో] అచ్ఛా! అచ్ఛా!

ఒకవజీర్.—హుజూర్ బుద్ధిసూర్యుడుమాకి ముందర హమారేబుద్ధీలు నచ్ఛత్రం ...ఖర్యభూ.

సు.—[పరితోషముతో] అచ్ఛా! అచ్ఛా!

వలీ.—[ఆత్మగతము] వీడూ నాకీకంటె ఖుతీచెయ్యవాలా చూస్తాడు. నేను ...పోతే ముసల్మానీ నహి. [ప్రకాశము] బందగానె ఆలి రెండో అల్లా!

ఒకవజీర్.—[ఆత్మగతము] అరే వీడు మనకి మించడం చూస్తాడు! వీడికి ...పోతే హం ముసల్మానీ నహీ, [ప్రకాశము] నహీ నహీ నహీ, సుల్తాన్ వారు ...అల్లా అల్లా రెండో అల్లా.

మఱియొక వజీర్.—అది యేలాగ వివదం చెయ్యండి వజీర్ ఖాయి.

ఆవజీర్.—

సుల్తాన్వారూ యిష్టిస్తారూ, హల్లా రేపిస్తాడ్ ;
సుల్తాన్వారూ యిప్పుడుకొడ్తార్, హల్లా రేప్కొట్టాడ్ ;
సుల్తాన్వారూ హగ్పడ్తారూ, హల్లా హగ్పడడు ;
సుల్తాన్వారూ యిన్పడ్తారూ, హల్లా యిన్పడడు ;
సుల్తాన్వారూ హంతా నిశ్చయ, మల్లా పంధేఘమ్.
హంమకోసము మేమూ చెప్తాం, హందర్ విన్కోండి,
సుల్తాన్వారూ మొదలూ హల్లా, హల్లా రెం డల్లా !

[సుల్తాను పరమానంద భరితుఁడుగా అందఱను చూచుచు

అందఱు.—అచ్ఛా ! అచ్ఛా !

సు.—వలీసాహేబ్, నీవు తెలంగీ రాజాకి తెచ్చినావు పంతోషం. యీ పాలిఖట్కంవోంద్రం రాజాకీ తెస్తావా?

వలీ.— హుజూర్ కతాచ్ఛం వుంటే, యిప్పుడు తెస్తాగ.

సు.—మాగులాం ఖుస్రూ తెలంగీదేపంలడాయిలో మర్గయా కావడం మా చాలా హాయాపం వుంది.

వలీ.—[వణఁకుచు] అల్లా చేసింహానికీ యేమీ చేస్తాం.

ప్రతిహారీ—[ప్రవేశించి] తఫావద్ బాదబ్, బడా బడా బకాల్ చాలా దూరం కోస్తానుంచి దర్శణానికి వచ్చివున్నారు.

సు.—బడా బడా బకాల్ యేలాగా తెల్సింది?

ప్రతీ.—యింతగొప్ప నజరానా ఇంతకి కితం ఎంతా బడా అద్మి యేబీ బడా సుల్తాన్వారికి కూడా తెచ్చినాడు నహీ.

సు.—సెలవు.

ప్రతీ.—హుజూర్ అజ్ఞ. [అని పోయి వర్తకులను గొనివచ్చి] వారే సుల్తాన్ వారు, మోకాళ్ళే నిల్చి సలాం కరో. [అని నిష్క్రమించును.

[వర్తకులు ఖుర్నీష్సలాముచేయుదురు, మోకాళ్ల మీఁద నేదగ్గఱకుపోయి సలాముతో నజరుపళ్లెమునుంతురు.ఒకజవాను దానిని సుల్తానుముందఱ పెట్టును.

సు.—[చూచి యాశ్చర్యపడుచు] ఏమి యీయద్భుతము! మా చూపులకు తెల్ల చేస్తున్నవి. ఇట్వంటివాట్కి అల్లా చెయ్యగలడా? కన్నాక మైకంవస్తుంది! వాళ్ళు

...! [అని కన్నులు మూసికొని, తెఱచి, తల యెత్తి,కని] కూర్చోండి వర్తకులూ,
...ర్చోండి. [వర్తకులు కూర్చుందురు.
సు.—[పళ్లెములోనుండి ఒక మరకతమయూరమును ఎత్తి] చూడండి వజీర్సా
...బు చూడండి. ఇదేమి అంతా పక్షి పచ్చ చెక్కినారా? పచ్చాంతరం, పచ్చకి
...ప్పు టాక్సందీ చేసినారా? వా! యిది కోడిపుంజూ అంతా వుంది!
వర్త.—జగత్ప్రభువుసన్నిధానములో మానజరులను మేమే ఎట్లు వర్ణింతుము?
సు.—పర్యా లేదు బడావర్తకులూ, మాకీ సులభంగా మాలుం కావడానికి
...ప్పండి.
వర్త.—జగత్ప్రభువువారి యాస్థానములో వజీర్సాహేబులున్నారు, సాహు
...ర్ సాహేబులున్నారు, సౌదాగర్సాహేబులున్నారు. మానోట చెప్పించుట
...క్యము కాదు.
సు.—వలీఖాఁ బహద్దర్, నీవు చెప్పగలవా? [అని నెమలిని చేతి కిచ్చును.
వలీ.—[పుచ్చుకొని చూచి] బందగా నే ఆలీ, ఇది పక్షి మణి.
సు.—[మరలఁగొని] అన్ని వరణమ్లు వున్నవి, హాత్కాలు అగ్పడవు! ఆ!ఆ!
...య్కాలు వుందీ దానికి హాత్కాలులేమా చూపి మాకి మోసంచేస్తారూ వర్తకులూ?
వర్త.—[ఆత్మగతము] ఏమి పఠాణీవానియుక్తి! కోమటిబిడ్డల మని యెఱుఁ
...ను గాఁబోలు. [ప్రకాశము] ఇన్ని సంస్థానములు మేము తిరుగుచున్నాము, మోస
...ము చేసిన మాకు వ్యాపారము జరుగునా? మిమ్ము వెదకుకొని నన్నూతామడ వచ్చి
...యుచిన మోసమా?
సు.—[నవ్వి] మోసం అంటే మేము చమత్కారం తల్చినాం వర్తకులూ,
...ను దానికి వేరే తల్చినారు. మనం స్నేహితులు అయినాం మీకి; చెప్పండి, మా
...జీర్సాహేబుమాట సరియేనా?
వర్త.—చెప్పనున్నతమకుకోపమువచ్చును.వజీర్ల వారిమాటసరియే.ఇదంతయు
...నిధరాయి. దానిని ఇట్లు చెక్కినారు, ఆయావర్ణములకు ఆయామణులు తాపించి
...రు. దీనిని తయ్యారుచేయుటకు పది సంవత్సరములు పట్టినవి.
సు.—బలే బలే! వర్తకులూ, దాని కుంచెంతోకా విప్పి నాచిరంగ్ నృత్యం
...గా చేశినాడు, మీపనీవాలా బలే జాణా, అల్లా పక్కి మెరుగు పెట్టినాడు.
...ని వజీర్ల కందించిదేదీప్యమానమైనయొక తెల్లనివస్తువునెత్తి] ఇదేమివర్తకులూ,
...గారికా సూర్యుడూహాకారంవుంది. మాకంటిచూపు వస్తాదుమీద కోటికిరణం
...ల సచ్చి సహిసహి చేస్తుఁది! స్నేహంలో సంకోచం మంచిదీ మీకి? టూకి
...ప్పండి సంతోషిస్తాం. యిది వజ్రం మాకీ తోసుంది, యిప్పుడే పెద్దపంపరపనస
...ను అంత వుంది: నక్షీ మూడు ఎంత వుంటుందో?

వర్త.—జగత్ప్రభువునాజ్ఞ. తమ చేతిలోనిది, ఒకటేవజ్రము, మొదట ఇది పెద్ద కొబ్బెరబొండ్లమునంత యుండినది. సుంద్రపఱిచి లెక్కలేని సూక్ష్మకిరణములు చేయుటకు ఇరువది సంవత్సరములు పట్టినవి. దీని విశేషము—దీనికిరణములను ఏయుపాయమునను లెక్కించి యిన్ని యని యెవ్వరును చెప్పలేరు. దీనిని అమావాస్యచీకటిలో దూరమున ఉంచి చూచిన, పట్టపగలు అవును.

సు.—[దానిని వజీరుల కందించి మఱియొకటి గొని] ఇది అద్దం అద్భుతం వుంది! దీని స్వరూపం యేమి స్నేహితులు ?

వర్త.—ఇది వజ్రపుబిళ్ల, పదియేండ్ల పని.

సు.—[దానిని వజీర్ల కందించి] ఇంక వక్టీ వుంది. తామరఖమల్పద్మం. దీని సంగతి యేమి ?

వర్త.—ఇది ఒకటే పద్మరాగము. మొదట జేనెడు ఘనము. దానినిట్లు చిత్రించి, గద్దియ, పుష్పాడి, యితరమణులతో చేర్చినారు. పదియేను సంవత్సరముల పని.

సు.—మరి వర్తకులూ, స్నేహితులూ, వీటికి ఖరీదు ఎంతెంత వుంటుంది, చెప్పండీ కోర్తాము.

వర్త.—భూలోకదేవేంద్రా, మన్నింపవలయును. మానజరునకు ఖరీదు మా నోట రాదు.

సు.—మీనోటా రాదూ నిశ్చయం ?

వర్త.—రాదు నిశ్చయము.

సు.—స్నేహం చూచినారు లేదు.

వర్త.—చూడకపోయిన, అప్పుడే చెప్పియుందుము.

సు.—వజీర్సాహేబులు, మీకీ యీలోఖం ఖమాయిష్ అంతా తెల్సును. వీటికి ఖిమ్మత్ చెప్పండి. మనకీ వర్తకులూ ఇంతగౌరవం చేశినారు తెల్వవాలా కదా.

వజీర్లు.—బందగానే ఆలీ, యిట్వంటీవాటికీ ఖరీదులు మాకీ తెల్వడం బోటా. తలాక్కయకి తెల్వదూ, కాలిగోరూకీ తెలుస్తుంది ?

ఆవజీరు.—తలాక్కయాకి తెల్వదు, యెడంకాలీ యెంట్రికాకీ తెలుస్తుంది ?

సు.—మఱి మన సాహుకార్లు ఎవరూ చెప్పలేరా ?

వజీర్లు.—చెప్పలేరు తోస్తుంది మాకి. ఇది యీలాగా, మన సౌదాగర్ల గొప్ప సరుకులు హుజూర్ కొంటారు. అందుకు తక్వాసరుకులు గులాములు కొంటారు. యిట్వంటివి మనవర్తకులు మనకీయెప్పుడూ చూపడంలేదు; అదీ కారణం వాళ్లకన్నూకి యివి తగలలేదు; అదీ కారణం తమ్మ లేమూ, వారికి వీటిఖరీదు తెల్వదు; కొనలేము మనకీ తెల్వదు.

ఆవజీరు.—తమసన్నిధిలో దర్బారిలో వుంటాం మాకీ తెల్వదు. దూరంవుంటారు సాహుకార్లకీ తెల్వనే తెల్వదు. మరిదూరం పోతారు సౌదాగర్లు, వారికి తెల్వనే తెల్వ

తెల్వరు. యెక్కడా తెల్వందీ సర్కార్ దర్బార్లో తెల్వవాలా.యిక్డా తెల్వందీ భూమిలోకంలో మరియెక్డా తెల్వను.

సు.—[జనాంతికము వలీఖానుతో] వీళ్ల నోటనే టక్కుచేశిచెప్పిస్తాక్ చూడు. [ప్రకాశము] మంచిది వర్తకులూ, మీరు వచ్చినపనికి చెప్పండి.

వర్త.—ఒకపని, జగత్ప్రభువువారికి పూర్ణగౌరవముగా వజీర్సాహెబు లకును నజర్ స్నేహము చేసెదము. సెలవు దయచేయవలయును.

సు.—మనవజీర్లకి కూడా గౌరవం చేస్తే మనకీ బలే గౌరవంకదా. హవప్యం క్యండి, మనమూ చూస్తాం, చాలా మంతోషం. [ఆత్మగతము] అది కూడా నా మాకే చేస్తే ఇంతకంటే బలే ఖసంతు వుంటుంది.

[వర్తకులు వజీర్లకు నజరిత్తురు. వజీర్లు పుచ్చుకొని
త్రిప్పి త్రిప్పి చూచి చూచి, ఆశ్చర్యపడుదురు.

సు.—[ఆత్మగతము] వీళ్లు చేశే మర్యాదా చూస్తే వీళ్లనోటా మోషంగా పించడం కష్టం వుంది. [ప్రకాశము] మంచిది, స్నేహితులూ, మీరు వచ్చినపని చెప్పినార్, చేశినార్. రెండూపని యేమి?

వర్త.—మేము ఓడలలో ఇట్టివిచిత్రవస్తువులను అనంతముగా తెచ్చియు న్నాము. తమరు వానిని చిత్తగింతురని విన్నపము.

సు.—మీరు యేదేషంనుండి వచ్చినార్?

వర్త.—మేము సముద్రపురేవు గోవానుండి వచ్చినారము.

సు.—ఇంతధూరం మీసరుక్కు మాకి చూపడానికి వచ్చినార్?

వర్త.—అందుకోసమే వచ్చినారము.

సు.—ఎన్నివాడలు?

వర్త.—నాల్గు ఓడలు.

సు.—మీకి దారీ యేది?

వర్త.—

క. గోవాపురియు, సముద్రము,
రావణలంకయును, సాగరంబును, హుగ్లీ,
దేవనది, యమున, [1]వైభవ
[2]శేవధి ఢిల్లీపురీశు శ్రీసన్నిధియున్. ౧

సు.—మనమూమీసరకులు కొనకుంటే,యీప్రయాణ మంతా మీకీలుగ్సాక్

౧. 1. ఐశ్వర్యము. 2. నిధి.

వర్త.—జగత్ప్రభువునకు తెలియని దేమున్నది ?

సు.—ఇంతవింతనజరానాలో యింత పెద్దసౌదాగర్లు అద్భుతం సరుకులు తెస్తే అవి పుచ్చుకోకపోవడం మనకీ నామోషీ నహో వజీర్సాహేబ్ వార్లు ?

వజీ.—తప్పకుండా పుచ్చుకోవాలా.

కడమవజీర్లు.—సర్కార్ చెప్పినదే.

సు.—మరి వర్తకులూ, మీసరకులు తెప్పించండి, మేము మాకి కావలసి పుచ్చుకొంటాం.

వర్త.—ఇక్కడికి తెచ్చుట అసాధ్యము.

చ. బరువులు నాల్గునావలకుఁ బట్టక యున్నవి; యన్ని క్రొత్తలే;
తిరముగ వీని మా కెగుమతింపఁగ నయ్యెను రెండు మాసముల్;
ఉరుకృప మీర లెల్ల రలయోడలకు న్విజయంబు సేసి, మా
సరకులు చిత్తగింతు రని చాలఁగ వేఁడెద మోజగత్ప్రభూ. 3

సు.—మీయభిప్రాయం వజీర్సాహేబులు ?

ఆవజీరు.—నజరువస్తువులే యింత అద్భుతం వున్నవే, సరుకులు మరీ అద్భుతం వుండును, అవశ్యం పోయి చూడడం సరి అభిప్రాయం

కడమవజీరులు.—అచ్ఛా! అచ్ఛా!

సు.—అయితే వర్తకులూ మీరు ఈవస్తువులకీ ఖరీదులు చెప్తే మనము మీవాడలకి వస్తాం, సర్కులు పుచ్చుకొంటాం.

వర్త.—[స్వగతము] ఆహాహా ఏమి యీతని యుక్తి ? [ప్రకాశము] మేము శాశ్వతముగా మీకు వర్తకులముగా నుండఁగోరుదుము, మామాటమీఁద నే వెలలుపరిష్కరించుకొనుట వ్యాపారధర్మములో మాకు అపకీర్తికి కారణము, పిమ్మట సందేహములకాస్పదము. కావున ఆసరకులకైన వెలలు తీర్చుటకు తమకు ఆవిద్య తెలిసినవారు కావలయును. అందుకై యెవరిని రప్పింతురో వారివలన నే యీ నజరువస్తువులకుఁ గూడ వెలలు తెలిసికొనుఁడు. ఏలినవారు విచారించి అట్టివారిని రప్పించిన ఉభయులకు తృప్తి యగును.

క. ఢిల్లీ ఢిల్లీ యనుచుర్
ముల్లోకములందు [1]డవిణ మ్రోఁగెడు నఁట! యా
ఢిల్లీలో వెలతీర్పరి
కల్ల యయిన నింక నెందుఁ గలుగు ధరిత్రిన్! 3

3. 1. చర్మవాద్యవిశేషము.

సు.—[ఆత్మగతము] అరే! వీళ్లు నావల్ల మోసంపోరు. మరియేమి చేస్తాం ? [ప్రకాశము] వర్తకులూ, మీరు ఇంతకిముందు మాసంస్థానాన్కి యెప్పుడైనావచ్చి నారా ? అప్పుడు ఖరీదులు ఏలాగ నిశ్చయించుకొన్నారు ?

వర్త.—ఇంతకు పూర్వము మేము ఈసంస్థానమునకు రాలేదు.

సు.—మేము తప్పితే యీదేశంలో మీసరుకులు ఎవర్ కొంటారు ?

వర్త.— (స్రగ్ధర.)

ఏకోస్తావి తేనిం, డెటులు తెలియనిం, డెంత [1]మూల్యంబుగానిం,
గోరంగోల్కొండదుషావా రొకరె [2]విలుతు రభ్యున్నతశ్రీసమృద్ధిన్.
వారి న్దర్శింపనే యీ[3]వరమణినజరుల్ వస్తువుల్ గూర్ప నయ్యెన్;
వారున్న న్వేఱుచోట న్బదమిడుదుమె దైవంబుహా! యోర్వ దార్యా!

సు.—అంతధనం వుందా వారికి ?

వర్త.—అడ్డ మేమి ?

సు.—వారికి ఖరీదులు ఎవరు తీర్చడం ?

వర్త.—వారే అంచనకు తీర్తురు. ఆవిద్యలో వారు మహానిపుణులు, వారు చేసినవెలలకు మేము బదులు చెప్పుటలేదు.

సు.—మరియిప్పుడు మీరు వేరేసంస్థానానికి రావడానికి వారేమైనార్ ?

వర్త.—మాదురదృష్టముచేత, ఆమహారాజు తనసర్దార్లతోడి యుద్ధములో నష్టులైనారని మీయడితిదారులు మాకు తెలిపినారు. దేశమంతట అదే కింవదంతి. అందుచేత మేము వంశపరంపరగా నున్న యీవర్తకము మానలేక యిటకు తమదర్శనమునకు వచ్చితిమి.

సు.—[జనాంతికము] ఏమి వలీఖాను, మనవేగులు తెలంగిరాజాకి మర్గయా చెప్తారు,వీళ్ళుకూడా మర్గయా చెప్తారు,మనంఅతనికి ఊరేగింపుచేసి ఖైదులోవుంచినాం?

వలీ.—[జనాంతికము] ఆబడాలడాయిలో రాజా ఏకాకి మనదండు దూరి వచ్చిచంపి మనచేతులో పడ్డాడు. మరి అతనివాళ్లకి అగ్పడలేదూ,వాళ్ళు చచ్చినాడు అనుకొన్నారు.

సు.—[జనాంతికము] మరి యితనిగతి వాళ్ళు విచారించుకోలేదా ?

వలీ.—[జనాంతికము] ఎవడిప్రాణం వాడు విచారించుకొని పారిపోయినాడు. మరి మంత్రులు, పౌజుదార్లు, రాజావున్నాడు తెల్సుకుంటే, రాజాకి విడిపించుకో వాల్ను అసాధ్యం పని. అందులో తాము చావడం. రాజా చచ్చిపోయినాడు చెప్తే

1. ఏకు ఏకోస్తావి తేనిండు = ఎవరు ఏకోస్తాసరకులు తెచ్చినను. 1. వెల. 2. కొనుదురు. 3. మేలురత్నముల కానుకలు.

రాజ్యం తాము హరించవచ్చును. అందుచేత రాజా చచ్చిపోయినాడుపుఖార్ వాస్త కొంచెం వున్నది కొండంత చేశినారు వుంటుంది.

సు.—[ఆత్మగతము] అచ్ఛాఅచ్ఛా! [ప్రకాశము] వర్తకులూ, రాజా మర్గయా అయితే, యిప్పుడు సంస్థానానికి మీసర్కారులు యుగంధర్మంత్రి కానరాదా!

వర్త.—వారున్న మాకు లోపమేమి? వారు రామేశ్వరములో మరిడీజాడ్యము వలన స్వర్గస్థులైనారని మాయడితిదార్లు వ్రాసినారు. లోకమంతయు నదే కింవదంతి.

వలీ.—[జనాంతికము] మనవేగులు కూడా ఆలాగే చెప్పినారుగదా?

సు.—[స్వగతము] అచ్ఛా! అచ్ఛా! [ప్రకాశము వర్తకులతో] వారికి మీ! చాలా స్నేహం పరిచయం వుంటుందా?

వర్త.—మాయన్నగారు ఇరువదిసంవత్సరముల క్రిందటవారినిస్వయముగాదర్శనము చేసికొన్నారు. ఆదిమొదలు,మాయడితిదారులేవారితోమావర్తకమంతయు జరుపుచుండిరి. అట్లే ఇప్పుడు తమకటాక్షము మాయందుఁ గలిగిన, మేము ఇచట గొప్ప సాహుకారు లెవరినైన తమసంస్థానముకోసము అడితి యేర్పఱుచుకొని పోయెదము.

సు.—[జనాంతికము] వజీర్సాహేబులు, మనము పెర్తాపరాజాకి యిక్కడికి తెప్పించి ఖరీదులు చెప్పింతామా?

వజీర్లు.—అదే సర్కారుకు చెప్పవాలా వుంటాం.

వలీ.—[ఆత్మగతము] చాకలి వెల యేలాగా వేస్తాడు? రాజా కాదు మహల్వాలా తెలిస్తే నాతలకీ వస్తుంది. ఈవర్తకులు రాజాకి తెలుసుకొంటారు భయము చెప్పడానికీ లేదు. సుల్తాను తెప్పించకమానడు, నాగతి గాథరావుంది. [చింతించి] అయినా యేమి భయం? యమధర్మరాజుసహాయం వుంది.

సు.—[జనాంతికము] ఏమివలీఖాను బహద్దర్, నీమనస్ తెల్పలేదు?

వలీ.—[వణఁకుచు విలక్షుఁడై] రప్పించవచ్చును నానమస్.

సు.—[జనాంతికము] వజీరాలీ, నీవు పోయి ఆ తెలంగిరాజా ఖైదీకి మనవాడు సౌదాగర్ వేషంవేసి తీస్కానిరా. [నవ్వుచు] ఆయనదాడీ యీఆరుచందుర్లీ మనకే యిప్పుడు పనికీ వస్తుంది.

వజీ.—సర్కార్ ఆజ్ఞ. [అని నిష్క్రమించును.

సు.—మంచిది గోవావర్తకులూ, మారాజ్యంలో మీసరుకులకీ ఖమ్మల్ చెప్పేవారు లేరు మీరు తల్వావద్దు, మీమాటమీద యిప్పుడు రాచేస్తాం. మరి వాని నిఘాఖరారు అవునో కాదో మీకే తెలియాలా?



వర్త.—ఈ నజరువస్తువులకు వారు వేయువెలలను బట్టి తెలిసికొనఁగలము.

సు.—వారు చాలా గొప్పవారు. మనమంతా వారికీ తాజీం చెయ్యావాలా. వఖాటు మాకీ కావల్సీ నూరుకోట్లు వరహాలు అప్పయిచ్చి వల్లి మేమయెంత పుచ్చుకొన్నారు లేదు. అందుకు వారికీ మాకీ భాయిభాయి స్నేహం చూడండి మీ పెర్తాపరాజాకి వారికి నిఘాహైఫార్.

వర్త.—జగత్ప్రభువు చిత్తము.

అంతట ప్రతాపరుద్రమహారాజు తురకసౌదాగరు వేషమున
వజీరాలితో ప్రవేశించును.

[సభ అంతయు లేచును.

సు.—[రాజు చేయి పట్టుకొని] సలాం సలాం. ఇక్డ ఇక్డ భాయి.

[అని తనప్రక్కను కూర్చుండఁ బెట్టును. రాజు
సమకాలమందే సలాముచెప్పి కూర్చుండును.

సు.—సౌదాగర్ సాహెబ్, మీకి శ్రమ యిచ్చినాం. కారణం యీసౌదా వీరు యీనజర్లు తెచ్చినార్. ఖరీదులు చెప్పము అంటార్. తమరు వీటికి ఖరీదు మనపర్వానిల్పవాలా. యిందుచేత తమ దర్శణం అయింది వంతోషంగదా.

రాజు.—[ఆవస్తువులను పరీక్షించునట్లుగాఁ జూచుచు, ఆత్మగతము] ఆహా గంధరులవారి మహిమ! ఈవస్తువులు నాయంతిపురములోనివే, వీరు నావర్తకులే, ఈదినమే ప్రయాణసుముహూర్తము. [బహుకాశము]పత్ అచ్ఛా.వీరివల్ల తమ లాభం. యీకారణంగా వీరికీ మాస్నేహం వుంది. మరియిప్పుడు వీరికి మేము చేస్తాం, వీరు మాకీ పరీచ్ఛా చేస్తారు.ఒకరిఖరాద్ ఒకరికి తెలుస్తుంది ఛణంలో

[సుల్తాను రాజుచేతికి నెమలి నందించును.

రాజు.—[నెమలిని త్రిప్పిత్రిప్పి చూచి, లెక్కలు వేసికొనుట నభినయించి] భాయి ఈనెమిలి షుమార్ రెండుకోట్లు,యాభైలక్షల్ వరహాల్.కోట్లు పచ్చ, యిర్వైయైదు లక్షలు తలిమ్మా రాళ్లు, యిర్వైయైదు లక్షలు కూలి. ఏమి సౌదాగర్లు?

వర్త.—[ఆశ్చర్యముతో] అన్నిటికి చెప్పి కానిండు.

రాజు.—అదీ కాదు. సరియైతే పైన చెప్తాం. లేకోపోతే యెందుక్ చెప్డం

వలీ.—[ఆత్మగతము] క్యారే, ఇతడు ఆరునెల్లు బందీ వున్నా దేదీప్యమానం మంచి తెల్వితో మాట్లాడుతాడు, మహాల్జీకాడు తోస్తుంది. [విమర్శ లేక, మంత్రి యుగంధర్ అట్వంటి తెల్విగల చాకలికి పంపాదించి మాకీ మోసం చెయ్యడానికి?

వర్త.—తమరు చెప్పినది సరి [illegible] ఆశ్చర్యము కలుగు మనవి చేసెదము, అన్నిటికి సెలవిండు,

రాజు.—మంచిది. ఈవజ్రంషూర్యుడు [లెక్క నభినయించి] యిర్వైయైదు కోట్లు, పని సహా. ఈహద్దం [మరల లెక్కనభినయించి]పదియైదుకోట్లు. ఈశాత్ర ఖమ్లం పదికోట్లు, అంతా పని సహా. ఏమి మీహాశ్చర్యం?

వర్త.—జగత్ప్రభూ, వీరు సాక్షాత్ప్రతాపరుద్రులవారే! స్వర్గస్థు లనుట అబద్ధము !

సు.—[సవిస్మయము, ఆత్మగతము] క్యారే! కని పెట్టివేశినార్!

వలీ.—[ఆశ్చర్యముతో] ఖుస్రూ, జోస్యులుభాయి, చాకలీ చెప్తారు! రాజా చెప్తారు! క్యారే ఇది!

వర్త.—వీరిదేహములో పరకాయప్రవేశము చేసినా రని మాకు తోచుచున్నది. మంత్రియుగంధరులవారికి అట్టిశక్తులు కల వని మేము వినియున్నాము. ఈవెలలు ఆమహారాజే వేసినా రని చెప్పవచ్చును.

వలీ—[హర్షముతో ఆత్మగతము] బలే బలే వాళ్లమాట అది కాదు! మా యమధర్మరాజుసహాయం నిజం నిజం.

సు.—[ఆత్మగతము] వాళ్లు వక్టీ చెప్తే మేము మరి వక్టీ తెలుసుకొన్నాం. [ప్రకాశము] ఖరీదులు అంత సరిగా వున్నవా?

వర్త.—ఉన్నవి.

సు.—వీరిఖరాప్రకారము తిర్గు లేక వప్పుకుంటారా ?

వర్త.—ఒప్పుకొనియెదము.

వలీ.—[ఆత్మగతము] బలే! యమధర్మరాజు సహాయం! బలే ! యమధర్మరాజు సహాయం!

సు.—ఒప్పుకోకపోతే?

వర్త.—మ మ్మందఱను శిరశ్ఛేదము చేయింపుఁడు.

సు.—ఇదే షరత్? నిశ్చయం?

వర్త.—ఇదే షరత్, నిశ్చయము.

సు.—అచ్ఛా! అచ్ఛా! [జనాంతికము] మహారాజాభాయి, వీళ్ల సర్కారు అన్నిటికి సున్నసమానం ఖరీదులు వెయ్యండి. మేము షరత్ప్రకారం పుచ్చుకొంటాం వీరొప్పుకోకపోతే శిరచ్ఛేదం పుచ్చుకొంటాం. మీకి యీషష్టిహానికి వోరంగోల్లు వదిలివేస్తాం. మరి తమరు బందీఖానాకి రావద్దు. జవాబు చెప్పండి భాయి.

రాజు.—[ఆత్మగతము] ఎంత నిర్భాగ్యుఁడు వీఁడు! అన్నకుమారుని శిరస్సు చంపి రాజ్యము హరించినవానికి ఈచింత యెంతపాటి! [జనాంతికము] సుల్తాన్ భాయికి జవాబ్ పదిమాటలు యెందుక్కు? మరి యిక్కడికి రాం.

సు.—అచ్ఛాఅచ్ఛా! మరైతే వర్తకులూ, ఈ దివాణం దివాణంగానే మీకే వస్తాం, లెండి.

వర్త.—మహాప్రసాదము! మహాప్రసాదము!

[అందఱు లేచి పరిక్రమింతురు.

సు.—[పరివారముతో] సికారీకి సర్వం సిద్ధమా?

పరి.—బందగానె ఆలీ, మీకీ అందర్కి ఏనుగులు హౌదాలు వేసి తయ్యార్ వున్నవి. శిబ్బందికి గోడాలు జీన్ వేసి సిద్ధం వున్నవి. తుర్వం సిద్ధం.

సు.—భోత్ అచ్ఛా! ఈనజర్లు మాహౌదాలో అలంకరించి మాకంటికి విం మాకూడానే వాడలికి తెండి.[పరివారము తెచ్చును.అందఱు పరిక్రమింతురు.

స్థలము 2. ఢిల్లీలో వీథి.

[నేపథ్యమున]

ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్,
ఇదుగో ఇప్పుడే పట్టుకపోతాన్.

[మరల మరల ఆఱ్ఱే.

సు.—[ఆశ్చర్యపడుచు] అరే! ఎవడ్రా మాకీ పకడ్దేవు అరుస్తాడు? చెవికి సోకుతుంది?

వజీర్లు.—బందగానె ఆలీ, వాడే ఆదివానా తెలంగి.

సు.—మేము చూడవాలా, మేము చూడవాలా.

అంతట వెట్టివాఁడు ప్రవేశించును.

వెట్టి.—[కేటాలున దారికడ్డము వచ్చి సుల్తానుముందఱ ఆడంబరముగా నిలుచుచు]ఢిల్లీ సుల్తాన్...[ఉత్తరవెళ్లు పాడుము పిల్చుచు] ఢిల్లీ సుల్తాన్...[చుట్ట త్రిప్పుట నభినయించుచు] ఢిల్లీ సుల్తాన్...[హుక్కాత్రాగుటను వెక్కిరించుచు] ఢిల్లీసుల్తాన్...[అనుచు సుల్తానువారి యేనుఁగుముందఱ నిర్భయముగా నిలుచును.

పరి.—దారి కడ్డం లేరా, ఆరే దివానా. [అని ఆవలికి త్రోయుదురు.

వెట్టి.—నేను కదలను, ఏమి చేస్తావు?

పరి.—కదలకపోతే బుర్ర యెగ్రగా యేస్తాం.

వెట్టి.—అహా సుల్తాన్, నిన్ను నేను మాయింటికి తీసుకొనిపోతూవుంటే నన్ను అడ్డుతున్నారు. వీళ్లను పిల్చుకో, లేదా, నేను వీళ్లను చంపివేస్తాను.

సు.—ఏదీ చంపూ చూస్తాం!

వెట్టి.—చంపూ చూస్తాం ఏమిటి? చంపూ యేడుస్తాం. అను. [అని పరిజనుల గొట్టఁగని] ఆటలో అరటిపండు. [అనుచు ఒక్కతాఁపు తన్నుచు, ఒక్క

క్కనింగాంచి] అబ్బో! నీ వెంతవాడవు! చావకముందు బతికే వున్నావు! నీవు శక్తుంచే నన్ను పుతం వెయ్యవూ! నీవు చస్తే మరి బతకవు.

[జవానులు తాఁపున కొకఁడు పడి, లేచి, కత్తు లుంకించి, సుల్తానుపై ప్ర చూఁతురు.]

సు.—క్యారే యేమి పడిపోయినార్?

పరి.—సర్కార్, వాడికి సింహంవుంది వంట్లో, వాడు సైతాన్, మన్సీకాడు.

సు.—వాడికీ ఏమీ చెయ్యకండి, మాముందర తమాషాలు చేస్తూ రానియ్యండి, వాడి కేమైనా చేస్తే మీతలాక్కాయ పోతుంది. [అందఱు పరిక్రమింతురు.

వెట్టి.—[పరిజనులను పాటగా] ఏమి రోయి, మన్సీ, మన్సీ, మన్సీ, కత్తి వుంకించావే, ఏమి చేశావు? తాకు, ఎవరిబుఱ్ఱయెగురుతుందో? ఢిల్లీ సుల్తాను ...

పరి.—సర్కార్ హుకుం అయ్యేధాకా నీబుఱ్ఱ బిగురుతుంది. తర్వాత యెగురు తుంది. [అని జవానులు వెట్టివానిని అత్యుగ్రముగా చూతురు.

వెట్టి.—నా బంగారుసుల్తాను, నీవు మావూరికి వచ్చి, నాకు శూన్యంపెట్టిన రాగణ్ణి వీరణ్ణి ఎక్కి తొక్కి నొక్కిముక్కి రక్కి డొక్క చెక్కి చక్కాడవలెను. ఇది మాప్రార్థన, మనవి, వేడుకోలు, గంగడోలు, గడోలు, డోలు, లు, ఉ.

[అని నానావిధముల వికారములు చేయును.

సు.—అహో దరికి చేరినాం! పడవలు కనిపెట్టుకొని వున్నవి. యెక్కుదాం.

---

## స్థలము ౩, యమున, పడవలు.

[అందఱు అవరోహణారోహణములు నటింతురు. సుల్తాను, రాజు, వలీ, పెద్దసెట్టియు ఒకపడవనే యెక్కుదురు.

వెట్టి—నీళ్ళు దొరికినవి. నేను బాపనాట ఆడతా.

[అని బ్రాహ్మణులను వెక్కిరించుటగా సంధ్యావార్చును. వెట్టి, ఏపడవకుఁ బోయినను అందలివారు రానీరు.

వెట్టి.—[ఒకపడవచుక్కానిని పట్టి యీడిగలఁబడి] ఓసుల్తాను, వీళ్ళు నన్ను రానీయరు, హా! [అని అఱచును.

సు.—[పడవవాండ్రతో] వాడికీ మాపడ్వలోనే యెక్కించండి.

[పడవవాండ్రు అట్లే చేయుదురు.

వెట్టి.—తోసినవెధవలే బుద్ధిమంతులు. ఎక్కించుకొన్నముండలకే బుద్ధి లేదు. నాకు నెనరు లేదంటే చెప్పట్టుకొక్కడతా, నామట్టుకు నేను పాడుకొంటూ, వద్దన్న వాళ్లని ఏట్లోకి తోస్తా.

ఢిల్లీ సుల్తాన్ పట్టుక పోతాన్,
ఇదుగో ఇప్పుడే పట్టుకపోతాన్.
1 వీరణ్ణి రాగణ్ణి మన్ను చేయిస్తాన్,
ఇదుగో యిప్పుడే మన్ను చేయిస్తాన్.
గోతిలో పాతించి గోరీ కట్టిస్తాన్,
ఇదుగో ఇప్పుడే గోరీ కట్టిస్తాన్.
2 గల్లోను కొబ్బరి కాయల్ కొట్టిస్తాన్,
ఇదుగో ఇప్పుడే కాయల్ కొట్టిస్తాన్.

సు. తప్ప కడమవారు.—ఓయి, అల్లరి చేయకు.

సు.—చెయ్యనియ్యండి. మాకి తమాషా వుంది

వెట్టి.—అల్లరి చెయ్యకూ? అల్లరిచెయ్యకూ? [అని పెద్దసెట్టిని ఏటవేయనెత్తును.
[ఇతరులు మాన్పుదురు. వెట్టివాఁడు సెట్టిని కుదియవేయును.
సు. పరిహాసముగా నవ్వును. సెట్టి నొప్పి నభినయించును.

వెట్టి.—* అల్లవా డిల్లహో యిల్లవా డల్లహో
కళ్లు లే నికబోది కడ తేర లేదు.

వె. తెడ్డుగాళ్లూ, పాడండి నావెంట, పాడకపోతే చంపేస్తా.

సు.—పాడండిరా.

వెట్టి.— అల్లవా డిల్లహో ...

తెడ్డు.— అల్లవా డిల్లహో ...

వెట్టి.— † కాలరు ద్రునికంట కాలాన లము లేద,
కాలరు ద్రునికన్ను కాల్చి వేసినదా?

తెడ్డు.— కాల ...

వెట్టి.— అల్లవా. ...

తెడ్డు.— అల్లవా ...

1. వలీఖాను లోనగువారిని. 2. ఓడలో తలకాయలు తీయించెదను.

* అల్లవా—అక్కడి ప్రతాపరుద్రుఁడు ఇక్కడికివచ్చినాఁడు, ఇక్కడిఢిల్లీ సుల్తాను అక్కడికి (ఓరుఁగంటికి) పోవుచున్నాఁడు. ఇది ప్రత్యక్షమ యయినను సర్వులు ఎఱుంగలేకున్నారు.

† కాల—ఢిల్లీ కోటలో ఇంత కాలము ప్రతాపరుద్రుఁ డుండెనుగాని ఢిల్లీ కోట కేమియు నపాయము చేయలేదు.

వెట్టి—చస్తే నాపెళ్లాందగ్గిరికే వెళ్తాను. [అనికొట్టును.

పడవ.—అబ్బబ్బ! యేమి యినపముండాకొడుకురా, శండాలుడు!

[అందఱు ఓడ లెక్కుటను నటింతురు.

---

స్థలము 4 యమున, ఓడ, పై తట్టు.

వెట్టి—[వడివడిగా ఆదీపమును బట్టి దాని ముద్దుకొని గడ్డము కాలి]బళీ! నన్నునీవుముద్దుపెట్టుకొన్నావా? బతికున్నప్పుడుయెంతెంతో బతిమాలుకొంటేనేగాని ఆయనుగ్రహం చేయకపోతివి. పోనీ యిప్పటికైనా దయకలిగెనా? మళ్లీ ఒకమాటు.

[అని గడ్డము కాల్చుకొని తుడుచుకొనుచు, ముద్దు పెట్టుకొనుటగా దీపమార్చి, ప్రతిష తెచ్చి, మాటిమాటికిముద్దులుగొనుచు, దానితోరహస్యముపలుకుచు, దానిరహస్యములు వినుచు, ఇతరవిధములను లాలనలు చేయుచు, ఉండును. వర్తకులు సురత్రాణప్రభృతులను కూర్చుండఁబెట్టుదురు. వేశ్యలు ఇద్దఱు సుల్తానునకు, ఇద్దఱు రాజునకు, వింజామరలు వేయుదురు. ఇరువురు తాళవృంతములు వీతురు.

వర్త.—[సుల్తానుతో]కొండంతదేవునికి కొండంతపత్రి తేఁగలమా? 'ఉడుతాభక్తి.' జగత్ప్రభువారికివిశ్రామార్థము మంగళార్థమునుకొంచెము నృత్యసేవ చేయించెదము.

వెట్టి.—వెట్టిముండాకొడకులారా, నాకక్కరలేదా నృత్యసేవ? నాకో స్త్రీ చామరాలు, విసనకఱ్ఱలు?

సు.—మంచిది. కానియ్యండి. మరి మాకి చేసేమర్యాదఅంతా దివానాబహద్దరువారికి కూడా చెయ్యండి.

[అంతట వెట్టివానిని ఛత్త్రిచామరాదుల నుపాసింతురు. నటీ మార్గికులు పలువురు ప్రవేశించి సవాద్యముగా ఆడుచు పాడుదురు.

సు.—వహావ్వా! వహావ్వా!

వెట్టి.—అవ్వవ్వా! అవ్వవ్వా! వాడు వహావ్వా అనడ మేమి?

[అందఱు నవ్వుదురు. వెట్టియు హా హా హా హా అని నవ్వును. సుల్తాను నర్తకికి ఒకహార మిచ్చును.

వెట్టి.—[తనగోసెచాక్కా యిచ్చుచు]అదినీళ్లలో మునిగిపోతుంది, నిప్పులో కాలిపోతుంది. ఇదిమునగదు కాలదు. అందానికి దానబ్బయిది. [అనివికటముగానవ్వును.

సు.—వర్తకులూ, మాకి యేమి పశారీలమధ్య పెట్టినారు! దీనికి మర్త్యలోకపు డానికి మాకీ ఖుషీ లేదు. మరి మేము సర్కాలు చూడడం అబ్బమే.



వర్త.—ఈసరకులు చూచి కానిండు.

సు.—ఏమి వీళ్లకి మాకి అమ్ముతారా?

వర్త.—అమ్మెదము.

సు.—వీ శ్లేమి బానిసలా?

వర్త.—దంతపుబొమ్మలు జగత్ప్రభూ.

మరకలు.—ఆహాహా ఏమి హాశ్చర్యం! ఏమి హాశ్చర్యం!

[అని ముక్కు మీఁద వ్రేలుపెట్టుకొందురు.

వెట్టి.—ఏమివికారము! ఏమి వికారము. [అని ప్రమిదతో] ఒళే, ఈపిశాగాలు నీకు సంవా?

[సు. నటిని తాఁకి చూచును. వెట్టి. నటికెండుచేతులు పట్టి జాడించి మొగ్గలు, దండెములు, వేయించును.

సు.—[ఆశ్చర్యపడుచు] ఇట్టియద్భుతాలు ఇంకాయేపాటి వుండును?

వర్త.—మాజాబితా చదువుటకు ఒకపగ లెల్ల పట్టును.

సు.—[ఆత్మగతము] ఏలాగైనా వీటి నన్నిట్నీ లఫ్టాయించవల్సిందే. [ప్రకాశము] ఏమి వలీసాహేబ్? మనము ఈరాత్రి యిక్కడే వుంటాం.

వలీ.—నాకీకూడా యీయద్భుతాలు చూడవాలా వుంది, సర్కార్యక్కమాటముందు చెప్పకొన్నవిందు చేయువాలా వుంది. ఈవేళ విందుకి అనుగ్రహంచేసి ఇవిచూడడానికి చిత్తం చెయ్యకూడదా, అని గులాం మన్వి.

సు.—పడవలు పంపి ఆ విందు యిక్కడికి తెప్పించు.

వలీ.—మహానుగ్రహం, మహానుగ్రహం.

వర్త.—స్నేహితులూ అని తమరే పిలిచినారు. అందఱు ఈరాత్రి మాయింట ము పుచ్చుకొని మమ్ము ధన్యులను జేయఁగోరెదము. సర్వము సిద్ధము. స్నేహములో చము కూడ దని తమరే సెల విచ్చియున్నారు.

సు.—ఏమి వజీర్సాహేబులువారి యిష్టం?

వజీర్లు.—సర్కార్ యిష్టమే.

సు.—మంచిది వర్తకులూ.

వర్త.—మహాప్రసాదము! మహాప్రసాదము!

సు.—అట్లైతే త్వరగా వెల్లి మనకి భోజనంవిందు చేసి, తర్వాత మనకన్నులకీ యీవిందూ చేస్తాం, లెండి రండి. [అందఱు లేతురు.

రాజు.—[జనాంతికము] సుల్తాన్ భాయి, తమకు తెలియనిది గాదుగదా జాతి నేను జాబితాగా సరకులకు కున్న సెలవిస్తే, మున్ను ఉత్తముచేసి, త్వరలో

మీపని యగునట్లు చేసెదను. పిమ్మట కావలసినప్పుడు కలసికొనియెదను. సరకులను తరలించునప్పుడే తమరు ఎఱుఁగవచ్చును.

సు.—[జనాంతికము] అహా ఏమి దురదృష్టం మాకీ, మీరు లేకుండా ఖానాగోష్ఠి చెయ్యడం! యేమీ చేస్తాం! తమచిత్తం. [వలీతో జనాంతికము] ఇది చాలా మంచిదే అయింది. [వర్తకులతో తురకలు నిష్క్రమింతురు.

పేట్టి.—నాకొక ఆటవిడుపుపద్యం జ్ఞాపకం వస్తూవుంది.

(మణిహారము.)

[1]క్షత్రియు [2]నారయును గలసియ యున్నన్ గలఁకలఁ [3]రిపువుల నలఁకఁగఁ దరమే? క్షత్రియు నారయును గలయక యున్నన్ గలఁకలఁ రిపువుల నలఁకఁగఁ దరమా. మొత్తముగ [4]హిమము మొనయుచునున్నన్ ముదముగ మధుపముఁ బికము పిలుచునే? మొత్తముగ హిమము మగిసినవెన్కన్ ముదముగ మధుపముఁ బికము పిలుచుఁబో.౧.

'పుల్చా' అంటేగదా కనుక్కొన్నారు. 'ఓరి నాయనోయి, కనుక్కొన్నారో!' అంటేగదా యిద్దర్నీ పట్టుకొని తన్నినారు. నెల పొడిస్తే సముద్రం పొంగకుండావుంటుందా? తెగ్గాలిస్తే యినుమైనా మెత్తబడకుంటుందా? సంగీతానికేచాపరాళ్లు కరుగుతా యట, మిడియెండకు మంచుగడ్డ కరగదా? నిద్రలో కాకినిగుడ్లగూబ కొడుతుంది. పట్టపగలు గుడ్లగూబను కాకి కొడుతుంది. నీళ్లలో మొసలి ఏనుగును పడుతుంది. నేలను మొసలిని కుక్క కరుస్తుంది. సమయం లేదా, స్థానం లేదా? ఏవలందఱు నామాటలు వెర్రిమాట లంటారు. నేనున్ను కొంతసేపు మౌనం వహిస్తాను.

రాజు.—[ఆత్మగతము] విశ్రమించి పిమ్మటఁ గలసికొమ్మని గురువరు నాజ్ఞ. అట్లే చేసెదను. [అని నిష్క్రమించును.

పేట్టి.—[ఆత్మగతము] అప్పుడే క్రిందితట్టున తురకలు వచ్చి వినోదించుచున్నారు. అచటికేపోయి ఢిల్లీనగరరాక్షసునియొక్క వజీరు ప్రాణమధుపములను బరణి తెలఁచి నలిపివేసెదనుగాక.

## స్థలము. 5. ఆ యోడయే, లోతట్టు.

[అంతట పడవకడుపులో తురకలందఱు ఉచితాసనముల నుపవిష్టులై ప్రవేశింతురు. బొమ్మలు తాంబూలము నిచ్చి హుక్కాలు పెట్టును, వీచోపులు వేయును.

సు.—[క్షైపుతో] వర్తకులూ, వాడలు మీవి కొంటాం మేము. ఇంత అద్భుతం వాడలు, ఈదేశంలో చెయ్యలేరు. మేము సుల్తాన్ వున్నాం, నీటిమహాల్ మే వున్నాం. ఈయేరు ఖందకం వుంది.

1. యుగంధరుఁడు. 2. ప్రతాపరుద్రుఁడు. 3. శత్రువులను. 4. తురకలు. 5. యుగంధరుని. 6. ప్రతాపరుద్రుడు.

వర్త.—[ఆత్మగతము] వీనికి కై పెక్కు మన్నది. [ప్రకాశము] జగత్ప్రభువు
...త్తము.

సు.—అచ్ఛా! అచ్ఛా! [అని విశేషముగా నవ్వి, ఆత్మగతము] కైపుగా తో
... [జాగ్రత్తతో] వర్తకులూ, నిన్నటి నాచిరంగు ఏదీ? అప్పట్నుంచి అక్కడ
...తూనే వుందా? [ఆత్మగతము] కైఫ్ ఎక్కా అవుతూవుంది. నాచిరంగు అప్పుడే
...ఖ్ అయింది. ఆడుతూవుందా ఆడుగుతాం.

ఒకవజీర్.—బందగానె ఆలీ, ఏమి యీ-యీ-యీ- దానిపేరు - రాలేదు,
...యీ విందు!

సు.—మనము బ్రతికి లేము. చచ్చి వీరస్వర్గంమే వున్నాము నేము చెప్తాం.
...సౌధాగార్ల దంతా హాశ్చర్యం, అద్భుతం, తమాషా, చమత్కారం, గమ్మత్, వుంది.

మఱియొక వజీర్.—ఆహా యేమి అషెర్బత్!

,, ఏమి అ మాజూమ్! ఏమి ఆ లాహిరి! ఏమి యా మాధున్యం!

సు.—సేట్ బాయి, వఖ్నాడు, యెప్పుడో జ్ఞాపకం లేదు, మేము యిలాగే
...వాడాలో వఖ్ నాచీ చూచినాం. అది మాకి యిప్పుడు, తెచ్చింపండి భాయి.

మఱియొక వజీర్.—మేము వఖ్నాడు స్వప్నంలో యిట్వంటి వాడామే
...నాచీ చూచినాం షుల్తాన్వారితో కూడా [వికటముగా నవ్వుచు] వారికీ తోకా
...తుంది వోయి? మానోటా చమత్కారంమాటా వచ్చింది! హిహిహిహి! ఆనాచీ
...మేము చూడవాలా; తెచ్చించండి, సేట్ వర్తకులు గోవా భాయి.

సు.—ఆనాచీ వస్తే మేము కూడా ఆడుతాం, లేదు మొగతాం, లేదు, వజీర్
...యి, యేమి చెప్పినాం? ఆడుతాం తోస్తుంది.

వర్త.—[ఆత్మగతము] వీరెక్కడ నున్నారో వీరికి తెలియదు. వలీఖానుపక్షము
...మాత్రము కైపు లేకున్నారు. [ప్రకాశము] జగత్ప్రభూ' చూచినదే చూడ నేల?
...త్ప్రభువువారు తెలుఁగుదేశము జయించినకీర్తినాటకమును చూడవచ్చును.

సు.—మాకీర్తినాకటం! మాకీర్తి నాకటం!

వర్త.—అవును, తమకీర్తినాటకమే, దానిని మాదేశపుమహాకవులుతమకోసము
...నారు.

సు.—వజీర్సాహేబ్, బలేతమాష్! బలేతమాష్! నాకట మారంభించండి.

వర్త.—మా యుద్యోగస్థులు, నౌకర్లు అందఱు చూచుటకు జగత్ప్రభువువారి
...శ్రవము ప్రార్థించుచున్నారు.

సు.—లోకమంతా చూడవచ్చును. హాహాహాహా! షూర్యచంద్రుల్ కబ్జాతో
...సాహేబ్ చూడవచ్చును. నచ్ఛత్రాల్ కబ్జాలో రాత్రిబీబీ చూడవచ్చును!
...మే వుంటే సింగ్ పులి కూడా చూడవచ్చును. హాయి హాయి హాయి హాయి.
...దంలో వుంటే మచ్ఛంకన్నె మయ్యకి చూడవచ్చును.

ఒకవజీర్.—[అరగన్నువడుచు]హా కౌళంలోవుంతేపచ్చికూడా చూడవచ్చును.

వలీ.—[ఆత్మగతము]బలే యమధర్మరాజువహాయం! అతిషులభంగావీర్ల వేరరిని సాప్ శీదా చేయువచ్చును.

వర్త.—మహానుగ్రహము! మహానుగ్రహము! ఆటగాండ్రను తెచ్చెదము.

[అని నిష్క్రమింతురు.

సు.—[తాంబూలకరండవాహినినిగూర్చి] మాకీ యేలడా యేలడా యేలడాయిలో చచ్చినందుకు వచ్చినావు అగే హశారీ? [అని దానిచేయి పట్టుకొనును.

తాంబూ.—ఆహశారీ వేరు మహాప్రభూ.

సు.—ఆహశారీని మేము చూడవాలా. బలే! బలే! బలే!

వలీ.—మనము ఎన్నిలడాయీలలో చస్తాం సర్కార్?

సు.—ఆహా! మీరుకూడా నాతో యిక్కడ వున్నారా! మీరు యెప్పుడు చచ్చినారు సాహేబ్?

వెట్టి.—[సమీపించి] ఇప్పుడే, ఇప్పుడే.

సు.—అహా! దివానాబహద్దర్! దివానాబహద్దర్! మాదగ్గిర మాదగ్గిర.[అని తనప్రక్కను తనకు వలీఖానునకు నడుమ గూర్చుండఁ బెట్టుకొని] దివానాబహద్దర్భాయి హశారికి మేము చూడవాలా.

[వెట్టివాఁడు తన ప్రమిదను చూపును. అందఱు వికృతముగా నవ్వుదురు.

అంతట వలీపాత్రము సిపాయీలును ప్రవేశింతురు.

వలీపాత్రము—బలే! బలే! షర్వం సిద్ధమా?

సిపా.—త్సర్వం సిద్ధం.

వలీపా.—మరి కదలండి. [ప్రయాణభేరి, ఇతరవాద్యములును.

వలీపా.—మీరు ఈలడాయిలో యే మేమిషక్తి చూపారు చెప్పండి.

సిపా.—[ఒకరితోనొకరు]మనము గులాందస్తఖైర్యనిషీచేత కట్టింమకొన్న పాటా కానిత్తాము రా. [అని సవాద్యముగా పాడుదురు.

ఒక సిపా.—[రొమ్మున చేయి యుంచుకొని] సర్కార్, నేను,

మొఘలి ఢాం కలోన మొఘిరే నా ఘసామి
రఘిలే యిసము దాగే పఘిడీమిలెగా.

కడమ సిపాయిపాత్రములు వెంటఁ బాడుదురు.



మఱియొకఁడు.—[అట్లే] నేను సర్దార్,

నీ రంతా షారాయి నారంతా ఘుంజాయి
జూరీ ని షా లేని పీరూ మియా. ,,

...కుడు.—[అశ్లేష] నేను సర్దార్,
హోఖాషా నా ఫట్టీ లేఖాన్కి పార్వాల
ఢీఖోసీ యే పేటి పేఖూ మియా. ,,

[సిపాయీలందఱు కలిసి పాడుదురు.

* పీఖాల కీ కోసి హోఖాసా నీ కేసి
రాఖాను లూ రండి కేఖాలేస్తాం.
యేళ్లన్ని కోశేశి నాళ్లన్ని దోశేశి
ఊళ్లన్ని బల్వాల్ల కాళ్లు శేస్తాం.
యేన్గాల కొమ్మట్టి పీన్గాలు గా గొట్టి
గాన్గపెం టలుగా తున్గి యేస్తాం.
సామూల శెవు లట్టి నామాలు నా కేసి
నీమాలు పోగొట్టి నామాజ్ శేస్తాం.
అయ్యాల ముక్కట్టి రొయ్యాలు దిన్పించి
సయ్యేద్ సాహేబ్ చేసి సావు చేస్తాం.
నిక్కుగు బ్బెతల తక్కులు సల్లించి
అక్కడి కక్కడే నిక్కా శేస్తాం.
రానీవా సామూలా మానాముగా దెచ్చి
కానీక సర్దార్ జె నానా కిస్తాం.

షు.—వహావ్వా! వహావ్వా! [వర్తకులతో] ఈవస్త్రాదులు కూడా బొమ్మలో చెయ్యలేక పోయినారా వర్తకులూ?

వర్త.—జగత్ప్రభూ, రసజ్ఞశేఖరా, ఈవస్త్రాదు లందఱు బొమ్మలే.

షు.—[పట్టి చూచి ఆశ్చర్యముతో ముక్కుమీఁద వ్రేలుంచుకొని] వర్తకులూ, ఇది సర్వం మోసంవుంది. ఏమిహాశ్చర్యం! ఏమిహాశ్చర్యం! మీరుయీలోకంవర్తకులు గారు, ఏలోకం వర్తకులు?

* పీఖాలకీ=రొ[illegible]

వెట్టి.—యమలోకం వర్తకులు. వెంగళప్పా, తెలివితక్కువప్రశ్నలు వేస్తావు!

వస్తాదులు,వర్తకులు.—[నవ్వుచు]దివానాబహద్దర్, నీవే ప్రళయకాలుఁడవు, మేమే కింకరులము.

వెట్టి.—అయితే మాకాయస్థుడు చిత్రగుప్తు డేడి?

వర్త.—చచ్చినవారిని యమునియెదుట మాటలాడ సిద్ధపఱుచుచున్నాఁడు.

వలీపా.—[ఆత్మగతము] ఈఢిల్లీయేలకపోతే నేనుపఠాణ్ కాను. తెలంగీదేశం కొత్తే రాణువకీ లూటీ విస్తారంవస్తుంది, అది నాకీ వశం వుంటుంది. ఈలడాయిలో ఖుస్రూ చస్తే వంతోషం. బతికితే తర్వాత సఫాయి.

సు.—[వలీఖానుంజూచి]ఇదేమోయి యిది?యిట్వంటి ఆలోచనవుందా నీకు?

వలీఖాన్.—బందగానె ఆలీ, ఇదంతా అబ్ధం, జూటా, వుత్తనాటకం.

సు.—అవును వుత్తనాకటమే. కానీ చూస్తాం యింకా.

[ప్రవేశవాద్యములు మ్రోఁగును]

వలీపా.—మనం యిప్పుడు వోరంగోల్ చేరినాంగదా. యీదండు పట్నంపట్టడానికి ఖుస్రూతో ఛోడ్దేవు చేశి రాజాకి పట్టడాన్కి జంగల్కు పోదాం.

సిపా.—సర్దార్చిత్తం. [ప్రయాణభేరి, ఇతర వాద్యములును.

సు.—అహో! వలీఖాన్, లడాయిలో రాజాకి పట్టినాన్ చెప్పినావే?

వలీఖాన్.—ఇదంతా జూటానాటకం సర్కార్.

సు.—మంచిది, నాకటమే, చూస్తాం యింకా.

వలీపా.—మరి నడవండి. [అందఱు సవాద్యవాదనముగా పరిక్రమింతురు.

వలీపా.—అడ్వీకి వచ్చినాం రాజాకి వెత్కండి.

[సిపాయీలు చెదరి అన్వేషణ మభినయించుచు నిష్క్రమింతురు.

వలీపా.—రాజా నాకీదొరికితే ఢిల్లీ కి తీస్కానిపోతాన్.ఖుస్రూ ఇక్డ చావనీ.

సు.—[వలీఖానుతో] అరేయేమిరా నీకీ ఖుస్రూఖాన్ మీద అంతా ఖావేషి!

వలీఖాన్.—తమరు కైఫ్ మే వున్నారు,తమకీ యిద అదీ తెలియడం లేదు,ఆరె నట్టువులు, యేమి నాట్కం యిది, జూటానాట్కం ఆడ్తారు? మాకీ సుల్తాన్వారికి ద్వేషం చేస్తారూ?

సు.—[కోపముతో] అరే! యేమిరా యింతా జబర్దస్తీ మాట్లాడ్తావ్?

వలీఖాన్.— లేదు ఆల్లా. నట్వులుతో మాట్లాడినాను. గులాంతల మీది.

సిపా.—[రాజును పట్టితెచ్చి] సర్దార్సాహేబ్. ఇద్గో రాజా మీ ఖయిదీ.

వలీపా.—[illegible]

శెట్టి.—సాకొక వెంగళప్ప ఒకపాటకట్టి నేర్పాడు. ఇది చూడకపోతే అది [అని లేచి ఆడుచు పాడును.

రాజు నేమో పట్టలేదు, రౌతు నేమో పట్టలేదు,
చాకలిపే రని వల్లీ సాయెబయ్యా పట్టినాడు.
మంత్రిమాటకు మోసపోయి మంచిదుస్తు నగలు దొడిగి
వేట వేసము వేసుకొని కాటిమొనలో గునుసుచున్న
చాకలిపే రని వల్లీ సాయెబయ్యా పట్టినాడు.
రాజు నేమో పట్టలేదు రౌతు నేమో పట్టలేదు, చాకలి...

సు.—[ఆత్మగతము] అహాహాహా! ఎంతమోసం! ఎంతమోసం! [ప్రకాశము] అరే వలీ యేమిరా మసాల్వాలాకి మాచేత తాజీం యిచ్చినావు.

వలీఖాన్.—దివానాది పాటా నమ్మతారూ, నాదీమాటా నమ్మరు.

సు.—కానీ కానీ, అరే వర్తకులు, ఏమి మాకీ మోసం నాకటం చేస్తారు? తల్కాయ అక్కర్లేదా?

పెద్దసెట్టి.—తలకాయ అక్కఱలేదా? తలకాయకోసమే యింతకొలువు. జగద్రక్షకా, మేము తమదర్శనమునకు వచ్చి మూడుమాసము లయినవి. వచ్చిననాఁడే మోడకు లంగరు దింపి కొంచెమవలికి జరుగుటకు మరల లంగరెత్తఁగా లంగరుతో శవము మొండెము గాయి కట్టినది లేచినది.

సు.—తర్వాత? తర్వాత?

వలీఖాన్.—[వర్తకులను సుల్తానును అత్యుగ్రముగాఁజూచుచు, ఆత్మగతము] వడ్డర్ల రాజువహాయం మోసం వుందా? వచ్చినపని జర్గడాన్కి జగడం పెడ్తారు పోతుంది.

పెద్దసెట్టి.—అంతట ఎవరో పాపము, ఎవరో చంపినారు, బంధువులు వెదకుట కై వచ్చిన ఈయవచ్చునను, అనిశవమును ఓడలో పెట్టితిమి. గట్టున నక్కఁలఁగాంచి చూడఁగా తల యొకటి దొరకినది. అది ఈమొండెమునకు సరిపోయినది.

సు.—తర్వాత? తర్వాత?

[వలీఖాను తన పక్షమువజీర్లకు హెచ్చరిక సేయును.

పెద్దసెట్టి.—అంతట మేకుబంది చేసి ఔషధములచే శవమును ఈ గదిలో దాచియున్నాము. మతిమాగ్రహచారముచేశవము వెంట నే వచ్చిన వాని పిశాచము ఆగదిలో చేరినది. రాత్రులెల్ల అందులో కొ యని యేడ్పులు. ఎందఱకో మా

కళాసులకు అభయముచే జ్వరములు. ఎందఱనో ఆపిశాచము పట్టి మాప్రాణహాటు ధూపము వేసిన పలుకుచు, తాను ఖుస్రూఖాన్ —

సు.—[ఆశ్చర్యముతో] ఆ! ఆ! ఆ! ఏమి? ఏమి?

[వలీఖాను కత్తి దూయును, అతనిపక్షము వారును దూయుదురు.

పెద్దసెట్టి.—[వణఁకుచు] తన్ను వలీఖాన్ చంపినాఁడని, సుల్తానువారితో చెప్పుమని యేడ్చును. తమతో చెప్పినతర్వాత దానిని పోఁగొట్టుకొందమని యింత కాలము ఇంత కష్టపడినారము.

[వలీఖాను సుల్తానును పొడువఁబోవును. శెట్టి. వలీకత్తిని లాగివేసి వాని పెడ రెక్కలు విఱిచికట్టును. సిపాయిపాత్రములు వలీఖానుమిత్రులను ఆస్లే చేయుదురు.

సు.—అరే! యీహాశ్చర్యాలలో మాకై పుగయా, అంతా పట్టపగల్లా వుంది! అరే! అరే! జూటానాకటం చెప్పినావు! యెంతాద్రోఘీరా నీవు! నీవు మాకీ కొమార్తెకీ యిచ్చి పెళ్లి చేస్తావు! పిందూ చెప్పి యింటికి తీస్కానిపోయి చంపడానికి నిశ్చయం! అహో హాశ్చరం! ఎంతాద్రోఘీ! ఎంతాద్రోఘి! మాకి చంపే యీహాతో మాఖుస్రూకీ చంపినాడులో సందేఘం యేమి? అరే ఖుస్రూ! అరే ఖుస్రూ! అయ్యో ఖుస్రూ! వాడు మాబిడ్డా, వాడు మాకూనా, వాడు మర్గయా, మేమూ మర్గయా.

[అంతట గదినుండి ఖుస్రూశవము పిశాచాధిష్ఠితమై వచ్చును. వర్తకులు గడగడ వణఁకుదురు. వజీర్లు భయవిభ్రాంతులై దూరము జరుగుదురు, ఆస్లే సుల్తాను వడవడ వణఁకుచు,

సు.—[భీతినాటితకముతో] మాడుమామం ఖానా లేక సొక్కినవదనము చిక్కినశపం, ఎండుతాటికాసులాగ కల్లాయ, ఎండుతాటిబొందలాగ మొండెం వీడికి చూస్తే మాకీ గుండె తువ్వని పోతుంది! గాథరా వుంది! క్యాకర్నా!

ఖుస్రూ.—[పెద్దరోదనముతో] మేరే బాబ్, ఘయాజ్ ఉద్దీన్ టోగ్లాక్ సుల్తాన్, బందగానె ఆలీ, నాకీ వలీ చంపినాడు. లడాయిలో చావలేదు. లీపాకే ప్రాణం దొంగచేతా చచ్చింది. వీడు రాజాకి పట్టలేదు. చాకలికి పట్టినాడు.

[సుల్తాన్ విభ్రాంతుఁడై వినును.

శెట్టి.—[వలీఖానును తన్ని దొరలించుచు] 'దివానాది పాటా నమ్మరాదు నాది మాటా నమ్మరు.'

[వలీ వణఁకును.

ఖుస్రూ.—రాజా తర్వాత వచ్చినాడు. లాడాయి ఐంది, మన దండంతా వచ్చీ తూ. నేను మేరే బాబ్, మేరే బాబ్, మేరే బాబ్, తమపాదాల్ దర్శనంకోసము పరారిచేసే ఢిల్లీకి వచ్చినాను.

[సు. వణఁకుచు ఏడ్చును. సుల్తాన్ పక్షము వజీర్లును
వణఁకుచు ఏడ్తురు. వలీ కన్నులు మూసికొనును.

ఖుస్రూ.—వీడు సర్దార్గదా అని, వీడు సర్దార్గదా అని, వీనికి దర్శనంచేసి, ప్రాకారికి తెచ్చినావు చెప్పినాను బాబ్, తమతో చెప్పవద్దు అన్నాడ్. తప్పకుండా చెప్తాన్ అన్నాను. అయితే పోనీ సికార్పోవాం చెప్పి, కబుర్లడుగుతూ, ఇక్కడ వచ్చిఅడ్డో అక్డ చూడు చెప్పి యిద్గో యిక్డ నాతల కొట్టినాడ్ బాబ్, మేరేబాబ్.

[వలీ. మూర్ఛిల్లును.

ఖుస్రూ.—వాడ్కి అట్లా మీరు తలాక్కాయ కొట్టించి నాకీ గోరికట్టిస్తే నా ఆత్మ హల్లాకాడికి పోతుంది.

సు.—[కన్నీళ్లతో వణఁకుచు] యిడ్డే వాడ్కి శాస్త్రీ చేస్తాం, నీకి బంగారం గోరీకట్తాం. ఏడవకు హల్లాకాడ్కి పో. అహహా, మాకుమాసాల్కింద దివానాగోడ్ కూడా తైజవాన్లు వీడికి చూచినాం చెప్పినార్. ఈవలీ పాపి జూటాభాత్ అన్నాడ్. హాకీ యుద్ధంలో ఖుస్రూ మర్గయా చెప్పినాడ్.

[వలీఖాన్ మూర్ఛ తేరును.

ఖుస్రూ.—మేరేబాబ్కి సలామతీ. నేనీదేఘం తమకివప్పగించి అల్లా కాడ్కి పోతావున్నాను. [ఖుస్రూకళేబరమునుండి చెకుముకిశాస్త్రి వెలువడి కళేబరము నుండి త్రోసి వలీకిమాత్ర మగపడి చాటునకు పోవును.

వలీఖాన్.—[చెకుముకిశాస్త్రిం గని] హా! హా! హా! యంధర్మరాజా]

[అందఱు కళేబరమును దరిసి కని ఆశ్చర్యపడుదురు.

శెట్టి.—నన్ను పిలుస్తావా?

సు.—అరే గాడిదా, యమధర్మ రాజేమిరా?

పెద్దసెట్టి.—[వణఁకుచు] చావఁబోవువానికి, ఇది హింమానావ గనుక యమ ధర్మరాజగపడినాఁడు.

సు.—వీడ్కి మేము యంధర్మరాజ్ అవుతాం.

మాదీ నమ్మకున్న మంచి వజీర్లకి
మాపై ఖావేషీ చేస్తాడు.
మాషాల్ వాలాగాడ్కి మాకీ తాజీం చెప్పి
మాకి హవ్మానం చేస్తాడు.
మాగులాం కు సంపి మాకీ నఫాయి చేసి
మాతఖు వీడు యెళ్లాడు.

హిద్దిగ్గో వీడికి హిందాగు చూడండి
యేటూపో తూ హల్లా కేస్తాఁ.
వేడి వేడి వేడి వీడి నెత్తు ర్తాగి
వీళ్ల మొ ఘూన థూ చేస్తాఁ.
వీళ్ల డొక్కల్ చించి వీళ్లపే గుత్తెంచి
వీళ్లక్ బొ మ్మన్తాడు వేస్తాఁ.
నిప్పా రం పాలతో నెత్తి యద్దు ల్దాక
నిత్యం వీ ళ్లెమ్కల్ కోయిస్తాఁ.
భగ్భగ్భ గ్నిప్పులో పదియేళ్లు రోజ్రోజు
పాతి మ హమ్మాయ్ చేయిస్తాఁ.

[అని వలీఖానుతలను కొట్టఁబోవును.

పెద్దసెట్టి.—కట్టినవానిని తమరుకొట్టఁగూడదు, అంగరక్షకుల కాజ్ఞ చేయుఁడు.

వజీర్లు.—అవును. బందగా నె ఆలీ, మేము చెప్తాం. ఎవర్రా, అక్డ? ఈ పాపాత్ములకి తీస్కానిపోయి తలకొట్టి రాయిగట్టి జమ్నా మే వెయ్యండి. అది సర్కార్ ఆజ్ఞ.

అంగరక్షకులు.—సర్కార్ చిత్తం. [అని కొనిపోవుదురు.

పెద్దసెట్టి.—[ఒకవర్తకునితో అపవారించి] వలీతల తెచ్చి భద్రము చేయుము.

[వర్తకుఁడు నిష్క్రమించును. గుభీల్ గుభీల్ అని నీటిలో వేసిన శబ్దములు అగును. గుండ్లు మ్రోఁగును.

అంతట చెకుముకిశాస్త్రి ప్రవేశించును.

వర్త.—వీరే మాపురోహితులు.

సు.—ఓహో చిత్తర్ గుప్తజోస్యులు!

[చెకుముకి వలీఖానుని ఖరారునామా సుల్తానుచేత పెట్టును.

సు.—[చదువుకొని] అహా! మాకి యీ రాత్రి చంపడానికి మూడు నెలల్ కుట్ర. ఇది వాడిదే దస్తూరీ. ఇది వాడిదే దస్కత్. ఇవి వా డెవర్కి రాసినాడ్!

చెకు.—ఎవరికో? ఈ చీటి ఒకనాఁడు జగత్ప్రభువువారి యాస్థానమున సభ లేచినపిమ్మట నాకు దొరకినది. ఆశత్రువు లందఱు తమకు దొరకుటకై, ఇప్పటివఱకు నేను దీనిని దాఁచితిని. ఈవర్తకులకు ఈకుట్ర తెలిపితిని. వానియింట జగత్ప్రభువునకు విందు తప్పి ... తమకు చెనన సాక్షి ... ప్రత్యక్షమే.

సు.—వారిచేత బతికినాం. మీ వుప్కారానికి చాలా సంతోషం! హా రాత్రియిది! వీడ్కి మేం సిఫాయి మొదల్ పాజ్ దార్ చేశి,సర్వసేనాపతి చేసి, ఇచ్చి మర్యాదల్ యిచ్చి,వజీర్ చేసి,మొదల్ వజీరు చేసినాం మాకీ యింతా గ్నం చేసినాడు! హా హా హా!

[నేపథ్యమున బాలస్వరముగా]

దాదాజీ, దాదాజీ, నీహుకుం చెప్పి వీళ్లు నాకీ

చం పేస్తున్నారు! దాదాజీ, దాదాజీ! దాదా ఆ ఆ ఆ.

సు.—హా! నా హన్నాకొమారుడి యేడ్పు విన్పడ్తుంది! ఆ! నాపాపం నాకి త్తుదా! హా! హా! హల్లా! హల్లా! [అని మూర్ఛితుఁడై పడిపోవును.

వజీర్లు.—[వణఁకుచు చెమర్చుచు] హా యేమిరాత్రి యిది! ఏమి రాత్రియిది! ఆ! పెద్దపిసాసీ షహ్వేషంలో నో రెర్గని కూనపిసాసీ చేరింది! వీడు వలీఖాన్కు పివాడు; దాన్కి పది వీడ్కి వీడి అన్నా పెంచినాడు. అతడు, సచ్చేతప్పుడు, న్ను చూస్తావున్నవి,యీపాపాత్ముడివల్లో పెట్టిపోయిన నోరెరగని కూనకి ఏడేళ్ల వుకి, వీడు గోడచాటు వుండి చూస్తావుండి,[కన్నీళ్లతో ఏడ్చుచు]తల్చుకొంటె టెడెల్ నీరవుతుంది, ఆ మహాప్రభు సిసువుకి, వీడు యిద్దర్ మనుషుల్ చేత, బిలిచిబిలిచి యేడుస్తావున్న సిషువుకీ, సంపించి వేసి తఖ్తు యెక్కినాడు. పాపం యిప్పుడు వీడిగుండెకి తగిలింది సౌదాగర్ భాయి.

పెద్దసెట్టి.—శివశివా! శివశివా!

[చెకుముకి సుల్తానుముఖమున పన్నీరు చల్లును. సుల్తాను ఆశ్వాసిల్లును.

వజీర్లు.—బందగానె ఆలీ,ఇక యిక్డ మనం వుంటాంవద్దు.నగర్కు పోదాంరండి.

సు.—నగర్నుంచి గుండు మాగుండెకి యిష్డు తగిలింది.మేము యిష్డు నగర్కు పోము.

చెకు.—మఱియిచటనే శయనింపుఁడు, సర్వము సిద్ధము. నాతో రండు. సెము షెర్బత్తు పుచ్చుకొనుఁడు, ఆయాసము తీఱును.

వజీర్లు.ఆట్లాచేయండి.

[చెకుముకి షర్బత్తు ఇచ్చును. సుల్తాను త్రాగును. వజీర్లును చెకుముకియు సుల్తానును శయనగృహమునకు తోడ్కొని నిష్క్రమింతురు. అంతట రాజు ప్రవేశించును.

రా.—పెద్దసెట్టీ, మహారాజునకు మంగళవేష మొసంగుము.

పెద్దసెట్టి.—శుభము శుభము. తమరును మంగళవేషము ధరింపుఁడు.

[అని వెట్టివానికి మంత్రివస్త్రములు ఇచ్చి, రాజునకు వస్త్రములను ఆభరణములను తెచ్చి యుంచును. వెట్టివాఁడు మహామంత్రివేషము ధరించును.

పెద్దసెట్టి.—జయము జయము మహామంత్రి యుగంధరులవారికి.

చెకు.—[ప్రవేశించి యుగంధరునిం గని] జయము జయము యమధర్మరాజ మహామంత్రి గారికి. [రాజుం గని] ఈయమసభలో సౌదాగరులవారు దేనికి వెలలు వేయుచున్నారు? [అగాదు. యుగం. తల ఆడించును.

రాజు.—[రాజవేషధారణమును ముగించుచు] వెల గలవానికి వేయఁగలను గాని లేనివానికి వేయఁగలమా?

చెకు.—వెలలేని సరకులుం గలవా యీవర్తకులయొద్ద?

[అగాదు. యుగం. తల ఆడించును.

రాజు.—[ముగించి తటాలున యుగంధరునిపాదములు పట్టుకొని, హర్షాశ్రుగద్గదముగా] ఈ యుగ్మమునకు వెలగలదా శాస్త్రులవారూ?

ఉ. [1]శ్రీదయితుండు [2]దానవులఁ జెండి నిజాశ్రితు నింద్రుఁ బ్రోచున ట్లాదట నాయరాతుల వెలార్చి నను న్సతతంబుఁ బ్రోచుచున్‌।
[4]శ్రీదునిఁ బేదఁ బేద నలశ్రీమ నొనర్చి విధి న్హసించు నీ పాదసరోరుహద్వయికిఁ బ్రాజ్ఞ వరేణ్యా, వచింపు మూల్యమున్‌।

[అని యాపాదములను బాష్పములం దడుపును.

అందఱు.—లేదు, లేదు, లేదు. [మూఁడు అగాదు.

యుగం.—లేలెమ్ము వత్సా. [అని రాజును లేపి కూర్చుండఁ బెట్టి] దైవికమునకు ఖేదపడకు.

రాజు.—తమ యాజ్ఞ మీఱిన దోషమే, దైవదోషము గాదు.

యుగం.—వత్సా, గతమునకు చింతిల్లకు.

ఉ. రాణ దలిర్ప నీ కఖిలరాజులు దండనతు ల్రచింప, వి న్నాణపుమౌళికెంపులఘనద్యుతి నల్లడఁ జుట్టు వాఱుచోఁ, బా జాణను నివ్వెరించు నలశాత్రవలక్ష్మిని బెండ్లియాడఁ బ్రా రాణియలంకృతిం బడయు రాజశిఖామణి, నీపదాబ్జముల్‌.

రాజు.—మహాప్రసాదము మహాప్రసాదము.

1. నారాయణుఁడు. 2. అసురులను. 3. సంహరించి. అదటన్ =ప్రీతితో, అరాతులన్ =శత్రువులను. 4. కుబేరుని.

యుగం.—వత్సా, నీ బాహుకార్యమును వీరి భక్తివిశ్వాసములు కావించినవి.

రాజు.—నా సుకృతకార్యమును గావించినవి.

యుగం.—పెద్దసెట్టీ, బాల్యమున మాసహాధ్యాయుని సహక్రీడివియు నైన స్నేహవిశ్వాసములను పూర్ణముగా చెల్లించితివి.

పెద్దసెట్టి.—కంటికి ఱెప్పలవలె సదా రక్షకుల రగు తమకు నాచేయుగొను వునకు ప్రశంస యేల?

రాజు.—ఆచంద్రార్కము ప్రశంసనీయము మీయందలివిశ్వాసము.

యుగం.—చెకుముకీ, ఇపుడీ ఢిల్లీనగర మెట్లయినది?

చెకు.— (పంచచామరము.)

సచిత్రగుప్తకింకరంబు చాయపట్టి చండత౯
విచిత్రవై ఖరి౯ [1]మెసంగి వీడినట్టు లయ్యెఁ జూ.
[2]విచేతనంపు మొండియంపు వేగిరింపు లింక ఢి
ల్లిచేష్ట, జ్యేష్ఠలక్ష్మి గాఁగిలించె దీనిఁ బ్రేమతో౯. ౧

యుగం.—ఇక్కడికి లెక్క అప్పగింపుము.

చెకు.—హతశేషులు—సుల్తాను, ఇరువురు ముసలివజీర్లు, ఇరువురు జవానులు. షెర్బత్తునిద్రలో ఖైదు.

యుగం.—వత్సా, మన సన్నాహమును పరికించుచుంటివా యింతసేపు?

రాజు.—విచారించితిని. ఈ యోడల నున్నపదివేలుగాక నదిపొడుగునను నా ఏఁబదివే లున్నదిగదా, మనమేల ఢిల్లీని పట్టఁగూడదు?

యుగం.—చచ్చినపాము, పట్టి నిలుపుకొనుట కీసన్నాహము చాలదు.

రాజు.—తమ చిత్తము.

పెద్దసెట్టి.—ఏలినవారు ఒక కొన్నియేని నిజమంగళాలంకారములు ధరింప

రాజు.—విశ్వనాథక్షేత్రమున ప్రాయశ్చిత్తమై, విశ్వనాథపూజయై, [యుగంధ పాదములు నూపుచు] ఈపాదములను నాస్వహస్తములఁ బూజించి, పిదప.

చెకు.—తురకలు తిండికి లేవఁగా నే లంగరు లెత్తినారము. నిద్ర కేఁగినంత నే లెత్తినారము. ఉభయవేగములఁ బోవుచున్నవి. ఱేపే విశ్వనాథసేవ.

యుగం.—మతి అందఱు విశ్రమింపుఁడు.

౧. సచి...డత౯=చిత్రగుప్తుఁడును కింకరులును తోడుగా యమధర్మరాజు ప్రతాపముతో. 1. ఛేదించి. 2. ప్రాణములేని.

ఆ. సెట్టి యొకఁడు, నేనుఁ, జెకుముకిశాస్త్రియు,
కాలరుద్రు మూఁడుకనులభంగి,
మేము ముప్వురమును మేల్కొని యుందుము,
ప్రభువు విశ్రమంబుఁ బడయుఁగాక.

[అందఱు నిష్క్రమింతురు.

---

# నవమాంకము.

స్థలము 1, ఓరుఁగల్లు, నగరిలో, రాణి పూజామందిరము.

అంతట విరహాకృశ వ్రతస్థ రాణి గౌరిని పూజించుచును, చేటిక లుపకరణము లందిచ్చుచును, కొందఱు విప్రాంగనలు, పురోహితుఁడు, తద్భార్య, తత్స్నుషయు, ప్రవేశింతురు.

పురో.—అమ్మా, స్వప్నములో దేవతలిచ్చిన వరములు తప్పవు. ఈదినమే నీవు ప్రాణేశ్వరునిం గలసెదవు.

రాణి.—మహానుభావుల వాక్ప్రభావము.

[అని గౌరిని బాడును. చేటికలు మృదంగాదికము వాయింతురు.

ఖమాజ్ రాగము. చాపుతాళము.

*ఇందుమౌళి కామినీ, మృగేంద్రగామినీ,
డెందమందుఁ గూర్పవే, నా కుందు దీర్పవే. ఇందు.
దుష్టవర్గ శిక్షణీ, నిజేష్టరక్షణీ.
కష్ట మడఁచి ప్రాణనాథుఁ గనులఁ జూపుమీ. ఇందు.
† కల్పకముల హరునితపము కన్నెలీలనే,
నల్పి యతని సగము గొన్న సాహసాంగిరో. ఇందు.
కల నొసఁగిన వరము లిపుడె కరుణసేయవే,
‡ కులగిరీంద్రు కన్య, జాలి గొనవె, కావవే. ఇందు.

---

*ఇందు—చంద్రశేఖరుని (శివుని) భార్యా, సింహము నెక్కి సంచరించుదానా, (నీ) హృదయమందు(నాపై)ప్రేమ వహింపుము, నాదుఃఖమును పోఁగొట్టుము.

† కల్పకము = సృష్టి మొదలు ప్రళయమువఱకుం గలకాలము.

‡ హిమవంతుని యొక్క.

రాణి.—[దోయిలించి దోయిలించి అమ్మవారి పాదముల పువ్వులు చల్లి] ఓసి, ముత్తెములగంప అందియ్యవే.

చేటి.—ఇదిగో. [అని దగ్గఱఁ బెట్టును.

[రాణి ముత్తెములు దోయిలించి గౌరిపాదములం దర్పించును.

ఒకచేటి.[ప్రవేశించి] దేవీ, మల్లీ పువ్వులు, కడమవి అన్నీ వచ్చినవి.

రాణి.—ఏవేవి? ఎంతెంత?

ఆచేటి.—పదిబట్లు పువ్వులు, నూరుబిందెలు పన్నీరు, నూరుగిండ్లు అత్తరు. కాచిల్లరలు వున్నవి.

రాణి.—సగము అత్తగారిపూజకు కొనిపొండు, సగము ఇక్కడికి తెండు.

ఆచేటి.—ఇవన్నీ అత్తగారు పంపినవే.

రాణి.—ఆటయిన మహాప్రసాదము. అంతయు తెండి జాగ్రత్తగా.

ఆచేటి.—దేవిగారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాణి.—ఈ వీనులు గౌరీవాగమృతమును గ్రోలిన యాదినమే ప్రాణేశ్వర నగరవేశతూర్యనాదామృతముం గ్రోలఁగాక. గౌరీపూజాపరిశేషితకుసుమోత్కరం బ్రాణేశపాదములం బూజించెద. [అని మరల గౌరిం బూజించుచు పాడును.

[చేటికలు వాద్యములు వాయింతురు.

హిందు. కాపి రాగము. రూపకతాళము.

నీవే గతి గావే, *నిటలాక్షు రాణిరో,
కావవే వేగమే, వేగమే. నీవే.

శరణుఁ జొచ్చితి నీ చరణము తల్లిరో,
కరుణతోఁ జూడవే, చూడవే. నీవే.

తెల్లమయ్యె నా యుల్లమిా వేళ,
తల్లిరో, ప్రోచితే, ప్రోచితే. నీవే.

గౌరీ మహేశులు కాతురన్నమాట,
సారము, చేసితే, చేసితే. నీవే.

నిన్నే నేఁ గొల్వ నిఖిలజన్మముల,
నెన్నవే యీశ్వరీ, యీశ్వరీ. నీవే.

* ఫాలనేత్రుని యొక్క (శివుని యొక్క)

* కల నీ కథ, నిద్ర కలఁగని ధ్యానము,
తెలివి నుతి, సేయవే, సేయవే. నీవే,

చుక్క లన్ని పూవు, లక్కడలి పన్నీరు,
† లెక్క చేతుల్, సేయవే, సేయవే. నీవే,

మ్రొక్కఁగయి కొమ్మా, మ్రొక్కఁగై కొవమ్మా,
మ్రొక్కెద నోయమ్మా, ఓయమ్మా. నీవే,

[ముత్తయిదువులు పాడుదురు. చేటికలు వాద్యములు వాయింతురు,
ఆనందభైరవి రాగము. రూపకతాళము.

గిరిరాజతనయా, రక్షింపు;
వరము లొసఁగి మమ్ము వాసిగాఁ బెంపు. గిరిరాజ.
అళిక నేత్ర మొకటి, యర్ధాంగ మొక్కటి,
తళుకు‡లే నెలపూవు తల నొక్కటి,
కులుకుసింగపుఁ దేజి కొదమయు, గుఱులుగా
వెలసి లోకము లేలు విశ్వేశురాణి. గిరిరాజ
‡‡ వాకు వాకున నాను § భారతీదేవిని,
§§ ఏకస్థానము లేని యిందిరను,
మేకొనక దయితు మేనను నెలకొని,
లోకము లేలుత్రైలోక్యజనని. గిరిరాజ.

[చేటికలు పుష్పాదికములను తెచ్చి యుంతురు. రాణి
వానిని పరీక్షించుచు యథాస్థానముల నుంపించును.

పురోహితపుత్త్రుఁడు సంభావనీయబ్రాహ్మణులతో
వేఱుశాలం బ్రవేశించును.

ఒక వృద్ధబ్రాహ్మణుఁడు (అవధానులవారు).—[ప్రవేశించుచు]

---

* కల—నాస్వప్నావస్థ నీచరిత్రగాను, నానిద్ర నీధ్యానముగాను, నాజాగ్రదవస్థ నీస్తోత్రముగాను చేయుము. † లెక్క—లోకములో సంఖ్య లెంతవఱకు డునో అన్ని చేతులు నాకిమ్ము. ‡ లేనెల=లేఁతచంద్రుఁడు. ‡‡ వాకువాకునన్=ప్రతివారినోటను § సరస్వతిని, §§ ఒకచోట స్థిరముగా నుండని లక్ష్మిని.

'ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్,
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్.'

కూర్చున్న బ్రాహ్మణులు.—అబ్బో! అవధానులవారా! రండి రండి, ఇక్కడ

...కూర్చుండ. [అని వారిని సగౌరవముగా కూర్చుండఁ బెట్టుదురు.
వారును కూర్చుంటలో పడఁబోయి కూర్చుందురు.

ఇతరులు.—పెద్దకాలము!

మఱియొక బ్రాహ్మణుఁడు [కుండలధారి చయనులవారు].—[ప్రవేశించుచు]

హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే.

ఇతరులు.—రండి రండి, చయనులవారు. నీవు లేరా.

[అని చిన్నవాని నొకని జరిపి ఆయనను కూర్చుండఁ బెట్టుదురు.

పురో.— [వీరికడకు వచ్చి] ఇన్నాళ్లు ప్రార్థింపఁగా ప్రార్థింపఁగా ఈదినము ...యనులవారు అనుగ్రహించినారు.

చయనులు.—నాయనా, మీరా శివమహాదేవయ్యగారా? ఈదినమునఁగూడ అగ్ని ...హోత్రము లయిన తర్వాత ఉపనిషత్తులు పారాయణము చేసికొనుచుండి యిక్కడి ...మాట మఱవనే మఱచితిని. తర్వాత మనుమరాలు జ్ఞాపకము చేయఁగా వచ్చితిని. మీ ...మేళనను పొందియున్నాము. మీయెడ మోమోటమి లేక యుండవచ్చునా?

మఱియొక బ్రాహ్మణుఁడు [కుండలధారి సోమయాజులవారు]—[ప్రవేశించుచు]

'శివం శివకరం శాన్తం శివాత్మానం శివోత్తమమ్
శివమార్గప్రణేతారం ప్రణతోఽస్మి సదాశివమ్.'

వేదికడ ఎన్ని గుంజిళ్లు పెట్టినను కాళ్లకు నొప్పిలేదు. ఈ ద్వారములు దాఁటి ...సోపానములు ఎక్కునప్పటికి నా పని అయినది.

ఇతరులు.—ఓహో! విశ్వేశ్వర సోమయాజులవారు! ఇన్నాళ్లకు గ్రామము ...చేరి దయచేసినారు, ఇక్కడ ఇక్కడ. [అని సగౌరవముగా కూర్చుండఁ బెట్టుదురు.

పురో.—బహుదినములకు కటాక్షించితిరి. సోమిదేవమ్మగారుకూడ వచ్చినారా?

సోమ.—మాయింటిదా, వచ్చినది. దానివలననే యింత యాలస్యము.

సోమిదేవమ్మ.—[ప్రవేశించుచు నవ్వుతో ఆత్మ.] ఇక్కడికొచ్చినా తప్పులేనా?

పురోహితభార్య.—రండి సోమిదేవమ్మగారూ, రండి. [అని ఆమెను రాణి ...దఁ గొనిపోయి కూర్చుండఁ బెట్టి, కోడలితో] అమ్మా జగదంబికా, మనము ...శ్రీయుదలను పూజింపవలెను అమ్మా.

పురో.—[తనకుమారునితో] మహేశ్వరా, బ్రాహ్మణపూజ కానీ.

[రాణి చందనపుష్పతాంబూలాదులను సంస్కారవంతములనుగాఁ బరికించి చేటికలచేత మహేశ్వరయ్యకడకును జగదంబికమ్మ కడకును బంపును. వారు బ్రాహ్మణులకును ముత్తయిదువులకును వినియోగింతురు.

పురో.—ముందు చయనులవారిని పూజింపుము.

చయనులు.—సోమయాజులవా రున్నారు, మహానుభావులు, వారిని పూజింపుము నాయనా ముందు. ఇంక పెద్ద లెవరున్నారో చూడు బాబూ.

సోమ.—తమరే ఇచట వయోవిద్యాకర్మజ్ఞానజ్యేష్ఠులు. సాక్షాత్తు ఆపస్తంబు వారే. బాబూ చయనులుగారికే కానిమ్ము నాయనా.

[మహేశ్వరయ్య చయనులవారికి చందనాదికము ఇచ్చును.

చయనులు.—మ ఉేమి చేయవచ్చును! పెద్దలమాట తప్పఁగూడదు.

[అని గ్రహించును. ఒకరిద్దఱు బ్రాహ్మణకుమారులు లేచి యితరులకు చందనాదికము సమర్పింతురు.

చయనులు.—[మహేశ్వరయ్యతో] నాయనా, మహాపుణ్యజన్మము నీది, 'కర్తాకారయితా' అన్నారు పెద్దలు. [బ్రాహ్మణపూజ జరుగును.

ఒక బ్రాహ్మణుఁడు.—[ప్రక్కవానితో]

క. ఈ మాన్యవృత్తపావన
సామీప్యంబందు నున్న సమయం బెల్లన్
నామదిఁ దోఁచు మథురలో
నా మీనేక్షణసమీపమం దున్నగతిన్. ౧

మఱియొక బ్రాహ్మణుఁడు.—

క. ఊరఁ గల *వామ లెల్లరు
నీ రాణిని నీమెపూజ నీక్షించినచో
సారమతి నల్లయనసూ
యారుంధతు లగుట కొక్క యంకిలి యున్నే!

ఇంకొక బ్రాహ్మణుఁడు.—సాక్షాత్తు ఆ కాశీవిశాలాక్షి యిట్లవతరించినది.

[మహేశ్వరయ్య వరహాలు పళ్లెరములతో బ్రాహ్మణులకు కుమ్మరించును.

కొందఱు బ్రాహ్మణులు.—[వరహాలు ఉత్తరీయములో పట్టుచు] ఏమయ్యా మహేశ్వరయ్యా, ఇరుసలతోఁ గొలిచి కుమ్మరించుచున్నావు? మోయలేము బాబూ,

౧. ఈమాన్యవృత్త=మాననీయమైన చారిత్రముగల యీరాణియొక్క... * వ... టిల స్త్రీలు.

మహేశ్వ.—కోపగింపకుండు స్వామీ, కోపగింపకుండు; ఇంకొక పళ్లేము, ఇం[కొ]కపళ్లేము, [అని మరల మరల వరహాలు కుమ్మరించును.

ఆముప్వుర బ్రాహ్మణులు.—అయ్యా, పిల్లపారోహితులూ,

(సీసము.)

ఒక.—సాధించిరో నీదుజనకు లేదేవిశ్లై *భూరిసమాకృష్టిభైరవంబు?

మఱియొక.—కాదేని, చేసిరో కనకధారాస్తోత్ర బీజాక్షరాదిసంయోజనంబు?

ఇంకొక.—అది కాదు, సిద్ధించె నలకుబేరోపాస్తి.

ఒక.— దొరకెంబో వీరికిఁ † బరసువేధి.

మఱియొక.—వశ మయ్యె నితనికి వటయక్షి

ఇంకొక.— యది గాదు, ‡ నిధ్యంజన మితండు నేర్చినాఁడు.

ఒక.— కంటె చేర్చుసారంగంబు § కనకగిరికి?
నెచటి దన్కిది నెలలుగా నీ విధమున
వచ్చుబ్రాహ్మణ్యమున కెల్లఁ బైఁడిరాశి
దెచ్చి యిచ్చెదవు, వచింపు ద్విజవరేణ్య. 3

మహే.—ఆ. జగతి నేల వెలసి సాక్షాన్మహాలక్ష్మి
సింహపీఠి నధివసించి ప్రేమ
నవనిధులను వితరణము సేయుచుండంగఁ
జూచ్చె మేమి కలుగు భూసురేంద్ర?

చేటి.—ఈ రత్న రాసులు కూడ వినియోగము చేయుమన్నారు దేవిగారు. [అని అందించును.

మహేశ్వ.—స్వామీ, బంగారము భార మని యివి పంపినారు. పుచ్చుకొండి [మహాను]భావులారా. [అని విప్రులకు కుమ్మరించును.

ఆముప్వురు బ్రాహ్మణులు.—భార మన్నందులకు దండన యిది. నీచిత్తము. [అని పుచ్చుకొందురు.

ఒక ముత్తయిదువ.—బంగారం మహాలక్ష్మి. ముత్యాలు కెంపులువజ్రాలుఅన్నీ [..]త్నే, వద్దనరాదు. ఇళ్లల్లోయెన్ని బోషాణాలైనా చాలడంలేదు. వొచ్చిపుచ్చు[కుం]తే, అబ్బో! వైదికుల కెంతగర్వమో అంచారు. ఒకనాడైనా మోయగలిగే [..]య్యారు. మాయిళ్లలో శెనగలైనా యిన్ని వాయనం పెట్టలేము.

జగదంబిక.—అమ్మ గాదూ, మాతల్లి గాదూ, ఇక వొకటే పళ్లెం, వొకటే.

3. *స్వర్ణాకర్షణభైరవ మనుమంత్రమును. దానిసిద్ధిచే అమితముగా బంగారము [..]ము. †ఇనుమునకుం దగిలించిన ఆయినుమును బంగారము చేయువస్తువిశేషము. [..]షములను జూపు[..] § మేరుపర్వతమునకు (అది [..] బంగారము.)

[అని ఒక్కొక్కరికి మరల మరల బలవంతముగా వరహాలు, ముత్తెములు, ఇతరరత్నములును, కుమ్మరించును. ముత్తయిదువులు మూటకట్టుకొందురు.

ఒకబ్రహ్మచారి.—కాంకరపువ్వులరాశివలె ఈవరహాలరాశి గనంగా కన్నులు సుడి తిరుగుచున్నవి, మిలుమిట్లు గొనుచున్నవి, ఏల మనకీడబ్బు? దీనిని మన మేమి చేయ గలము?

ఒకండు.—పెండ్లి చేసికొమ్ము.

ఆ బ్రహ్మచారి.—దీనికి వ్యయము లేదుగదా, వరదక్షిణాదిలాభమే గాని.

ఆ యొకండు.—తరువాత యజ్ఞము చేయుము.

ఆ బ్రహ్మచారి.—బళి బళి.

ఒకండు.—నేను ఈయేడు నెలలధనముతో కాశిలో శాశ్వతసత్రము వేసెదను.

,, [అపవారించి ప్రక్కవానితో]

క. తురకలకొలువునకుం ని
ర్వారణముగా నీధనమున నఖిలమ్మును నే
డరిసించి కాశి, రామే
శ్వరుం బొడగని, పడయువాండ శాశ్వతశుభముం. ౫

ప్రక్కవాండు.—[అపవారించి వీనితో] నా యీ సర్వధనముతో,

క. గ్రామగ్రామంబునం గా
శీమార్గములం హిమాద్రిసేతులు దాంకం
దామరకొలంకు లిడెద మ
హామదసైన్యపులనున్న యతికిం బ్రీతిగాం.

ఒకండు.—నేను నాకొమార్తకు పెండ్లి చేసెదను.

,, ఈదేశమున జీర్ణాలయములు లేవు. నేను పరదేశముల జీర్ణోద్ధారము చేయించి మాన్యము లిచ్చెద.

,, నేను విద్యార్థులకు మద్రసోపేతముగా భోజనము పెట్టుటకును, సదాచారములు జరుపుటకును, లేనిచోట్ల నెల్ల సత్రములు వేసెదను.

[రాణి ముత్తయిదువులకు నమస్కరించును.

ముత్తయిదువులు.—నీవూ నీప్రాణేశ్వరులున్నూ కడుపునిండా కడు పెద్ద బిడ్డలను గనుకొని ఆపార్వతీపరమేశ్వరులలాగ శాశ్వతంగా భూమి పాలిస్తూవుండండి.

రాణి.—[వామాక్షిస్పందనము సూచించి పురోహితభార్యతో] అవ్వగారూ, నాయెడమకన్ను అదరుచున్నది.

పురో. భార్య, ముత్తై.—శుభం, శుభం, శుభం.

ఒకచేటి.—[వడివడిగా ప్రవేశించి] దేవీ, దేవీ, ఏలినవారు గడికోటకొచ్చినారు.

[రాణి హర్షాశ్రువులతో తన మెడలోనిహారమును చేటి మెడను వైచి, ఆభరణము లూడ్చి దాని కిచ్చును.

చేటి.—[ఆభరణములు గ్రహించి రాణిపాదములకు మ్రొక్కి] తల్లీ, ఇంక ముతో దరిశన మని మంత్రిగారు మనవి చేయుమన్నారు.

రాణి.—[వగల వామాక్షిస్పందనము సూచించి] ఓసి, ఈకంటి సంవాదము అతిప్రియ మగుటచే నీమాటను నేను నమ్మలేకున్నాను.

పువ్వులచేటి.—[ప్రవేశించి] ఇంక 1000 బళ్లు పువ్వులు, 100బళ్లు పన్నీరు, 50 అత్తరు, తమకోసం వస్తున్న వని పువ్వుల శిరస్తాపంతులు చెప్పినారు.

రాణి.—ఓసి, మా వివాహదినముకన్న ఈదినముమాకు ప్రియముగా నున్నది. ఈశుభదినమున, మాప్రాణేశ్వరులు మాకుదర్శనమిచ్చునీమహోత్సవమున, ఆపుష్పా దుల—

క. గంపలు బిందెలుగా నగ
రంపువాసినుల కెల్లరకు నింటింటం
బంపక మిదు మని యిదె మా
పంపుగ వచియింవు గంధపాలకుతోడన్.

చేటి.—దేవిగారి యాజ్ఞ.

రాణి.—నాకు హర్షాతిశయముచే నేమియు తోఁపకయున్నది. ఈకల్యాణం అత్తగారికి తెలుపుకొని వారి దీవనం బొంది వచ్చి మరల గౌరిపాదములం ంచుకొని ప్రాణేశ్వరులం గనులఁ జూచెదను.

పురో. భార్య.—మంచిది, రా అమ్మా.

పురో.—పెద్దలందఱకు రాణిగారు నమస్కరించుచున్నారు. మహర్షులారా, దీవింపుఁడు.

వృద్ధబ్రాహ్మణులు.—మాతపఃఫలాంశము వారిక్షేమమునకే గదా!

రాణి.—ధన్యురాలను. [అని పురోహితభార్యాస్నుషాచేటులతో నిష్క్రమించును.

[పురోహిత తత్పుత్రులును నిష్క్రమింతురు.

బ్రాహ్మణకుమారులు.—మనము గడికోటకుఁ బోయి, రాజయుగంధరుల పరి చూతము.

వృద్ధులు.—ఈదినము మేము ఈబరువుతో ఇల్లుచేరుట ఎట్లు ?

కొందఱు బ్రాహ్మణకుమారులు.—స్వామీ, ఎట్టయిన మేము మోచెదము.

[అని వారిమూటలు కైకొనుదురు.

వృద్ధులు.—[ఇచ్చి] నూరేండ్లు బ్రతుకుదురు మీరు.

స్త్రీలు కొందఱు.—[పరస్పరము] తొరగా రావో, వోవిడో, తొరగా రా, యిళ్లకు పోదాం, ఆలశ్యం చేస్తే యీరోజు వీధుల్లో నుపుగింజ రాలదు. రాజొస్తాడుప. మంత్రొస్తాడుప. [స్త్రీలు పురుషులు అందఱు పరిక్రమింతురు.

ఒకబ్రాహ్మ.—ఓసీ, నామూట నీవు మోసికొని పోదువా? నేనుకూడ గడికోటకు పోయెదను.

బ్రాహ్మణి.—నావే నేను మోయలేకున్నాను, మీవి నేను మోయడమెక్కడిది?

బ్రాహ్మ.—స్వారస్యముగానే చెప్పితివి.

వృద్ధులు, స్త్రీలు.—నగరు వెలువడుటకే క్రోశమైనది; మేముపరుగెత్తలేము. ఇక్కడ నెచటనేని రవంత కూర్చుండి మే మిల్లు సేరెదము. [అని నిష్క్రమింతురు.

బ్రాహ్మ.—మనము త్వరగా పోదము రండి రండి. [అని త్వరగా పరిక్రమింతురు.

## స్థలము 2. ఓరుఁగల్లు రాజవీథి.

[నేపథ్యమున చాటింపువాద్యము.]

బ్రాహ్మ.—[శ్రవణ మభినయించి] ఏమి చాటింపు ?

అంతట వెట్టివాఁడు డప్పు వాయించుచు ప్రవేశించును.

బ్రాహ్మ.—ఏమిరా ఆచాటింపు?

వెట్టి.—[ఉచ్చైస్స్వరముతో] సామే, యీరాయాల పెద్దమంతిరిగారుఉగంధర దేముడుగారు సాకలాయన పేరాయన్ని డిల్లినుంచి తీసకొని ఈపట్టంవొచ్చి శేరినారు. [డండండండం] పేరాయన్ని యెత్తుకెల్లి నతురకోడిబుట్టి కొట్టించి తెచ్చినారు. [డం డండండం.] డిల్లీసుల్తాన్ని కూడా తెచ్చినారు. [అడుచు డండండండం.] మంతిరిగారికి మారాజు కాశీదాక యెదురెల్లి [డం] ఉచ్చవంతో [డం] పట్టంలోకి తీసకొచ్చినారు. మారాజుగారిని పట్టంలోనికి తేవడానికి బేతాళనాయనింగోరు దండుతో ఎదురెల్లినారు; మారాజుయెల్లయిభవాలతో టిన్నిపట్టంలోకివస్తావున్నారు. [డండం] పట్టమంతా అలంకారం శెయ్యాలిశిందే. [డండండండం.] [అనివాయించుచునిష్క్రమించును.

బ్రాహ్మ.—త్వరగా పోదము. త్వరగా పోదము. [అని పరిక్రమింతురు.

అంతట ఆకాశయానమున విద్యాధరమిథునము ప్రవేశించును.

విద్యాధరుఁడు.—ప్రేయసీ, గౌరి తానే యిచటికి తనభర్తురాలు ప్రతాపరుద్ర మహారాజు పట్టపుదేవి యీశర్వాణి కళ్యాణమును తనకన్నులతోఁ జూచుటకొరకు మనలం బంపినది

విద్యాధరి.—ఆర్యపుత్త్రా, గంగతో మహేశ్వరుఁడు మంతనమాడినది మొదలు గౌరి యలిగి, యిప్పుడ యలుక తీఱి యాయన యుపలాలనంబుల మునింగి యున్నది. సఖ్రవర్ణిల, నన్ను శర్వాణీకళ్యాణమును కనులఁ గాంచి వచ్చి నివేదింపుమని మన గుబలి యనుగ్రహాతిశయముచే మన కానతిచ్చినది. ఆర్యపుత్త్రా, చూడు చూడు !

క. పుర మెల్లను గ్రీడామం
దిరముగఁ * గైసేత వొంది దీపించును, † రా
జ్యరమా ‡ వాసకసజ్జిక
§ యురు లాలస నెదురుసూచుచున్నది విభునిన్. ౮

కాని, అ దేమి ఆర్యపుత్త్రా, నగర మెల్ల వానసఁ దడసిన ట్లున్నది!

విద్యాధరుఁడు.—వాన గాదు ప్రేయసీ, వీథుల నెల్ల, అత్తరు, పన్నీరు, సుగంధద్రవంబులు, వర్షించినారు.

బ్రాహ్మ.—గడికోట కీదారి దగ్గఱ, ఇటు పోదము.[అని నిష్క్రమింతురు.

విద్యాధరుఁడు.—ప్రేయసీ, అవే గడికోటలో డేరాలు; జన సంఘము చూడు! మనము నచటికే పోదము. [అని ఆకాశయాన మభినయింతురు

---

## స్థలము 3. గడికోటకడ తోపులో డేరాలు మొదలు ఓరుఁగంటినగరివఱకు ఆకాశము.

విద్యాధరి.—ఆర్యపుత్త్రా, కాశికడ మనము విశాలాక్షీవిశ్వేశ్వర సేవార్థము చనునపుడు ఆదినము మనకగపడిన యా మేనాపల్లకీలు ప్రతాపరుద్రుని రాణివాస మని తలంచితిమే. ఇదే మాశ్చర్యము! వానినుండి తురకలు పురుషులు దిగు చున్నారు! ఎవరువారు?

విద్యాధరుఁడు.—[పరికించి] ఆశ్చర్యమే. అతఁడే ఢిల్లీసుల్తాన్, కడమవారు అతని వజీర్లు. [మరలి చూచ్కి నిగిడించి] ఓహో! వారందఱు ఖైదీలు, బంగారు సంకెలలు చూడు.

విద్యాధరి.—ఆర్యపుత్త్రా, వారి నెవరు ఎట్లు ఖైదుచేయఁగలిగినారు ?

విద్యాధరుఁడు.—ఇదంత అల్ల వాఁడుగో ఆమంత్రి యుగంధరదేవుని నీతి ప్రాబల్యవిజృంభితము.

విద్యాధరి.—అటువైపు చూడు మార్యపుత్త్రా, ఏనిమిదేనుఁగులపై ఒకచోట అంబారీ వేసినారు. అందులో రాజు, సుల్తాను, ఇద్దఱు రాజమంత్రులు, ఇద్దఱు వజీ

---

౮. * అలంకారము. † రాజ్యలక్ష్మి యనెడి. ‡ పడుకటింటి నలంకరించి త నలంకరించుకొని భర్త నెదురుచూచుచుండు నాయిక. § గొప్పకోరికతో,

ద్దుల్లు, మావటీలును, అంగరక్షకులును కూర్చున్నారు, వారాంగనలు వింజామరలు వేయుచున్నారు, ఛత్త్రిము పట్టుచున్నారు.

విద్యాధరుఁడు.—భళిబళిరే! అష్టగజపుష్పకము ఎంత దేదీప్యమానము! ఆ తరలుచున్నారు చూడు.

చ. ఎనిమిది దిగ్గజంబులు రహిం వహించుధరాతలంబుపై,
*దినకరచంద్రభోడుతతిదీపిత † మూకనకాచలం బనఁ,
‡ కనదురుధాముఁ డేకశిలకాముఁడుఁ, బాదుషహా, వజీర్లు, సు
గనలును గల్గి పుష్పకము గ్రాలు § గజాష్టకనిష్ఠపీఠిపై, ౯

విద్యాధరి—అదే మార్యపుత్త్రా, వారు తరలఁగానే ఆ యాశ్చర్యము!

క. నెరయీరెండగ, సంపెఁగ
విరిజడి యన, సంజమొగులు విఱిగి చిద్రుపలై
ధరఁ బడె నన, బంగరుమల
కరఁగి కురిసె ననఁగ, నింగి కడుఁ బసు పయ్యెన్. ౧౦

విద్యాధరుఁడు.—ముద్దరాలా, అది వాస్తవముగా సువర్ణవృష్టియే, సేవకులగు రాజాధికృతులు గురియుచున్నారు.

విద్యాధరి.—[సభయము] ఆర్యపుత్త్రా, ఏమి అటువైపున ఆరక్తవర్షము!

విద్యాధరుఁడు.—ఓసీ బేలా, రక్తవర్షము కాదు, రత్నవర్షము. అచట బ్రాహ్మణ జనము, వారికై మహామంత్రి కురియించుచున్నాఁడు.

విద్యాధరి.—ఆహా! అ దేమి రోహణశృంగపాతమువలె నున్నది!

విద్యాధరుఁడు.—

సీ. చూచుచూడుము దవ్వుఁజూడ్కికి వీ డెల్ల రేఁగు తేనియగూఁటిరీతి నొంచు
నీనుచున్నవి చూడు మిండ్ల మోడులు చెట్లయాకులు నరుల నారీకులముల,
వనితలపలువన్నె వలిపంబులఁ బురంబు కలయఁబూచిన * కానకళ వహించె
బరగుఁ జూడుము † కేతుపట్టికాతతి నింగి సకలజాతి ‡ విహంగనికర మనఁగ,

౯. *సూర్య చంద్ర నక్షత్ర తారా సమూహప్రకాశితము. † పసిండికొండ (మేరువు). ‡ వెలుఁగుచున్న గొప్ప తేజముగలవాఁడు, ఏకశిలకాఁముడు=ఏకశిలానగరము యొక్క మన్మథుఁడు, ప్రతాపరుద్రుఁడనుట. § ఎనిమిదియేనుఁగుల పైనున్న యంబారీపై.

౧౦. *అడవియొక్క శోభను. † జెండావస్త్రముల సమూహము, ‡ పక్షి సమూహము.

తే. వచ్చుకాంతుఁ గవసి యెదఁ గ్రుచ్చుకొనఁగ
నగరి తమి మీాటి యెడ యోర్వ కెగసె ననఁగ,
నేల నిరసించి జన మెల్ల నింగిఁ జేరెఁ,
గనవె* యనిమేషదృష్టి నీ † జని ఫలింప. ౧౧

విద్యాధరి.—ఊరెల్ల నేల విడిచి నింగిని సాముచేయుచున్నది.

విద్యాధరుఁడు.—చూడు ప్రేయసీ, చూడు, అప్పుడే నగరప్రవేశమునకు వరుస ట్టుచున్నారు.

విద్యాధరి.—[దేనిమీఁద నో బద్ధదృష్టియై అనాకర్ణితకముతో, భీత్యాశ్చర్యము తో] ఆదేమి ఆర్యపుత్రా? ఒకతలకాయను పొడుగుపాటి వెదురుగడకొనకుఁ చ్చి, ఆగడ నొకబండిలో నాటి ముందు నడపించుచున్నారు!

విద్యాధరుఁడు.—అది మనవిద్యవలనఁ దెలిసికోఁ పలసియున్నది. [ఆలోచించి] యీరాజును కొనిపోయిన వలీఖానుని తలకాయ, యుగంధరదేవుని తంత్రము న దేహమునుండి వేఱయినది. "చాకలిని గొనిపోయిన వలీఖానుసర్దారునితల" అని కొంచెము క్రింద పటమున పెద్దయక్షరములవ్రాత యున్నది చూడు.

విద్యాధరి.—ఆహా! యుగంధరా!

విద్యాధరుఁడు.—చూడు ప్రేయసీ, దానివెంట నగరప్రవేశ వ్యూహమును, ము భేర్యాదివాద్యములు, గుఱ్ఱపుదండు, మరల వాద్యములు, కాలిదండు. ఆహా! మి యావాద్యముల వీరరసోద్బోధనము!

విద్యాధరి.—ఆర్యపుత్రా, నాకు చెవుల కమృత మైనను, హృదయమునకు ముగా నున్నది.

విద్యాధరుఁడు.—చూడు, చూడు, వెంట బజంత్రీల మహాశకటములు, వెంట వారాంగనా శాలాశకటములు.

విద్యాధరి.—ఏమి యావాద్యనాదామృతము! ఏమి యానృత్యోత్సవము!

విద్యాధరుఁడు.—వెనుక పేరిగానికంకరగాడిద, వానిచుట్టు చాకలిపటాలము.

విద్యాధరి.—వీనికి పట్టినది యోగము!

విద్యాధరుఁడు.—వెనుక మహాశకటంబున అల్గోజా, సుతి, మృదంగాదికము, వారాంగనానృత్యములు.

విద్యాధరి.—ఈ దూరశ్రవణమునకు ఆనాదములు చల్లఁగా నిద్రగొల్పుచున్నవి.

విద్యాధరుఁడు.—వెనుక తురుపులు.

విద్యాధరి.—ఆ వెనుక అష్టగజపుష్పకము.

* రెప్పపాటు లేనిచూపుతో. † జన్మము.

విద్యాధరుఁడు.—ఆ వెనుక అన్నియు విలోమముగా యథాపూర్వము, చాకలి తక్కువ. చివర ... [అనఁగానే సగములో,

విద్యాధరి.—చివర ఏమిది! తాటిచెట్టునంతమానిసిని బండిలోఁ నిలువఁ బెట్టినారు!

విద్యాధరుఁడు.—ఖుస్రూఖాను దేహము, నాలుగుమాసముల క్రింద ఢిల్లిలో వీనిని వలీఖానుఁడు తల కొట్టినాఁడు.

విద్యాధరి.—ఇదియు ఆ యుగంధరుని తంత్రమే ?

విద్యాధరుఁడు.—అవును.

విద్యాధరి.—మఱి ఆర్యపుత్రా, ఆ యుగంధరుఁ డెక్కడ ?

విద్యాధరుఁడు.—[కలయఁ బరికించి] వాఁడుగో, ఎవ్వరు లేని యూరు బయటి రథ్యలో ఏకాకిగా గుఱ్ఱముమీఁద కోటకు పోవుచున్నాఁడు.

విద్యాధరి.—ఇతని మార్గములు దుర్బోధము లార్యపుత్రా.

విద్యాధరుఁడు.—ఓహో ఊరేఁగింపు కోట చేరినది.

సీ. రాజవీథిని జూను [1]రాజీవగంధి, యా [2]కంపాతముల తత్తఱంపు సొంపు,
[illegible] క్రిక్కిఱిసిన [illegible] మొగ్గరములు,
[illegible] చూచువారికనువిచ్చు విలసనల్కలికివగలు,
[illegible] ల్గురియు హొయలు.

తే. [illegible]
[illegible]
[illegible]
[illegible]

[illegible]
[illegible]
[illegible]
[illegible] లెనయే ?

[illegible] 2. [illegible] గవంటి దేహములు
[illegible]

సీ. నారక [1]ఘర్మబిందుపు లవారిగ నొక్కట రాల, డ్రెచ్చి వే
హారపుటాణిము త్తెము లహంయుత నోయన రాల, గైశ్యపుం
జారుసుమాళి రాల, గడసారికి వేపథు వాప్రమత్త కా
చారపులాజదోసిటిని జాఱిచి మానముఁ గాచెఁ గోమలీ. ౧౪

క. [1]అస్త్రోకము లెద ముడి యిడి,
[2]లాలస దారంబుగా, [3]నిలాపతిమేనఁ
గీలించి, మదనుఁ డాడెడు
గాలిపడగ లైరి పౌర కాంతలు తరుణీ. ౧౫

విద్యాధరి.—ఆర్యపుత్త్రా! నీచూపు నేమి అక్కడ గ్రుచ్చివై చితివి? ఓహో! ...హాడ కనుచున్నావా? [ఊఁపి] స్పర్శముకూడ? [కని] అహో! ఏమారూపము! ...పతిమీఁది యామనోభావము! ఆర్యపుత్త్రా, [అని విద్యాధరుని ఊఁచుచు] ఆ ...లోని యాయేక వేణీధరను రాణిని శర్వాణిని కనుచున్నావు; నీయోగ్యతను ...! తెల్పెదనులే.

[అని లాగును.

విద్యాధరుఁడు.—అబ్బ! ఏల నన్నట్లు లాగితివి! [విద్యాధరి మఱియొక వైపు ...మను.] ఇదిగాక మఱి ఎవరు నన్ను లాగినవారు? [కలయంగని] నీబుద్ధిమాత్రమే ...! రాజును జూచుచున్నావు! పుష్పకము దిగి, మేడయెక్కి పరివారమధ్య ...డై రాజు నీకు నేత్రోత్సవ మొసంగుచున్నాఁడు! మఱి యిటు చూడవా? ...ములు పోయినవా?

[అని విద్యాధరిని ఊఁపును. విద్యాధరి అనాకర్ణితకముగా అట్లే చూచును.]

విద్యాధరుఁడు.—పరివారమునకు సెలవిచ్చి, రాజు, ప్రతీహారి దారి చూప, ...ప్రమునకుఁ బోవుచున్నాఁడు. అతఁడు దృష్టిపథము దాఁటినపిమ్మట నైన దీనికి ...య్యము రాదేమో చూచెద. ఆహా! రాణి శర్వాణి సబాలగా ముమ్మడమ్మ వెంట

౧౪.—1. చెమట. అహంయుతన్ = పోటీచేత. కైశ్య...లి—కేశసమూహ ...యందు మయిన పువ్వుల సమూహము. వేపథువు = వడఁకు. ఘర్మబిందువు ...రాలుట లాజలు రాలుటగా నితరుల కగపడె నని భా.

౧౫.—1. చూపులను. ఎదన్ = హృదయమును. 2. మిక్కుటంపుఁగోరిక. ...రాజు రెండుకన్నుల రెండుచూపులును హృదయంబు ననునీమూఁడును మూఁడు ...కొనలుగా ముడివేయఁబడినవి. కోరిక పొడుగుపాటి సన్ననిపురిదైనది. కోరికతో ...యున్న యా నగరి స్త్రీలు గాలిపడగ లయిరి; మన్మథుఁడే ఆగాలిపడగలను రాజు ...మునకు (ఇంటిచూరునకో నిట్టాటికో కట్టినట్లు) కట్టిపెట్టి చిత్రము చూచుచున్న ...డు.—ఎల్ల స్త్రీలును కోరిక మీఱ రాజునే చూచుచుండి రని తా.

రాజుకడకు వచ్చినది. ఆ యేకవీరుఁడు యుగంధరుఁడును రాజుతో నున్నాఁడు. ఇదే యిట్లే చూచుచున్నది. [అని విద్యాధరికన్నులు మూసి] రాజునకు ముత్తయిదువలు ఆరతి యిచ్చుచున్నారు.

విద్యాధరి.—[కొంచెము సేపటికి] చేతులు త్రోసి, ఏమి ఆర్యపుత్రా? నా కన్నులు మూసితివి?

విద్యాధరుఁడు.—ఎందులకా! గౌరి యెదుట నే చెప్పెదనురా నీయోగ్యతను.

విద్యాధరి.—[చింతించి, స్మరణ మభినయించి] నీయోగ్యతను నేను చెప్పెదనురా శాంభవితో.

[అని శర్వాణిని వి-డును, రాజును వి-రియు చూచుచు నిష్క్రమింతురు.

---

## స్థలము 4. నగరు.

అంతట రాజు, యుగంధరుఁడును, రాజమాత, ఏక వేణీధర రాణి, బాలుఁడును ప్రవేశింతురు.

రాణి.—[ఆత్మగతము] నిద్రలోఁ గానియెడల నాప్రాణేశ్వరు నెవరు వంచింపఁగలరు? ఆహా! ఎంతకాలమున కార్యపుత్త్రు లీకన్నుల కగపడుచున్నారు!

యుగం.—[రాజును కేలఁగొని రాజమాత కప్పగించి] అక్కగారితో నాపలికినమాటను జగదీశ్వరుఁడు నెఱవేర్చినాఁడు.

[రాజు తల్లిపాదములకు ప్రణమిల్లును.

ముమ్మ.—

ఉ. నాఁడు మహేశ్వరుండు కరుణాపరతన్ వర మీయ బ్రాఁతియై
పోఁడిగ నాదుగర్భమునఁ బుట్టితి వంటది బొంకు సుమ్మికన్,
నేఁడు యుగంధరప్రభుఁ డనిద్రకృపన్ వర మీయ బ్రాఁతియై
పోఁడిగ నాదుగర్భమునఁ బుట్టితి వంట నిజంబు పుత్త్రకా. ౧౬

వత్స, చిరంజీవ.

రాణి.—జయము మార్యపుత్త్రునికి.

[అని రాజుపాదముల పువ్వులు చల్లి కన్నుల నద్దుకొనును.

రాజు.—ప్రేయసీ, వారిపాదములకుఁ బ్రణమిల్లుము, వారుచేసిన సౌభాగ్యవతివి.

[రాణి యుగంధరుని పాదములకు ప్రణమిల్లును. చేటి పువ్వులు ముత్తెములు బంగారపుఁ దట్టలో తెచ్చి యుంచును. రాణి వానిని దోసిళ్లఁగొని యుగంధరుని పాదములఁ బోయును.

బాలుఁడు.—నాయనగారిపాదాలకు నమస్కరిస్తున్నాను. [ప్రణమిల్లును.

రాజు.—చిరంజీవ. నాయనా, తాతగారి పాదములకు నమస్కరింపుము.

[బాలుఁడు యుగంధరుని పాదములకు మ్రొక్కును.

యుగం.—వత్స, చిరంజీవ.

[రాజు బాలుని అంకమునఁ గూర్చుండఁ బెట్టుకొనును.

బాలుఁడు.—బాబయ్యగారూ, తాతయ్యగారుకూడా. అప్పుడు నేనూ, అమ్మగారూ, అవ్వగారూ, అందఱంపోయి అడిగినప్పుడు తమదర్శనం మాకు కలగజేశినారు.

రాజు.—నాయనా, వారు సెలవిచ్చినప్పుడుగదా నీవుదర్శనము చేయవలసినది?

బాలుఁడు.—అవును.

సుమ్మ.—తమ్ముఁడు, అప్పుడు గాదంటివి. ఇప్పుడు చెప్పుము, నీఋణమును [illegible] మెట్లు తీర్చుకొందుము ?

రాజు.—అమ్మా, తీర్చుకొనుట యెక్కడిది? జన్మజన్మమందును,

క. వారే రక్షకులుగ మన
మే రక్ష్యులముగను నిట్టియిడుమలు మనకుం
జేరక యుండఁగ నీశ్వరు
నారాధింపంగవలయు నమ్మరో సతముం ౧౭

బాలుఁడు.—మనము తాతగారిని ఇలువేల్పుగా గొలవవలశిందిగదా.

రాజాదులు.—బళిబళి, పుత్త్రికా! [అని వానిని ముద్దుగొనుదురు.

యుగం.—అక్కగారూ, మనకు పరస్పరము ఋణానుబంధములు తీఱఁ[illegible] గదా.

మువ్వురు.—[కేలు మోడ్చి] మాకు వర మిది.

రాజు.—నాయనా, నీవుకూడ చెప్పుము.

బాలుఁడు.—[కేలుమోడ్చి] మాకు వర మిది.

యుగం.—ఇఁక మీరు సుఖం బుండుఁడు, నేను మిగత యేర్పాట్లు విచారించి [illegible]మెద.

[అని లేచును. ఇతరులు నిష్క్రమింతురు.

యుగం.—[పరిక్రమించుచు సవిమర్శము] ఏర్పాటులన్నియు తమ్ములు జరిపి [illegible] యెదురుసూచుచుందురు. [సోపానావరోహణము నటించుచు పరిక్రమించి] వీరు [illegible]తమ్ములు, చెకుముకియూ. ఓహో! చాకలియు, వేసడము పై ఆజ్ఞకై వేచియున్నాఁడు.

స్థలము 5 ఓరుఁగల్లు, వీథి.

అంతట చాకలి సపరివారముగా ప్రవేశించును.

పేరి.—[కేలుమోడ్చి] దండం సామే దండం !

యుగం.—సుఖ ముండు.

పరివారము.[కొందఱుకేలుమోడ్చి] యీయనకికూడా పూరేగింపు అయ్యిం! సామే. [కొందఱు తమలో తాము నవ్వుకొనుదురు.

యుగం.—మీరు వీనిని ఈ వేసడముమీఁద నే వీని యిల్లుచేర్చి, మేము వానిని తెచ్చి యిచ్చితి మని, మామాటగా వాని పెండ్లాము ఎల్లితో చెప్పవలసినది. పొండి.

పరి.—శిత్తం మహాప్పెబో.

యుగం.—[ఆత్మగతము] నేను నాతమ్ములంగలసికొని యింటికిఁ బోయెద.[పరికించి] ఓహో! వీరితో విశ్వాసరావుకూడ నున్నాఁడు. ఇతనిని వారముదినములు దేవోత్సవము జరిపి లెక్క రాజసభలో చదువు మని యాజ్ఞాపించెదను. [అని నిష్క్ర.]

పరి.—[పేరిగానితో పరిక్రమించి]యిల్లిదుగోయీడిల్లు,అల్లదుగోనిచ్చెనేసుకొని గోడమీద నిక్కి యెదురు సూస్తున్నది యీడిపెళ్లం.

[పేరి. నోరు తెఱచి ఆనందముతో చూచును. అందఱు పరిక్రమింతురు.

పరి.—యిక డిగవోయి సాకలి మారాజా.

---

స్థలము 6. పేరిగాని యిల్లు.

అంతట ఎల్లి ప్రవేశించును.

[ఒకముసలి చాకలిది ప్రవేశించి ఎల్లి ని పేరని కలయ నిలిపి ఎఱ్ఱనీళ్లు వారి మొగములపై దిగఁ దుడిచి పాఱఁబోయును. పరిజనులు పేరిగానితోఁగూడ కూర్చుందురు.

పరి.—ఎల్లీ, పెద్దమంతిరిగారు నీతోటి శెప్పమన్నారు.ఆరు పెద్దమంతిరిగారు యీణ్ని తెచ్చి నీకిచ్చినామన్నారు; మమ్మల్ని వొప్పగించమన్నారు. మేమొప్పగించినాం.

ఎల్లి.—దండ మామారాజుకి, ఆరి పేరు తలుసుకొంటా బదికున్నా న్నాయా. బతికొచ్చినావా మామా? ఏం కట్టపడ్డావో, మామా? మామా, కూడులేటావా? నీకోసంవొండి నీ కెట్టితినాలని కనిపెట్టుకూకున్నా. పువ్వులు, గందం, * వోసననీలు, † వోసననూని, రాణీగారు పంచిపెట్టించినారు.అన్నీ నీకోసం యెట్టుకొన్నా.

* పన్నీరు. † అత్తరు.

[అని తెచ్చి పువ్వులదండలు అందఱకు ఇచ్చును. చాకళ్లు కొందఱు మెడలో వేసికొందురు. కొందఱు జుట్టునకు చుట్టుకొనుదురు. ఎల్లి పేరిగానికి చుట్టును, పన్నీరు తెచ్చి అందఱకుఇచ్చును. చాకళ్లు దానిని త్రాగుదురు.

పేరి.—[పకపక నవ్వుచు] ఓరి యెట్టిమొకాల్లారా, అది మీద సల్లుకోటమే తాగటం గాదురా! [ఎల్లి అత్తరిచ్చును. చాకళ్లు జుట్టునకు పూసికొనుదురు.

పేరి.—[పకపక నవ్వుచు] అది గుడ్డలకి రాసుకోవటమేగాని జుట్టుకా యెట్టిమొకాల్లారా.

ఎల్లి.—నీకోసం అములునీలు కూడా తెచ్చినాను. లే మామా లే కూటికి. కూడా శేశినా. కులం వోళ్ల కంతా మాపటిక్కి యిందు శేతా మని అంతా శేసినా. అందటికి కూ డిక వొండిస్తా.

పరి. ముసలిదియు.—లేరా పేరయ్యా లేరా, తిండి తిను.పాపం! అది నీకోసం కతలు రామాండాలు పురాండాలు. [ఎల్లితో] తీసకొచ్చి యీడెట్టే.

[ఎల్లి కంచము తెచ్చి పెట్టును.

పేరి.—ఇదేం కూడే వోలే! నాకు ముంగటిమాటలే నోటికి రావటంలే. యిం *దూడపేడేని? †బట్టిపేడేని? అయి లేకుండా నాను కూడు తిన్ను.[సాగాయి యీనీలకి మొగం వోశిపోయినాదిరా. ఇయి మాత్తరం తాగేస్తా. మీరు అందురు కొంచెం నీ లుచ్చుకోండోయ్.

[ముసలిది పరివారమునకు ధారళముగా కల్లు సా రాయి పోయును. ఎల్లి పేరాయకు ఇచ్చును.

పరి.—దూడ పేడేంట్రా పేరయ్యా, కూడు తినక? బట్టిపేడేంటి?

ఎల్లి.—[ఆత్మగతము] మామ యెక్కువతాక్కుండా సూసుకోవాల.

పేరి.—ఈబాపన నాయాళ్ల శేతుల్లో బడి సచ్చినానురా నాయినా. ఎల్లంటే మన్నారు. ఒకపాలి మూడు రోజులంట సంపేసించినారు.

ఎల్లి.—ఓరు మామా? ఓర్ని మామా?

పేరి.—ఓరా, బాపననాయాళ్లు; నన్ను.

ఎల్లి.—తురకోళ్లు మామా.

పరి.—తురకోళ్లరా పేరయ్యా.

పేరి.—బాపనోళ్లే, బాపనోళ్లే, బాపనోళ్లేరా సాకలోళ్లలారా.

పరి.—నీకేం మతి పోయిందంట్రా!

* దూద్పేడా, † బర్ఫీ, అనునవి భక్ష్యవిశేషములు.

పేరి.—[మధ్యమధ్య త్రాగుచు] మీాబుద్ది గడ్డితినెల్లిం దంట్రా? బాపనోళ్లు బాపనోళ్లు. ఆళ్లు సంపేస్తామన్నారు, మూానాలు సంపేశినారు. నాకు దంజెం దేశి నారు. యీాపంతా గులగులే. అది బాపనో శ్లేసుకునేది దంజెం. ఆ దేస్కుంటే సచ్చిపోమా సాకలోళ్ల మేశ్? సీత్! అది కాదు మాట, సదువుకునోళ్ల మేశ్? సీత్! అదీ గాదు, మీాకు సదు వెక్కడిది? పోనీ, అద్దదీ అదీ నాబయ్యం. ఆళ్లని బాగా దేశి పించినా; ఆళ్లు లేసుంటే దంజెం తీశేవోణ్ని, ఆళ్లునూ_స్తే యేశేవోణ్ని. [నవ్వుచు ఎడమచేయి చూపి] యీాశేతిమీాద యేసుకోమంటే [కుడిచేయి చూపుచు] యీాశేతి మీాద యేసుకోవటం, సరదంగాలకాడ కొాయి ముందరికి తొాయ్యమంటే యెనక్కి తొాయ్యటం, బాగా యేడిపించినాన్రా.

పరి.—పేరయ్యా, ఏంట్రా యీాయెట్టిమాటలు, కూడుతిన్రా.మాకేం తెలటు లేదు, దంచె మేంటి, సరదంగా లేంట్రా, నీ మొకం?

పేరి.— మీాకు తెల్దు. యింకొంచెం నీ లుచ్చుకొండి అంతా తెలస్తది.

[అని నవ్వుచు త్రాగును. అందఱు నంజుళ్లతో త్రాగుదురు.

పరి.—శెప్పరా పేరయ్యా, నువ్వు యీాయెనిమిదిసెల్లు బతికినయిదం, గతికిన యిదం, సతికినయిదం.

పేరి.—యిదే యిదం,యిదం యిదే. నాకు యేమి దుస్తురా! యేమి నగలురా! అంతా బంగారం రతనాలే. యిందుకే ఆ మారాజుల్ని తలుసుకోవాల. తలుసుకొంటే గ_ప్తికొస్తారు. నన్ను దేసమంతా తిప్పినారు. నాను యెక్కడికెల్లినా వోంబాయి వోంబాయి, వోంబాయి.

ఒకఁడు.—సవారి మోయించినారంట్రా నీశాతకి?

పేరి.— బద్దరం, నాను మోయటమేశ్? నాకు మోయటం. కవడ్దాల్! నా సెక్కడి కెల్లినా యేనిగమీాదే. నాకు లచ్చలు లచ్చలు దండు పడాల్లు అంటారు దండమే. నాసెల్లినకాడంతా బేరీ, డంకా,నగరా, నౌపత్తు; యింకా యేం బేంటోరు మియ్యాబ్బనాడైనా మీా రెరుగుదురంట్రా !

[అని నవ్వును.

నారిగాఁడు.—ఈణ్ణొట్టు కెల్లినాడే ఆసాయేబుకి సలాములు శేస్తే సంకె ళ్లల్లో వున్నా యీా మొకం తవ కనుకు నాన్నడ్రోయ్. ఆయేనిగమీాద తురకపడాలు యీాడుకాళ్లు గుద్దతా వుండోడు గావాల.

[అని హేళనముగా నవ్వును.

పేరి.—[కోపముగా] మటి నాను శెప్పను. యీాతేమయినా నూసినాడా! నాను కాళ్లు గుద్దతా వుండగా యీాడు నూసినాడా?

మఱియొకఁడు.—లేదు లే, శెప్పరా శెప్పు. నారిగాడి కైపు కూతల్లే.

[నారిగాఁడు ఊఁగుచు లేచును.

పేరి.—గుడి గుడికీ యెల్లినా; నానెల్లిన సోటంతా చటకోపాలే.

నారి.—నీకోపం నన్నేం శేస్తదిరా? నాకోపా లెరగవు.

సుబ్బఁడు.—[కై పుతో] వోడికిరా కోపం?వోడికో శెప్పు, నాను సంపేస్తా.

కొండలు.—వోడికీ లేదురా సుబ్బా, కూకొని యిను.

సుబ్బఁడు.—నా క్కోపమొస్తే చటకోపం గాదు, చట చట చట చట సం. మూస్కో నాతమాసా. సచ్చిబతికొచ్చిన పేరయ్యమీదంట కోప మంట!

కొండలు.—శెప్పరా పేరయ్యా, మా కేమి తెలటం లేదు.

పేరి.—పెసాదాలు! పెసాదాలు! ఒకటి మరిశినా!

కొండలు.—యేంట్రా?

పేరి.—ఆ చటకోపం నంబాశార్లు అయ్యవోర్లవోరు,పూజారయ్యవోర్లవోరు బాజాలబుర్రమీ దెట్టేది. నాబుర్రమీ దెడితే నాను తియ్యొద్దని జగడమాడే శ్శు. [ఆత్మగతము] యీళ్లతో యేమి శెప్పినా నమ్ముతారు నాయాళ్ళు. [ప్రకా శ] దాన్ని నెత్తినేసుకొనే పెసాదాలు తినేవోణ్ణి. వొక తమాసా. యెందు వోరు నానెత్తిమీద * శెప్పు నూతాం నాయాళ్ళు?

శ్రోతలు.—మా కేం తెలటం లేదురా † శెప్పెందు కుంచోరో.

* నారి.—బుద్ది రావటాని కుంచినార్రా.

పేరి.—వోరికిరా బుద్ది రావటం?

నారి.—నీకుగాదురా.

పేరి.—ఆలా కూయి. మీరెనండ్రా; కైంకర్యం కైంకర్యం! నాను కైంక ర్యం శేయించరే? మానాశ్య లీలే? గ్యామా లీలే?

శ్రోతలు.—మాకేమి తెలటం లేదు, శెప్పు శెప్పు.

పేరి.—నామంగల బోగంవోళ్ళు ఆట్టం, నాకు దండం. వోళ్ళుగాని నాముం స్తే నాకు దండం. యెత్తే నాకు దండం.

శ్రోతలు.—మోము కాగడాలట్టి నూళ్లే? ఆయి నీకు నాకు యెట్టే దండాలు యి, ఆటలో యెట్టే దండ్యాలు.

పేరి.—మరైతే నాను శెప్పను.

శ్రోతలు.—శెప్పరా శెప్పరా, మాకు తెలటం లేదు.

పేరి.—యీపాలి నన్నెక్కిరించి నోణ్ణి యేనిగమీదినుంచి కిందికితోశేస్తా. వాడు, యీబాపన మారాజులు, యిందుకే ఆళ్లనితల్సుకోవాల, పేరిగా పేరిగా పెడ తింటావా?' అన్నారు.

* వచింపుము-అని పేరిగాని యభిప్రాయము. † శ్రోతలు కొండలు శెప్పనఁగా యనితలంచిరి. ‡ నారిగాఁడు శెప్పనఁగా పాదరక్ష యనితలంచినాఁడు.

కోడిగాఁడు.—దూడపేడకి తల్సుకోవల్సిందేరా! వవ్వా! యెట్టి బుద్ధి కెక్కిం దిరా!

మఱియొక శ్రోత.—ఊరుకోరా పలక్క కోడిగా.

పేరి.—[కైపుతో] నాను శెప్పనే శెప్పను. యీణ్ణి గెంటెయ్యండి

[ఇతరులు అట్లే చేయుదురు.

పేరి.—'అత్తినిపిస్తారా మారాజా నాశాత' అని నా నేడవటం, ఆళ్లు యెట కడుపు లాళ్ళు పిసుక్కొంటూ నవ్వటం.

కోడి.—వొకరి కడుపు వొకరు పిసికితే గదంట్రా నొప్పి తీస్తది. మల్లీ బ్యామ్మలంటావు. తురకోళ్ళురా, ఆళ్ళ తెలి యంతే.

సుబ్బఁడు.—నీ తెలివి కాలా సస్తార్రా ఆలా శేస్తే.

పేరి.—వవ్వా, వవ్వా, అల్లా శెప్పతో కొట్రా * నాయాలిని.

† కోడి.—ఎల్లీ, యీమద్దెని తన్నులు లేకుండా వున్నావు. రాయే, ఆన్నీ కో పాలే తిను.

నారి—దాన్నెందుకురా కొట్టటం? అదేం శేశింది?

పేరి.—వవ్వా ! వవ్వా ! నాదెర్ది ! నాదెర్ది !

ఇతర శ్రోతలు.—దూడపేడ తిన్నావా? శెప్పరా అది.

పేరి.—అదా? ఆబాపనో శ్లెట్టిందా? మరిశినారా. అవున్రా. ఆపాట్ని ఆళ్లు 'తిని సూడ్రా యెట్టివుండాకొడకా' అని నానోట్లో యేశినారు. పెద్ద కంచు యెట్టించోరు మారాజులు! ఆకంచానికి ఆ శ్లెట్టిన కూటికి ఆళ్లని బతికినన్నాళ్లు తల్సు కోవాల.

కోడి.—దూడపే డెట్టినందుకు మాత్రం తిట్టాలా.

పేరి.—దూడపేడకే తల్సుకోవాలా.

కోరి. నారి.—వవ్వా వవ్వా, యెట్టి బుద్ధి కెక్కింది! యలా తిన్నావురా శెప్పు!

పేరి.—యిదుగో శెప్పతా యిను సాకలినాయాలా. [నవ్వుచు] దూడపేడ యిరవకుండా కాలిస్తే ఆయెలిబూడి దుంటదే ఆలా వుంది. పచ్చిది గాదు గదా అను కొన్నా. యెలిబూడిద తిన్లేను మారాజా అని యేడిశినా.

ఒకఁడు.—ఆయెనక ఆయెనక ?

[అని కైపుచే పడి, వక్త పలికినప్పుడు పలుకు నప్పుడునుంగూడ, చాలసేపు ఊఁకొట్టును.

పేరి.—ఆయెనక రవ్వంత నోట్లో యేస్కోమన్నారు. కొంచెం గ్లిసేసు కున్నా! మఱియింక నారంగా! ఆ తీపి నా నేమిశెప్పదును! నోరంతా మసమస

---

* 'నాయాలిని' అని పేరయ్య కోడిగానిని తిట్టినాడు. † 'నాయాలిని' అన్న మాటకు 'నాభార్యను' అని కోడిగాడు హేళనమునకై పెడయర్థము చేసినాడు.

...ళ్లంతా మదనం, పల్లంతా మదనం. కల్లు శెవులు ముక్కంతా మదనమే. ఆళ్లకి ...దారెట్టి, అదంతా తిన్నా. తిని ఒక తమాసా శేశినా.

ఒకఁడు.—యేంట్రా ఆ తమాసా?

శేరి.—'మారాజా దూడపేడే యింతమదనమే, ఆవుపేడ, ఎద్దుపేడ, బఱ్ఱి ...దున్నపోతు పేడ, అన్ని యెట్టండిసామే, మీకు దండా లెడతా. నాకు పేడే ...ట్టండి కూడొద్దు,' అన్నా. ఆరు సాకలోడికి యియ్యన్నీ యెడతామా, అని బఱ్ఱి ...మాత్రం యెట్టోరు, నాను తినోణ్ని. పేడ లేని కూడు నాను తిన్ను.

[ప్రష్ట కన్నులు మూసికొని ఊఁకొట్టుచు పడిపోయి మరల మరల ఊఁకొట్టును.

కోడి. నారి.—యెల్లీ, నూకూడా యీదిలో కెల్లి యింత పేడతెచ్చి యెయ్యే ...టిముండకొడుక్కి; నీకు దండ మెడతాడు, కూడు తింటాడు.

శేరి.—ఆ! ఆ! ఆ! నన్ను యెట్టిముండకొడు కంటావు? సాకలి నాయాలా! ...కొట్టా? ఓరనుకొన్నావ్రా? నాను పెత్తాత దురద మగారాజుని, పెత్తాదదురద ...రాజు ననుకో. బద్దరం! బద్దరం! కవడ్దాల్!

కోడి.—మటినానో, దోనెకడుపురాకాశి ననుకో. బద్దరం!బద్దరం! కవడ్దాల్

నారి.—గాడిదమీ దెక్కిస్తే యీడు మాగొప్పనుకొన్నాడ్రా. నానైతే ...తాటాకు కూడా కట్టించుకోనా, బోగవమ్మవోరిలాగ ?

కోడి.—నాను బుఱ్ఱి డెక్కించుకొని సున్నబొమ్మట్లు పొడిపించుకోనా సన్నా ...య్యలాగ ?

సుబ్బ.—నా రుమాలు యెంక డెత్తు కెల్నప్పుడు నాకోపాలి గాలేదా యీ ...మానీ? మీయబ్బతోడు మీకొస్తదా! [ఇద్దఱు పడిపోదురు.

కోడి.—నాను గోనెపట్టకికూడా సలవ శేస్తా, యీణ్ని శెయ్యమను నూతాం!

నారి.—నాతో చరిగా సున్నం శెయ్య మను వోడు శేస్తాడో.

సుబ్బ.—నాను కొటంరెడ్డిని బద్దరం.

కోడి.—నాను పోతరాజుని బద్దరం. కవడ్దాల్.

నారి.—నానైతే యీలాంటిదానికి కోదండంతియ్యించుకోనా సదువులయ్య ...లాగ ?

ముసలిది.—నా నోట్రా? నాను పోలేరమ్మను గానా? యెల్లండ్రా, యెల్లండి, ...గోటులం జెకొడుకులు, యింటి కెల్లండి. పేరయ్యా, నూ లోనికి రారా, యీ ...పాప్పని తలువేస్తా.

శేరి.—నూ పొలిమేరమ్మ వైతే పొలిమేర కాడికెల్లు. నాను రాను.

ముసలిది.—రాయే యెల్లి, యీణ్ణి తీసకెల్లి తలు వేశేతాం,

పేరి.—మీయబ్బతోడు మీ వొల్ల గాదు.

అనాములు.—రండ్రా యెల్దాం, గాడిది తంతే పశ్రాలిపోయినయి.

కోడి.—నాకోట్ట పమొస్తే వుదకటం చణం, గుడ్డంతా నూలంతా పీసుపీసై యెగిరిపోవటమే, మరి కంతా నాశాత నిలవటమే.

నారి.—ఈపాలి నన్నో డైన దోనెరాక శంటే, ఆ అన్నావోణ్ణి రేవుల్లో కడవలు బాన లన్నీ తెచ్చి నెత్తి నేసి కొట్టొకంటా,

[అని కోడి. నారి. సుబ్బ. నిష్క్రమించి, నేపథ్యమున కీకర శాకర కీకర శాకర అని జగడమాడుచు మరల ప్రవేశించి తొలఁగుదురు.

ఒకఁడు.— పేరాయయెట్టి కొండాయయెట్టిగా నే వుందిరా!

అందఱు.—వవ్వా! కొండాయా!

[అందఱు ప్రక్కప్రక్కను ఎదురెదురుగాను నిలిచి ఒకరిముఖము ఒకరి ముఖమునకు తగులఁనట్లుగా చేర్చుచు మహా వికృతహాసములతో, నేత్ర వికాసములలో, మహాభినయముతో వికట నృత్యముతో పాడుదురు.

రైకా నూశి మోగించినదు రాసావోరి పదును,
ఆ రాసావోరి పదును,
ఆ రాసావోగి పదును,
ఆ రాసావోరి పదును,
కోకా నూశి మోగించినదు గోసాసింగు పదును,
ఆ గోసాసింగు పదును,
ఆ గోసాసింగు పదును,
ఆ గోసాసింగు పదును.
గోడా గోడా దాన్నే గీశి గూబాల్యా నూశినదు,
ఆడు కొంగాల్యా నూశినదు,
ఆడు కోడ్యాల్యా నూశినదు,
ఆడు కోత్యాల్యా నూశినదు.
కూ డో గ్గేశి నీ లా గ్గేశి కొండాడు యెల్లినదు,
ఆ కొండాడు యేగినదు,
ఆ కొండాడు సాగినదు,
ఆ కొండాడు సచ్చినదు.

[అని నిష్క్రమించి, నేపథ్యమున దానినే పాడుచు తొలఁగుదురు.

ముసలిది.—కూడు తినవా పేరాయా?

పేరి.—[అందఱు లేచిపోయిన పిమ్మట ఉన్నట్టు భావించి] ఒకపాలి నామీద బ్యాష్ముడు 'సలవమడతల' కయిత్తం శేశినాడు. ఆయనకి అచ్చరకో ట్లిచ్చినా.

ఎల్లి.—వోరికి మామా శెప్తావు? ఆళ్లెల్లి పోయినారే.

ముసలిది.—వోరికిరా పేరాయా శెప్తావు? ఆట్లు లేరే.

పేరి.—యెక్కడి కెల్లినారే? మీసాకలికళ్ల కవుపడకుంటే నామారాజుకళ్ల కవుపడరంటే? యినంద్రా మీరు. ఒక తంజావూరాయన పాటాయన నాగాడిదిలాగే పాడినాడు, ఆయనకి అచ్చరకోట్లు వొరా లిచ్చినా.

ఎల్లి.—ఇదేమి యెట్టి మామా?

పేరి.—యినంద్రా మీరు. బోగమోరిపిల్ల ఆడింది. దాన్ని నూశి నా నికిలించ బు, నన్ను నూశి అది యికిలించటం. యినంద్రా మీ రినండి.

ఎల్లి.—కూడుతినవా మామా?

పేరి.—యెల్లీ, యీణోయించ గల్తువా?

ఎల్లి—యీణేంటి యీణ?

పేరి.—[ఆత్మగతము] దీనికి తెల్నికుండగా సడసమాడతా. [ప్రకాశము] మురికి ఇకే కంపెల్లివి, యింక నాకు నువ్వు పనికిరావు, నా నెల్లిపోతా; పెత్తాతదురద మారాజుకేంటి కంపెల్లి పెళ్ల మేంటి? [ఆత్మగతము] యీముసలి దెల్లిపోయినాక సమని శెప్పేస్తా.

ఎల్లి.—యెనిమిది నెల్ల మట్టీ నీకోసం యేడుస్తావుంటే యేమి మామా యింటి కొచ్చికూడా యీ యెట్టి! అయ్యో నారాతా, నీకు దండ మెడతా మామో!

[అని పాదములకు మ్రొక్కును.

పేరి.—[కనికరముతో] ఒలే లెగే లెగే. యిన్నాలు, యెన్నాలో నాకు తెల్దు, సం నా నేడిశింది నీకు తెల్సునాశి అంతా మాపటికి శెప్తాలే. ఇయ్యిగో నీశేతి వారాలు. [అని తన చొక్కాజేబునుండి వరహాలు తీసి దానిచేతఁబోసి] ఎల్లి బట్టిపేడ, కొనుక్కురా. పెత్తాతదురదమగారాజుని, అయి లేకుంటే కూడు తిన్ను. నానెల్లి యీపాగాతోటి యీకుడతాలోటి వూరంతా నూస్తా.

[అని నిష్క్రమించును.

ఎల్లి—అవ్వా, యిల్లు కొంచెం నూస్కుంటావా? మామని పిలుసుకొస్తా.

ముసలిది.—నా నెల్లి మల్లీ వొస్తా! యీళ్లని యీదిలోకి పట్టి యెల్తా.

ఎల్లి.—పట్టు మతి. [అని ఇరువురు ఒకనిని కాలుసేతులు పట్టి మోచుచుపరిక్ర.

ప్రథముఁడు.—ఏమీ తెల్దు, శెప్పు శెప్పు.

[మరియొకని అల్లే కొనిపోవుదురు.

ద్వితీయుఁడు.—పెత్తాతరాజంట, అవును రాజేరా. [వానిని అన్వేషింప నిష్క్ర

ముసలిది.—నా నెల్తా. [అని నిష్క్రమించుచు.

ఎల్లి.—[తలుపు వేయుట నభినయించి పరిక్రమించుచు] శివశివా! ఏమి నారా తా! దూడపే డేంటి? బర్రిపే డేంటి? నామామో! నామామో! యెర్రెత్తినా వింత వంతుడా! గవరమ్మతల్లీ నాను నోసుకొంటే నా మామని తెచ్చియిచ్చినావు గంగా, యెర్రికుదిరిస్తివా నాకు పెద్దమంతిరిగారిచ్చిన నగలన్నీ నీకు నిలువుదో పిస్తాత అమ్మతల్లీ. యిదే మొక్కు. యిదే ముడుపు. మా మెక్కడికెల్లి నాడో తెలదు. [ఆలో చించి] మంతిరిగారితో శే యెల్లి చెప్పుకొంటా. మారాజా 'సేమంగా తెప్పించిస్తా మని నాకు వొర మిచ్చి యెర్రోణ్ణిచ్చినారు సామీ' అని మొర్రెట్టుకొంటా. ఆ మా రాజు శేమయినా మంచూ మంతరం శేయిస్తారు. [అని నిష్క్రమించుచు.

---

# దశమాంకము.

---

స్థలము: ఓరుఁగల్లు, ప్రతాపరుద్రమహారాజు నాస్థానము. ప్రతాపరుద్రుఁడు, అన్నమదేవుఁడు సురత్రాణుఁడు, వజీర్లు, జనా ర్దన విద్యానాథ చెకుముకులు, నరసింహరాయలు, విశ్వాస రావు, బహుపరివారముతో ప్రవేశించి యుపవేశింతురు. వేశ్యలు వీవనలు వీచుచుందురు.

రాజు.—తమ్ముఁడా, కటకముగతి వివరింపుము.

అన్నమ.—

చ. కటకనరేంద్రు బల్లహునిఁ గాలునిచుట్టము గాఁగఁ బుచ్చితిర్,
బటుకృప వానిపుత్త్రునికి భండికిఁ దండ్రిధరిత్రి నిచ్చితిర్,
కటకము వట్టికుండగ నగణ్యము రత్నచయంబు దెచ్చితిర్,
నిటలతటిర్ భవచ్చరణనీరరుహంబులఁ జేర్ప వచ్చితిర్.

రాజు.—బాహుశాలికి నీ కలవి గాని దేమున్నది? తమ్ముఁడా, నీరాకవలని తనివి మన క్రొత్తమిత్త్రులు సుల్తానువారు తరలినచింతచే నంతరిత మగుచున్నది.

అన్నమ.—మనయందు సుల్తానువారు మతి కొంచెము మైత్రి యుంచరా



దా! మాకైన వారి సాంగత్యము రెండు గడియలే గదా?

రాజు.—నిర్బంధము చేయఁగూడదు. ఏ మది విశ్వాసరావు ?

విశ్వా.—మహోత్సవవ్యయముల వివరము.

రాజు.—ఉత్సవముమీఁద ఉత్సవము వచ్చియున్నది; మొత్తములు మాత్రము చెప్పుము, చాలును.

విశ్వా.—స్వస్తి.

ఉ. కోటిసువర్ణము ల్బుధులకుఁ, శతకోటి మహీసురాళికిఁ,
గోటి గజాశ్వధేనువులకుఁ, బది కోటులు సైన్యపాళికిఁ,
కోటి వృషోష్ట్రపక్షులకుఁ, గోటి మెకాలకు, జాగిలాలకుఁ,
గోటులునూఱు పేదలకుఁ, గోటులునూఱు నియుక్తకోటికిఁ. ౨

సు.—మీఘౌలత్ కాలీఫ్ హరూనల్ రషీద్ వారికివుండింది తోస్తుంది. [ఆత్మ గతము] ఖట్కాం పట్టినారు. ఢిల్లీ మీదికికూడా వస్తారువాలా తోస్తుంది. దచ్ఛిణఖాండం అంతా వీరికీ స్వాధీనంవుంది. మా రాజ్యంకంటె వీరిదే యెక్వా. వీరిచేయి యేలాగా తప్పించుకొని పోతాం? [ప్రకాశము] మహరాజ్, మేఘంచాటులో ఘూర్యుడు వున్నాడు, కింద అంతా ఆయనప్రకాషం వుంది. ఆయన కంటికి హగ్పడను. ఆ రాగా వున్నార్ మీబడామంత్రి యుగంధర్ వారు. వారికి మాకన్నూతో చూడ వలా కోర్తాం.

రాజు.—అవశ్యము. మహామంత్రిగారు విజయంచేయు సమయమే. వారు వచ్చు టకు మాతమ్ములు వచ్చిన యీ మహోత్సవమున సుల్తానుభాయిగారి ప్రయాణ మంగ ళముగా రవంత మేజువాణి కానిత్తుమా ?

సు.—చిత్తం కానియ్యండి.

[అంతట వేశ్యాంగనలు మేళమున తౌర్యత్రికము జరుపుదురు.
“నిన్నుఁగని మెన్నుకొను” (96-వ పుట చూ).

ప్రతీ.—ప్రవేశించి జయము జయము జగదీశ్వరులకు. మహా మంత్రిగారు వచ్చుచున్నారు.

[అని నిష్క్రమించును.

[నేపథ్యమున దూరముగా]

ఓంభాయి, ఓంభాయి, ఓంభాయి, ఓంభాయి; పొడు, పొడు, పొడు, పొడు; తీ దీ, దీ, దీ; తీ పొడు, తీ పొడు.

[వాద్యములు మ్రోఁగును.

రాజు.—[సుల్తానుతో] మామంత్రిగారు వచ్చుచున్నారు. మా వాద్యములు చేయు వారిని తెచ్చినవి.

సు.—మీ మంత్రిగారికి వంతా గౌరవం వున్నా సరె వుంటుంది.

[నేపథ్యమున దగ్గఱఁగా.]

పొడు పొడు పొడు పొడు, దీ దీ దీ దీ, తీపొడు తీ పొడు.

[వాద్యములు మ్రోఁగును.

రాజు.—మన మెదురువోయి వారిని తోడ్కొని రావలయును.

[అందఱు లేచి ఎదుర నడతురు. యుగంధరునితో అందఱు మరలి వత్తురు.

రాజు.—[యుగంధరునితో] కూర్చుండుఁడు. [అని ఆసీనుం జేసి ప్రణమిల్లును.

యుగం.—సర్వాభ్యుదయోఽస్తు.

ఉ. శ్రీ యెసలార మెట్లబడిఁ ద్రిక్కిఱియంబడి నిల్చి, గద్దియఁ
డాయు *కిరీటిసంఘము తడంబడి యొక్కట నీకు మ్రొక్కఁచోఁ,
†దోయధివీచికాపటలిఁ ‡ దోరవుభోగ ముఱఁ సరత్నముల్
వేయితలల్ మణుంచుకొని విష్ణుని మ్రొక్కననంతుఁ బోలుదఁ.

[అన్నమదేవుఁడు యుగంధరునికిఁ బ్రణమిల్లును.

యుగం.—సర్వాభ్యుదయోఽస్తు

ఆ. నూఱు వత్సరము లనూనభక్తిరసాన
నింద్రు సుఖితు నల యుపేంద్రుపగిది,
నన్నమావనీశ, యనపాయ లక్ష్మీశ,
కొలువు మన్న నన్న, కోర్కు లలర.

[అందఱు కూర్చుందురు.

విశ్వాసరావు, అన్నమదేవమహారాజువచ్చిన యీమహాశుభమున ఇంకొక వారము కచ్చేరీలకు సెలవులు, మహోత్సవములు, చాటింపించి జరిపింపుము.

విశ్వా.—మహామంత్రిగారి యాజ్ఞ.

రాజు.—తమ దర్శనము కొఱకు కనుపెట్టుకొని యున్నారు సుల్తాను గారు. నిజనగరమునకుఁ బోవ త్వరపడుచున్నారు.

సు.—సలాం యుగంధర్ మహామంతిరిగారికి.

యుగం.—సలాం. మాయింట ఆఱుమాసము లయిన నిలువక ఆఱునిమేషములకే విసివిరా సుల్తాను వారు ?

*కిరీటము C-0 Jangamwadi Math Collection. Digitized by eGangotri ...రాజులయొక్క. †కడలియలలసమూహమందు. ‡గొప్ప దేహమా.

సు.—తమరు చేసే సత్కారం, గౌరవం, మర్యాదావల్ల యావజ్జీవం మీఘ
...మే మాకీ యిష్టం. అయితే పోవడాన్కి కోరడాన్కి కారణాన్కి మహా
...గారు యెరుగుదురే యెరుగుదురు. దయా వుంచి శెలవు దయచెయ్యవాలా
...ము.

యుగం.—ఇట్టి వారిని నిలిపిన, వారికి వారికై యువ్విళ్లూరుచుండు వారికిం
...సాప రాధుల మగుదుము. వా రెచటనున్నారో నిజనగరమున దెలియదు.
...వున వారిని పంపుట యుచితము.

[కంచుకి బాలుని తెచ్చి రాజుచెంత నిలిపి పోవును, బాలుఁడు ప్రతాపరుద్రునికి అన్నమదేవునికి యుగంధరునకు ప్రణమిల్లును. అందఱు 'వత్స, చిరంజీవ' అని ఆశీర్వదింతురు.

సు.—వీరు చిన్న ప్రతాపరుద్రమహారాజావారా ?

అన్నమ.—ఆవును.

సు.—సలాం చిన్న ప్రతాపరుద్ర మహారాజావారికి.

బాలుఁడు.—సలాం ఢిల్లీ సుల్తాన్ వారికి.

రాజు.—నాయనా, యిప్పు డిక్కడికి నీవు వచ్చినపని యేమి? పిలిపింపకయే ...స్తివి ?

బాలుఁడు.—చిన్నాయన మహారాజుగారు కటకమునుంచి విజయం చేసినా ...విని వారిని సేవించుకొనడానికిన్ని ...

రాజు.—ఇంక నేమి ?

బాలుఁడు.—ఢిల్లీ సుల్తానువారు ప్రయాణమని వారిదర్శనము చెయ్యడానికిన్ని.

అందఱు.—బళి బళి బళి బళి!

సుల్తాన్.—బలే బలారే! తుపాకికడుపున పిరంగి! చిన్న మహారాజావారూ, ...స్నేహితులు ...

బాలుఁడు.—'మీ' అంటా రేమి? భాష బాగా రాదా ?

సభ్యులు.—బళిబళి! అట్లు పుట్టుకలో రావలయుఁగాని తెచ్చుకొన్నవచ్చునా!

సు.—వహావ్వా వహావ్వా! బలే! పొరబాటు; పొరబాటు మన్నించండి. ...స్నేహితులు ఢిల్లీలో వున్నారు చిన్న సుల్తానువారు.

బాలుఁడు.—చాలా సంతోషం.

కంచుకి.—[ప్రవేశించి వజ్రహార మొకటి రాజుచేత నిడి] జగదీశ్వరా, అమ్మ...రు ఈవజ్రహారమును మహామంత్రిగారికి చాకలిని తెచ్చినందులకు, ఢిల్లీ సుల్తానును ...తెచ్చినందులకు, వలీఖాన్ తలను, ఖుస్రూఖాన్ దేహమును, తెచ్చినందులకును, ...బహుమాన సూచకముగా పంపినారు. [సుల్తాన్ తలయూఁచును.

రాజు.—[దానింగొని పరికించి] అమ్మగారియాజ్ఞ శిరమున నవతంసించితిని! ఆహా వర్ణరూపమున విరచితము! ఏమి పావనవర్ణములు!—

"త్రైలింగరాజ్య సింహాసన సంస్థాపక,
ఢిల్లీసురత్రాణ బందీగ్రాహక,"

[అని చదివి లేచి హారమును యుగంధరుని మెడను వైచును.

సభ్యులు [తురకబుదప్ప]—జయ జయ త్రైలింగ రాజ్య సింహాసన సంస్థాపక, ఢిల్లీ సురత్రాణ బందీగ్రాహక, మహామంత్రి యుగంధర.

సు.—మహారాజ్, మేముదై వంచేస్తా చేతఆవాడలోపడ్డాం, మీకివారికినా, ఈయన పట్టినాడు మాకీ? మీరు ఈయనకీ అర్థంకీర్తి చేస్తారు తోస్తుంది.

చెరు.— "అల్లవా డిల్లహో యిల్లవా డల్లహో
కళ్లులేని కబోది కడతేరలేదు".

సు.—చిత్తగ్గుప్తజోస్యులూ, మేము కబోదీ చెప్తావా? వుండు వుండు.[స్మరణమభినయించి] జోస్యులూ, మాతో వచ్చినాడు, ఆదివానా యేమైనాడు? ఆహా వాడ్కీ కూడా సంపీ యేశినారా!

చెరు.—వాఁడే అందఱను చంపివేసినాఁడు. వాని నెవఁడు చంపఁగలవాఁడు!

సు.—మరి యేమైనాఁడు!

రాజు.—మీయెదుటనే యున్నాఁడు.

సు.—మాకీ అంతా షందేషుం, ఆ దివానా దివానా అర్థం, మీతంత్రాలో మేమూ దివానా వున్నాం మహారాజ్.

రాజు.—వారే. [అని మోదప్రకేలితో యుగంధరుని చూపును.

[సుల్తాన్, వజీర్లను ముక్కుమీఁద వ్రేలుంచుకొందురు.

సు.—అల్లా! అల్లా! అల్లా అందుకీ మీరు రామేషరంలో మర్గయా ఫుఖాన్ చేసినారు. తమరు యుగంధర్ మహామంత్రిగారు మకీ నిజంగా కబోదీ చేసినారు, మీషక్తి మన్సీకి లేదు! ఆహాహా మీరు ఆరు నెల్లు ఢిల్లీలో దివానా తిరిగినారు, మీచరిత్రం మాకీ హాశ్చర్యం! బోధపడదు, అల్లా! అల్లా! అల్లా! మీరు మాకీ షేగ్తులు అయితే యెందుకీ పట్టితెచ్చినారు! మాకీ షత్రువులు అయితే వలీకి యెందుకీ షహాయం చెయ్యలేదు. [ఆత్మగతము] దివానా మన్సీకాదు, సైతాన్, చెప్పినాను జవాన్లు!

యుగం.—అంతయు మీ వజీర్లు విశదీకరింతురు.

సు.—[దిగులుతో] మీరుకూడా షరీకవోయి వజీర్లు! అల్లా అల్లా అల్లా! ఇంకా యేమి తల్చినారు మాకీ యుగంధర్ మహారాజ్? [అని వజీర్లకు దూరముగా నిలిచి] యిది మళ్లీ వాడారాత్రి అవుతుందా యుగంధర్ మహారాజ్?

యుగం.—అట్లు కానేరదు. శివునియాజ్ఞ లేక చీమయు కుట్టదు. మీవజీర్లు
మంత్రులు, ఊహించి చెప్పుదు రని మామాట. క్రమక్రమముగా మీరెఱింగిన నే
రహస్యము; మావలన వినవలదు. మీకు యావజ్జీవము బుద్ధికి ఇది యొక వినోద
సారమగుఁగాక.

సు.—హబ్బ! మీ మాటచేత గాభరా తీరింది మహారాజ్. ఆ మహారాజా
మాట్లు పట్టిన ఆపాదాల్కి మేము వఖ్మాట్లు పట్టుతాం. [అని తటాలున
ంధరుని పాదములు సోక సలాముచేసి] మీరు యెవగో హావతారం, మాకీ వరమి
వ్వండి సామీ. మీదర్శణం యాట్వంటీ పాపాత్ముడికీ మేలు చేస్తుంది.

యుగం.—[సుల్తానుచేయి ప్రతాపరుద్రునిచేయికలిపి] మీ కిరువురకు సఖ్యము
చుచున్నాను.

క. మయశంబరులకుబలె * న
వ్వయపారంపరిగ సఖ్య మమరుత మీకున్,
నయముగ నొండొరులకు† రిపు
భయదాహవములను దోడుపడుదురు గాతన్. ౫

సు.—ప్రతా, వజీర్లు, సైకుమకి ప్రభృతులు.—కోరిక గాదు, వరము వరము
ము.

సు.—మాజ్ఞాపకం తమకాడ వుండవాలా.

[అని యుగంధరునికి తనకత్తి ఇచ్చి, తన పగిడీ ఇడి, తాను పాగా ధరించును.

రాజు.—మాగుర్తుతమయొద్దనుండవలయును. [అనిసు.కు పగిడీ,కత్తి,ఇచ్చును.

సు.—[గ్రహించి, ధరించి] వీట్కి ఖరీద్ వుంది, షైహాన్కి ఖరీద్ లేదు, మహా
జా భాయి. [యుగంధరునితో] మాకీ ఢిల్లీకి తల్పుకొంటే హడల్వుంది. అక్కడయెక్కా
తప్పుదు. తమకీ తెల్పుకొంటాం. తమరు వ్వయం వచ్చి, మాకీ మల్లీ తఖ్తుమే
వాలా. అదీ మేమూ వరం అడ్గుతాం.

యుగం.—మంచిది.

చెకు.—[రాజ జనార్దనాదులతో, జనాంతికము] ఆపాటిస్థితిలో నీఁక నూ
వచుకు ఉండిన ?

సు.—ఇక మాకి శెల్వు.

రాజు.—మా సేనాపతి బేతాళరావుగారిని రానింపు, తమకు పరివారము
చుచున్నాఁడు.

సు.—చిత్తము.

---

*వ్వ...=వంశ పరంపరగా. † శత్రువులకు భయంకరములయిన యుద్ధములందు.

ప్రతీ.—[ప్రవేశించి] జయము జయము జగదీశ్వరులవారికి. పెద్దశెట్టిగారు వచ్చివున్నారు.

రాజు.—రమ్మను.

అంతట పెద్దసెట్టి ప్రభృతులు ప్రవేశింతురు.

వర్త.—జయము జయము జగదీశ్వరులవారికి. జయము జయము మహామంత్రి యుగంధరులవారికి. ఓహో! సలాము సలాము సుల్తానువారికి, సలాము సలాము వజీర్ల బాయివారికి.

సు.—వజీర్లు.—సలాం సలాం.

సు.—[ఆత్మగతము] వీళ్లకి కొట్టి రాజాసర్దార్లు మాకీ పట్టి తెచ్చినారు. వీళ్ల హుంగ్లీకి పోయినారు. వీళ్లు గోవావర్తకులు, రాజా మర్గయా మంత్రి మర్గయా, చెప్పినారు. ఇక్డ యిప్డు అంతా ష్నేహితులు. అరే! హాల్లా! హాల్లా! మోషంమీదా మోషం! అహో! యిక్డనుంచి ప్రాణంతోటి పోతామా? [జనాంతికము] ఏమి వజీర్ సాహెబ్లు! మీకి యేమైనా యీ తెలంగీ తంత్రం తూర్పు పశ్మర తెలుస్తుందా ?

వజీర్లు.—[జనాంతికము] ఇది తెలుస్తుంది. ఇక్డనుంచి యెంత త్వరగా పోతే అంత హుద్రుష్టం మనది.

ప్రతీ.—[ప్రవేశించి] జయము జయము జగదీశ్వరులవారికి. ఒక వైదికబ్రాహ్మణుడు వచ్చి వున్నాడు. చాకలి యెల్లట వచ్చివుంది.

యుగం.—యెల్లిని రమ్మను. పహరాలో నున్న యీ చాకలిని తెప్పింపుము.

ప్రతీ.—జగదీశ్వరులయాజ్ఞ. [అని నిష్క్రమించును.

అంతట ఎల్లి ప్రవేశించును. పేరిగానిని జవానులు తెత్తురు.

యుగం.—[రాజుతో] ఇది చాకలియెల్లి, దీనిభర్త యీ పేరిగాఁడు. వీనినే వలీఖాన్ ఖయిదుకొనిపోవుట. వీనికిని దీనికిని ఏమో రగడయైనది. ప్రభువే స్వయముగా విచారింపవలయును.

సు.—[జనాంతికము, వజీర్లతో] అల్లా! యిది అన్నిట్కిమీద వుంది. యీ గాడ్దాకోషం మాకీ పట్టితెచ్చినార్. ఈడ్కోబీకి మేం తాజీం యిచ్చినాం. మళ్లీ వీడ్కి చూడటం హవ్మానం యేలాగా తింటాం ?

రాజు.—పాపము! వీనినా వలీ కొనిపోయినాఁడు? తమ నీతిప్రభావమువలన వీఁడు మరల వచ్చినందున దీనివంత తీఱినది గదా, రగడ యేల ?

యుగం.—విచారించినఁగదా తెలియును ?

సు.—[జనాంతికము వజీర్లతో] వీడు మాదుగ యైనాక్కీ నిగిడి మహారాజా కూర్చున్నాడు. యిప్డు వీప్కుకోతీ వంగ్తాడు. హాల్లా! హాల్లా! మాకీ చార్కీ, వీడ్కి చాకి

కే నాచీ, వీడ్కి నాచీ ? హా! యీఘండాలీ తెలంగీతంత్రం! మాఖుర్రాకీ అడ్డం కత్తిరించిందివాలా వుంది! యేమి చేస్తాం! యెవ్డూపోతాం!

బేతాళరావు.—[ప్రవేశించి] జయము జయము జగదీశ్వరులవారికి.

రాజు.—బేతాళరావు, ఏమి చేసితివి ?

బేతా.—తమ సెలవుప్రకారము, తురక ఖయిదీలను పది వేలమందిని విడుదల చేసి ఢిల్లీవఱకు బత్తెము లిచ్చి సుల్తానువారికి పరివారముగా ఏర్పరించితిని.

రాజు.—తమ్ములును నీవును నరసింహరాయలును సుల్తానువారిని మన నగరుదాఁట సాగనంపి రండు.

అన్నమ.—నాకు వచ్చియు రాకముందే అన్నగారు మిక్కిలి ప్రియమైనపని చేసినారు, మహాప్రసాదము.

బేతా. నరసిం.—ఏలినవారి చిత్తము. [అందఱు లేచి పరిక్రమింతురు.

సు.—[రాజుతో] తమరు నిల్వాండి. సలాం మహారాజాభాయి. సలాం జగదీశ్వరా మహామంత్రి యుగంధర్దేవ మహారాజ్. సలాం చిత్రగుప్తజోష్యులు.

[వీరందఱు వెంటవెంటనే సలాము చెప్పుదురు.
వజీర్లు అందఱకు సలాములు చేసి పొందుదురు.

సు.—[బాలునిచేయి ముద్దుకొని] తమవద్ద సెలవు చిన్నమహారాజావారు.

బాలుఁడు.—చిత్తం. మాసలాం మాస్నేహితులు చిన్నసుల్తానువారికి చెప్పవలెనని కోర్తాము.

సు.—అచ్ఛా! అచ్ఛా!

[సుల్తాన్, వజీర్లు, అన్నమాదులును నిష్క్రి. ఇతరులు వచ్చి కూర్చుందురు.

యుగం.—ఎల్లీ, చెప్పుకోవే.

ఎల్లి.—[వడవడ వణకుచు చేతులు మోడ్చుకొని] నానోట మాట రావటం లేదు మారాజా. నాపిరాదు యిని ఆయ స్నేమైనా శిచ్చ శేస్తారేమో మారాజా ? యిని శేసుకోను సామీ.

యుగం.—వానిని శిక్షింపము, చెప్పుకో.

ఎల్లి.—మరుండి, సామీ, [ఆత్మగతము]ఏమి చెప్పుకొందును? [ప్రకాశము] ఉండి, యీయన పెత్తాతదురద మగారాజంటుండి.

యుగం.—[రాజుం గని, చిఱునగవుతో] విశద మగుచున్నదా ?

[అందఱు నవ్వుదురు.

ఎల్లి.—నా కేమి తెల్దుండి, ఆయ నన్నామాట నాను శెప్పినాను మారాజా.

యుగం.—చెప్పు చెప్పు.

ఎల్లి.—[వణఁకుచు] మరుండి, ఆనాడు తమరితో శెప్పుకొన్నా మాటేనుండి.

యుగం.—అదే, భయపడకు. పేరిగాని నేమియు చేయములే.

ఎల్లి.—[తల వాంచి బిడియములో] నన్నొల్లడంట, నాను కంపెల్లి నంట, యీ ణోయించలేనంట, పేడ లేకండా కూడుః తినడంట.

రాజు.—ఛీ! ఛీ! ఛీ!

ఎల్లి.—[వణఁకుచు] ఆయన శెప్పినమాటేనుండి.

యుగం.—ఏం పేఁడ?

ఎల్లి.—దూడపేడ, బఱ్ఱిపేడ, అయి ఆయనకి మదనమంట. యింకా యేం శేంటో శెప్పినాడు సామీ.

యుగం.—ఏమేమో చెప్పు. భయపడకు.

ఎల్లి.—యేనిగల నెక్కినాడంట, యెల్లిన కాడంతా యీతనికి లచ్చ ల్లచ్చల దండు దండా లెట్టోరంట. యీలాగంతా శెప్తాడు మారాజా. యెఱ్ఱోడో, ఒల్లోడో, తెలదు మారాజా. కూడు తినక యింటికి రాక ఒగ్గేశి యెల్లిపోయినాడు మారాజా.

రాజు.—ఎందుచేత నీవు పనికిరా వన్నాఁడు?

ఎల్లి.—తను రాజంట, సదువుకొన్నోడంట.

విశ్వా.—[లేచి] మహాప్రభూ, నేను ఎల్లికి వకీలను.

రాజు.—ఏమి నీవాదము?

విశ్వా.—వీఁడు చదువుకొన్నందున, చాకళ్లలో చెడిపోయినాఁడు. కావున వీఁతో యెల్లికి పనికిరాఁడు.

ఎల్లి.—[సబాష్పముగా] నారాయణమూర్తీ! పనికొస్తాడుసామీ, పనికొస్తాడు!

విశ్వా.—ఉండవే, నీకు తెలియదు.

ఎల్లి.—[దీనముగా] తెలుసును సామీ, పనికొస్తాడు.

రాజు.—ఏమిరా నీవాదము?

పేరి.—[వడవడ వణఁకుచు చేతులు మోడ్చి] నేరనోణ్ణుండి. కాయవ దేవాదిదేవా. [అని సాగిలఁబడును

చెరు.— నేను పేరిగాని వకీలను.

రాజు.—మీవాద మేమి?

చెరు.—చదువుకొన్నను గూను పోలేదు గనుక వీఁడు చాకళ్లలో చెడలేదు; కావున ఎల్లికి పనికిరాఁడని మానసష్టిచేయుట తప్పు.

ఎల్లి.—దండం సామీ దండం. ఎఱ్ఱిదాన్ని రచ్చించండి మారాజా.

చెరు. జనా పెద్దవెట్టి ... పెట్టి ... త్త్రీల కందలును ఉన్న శంతి... పోదురు.

రాజు.—మంచిది, తీర్పు.— పేరిగానివకీలు చేసినవాదము సరి. గూను తీరినఁ గాని చదువుకొన్నవాఁడు గాఁడు, చాకలివాఁడే. ఎల్లికి పనికివచ్చును. మఱి వీరికి మహామంత్రిగారు మాదర్శన మనుగ్రహింనారు గావున ఇనా మియ్యక మేము పంపఁ గనుక. [ఆలోచించి] ఇదే యినాము. వీరిఁక చాకిపని మానవచ్చును. చాకళ్లకు కులము పెద్ద, చాకలిదొర, చాకళ్లుండలు వీనికి పన్ను చెల్లింపవలసినది. వీనికి సారము, ధనము, సకల సౌభాగ్యము, మహల్, దూడపేఁడ, బఱ్ఱెపేఁడ, యిచ్చి నాము. మంత్రు లిప్పుడే యేర్పాట్లు చేయుదురు [ఒకనౌకరు వైపు చూచి] ఓరి,వీరిం గిపోయి దీని నచ్చరవలెను వీనిని అమరేశ్వరునివలెను కట్టించితొడిగించి తెండి.

[ఎల్లి సాగిలఁబడి లేచును. పేరి. ఏమియు తోఁపక నిలుచును.

ఎల్లి.—[చేయిపట్టి లాగుచు] రా మామా.

[అందఱు నవ్వుదురు. ఆశబ్దమునకు పేరి. తెలివి వచ్చి యెల్లితో నిష్క్రా.

యుగం.—[ఒకనౌకరుతో] ఆబ్రాహ్మణుని తోడ్కొనిరా.

[వాఁడు నిష్క్రమించును.

అంతట అన్నమరాజు, బేతాళరావు, నరసింహరాయలును ప్రవేశింతురు.

అన్నమ.—సుల్తాను వేగిరించి నడచినాఁడు. మమ్ము బతిమాలి బతిమాలి వెను క మరల్చినాఁడు. జనాంతిక భాషితముల వజీర్లు తమరాజ్యము చక్రాలిపై నెత్తి కొనకుండ యయ్యె ననియు, తాము దేశాంతరమున పకీరులుగా బ్రతుకుట శ్రేయ స్కరము పలికినారు. నేను 'యుగంధరమహారాజు సాహాయ్య మున్నది, వెలవకుఁ' డని హెచ్చరింపఁగా, వెఱఁగుపడి ముప్వురు నంగీకరించిరి. ఈదుస్స్వప్నము సుల్తా నుకు ఈ జన్మములో తీఱుట దుస్తరము.

అంతట అగ్రహారస్థుఁడు ప్రవేశించును.

యుగం.—ఏమయ్యా, మీరు వచ్చినపని ?

బ్రాహ్మ.— *నవలక్ష ధనుర్ధరాధినాథే
పృథివీం శాసతి వీరరుద్రదేవే,
అభవ త్వర మగ్రహారపీడా

[అని యర్ధోక్తమున,

* తొమ్మిదిలక్షల విలుకాండ్రకు దొర యగు ప్రతాపరుద్రమహారాజు భూమిని ఏలుచుండఁగా అగ్రహారములకు మిక్కిలి బాధ కలిగినది.

రాజు.—శివశివా! నాయేలుబడిలో అగ్రహారములకు పీడ కలిగినదా ?

విద్యా.—[తటాలున లేచి]

* కుచకుమ్భేషు కురఙ్గలోచనానామ్.

జనా. చెరు.—బళిబళీ! మహాకవీ, స్త్రీల పాలిండ్లయందు హారముల యు కటము మిక్కుటముగా కలిగినదా.

రాజు.—ఓహో విద్యానాథులవారా! [లేచి పాదములకు మ్రొక్కి మరల గూర్చుండి] అనవాలు పట్టనందులకు మన్నింపవలయును.

యుగం.—అయ్యా, మీయగ్రహారమునకు క్షేమము చేసెదము, తేపు మా కచ్చేరికి రండి. కూర్చుండుడు [బ్రాహ్మణుఁడు కూర్చుండును.

రాజు.—మహానుభావా, తమకొమారితకు వివాహ మైనదా ?

విద్యా.—[ఆత్మగతము] కృతికన్యం గూర్చి పలికెదఁగాక. [ప్రకాశము] మహా రాజా, అల్లుఁడు కాశిలో నుండఁగా ఇట వివాహ మెట్లగును ?

రాజు.—[ఆత్మగతము] కృతింగూర్చి పలుకుచున్నాఁడు మహాకవి. [ప్రకాశము] వచ్చెనుగదా కానీరాదా ?

విద్యా.—ఇదిగో కానిచ్చెద. 'తదేవలగ్నం సుదినం తదేవ విద్యాబలం దైవ బలం తదేవ ...

[అని ప్రతాపరుద్రీయగ్రంథమును విప్పి ఒకటిరెండుశ్లోకములం జదువును (56,57.వ పు. చూ.) చెరుముకి అర్థము చెప్పును. విద్యానాథుఁడు గ్రంథమును రాజునకిచ్చును. రాజు లేచి సనమస్కారముగా గ్రహించికూర్చుండును.

విద్యా.—ఇట్టివరులు హరణము కోరరు గాని హరణహీనముగా కన్యనిచ్చుట కన్యాజనకులకు పరువు తక్కువ కావున ఈయలంకారమును గ్రహింపవలయును.

[అని రాజువ్రేల ముద్దుటుంగరమును తొడుగును.

[నేపథ్యమున దుందుభులు పుష్పవృష్టియు].

రాజు.—[నమస్కరించి, మోడ్పుఁగేలితో] అంతటను వానినే తమల పేరిట నంటిరి గదా.

విద్యా.—ప్రతిశ్లోకమునను పేరు తగిలియున్నదో లేదో చూచుకొనుఁడు.

[నేపథ్యమున దుందుభులు పుష్పవృష్టియు].

[యుగంధరుఁడు రాజుచేతికి కొన్ని శాసనము లిచ్చును.

* లేడికన్నులవంటి కన్నులుగల స్త్రీలయొక్క చనుఁగుండలయందు అని యర్థము. [illegible] తృతీయపాదమునకు అర్థము. [illegible] చెరు. చెప్పిన విధమున మాటినది.

రాజు.—[చూచి ఆనందించి] విశ్వాసరావు, వీనిని అందింపుము.

[అని ఒకటొకటిగా చూచి యిచ్చును. విశ్వాసరావు వరుసగా విద్యా. చెకు. బేతాళ. నరసిం. పెద్దసె.—వీరికి ఇచ్చును.

యుగం.—ఏలినవారు మిమ్ము నందఱను దేశాధీశ్వరులను చేసినారు, మిత్త్రి స్థిగా మర్యాద నిబంధించినారు.

[నేపథ్యమున దుందుభులు పుష్పవృష్టి.]

వారందఱు.—మేము ఏలినవారి సన్నిధానమందే యుండెదము, మాకు స్వాములేల? అయినను సమ్మానమును గ్రహింపవలసినది. [అని గ్రహింతురు.

విశ్వా.—[ఒకశాసనము చేతిలో నుండ] ఇది మడివేలు దొరవారిది.

[పేరిగాఁడును ఎల్లియు ముస్తాబుతో ప్రవేశింతురు.

సభ్యులు.—బళి బళి బళి బళి!

[చాకళ్లు సాగిలఁబడి లేతురు. విశ్వాసరావు పేరిగానికి శాసన మిచ్చును.

పేరి.—[వణఁకుచు అందుకొని] ఇదేంటి మారాజా ?

విశ్వా.—కన్నుల నద్దుకో,దీనిని దాఁచుకో,దీనివలన నీవుచాకలిదొరవు, ఇది సాని చాకలిది.

[పేరిగాఁడు తానుకనుల నద్దుకొని ఎల్లికిచ్చును. ఎల్లియు కనుల నద్దుకొనును. పేరిగాఁడు ఏమో చెప్పఁబోయి తడఁబడుచు నత్తివానివలెనై యూరకుండును.

రాజు.—ఏమిరా నీవు ఇంక చెప్పఁకొనునది ? చాలదా?

పేరి.—నన్ను దొరని శేశినారు, ఎల్లిని—

[అని యర్ధోక్తములో నూరకుండును. అందఱు నవ్వుదురు.

రాజు.—మంచిది, మంచి యనుకూలనాయకుఁడవు నీవు, స్వాధీనపతిక అది. మంచిది, ఎల్లిని దొరసానిని చేసినారము.

పేరి.—దండం మారాజా దండం. మరి నాకీదొర మిచ్చిన బెమ్మదేము డౌ ఆయనపాదాల్లో పడతా.

[అని సభలో కలయ వెదకును. చెకుముకి విద్యానాథునికి చాటు తొలఁగును.

పేరి.—[విద్యానాథునిం గని] బెమ్మదేముడా నీదొర మిది.

[అని సాగిలఁ బడును. ఎల్లియు పడును.

విద్యా.—లెండి. ఇంతకన్నను క్షేమపడెదరు లెండి. [ఇరువురు లేతురు.

యుగం.—రాజునుగూర్చి] వత్సా, నీ కింక నేదేని మనోరథం బున్న జెప్పుము.

రాజు.—మహానుభావా,

శా. ఢిల్లీనాథుని మిత్త్రుఁ జేసితివి, * ధాటీధర్మ బాహ్యాత్ముఁ డౌ
వల్లీఖానుశిరంబుఁ దెచ్చితి, † ద్విషద్బందీకృతున్ మిత్త్రుఁ బ్ర
హ్లాదించితి చాకినేని, ‡ గజరా జేఁగెన్ యము న్గానఁగా,
నల్లాపింపుము యింకనుం గలుగునే, సర్వజ్ఞ, § యాశాస్యముల్
అయిన నిది యగుఁగాక.

[భరతవాక్యము]

(మానిని)

వానలు లోకశివం బకృశంబుగ వానవుఁ డిచ్చుతఁ గాలమునన్,
దేనియ జాల్కొన దేశము పండుత దివ్యులఁ దన్పుత యాగకరుల్,
మానిత మానవమార్గముఁ దప్పక మంతురుగాక నృపుల్జగతిన్,
భూనుతులౌ కవిపుంగవులం బొరపొచ్చెము సేయరు గాక బుధుల్.

స మా ప్త ము.



* దాడియొక్క న్యాయమునకు వెలియయిన హృదయముగలవాఁడు. † శత్రు వులచేత చెఱఁబెట్టఁబడినవానిని. ‡ కటకబల్లహుఁడు. § కోరఁదగినవి.



PRINTED AT THE KESARI PRINTING WORKS, G. T., MADRAS.

శ్రీరస్తు.

# కన్యాశుల్కము

## హాస్యరసప్రధానమగు నాటకము.



శ్రీ శ్రీ శ్రీ హర్ హైనెస్

ది మహారాజ కుమారికా సాహేబా

ఆఫ్ విజయనగరం, మహారాణీ ఆఫ్ మాధోగడ్, రీవా,

సర్కార్‌వారి భృత్యుడగు,

## గురజాడ-అప్పారావుచే

రచింపబడినది.

మాడవకూర్పు.

రాజమహేంద్రవరము

మెస్సర్స్, యస్. గున్నేశ్వరరావుబ్రదర్సువారిచే

స్వకీయ.

శ్రీచింతామణీ ముద్రాక్షరశాలయందు

ముద్రాపితంబై

రాజమండ్రి, బుక్కుసెల్లర్సు

కర్రా అచ్చయ్య అండ్ సన్సువారిచే

ప్రకటింపబడియె.



1925.

వెల రు. 1-0-0.

# DEDICATION.

To

**His Highness the Maharajah Mirja Sri Ananda Gajapati Raj, Manea Sultan Bahadur of Vizianagaram, G. C. I. E.**

MAY IT PLEASE YOUR HIGHNESS,

It is fabled that when the ancient demi-god of your noble race was making a causeway across the sea to rescue his consort from captivity, the faithful squirrel brought at the end of its tail a few grains of sand, not indeed hoping to advance the great enterprise in any appreciable degree, but to show an inclination to serve. Ten years ago, when the question was engaging Your Highness's attention of saving a very helpless portion of our woman-kind from a galling type of slavery, fraught with the germs of social demoralisation, an humble servant made a feeble effort to arouse public opinion on the subject by exposing the evil in a popular drama. The success that attended its production on the boards, and demand for copies from various quarters, emboldened him to publish it. No one is better aware than the writer himself how great are the imperfections of the piece, and how unworthy it is of presentation to such an exalted personage and scholar as Your Highness, but he has ventured to seek Your Highness's indulgence, as he deems it the highest honour and his greatest ambition to be permitted to dedicate the fruits of his intellect, poor though in merit, to a Prince with whom knowledge is an absorbing passion and whose appreciative encouragement of letters, has attracted to his court, literary stars of the first magnitude and inaugurated a brilliant epoch in the history of Telugu Literature.

*I have the honour to subscribe myself*
*May it please Your Highness,*
*One Ever Loyal to* **The Ever Loyal.**

I cannot understand how modern writers fail to see the merits of Spoken Telugu, its softness which elicited the admiration of foreigners, and its range of expression. At this moment, the best prose in the language is in the Spoken Dialect. Strange as it may sound, Telugu prose owes its origin and development not to the patronage of kings or to the influence of foreign literatures, but to the exertions of a curious Englishman who stimulated compilation of local histories in the vernacular during the early years of the last century. The Mackenzie Collections, no doubt, comprise tracts of unequal merit but for rythm, flow and directness some of them beat the best work in the Literary Dialect; and, what is rare in Telugu literature, they reflect the mind of the people and bear impress of the times. Unconsciously possibly, Rai Bahadur K. Viresalingam Pantulu Garu rendered great service to Telugu by issuing as the first volume of his collected works adaptations of English acting plays and forces of Indian life written in vernacular of various degrees of purity; and the choice does credit to his shrewd common sense, because that first volume contains his very best work; in fact, his only work that took the public by storm. The credit of deliberately introducing the vernacular into Telugu drama in keeping with Sanskrit tradition, belongs to my friend V. Venkataraya Sastri Garu whose Prataparudriyam owes not a little of its charm to dialogue in the dialects. I believe my play is the first ambitious work in the Spoken Dialect and, certainly, it has not failed; but success or failure of individual authors is no test of the capacity of a language.

While the Vernacular is thus gaining recognition, the Literary Dialect itself is approximating to the Spoken Dialect in the best modern prose which manifests great freedom of usage. Rai Bahadur K. Viresalingam Pantulu Garu, the most prominent figure in the Telugu World of letters at the

present day, has set the exmple of laxity in the observance of the Law of interchange of soft and hard consonants after a ... nasal. Hardly a modern writer would escape censure if judged by rules of grammar and established usage, and in the school room, Pandits have relaxed insistence on rigid observance of rules of *Sandhi*. The moral of this tendency to break through traditional restrictions is clear. The old Literary Dialect is felt to be an inconvenient instrument, and there is an unconscious effort to form a new Literary Dialect. My complaint is that this movement is illogically slow.

I view the Telugu Literary Dialect as a great disability imposed by tradition upon the Telugus. Let those who love letters venerate it. My own vernacular for me, the Living Telugu, the Italian of the East in which none of us is ashamed to express our joys and sorrows, but which some of us are ashamed to write well. Literature in the Vernacular will knock at the door of the peasant; and it will knock at the door of the Englishman in India. Its possibilities are immense.

No argument in favour of a Vernacular Literature is needed with persons who are conversant with the history of the English Dialects and the Prakrits; and I know it is not arguments that will evolve a New Literary Dialect for Telugu. A great writer must write and make it. Let us prepare the ground for him.

The cause of Social Reform has received strong support from a recent decision of the Madras High Court in which a full bench consisting of Chief Justice Sir Arnold White, and Justices Miller and Munro ruled: "That a contract to make payment to a father in consideration of his giving his daughter in marriage is immoral and opposed to public policy within the meaning of Section 23 of the Indian Contract Act".

I had to contend with one difficulty in printing this book. There are many sounds in the spoken Dialect which are not represented in the Telugu Alphabet. In the present state of Telugu phonetics, I had to content myself with indicating such sounds by a horizontal line placed over the nearest symbols: and I employed the Ardhanusvara after a nasal ఁ. The creation of new symbols and their adoption into type can be effected only after a more widespread recognition of the spoken Dialect.

My best thanks are due to Messrs. G. Ramaswami Chetty & Co. who cheerfully undertook to adopt my innovations, and did their part of the work to my entire satisfaction.

"Elk Hill House,"
Ootacamund,
*1st May 1909.*

G. V. A.

# Preface to the First Edition.

---

Under the orders of His Highness the Maharajah of Vizianagaram, a list was prepared ten years ago, of Brahmin *sulka marriages*, celebrated in the ordinary tracts of the Vizagapatam District during three years. The list is by no means exhaustive as the parties concerned were naturally averse to admitting acceptance of bride-money; but such as it is, it forms a document of great value and interest. The number of marriages recorded reached one thousand and thirtyfour, giving an average of three hundred and fortyfour for the year. Ninetynine girls were married at the age of five years, fortyfour at four, thirtysix at three, six at two, and three at the age of one !—the babies in the last instance carrying a price of from three hundred and fifty to four hundred rupees a head. Strange, as it may sound, bargains are sometimes struck for children in the womb. Such a

ndalous state of things is a disgrace to society, and litera-re cannot have a higher function than to show up such actices and give currency to a high standard of moral ideas. til reading habits prevail among the masses, one must look ly to the stage to exert such healthy influence. These nsiderations prompted me to compose *Kanyasulkam*.

I clothed the play in the spoken dialect, not only that it better intelligible to the public than the literary dialect, but o from a conviction that it is the proper comic diction for lugu. Dramatic style is, no doubt determined to some tent by usage, but the absence of any real dramatic erature in Telugu, leaves a writer free to adopt that out-rd form which he deems most appropriate for the present-ion of his ideas. The metres in use in Telugu, with their literative restrictions, are incapable of imparting to language nversational ease which is indispensable in a comedy, or *ntinuity* in which, as Mr. Ward remarks, lies real life. One ght invent new dramatic measures—but it would be a perfluous task, so far at least as comedy is concerned, as ose is gaining ground all over the world for dramatic rposes.

It has been remarked that the use of what is wrongly rmed the *vulgar tongue* mars the dignity of a literary pro-ction, but that is a piece of criticism which one need not ed at the present day when the progress of the Science of nguage has established better standards for judging the ality and usefulness of tongues than the whims of rammarians of old linguistic starta. The Telugu literary alect contains many obsolete grammatical forms, an in-conveniently large mass of obsolete words and arbitrary verbal contractions and expansions which were necessitated y a system of versification based both on alliteration and n quantity. A license, which, no doubt, has its own advan-

tages of introducing Sanskrit words to an unlimited exetent has been but too eagerly availed of by poets who brought glossaries into requisition, revelled in fantastic compound-formation, and made the Telugu literary dialect *doubly dead*. This is not the place to dilate on the question of linguistic reform; but thus much might be said. If it is intended to make the Telugu literary dialect a great civilizing medium, it must be divested of its superfluous obsolete and Sanskrit elements, and brought closer to the spoken dialect from which it must be throughly replenished. There is not much dialectical difference in the Telugu generally spoken in the various parts of the Telugu country; so a new common literary dialect can be established with comparative ease if only able writers set obout it in right earnest.

Recently, I happened to read *Brahmavivaham* by Rai Bahadur Viresalingam Pantulu Garu and found that there were some parallel passages in our plays, a thing perfectly natural considering that his piece traversed the whole filed of Brahmin marriages. But it will be seen that these plays have little else in common, our treatment being essentially different. *Brahmavivaham* was meant to be a pure comedy of manners, while in *Kanyasulkam* honour, characterization, and the construction of an original and complex plot have been attempted—with what success, it is for the public to judge.

VIZIANAGARAM,
*1st January 1897.*

## Some Press Opinions on the First Edition.

......Mr. Appa Row is, apparently, a man of original ideas in literary matters......He has wisely and happily discarded for the purposes of his comedy the unnatural, stilted,

pedantic, literary dialect so much beloved of Telugu Pandits, and so unduly prized by them, and employed, instead, the simple, ordinary language of common life now in use among the classes of the population in the Northern districts of this Presidency. The book, therefore, marks a new and bold departure in Telugu dramatic composition, or for the matter of that, in Telugu composition in general......The literary tendencies of the present time running, as they do, in such a narrow groove, and being of so stereotyped a character, it speaks very highly, we think, for our author's literary courage, a courage bordering on audacity, that he has been able to set at naught the absurd literary canons of this degenerate age and risen above the prevalent grammatical and literary superstitions in regard to Telugu composition. But, not only has he thus boldly used a new literary diction which, though unsanctified by existing usage among authors, bears the stamp and seal of popular approval and universal use; but he has likewise shown unmistakable merit in constructing a singularly original and interesting plot and creating a variety of characters true to life, which, we are sure, if represented on the stage, will greatly please any Telugu audience, let alone the reading public who may peruse the drama in the retirement of the study or the library. We have therefore, much pleasure in recommending "Kunyasulkum" to all our Telugu readers......The characters are all boldly drawn and the whole piece is very happily put together and artistically constructed, evincing no little originality and dramatic skill on the part of the author.—*The People's Friend, January 21, 1897.*

*Kanyasulkam* ought to be widely read. It is very agreeable reading—and we have read it almost at one sitting. But the naturalness of expression and the skill of plot are the least of its merits. It holds the mirror up to nature...... Such is the plot of Kanyasulkam. And what scope it affords

for the representation of Indian character in its various acpects, needs scarcely to be pointed out. Nor has Mr. Appa Row wasted his opportunities......*The Weekly Review, March 27, 1897.*

The piece, besides displaying much incident and humour, possesses the very necessary element of characterization, a trait often conspicuous by its absence in our old plays—*The Telugu Harp.*

The play has been acted several times, and judging from the large audience which crowded the theatre on each occasion, the author must be congratulated upon the success which the exhibition of his work produced.—*The East Coast News.*

The plot is well concieved and skilfully worked out. The characters are all aptly chosen.—*The Indian Journal of Education.*

Mr. Appa Row deserves to be congratulated.—*The Indian Social Reformer.*

It is full of wit and humour and falls in with the spirit of the times. The dialogue is lively and very interesting, and we have nothing but praise and admiration for the author.—*Dhimani.*

Its story which is very humourous inculcates wholesome moral lessons.—*Balika.*

The predominating *Rasa* (emotion) in the play is humour. A careful study of the book is sure to bring home to the mind of the reader the need for social reform. As the author mentions in his preface, this work has been written on lines different from *Brahma Vivaha* and other social reform dramas......May this work which has been composed for the good of the people, put an end to some of the evils in the country......May this work which is intelligible to the masses, spread all over the country and help the cause fo Social Reform.—*Chintamani.*

---

# పాత్రలు.

---

1. అగ్నిహోత్రావధాన్లు. కృష్ణారాయపురం అగ్రహారీకుడు.
2. వెంకమ్మ—అతని భార్య.
3. బుచ్చమ్మ—పెద్దకూతురు, వితంతువు.
4. సుబ్బమ్మ—రెండవకూతురు.
5. వెంకటేశం—కుమారుడు.
6. కరటకశాస్త్రి—అగ్నిహోత్రావధాన్లు బావమరది. విజయనగరం సంస్కృత నాటక కంపెనీలో విదూషకుడు.
7. కరటకశాస్త్రియొక్క—శిష్యుడు, పెళ్లికూతురువేషము, దాసరివేషము వేయును.
8. లుబ్ధావధాన్లు—రామచంద్రపురం అగ్రహారీకుడు.
9. మీనాక్షి—అతనికుమార్తె; వితంతువు.
10. రామప్పంతులు—రామచంద్రపురం అగ్రహారం కరణం.
11. గిరీశం—లుబ్ధావధాన్లు పినతల్లికొడుకు. వెంకటేశముకు చదువుచెప్పునయ్యవారు.
12. సౌజన్యారావుపంతులు—వకీలు.
13. భీమారావుపంతులు—ప్లీడరు
14. నాయుడు—ప్రైవేటు వకీలు
15. పూజారి గవరయ్య—వైద్యుడు, మాంత్రికుడు.
16. మధురవాణి—వేశ్య.

డిప్టీకలక్టరు, హెడ్‌కనిష్టేబు, పోలిశెట్టి, సిద్ధాంతి, బైరాగి, దుకాణదారు గ్రామమునసబు, పావల్లారు, యోగిని, లుబ్ధావధాన్లుయొక్క నౌకరు అసిరిగాడు, మనవాళ్ళయ్య, పీకేశ.

---

కళింగ రాజ్యములో వాడుకొను కొన్నిమాటలకు అర్థము.

———:)o(:———

గుంట=ఆడపిల్ల.

పీక=కంఠము.

పేకాట=చీట్లాట.

బుఱ్ఱ=తల.

సాని=వేశ్య.

———

మెస్సర్స్, యస్. గున్నేశ్వర రావు బ్రదర్సువారి యనుజ్ఞ లేనిది యీనాటకము నెవ్వరును ఆడకూడదు.

శ్రీ

# కన్యాశుల్కము—ప్రథమాంకము.



## ౧-వ స్థలము. విజయనగరములో బొంకులదిబ్బ.

—:)o(:—

[గిరీశము ప్రవేశించును.]

గిరీ—సాయంకాలమైంది. పూటకూళ్లమ్మకి సంతలో సామాను కొనిపెడతానని నెల రోజుల కిందట యిరవై రూపాయలు పట్టుకెళ్ళి డాన్సింగర్లుకింద ఖర్చుపెట్టాను. యివాళ ఉదయం పూటకూళ్లమ్మకీ నాకూ యుద్ధమైపోయింది. బుఱ్ఱ బద్దలు గొడదామా అన్నంత కోపంవచ్చిందిగాని, పూర్వం భర్తృహరి చెప్పినట్లు పేషెన్సు పట్టేగాని లోకంలో నెగ్గలేం. ఈలా డబ్బు లాగేస్తె యిదివరకు యెన్నిపర్యాయములు వూరుకుంది కాదు. యిప్పుడేదో కొంచం డాన్సింగర్లమాట అచోకీ గట్టు కనబడుతుంది. ఓర్వలేని వెధవ యెవడైనా చెప్పివుంటాడు. ఉదయం నుంచి ఆలోచిస్తే యిటుపైని తిండిపెట్టేటట్టు కానరాదు యీవూళ్లోమరి మన కప్పుపుట్టదు. ఎటు చూసినా అందరికి బాకీలే. వెంకంపంతులుగారి కోడలికి లవ్ లెటర్ రాసినందుకు యెప్పుడో ఒహప్పుడు సమయంకనిపెట్టి దేహశుద్ధి చేస్తాడు.

Can love be controll'd by advice ?
will cupid our mothers obey ?

క్రమంగా యిక్కణ్ణించి బిచాణా యెత్తివెయ్యడమే బుద్ధికి లక్షణం; గాని మధురవాణిని వదలడమంటే యేమీ మనస్కరించకుండా వున్నది.

It is women that seduce all mankind.

నేను యేమో ఉద్యోగాలూ ఊళ్ళూయేలి తనతో వైభవం వెలిగిస్తాననే నమ్మకంతో వుంది, పూర్ క్రీచర్ !

ఎవరావస్తున్నది? నాప్రియశిష్యుడు వెంకటేశ్వర్లులా వున్నాడు. యీవాళ కిస్‌మిస్ శలవులు యిచ్చివుంటారు. వీడివైఖరి చూస్తే పరిక్ష ఫేలైనట్టు కనపడుతుంది. వీణ్ణి కొంచం వోదార్చి వీడికి శలవుల్లో చదువు చెప్పే మిషమీద వీడితో వీడివూరికి వుడాయిస్తే ఛాలాచిక్కులువొదుల్తాయి; అటుంచినరుక్కురమ్మన్నాడు.

[వెంకటేశం ప్రవేశించును.]

యేమివాయ్ మైడియర్ షేక్స్పియర్, ముఖం వేలవేసినావ్ ?

వెంక—యిక మీర్నాతోమాట్లాడకండి. మా మాస్టరు మీతో మాట్లాడొద్దన్నాడు. మీ సావాసం చెయడంచాత నాపరిక్ష పోయిందని అన్నారు.

గిరీ—నాన్సెన్స్, మొదట్నుంచీ నేను అనుమానిస్తూనే వున్నాను. నీ మాష్టరికీన్నూ చూస్తేకిట్టదు. అందుచాత నిన్ను ఫెయిల్ చేశాడుగాని లేకుంటే నువ్వేవిటి ఫెయిల్ కావడవేఁవిటి! అతనికీ నాకూ యెందుకువిరోధంవొచ్చిందో తెలిసిందా? అతను చెప్పేదంతా తప్పులతడక. అది నేను న్యూసు పేపర్లో యేకేశాను. అప్పట్నుంచీ నేనంటే వాడిక్కడుపుడుకు.

వెంక—మీవల్లనాకు ఒచ్చిందల్లా చుట్టకాల్చడం వొక్కటే. పాఠం చెప్తానంటే యెప్పుడూకబుర్లు చెప్పడవేఁకాని ఒకమారయినా ఒక ముక్క చెప్పిన పాపాన్ని పోయినారూ?

గిరీ—డామిట్. ఇలాటి మాటలంటే నాకు కోపంవొస్తుంది ఇది బేస్ ఇన్గ్రాటిట్యూడ్. నాతో మాట్లాడడవేఁ ఒక ఎడ్యుకేషన్. ఆమాటకొస్తే నీకున్న లాంగ్వేజి నీ మాష్టరుకుందీ ? విడో మారియేజి విషయమై, నాచ్చి క్వశ్చన్ విషయమై నీకు యెన్ని లెక్చర్లు యిచ్చాను ! నాదగ్గిర చదువుకున్నవాడు అప్రయోజకుడుకాలేదు. పూనా డక్కన్ కాలేజీలో నేను చదువుతున్నప్పుడు ది ఇలెవెన్ కాజస్ ఫర్ది డిజనరేషన్ ఆఫ్ ఇండియాను గూర్చి మూడుఘంటలు ఒక్కబిగిని లెక్చర్ యిచ్చేసరికి ప్రొఫెసర్లు దంగయిపోయినారు. మొన్న బంగాళీ వాడు యీవూళ్లో లెక్చరిచ్చినప్పుడు ఒకడికైనా నోరు పెగిలిందీ? మనవాళ్లు వొట్టి వెధవాయలోయ్, చుట్టనేర్పినందుకు థాంక్ చెయ్యక, తప్పుపట్టుతున్నావ్! చుట్టకాల్చడంయొక్క మజా నీకు యింకా బోధపడకపోవడం చాలా ఆశ్చర్యంగా

గిరీ. చుట్టగాల్చబట్టే కదా దొరలింత గొప్పవాళ్లయినారు. చుట్టకాల్చని యింగ్లీషువాణ్ణి చూశావూ? చుట్టపంపిణీ మీదనే స్టీమరుయంత్రం వగయిరా తెల్లవాడు కనిపెట్టాడు. లేకపోతే వాడికి పట్టుబట్టునా? శాస్త్రకారుడు యేవన్నాడో చెప్పానే.

శ్లో వాచ—క॥ ఖగపతియమృతము తేగా । భుగభుగమని పొంగి చుక్క భూమిని వ్రాలెన్ । పొగ చెట్టై జన్మించెను । పొగ తాగనివాడు దున్నపోతై బుట్టున్॥ యిది బ్రహ్మాండపురాణం నాలుగవ ఆశ్వాసంలో వున్నది అది అలావుణ్ణీగాని నీ అంత తెలివైన కుఱ్ఱవాణ్ణి ఫెయిల్ చేసినందుకు నీ మాష్టరుమీద నావొళ్ళు మహా మండు తోంది. ఈమాటు వంటరిగాచూసి వొకతడాఖా తీస్తాను. నువ్వు శలవుల్లో యిక్కడుంటావా వూరికి వెళతావా?

వెం—వెళ్లాల్నుందిగాని. పాసుకాలేదంటే మాతండ్రి చావ కొడతాడు.

గి—కొండంత తప్పేవుపాయం నే నేర్పబుతాను, నే చెప్పినట్లల్లా వింటానని ప్రమాణం చేస్తావూ?

వెం—(గిరీశం కాళ్లుపట్టుకొని) మీ శలవు యెప్పుడు తప్పాను? మాతండ్రికి మాచడ్డ కోపం పాసుకాలేదంటే యెముకలు విరగ్గొడతాడు (కన్నీరు చేత తుడుచు కొనును.)

గి—చవేక్ టిరనీ-యిదే బంగాళీ కుఱ్ఱవాడవుతే యేంజాస్తాడో తెలిసిందా? తాత మీద రెండ్రమేసి కఱ్ఱపట్టుకుని చస్తూలెక్కగొడతాడు; మీ అగ్రహారం కుఱ్ఱవాళ్లు యిదివరకెవరయినా యీ వూళ్లో చదువుకుంటున్నారా?

వెం—మరెవరూ లేరు.

గి—అయితే నేనో వుపాయం చెపుతాను విను. నే కూడా నీతో మీవూరొచ్చి పరిక్ష పాసయినావని మీవాళ్ళతో చెబుతాను; అక్కడనీకు చదువుచెప్పడానికి ఒచ్చానని మీవాళ్ళతో చెప్పు; శెలవులాఖర్ని నిన్ను టవునుస్కూల్లో పైక్లాసులో ప్రవేశ పెడతాను.

వెం—మీరేవొస్తేబతికాను మరేవింటి; కిందటి మాటు శలవులికే మాఅమ్మ మిమ్మల్ని తీసుకు రమ్మంది.

గి—అల్రైట్ - గాని - నాకిక్కడ చాలా వ్యవహారములలో నష్టంవస్తుందే - మున సబుగారి పిల్లలికి శలవుల్లో పాఠాల్చెపితె ఫిఫ్టీరుపీజ్ యిస్తావన్నారు; అయినా

నీ విషయమై యెంత లాస్ వచ్చినా నేను కేర్ చెయ్యను. ఒకభయం మాత్రం వుంది. మీవాళ్లు బార్బరస్ పీపిల్ గదా, నన్ను తిన్నగా ట్రీట్ చేస్తారో చెయ్యరో, నీవు నన్నుగురించి మీమదర్ తో గట్టిగా రికమెండ్ చెయ్యవలసి వుంటుంది. కొత్త పుస్తకాలికి వొకజాబితా రాయి కొంచం డబ్బు చేతిలోవుంటేగాని సిగస్సుకి యిబ్బంది కలుగుతుంది. నోటుబుక్కు తీసిరాయి. 1 రోయల్ రీడర్, 2 మాన్యూల్ గ్రామర్, 3 గోష్ జియామెట్రీ, 4 బాష్ ఆల్జిబ్రా, 5 శ్రీనివాస్సయ్యర్ అర్థిమెటిక్, 6 నలచరిత్ర, 7 రాజశేఖరచరిత్ర, 8 షెపర్డు జనరల్ ఇంగ్లీష్, 9 వెంకటసుబ్బారావు మేడీజీ. యెన్ని పుస్తకాలయినాయి?

వెంక — తొమ్మిది.

గిరీ — మరో కొట్టిరాయి. అక్కడికి పదీఅవుతాయి. కుప్పుసామయ్యర్ మేడ్ డిఫికల్ట్, అక్కడికి చాలు. మీవాళ్లు గాని యింగ్లీషుమాట్లాడ మన్నట్టాయినా తడుకూ బెడుకూ లేకుండా పుస్తకాల్లో చదువుకున్న ముక్కలు జ్ఞాపకం వున్నంతవరకు యాకరు పెట్టు. నీదగ్గిర కాపర్సు యేమైనా వున్నవా? నాదగ్గిర కరస్సీనోట్లు వున్నవిగాని మార్చలేదు. పచణాలు పెట్టి ఓ శేరు కాశీమిఠాయికొని పట్టుకురా. రాత్రి మరి నేను భోజనం చెయ్యను. మార్కెట్టుకివెళ్లి బండీకుదిర్చి దానిమీద నాట్రావెలింగ్ ట్రంక్కు వేశి మెట్టుదగ్గిర బండీ నిలబెట్టివుంచు. యిక్కడకొన్ని రాచకార్యాలు చక్కబెట్టుకుని యంతరాత్రికైనా వొచ్చి కల్సుకుంటాను. గో ఎట్వన్స్ మైగుడ్ బోయ్. నువ్ బుద్ధిగావుండి చెప్పినమాటల్లా వింటూంటే నిన్ను సురేంద్రనాద్ బానర్జీ అంత గొప్పవాణ్ణిచేస్తాను. నేను నీతోవస్తానన్నమాట మాత్రం కైనా తెలియనియ్యొద్దు. జాగ్రత. (వెంకటేశం నిష్క్రమించును.)

గిరీశం — యీవ్యవహార మొహాటి ఫైసలైంది. ఈ రాత్రి మధురవాణికి పార్టింగ్ విజిట్ యివ్వందీ పోకూడదు.

[రాగవరసతో పాడును.]

నీసైటు నాడి లైటు;
నిన్ను మిన్న
కాన కున్న
కైవ్వటు రెచడ్ ప్లైటు,
మూమలేని సైటు

[ఒక బంట్రోతు ప్రవేశించును.]

బంట్రోతు—నేను పోటిగరాప్పంతులుగారి నౌఖర్నండి, లెక్క జమారుగుంపండి, పోటిగరాపుల కరీదు యెంటనె యిప్పించమన్నారండి.

—(విననట్టు నటించుతూ)

పుల్లమూను లైటటా,
జానమిన్ను వైటటా,
మూను కన్న
మొల్ల కన్న,
నీదు మోము బ్రైటటా,
టా ! టా ! టా !

బంట్రోతు—యంతమందిని పంపినా యిచ్చారు కారటండి, నేనాళ్ల లాగూరుకుండే వోణ్ణికానండి.

—అయ్యో నేటికి తోవయిదే;

బంట్రోతు—యక్కడి శెవిటిమాలోకం వొచ్చిందయ్యా.

—వంటి దుకాణవాఁడికసా బజార్లోగాని యిటివే పులేదు.

బంట్రోతు—(గట్టిగాచెవిదగ్గిర నోరుపెట్టి) పోటిగరాపులు కరీదిస్తారా యివ్వరా?

—స, రాధారీ బంగాళాలో చెయ్యొచ్చును.

బంట్రోతు—(మరీగట్టిగా) యాడాదికిందట మీరూ సాన్దీ కలిసియేసుకున్న పోటిగరాపులకరీదు మాపంతులు నిలబెట్టి పుచ్చుకోమన్నారు.

—హో నీవటోయ్, యవరో అనుకున్నాను. నింపాదిగా మాట్లాడు, నింపాదిగా మాట్లాడు. రేపువుదయం యెనిమిది ఘంటలకి పూటకూళ్ళమ్మ యింటికి వస్తే అదా ఫయిసల్తో సొమ్మిచ్చేస్తాను. మీపంతులికి స్నేహం మంచీ చెడ్డా అక్కర్లేదూ?

బంట్రోతు—మాటల్తో కార్యంలేదు మొల్లోశెయ్యెట్టి నిలున్నపాట్ని పుచ్చుకోమన్నారండి.

గిరి—పెద్దమనిషివిగదా; నువ్వు తొందరపడ్డం మంచిదేనా; నీ తండ్రి యంత పెద్ద మనిషి. యీ చుట్టచూడు యంత మజాగా కాల్తుందో. హవానా అంటారు దొర్లు దీన్ని. రేపొద్దున్నరా రెండు కట్టలిస్తాను.

బంట్రోతు—శిత్తం సొమ్మమాటేం శలవండి.

గిరీశం—చెప్పానుకానా? రెపొద్దున్న యివ్వకపోతే మాలవాడికొడుకు ఛండాలుడు

బంట్రోతు—మాలాడికొడుకు శండాలుడు కాకుంటే మరేటండి.

గిరీశం—నీకు నమ్మకం చాలకపోతే యిదిగో గాయత్రీపట్టుకు ప్రమాణంచేస్తాను.

బంట్రోతు—శిత్తం, రేపు పొద్దున్న సొమ్మియ్యకపోతేనా అబోరుండదండి.

గిరీశం—అహాః. నీ అబోరు ఒహటీ, నా అబోరు ఒహటీనా? [బంట్రోతు నిష్క్రమించును.]

ఇన్నాళ్ళకి జంఝప్పోగవిని యోగంల్లోకి వొచ్చింది. థియాసాఫిస్టులు చెప్పి నట్లు మన ఓళ్లు కష్టమ్సు అన్నిటికీ యేదో ఒహ ప్రయోజనం ఆలోచించే మన వాళ్లు యేర్పరిచారు. ఆత్మానుభవం అయితేనేగాని తత్వం బోధపడదు. ఈ పిశాచాన్ని వొదుల్చుకునేసరికి తలప్రాణంతోక్కొచ్చింది. శీఘ్రబుద్ధిః పలా యనం. పెందరాళే యీవూర్నించి వుడాయిస్తేనేకాని అబోరు దక్కదు. యిక మధురవాణియింటికి వెళదాం. మేక్ హే వైల్డీ సన్ షైన్స్ అన్నాడు.

---

## ౨-వ స్థలము. మధురవాణియింట్లో గది.

[రామప్పపంతులు కుర్చీమీదు కూర్చుండును, మధురవాణి యెదుట నిలుచుండును.]

రామ—(జేబులోనుంచి చుట్టతీసి పంటకొన కొరికి) పిల్లా, అగ్గిపుల్ల.

మధురవాణి—(అగ్గిపుల్ల వెలిగించి చుట్టకందించుచుండగా రామప్పంతులు మధుర వాణి బుగ్గను గిల్లును. మధురవాణి చుట్టకాలకుండానే అగ్గి పుల్లనార్పి యెడంగా నిలబడి కోపం కనపర్చుతూ) మొగవాడికయినా ఆడదానికయినా నీతివుండాలి కాళవద్దంటే [illegible]

9

—నిన్ను వుంచుకోవడానికి అంతా నిశ్చయమయి రేపో నేడో మంచి ముహూర్తం
చూసి మావూరు లేవతీసుకు వెళ్లడానికి సిద్ధవఁయ్యేంటే యింకా యెవడో
స్వా హేగాడి ఆడాల్లో వున్నానంటూ పాతివ్రత్యంనటిస్తావేమిటి?

—వేశ్య అనగానే అంత చులకనా పంతులుగారూ? సానిదానికిమ్మాత్రం నీతి
వుండొద్దా? మాపంతులుగార్ని పిలిచి "అయ్యా యిటుపైని మీతోవమీది,
నాతోవనాది" అని తెగతెంపులు చేసుకున్నదాకా నేను పరాధీనురాలినే అని
యెంచండి. మీరు దెప్పిపొడిచినట్టు ఆయన నైదీకయితేనేమి, కిరస్తానం మని
తేనేమి, పూటకూళ్లమ్మను వుంచుకుంటేనేమి నన్ను యీనాళ్లూ ఆ మహారాజు
పోషించాడుకాడా? మీరంతకన్న రసికులయినా, నామనస్సు మీరు యెంత
గొన్నా, ఆయనయడల విశ్వాసం నాకుమట్టుకు వుండొద్దా?

—పెద్దపెద్దమాటలు ప్రయోగిస్తున్నావు! వాడి బతుక్కి వాడు పూటకూళ్లమ్మని
వుంచుకోవడం కూడానా! పూటకూళ్లమ్మే వాణ్ణి వుంచుకుని యింతగంజి
పోస్తూంది.

—అన్యాయం మాటలు ఆడకండి, ఆయన యెంత చదువుకున్నాడు, ఆయనకి
యెంతప్రఖ్యాతి వుంది! నేడో రేపో గొప్ప వుద్యోగం కానైయ్యింది.

—అహహ (నవ్వుతూ) యేం వెఱ్ఱినమ్మకం! నీవు సానివాళ్ళలో తప్పపుట్టావు.
లింగారు గిరీశంగారు అని పెద్దపేరు పెడతావేవిఁటి, మావూళ్లోవున్న లుబ్ధావ
ధాన్లు పింపల్లికొడుకా్కడూ కిడూ! గిఱ్ఱడని మేం పిలిచేవాళ్ళం. బొట్లేరు
ముక్కలు రెండు నేర్చుకోగానే ఉద్యోగాలే! వాడికల్లా పక్కటే వుద్యోగం
దేవుడు రాశాడు. యేవిఁటో తెలిసిందా? పూటకూళ్లమ్మయింట్లో డప్పిక్కిచేరి
ఆవిడ చాకిరీచెయ్యడం.

—యీమాటలు ఆయన్ని ఆడుగుదునా?

—తప్పకుండా, కావలస్తే నేను చెప్పాననికూడా చెప్పు.

—అయినా ఆయన గుణ యోగ్యతలతో నాకేంపని? యేవఁయినా ఆయన నాకు
యజమాని ఆయన తప్పులు నాకళ్లకు కనబడవ్.

—అయితే ఆతడికి విడాకులు యెప్పుడిస్తావు?

—యిక్కడి ఋణాలూ పణాలూ తీర్చుకోడానికి మీరు శెలవిచ్చిన రెండు
రొక్కాలూ యిప్పిస్తే యీక్షణం తెగుతెంపులు చేసుకుంటాను.

రామ—అయితే యిందు (జేబులోనుంచి నోట్లు తీసియిచ్చును. మధురవాణి అందుకోకుండగా రామప్పంతులు చెయ్యిపట్టి లాగును. మధురవాణి కోపంతో చెయి విడిపించుకుని నోట్లు పారవేసి దూరముగా నిలుచును.)

మధు—మీతో కాలక్షేపం చెయ్యడం కష్టం. ఒక నిర్ణయంమీద నిలవని మనిషిని యేవన్నమ్మను?

రామ—(నోట్లుయెత్తి) క్షమించు, అపరాధం, (నోట్లు చేతికిచ్చును) లెక్కపెట్టి చూసుకో.

మధు—ఆమాత్రం మిమ్మల్ని నమ్మకపోతే మీతో రానేరాను. యింత రసికులయ్యుండీ నామనస్సు కనిపెట్టజాలినారుకారు గదా? మీనోట్లు మీవద్దనే వుంచండి. నేను డబ్బుకక్కూర్తి మనిషినికాను (నోట్లు యివ్వబోవును.)

రామ—వొద్దు! వొద్దు! వొద్దు! నీమనసు కనుక్కుందావని అన్నమాటగాని మరొకటి కాదు. గాని, యీగిరీశం గుంటవెధవ, వీడెవడో మా గొప్పవాడనుకుంటున్నావేవిటి?

మధు—ఆయన్ని నాయవట తూలనాడితే యిదుగో తలుపుతీశాను విజయంచెయ్యండి (తలుపుతీసి ఒక చేత పట్టుకుని రెండవ చేతి వేలుతో పైకిత్రోవ చూపును), అదుగో గిరీశంగారే వొస్తున్నారు, ఆమాటేదో ఆయన్తోటే చెప్పండి.

రామ—వేళాకోళం ఆడుతున్నావూ?

గిరీశం—(వాకట్లోనుంచి) మైడియర్.

రామ—(ఆత్మగతం) అన్న, వేళగాని వేళొచ్చాడు గాడిదకొడుకు, తంతాడుకాబోలు, యేవిటి సాధనం, యీ మంచంకింద దూరదాం. (మంచంకింద దూరును.)

[గిరీశం ప్రవేశించును]

గిరీశం—వెల్, మైడియర్ ఎంప్రెస్. (బుజముమీద తట్టబోవును.)

మధు—(ఒసిలి తప్పించుకుని) ముట్టబోకండి.

గిరీశం—(నిర్ఘాంతపోయి) అదేమిటి ఆవికారం.

మధు—ఆఖరు వికారం.

గిరీ—(ఆత్మగతం) నేను వుడాయిస్తానని దీనికెలా తెలిసింది చెప్మా! సానివాళ్ళకి కర్ణపిశాచివుంటుంది కాబోలు (పైకి) మైలపడితే స్నానంచేసి వేగిరం రా.

—యిప్పుడేంతొందర, తలంటు కుంటాను.

—(ఆత్మగతం) చబాష్. యేమి నీతియున మనిషి యిది! వెనకాల చుట్టుకో నివ్వ కూడా యెత్తు యెత్తింది!

—మైలాగియిలా మాయింగ్లీషువాళ్ళకి లక్ష్యంలేదు యిలా రా (దగ్గిరికి చేరును.)

—(వెనుచూసి) అక్కడనే ఆగండి. మీరు కిరస్తానం అయితే కావచ్చును. నేను కిరస్తానం యింకా కాలేదు. మీరు కిరస్తానం అన్నమాట యిప్పుడే ఒకరు చప్పగా విన్నాను.

—(తనలో) నా చెప్పావంటుందా యేమిటి!

—ఒకరు చప్పగా విన్నావూ? యవరా జెప్పింది? యవడికిక్కడికి రావడానికి మకదూర్ వుంది? యిలాంటి చాడీకోర్ కబుర్లు చెప్పడానికి యవడికి గుండె వుంది? ఆ మాటలు విని నాతో చెప్పడానికి నీ కెక్కడ గుండెవుంది? చెప్పు!

—(తనలో) తంతాను కాబోలు, యిరుక్కు చిక్కడ్డాను.

—మొగాడే చెప్పాలాయేవిటి? ఆడవాళ్లకి దేవుడు నోరివ్వ లేదా?

—(తనలో) పూటకూళ్లముండే చెప్పింది కాబోలు (పైకి) ఆడదా? ఆడదాన్ని నోరు బెట్టుకు బతకమనే దేవుడు చేశాడు. పరువయిన ఆడది నీయింటికెందుకొస్తుంది.

—పరువైన మొగాళ్లొచ్చినప్పుడు పైరువైన ఆడవాళ్లెందుకు రాకూడదు? ముందు మాచోండి. తరవాత కోప్పడుదురుగాని, చుట్టతీసుకోండి, అదుగో అగ్గి పెట్టె.

—చుట్టకోడానికి వల్లలేకపోతే అగ్గిపుల్ల వెలిగించి యివ్వడానికయినా పెట్టిపుట్టాను కానా? యీవాళ మహోత్సాహంగా వచ్చానుగాని ఉత్సాహభంగం చేశావ్.

—యేవిటా వుత్సాహం?

—యిదిగో జేబులో హైదరాబాద్ నైజామ్‌వారి దగ్గిర్నించివొచ్చిన ఫర్మానా. మహాస్తం నవాబ్ సదరదౌలత్ బావురల్లీఖాన్ ఇస్పహాన్ జంగ్ బహద్దర్ వారు శిఫార్సుచేసి వెయ్యి సిక్కారూపాయలు జీతంతో ముసాయిబ్ ఉద్యోగం నాకు చెప్పించారు. అనగా హమేషా బాద్షావారి హుజూర్న వుండడం.

—(తనలో) యెవిట్రా వీడిగోతాలు!

—యింతశుభవార్త తెచ్చినా, దగ్గిరకి రానిచ్చావు కావుగదా? నాతో హైదరాబాద్ వస్తావా?

మధు—(తలతిప్పుతూ) నే యెందుకు ? పూటకూళ్లమ్మని తీసికెళ్ళండి.

గిరీ—(నిర్ఘాంతపోయి) పూటకూళ్ళమ్మ యేవఁయినా వెంట పెడుతూందా యేవిఁటి?

మధు—మీకే తెలియాలి.

గిరీ—నీ తెలివి తక్కువ చూస్తే నాకు నవ్వొస్తూంది. యెవ డేమాటన్నా నామీద నమ్మ వేఁనా? యీఘోరవైఁన అబద్ధాలు నీతో యవడు చెబుతున్నాడో కనుక్కోలేకు న్నావా యేవిఁటి ? సప్తసముద్రాల్దాటినా వాడి పిలకట్టుకుని పిస్తోల్తో వొళ్ల తూట్లు పడేటట్టు ధాం ధాం మని కొట్టకపోతినట్టయినా నాపేరు గిరీశమే కాదు. భీషణశంఖము చేపడతిత్తమే! కబడ్దార్ !.

మధు—సముద్రాలవతలకెళ్లి వెతకక్కర్లేదు. ఆచెప్పేమనిషి మీ యదటే చెబుతాడు.

రామ—(తనలో) యీముండ నన్ను బయలుపెడుతుంది కాబోలా దైవమా!

గిరీ—(తనలో) థాంక్గాడ్. అయితే పూటకూళ్లదాన్దెబ్బతగల్లేదు. (పైకి) యిలాటి దుర్మార్గపుకూతలు ఆయిల్లాలు చెవినిపడితే చాలా ఖేదిస్తుంది. ఆపాపవఁంతా నిన్ను చుట్టుకుంటుంది. ఆమె యంత పతివ్రత ! యంత యోగ్యురాలు !

మధు—వెధవముండకి పాతివ్రత్యం అన్నమాట యీనాటికి విన్నాను.

గిరీశం—దానికి... కాదు ఆమెకి మొగుల్లేక పోయినా ఆమెను వెధవనడానికి వీల్లేదు.

మధు—మీరుండగా వెధవెలా అవుతుంది ?

గిరీశం—నాన్సెన్స్ (దీనికో కథ చెప్పి రంజింపచేదాం) యిదుగో విను. దాని నిజం యెవిఁటంటే—పూటకూళ్ళమ్మ ముచ్చటగా తప్పటడుగులు వేశే రోజుల్లో ఒక కుసుష్టి ముసలాడికి కట్ట నిశ్చయించారు. పుస్తె కట్టబోతూంటేనో కట్టిన వుత్తర క్షణం లోనో ఆముసలాడు పెళ్లిపీటలమీదే గుటుక్కు మన్నాడు. అప్పుడు పెళ్లి అయినట్టా కానట్టా అని మీమాంస అయింది. కొందరు పుస్తె కట్టాడన్నారు. కొందరు కట్టలేదన్నారు. పిల్లతండ్రి, పెళ్ళికొడుకు వారసులమీద దావా తెచ్చాడు. పురోహితుడు వాళ్ళదగ్గిర లంచంపుచ్చుకుని పుస్తె కట్టలేదని సాక్ష్యవిఁచ్చాడు. దాంతో కేసుపోయింది; మరిదాన్నెవరూ పెళ్ళాడారు కారు.

మధు—అయితే మరిమీకు తప్పులేదే ?

గిరీశం—యేవిఁటి యీ నాటమాటలూ! నాకు ఆదీ అంటూ తెలియకుండా వుంది! అసందర్భం!

ఆహాఁ సరసంవిరసంగా ... ! ... నిర్లక్ష్యంగా ...

జమనిగానీ అంటీవా, చూడు నాతడాఖా. యవడీమాటలు చెప్తూన్నాడో వాడి పేరుతక్షణం చెబుతావా చెప్పవా ?

మధు—రామ.

గిరీ—(తనలో) సచ్చాన్రా, పేరు చెప్పేసింది !

మధు—రామ! రామ! ఒహరు చెప్పేదేవిఁటి లోకవంఁతా కోడై కూస్తూంటేను ?

(వీధిలోనుంచి తలుపుతలుపు అనిధ్వని.)

గిరీ—(తెల్లబోయి) తలుపుతీయొద్దు, తియ్యొద్దు ఆపిలిచేమనిషి వెట్టిముండ మనుష్ని కరుస్తుంది.

మధు—తలుపు తీసేవుంది.

గిరీ—చంగునవెళ్ళి గడియవేసెయ్.

మధు—అదుగో తలుపుతోసుకు వోస్తూంది.

గిరీ—గెంటెయ్, గెంటెయ్.

మధు—ఆ వయ్యారం చూస్తే మీ పతివ్రితలా కనిపిస్తూంది. (మధురవాణి వాకట్లోకి వెళ్ళును.)

గిరీ—మంచంకింద దూరుదాం (గిరీశం మంచంకింద దూరును.)

(తనలో) దొంగలంజ సరసుణ్ణిదా చిందోయ్ మంచం కింద. యిదేవిఁటోమంచి మనిషి అని భ్రమించాను. దీన్తస్సా గొయ్యా. సిగపాయిదీసి తందునుగాని యిది సమయింకాదు. అయినా పోయేవాడికి నాకెందుకురొష్టు, (రామప్పంతులుతో మెల్లిగా) యవరన్నా మీరు, మహానుభావులు ?

రామ—నేను రామప్పంతుల్నిరా, అబ్బాయీ.

గిరీ—తమరా. యీమాత్రానికి మంచంకింద దాగోవాలా, మహానుభావా ? నన్నడిగితే యీలాంటి లంజల్ని యిరవై మందిని మీకు కన్యాదానం చేతును.

రామ—(తనలో) బతికాన్రా దేవుఁడా; (పైకి) నువ్వురా బాబూ దీన్నుంచుకున్నావు ! ఆలా తెలిస్తే నేరాకపోదును సుమా.

గిరీ—మాటవినపళ్ళేదు కొంచం యిసుంటా రండి. (రామప్పంతులు ముందుకుజరుగును, గిరీశం అతన్ని తప్పించుకుని గోడవేపు చేరును.)

గిరీ—అన్నా యీలంజని యిన్నాడూ నమ్మకండీ, యిలా యిరవైమందిని దాచగల శక్తుంది, దీనికి.

రాము—రెండువందలు దొబ్బిందిరా బాబూ.

గిరీశం—నువ్వు లేంజాగర్త చేశారా?

రామ—అంతేనా?

గిరీ—మరేపిటి?

(మధురవాణిన్ని పూటకూళ్ళమ్మ వల్లెవాటులో చీపురుగట్టదాచిన్ని ప్రవేశింతురు.)

మధు—మీరన్నమనిషి యిక్కడలేరంటే చెవినిబెట్టరుగదా!

పూట—నీయింట్లో జొరబడ్డాడని వీధులో వాళ్లుచెబితే నీమాట నమ్మతానా యేమిటి! ఆవెధవవుంటే నాకేం కావాలి, వుండకుంటే నాకేం కావాలి. వాడునీకిచ్చిన యిరవయి రూపాయలూ యిచ్చెయ్.

మధు—యవడికిచ్చావో వాణ్ణే అడగవమ్మా.

పూట—వెధవకనబడితే సిగపాయిచేసి చీపురుగట్టతో మొత్తుదును, యెక్కడదాచావేపిటి?

మధు—నాకు దాచడం ఖర్మవేమి నేను మొగవాళ్నికాను. వెధవముండనీ కాను నాయింటికొచ్చేవాడు మహారాజులాగ పబ్లీగ్గావొస్తాడు (కంటిలో మంచము కిందుచూపును.)

పూట—మంచంకింద దాగాడేమో-(మంచము కిందుకు వంగి) నీ పరువు బుగ్గయి నట్టేవుంది లేచిరా (చీపురుగట్ట తిరగవేసి రామప్పంతులును కొట్టును.)

రామ—ఓర్నాయనా, నన్నెందుకొడతావే దండుముండా? (మంచంకిందినించి పైకి వచ్చి వీపు తడుముకొనును.)

మధు—ఆయన్నెందుకు కొట్టావు? నాయింటికొచ్చి యేమిటీ రవ్వ?

పూట—అయితే మంచంకిందెందుకు దూరాడూ?

మధు—నీ కెందుకు కాగోవ? అదో సరసం.

పూట—యిదో చీపురుగట్ట సరసం.

రామ—(వీపుతడువుకుంటూ) నీసిగతరగా, ఆడదానివైపోయినావే, లేకుంటే చంపే పోదును. నీ రంకు మొగుణ్ణికొట్టక నన్నెందుకొట్టావే ముండా? అందుకా నన్ను ముందుకి [illegible] గడపవు దాచున్నాడు.

పూట—అవిధవ కూడా వున్నాడమ్మా మంచంకింద! కుక్కా పైకిరా.

రామ—వెఱ్ఱిపప్పా! మంచంకిందకి రా, వెఱ్ఱి వొదలగొడతాను.

పూట—అప్పచ్చిట్రా వెధవా నీకు? నీకు భయపడతా ననుకున్నావా యేమిటి? నీ పాలిముండ యెలా అడ్డుకుంటుందో చూస్తాను. (పూటకూళ్ళమ్మ ఒకవేపునుంచి మంచంకిందికి దూరును. మరి వొక వేపునుంచి గిరీశం పైకివచ్చి రామప్పంతులు శిక్ష చరిచి లఘువేసి పెరటివేపు పరిగెత్తిపోవును.)

రామ—నచ్చాచ్రా నాయనా (రెండు చేతుల తలపట్టుకొని) మధురవాణీ యేవీ దీపొచ్చి! కనిష్టీబు క్కాబు రంపించూ.

మధురవాణి—యెందుకు పల్లకున అల్లరీ అవమానవున్నూ! రేపో యెల్లుండో మీరే వాడికి దెబ్బకి దెబ్బతీసి పగతీర్చుకుందురుగాని.

(మధురవాణి రామప్పంతుల్ని కౌగలించుకొని తలముద్దెట్టుకుని చేతరాసి) దుర్విదుష్టు! మొగవాడయినవాడు యెదుట నిలిచి కొట్టాలి. దొంగ దెబ్బకొడ కాదూ? వాడిపొంకం అణుతుంగాని లెండి.

రామ—గవురను మెంటు జీతమిచ్చుంచిన కనిష్టీబులుండగా మనకందుకు శరీరాయాసం? యీ వెధవని పజ్యెండు కోర్టులంటా తిప్పకపోతే నేను రామప్పంతుల్నికాను చూడు నాతమాషా!

మధు—(రామప్పంతుల్ని ముద్దుపెట్టుకుని) మాటాడక వూరుకోండి. మంచంకింది వేపు చూపించి నోరు మూసి) దొంగ దెబ్బకొట్టినవాడిదే అవమానం; మీది కాదు.

పూట—నొప్పెవడి దనుకున్నావు? ఆముండ మంచంకిందనించి రాదేం? చీపురుకట్టలాగ్గా.

పూట—ఫడేల్మంటే పస్తాయించి చూస్తున్నాను. నీ మొగతనం యేడిసినట్టేవుంది. (పైకివచ్చును.)

(అంతా నిష్క్రమింతురు.)

---

శ్రీ

# కన్యాశుల్కము — ద్వితీయాంకము.



## ౧-వ స్థలము. కృష్ణారాయపురం అగ్రహారంలో అగ్నిహోత్రావధాన్లు ఇల్లు.

-:)o(:-

(అగ్నిహోత్రావధాన్లు జంఝాలు వడుకుచుండును. కరటకశాస్త్రుల్లు శిష్యుని చేత శేనిపేలు నొక్కించుకొనుచుండును. వెంకమ్మ కూర తరుగుచుండును.)

వెంకమ్మ—నిన్నటినుంచి కిళిమీళ్ళలవులని కుఱ్ఱవాడు వుత్తరం రాశాడు. యెన్నాళ్ళ యింది వాణ్ణిచూసి, కళ్ళు కాయలుకాసిపోయినాయి. గడియో గడియో రావాలి.

అగ్నిహోత్రావధాన్లు—ఎందుకు వొట్టినే వగచడం? వొద్దు వొద్దంటూంటే యీ యింగిలీషు చదువులోపెట్టావ్. మెరకపొలం సిస్తంతావాడి కిందయిపోతూంది. కిందటియేడు పరీక్ష ఫేలయి పోయినాడుగదా? యీయేడు యెలాతగలేస్తాడో తెలియదు. మనకీ యింగిలీషు చదువు అచ్చిరాదని పోరిపోరిచెబితే విన్నావు కావు. మాపెద్దన్న దిబ్బావుధాన్లు కొడుకుని యింగిలీషు చదువుకు పార్వతీపురం పంపించేసరికి వూష్టం వొచ్చి మూడ్రోజుల్లో కొట్టేశింది. బుచ్చమ్మ కొడుక్కి యింగిలీషు చెప్పిద్దావనుకుంటూండగానే చచ్చినంత పాయిశాపం చేసింది.

వెంకమ్మ—మీ రెప్పుడూ యిలాంటి వోఘాయిత్తం మాటలే అంచూవుంటారు. డబ్బు ఖర్చయిపోతుందని మీకు బెంగ, మొన్న మొన్న మనకళ్ళెదుట మనవాకిట్లో జుత్తు విరబోసుకు గొట్టికాయలాడిన నేమానివారి కుఱ్ఱాడికి మునసబీ వొచ్చింది కాదూ?

అగ్ని—మనవెధవాయికి చదువొచ్చేదేం కనపడదుగాని పుస్తకాలకిందా జీతంకిందా డొక్కుఖుబా బ్బాలుగేళ్ళయే సరికి మురభూమి కడితేరిపోతుంది. ఆఫైని చిప్పా దొప్పా

మ్ముకు బయల్దేరాలి. నిమ్మళంగా యింటి దగ్గిరుంటే యీపాటి నాలుగక్షరాలు వచ్చేవును. వొద్దంటూంటే యీ వెధ వింగిలీషు చదువులో పెట్టావు.

...—మనవాడిక్కో మునసబీ నివా పోలీసుపనైనా ఐతే పణాలిచ్చి యీ అగ్ర... భూవు(లన్నీ కొనేస్తాడు యీవాడికో నూఱ్ఱూపాయలు ఖర్చుపెట్టడాని... ముందూ వెనకా చూస్తున్నారు, మీలాగేవాడూ జంఝాలు వొడుక్కుంటూ... కాలం వుండా యేవిటి? మీకంత భారవంతోస్తే మావాళ్ళు నాకు పసుపూ కుంకానికి యిచ్చిన భూవిఁ అమ్మేసి కుఱ్ఱాడికి చదువుచెప్పిస్తాను.

...స్త్రీ—నీభూవెందు కమ్మా లమ్మా? మనసొమ్ము చడలిని కొవ్వున్నాను, ...డే పెట్టుకుంటాడు.

...—ఐతే నన్ను ఆక్షేపణ చేస్తావషే? యీ మారంటే నీ అన్నవున్నాడని వూరు ...నేదిలేదు.

[గిరీశం వెంకటేశం ప్రవేశింతురు.]

...—మాబాబ్బా బాబు వచ్చావషాయ్! (వెంకటేశమును కౌగలించుకొనును.)

...—వెధవాయీ యీమారైనా పాసయినావా? (వెంకటేశం తెల్లబోయి ...చును.)

...—పాసయినాడండి, ఫస్టుగా పాసయినాడు. నేను చాలాశ్రమపడి చదువు చెప్పానండి.

...—యీతుర కెవడోయ్?

...—టస్! డామిట్, జెంటిల్మాన్.

...—మానా? మానులావుంచా నంచావూ? గూబ్బగల గొడతాను.

...శం—(వణుకుతూతల్లి వేపుచూసి) అమ్మా యీ యన్న నాకు చదువు చెప్పే ...ష్టరు.

...—ఇంటికి పెద్దమనిషొస్తే అప్రచ్ఛపు మాటలాడతావేవిటి బావా? ఆయనేదో ...స్టువాడిలో యింగిలీషు మాటంటే పుచ్చకాయలదొంగంటే బుజాల్తడువు... ...ట్టు నీమీద పెట్టుకుంటావేం? (బండివాడు సామాను దింపును.)

గిరీశం—(కరకటశాస్త్రితో) తమ బావగారా అగ్నిహోత్రావధాన్లుగారు? నన్ను తమరు యెరక్కపోవచ్చునుగాని డిప్టీకలక్టరుగారింటికి తమరు వచ్చేటప్పుడు నేను వారి పిల్లలికి చదువు చెబుతూ వుండేవాణ్ణి, డిప్టీకలక్టరుగారు తమర్ని యే మెచ్చుకునేవారనుకుంటారు!

కరట—అవును మీ మొఖం చూసినజ్ఞాపకవుంది. డిప్టీకలక్టరుగారు మహాదొడ్డ ప్రభువ్.

గిరీశం—మీలాంటి చప్పన్నభాషలూ వచ్చిన మనిషిని యెక్కడా లేడని, సంస్కృతం మంచి నీళ్ళప్రవాహంలా తమరు మాట్లాడతారని, తమలాంటి విధూషకుణ్ణి యెక్కడా చూళ్ళేదనీ డిప్టీకలక్టరుగారు శలవిస్తూండేవారు. కవితారసం గ్రహించేవారేరీ? నాకవిత్వవంటే ఆయన్న చెవికోసుకుంటారు. మహారాజావారిదర్శనం కూడా నాకు చేయించారండి.

అగ్ని—(ధుమధుమలాడుతూ) ఈ శషభిషలు నాకేం పనికిరావు. యిటీవె వైఖరి చూస్తే యిక్కడే బసవేసేటట్టు కనపడుతూంది. మాయింట్లో భోజనం యిది మాత్రం వీలుపడదు.

వెంక—ఆయనమాటలు గణించకు బాబూ, ఆయన మోస్తరది. మీదయవుంచి మావాడికో ముక్కచెబితే మీ మేలు మరిచిపోం.

గిరీశం—అందు కభ్యంతర వేవిటమ్మా. మీవాడు శలవుల్లో చదువు చెప్పమని యింటో బతిమాలుకుంటే పోనీ పనికొచ్చే కుఱ్ఱవాడుగదా అని వొచ్చానుగాని పట్నంలో మునసబుగారింట భోజనం చేసని వొచ్చానా వారిచ్చేదబ్బు చేదని వొచ్చానా అన్నీ

వెంకమ్మ—యీ చదువులకోసవని పిల్లణ్ణి వొదులుకునివుండడం, వాడు పరాయిప్రాణం శ్రమదమాలు పడుతూండడం నాప్రాణాలు యెప్పుడూ అక్కడే వుంచాను. డబ్బంటే యెన్నడూ వెనక చూళ్ళేదుగదా. మేం కనడంమట్టుకు కన్నాం. మీరే వాడికి తల్లీ తండ్రీని. యలా కడుపులో పెట్టుకు చదువు చెబుతారో మీదే భారం.

గిరీశం—తమరు యింతదూరం శలవియ్యాలమ్మా? నామంచిచెడ్డలు మీకుఱ్ఱవాణ్ణి అడిగితే తెలుస్తుంది. మునసబుగారూ, డిప్టీకలక్టరుగారూ యెన్నిక చేసిన మనిషి నామాటనే చెప్పుకోవాలా, ఇంతెందుకూ. యిక మూడేళ్ళు నాతరిఫీదులో వుంచితే క్రిమినల్లోకరనగా పోలీసుపరిక్ష పాసుచేయిస్తాను.



....

—మాడేళ్లే! యీసంవత్సరం పుస్తకాల కెంతవుతుందిరా అబ్బీ!

శం—పది హేన్రూపాయ లవుతుంది.

—ఒక్కదమ్మిడీ యివ్వను. పిల్లిద్దరూకూడి ఆరూపాయలు పంచుకుతినేటట్టు కనపడుతూంది. నేను వేదం యనభై రెండుపన్నాలూ ఒకదమ్మిడీ పుస్తకాలఖర్చు లేకుండా చదువుకున్నాను. ఇదంతా టోపీ వ్యవహారంలా కనపడుతుంది.

—(నవ్వుతూ) కోట్లకి విలవైనమాట అన్నావు బావా!

—(కరటకశాస్త్రితో) ది సీజ్ బార్బరస్, మాచారండీ, జెంటిల్మేను అనగా పెద్దమనిషిని యిలా అంటున్నారో! నేను యిక యిక్కడ వుండడం భావ్యం కాదు, శలవుపుచ్చుకుంటాను.

మ్మ—చాల్చాలు బాగా నేవుంది! యింటికి కొనబొచ్చినా నాకిదే భయం, ఆయన మాటల కెక్కడికి బాబూ, వెళ్లిపోకండి.

—అగ్నిహోత్రావధాన్లూ కుఱ్ఱవాడికి రవ్వంతచదువు చెప్పించడానికి ఇంత ముందూవెనకా చూస్తున్నావ్. బుచ్చమ్మనమ్మిన పదిహేను వొందల రూపాయి లేశేరావ్!

—సెల్లింగ్గర్ల్! డామిట్!

—ప్రతీగాడిదె కొడుకూ అమ్మావంమ్మా యంచూంటాడు. కూరగాయల్లోయ్ అమ్మడానికి? ఆరూపాయలు పుచ్చుకోకపోతే మొగుడు చచ్చాడుగదా, దాని కేం యావై యియ్యిందును?

—చచ్చాడంటే వాడిదా తప్పు, మంచమీంచి దింపేయడానికి సిద్ధంగా వున్న వాడికి కట్టావ్

—తమరేనా నులక అగ్నిహోత్రావధాన్లుగారు? యీపట్టైని జటలో తమంత వారు లేరని రాజమహేంద్రవరంలో మావాళ్ళనుకునేవారు.

—మీది రాజమహేంద్రమండీ ఆమాట చెప్పారుకారేం? రామావధాన్లు గారు బాగున్నరా?

—బాగున్నారండి. ఆయనమా మేనమావగారండి.

—ఆ మాట చెప్పారుకాదూ?

గిరీశం – మామావఁ యీ దేశభోఁగట్టా వొచ్చినప్పుడల్లా తమక్ని యెన్నిక చేస్తుంటా రండి

అగ్ని—నాకూ వారికి చాలాస్నేహం. చూశారా కొంచం నాకు వృగ్రిసమకోపం. యవరో తెలియకుండా అన్నమాటలు, గణించకండేం.

గిరీశం—దానికేవఁండి, తమవంటి పెద్దలు అనడం మాలాంటి కుఱ్ఱవాళ్ల పదస్సు విధాయకవేఁగదండీ!

కరట—(తనలో) యిన్నాళ్ళకి మా అగ్నిహోత్రుడికి తగినవాడు దొరికాడు.

అగ్ని—చూచారండీ, మీపేరేవిఁటండీ?

గిరీశం—గిరీశం అంటారండి.

అగ్ని—చూశారండి, గిరీశంగారూ! మా కరటక శాస్త్రుల్లు వట్టి అవకతవక మనిషి! మంచీ చెడ్డా యేమీ వాడి మనసుకెక్కదు. అల్లుడు చచ్చిపోయినాడంటే అందువల్ల యెంతలాభం కలిగింది. భూవుఁలకి దావా తెచ్చావాఁలేదా? నేను యీమధ్య దాఖలేచ్చేయించిన పిటీషను మీద ఆర్డరు చదవి పెట్టండి (గదిలోకి వెళ్ళి కాగితం తెచ్చి గిరీశంచేతికి యిచ్చును)

గిరీశం—(చూసి) ఎవడో తెలివితక్కువ గుమస్తా వ్రాసినట్టుంది. అక్షరశుద్ధి లేదండి.

అగ్ని—మావకీలు గడగడ చదివేశాడండి.

గిరీశం— నేను మాత్రం చదవలేక నా అంతకన్న గడగడా చదువుతాను. రెక్క ర్లచ్చేసండితున్నే నాకిది వేలపిండీ కాదు; అయితే రాసినవాడి తెలివికి సంతోషిస్తున్నాను. యిది అరిటిపండు విప్పినట్టు తర్జుమాచేసి దాఖలు చెయ్యవలెనలవా?

అగ్ని—అంతకంటేనా! (తనలో) డబ్బు ఖర్చులేకుండా పీకేచాత గాగితమ్ముక్కల్ని తర్జుమా చేయించేస్తాను.

గిరీశం—యింకా యింగ్లీషు కాయితాలు యేవుఁన్నా నామీద పారయ్యండి, తర్జుమా చేసిపెడతాను.

అగ్ని—అల్లాగే.

వెంకమ్మ—మా అబ్బాయి మీరు ఒకర్ని పర్యాయం యింగిలీషు మాట్లాడండి బాబూ,

శం—అలాగే నమస్తే.

My dear Venkatesam—
Twinkle! Twinkle! little star,
How I wonder what you are!

కటేశం—There is a white man in the tent.

శం—The boy stood on the burning deck
Whence all but he had fled.

కటేశం—Upon the same base and on the same side of it the sides of a trepezium are equal to one another.

శం—Of man's first disobedience and the fruit of that mango tree, sing, Venkatesa, my very good boy.

కటేశం—Nouns ending in *f* or *fe* change their *f* or *fe* into *ves*.

స్త్రీ—యీ ఆడుతూన్న మాటలికి అర్థంయేవిఁటండి ?

శం—యీ శలవుల్లో యేపరికారం చనవాలో అవంతా మాట్లాడుతున్నావండి.

టు—అబ్బీ వొక తెనుగు పద్యం చదవరా ?

కటేశం—పాఁ చుట్టకు సతిమోవికి—

టు—చబాష్ !

శం—డామిట్ ! డొంట్రీడ్ దట్, (మెల్లగా) "నలదమయంతులిద్దరు" చదువ్.

కటేశం—నలదమయంతు లిద్దరు మనః ప్రభవానల దహ్యమానులై సలిపిరి దీర్ఘ వాసర నిశల్.

టు—అట్టేఅట్టే, మనఃప్రభవానలవఁటండే యేవిఁట్రా ?

కటేశం—(యింటికప్పు వేపుచూసి వూరకుండును)

శం—పసిపిల్లలకి అలాంటికఠినవైఁన పద్యానికి అర్థం తెలుస్తుందా అండి ?

స్త్రీ—పద్యాలికి అర్థం చెప్పరూ ?

శం—యిప్పటిమట్టుకు వేదంలాగే భట్టీయం వేయిస్తారు. తెల్లవాళ్ళ స్కూళ్ళలో తెలుగుపద్యాలమీద ఖాతరీ లేదండి. యంతసేపూ జాగర్ఫీ, గీగర్ఫీ, అర్థమెటిక్, ఆల్జిబ్రా, మాథమాటిక్స్ యివన్నీ హాడలేసి చెప్తారండి.

కరటక—(తనలో) తర్ఫీదు మాచక్కగావుంది, వీణ్ణి కొంచరాశె తోవపెట్టకపోతే మోసంవొస్తుంది.

అగ్ని—అన్నోటి చెప్తారండీ?

గిరీశం—మరేవఁనుకున్నారు? మీకుఱ్ఱవాళ్ళాగ చదువుకునే వాడికి ఒకనిమిషమైనా తెరిపుండదు.

అగ్ని—ఆదుగో చదువంటే అల్లాగే చదువుకోవాలి. గొట్టికాయలాడకుండా మావాణ్ణి ఖాయిదాచేస్తే యంత చదువైనా వొస్తుంది.

గిరీశం—నాదగ్గిర గొట్టికాయిలు గిట్టికాయిలు పనికిరావండి. పుస్తకం చాలిపక్షే వేళ్ళకి పుస్తకం అంటుకుపోవాలి, ఆలాచదివిస్తానండి.

అగ్ని—ఆలాగేచేస్తే మావాడికి చదువొచ్చి అన్నిపరిక్షలూ పాసవుతాడండి. మావాడికి డబ్బుఖర్చులేకుండా పెళ్ళయె సాధనంకూడా తటస్థించిందండి.

వెంకమ్మ—మీ నైజంకొద్దీ ఛిఱ్ఱూ కొఱ్ఱూ మంటారుగాని మీకు మాత్రం అబ్బిమీద ప్రేవఁలేదా యేవిఁషి? పట్టంలో గొట్టాలమ్మొచ్చినప్పుడు యంతో బెంగెట్టుకుని అబ్బిని శలవఁజీరాసి వెళ్ళిపోయిరమ్మన్నారు కారా? చదువూ చెప్పించి పెళ్ళిచెయ్యాక తీరుతుందా యేమిషి?

కరట—డబ్బు ఖర్చులేకుండా కొడుక్కి పెళ్ళిచేస్తావుటోయి బావా? ఆడపిల్లని అమ్మినట్టే ననుకున్నావా యేవిఁటి? పదిహేను వొందలైనా పోస్తేనేగాని ఆళ్ళిక పిల్లనివ్వరు.

అగ్ని—డబ్బు ఖర్చులేకుండా వెంకడికి యలా పెళ్ళిచేస్తానో నువ్వేచూతువుగాని. రామచంద్రపురం అగ్రహారంలో లుబ్ధావధాన్లుగార్ని యెరుగుదువా?

కరట—యెరగను

అగ్ని—ఆయన లక్షాధికారి. పద్ధనిమిదివందలకి నుబ్బిని అడగొచ్చారు. ఉభయఖర్చులూ పెడతారట, పెళ్ళిమావైభవంగా చేస్తారట, మనం పిల్లనితీసికెళ్ళి వాళ్ళింటే పెళ్ళిచెయ్యడం, మనకి తట్టుబడి ఆట్టేవుండదు.. ఆపద్ధనిమిది వొందలూపెట్టి వెంకడికి పెళ్ళిచేస్తాను.

వెంకమ్మ—పెళ్ళికొడుక్కెన్నేళ్ళు?

అగ్ని—ఆట్టే లేవేవిఁ? నలభైయ్యాయిదు.

—బుచ్చావధాన్లు మా పైతల్లి కొడుకండి, తమతో సమ్మంధవంటే నాకు సంతోష మేగానండి. ఆయనకి అరవయ్యేళ్లు దాటాయండి, యీ పేవయినా సెల్లింగ్ గర్లన్ అవగా కన్యాశుల్కం, డామిట్! యంతమాత్రమూ కూడదండి, నేను పూనాలో వున్నప్పుడు ఆందువిషయమై ఒకనాడు నాలుగ్గంటలు ఒక్కబిగిని లెక్చరిచ్చానండి, సావకాశంగా కూచ్చుంటే కన్యాశుల్కం కూడని పనని తమచేతనే ఒప్పిస్తాను.

—బావా యీసమ్మంధం చేస్తే నీకొంపకి అగ్గెట్టేస్తాను.

—పెళ్లమ్మా శిఖాతరగ, ప్రతీ గాడిదకొడుకూ తిండిపోతుల్లాగ నాయింట జేరినవ్నాళ్లే, తాంబోలం యిచ్చేశాను యిహ తన్నుకుచావండి.

—నాతో చప్పకుండా నే?

—ఆడముండర్తో నా ఆలోచన? యీసమ్మంధం చైకపోతే నేను బాపిరాజుణ్ణే (లేచివెళ్లును.)

—యెంమార్ధవం.

—అన్నయ్యా! యీసమ్మంధం చేస్తే, నేన్నుయ్యోగోయ్యో చూసుకుంటాను. పెద్దాన్ని రొమ్మ్మమీద కుంపట్లాగ భరిస్తూ నేవున్నాం. ఆయనికి యంత యీడొచ్చినా కష్టంసుఖం వొళ్లునాటక యీ దౌర్భాగ్యపు సమ్మంధం కల్పించు కొచ్చారు. నేబతికి బాగుండాలంటే యీ సమ్మంధం తప్పించు.

—గట్టిఅసాధ్యం తెచ్చిపెట్టావే, వొట్టిమూర్ఖప గాడిదకొడుకు. యెదురుచెప్పిన కొద్దీ మరింత కొట్టెక్కుతాడు. యేంచేయగల్గుదునని నీకు భరవసా చెప్పను? యేమీ పాలుపోకుండా వుంది.

—అమ్మా మీరు యెందు కలావిచారిస్తారు? అవుధాన్లుగారు సావకాశంగా వున్నప్పుడు ఒకటిగంట కూచ్చుంటే డబ్బుచ్చుకు ముసలివాళ్లకి పెళ్లిచెయ్యడం దౌర్జన్యవని లెక్చరిచ్చి మనసు మళ్లిస్తాను.

—బాబూ, అతడు మీ మేనత్తకొడుకైతే మీకాళ్లు పట్టుకుంటాను. మీరు పెళ్లి ఆయ్యేన్న మనస్సు మళ్లిస్తుకూ. నాచర్మం చెప్పులుకుట్టిస్తాను.

—అమ్మ యేం చెప్పను! వాడో త్వాష్ట్రిం పిల్లదొరకడవే చాలువాడికి. సమ్మంధం వొదులుకుంటే వాడికి పేళ్లేకాదు. వాడనివాడొదిలే ఘటంకాడు.

కరట—అమ్మా నేనో ఉపాయం చెబుతాను యీలారా. (కరటకశాస్త్రిశిష్యుడు వెంకమ్మ నిష్క్రమింతురు.)

గిరీశం—మైడియర్ షేక్స్పియర్! నీతండ్రి అగ్గిరావుడోయి మా యింట్లో యిన్ని ళ్లకీ అతణ్ణిలాంగ దీశే యలోక్వెన్సులేదు. నాదెబ్బచూడు యీవాళ్లేం జేస్తానో. వీరేశలింగం పంతులుగారు కన్యాశుల్కం విషమై రాసిన ఉపన్యాసం నైకేదస్సు మామగారికి లెక్చరివ్వడానికి కృత్తి కశారీనూరాలి

వెంకటేశం—మీ లెక్చరు మాట అలావుణ్ణీండి గాని యీ వాళ నాగండం గడిచిందిగదా అనిసంతోషిస్తున్నాను. మీరు మాట్లాడకపోతే పరీక్ష ఫేలయినందుకు మావాన్న పెళ్ళి కట్టుతాడు తోచమ్మాలెక్కగొట్టును.

గిరీశం—యిలాంటి ప్రమాదాల్తప్పించుకోవడవేఁ ప్రజ్ఞ. యేమైనా డిఫికల్టీ వొచ్చి నప్పుడు ఒకరస్సావేశాంవంటే అది బ్రహ్మాభేద్యంగా వుండాలి. పొలిటిషనంటే మరేవిటనుకున్నావ్? పూజా నమస్కారాల్లేక బూజెక్కున్నాను గాని మన కంట్రియే ఇండిపెండెంట్ అయితే గ్లాడ్స్టన్ లాగ దివాన్గిరీ చలాయిస్తును. యేమి వాయ్! మీ తండ్రివైఖరి చూస్తే పుస్తకాలకి సొమ్మిచ్చేటట్టు కనపడదు. చుట్టలు పట్టనించి అరకట్టే తెచ్చావ్ంగదా, యేమి సాధనం?

వెంక—నాన్నివ్వకపోతే అమ్మనడిగి డబ్బుతెస్తాను

గిరీశం—నీబుద్ధియలా వికసిస్తూందో చూశావా? యిలా తర్ఫీదవుతుంటే నువ్వుకూడా పెద్దపొలిటిషను వవుతావు.

[బుచ్చమ్మ ప్రవేశించును.]

బుచ్చమ్మ—తమ్ముడూ అమ్మ కాళ్లుకడుక్కోమంచూందిరా.

గిరీశం—(తనలో) హా బ్యూటిఫుల్! క్వైటనెక్స్పెక్టెడ్!

బుచ్చమ్మ—అయ్యా మీరు చల్దివణ్ణం తించారా?

గిరీశం—నాట్టిల్లె పెస్టబ్లిక్ షన్, అనగా యంతమాత్రం అభ్యంతర లేదు. వడ్డించుడు గోవస్తున్నాను. తోవలో యేటిదగ్గిర సంధ్యావందనం. అదీ చేసుకున్నాను. (బుచ్చమ్మ వెళ్లును)

గిరీశం—వాట్ యీ మెమ నీ సిస్టరా? తలచెడ్డట్టు కనబడుతున్నదే?

…—మా అక్కే, జుత్తుకి చవుఁర్రాసుకోదు.

…—తల చెడ్డం అంటే, విడో అన్నమాట. చవుఁరు గివుఁరూ జాంతేనయ్.

…గాని యిన్నాళ్ళాయి నీకు విడో మారేజి విషయమై లెక్చర్లిస్తూవుంటే యీ కథ యెప్పుడూ చెప్పావు కావు? మీ యింట్లోనే ఓ అన్ఫార్చునేట్ బ్యూటిఫుల్ యంగ్ విడో వుండటోయ్! యేమి దురవస్థ! మైహార్ట్ మెల్ట్స్. నేనే తండ్రినైతే యీపిల్లకి విడోమారియేజ్ చేసి శాశ్వతమైన కీర్తి సంపాదిస్తును. (తనలో) యేమి చక్కఁదనం, యీసొంపు యెక్కఁడా చూశ్శేదే! పల్లెటూరు పూను పోదను కున్నానుగాని పెద్ద కాంపేనుకి అవకాశం యిక్కఁడకూడా దొరకడం నా అదృష్టం.

…—మా నాన్న నాకూఁడా పెళ్లి చేస్తాడు.

…—యీ వాళ్లో పెద్ద పెళ్ళి నీకు తలవెంట్రుకంత వాసి తప్పిపోయింది. యీ …పులాఖుల్లోగా తాళాధ్యాయం కాకుండా తప్పించుకుంటేనువ్ పూరా ప్రయోజకుడివే. యిహ నిజమైన పెళ్ళా? యింతచదువూ చదువుకుని నీతండ్రి కుదిర్చిన దేవీ యెరగని చిన్న పిల్ల కావుస్తె కడతాన్? మాంచి మొబ్బిగా బుట్టిగావున్న ముగ్ధాడోని నువ్ పెళ్ళాడకపోతే ఇషుశ్చి యమేష్టాఫ్యా!

---

## ౨. వ స్థలము. దేవాలయము.

…వ్వాల తోటలో మండపంమీద కూచుని, శిష్యుడు ప్రవేశించును.]

…—ఆర్నెల్లకోమాటు పొస్తకం ఒట్టుకుంటే కొత్తశ్లోకాలు పాతశ్లోకాలు ఒకలాగ కనపడతాయి. యిప్పుడు కొత్తశ్లోకం కనుక్కొమ్మంటే వాళకృవాఁ? …పంక్తి నెవణ్ణయినా ప్రశ్నడిగి కనుక్కోవాలి, లేకుంటే చటుక్కన పుస్తకం …విప్పియే శ్లోకం కనపడితే ఆశ్లోకం చదువుతాను.

"మృగాక్షిప్రియాళుద్రుమమంజరీణాం"

యిదేదో చదివినజ్ఞాపకం లీలగావుంది. లేళ్ళుపరిగెత్తాయని కాదూ? యేం …మాట చెప్పాడోయి కవి! లేళ్ళు పరిగెత్తితే యవడికి కావాలి, పరిగెత్తక

పాతే యవడికొ్కాలి? కుక్కలు పరిగెత్తుతున్నాయ్‌కావా, నక్కలుపరిగెత్తుతున్నాయ్‌కావా? పిల్లులు పరిగెత్తుతున్నాయి కావా? పనికొచ్చే ముక్క ఒకటి యీపుస్తకంలో లేదు. నాలుగంకెలు బేరీజు వేయడం. వొడ్డీ వాశీ కట్టడం కాళిదాసుకేం తెలుసును? తెల్లవాడిదా మహిమ! యిప్పట్నుం యెన్ని యేళ్ళుందో, యెకొండ లెక్కడున్నాయో అడగవయ్యా గిరీశంగార్ని; నిలుచున్న పాట్ను చెబుతాడు.

"ప్రియాముఖం కింపురుషశ్చుచుంబ"

ముద్దెట్టుకున్నాడటోయి ముండాకొడుకు. ముక్కట్టుకున్నాడు కాదూ!

[కరటకశాస్త్రి శిష్యునికి కనబడకుండా వెనుకనుంచి ప్రవేశించును]

"వర్ణప్రకర్షే సతి కర్ణికారం
ధునోతినిర్గంధతయాస్మ చేతః॥

యిదికూడా చదివినట్టె వుందోయి, ఆపువ్వెదో కవికిష్టంలేదట. యిష్టం లేకపోతె ములిగిపోయింది కాబోలు? మాగురువుగారికి దొండకాయ కూరయిష్టం లేదు, గురువుగారి పెళ్ళాం పెరట్లో దొండపాదుందని రోజూ ఆకూరేవొండుతుంది. బతికున్నవాళ్ళ యిష్టవేఁ యిలా యేడుస్తూంటే చచ్చినవాడి యిష్టాయిష్టాల్తోయేంపని? యీచదువిక్కడితో చాలించి గిరీశంగారిదగ్గిర నాలుగింగ్లీషు ముక్కలు నేర్చుకుంటాను వెంకడికి యింగిలీషొచ్చునని యేం గర్వంగా వుంది?

కరట—యేవిఁటగ్రాలిఅబ్బీ అంటున్నావు?

శిష్యు—యెదో నాస్వంత ఘోష.

కరట—గురువునిగదా, ఆదేదో నాకు కొచ్చం చెబుదూ.

శిష్యు—చప్పడానికేంవుఁండండి? నాటకంలో సాచాత వేషం కట్టించి పెద్దవాంళ్ళలాంటి హిందూస్తానీ ముక్కలూ, సంస్కృతం ముక్కలూ అర్థం తెలియకుండా భట్టీయం వేయించడానికి మీకు ఓపికుందిగాని నాకు నాల్గోఖులికో శ్లోకం చెప్పడానికి శ్రద్ధలేదుగదా? పట్నంవొదిలి ఆర్నెల్లకోమాటు అగ్రహారాలంట వొచ్చినప్పుడు మరేం పూనుపాక "పుస్తకం తియ్యంటె" సంసారంలెం యెం దేఁచ్చేది?

—ఇటు పైన్నాడు యలా చెబుతానో, రోజుకి నాలుగే శ్లోకాలు చెబుతాను.
శ్లోకం చదువు.

—"అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా।
హిమాలయో నామ నగాధిరాజః"॥

—మొదటికొచ్చావేం ?

—మొసలాకొసా వొక్క—లాగే కనపడుతూంది.
—(నవ్వి) పోనియ్, మొదణ్ణించే చదువుదాం.
—చదివినా యేంలాభవుంది. యీశ్లోకం శుద్ధ అబద్ధంట.
—యవరు చెప్పారు ?
—గిరీశంగారు.
—యేం చెప్పాడు ?
—హిమాలయం రెండు సముద్రాలికీ దాసి, రూళ్ల గఱ్ఱలాగలేదట. మాపులో చూపించాడు.

—హిమాలయం శిగగోశింగాని. ఆపుస్తకం మణిచి నామాటవిను.
—నిత్తం (పుస్తకం మూయును.)
—చదువన్న దెందుకు. పొట్ట పోషించుకోడానిగ్గదా ?
—అవును.
—యీరోజుల్లో సంస్కృతం చదువేవడి క్కావాలి ?
—దరిద్రులి క్కావాలి.
—బాగాచెప్పావు. నీకు యింగ్లీషు చదువుకోవాలనుందో!
—చెప్పించేదా లేడీ ?
—నేను చెప్పిస్తాను.
—నిజంగాను ?
—నిజంగాను, గాని ఒకషరతుంది.

శిష్యు—యేవిఁటండి?

కరట—నాకో కష్టసాధ్యమైన రాచకార్యం తటస్థించింది. అది నిర్వహించి నన్
చేసుకురావాలి.

శిష్యు—నావల్ల యేం రాచకార్యాలు కూడా వున్నాయా?

కరట—యీరాచకార్యం నీవల్లేకావాలి. మరెవడివల్లాకాదు. అదేవిఁటంటె, ఓటి
రోజులు నువ్వు ఆడపిల్లవై పోవాలి.

శిష్యు—గణియం పట్నంలోవుండి పోయిందే?

కరట—అట్టే గణియం అవసరం లేదు. నీకు తలదువ్వి, కోకకడితే పజ్యాండ్లే కన్నె
పిల్లలావుంటావు. నిన్ను తీసుకెళ్ళి లుబ్ధావుధాన్లుకి పెళ్ళిచేస్తాను. నాలుగుపూటలు
వాళ్ళింట నిపుణతగా మెసిలి, వేషం విప్పేసి పారిపోయిరా. నిజమైన పెళ్ళి
ముహూర్తం చాలా వ్యవధుంది.

శిష్యు—యిదెంతపని.

కరట—అలా అనుకోకు. అతి చేస్తివట్టాయనా, అనుమాన పడతారు. పట్టు
బడ్డావంటే పీక తెగిపోతుంది.

శిష్యు—మీకా భయంవొద్దు.

కరట—నువ్వు నెగ్గుకొస్తే, మాపిల్లనిన్నికిచ్చి యిల్లరకం వుంచుకుంటాను.

శిష్యు—ఆలా ప్రమాణం చెయ్యండి.

కరట—యిదుగో యీపుస్తకం పట్టుకు ప్రమాణం చేస్తున్నాను.

శిష్యుడు—యీపుస్తకంమీద నాకు నమ్మకం పోయింది. మరోగట్టి ప్రమాణ
చెయ్యండి. గిరీశంగారిని అడిగి ఒక యింగిలీషు పుస్తకం పట్టుకురానా?

కరట—తప్పితే భూమితోంద్రా.

శిష్యు—మీరు యగేస్తే భూమేం జేస్తుంది? మీ మాటేచాలును కానీండి.

---

3-వ స్థలము. అగ్నిహోత్రావధాన్లు యింటి యెదటవీధి



[గిరీశం, వెంకటేశం ప్రవేశింతురు.]

వెం—రాత్రి కన్యాశుల్కం మీద లెక్చరిచ్చారా ?

గి—లెక్చరేవిటోయ్ ఢణులెగిరిపోయింది. మీతండ్రిది మైరావణచరిత్రోయ్
హా అంకుల్ కరటకశాస్త్రి స్కౌండ్రల్లా కనపడుతున్నాడు.

వెం—యేం జరిగిందేం జరిగిందేవిటి ?

గి—విను. రాత్రి భోజనాలవేళ లెక్చరు ఆరంభించమని రోజల్లా బుడ్డీలు
పెట్టాడోయి మీ మావఁ సబ్జక్టు నేను కొంచం యెత్తగానే తనుకూడా గట్టిగా
సపోర్టు చేస్తానని ప్రామిస్‌కూడా చేశాడు. నీ తండ్రి వైఖరీ చూస్తే మాత్రం
కొంచం ధైర్యం వెనకాడి నాలికిచివర కొచ్చిన మాట మళ్లీ మింగి పోతూండేది.
పెరుగు అన్నం కలుపుకునే వేళకి యిక బైమిస్త్రాంచి పోతూందని తెగించి లెక్చరు
ఆరంభించాను. ఇంట్రడక్షన్ రెండు సెంటెన్సులు యింకా చెప్పనే లేదు
నాలుగు యింగ్లీషు మాటలు దొల్లాయో లేదో దాంతో . నీతండ్రి కళ్లెఱ్ఱజేసి "యీ
పెధవ యింగ్లీషు చదువు వొచ్చి బ్రాహ్మణ్యం చెడిపోతూంది; దేవభాషలాగ భోజ
నాల దగ్గిరకూడా ఆ మాటలే కూస్తారు; సంధ్యావందన శ్రీసూక్త పురుష
సూక్తాలూ తగలబడిపోయినాయి సరే గదా ?' అని గట్టిగా కేకవేసి చెప్పే
సరికి నేను కొంచం చప్పాయించి "థ్రోయింగ్ పెర్ల్సు బిఫోర్ స్వైన్" అనుకొని
కరటక శాస్త్రుల్లువేపు చూసే సరికి యెంచేస్తాన్నాడనుకున్నావ్ ? రాస్కెల్ వులక
లేదు పలుకు లేదు సరేకదా మొహం పక్కకి తిప్పి కడుపుగిలేటట్టు నవ్వుతున్నాడు
యిక లెక్చరు వెళ్లింది కాదు సరేకదా, నోట్లోకి ముద్దకూడా వెళ్లింది కాదు.
యింతయినప్పుడు జరిగింతరవాత తక్షణం బయిల్దేరి వెళ్లిపోదావఁనుకున్నాను.

వెం—అయ్యో వెళ్లిపోతారా యేవిఁటి ?

గి—నాటింది లీస్టు. కొసాకివిను, నీతండ్రిని పాకెట్లో వేశాను.

వెం—నా తండ్రికి లెక్చరిచ్చి వెళ్లి తప్పిస్తావఁనా రే ?

గిరీశం—పెళ్ళి ఆపడానికి బ్రహ్మశక్యంకాదు. డిమాస్థనీసు, సురేంద్రనాథ బెనర్జీ వచ్చి చెప్పినా నీతండ్రి యీ పెళ్ళిమానడు. లెక్చర్లు యంతసేపూ సిటీల్లోనేగాని పల్లిటూళ్ళలో యంతమాత్రం పనికిరావు పూనాలాంటిసిటీలో లెక్చర్ యిచ్చారంటే టెంథౌజండు పీపిల్ వినడానికి వొస్తారు. మన టౌన్లోనే, పెద్దమీటింగులు చెయ్యాలంటే, డప్పులు బజాయించి, నోటీసులు కట్టి, బజార్లకాళ్ళతోవంట పోయేవాళ్ళని యీడ్చుకు వొచ్చినా, యాభైమంది కారు. పల్లెటూళ్ళ పీపిల్ లెక్చర్లకి అన్ ఫిట్. మొన్న మనం వొచ్చినబండీవాడికి నాషనల్ కాంగ్రెస్ విషయమై రెండు ఘంటలు లెక్చరు యిచ్చేసరికి ఆగాడిదకొడుకు, వాళ్ళవూరి హెడ్ కానిస్టేబిల్ని కాంగ్రెసువారు యెప్పుడు బదలీ చేస్తారని అడిగాడు! విలేజస్ లో లెక్చర్లు యంతమాత్రం కార్యంలేదు. నీ తండ్రి దగ్గిర మాత్రం లెక్చరన్నమాటకూడా అనకూడదు.

వెంక—అయితే, నాన్ననియలాగ జేబులో వెశారేవిఁటి?

గిరీశం—అదిపొలిటిక్సు డెబ్బోయ్! ఆ తరవాత కథవిను. నామీద కేకలేసిన తరవాత కోపవేఁశకొఁ, ధుమధుమలాడుకుంటూ, పెరుగూ అన్నం కుమ్మడం ఆరంభించాడు. ఇంతలో మీ అప్ప వొచ్చి గుమ్మం దగ్గిర నిలబడి కోకిలకంఠంతో "నాన్నా తమ్ముడికి పెళ్ళిచెయ్యాలంటే నాసొమ్ముపెట్టి పెళ్లి చెయ్యండిగాని దాని కొంపముంచి లుబ్ధావుఁధాన్లుఁకి యివ్వొద్దని" చెప్పిఁది దాంతో నీ తండ్రికి పట్టలేని కోపం వొచ్చి వుత్తరారాపోననం పట్టకుండానే ఆపెరుగూ అన్నఁలో వున్న కంచం విసిరి కెళ్ళి దాన్నెత్తిని రుద్దేశాడు! కరటక శాస్తుల్లు అడ్డుపడబోతే చెంబులో నీళ్లు వాడిసెత్తింది మ్మరించాడు. కరటక శాస్తుల్లుకి కోవంవొచ్చి శిష్యుణ్ణి తీసుకు వాళ్ళవూరెళ్ళిపోయినాడు.

వెంక—దీని పేరెనా యేవిఁటి మానాన్నంజేబులో వేసుకోవడం?

గిరీశం—పేషన్స్! కొసాకీవిను. స్కాండ్రల్ కరటక శాస్తుల్లు వెళ్ళిపోయినాడనిసంతోషించానుగాని, నీ సిస్టర్ ఫేట్ విషయమై మహా విచారమైంది నేనే దానిహజ్బెండునైవుంటే, నిలబడ్డపాటున నీ తండ్రిని రివాల్వర్తో షూట్ చేసివుందును. మీ అమ్మ యేడుస్తూ ఒకమూలకూచుంది. అప్పుణ్ణే వెళ్ళి, నీళ్ళ పొయిలో నిప్పేసి నీళ్లుతోడి, నీసిస్టర్ని స్నానం చెయుమన్నాను. సిగరు కాల్చుకుందావని అరుగుమీద నేను బిచాణావేసే సరికి, నీ తండ్రికి పశ్చాత్తాపం వొచ్చి, తానూ ఆ

మీద బిచాణా వేసి, ఒక్క సిగరయినా కాల్చనియ్యకుండా రాత్రల్లా బుర్లలో పెట్టి చంపాడోయ్. మొత్తానికి కత్తు కలిపేశాను.

—యు లాక్కు—లిపారేవిఁటి ?

—ఒక పొలిటికల్ మహాస్త్రం ప్రయోగించి కలిపేశాను.

—యేవిఁటండా అస్త్రం ?

—ఒకడు చెప్పిందల్లా మహాబాగుందనడవేఁ. సన్మోహనాస్త్రవఁంటే అదేకదా?

—లెక్చరిచ్చి మాతండ్రిని వొప్పించడానికి బదులుగా ఆయన చెప్పిందానికి మీరే వొప్పకున్నారూ ?

—కంచం నిలువుగా కోలవడానికి వీల్లేనప్పుడు, తిరిగేసైనా కొలిస్తే నాలుగ్గింజలు పుస్తాయి. బాగా ఆలోచిస్తే యిన్ఫెంటు మారియేజి కూడుననే తోస్తూంది.

—యిన్నాళ్ళూ కూడదని చెప్పేవారే నా తోటి ?

—ఒపీనియన్సు అప్పుడప్పుడు ఛేంజి చెస్తూంటేనేగాని పొలిటీషను కానేరడు. కు తోచిన కొత్త ఆర్గ్యుమెంటు విన్నావా ? యిన్ఫెంటు మారేజీలు అయితేనే గాని, యంగ్ విడోజ్ వుండరు. యంగ్ విడోజ్ వుంటేనేగాని, విడో మారిజ్ రిఫారమ్కి అవకాశం వుండదుగదా ? సివిలిజేషన్కల్లా నిగ్గ విడోమారియేజ్ అయినప్పుడు, యిన్ఫెంట్ మారేజీల్లేకపోతే, సివిలిజేషన్ హాల్టవుతుంది ? మరి ముందు అనుగు పెట్టలేదు. గనక తప్పకుండా యిన్ఫెంటు మారేజి చెయ్యవలసే. యిదివొహ కొత్తడిస్కవరీ ; నంబర్ టూ, చిన్నపిల్లల్ని ముసలాళ్ళకిచ్చి పెళ్ళిచెయ్యడం కూడా మంచిదే అని నేను వాదిస్తాను.

—సుబ్బినిలు బ్ధావుఁధాళ్లకి యివ్వడం మంచిదంటారా యేవిఁటి ? అమ్మ ఆ సమ్మంధం చేస్తే నూతులో పడతానంటూందే ?

—షెమిస్పైన్స్ పూల్సన్నాడు. ''పడుపడుఅన్నా సవితేగాని పడ్డనాసవితి కాండి,'' అనవస్తోను. నూతులో పడడం గీతులో పడడం నాన్సెన్స్, ఓ రెండు తులాల వరుస్కోటి మీ నాన్న చేయించి యిచ్చాడంటే మీ అమ్మ ఆమాట మానేస్తుంది. గాని నా ఆర్గ్యుమెంటు విను.

—యేవిఁటండి.

గిరీశం—పెళ్ళనే వస్తువ శుభవా? అశుభవా? మంచిదా చెడ్డదా? చెప్పు.

వెంక—మంచిదే.

గిరీశం—వెరిగుడ్! పెళ్ళనేది మంచిపదార్థమైతే "అధికస్య అధికం ఫలం" అన్నాడ గనక చిన్నపిల్లని ఒక ముసలాడికి పెళ్ళిచేసి, వాడుచస్తే మరోడికి, మరోడుచస్తే మరోడికి, యిలాగ పెళ్ళిమీద పెళ్ళి, పెళ్ళిమీద పెళ్ళిఅయి, వీడివద్దలో నెయ్యి వాడి దగ్గిరో నెయ్యి, మరోడిదగ్గర మరోనెయి, రొట్టుమీద నెయ్యి, నేతిమీద రొట్టె, లాగ యేకోత్ర వృద్ధిగా కన్యాశుల్కంలాగి, తుదకి నాలాంటి బుద్ధిమం తుణ్ని చూసి పెళ్ళాడితే చెప్పావ్ మజా? ఇహసౌఖ్యంపూర్తిగాలభిస్తుంది. ఇహ సౌఖ్యంవుంటే పరసౌఖ్యంకూడా సాధించావేఁ అన్నమాట యలాగో తెలిసిందా! ఈజ్ మెంటు హక్కు యస్టాబ్లిష్ అవుతుంది.

వెంక—కన్యాశుల్కంకూడా మంచిదంటున్నారేవిఁటి?

గిరీ—మరేవిఁటనుకున్నావ్? నెవ్వర్గూబైహవ్వన్నాడు చేస్తే శుద్ధక్షవరవేఁగాని తీర పతి మంగలాడి క్షవరం చెయ్యకూడదు. యీ అస్త్రంతోటే మీ తండ్రి పట్టు అయినాడు. యింగ్లీషువాడు "థింక్" అన్నాడోయి. ఆలోచిస్తేగాని నిజం బోధపడదు బాగా ఆలోచించగా, కన్యాశుల్కంలేని మారేజే యీ భూ ప్రపంచంలోలేదు విన్నావా?

వెంక—యెలాగంటే?

గిరీ—అలా అడగవోయి, యేం? డబ్బిచ్చుకుంటేనే కన్యాశుల్కవఁయిందేం? యిన్ని తులాలు బంగారం పెట్టాలి, యింత వెండిపెట్టాలి, అనిరూపాయిలకి బదులుగా వెండిబంగారాలకింద ధనం లాగితే, కన్యాశుల్కం అయిందికాదేం? యీ పెద్దపెద్ద పంతుళ్ళవారం తాయిలా చేస్తూన్నవారేనా.?

వెంక—అవును.

గిరీ—యిక దొర్లలోనో? వాళ్ళతస్సాగొయ్యా, యిల్లుగుల్లచేస్తారోయి; అనిగుడ్లు కావు, అవిశెంట్లుకావు, అవి జూయలుస్కావు, మారియేజి సెటిలుమెంటని బోలెడు ఆస్తికూడా లాగుతారు. యీ ఆర్గ్యుమెంటు నేను చెప్పేటికి మీ తండ్రి బ్రహ్మానంద భరితుడైనాడు. లుబ్ధావుఁదాన్ను పెళ్ళికి అన్నిటికన్న సవబొకటి నీకు చెప్తానువిను.

—యేవిటండి.

—బుద్ధావుధాన్లు ముసలాడూ, బంగారప్పిచికానున్నూ, రెండేళ్ళకో మూడేళ్ళకో
యమాంతంగా బాల్చీ తన్నేస్తారు, అనగా "కిక్స్ ది బకెట్." దాంతో
చెల్లెలు రిచ్చి విడో అవుతుంది. నువ్వు పెద్దవాడివైన తరవాత దానికి
మోహరియేజి చేశి శాశ్వతమైన కీర్తి అతిసులభంగా సంపాదించవచ్చును.
యేవంటావ్ ?

—అవును.

—మరో గొప్పమాట యీ సంబంధం అయితే నీకూ నాకూ సంబంధం కలు
స్తుందోయి.

—అదినాకిష్ట వేం.

—రాత్రి నీ తండ్రి, నీను హైకోర్టు వకాల్తీదాకా చదువు చెప్పిస్తానన్నాడు
ప్రస్తుతో పయోగం పుస్తకాలమాట కదిపానుగాని, పెళ్లినుంచి వచ్చింతర
వాత యిస్తానన్నాడు. యీలోగా చుట్టనుక్కల్లాకపోతే గుడ్లెక్కొస్తాయి.
పీకస్సోసం కాపర్సేనయినా సంపాదించావాలేదా ?

—లేదు యీ వుదయవల్లా అమ్మ ధుమధుమలాడుతూనే వుంది. మానాన్న
పొడుక్కోసం కొట్లోనిలవచేసిన పొగాకులోది వోకట్ట వోణీలో దాచి తీసు
కొచ్చాను.

—పట్టీక్స్ పొలిటిక్స్! మరియింతసేపూ చెపావుకావేం ? చుట్టలుచుట్టుకుని యీకోవిల
గోపురంలో కూచుని కాల్చుకుందాం రా ?

—కోవిల్లో చుట్టకాల్చవొచ్చునా ?

—కాలిస్తే కోవిల్లోనే కాల్చాలోయి. దీనిపొగ ముందర సాంబ్రాణీ, గుగ్గిలం యే
పాటి? యేదీ కట్టయిలాతే (కట్ట అందుకొని వాసనచూసి) ఆహా! యేవిఁ
పొగాకోయి! నిజంగా కంట్రీలైఫులో చాలా చమత్కారంవుంది. బెస్టు
బ్రెకుఫాస్టు, బెస్టుగేదపెరుగు, మాంచిఘీ అంచేత నేనోయ్ పోయటుప్ "కం
ట్రీలైఫ్ కంట్రీ లైఫ్" అని దేవులాడుతారు.

—మీరూ పోయెట్సేగదా ?

గిరీ—అందుకభ్యంతరమేమిటి? నాకూ కంట్రీ లైఫు యిష్టమేగాని నీవంటి లాగ బ్యూటీ ఫుల్ షెపర్డెస్లూ, లవ్ మేకింగూ వుండదోయ్. గ్రాస్ గట్సర్ తెగుమాత్రంగా వుంటారుగాని, మాడర్న్ స్టైల్! అదొహటీస్నీ మనదేశంలో మెయిడన్సు వుండరోయి. యంతసేపూ లవ్మేకింగ్ విడోజ్కి చెయ్యాలిగాని మరిసాధనాంతరంలేదు.

వెంక—మీరు విడోమీద చేసిన పోయిట్రీ రాసియిస్తానని యిచ్చారుకారు గదా!

గిరీ—అడగ్గా నే యిస్తేవస్తువవిలువ తగ్గిపోతుంది. అదొహటీస్నీ, మట్టెరెండేళ్లపోతేన గాని దాని రసం నీకు బాగా బోధపడదు అయినా స్పెషల్ కేసుగా నీకు ఉపదేశం చాస్తాను నోటుబుక్కు తీసిరాయి.

(గిరీశం చుట్టకాలుస్తూ, మధ్య మధ్య చుట్టచేత పట్టి, ఒక్కొక్క ముక్క చెప్పగా వెంకటేశం వ్రాసును.)

---

## THE WIDOW.

She leaves her bed at A. M. four,
And sweeps the dust from off the floor,
and heaps it all behind the door,
The Widow!

Of wond' rous size she makes the cake,
And takes much pains to boil and bake,
And eats it all without mistake,
The Widow!

Through fasts and feasts she keeps her health,
And pie on pie, she stores by stealth,
Till all the town talk of her wealth,
The Widow!

And now and then she takes a mate,
And lets the hair grow on her pate,
And cares a hang what people prate,
The Widow!

I love the widow—however she be,
Married again—or single free,

Bathing and praying,
Or frisking and playing,
A model of saintliness,
Or model of comeliness,
What were the earth,
But for her birth ?

## The Widow !

యిది నేను రిఫార్మర్లలో— లన్నుకే నేటప్పటికి టెన్నిసన్ చూసి గుండె కొట్టుకున్నాడు. చుట్టరికం సమాప్తం చేశి యింటికి పోదాంగా చాలా సేపైంది.

(వాలుగడుగు యిద్దరూ నడిచే సరికి అగ్నిహోత్రావధాన్లు కలియును.)

—ఏమండీ-హనుమన్లుగారూ-మీ పేరేమిటండీ!

—గిరీశం అంటారండి.

—అదుగో, గిరీశంగారూ రాత్రి మనమనుకున్న ప్రకారం మనదావాలు గెలుస్తా యనే మీ అభిప్రాయమా ?

—గెలవకపోతే నేను చెవికద పాయించుక వెళ్ళిపోతాను. మీ పూర్వపక్షాలు సామాన్యమైనవా ? అందులో "యతో ధర్మస్తతో జయః" అన్నట్టు న్యాయం మీ పక్షం వుంది. బుచ్చమ్మగారి కేసు విషయమై జబ్బల్పూర్ హైకోర్టు తీర్మానాటి మనకి మహా బలంగావుంది. మా పిత్రండ్రిగారు యిలాంటి కేసే ఒకటి యీ మధ్య గెలిచారండి.

—దీని కల్లా అసాధ్యం యీ కేసు కాకినాళ్లో తేవల సొచ్చింది. మా కరటక శాస్త్రుల్ని పంపిస్తే యవడో చవలవకీల్ని కుదిర్చాడు. వాడెప్పుడూ డబ్బు లెమ్మని రాయడమే గాని కేసు భోగట్టా యేమీ రాయడు గడియ గడియకీ వాళ్ళ కావంటా దూరాభారం గదా ?

—మీకలవైతే క్రిమరునాడే నేను వెళ్లి ఆవ్యవహారమంతా చక్కబెట్టుకుస్తాను మా పెత్తండ్రిగారు కాకినాడ కల్లా తెలివైన ప్లీడరు, ఆయనపట్టిన కేసు యన్నడూ పోయిందన్నమాట లేదండి.

—మీరు వెళితే నేను వెళ్లినట్టే. యంత ఫీజయినా మీ పెత్తండ్రిగారికే యిస్తా ముద్దాం యేమంటారు ?

—మీదగ్గిర ఫీజు పుచ్చుకోవడం కూడానాండి ? ఖర్చులు మట్టుకు మీరు పెట్టు కుంటే, ఫీజక్కరలేకుండానే పని చేయిస్తానండీ.

—మీరలా అంటారన్నే నెరుగుదును గాని గెలిచేటపుడే మనకితోచిన బహుమతీ యిద్దాం.

గిరీ—యిచ్చినాసరే యివ్వకపోయినా సరేనండి.

[బుచ్చమ్మ ప్రవేశించును]

బుచ్చమ్మ—నాన్నా అమ్మ స్నానానికి లెమ్మంచూంది.

అగ్ని—అలాగే. (బుచ్చమ్మ వెళ్ళిపోతూండగా గిరీశం కేగంటచూసును.)

భోజనంచేశిన తరవాత కాయితాలు మీచేతికిస్తాను; అవన్నీ సావకాశంగా చూడండి, మాయింటికీయూరు ప్పారుగు రావాఁవుధాన్లుమీద మందడిగోడవిషయమై మనం తెచ్చినదావా, లంచంపుచ్చుకుని మునసబు అన్యాయంగా కొట్టేశాడు జడ్జీకోర్టులో అప్పీలుచేశాం; మావకీలు అవతలపార్టీదగ్గిరకతికి మనకు ధంసంచేశాడు. మీవంటివారు నాకు చెయ్యాసరావుంటే రావాఁవుధాన్లు కూడదీసేదును; కానింకీగాని తూపుఁమందడిగోడ రావాఁవుధాన్లిదుకు పడవఁటి మందడిగోడ మందవాల్నాలేదా? న్యాయంచెప్పండి చూడండి మీదయలా కొంజాయెత్తాడో! క్రిమినల్నడిపించమని భుక్తసలహాచెప్పాను.

[బుచ్చమ్మ పరివేశించును.]

బుచ్చ—నాన్నా? అమ్మ స్నానం చెయ్యమంచూంది.

అగ్ని—వెధవముండా సావ! పెద్దమనుష్యుల్తో వ్యవహారం మాట్లాడుతూంటే రామాయణంలో పిడకల వేట్లాటలాగ అదే పిలవడవాఁ!

గిరీ—తప్పకుండా క్రిమినల్కేసు తావలశిందే, క్రిమినల్ప్రొశిజ్యూర్ కోడు ఏ శక్షన్ ప్రకారం తెద్దావాఁ? 172 డో శక్షన్ ప్రకారం తెద్దావా?

అగ్ని—రెండు శక్షన్లూ తాలేవేఁ?

గిరీ—నేరంగలప్రవేశం, ఆక్రమణ- రెండు శక్షన్లూకూడా ఉపచరిస్తాయి నాకళ్లతో చూశాను గనుక యీగోడ మీదయినట్టు జల్లిలైగబోడిచి సాక్ష్యమియ్యగలను, యీగోడస్పష్టంగా మీదా న్లాగే కనబడుతూంది.

అగ్ని—అందుకు సందేహంఁందండీ, యేమరిచి యిన్నాళ్లు వూరుకున్నాను. జడ్జీగోడకూడా చూతురుగా న్రండి. అకాక—బత్తుడే ముక్క— నులిపిగెల్చుకున్నాను కాని యీదావాల్క్రింద సిరిపురంభూవిఁ అమ్మెయ్యావలసి వొచ్చిందండి, రావాఁవుధాన్లుకేనుకూడా గెలిస్తె, ఆవిచారంనాకు లేకపోవును.

(అందరు నిష్క్రమింతురు.)

# కన్యాశుల్కము—తృతీయాంకము.



౧-వ స్థలము. రామచంద్రపురం అగ్రహారంలో
రామప్పంతులు యింట్లో సావిట్లోగది.

—:)o(:—

[మధురవాణి ప్రవేశించును.]

—యీరామప్పంతులు కథ పైకి పటారం, లోపల లొటారంలా కనిపిస్తూంది. భూవులన్నీ తాకట్టుపడి వున్నాయిట; మరి రుణంకూడా పుట్టదట వాళ్ళకీ. క్కీ జట్లుముడేసి జీవనం జేస్తూన్నాడు, యీవూరు వేగం సవిరించి చెయ్ ...నంతసొమ్ము చిక్కించుకుని పెంపరాళే మరోకొమ్మ పట్టుకోవాలి (పాడును) 'తెలియక మోసపోతినే, తెలియక' (పాడుతుండగా రామప్పంతులు ప్రవే ...శించును.)

—యేవిఁటో ఆ మోసపోవడం ? తరవాత ముక్కేవిఁటి, పాడూ.

—తరవాత ముక్క లేవుఁంది. మిమ్మల్నినమ్మి మోసపోయినాను.

—అదేం అలాఅంటున్నావు? నిన్ను మోసపుచ్చలేదే? నిర్ణయప్రకారం ...రెండొందలూ పట్నంలో యిచ్చాను. నెల జీతం నెలకు ముందే యిచ్చాను. ...మూ మోస వేఁవుంది ?

—యేంచిత్రంగా మాట్లాడతారు పంతులుగారూ, నాకు డబ్బేప్రధానమైనట్టు ... మనసుకి పొడగడుతూంది కాబోలు, నాకుడబ్బు గడ్డిపరక. మీ భూవుఁలు ...ప్రాక్రాంతమై నాయని అప్పట్లో నాకు తెలికుంటే మీదగ్గిర రెండొందలూ ...పుచ్చుకుందునా ? మీరు ఖర్చు పెచ్చాలు తగ్గించుకుని సంసారం బాగుచేసుకోక ...నేనుమాత్రం వొప్పేదాన్నికాను. ఫలానా పంతులుగారు ఫలానా ...మ్మంచుకుని బాగుపడ్డారంటే నే నాకు ప్రతిష్ఠ. మాయింటి సాంప్రదాయం ...పంతులుగారూ! అంతేగాని లోకంలో సాన్లమచ్చని వూహించకండి.

రామ — భూములు తణఖా అన్నమాట వుత్త అబద్ధం యవరన్నారోగాని; నేను మహారాజులా వున్నాను.

మధు— నాకంటికి మహారాజులా కనపడబట్టే యిల్లూ వాకిలీ వొదిలి మానం ప్రాణం మీపాలు చేసి నమ్మి మీ వెంట వొచ్చాను నన్ను మోసం మాత్రం చెయ్యకండి; మిమ్మల్ని పాపం చుట్టుకుంటుంది.

రామ— నేను మోసం చేసే మనిషి నేనా ?

మధు— ఆలాగయితే లుబ్ధావధాన్లు గారికి పెళ్లెందుకు కుదిర్చారు? నాకు తెలియదనుకున్నారా యేవిటి ? ఆ ముసలాడికి పెళ్లెందుకు ? మీకోసవే యీ యెత్తంతాను.

రామ— ఆహా ! హా ! హా ! యిదా అనుమానం ! కొంచం గిష్టం నెరుస్తూంది, నన్ను కూడా ముసలాణ్ణంటావా యేవిటి ?

మధు— చట్లకి చావ లుపు, మనిషికి చావ తెలుపూ. అనగా చీకట్లో నక్షత్రాల్లాగ అక్కడక్కడ తెల్ల వెంట్రుక తళక్తే నే చమక్.

రామ— స్వారస్యం మా చమత్కారంగా తీశావ్ ! యేదీ ముద్దు. (రామప్పంతులు మధురవాణిని ముద్దుబెట్టుకో బోవును.)

మధు— (చేతులతో అడ్డి ముఖము ఓరజేసుకుని) వేళా పాళా లేవా ? లుబ్ధావధాన్లు పెళ్ళి తప్పించేస్తేగాని నేను ముద్దుబెట్టుకో నివ్వను.

రామ— అంతా సిద్ధమైన తరవాత, నా శక్యమా ఆపడానికి ? (బలాత్కారంగా ముద్దు బెట్టుకొనును.

మధు— సత్తు వుంద నామోటతనం ?

రామ— నా సత్తువిప్పుడేం జూశావ్. చిన్నతనంలో ధ్వజస్తంభం దండలో కొడితే గణగణమని గంటలన్నీ ఒకగడియ వాగేవి. నాకు జబ్బుచేసిం దగ్గిర్నుంచీ డీలా అయిపోయినాను.

మధు— యిదా డీలా ? నా చెయి చూడండీ యలా కంది పోయిందో. అన్నా! మోటతనం !

రామ— చాప చిరిగి నాచాప రంతని, నీ ప్రాణానికి యిప్పటి సత్తువే ఉడ్డోలం లాగున పడుతూంది.

మధు— [illegible]

వు—కొట్టికుదిరింది, రోకలి తలకి చుట్టమన్నాట్ట! రెండేళ్ళాయి ఆముసలిగాడిద గానుకుమీద నా లౌక్య ప్రజ్ఞంతా వినియోగపర్చి పెళ్ళిసిద్ధంచేసి యిప్పుడెలా తప్పించడం ?

ను—యేం లౌక్యం చేశారు ?

వు - అలా అడుగు. నాబుద్ధి సత్తువకూడా నీకు తెలుస్తుంది. లుబ్ధావుధాన్లు పరమ లోభి. వాడిగుణం యిలావుండబోతుందని పోల్చారేమో అన్నట్టు చిన్నతనంలో వాడికి పేరుపెట్టారు. పెళ్ళైతే వొళ్ళుమాల్ని ధనం వొస్తుందని ఆశపెట్టించాను

ను—యిలా చేశావేం మహాదిత్రం ? పెళ్ళైతే ధనం ఖర్చౌతుందిగాని, రావడ మెలాగ

వు—లౌక్యమంటే మరేమిటనుకున్నావు ? అసాధ్యాలు సాధ్యం, సాధ్యాలు అసాధ్యం చెయ్యడంకాదూ ? మనసిద్ధాంతిని దువ్వేటప్పటికి వాడేంచేశాడను కున్నావు ? లుబ్ధావుధాన్లు జాతకం యగాదిగా చూసి, సీఘ్రంలో వివాహయో గంవుందన్నాడు, ఆవివాహంవల్ల ధనయోగవుందన్నాడు, దాంతో ముసలాడికి డబ్బొస్తుందన్న ఆశ వుందుకి, డబ్బుఖర్చౌతుందన్న భయం వెనక్కిలాగడం ఆరంభించింది. యింతట్లో పండాగారిక్కడికొచ్చారు. ఆయన్ని కూడా తయారు చేశాను లుబ్ధావుధాన్లు అనుమానం తీర్చుకుందామని ఆయనకి జాతకం చూపించే సరికి పండాగారు యేమన్నారూ ? "వివాహనయోగాలు జవిలిగావున్నాయి అయితే మీరు పెట్టవాళ్ళు, యిప్పుడు మీకు పిల్ల నెవరిస్తారు, పెళ్ళేలా అవు తుంది? యిలాంటి జరగడానికి వీల్లేని మహా యోగాలు జాతకాల్లో పట్టినప్పుడు, గొప్పమేలుకు బదులుగా గొప్పకీడు సంభవిస్తుంది. అనగా మీక మారకం వో ధననష్టమో, సంభవిస్తుంది గ్రహశాంతి చేసి బ్రాహ్మణ భోజనం బాహుళ్యంగా చేయిస్తేనే, కొంత జబ్బు గిబ్బుచేసి అంతటితో అరిష్టం పోతుంది. మంచి రోజు చూసి సూర్య నమస్కారాలు ఆరంభించండి" అని చెప్పేసరికి అవుధాన్లు కంపై రెండుచక్రాలై వివాహప్రయత్నం ఆరంభించాడు. యిదీ కథ.

ను—యేమికల్పన !

వు—యింకావుంది ! యిహను కృష్ణా రాయపురంలో అగ్నిహోత్రావుధాన్లు కూతురు జాతక మెలావుందట ? చప్పడానికి అలవిలేదు. అదికాలు పెట్టిన యిల్లు పవి యిల్లౌతుందట అదిపట్టిందల్లా బంగారవౌతుందట!

మధు—నిజవేఁనా లేక అదీ మీ బనాయింపేనా?

రామ—అదిమట్టుకు నా బనాయింపు కాదు, అగ్నిహోత్రావుఁధాన్లే జాతకం అలా బనాయించాడు, మా బ్రాహ్మల్లో యిది పరిపాటే, పెళ్ళిళ్ళలో పంపించేది ఒక్క జాతకవూఁ నిజంవుండదు.

మధు—యేమోసం !

రామ—లౌక్యం, లౌక్యవేఁను.

మధు—రెండింటికీ యేవిఁటో భేదం.

రామ—నమ్మిం చోట చేస్తే మోసం, నమ్మించోట చేస్తే లౌక్యవూఁను.

మధు—తాను చేస్తే లౌక్యం, మరోడు చేస్తే మోసం అనరాదా? అబద్ధానికి అర్థవేఁవిఁటి?

రామ—యావన్నావూ? అబద్ధవేఁనా? ఉద్యోగధర్మం లౌక్యవృత్తి అని, అదివకవృత్తి భగవంతుడు కల్పించాడు. ఆలౌక్యవృత్తి యెటువంటిదీ? నిజాన్ని పోలిన అబద్ధ వాఁడి ద్రవ్యా కర్షణచేసేది. యీధర్మ సూక్ష్మాలు నీకెలా తెలుస్తాయి.

మధు—నాకెలా తెలుస్తాయి నిజవేఁగాని, ద్రవ్యాకర్షణ యలాగ యీపెళ్లివల్ల?

రామ—(తనలో) క్రాసి జ్గామి నేషను చేస్తూంద్రోయి దీంతస్సా గొయ్యా (పైకి) నీకు మేజువాణి నిర్ణయించుకున్నాను కానూ, నీకు పదిరూపాయలసొమ్ము దొరకడం ద్రవ్యాకర్షణ కాదా ?

మధు—యేంచిత్రవైఁన మనుష్యులు పంతులుగారూ ! (తమలపాకుచుట్టలో కొట్టి) నేను రాబోతానని రెండేళ్ల కిందట కలగని, యీకాబోయే మేజువాణీ బుద్ధిలో వుంచుకుని యీపెళ్లి కావడానికి విశ్వప్రయత్నం చేసారూ? ద్రవ్యాకర్షణ యలాగో నాకు బోధపడ్డది పెళ్లికూతుర్ని ములాకా చేసుకుని, దాంద్వారా ముసలాడి మూటా ముళ్ళా లాగేస్తారు. యంతసత్యకాల పదాన్నయినా అమ్మాత్రం ఊహించుకోగల్ను. లేకపోతే నేయంత బతిమాలుకున్నా యీపెళ్లి తప్పించా పోవడవేఁవిఁ? మీబుద్ధికి అసాధ్యం వుందంటే నే నమ్ముతానా?

రామ—ఆమాట్నిజవేఁగాని, అన్నిపనులూ ద్రవ్యాకర్షణ కొసవేఁ చాస్తానునుకున్నావాయేవిఁటి. ఆముసలాణ్ణి కాపాడదాన్కేఁనే, యీ పెళ్లి తలపెట్టాను.

మధు—"చిత్రం చిత్రం మహాచిత్రం" అని కథుంది. అలావున్నాయి మీ చర్యలు

రామ—ఆ కథేదో చెబుదూ, నాకు కథలంటే మా సరదా.

మధు—పొగటిపూట కథలేవిఁటి? ముందు యీ చిత్రి కథేవిఁటో శెలవియ్యండి.

రామ—అది చెప్పేదికాదు. చెప్పను.

మధు—చెప్పకపోతే వొప్పను.

రామ—ఒప్పకేం జేస్తావు?

మధు—యేంజేస్తానా? యీ జడతో కొడతాను, శాస్త్రంలో కాముకులకు చెప్పిన ఆయుధవిఁది.

రామ—నేం దెబ్బలికి మనిషినికాను. శాస్త్రాం గీస్త్రాం వొకపక్కనుంచి మోట సరసం మాను. చెప్పమంటే చెబుతాను గాని అలాంటి కబుర్లు నువ్వు వినకూడదు. మరేంలేదు. లుబ్ధావుధాన్లు వెధవకూతురు. మీనాక్షి ప్రివర్తన మంచిదికాదు. నాలోరిజాల కొహామాకు అది పీకలమీదికి తెస్తూంటుంది పోలీసువాళ్లు బెదిరించి పదిడబ్బులసొమ్ము లాగేస్తూంటారు డబ్బు ఖర్చంటే ముసలాడికి, ప్రాణపోకట, సంసారం కూడా మీనాక్షి దూబరచేస్తుం దంటాడు పెళ్లయితే దాని ఆటకడుతుంది.

మధు—మీనాక్షి ప్రవర్తన బాగుంది కాదంటూ మీరే చెప్పాలీ? మీరు కంట పడ్డ తరవాత యే ఆడదాని ప్రవర్తన తిన్నగావుంటుంది?

రామ—అదుగో చూశావా? అలా అంటావనే కదూ చప్పనన్నాను.

మధు—యీ చిక్కులు నాకేం తెలియవు. పెళ్లి మానిపించెయ్యండి.

రామ—యీ పెళ్ళిలో నీమేజువాణీ పెట్టి పదిరాళ్ళిప్పిస్తాను. మాటాడకూరుకో.

మధు—(ముక్కుమీద వేలుంచుకొని) లుబ్ధావుధాన్లు యదట నేను మేజువాణీ ఆఁ!

రామ—పేరువాడుగాని, సభలో పెద్దన్నే నేకదూ?

(హేడ్ కనిస్టేబ్ చుట్టకాలుస్తూ ప్రవేశించి కుర్చీమీద కూర్చొనును.)

హేడ్—రామప్పంతులూ! యినస్పెక్టరికే టోపి వేశావటే?

రామ—(హేడ్ కనిస్టేబుచెవిలో) గాకూ గాకూ అనవయ్యా.

హేడ్—యెప్పుడూ శేంది గాకేవిఁటి, గీకేవిఁటి, చింతగారు?

రామ—ఆడవాళ్లున్న చోటికి తోసుకు రావడవేఁవా, అన్నా!

హెడ్—ఆడవాళ్లంటున్నావు, నువ్వు కూడా అందులో నే జమాయేవిఁటి? ఆహా! హ!

రామ—హాస్యానికి వేళా పాళా వుండాలి.

హెడ్—నేను హాస్యంకోసం రాలేదు; యినస్పెక్టరు పేరు చెప్పి రావఁనాయడిదగ్గిర పాతిక రూపాయిల్లాగావుట, యిలా యందరిదగ్గిర లాగాడో రామప్పంతుల్ని నిల్చున్న పట్లాన్ని పిలకట్టుకు యీడ్చుకురా అని నాతో ఖచితంగా చెప్పి యినస్పెక్టరు పాలెం వెళ్లిపోయినాడు.

రామ—చిన్నప్పుడు వొక్కబళ్లో చదువుకున్నాం యినస్పెక్టరూ నేనూను. అంచాత అతని పిలక నేనూ నాపిలక అతనూ లాగినా ఫర్వాలేదు రావఁనాయడి పట్ల మాత్రం శుద్ధాబద్ధం. మీరు ముందు పదండి, గుఱ్ఱం కట్టించుకుని స్టేషను దగ్గిర కలుస్తాను

హెడ్—నే నెలావొస్తాను నీతోటి; నాకు వొల్ల మాల్నపనుంది, ఒక కనిష్టీబుని నీతో పంపిస్తాను.

రామ—(హెడ్ చెవులో) రాయిఁట్లో మాత్రం నకార ప్రయోగం. చెయ్యక నీపుణ్యం వుంటుంది.

హెడ్—అజ్ఞానీఘోష! అలా కానియి, (నిష్క్రమించును)

రామ—(తనలో) అదుగో మళ్లీ ఏకవచనవేఁ కూస్తాడు! (పైకి) యెవడారా అక్కడ.

నౌఖరు—(ప్రవేశించి) సిత్తం బాబు.

రామ—గుఱ్ఱం కట్టమను.

నౌఖరు—సిత్తం బాబూ, (నిష్క్రమించును)

రామ—చూశావూ మధురవాణీ నేన్నిలబడ్డచోట రూపాయలు గలగల్లాడ్డాయి. యీ యినస్పెక్టరుగాడికి యీ తాలూకాకి వొచ్చింతరవాత అయిదారుసేలు యిప్పించాను. వీధి తలుపు వేసుకుని, సంగీతసాధకం చేసుకో, విద్యవంటి వస్తువు లేదు (గుమ్మం దాటి నాలుగడుగులు వెళ్లి తిరిగివచ్చి) అప్పుడే వీణతీశావు? యీ వూళ్లో మాదుర్మార్గులున్నారు; నా స్నేహితులవఁనీ, బంధువులవఁనీ వేసస్టు కొస్తారు, రానీకుమీ (తలుపు వైనించివేసి) గడియవేసుకో. (నిష్క్రమించును)

---

## ౨-వ స్థలము. రామప్పంతులుయింట్లో పడకగది.

---

[మధురవాణి తివాసీమీాదకూచుని వీణవాయించుచుండును వాయిద్యం ముగించి.]

—విద్యవంటి వస్తువులేదు, నిజమే—ఒక్కటితప్ప—అదేవిఁటి? విత్తం. డబ్బు లేవిద్య దారిద్ర్యహేతువ యీాపూట్లో వారదుడువొచ్చి పాడితే నాలుగు ...లిస్తారు, గనక యీావీణ యిటుపెడదాం. హెడ్డు కనిస్టేబు స్నేహంచేసి ...డు అతడు యిచ్చేదీ చచ్చేదీ లేదుగాని, జట్టీలేవైనావొస్తే ఓ వొడ్డు కాస్తాడు.

(వీధితలుపు తట్టబడును.)

వొచ్చాడు కాబోలు. (తలుపుదగ్గరకివచ్చి) యవరు మీారు? బంధువులా?

(తలుపవతల కరటకశాస్త్రులు, కన్యావేషంతో శిష్యుడున్నూ.)

—ఆపద కడ్డం బడ్డవారే బంధువులు. మేమీాకు బంధువులం కావుగాని ...రు మాకు బంధువులు కాగలరు.

—నాస్తులా?

—(తనలో) యీాకంఠం విన్నట్టుంది. (పైకి) నాస్తం కట్టడానికే వొచ్చాం.

—దేంతో కడతారు?

—(తనలో) యీా వేశ్యమధురవాణి కాదుగద? కంఠాన్ని పోలిన కంఠం వుండ ...దా? (పైకి) నాస్తం కట్టడానికల్లా వున్నద వక్కటేగదా టంకం?

—యేవిఁటో ఆ టంకం?

—బంగారం!

—మాపంతులుగారికి మీారు నాస్తులూ, బంధువులూ కూడా కాకపోతే తలుపు తియ్యొచ్చును. (తలుపుతియ్యును.)

—(తనలో) ఆరే! మధురవాణే!

—(ముక్కుమీాదవేలుంచుకొని) చిత్రం!

కరట—యేమిటి చిత్రం ?
మధు—యీవేషం !
కరట—ఉదరనిమిత్తం బహుకృతవేషం; యిది దేవుడిచ్చిన వేషమేను.
మధు—నాదగ్గిరేనా మర్మం ? యీ పిల్లెవరో?
కరట—నాకోమార్తె.
మధు—నాటకమెల్లా చెడి పగటివేషాల్లో దిగిందా? పెట్టి పుట్టారుగదా దే
యీ అవస్థ ?
కరట—నీదయవల్ల దేవుడిచ్చినస్థితికేం లోపంరాలేదు. నిన్నుచూదామని వొచ్చాను
మధు—యిన్నాళ్ళకైనా యీ దీనురాలు మీకు జ్ఞాపకం రావడం ఆదెంపగాదు
కరట—నీలాంటి మనిషి మళ్ళీవుందా? నిన్ను చూడ్డం బ్రహ్మానందం కాదా? నీదగ్గి
రావడం, చేదనా యిన్నాళ్ళూ రాలేదనుకున్నావు ? డిప్టీ కలక్టరుగారి కుమా
రత్నంగారు నిన్ను చేపట్టారని తండ్రికి తెలిసింతరవాత, నేనుగానీ నీయిం
వొస్తే పీక ఉత్తరిం చేస్తాడేమో అనేభయంచాత కొంచం యెడబెట్టి యిక
యెప్పుడు బదిలీ అవుతుంది, మా మధురవాణ్ణి యెప్పుడు చూస్తాను అని దేవుణ్ణి
సదా ప్రార్థిస్తూ వుంటిని. నువ్విక్కడెన్నాళ్ళాయి వున్నావు ?
మధు—డిప్టీకలక్టరుగారి కుమారరత్నంగార్ని తండ్రి, చదువుపేరు పెట్టి చన్నపట్నం
తగిలినరెండునెల్లదాకా ఆయననాస్తుకు గిరీశంగారి ద్వారా డబ్బు పంపించాడు.
ఆతరవాత మొన్నటిదాకా గిరీశంగారు నన్ను వుంచారుగాని, డబ్బుకి యిబ్బ
ముటీగా వుండేది. నాయింటికి వొచ్చిన వాడల్లా తనకొడుక్కుదోస్తీ అయివుంటా
డని డిప్టీ కలక్టరు అనుమానిస్తాడేమో అని పేరుగలవాడెవడూ నాయింటికి
రావడం మానేశాడు. సంజీవరావుగారి అల్లరి కొంచం మరుపొచ్చిందా
పైనుందామని యీవూరొచ్చాను.
కరట—(ముక్కుమీద వేలుంచుకొని) గిరీశం నిన్నుంచుకున్నాడా ? మా మేనల్లు
చదువుచెప్పడానిక్కుదురుని మావాళ్ళింట్లో చేరాడు. వాడికి పెందరాళే ఉద్వా
సన చప్పాలి.
మధు—(ముక్కుమీద వేలుంచుకొని) నాదగ్గిరకు వచ్చినవాడల్లా చెడిపోయినాడో
నాదగ్గిరకు మీరు రాకుండా అవరోధం కల్పిగిందని యిప్పుడే డిప్టీకలక్టరుగా

శిష్యు.రే. ఆయనకంటె మీ న్యాయం యేంబాగావుందని? నావద్దిరకు వచ్చినందుకు, భార్యాగారు ముందు మిమ్మల్ని మెడబట్టుకొని యింట్లోంచి తరవ్వాలి

గు. తనకిరొట్టా. ఒహడికి ముక్కా—నా?

—క్రియలలో అంతవరకూ జరక్క—పోయినా మాటల్లో ఆమర్యాద అమేషా జరుగుతూనే వున్నది.

—(చిరునవ్వుతో) యీ యిల్లాలు మాపంతులు కంటబడితే యీవిడ గుట్టు బట్ట బయలౌతుంది.

—యిల్లాల నేన్తున్నా వేం అప్పుడేను? కన్నెపిల్ల; దీన్ని పెండ్లి చేయడానికే, దగ్గరికి తీసుకొచ్చాను.

—మాపంతులు కేనా పెళ్ళి?

—"ఏకానాకీ సుందరీవాదరీవా," అన్నాడు. త్రిలోకసుందరివి నువ్వు దొరి కినవాళ నీ పంతులుగారికి యింకా పెళ్లెందుకు?

—ఐతే మరెవరికి పెళ్ళిచెయ్యం? నాకాకాయేవిటి? ఆలాగైతే, సైయే! మొగ వేషంవేసుకొని, పెళ్లిపీటలమీద కూర్చుంటాను. యిలాంటి పెళ్లాం దొరకడవే నాగ? జగత్ప్రసిద్ధులైన కరటకశాస్తుల్లుగారి అల్లుణ్ణి కావడంయెలాగ? దివ్య సుందర విగ్రహావని పొగడగానే నాబుజాలు పొంగుతాయనుకున్నారు కాబోలు! మాపిల్లదగ్గిర నాబోట్లు దివిటీముందరదీపాలు. ఆడది మెచ్చిందే అందం! మొగాడి కన్ను మనక. మీకేంతెలునును? మరి నాపెళ్లాన్ని నాకిచ్చేసి పోవని మీరువెళ్ళండి. (శిష్యుడి చెయిపట్టిలాగును.)

శిష్యు—చూశావురానాన్నా యలా పట్టుకుందో?

—(ఆపుకోలేకుండానవ్వుతూ) శాబాషు! యిదేనా పెద్దమనిషి తరహా! యిరుగు పొరుగమ్మ లేవంటారో మొగుడు పిలిస్తె వెళ్ళకుంటేను?

శిష్యు—శాడుతుంది కాబోలాని నాన్నా, యింటికెళ్ళిపోదాం, రా!

—యేంనంగనాచివే? తరవాత పెళ్ళిచేనుకుంటాను. అందాకా ముద్దియ్య (ముద్దెట్టుకొనును.)

—నేరని పిల్లని చెడగొడుతున్నావు.

మధు—నాలాంటి వాళ్ళకి నూరుమందికి నేర్పి చెడగొట్టగలడు యీశిష్యుడు! యీకన్న పిల్ల నోరు కొంచం చుట్టవాసన కొడుతూంది!

కరట—అంచాతే కాబోలు డబ్బీలో చుట్టలు తరుచు మాయ మౌతూంటాయి మధురవాణీ! దేవుఁడ్లాగు నిన్ను చూపించాడు, పంతుల్లేని సమయం కనిపెట్టివొచ్చాను; మళ్ళీ అతడొచ్చేలోగా నామాటలు నాలుగూ విని మాకువొచ్చిన చిక్కు తప్పించు.

మధు—మీకొచ్చిన చిక్కేవిఁటి? నేం చెయ్యగలిగిన సహాయ వేఁవిఁటి?

కరట—చిక్కన్నా చిక్కు కాదు. విను. యీవూళ్ళో గిరీశం పెత్తల్లికొడుకు లుబ్ధావధాన్లని ఓ ముసలాడున్నాడు; వాడికి మా మేనగోడల్నివ్వడానికి మా భావ నిశ్చయించాడు యీ సంబంధం చేస్తేనా చెల్లెలు నూతులో పడతానని వొట్టేసుకుంది. యేం వుపాయం చేస్తావో, దాని ప్రాణం కాపాడాలి.

మధు—యీపిల్లని అంతకి తక్కువ సొమ్ముకి అమ్మితే, లుబ్ధావధాన్లు చంకలుగుద్దుకు చేసుకుంటాడు. అతనిదాకా యెందుకు నేనే కొనుక్కుంటాను.

కరట—చూపితే అందుకు పోయేదానికి నీకు మిక్కిలి చెప్పాలా యేవిఁటి?

మధు—యిదివరకి నిశ్చయమైన సమ్మంధం యేమిషపెట్టి తప్పించడం?

కరట—నీబుద్ధికసాధ్యం వుందా? డబ్బుకసాధ్యం వుందా?

మధు—బుద్ధికి అంతా అసాధ్యవేఁగాని, డబ్బుకి యెక్కడా అసాధ్యంలేదు. యీ పెళ్ళిలో మాపంతులుకో పదిరాళ్ళు దొరుకుతా యనుకుంటున్నాడే?

కరట—నాసంబంధం చేసుకుంటే నేను యిరవై రాపాషాణాలు యిస్తాను.

మధు—సరే. గాని నాటకంలో యంతహాస్యమైనా చెల్లుతుంది. నటనలోకి హాస్యం తెస్తే యేవిఁమౌతుందో ఆలోచించారా?

కరట—మధ్య నీకొచ్చిన పర్వాయేవిఁటి? నాకొచ్చిన ఫర్వాయేవిఁటి? యీ కత్తెర మీసం, కత్తెర గెడ్డం కడిగేసుకుని నాతోవని నే వెడతాను. యీ కోక నీదగ్గిర పారేసి మాశిష్యుడు వెళతాడు ఆతరవాత యీ దేవిఁటమ్మా యీ చిత్రవని నువ్వూ నలుగురమ్మలక్కలతోపాటు ఆశ్చర్యపడుదువుగాని. మీపంతులుతో సిఫార్సుచేసి యీ మంత్రం యలా సాగిస్తావో గట్టి ఆలోచనచెయ్యి.

మధు—మాపంతులు వక్కడివల్లా యీపని కానేరదు.

టు—మరియింకా యెవరికాళ్ళు పట్టుకోవాలో చెప్పు ?

ను—మావంతులుతో మాట్లాడ్డం ఐనతరవాత అవుధాన్లు కూతురు మానా స్తం మీనాక్షిని తండ్రికి తెలియకుండా చూసి, ఓ రెండు పెద్దకాసులు యిస్తానని చెప్పండి. ఆపైని సిద్ధాంతిని చూసి అతనికి ఆలాగే ఆశపెట్టండి. యీ పనికి సిద్ధాంతే కీలకం. నేను తెరవెనకనుంచి సమయోచితంగా హంగుచేస్తాను.

టు—నీమాటవరేనే చెప్పాలా? నిన్ను సంతోషపెట్టడం నాకు విధ.

ను—ఆమాట మీరు శలవివ్వడం నాకు విచారంగావుంది. వృత్తిచేత వేశ్యనిగనక చెయ్యవలసినచోట్ల ద్రవ్యాకర్షణచేస్తానుగాని, మధురవాణికి దయా దాక్షిణ్యాలు వున్నఅని తలచారా? మీతోడబుట్టుకి ప్రమాదం వొచ్చినప్పుడు నేను డబ్బుకి ఆశిస్తానా? యటుంచి యెటొచ్చినా కాపాడతాడు. హెడ్డు కనిష్టేబుకు మాత్రం కొంత నిజంచెప్పుదాం అతగాడు యిప్పుడే వస్తాడు, మాట్లాడతాను. మీరు యిక్కడ కూచోండి.

టు—స్వాధీనుడేనా? కొంపముంచడుగద ?

ను—గులాం. (నిష్క్రమించును.)

టు—కూచుందాం రా.

స్యను—నా పేరేవిటండోయి ?

టు—కొంపముంచుతావు కాబోలు! సుబ్బి ! సుబ్బి ! మధురవాణ్ణి చూడగానే మతి పోయిందా యేవిటి ?

స్యను—దానినవ్వు పట్టుబడాలని నిదానిస్తున్నాను.

టు—సబ్బు అన్నమాట జ్ఞాపకం వుంచుకుంటే సుబ్బిఅనే పేరు జ్ఞాపకంవుంటుంది.

(రామప్పంతులు గుఱ్ఱందూరాన్న దిగినడిచివచ్చి)

ను—(కరటకశాస్త్రితో మెల్లిగా) లోవలికెవరైనా వెళ్లారా ?

టు—(గట్టిగా) యెవరో యిద్దరు ముగ్గు రొచ్చారుగాని మీయిల్లాలుగారొచ్చి పైకి పొమ్మని గెంటేశారు.

ను—మీరెవరు? యెందుకొచ్చారు ?

టు—మాది కృష్ణాతీరం. నా పేరు గుంటూరు శాస్త్రులంటారు. తమదగ్గిరరాచ కార్యమేండి వొచ్చానండి.

వీధిలోనుంచిజవాను—"యినస్పెకటరుగారు నే వొచ్చిందాకా మఱ్ఱిచెట్టు కింద గుఱ్ఱాన్ని నిలబెట్టుంచుతావన్నారు. రూపాయలువేగం యివ్వండి."

[మధురవాణి ప్రవేశించును]

రామ—యవరు వొచ్చారట?

మధు—యవరొస్తారు? మీనాస్తులట! తగిలాను.

జవాను—రూపాయలండోయి.

రామ—(మధురవాణితో) యేదీ మొన్న నీకిచ్చిన రూపాయలు? సాయింత్రం మళ్లీ రాయిస్తాను. యీసైతాను ప్రాణం తింటున్నాడు.

మధు—మీరిచ్చిన రూపాయలు పట్నంతోలేశాను నేను డబ్బిక్కడదాచుకుంటే మాతల్లక్కడ కాలక్షేపం చెయ్యడవేలాగ?

రామ—వొట్టబద్ధాలు!

మధు—(తాళములు గుత్తి మెలలోనుంచి తీసి రామప్పంతులుమీదవిసిరి) చూసుకోండి

రామ—(బుజంతడువుకుంటూ) దురహంకారం కూడదు! విసిరికొడితే దెబ్బతగల్లేదనుకున్నావా యేవిటి?

మధు—దుష్టుమాటలనగా తగిల్తే తప్పా?

జవాను—యేవయ్యోయి. పోయి, రూపాయి లిచ్చావుకావని యినస్పెక్టరుగారితో చెబుదునా?

మధు—(మెడలోనానుతీసి) యిది తాకట్టువుంచి కావలసినసొమ్ము తెచ్చుకోండి.

రామ—(తనలో) ఆహా! యేమి యోగ్యమైనమనిషి! లేనిపోని అలుమానాలు పడకూడదు!

కరట—పంతులుగారూ యెన్నిరూపాయలు కావాలండి?

రామ—పాతిక్క.

కరట—నేదాఖలేస్తాను (జవానుకుఇచ్చును.)

రామ—ధనజాతకానికి డబ్బలా వొస్తూవుంటుంది. యేవిటి మీరాచకార్యం?

కరట—యిది నాపిల్లండి. దీనికి వివాహం చేయించి ఆసుకృతం తమరు కట్టుకోవాలి.

రామ—వివాహం చేయించడానికి నేను వైదీకిని కాను, నాకుమంత్రాలురావే ?
(చుట్ట, జేబులోంచి తీసి కొనకొరికి) యేవఁటా ప్ర మధురవాణీ ? అగ్గిపుల్ల.

మధు—(అగ్గిపుల్ల అందిస్తూ పంతులునుంచి శిష్యుడి వేపూ, శిష్యుడినుంచి పంతులు వేపూ కోపముతో చూసును.)

కరట—మంత్రవఁన్నప్పుడు వైదీకపవాడిదేం మంత్రఁండి ? యీరోజుల్లో వైదీకమ్మంత్రాల మహిమ పోయిందండి మంత్రవఁంటే నియ్యోగప్రభువుదే మంత్రిం ? తమవంటి ప్రయోజకులకు మంత్ర మాటాడుతుందండి.

రామ—మధురం ! యేవఁంటావు ? యీపిల్ల న్నే పెళ్ళిచేసుకుందునా ?

మధు—(రామప్పంతులు వేపూ, శిష్యుడివేపూ చురచుర చూసి నిష్క్రమించును)

రామ—సొగసుకత్తెలకి అలకకూడా అదో శృంగారం సుమండీ, శాస్త్రుల్లుగారూ !

కరట—వైదీకపాళ్ళం మాకా శృంగారాలు యలా అనుభవవౌతాయండి ? మాయిల్లాళ్ళకోపవొస్తె చీపురుగట్టలు యెగురుతాయండి. సరసవఁన్నది పుస్తకాల్లో వినపడవేఁగాని మాకు అనుభవవేద్యం కాదండి. శ్రీకృష్ణమూర్తివారు రాధికతో శలవిస్తున్నారు, ఓరాధికా నీకోపం తీర్చుకోవాలన్నట్టాయనా "ఘటయభుజబంధనం రచయరద ఖండనం, యేనవాభవతి సుఖజాలం" అనగా యేవఁంచున్నాడంటే కవీశ్వరుడు, చేతుల్తోటి ఉక్కిరి బిక్కిరి అయ్యేటట్టుగా కాగలించుకో, మరిన్నీ పెదివఁలు రక్తారోచ్చేట్టు కొంకెయ్యి, అంటున్నాడు.

రామ—(మధురవాణి వెళ్ళినగుమ్మము వేపు చూపి) ఉప్పులేకనే ముప్పందుం. మధురవాణికి మాత్రిం యీవెఱ్ఱి మొఱ్ఱి కవిత్వాలు చెప్పకండి. నాలాంటి మృదువర్తులమాటసరసం సహించరు.

కరట—ఆమె మీభార్యా కారండీ ? సంసారికన్నా మర్యాదగావుంది యీవేశ్య ! మీది యేవఁదృష్టఁ.

రామ—యెంపిక. యెంపికలోవుందండి. మీరాచకార్యం చెప్పారుకారు.

కరట—లుబ్ధావుధాన్లుగారికీ తమకి చాలాస్నేహవఁని విన్నాను. ఆయన తమమాట అడుగుదాటరట ?

రామ—ఆగాడిదకొడుక్కి ఒకరితో స్నేహం యేమిటండీ ? వాడి ప్రాణానికి డబ్బుకీలక. డబ్బుకి వాడికే స్నేహంగాని మరి యవరితోనూ స్నేహంలేదు. అయితే

వాడికి వ్యవహారజ్ఞానం లేకపోవడంచాతా, కోర్టులంటే భయంచాతా, సాస్తి హోలాక బతకలేడు వాడే అన్నమాటేవిఁటి, యీతాలూకాల్లో సివిలు ష్టేషన్ ప్లీడర్లు యెక్కడొచ్చినా రామప్పంతులు పప్పలేనిపులగం వుండదు.

కరట—ఆమాటవినే తాము నియ్యోగ ప్రభువులు, మంత్రబలంచాత చక్రం అడ్డేస్తారని తమర్ని వెతుకొచ్చాను. మాపింతల్లికొడుకు బియ్యే బియ్యెల్ పాసయినాడండి. డిప్టీకలక్టరీ చేస్తున్నాడు బంధువులకి ఆతనివల్ల గడ్డిపరకంతసాయం లేదుగదా? మీద మిక్కిలి కూరానారా యవళ్ళయినా గృహస్తులు గృహస్థు మర్యాదకి పంపించి, తల్లయినా పెళ్ళాంఅయినా ఆవిపుచ్చుకుంటే, తిరగ గొట్టిందాకా ఆభోజనం కూచుంటాడు! పెట్టడానికి పుచ్చుకోవడానికీ నియ్యోగ ప్రభువులు, తమకి చెల్లిందిగాని, మా వాళ్ళ ఉద్యోగాలు మంటిగడ్డ ఉద్యోగాలండి, "ఇయ్యా ఇప్పించఁగలఅయ్యలకేగాని మీసమన్వలకేలా రెయ్యకి! లేవాశారెడు" అని కవీశ్వరుడన్నాడు.

రామ—యీ యింగిలీషు చదువులలానైన కొద్దీ వైదీకులే అన్నమాటేవిఁటి అడ్డమైన జాతులవాళ్ళకీ ఉద్యోగాలవుతున్నాయి గానియంత చదువుకున్నా మీ వైదీకప్పంతుళ్ళవారికి మాచాకచక్యం లబ్బుతాయండీ? మా లౌక్యం మాలో స్వతహాగా పుట్టినది మీరు తెచ్చిపెట్టుకున్నది. యెరువు సరుకు యెరువు సరుకే విన్నారా? మీవాళ్ళు లంచాలు పుచ్చుకోవడం చాతకాక, పతివ్రతలమనివేషం వేస్తారు.

కరట—అదేపతకనైఁతే అది అమ్మకు బతకనాఁ అన్నట్టు మా వాళ్ళకే చాతయితే నాకు యీ అవస్థేవంఁటి? మావాడు పదిమంది పార్టీలతో చెబితే పదిర్నాళ్ళ సొమ్ము దొరుకును. యీ చిక్కులు లేక పోవును

రామ—యేవిఁటాచిక్కులు?

కరట—రుణబాధ చాలా లావుగా వుందండి. రెపటి పున్నంలోగా ఒక వస్త్రవేజూ తాలూకు రూపాయలు చెల్లకపోతే దావాపడిపోతుందండి. యీ పిల్లని నల్లబిల్లిలో వెంకటదీక్షితులుగారికి పదహారు వందలకి అమ్మ నిశ్చయించుకొని తీరా వొచ్చేసరికి యిప్పట్లో రూపాయలివ్వలేం పెళ్ళయిన నెలరోజుల్లో యిస్తావఁన్నారండి. అందుచేత అది [illegible] లుబ్ధావధాన్లుగారు వినాయ

ప్రయత్నంలో వున్నారనివిని తమ దర్శనానికి వొచ్చానండి. యిదిగాని
గాను సమకూరుస్తే పదివరహాల సాయిత్రీ దాఖలు చేసుకుంటాను.

—నేను నలభై యాభై రూపాయల వ్యవహారాల్లో జొరబడేవాణ్ణికాను.

—తాము చేసే సదుపాయాన్ని బట్టి యెంతయినా దాఖలు చేసేవాణ్ణేనండి నా
కొక్కు పనహారు వండయుంటాయండి. ఆపైని యెవొచ్చినా తాము దాఖలు
చేసుకోండి.

—"ఏతే, గిస్తే" బేరాలు మాకవసరం లేదు. అగ్నిహోత్రావధాన్లకి పద్దెని
మిది వొందలిస్తున్నామనుగదా, అందుకు సగానికి సగం తగ్గితేనేగాని అవధాన్లు
ఆ సంబంధం మాని మీ సంబంధం చేసుకోడు. అందులో మీ రుణానుబద్ధీకి
కేంటి నాకిచ్చేదేవిఁటి? యేవైఁతేనేవిఁ? ఆ వ్యవహారం యలాగా మించి
పోయింది. పదికోజులకింపటొస్తే ఫొక్తుపరుస్తును. ఆ సంబంధం భోగట్టా
ముందట నేనే తెచ్చాను. నా చేతులోంచి ఆ వ్యవహారం పోలిశెట్టిలాగేశాడు.
కృత్యాద్యవస్థమీద మధురవాణి మేజువాణీకి వాణొంక్ప్రంచే సరికి నా తొతలు
కొచ్చాయ మరివక ఉపాయం చెబుతాను వినండి. మీకు మయినరు కొమా
ర్లున్నారా?

—చిన్నవాడికి మయినారిటీ దాటి మూడేళ్ళయిందండి.

—అయితే యిహాలేందేవిఁటి? ఆ కుఱ్ఱవాడు మయినరని వాదిద్దాం.

—సాక్ష్యం యలావొస్తుందండి?

—ఓ, హూ హూ! మీకు యేమీ తెలియదే! యిలాంటి వ్యవహారాలు నా
తలమీద యెన్ని వెంట్రుకలున్నాయో అన్ని మోసేశాం, విన్నారా? ఉర్లాంబసవ
రాజా గారి సంభావన్లరేపే సాక్ష్యాలక్కూడా గేజటార్డర్ చేశాం. కుండనాలు
చేసుకున్నవారికి ఓ రూపాయి జాస్తా.

—జాతకంవుందిగదా యేంసాధనం?

—కాకితవైఁతే అగ్గిపుల్లతో ఫైసల్! తాటాకైతే నీళ్ళపొయ్యి! కొత్త జాతకం
వ్రాయించడం అయిదు నిమిషాలు పని. మా సిద్ధాంతిమట్టుకు నాలుకాగలాలు
వెళ్ళగావుండాలి నా దగ్గిర పాత తాటాకులు అరేఖాలు అటకనిండా వున్నాయి
ముప్పైయేళ్ళనాటి కాకితాలున్నాయి. రకరకాల సిరాలున్నాయి. ఒక
పాతికరూపాయిలు నాకు ఫీజుకింద యిచ్చి ఖర్చులు పెట్టుకోండి. గ్రంథం నడి
పిస్తాను.

కరట—దారి ఖర్చుకోసం తెచ్చిన రూపాయలు మీకు దాఖలుచేశాను. మరి బ్ర
గొరిగించుకుందావంటె దమ్మిడీలేదు. కోర్టులెంట తిరగాడానికయినా చేతిలో
డబ్బు సొమ్ముండాలిగదా? యిదో హస్తే టొంపలా నాతోవుంటే యలాగండి
కోర్టులెంట తిరగడం? తమ లౌక్యానికి అసాధ్యవన్నది వుంటుందంటే నే నమ్మ
జాలను. యలాగయినా కుసిర్ని సంబంధం తప్పించి, మా సంబంధం కుదిర్చి
నాకు యిచ్చే సొమ్ములో పదోవంతు తాము అంగీకరించి మిగిలింది నాకు దయ
చెయ్యండి. దీన్ని మొగుడింట అప్ప జెప్పి ఆపైన యీ గ్రంథం ద్యేవో
శాన చూసిందాకా తమర్ని అంటగాగి వుంటాను.

రామ—పదోవొంతు పనికిరాదు. మాచేరం యెప్పుడూ సగానికి సగం.

కరట—సంగోరు మీకిస్తే మరి నేను ఋణాలేం తీర్చుకోను?

రామ—ఋణాల్తీర్చుకో అక్కర్లేకుండా గ్రంథం జరిగిస్తాంగదూ? అప్పుడే మీచేతులో
రూపాయలు పడడానికి సిద్ధంగా వున్నట్లు మాట్లాడుతారేవిఁటి? దేను యవ
శ్రమపడ్డ పైసపతకం తిరగాలి? అది ఆలోచించారా?

కరట—తాము అలాఅంటే నేనేం మనవిచెయ్యనండి? రక్తం మాంసం అమ్ముకుంటూ
న్నప్పుడు ఆకానికూడయినా సంతుష్టిగా దొరకడం న్యాయంగదండి? స్వా
హారాల తొట్రుబాటుచాతనూ పిల్లకట్టు దప్పివుండడం చాతనూ, తొందరపడు
తున్నానుగానండి, కొంచం వ్యవధివుంటే రెండువేలకి పైగా అమ్ముకుందునండి.

రామ—"అయితేగియితేను" అనుకున్న లాభం లేదని చెప్పానుకానా? పదో
వొంతుకు యేవంటారు?

కరట—యీపాపపు సొమ్ముకే తమరు ఆశించాలా అండి?

రామ—పాపపు సొమ్ము మావగ్గిరకిరాగానే పవిత్రవైపోతుంది. ఒహళ్లే క్షేప
కోసవేఁగాని నాక్కావాలా యేవిఁటి?

కరట—ఐతే కానియ్యండి.

రామ—యిక నా ప్రయోజకత్వం చూడండి. మధురం! మధురం! కాకిరెం
సిరాబుడ్డీ తీసుకురా. మా మేలు సిరాబుడ్డి కాక గూట్లోది పెద్దసిరాబుడ్డి తే.

మధు—(అవతలనుంచి) నాకంటెమధురం కంటబడ్డ తరవాత నేనెందుకు.

రామ—ఆడవాళ్ళకి అనుమానం లావండి. వింటున్నారా? అదో ముచ్చట!

కరట—కేవలం [illegible]!

రామ—వజ్రవేఁగానండి, పట్టివాసపు అలవాటుచాత పదిమందితో మాట్లాడితేగాని, దానికి పూసుబోదు.

కర—ఆమాత్రం స్వేచ్ఛయివ్వడవేఁ మంచిదండి; ఆడదాన్నట్టే రోకాయించకూడదండి?

రామ—రోకాయిస్తే యెంజెస్తుం చేవిఁటండి ?

కర—యిలాంటి మానంగల మనిషైతే నూతులో గోతులో పడుతుందండి.

రామ—అలాగనా అండి ?

కర—అందుకు సందేహమేమిటండి ? నాజూకైన మనసుగల స్త్రీని మల్లెపువ్వులాగ కాసుకోవాలండి.

రామ—ఆ నాజూకులూ గీజూకులూ మీకేం తెలుసునండి.

కర—పుస్తకాల్లో చదువుకున్న ముక్కలు. నాయకుడు నిరాకరిస్తే నాయిక కొచ్చిన్నీ యేవే, ఉద్యానాల్లో వుండుకున్నటువంటి లతలతో వురికిపోసుకుంచుమండి. మహా కవులనాటకాల్లో అల్లాగే జరిగినట్లు రాశారండి.

రామ—మరెవళ్లతో మాట్లాడినా తప్పులేదుగాని, హెడ్కనిష్టీబుతో మాత్రం మాట్లాడవద్దని బుద్ధిచప్పండి. మీరుతండ్రిలాంటి వారుగదా ?

కర—ప్చ! అంత అదృష్టవాఁ అండి! అట్లాంటి పిల్లే నాకువుంటే, మూడునాలుగు వేల శమ్మకుని రుణాలూ పణాలూ లేకుండా కాలక్షేపం చేసివుందును. దీన్ని యినా నాలుగు దిక్కులా అమ్మ జూసితే రెండు మూడువేలు యిదివరకే చేతులో పడివుండునండి. మేనరికంచెయ్యాలని దీంతల్లి భీష్మించుక్కూచోబట్టి యీదు రవన్నమాటొచ్చింది. అంచాతనే యింట్లో చవ్వకుండా యీపిల్లని వెంటతీసుకొచ్చి యీదేశంలో పెళ్ళికి చూపుతున్నాను.

రామ—నానపఃయ లోపం వుండబోదు.

కర—ఐతే కార్యవఁయిందే!

రామ—యేదీపిల్లా యిలారా, చెయి చూపించూ.

(శిష్యుడు భయం నటించి వెనక్కి తక్కును.)

కర—చూపించమ్మా, భయంలేచ్చూపించు (కరటకశాస్త్రుల్లు శిష్యుణ్ణి రామప్పంతులు దగ్గరికి తోయును. రామప్పంతులు చెయ్యిపట్టుకుని అరిచెయ్యి చూచుచుండును.

శిష్యుడు చెయ్యిలాగుకోంటూన్నట్టు నటించును మధురవాణి సిరాబుడ్డీ, కలం, కాకితం పట్టుకుని రామప్పంతులు వెనక నిలుచుండును.)

రామ—ఆహా! యెంథవరేఖా! సంతానయోగ్యత బాగావుంది.

మధు—మీరు చేపట్టేతరవాత, ఆంమకు లోపం వుంటుందా?

(సిరాబుడ్డిలోని సిరా రామప్పంతులు ముఖంమీద పోసి ఛళ్లున వెళ్ళిపోవును.)

---

## 3_వ స్థలము. కృష్ణారాయపురం అగ్రహారంలో అగ్నిహోత్రావధాన్లు గారియిల్లు.



వీధి—గుమ్మంయెదట గిరీశంనిలిచి సన్ననిగొంతుకతో పాడును

"కామని విరిశరములబారికి నే,

నేమని సహింతునే, చెలి, యేమని సహింతునే!"

వీడి తస్సాగొయ్యా, వీడిబాణాలు పువ్వులటోయి? ఆమాట యెవడునమ్ముతాడు, వెరికుట్టె యెవడైనా నమ్మాలిగాని? అనుభవ వేద్యమైన దీని నిజం యేవిటంటే;— మంచిపదును బట్టిన లోహం మొనకి, డయమండ్ పాయంట్ వేసి, పాయిజన్‌లో ముంచి, కంటికి కనబడకుండా మంత్రించి విసురుతాడు. అంచేతనే, పై గాయం కనపడదుగాని పోలీసువాళ్ళ దెబ్బల్లాగ లోపలతహతహ పుట్టిస్తాయి. యీ విడో బ్యూటీ చూస్తే యేమీ తోచకుండావున్నది. అయితే యిది చెప్పే నట్టల్లా వశమయ్యేమనిషి కాదు. పాతరస్త్రాలేంపనికి రాకుండా వున్నాయి నాయక్‌స్పీరియన్సు, నాశృంగార చేష్టలూ గుడ్డి గవ్వంతపని చెయ్యకుండా వున్నాయి. యింత సింప్లిసిటీ యక్కడా కానలేదు. దీనికి లవ్ సిగ్నల్సు రామరామా! యేమీ తెలియవు. చమత్కారంమాటలు ఆడితే యేమిన్నీ అర్థంచేసుకోలేక ఆలేడి కళ్ళతో తెల్లబోయి చూస్తుంది. అయామ్ డెస్పరేట్లీ యిన్ లవ్ విత్ హర్. దీన్ని చూసిన దగ్గిర్నించీ టౌను లవ్‌న్నూ, డాన్సింగ్ గర్లునూ, మీద పరమాసహ్యంపుట్టింది. పాజిటివ్ యబహరెన్స్. వాళ్ళ తెంకె మాటలూ, పెడరాలు, దొంగవేషాలూ, డామిట్! అంతా యిన్ని

ప్రేటేయేగదా? యిన్నాళ్ళు మధురవాణి వల్లోపడి యెలాగు యాస్ని అయి
పోయినానో నాకు నామట్టుకే ఆశ్చర్యంగావుంది! మధురవాణికి యీమనిషికీ
కంపారిజన్ వున్నదా? ఆదిరంగువేసిన గాజుపూస యిది ప్యూర్ డైమండ్ ?
గాదని యెవడైనా అభాజనుడు అంటే అమాంతంగావాడి పిలకూడ దీస్తాను.
దీనిని చెడగొట్టడానికి ప్రయత్నం చెయ్యకూడదు చేసినా సాగేది కాదు. గనక
కొత్తదారీ. కొంతన్యాయమైన దారీ తొక్కాలి యేవిఁటయా అది? మాయో
పాయంచేసి దీన్ని లేవతీసుకుపోయి విడో మారియేజి చేనుకుంటినట్టాయనా
కీర్తి. సుఖంకూడా దక్కుతాయి. "టూ బర్డ్స్ యట్ వన్ షాట్!"
యిలాంటి అట్రన్లీ యిన్నోసెంట్ విడోని వొఫ్పించితీసుకుపోయి పెళ్ళాడితేమజా,
ప్రయోజకత్వముగాని, రెండేసి మూడేసి సంతానాలు కలిగి తురకాడితో నో.
మాదేకులవాడితోనూ లేచి పోవడానికి సిద్ధంగావున్న దండుముండల్ని విడో
మారియేజి చేసుకుంటే హెల్! పూటకూళ్ళమ్మలాంటి ముండని పెళ్లాడ్డం విడో
మారియేజి అనిపించుకోదు. అది దొంగముండా మారియేజి! యిదేవిఁటయా
యిది, యీ బుచ్చమ్మ? సాక్షాత్తూ పరమపవిత్రమైన విడో విల్ గిల్ట్ లెటర్స్!
అయితే, గియితే, మ-రా-రా-శ్రీ యన్- గిరీశంగారు విడో మారియేజి చేను
కోవడమేనా? "టు మారీ యె విడో, ఆర్ నాట్ టు మారీ, దటీజ్ ద క్వశ్చన్!"
షేక్స్పియర్ పడ్డ అవస్థలో పడ్డాం! "తొందరపడి హాజీసాహేబు తురకల్లో
కలిసిపోయినాడన్నట్లు" నావంటి బుద్ధిమంతుడు తొందరపడి యేపనీ చెయ్య
కూడదు. దాని లాభనష్టాలు బేరీజువేసి, జమాఖర్చుచేనుకుని మరీ డిసైడ్
చెయ్యాలి. లెటస్ సీ. Imprimis ఒకటోపద్దు డెబిడ్ (నష్టం) - విడో
మారియేజి చేసుకుంటే మావాళ్లు అక్కరచెయ్యరు. అందుకు క్రెడిట్, (లాభం)-
వాళ్లిప్పుడు చేస్తూన్న అక్కరేవుఁంది? గనక బేలెన్స్ (గాక బాకీ) నిల్ బండి
కున్నా! రెండోపద్దు - డెబిట్ (ఖర్చు) - లోకం నన్ను బహిష్కారం చేస్తారు.
అందుకు క్రెడిడ్, (జమ) - లోకంలోకల్లా విలవైన వస్తువను నేను అంకించు
కున్న, పనలేని ఆ లోకానికే నేను బహిష్కారం వేస్తాను. గనక క్రెడిటు
బాలెన్సు (నిలవ) - యేమిటయా ? నెగెటివ్ యడ్వాంటేజి, హేవింగ్ నథింగ్
టు డూ వితే పాపర్ వర్ల్డు - పోజిటివ్ యడ్వాంటేజి - పొజెసింగ్ ఆలిట్స్

వెల్! మూడోపద్దు - డెబిట్ - నష్టం - పీడ పెళ్ళాం వెధవచుండ'' అంటారు. నోటాబీనీ - యీ పద్దు నిజంగా డెబిటేనా? ఆడిట్ డిపార్టుమెంటు వార్ని అడిగి సంశయం తీర్చుకోవాలి. అందాకా మ-రా-రా-శ్రీ గిరీశంగారి అభిప్రాయం యేమంటే - విడో అనేది తుపేమిటి? ఏ నేమ్! ఓ పేరు? ఆ పేరు మనిషి మొహమ్మీద రాసుందా? మనిషిని ముస్తాబుచేసి యెదట నిలబెడితే, యిది పునిస్త్రీ, యిది విడో అని చెప్పగలిగిన పెద్దమనిషి యెవడు? ఒహడూ లేడు. గనక విడో అనేవస్తువ యెక్కడుందయ్యా? వెక్కిరించే వెధవల నోళ్ళలో వుంది. దీనికి క్రెడిట్, (లాభం) - యేమనగా - విడో పెళ్ళాడిందంటె ఆశుభం పోగా యిత్యంఅని అటెవడూ కన్నెయ్యడు. యిక డెబిట్లేని శుద్ధక్రెడిట్, నంబరు ఫోర్, "చుక్కలవలె, కర్పూరపు ముక్కలవలె నీదు కీర్తి ముల్లోకములన్! క్కిరిసి పిక్కటిల్లెను," అన్నట్లు గిరీశంగారికీర్తి మిన్ను ముట్టుతుంది. గిరీశంగారి విధవా వివాహ మహోత్సవం కథ న్యూసు పేపర్లలో పెద్దక్షరాల్తోపడుతుంది. క్రెడిట్ నెంబర్ ఫైవ్, విడోమారియేజి యసోసియేషన్‌వారు ఒక తృణం యిస్తారు. బుచ్చమ్మకూడా కొంచం డబ్బుంది. డెబిట్ - దావా తెస్తేగాని అవుంధాన్లు మావంగారు దాన్లో దమ్మిడీ యివ్వడు.

పాప్రెజెండ్ కాన్సన్నీ విచారించగా అవశ్యం విడోమారియేజి చేసుకుని తీరవలసిందే అయితే సాధనవేవింటి? యేదైనా యీ సెస్ బ్రిడ్జికటి వొడ్డు చేరాలి (పైకి ముఖం యెత్తి ఆలోచించి) వెంకమ్మ, మొగుడితో దెబ్బలాడి నూతులో పడ్డప్పుడు నేను సాహసించి వురికిపైకితీసిందగ్గిర్నుంచీ వూరంతా నేనుసాక్షాత్తూ సత్య హరిశ్చంద్రుణ్ణిగా భావిస్తున్నారు. అడుగడుక్కీ బుద్ధి దాళ్లేస్తూంటుందిగాని; నేనంత వాణ్ణీకానా యేవింటి? స్నేహంపట్లపికిచ్చేస్తారే గిరీశంగారు! సాధారణులా? గనుక బుచ్చమ్మని మనం లావుచనుంచేసినా సుతి మించే వరకూ యెవరూ తప్పు బట్టబోరు. రాత్రిళ్ళు అరబ్బీనైట్లు, కాశీమజిలీలు, మదనకామరాజు కథలూ చెబుతూవుంటే యెంతో సరదాగా పక్కని కూచుని వింటుంది. లవ్ స్టోరీజ్ బుఱ్ఱకెక్కించాను కొంత గ్రౌండ్ ప్రిపేరైంది గనక, యిహ విడో మారియేజి మంచిదని బోధపరుద్దాం. పాచిక పారినట్టాయనా, రామవరం చలో, విడో మారియేజి కరో! లెట్ మీ బిగిన్ ది కాంపైన్ ఏట్ వన్స్. (తలుపు కన్నములోనుంచి తొంగిచూచి) నడవలోకూర్చుని విస్తర్లు కుడుతున్నది. (ఏటులోయను నే) మొట్టమొదట కొంచం మ్యాజిక్ విసురుదాము.

శ్రీయా అను జావళీకూను రాగముతోపాడి) బుచ్చమ్మ వదినగారూ తలుపు తీయండి (బుచ్చమ్మ తలుపుతీయును) వదినా ..వెల్ !...వెంకటేశం యేమిచేస్తున్నాడు?

...ష్ణ—పెరట్లో గొట్టికాయ లాడుతున్నాడు.

...—ఈపూటవస్తే మరిచదువు చెడిపోతుంది. పట్నంలో వున్నప్పుడు డస్కు దగ్గరనుంచి కదలితే వొప్పేవాడను కాను...ఒక్కమాటు పి...పిలుస్తారా పాఠంచెపుతాను.

(బుచ్చమ్మ తమ్ముని తీసుకొని వచ్చుటకు వెళ్ళును.)

ఆహా! దీనితస్సాగొయ్యా, మొహంయెదటికి వచ్చేటప్పటికి కొంచం ట్రెంబ్లింగ్ పట్టుకుంటుంది వకటి అనవలెనని మరివకటి అనేస్తూ యుంటాను. మరెవళ్ళూలేరు. వంటరిగా దొరికిందిగదా, —యిలాంటప్పుడు నామనస్సులో మాట చెప్పేస్తే తీరిపోవునా! ఆ కోతి వెధవని తీసుకురమ్మని చెప్పాను. కానీ, పాఠాలలో చిన్నలెక్చరువేతాను. (వెంకటేశ్వరులు, బుచ్చమ్మ ప్రవేశింతురు.) దేమివాయి మైడియర్ బ్రదరిన్లా వెంకటేశం, పాఠాలు చదవడం శుభ్రంగా మానివేశావు? యిక్కడ మరి మాసంరోజులువుంటే వచ్చిందికూడా మరచిపోతావు. దేదీ టెక్స్టు బుక్కు పట్టుకురా. (వెంకటేశం పుస్తకము పట్టుకొనివచ్చును) గాడ్సేవర్కస్ అనేపాఠంతియ్యి రీడ్ ఆన్ మై గుడ్ బోయ్.

వెంకటేశ—(తడుముకుంటూ) దేర్ యిజ్ నాట్ ఏన్ ఆబ్జక్టు ఇన్ క్రియేషన్ వుచ్ డజ్ నాట్ సెర్వ్ సమ్ యూస్‌ఫుల్ పర్పజ్.

...శ—అట్టె! అట్టె! అక్కడ నిలుపు, క్రియేషన్ అనగా యేమిటి?

వెంకటేశ—క్రియేషన్ అనగా - అనగా - ఆవులు.

...శ—నాన్సెన్స్, చదువేస్తే ఉన్నమతికూడా పోతున్నది. ఆవులు యెదటవున్నాయనా ఆవులంటున్నావు? మళ్ళీ ఆలోచించి చెప్పు.

వెంకటేశ—మాటకి అర్థం అడిగిగారండి?

...శ—క్రియేషన్.

వెంకటేశ—ఇదా! క్రియేషన్ అంటే ప్రపంచం. నేను, యెదట ఆవులు కనబడితే యీ ఆవు పెరుగు యీ నెలరోజులేకదా తినడవంని ఆలోచిస్తూన్నాను.

గిరీశ—వన్ థింగ్ ఏట్ ఏ టైమ్ యిప్పుడు పాఠంమాట ఆలోచించు. క్రియేషన్ అనే వక్కమాటపైనే పక్కఘంట లెక్చరు యివ్వవచ్చును. ప్రపంచం యేలాగున్నది? కపిత్థాకార భూగోళా అని మనుధర్మ శాస్త్రంలో చెప్పినాడు, కపిత్థమంటే యేమిటి?

వెంక—నారింజపండు.

గిరీశ—వెరిగుడ్. అందుకు అమర నిఘంటువులో పద్యం నీకువచ్చునా?

వెంకటేశ—రాదు. చెప్పండి రాసుకుంటాను.

గిరీశ—యింతలు బదరీ ఫలములు యింతలు మారేడుపళ్ళు యీడుకు జోడై పంటుల
తామరమొగ్గలు పంతీకుచ కుంభములబోలు తరుణీ కుచములూ.
యీ ప్రపంచములో యేమివస్తువులుంటవి?

వెంకటేశ—ఆవులు.

గిరీశ—డామ్ నాన్సెన్స్, యెంతసేపూ ఆవులేనా?
యేవిటి వుంటవో బాగా ఆలోచించి చెప్పు.

వెంకటేశ—గేదెలు

గిరీశ—దట్ విల్ నాట్ డు, మళ్ళీ ఆలోచించి చెప్పు.

వెంకటే—అయితే నాకు తెలియదు.

గిరీశ—విడోస్ - యింతచిన్న ప్రశ్నకు నీకు జవాబు తెలియదు! ప్రపంచమందుండే వస్తువులన్నిటిలోకీ ముఖ్యమయినవి విధవలు. దానివిషయమై పెద్ద లెక్చరు యివ్వవచ్చును. మనదేశములో ఒక దురాచారమువున్నది. మొగవాడికి పెళ్ళాము చచ్చిపోతే తిరిగీ పెళ్ళాడుతాడు. ఆడదానికి మొగుడు చచ్చిపోతే యెంత యవ్వనములోనున్నా, యెంత సొగసుగానున్నా, మరివకడిని పెళ్ళాడవల్లలేదు. ఇది అన్యాయమంటావా, కాదంటావా?

వెంకటేశ—తప్పకుండా అన్యాయమే,

బుచ్చమ్మ—యేమండీ గిరీశంగారూ, వెధవలు పెళ్లాడడం పాపంకాదూ?

గిరీశ—ఆహా! మీ సత్యకాలం చూస్తే నాకు విచారంగానున్నది వెధవలు పెండ్లాడవలసినదని పరాశరస్మృతిలో స్పష్టంగానున్నది, వేదంలోకూడా నున్నది. పూర్వ రాజమహేంద్రవరములో యిదంతా పండితులు సిద్ధాంతం చేసినారు,

కాలంలో వెధవలు పెండ్లాడేవారు, వెంకటేశం! నలచరిత్రలో దమయంతీ రెండో పెళ్లి సాటించినపద్యం చదువు

వెంకటే—నాకు రాదు.

గిరీ—ఇంతే ముఖ్యమయిన పద్యం మరచిపోవడం యంతతప్పు! నోటుబుక్కు తీసుకో—"దమయంతి రెండో పెళ్లికి, ధరనుండే రాజులెల్లదడదడవచ్చిరి"—చూశావా! లోకంలో వుండే రాజులంతా వెధవని పెళ్ళాడడానికి వచ్చారట. (బచ్చమ్మనై పుజూచి) చూశారా? శాస్త్రాలన్నీ వొప్పుకోవడమే కాకుండామిది ఒక్కలి వెధవలు పెళ్ళాడకుండా వుండిపోతే దోషమని కూడా చెప్పుతూ వున్నాయి. యిందు విషయమై శంకరాచార్యులవారు పత్రికకూడా యిచ్చి యున్నారు.

బుచ్చమ్మ—అయితే మనవాళ్ళంతా వెధవల్ని పెళ్ళిచేసుకోకూడదంటారేః

గిరీ—అదంతా యింట్లో చాకిరీ చేయించుకోవడము కోసరము గాని మరేమీ కాదు. ఘూమురాత్రి ఉండనగాలేచి మరునాడు రెండు ఝామలరాత్రిదాకా యెద్దు లాగు పనిచేయిస్తారుకదా? ఒక్కపూటకంటె యెక్కువ భోజనం చెయ్యనియ్యరు గదా? అప్సరస లాగున యెంతసొగసుగావున్నా మంచిగుడ్డ కట్టుకోనివ్వరు. పసుపు పెట్టుకోనివ్వరు. తుమ్మెదపంక్తుల్లావుండే జుత్తుకూడా తీసివేస్తారు గదా! ఫీ ఏగ్జాంపిల్, మీ అక్కయ్యకు ఆ చంద్రబింబమువంటి ముఖముపైని ఒకకుంకుమబొట్టుంచే త్రినేత్రుశక్కైనా చూడడానికి అలవి వుండునా? ఆహా యీ అవస్థచూస్తే నా హృదయం కరిగిపోతున్నది ఆల్‌రైట్! ప్రపంచములో యింకా యేమివస్తువులువున్నవి?

వెంకటే—చేగోడీలు.

గిరీ—డామ్ నాన్సెన్స్ - ఏంతసేపూ తిండివిషయమయ్యే ఆలోచిస్తావు కాచి లక్ష్మి బ్రహ్మచారులుకూడా వున్నారు. వాళ్లు చెయ్యవలసినపని యేమిటి?

వెంకటే—వేదం చదువుకోవడం, పెయ్యలకి గడ్డితేవడం

గిరీ—నాన్సెన్స్- అవి నీతంత్రిదగ్గర చదువుకునే విద్యార్థుల మాట. బ్రహ్మచారి యొక్క రియల్ డ్యూటీ అంటే, విధింపబడినపని యేమనగా, విధవలను పెండ్లాడడమే ఇంకా క్రియేమున్నలో యేమున్నది?

వెంకటేశ—నాకు తెలియదు.

గిరీశ—రామవరములో విధవవివాహము చేసుకున్నవాళ్ళకల్లా నెల ఒక్కంటికి నూట రూపాయలు యిచ్చి పోషించడమునకు విడోమారేజి సభ ఒకటియున్నది. ఇది వరకు అయిదువేలమంది విధవలకు వివాహములు అయి పునస్త్రీలు అయిపోయి నారు. ఆల్ రైట్! క్రియేషన్ అనే మాట అయినది. ఆ సెంటెన్సు అంతకూ అర్థము చెప్పు.

వెంకటే—మీరొకమాటు చెప్పినతరవాత నే చెబుతాను.

గిరీశ—ఆల్ రైట్! ప్రపంచములో దేవుడు ప్రతివస్తువూ యేదో వొక ప్రయోగముకొరకు చేసియున్నాడు. చేగోడీ యెందుకు చేసినాడూ?

వెంకటేశ—తినడముకు.

గిరీశ—దటీజ్ రైట్, ఆవుల నెందుకు చేశాడు?

వెంకటేశ—పాలు యివ్వడముకు?

గిరీశ—పెర్ఫెక్ట్లీ రైట్, ఆడవాళ్ళ నెందుకు చేశాడు?

వెంకటేశ—వంట చెయ్యడానికి.

గిరీశ—నాన్ సెన్స్. పెండ్లాడడముకూ పిల్లలను కనడముకున్నూ. గనుక పెండ్లాడకుండావున్న వెధవపిల్లలు దేవుని ఆజ్ఞను అతిక్రమించిన పాపమును చేస్తున్నారు.

[అగ్నిహోత్రావధానులు ప్రవేశించుచు]

అగ్నిహో—ఏమండీ గిరీశంగారూ మాకుర్రవాడికి చదువు చెప్తున్నారూ?

గిరీశ—ఘంటసేపాయి చెపుతున్నానండి.

అగ్నిహో—యేదీ నేనూ డావింటాను కొద్దిగా చెప్పండీ.

గిరీశ—మైడియర్ బోయ్స్, గాడ్ మేడ్ క్రియేషన్. సృష్టియెవడు చేసినాడూ.

వెంకటేశ—దేవుడు.

గిరీశ—ఫాదర్ ఈజ్ నెక్స్ట్ టు గాడ్. దేవుని తరువాత ముఖ్యం యెవరూ! నే ఫాదర్.

వెంకటేశ—తండ్రి.

అగ్నిహో—మొత్తమువీాద మీ ఇంగ్లీషు దమువు మంచిదిలాగే కనబడుతూన్నది. భాషాభేదంగాని మనముకక్కలే వాళ్ళవిన్నీ.

—వెంకటేశం! దేవుడు సృజించిన ప్రపంచములో యేమివస్తువులున్నవి?
సే కోర్ట్స్.

టే—వెధవలు.

—నాన్ సెన్స్, సే కోర్ట్స్.

హో—యిదియేమిటండోయి ప్రపంచంలో వెధవలున్నారంటున్నాడు, ఇంగ్లీషు శాస్త్రాల్లో యిదేనాయేమిషి వున్నది?

—వెన్యూల్ అన్నది లాటిన్ మాటండి - ఆమాటకర్థం కచేరీలండి. కచేరీలం యెందుకున్నవి?

టేశ—దావాలు తీఎడముకు.

—దట్ ఈజ్ రైట్ - చూచారండీ మీవాడికి కచేరీల భోగట్టాలుకూడా నేర్పుతున్నాను.

హో—అయితేమనదావావిషయమై నేనిచ్చిన కాకితాలు సమగ్రంగాచూశారా?

—కేసు గెలవడముకు యేమీ అభ్యంతరములేదు. మీకు తెలియడంకోసం గ్రంథం అంతా తెలుగు చేస్తున్నాను. మామగారూ మీవిషయమై యెంతశ్రమ పడినావడి అమలాపురం వెళ్ళి అక్కడ కోర్టులో కేసు గెలిపించకపోతే నన్ను పేరుపెట్టి పిలువవద్దు.

హో—యేదో అంతా మిమ్మలినే నమ్ముకునివున్నాము. యెంత డబ్బయినా కేసు గెలిస్తే చాలును. పెళ్ళిపనులకి మీ కుమ్మక్కువుంటేనేకాని తూగదు కుమండీ. నామీద కోపంచాత కరటకశాస్త్రిల్లూ వాళ్లూ వెళ్లిపోయినారు. వాళ్లవొచ్చేటట్టు కనపడదు.

—మీరు కూర్చున్న దగ్గరనుంచి కాలుకదపకుండా ఎరేంజిమెంటు యావత్తూ నేను చేస్తానుకాదూ.

(నిష్క్రమించుచున్నారు.)

---

౮-వ స్థలము. పెరటిలో జామిచెట్టు కొమ్మమీద.
వెంకటేశం కూచుని జామిపండు కొరుకుచుండును.

—(౦)—

[చెట్టుకొమ్మలు ఆవరించివున్న నూతిలో నీళ్లు
బుచ్చమ్మ తోడుతుండును.]

బుచ్చమ్మ—తమ్ముడూ, గిరీశంగారు గొప్పవారర్రా?

వెంక—గొప్పవారంటే అలా యీలాగా అనుకున్నావా యేమిటి? సురేంద్రనాద్ బానర్జీ అంతగొప్పవారు.

బుచ్చమ్మ—అతగాడెవరు?

వెంక—అందరికంటే మరీ గొప్పవాడు

బుచ్చమ్మ—అయితే గిరీశంగారికి వుద్యోగం కాలేదేమి?

వెంక—నాన్సెన్స్! నువ్వు ఆడదానివి; నీకేం తెలియదు. ఉద్యోగమంటే గొప్పనుకుంటున్నావు. ఉద్యోగమంటే యేమిటో తెలిసిందా? సర్వెంట్ అన్నమాట.

బుచ్చమ్మ—అనగా యేమిటి?

వెంక—సర్వెంటనగానా? నౌఖర్ అన్నమాట. మన గేదెనికాసే అసిరిగాడు ఒక సర్వెంట్. మన యిల్లు తుడిచే అంకి ఒక సర్వెంట్. వీళ్లు మన నౌఖర్లు. పోలీసూ. మునసబూ. తెల్లవాడి నౌఖర్లు. జీతం లావురాగానే గొప్పనుకున్నావా యేమిటి? సురేంద్రనాద్ బానర్జీ, గిరీశంగారూలాంటి గొప్పవాళ్లు తెల్లవాడిదగ్గిర కాదు, దేవుడిదగ్గిరైనా నౌఖరి చెయ్యమంటే చెయ్యరు. కలక్టరేవంటాడో తెలిసిందా? పోలీసువెళితే "స్టాండ్!" నిలుచో అంటాడు. గిరీశంగారు వొచ్చారంటే షేక్‌హాండ్ చేసి కుర్చీమీద కూచోండి అంటాడు. ఆయనకి హైదరాబాదునవాబు వెయ్యిరూపాయల. పని యిస్తామంటే, నీపనెవడికి కావాలి పొమ్మన్నాడు.

బుచమ్మ—ఆయనకి పెళ్లైందిరా?

వెంక—లేదు.

బుచ్చమ్మ—తమ్ముడూ, వెధవలు పెళ్లాడ్డం మంచిదంటారుగదా, ఆయనెందుకు పెళ్లాడారు కార్రా?

వెం—నీకు యెంత చెప్పినా తెలియదు (గట్టిగా) ఆయన ఉద్యోగం చెయ్యకపోవడం, పెళ్లి మానుకోవడం లోకం మరామత్తు చెయ్యడానికట; యిప్పుడు తెలిసిందా?

బుచ్చమ్మ—యలా మరమ్మత్తు చేస్తున్నార్రా?

వెం—నావంటి కుర్రాళ్లకి చదువుచెప్పడం. (నిమ్మళంగా) చుట్టనేర్పడం. (గట్టిగా) వాల్చికోళ్చన్ అనగా సానివాళ్ల నందర్నీ దేశంలోంచి వెళ్లగొట్టడం ఒకటి. నేషనల్ కాంగ్రెస్—అనగా దివాన్గిరీ చలాయించడం ఒకటి యిప్పుడు తెలిసిందా?

బుచ్చమ్మ—ఉద్యోగం చెయ్యరన్నావే? దివాన్గిరీ యేంరాజువగ్గిర్రా?

వెం—యేరాజుదగ్గిరా?——ఆడదానివి నీకెందుకూ యీభోగట్టా అంతానూ?

బుచ్చమ్మ—నువ్వుకూడా లోకం మరమ్మత్తు చాస్తావుట్రా?

వెం—ఓ!

బుచ్చమ్మ—ఐతే వెధవముండనికూడా పెళ్లాడతావురా?

వెం—నాన్న తన్నకుండావుంటే తప్పకుండా పెళ్లాడతాను; గాని బోడిగుండు చేస్తేమాత్రం నాకక్కర్లేదు.

(గిరీశం ప్రవేశించి.)

గిరీ—వదినా యీ చెట్టుకింద నిలబడితే మీరు వనలక్ష్మిలా వున్నారు. (బుచ్చమ్మ వైపు తేరి చూచును.)

బుచ్చమ్మ—విన్నార్రా? తమ్ముడు వెధవని పెళ్లాడతాట్ట!

గిరీ—నా ప్రియశిష్యుడూ, మీకు, ప్రియసోదరుడూ అయిన వెంకటేశం విధవావివాహం చేసుకుంటే, మేం యావన్మంది వీణ్ని బ్రహ్మరథం పట్టమా?

బుచ్చమ్మ—గురువులుగదా ముందు మీరెందుకు చేసుకోరు?

గిరీ—అడగవలసినమాట అడిగారు. చెబ్తాను వినండి. మీరడిగినతరవాత చెప్పకపోవడం తప్పని చెబుతున్నాను గాని, యీ మాటలు చెప్పవలసినవి కావు. యేవంటే

టారా ? నా గొప్ప నే చెప్పుకోకూడదుగదా ? అదో వాటి. అంతకంటె ప్రమార
మైనమాట మరోటుంది. చూశారా వొదినా ! — మొదట్నించీ విధవావివాహం
కూడదు కూడదు అని తప్పు అభిప్రాయంలో పడిపోయివున్న అత్తగారూ,
మావఁగారూలాంటి పెద్దవాళ్ళకి యెన్ని శాస్త్రాలూ సవబులూ మనం చెప్పినా,
వాళ్ళకి నెత్తికెక్కవు. యిలాంటి మాటలు వాళ్ళతో మనం చెప్పినట్టాయనా
కబ్బుచ్చుకుంటారు. మావఁగారు వేదంమట్టుకే చదువుకున్నారుగాని నేను
శాస్త్రాలు అన్నీ చదువుకున్నాను. అబ్బో. నేను మన శాస్త్రాల్లో వుడ్డోణ్ణి.
శాస్త్రకారుడు యేవఁన్నాడూ ? "బాలాదపి సుభాషితం" అన్నాడు. అనగా
మంచిమాట చంటిపిల్లడు చెప్పినావిని ఆప్రికారం చెయ్యండయ్యా అన్నాడు.
అయితే మన పెద్దవాళ్ళు శాస్త్రాలలో చెప్పినప్రికారం నడుస్తారూ ? యంతమాత్రం
నడవరు. మనం శాస్త్రమూ, సవబులూ చూపిస్తే యావఁంటారు ? యీ గుంట
వెధవలు చెప్పడం మనం వినడవూనా అని కబ్బుచ్చుకుంటారు. నామాట కేవిఁ
చప్పకండీ, నాది యినుంలాంటి శరీరం—కొడితే కఱ్ఱ విరిగిపోవాలిగాని చెక్కు
చదరదు. నా ప్రియశిష్యుడికైతేనో ? మీ ఉంచరివీ మెత్తని మృదువైన శరీ
రాలు అవుటచాత యెవిఁకలు విరిగిపోతాయి. గనక యీ మాటలు మన్లో
మనం అనుకోవలిసినవే గాని మరొళ్ళతో ప్రాణం పోయినా అనవలసినవికావు.
యావఁంటారు ?

బుచ్చ—అవును.

గిరీ—అవునంటే చాలదు. యవరితోనూ యీ మాటలు చెప్పనని మీరంటేనేగాని
నామనసులో మాటలు నాలుగూ యెలా చప్పడం ?

బుచ్చ—యవరితోనూ చప్పను.

గిరీ—వొట్టేసుకోవాలి.

బుచ్చ—యావఁని వొట్టేసుకునేది ?

గిరీ—యావఁనా ? మీరు యవరితోనైనా చెబితే నాబుఱ్ఱ పగిలిపోవాలని వొట్టేసు
కోండి.

బుచ్చ—అహాఁ! అలా వొట్టేసుకోను ! మీ బుఱ్ఱ చల్లగావుండాలి. చెబితే నాబుఱ్ఱే
పగిలిపోవాలని వొట్టేసుకున్నాను.

గిరీ—అందుకు నే వొప్పుతానా యేవిఁటి ? నాబుఱ్ఱ పగిలింతరవాత మీబుఱ్ఱ బ్రతికి
యవడైనా [illegible] అడ్డుతాన్యూనా ?

సత్య—మాఅమ్మని బతికించారు కారా? మీరు అలాంటివారే,

—ఆమాటమీరే అన్నారుగనుక, వినండి—చెప్తాను. నేను పెళ్లాడి పెళ్లాం పిడ్డలూ నాకుంటే, వాళ్లని తల్చుకున్నతరవాత ప్రాణానికి తెగించి మీ అమ్మని తియ్యడానికి నూతులోకి గెంతె గలిగివుండునా? యీజన్మమంతా లోకోపకారం కింద వినియోగపర్చకుందామని నిశ్చయించుకుని యిదివరదాకా ఏకాకినై వుంటిని. సత్యమే. మీలాంటి నామేలుకోరినవాళ్లు "పెళ్లిచేసుకో" అంటే ఆమాటలో చేయడం కష్టమే; గాని ఒకమాటకిమాత్రం జవాబు న్యాయంగా చెప్పండి. ఒక్కళ్లకి ఉపకారం చెయడం గొప్పా? అందరికీ ఉపకారం చెయడం గొప్పా?

సత్య—అందరికి చెయ్యడవేఁ గొప్పనుకుంటాను.

—సరే! ఆమాటమీద నిలవండి. పెళ్లాడి. ఆలూబిడ్డలికి, ముచ్చకాయ ముగ్గు కి ఉపకారం చెయడంకంటే లోకోపకారం కింద యీ ప్రాణం వినియోగపర్చడం పుణ్యంకాదా? చచ్చేకాలానికి స్వర్గం యెదురుగుండా వొస్తూందే?

సత్య—లోకానికి యేం వుపకారం చాస్తారు?

—అలా అడగండి సోషల్ రిఫారమ్, సోషల్ రిఫారమ్ అంటే సంఘసంస్కారం. అసలు యింగిలీషుమాట యెంత అర్థవౌతుందో, మీకు దాని తర్జుమాకూడా ఐతే అర్థం అవుతుంది. విప్పిచెప్పాలంటే ఒకసిమిలీ, అనగా ఉపమానంచెప్పి మీకు బోధపర్సుస్తాను. లోకం తప్పుతోవలో వెళ్లుతూంటే ఆతోవలోంచి మళ్లించి మంచితోవలో పెట్టడమనేది సోషల్ రిఫారమ్.

సత్య—యేమిటా తప్పుతోవ?

—బాహా బురదాగట్లూ గతకలూ వున్నతోవ యలావుంటుందో యిప్పుడు మనవాళ్ల ఆచారాలు అలావున్నాయి; ఆతోవలోంచి బండీ తప్పించి మంచి దిమ్మిసా కొట్టిన హైరోడ్డులోకి మళ్లించాలి. ఆబండికి రెండుచక్రాలు. ఒకటి విధవావివాహం, రెండు నాచిక్వొశ్చన్, అనగా సానివాళ్లని హతవార్చడమన్నా యీరెండే రాజమార్గాలు.

సత్య—మనవాళ్ల దురాచారా లేవిటో నాకు బోధపడలేదు.

—ఐతే చెబుతాను వినండి. ముసలాళ్లకి చిన్నపిల్లల్నిచ్చి పెళ్లిచెయ్యడం ఒకటి. డబ్బుకి పిల్లల్ని అమ్ముకోవడం ఒకటి. అవునంటారా కాదంటారా?

బుచ్చ—అవును

గిరీ—ఆ ముసలాడు చస్తే కష్టంసుఖం యరగని పసిపిల్లలు విధవలు అవుతారు. తప్పు పుణ్యమూ తినడంచాత యేమీ యరగని పసిపిల్లలు పూర్ణయవ్వనం వొచ్చిన తరవాత మనసుపట్టలేకపోతే వాళ్ళదా తప్పు? "విధవవివాహం కూడదు, సధవవివాహం కూడదనీ" అని ఓర్వలేనిమాటలు చెబుతూ, డబ్బుకాశించి, ముసలి పెళ్ళిళ్ళు చేసే మూర్ఖులదా తప్పు? వూరుకుంటారేం?

బుచ్చ—నాకు తెలియను.

గిరీ—అవును మరి మీ రేమనగలరు? తల్లినీ తండ్రినీ యేమనుకున్నా మనసులో అనుకుని జీర్ణించుకోవాలిగాని, మీలాంటి మంచివాళ్ళు పైకంటారా? నాలాంటి వాణ్ణి, యేమండీ మామగారూ, పిల్లల్ని రూపవంతుడూ, యవ్వనవంతుడూ, బుద్ధి మంతుడూ అయ్ని వరుడికి యిమ్మని శాస్త్రంలో వుందిగదా, శాస్త్రానికి విరుద్ధంగా, యెందుచాత డబ్బుకక్కుర్తిపడి ముసలాళ్ళకి కట్టబెడుతున్నా రయ్యా? శాస్త్రంలో "విధవలికి పెళ్లి చెయ్యవలసినది. చెయ్యవలసినది" అని శాసించి చెప్పివుండగా యేందుకు చెయ్యరయ్యా అని అడిగితినట్టాయనా, ఒక్క చండప్రయోగం చేసి అవతలికి గెంటుతారు. అంచాత "కాంతబోసానపెట్ట" అనుకుని నోరుమూసుకు వూరుకున్నాను. యిహ నాచ్చికొళ్ళన్ మాటనంటే సానివాళ్ళని హతవార్చడం మంచిదంటారా కాదా?

బుచ్చ—వాళ్లని చంపేస్తారా యేవిటి?

గిరీ—చంపక్కర్లేదు, "పాముచక్కర్లేదు, పొగబెడితే" చాలునన్నట్టు సానివాళ్ళని పెళ్ళిళ్ళకి పిలవకపోవడం, వాళ్లిళ్ళకి వెళ్లకపోవడం, వాళ్లని వుంచుకోకపోవడం నేను చెప్పిన పనులుచేసేవాళ్లని కనపడ్డచోటల్లా తిట్టడం' యిలా నాలాంటి బుద్ధి మంతులంతా ఒహటై కొంతకాలం చేసేసరికి, కలికంలోకైనా మరి సాని వుండదు. లేకుంటే చూడండి మన వెంకటేశం పెళ్ళికి తప్పకుండా సాని మేళం తెస్తారు. నే యెరుగుదును. కూడదన్నపనల్లా మామగారు చాస్తారు. కూడినపనిమానేస్తారు. సానిమేళంతేవడమనేది డబ్బిచ్చి తద్దినం కొనుక్కోవడ మన్నమాటకాదా? పెళ్లినాటికి నాప్రియశిష్యుడికి కొంచం యీడొస్తుందిగదా ఆ సానిముండలు యబ్బెగా బిబ్బెగా వుండడం చూసి, పెళ్లాంమీద అసహ్యంపుట్టి "యీ పసిపిల్ల యెపుడగడవేప్పుడు, కాపరానికి రావడవేప్పుడు, యీసానివాణ్ణి

హీనజాగావున్నారని వాళ్ళనీ వెంకటేశం వుంచుకుంటే కొంప మునిగిపోతుంది గాని తరవాయి వుండిపోతుందా? యేవంటారు?

—అవును నిజవే.

—గనక లోకం బాగుపడేటందుకుగాను వెధవలికి పెళ్ళిచెయ్యడానికి, సానివాళ్ళని సాగరంపడానికి వీరకంకణం కట్టాను. మరే వచ్చి మీతమ్ముళ్ళాంటివాళ్ళకి అనే కలికి విద్యాబుద్ధులు చెప్పతున్నాను. గజీతగాణ్ణి ఔటచేశి నూతుల్లో గోతుల్లో పడ్డవాళ్ళని పైకి తీస్తాను. యింకా నాషనల్ క్రాంగ్రెస్ ఒహటుందిగాని అందులో నే చేసేపని చాంతాడంతి వ్యాఖ్యానం చేస్తేగాని మీకు బోధపడదు. పురవిధాల లోకోపకారం చేస్తున్నాను.

—యీ పనులన్నీ పెళ్లి చేసుకుంటేమాత్రిం చెయ్యకూడదా?

—యలా జెయడం? లోకవంటే యేవిటి గంజిగుంట అనుకున్నారా? యేషియా యూరోప్, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలేషియా అని, ఐదుఖండాలు. అందులో అమెరికాలో మనుష్యులు బుఱ్ఱకిందికీ కాళ్ళు పైకీపెట్టి నడుస్తారు. యిక్కడ పగలుగదా యిప్పుడు? అక్కడ రాత్రి. నార్తుపోల్ అని మరోదేశం వుంది. అక్కడ ఆర్నెల్లు పొగలే; అప్పుడు మరి రాత్రుండదు ఆర్నెల్లు రాత్రే; అప్పుడు మరి పొగలుండదు అక్కడేవిటనుకున్నారు. సముద్రిం అంతా మంచు కొండైపోతే శేళ్ళని బళ్ళకికట్టి సవారీవి, వాయువేగమనోవేగంగా వెళతారు. యిన్ని దేశాలకీ వెళ్ళి అక్కడివాళ్ళకల్లా ఉపకారం చేస్తేగదా లోకోపకారం అవుతుంది. పెళ్ళాంబిడ్డలూ వుంటే వాళ్ళని వొదిలి యలా పోవడం అయితే పెళ్ళాడమని మీరు చెప్పినమాటకూడా సుతలామూకొట్టి పారెయకూడదు. లోకానికోసం బతకడం ఉత్తమం. అయితే లోకం అంతా యంతవిలవో అంతకన్న యెక్కువవిలవైన రత్నంలాంటి ఆడమనిషి దొరికితే. తప్పకుండా పెళ్ళాడవలిసిందే. యీవూరొచ్చేవరకూ నా కలాంటి దివ్యసుందర విగ్రహం, కనపళ్ళేదు. మొహావెదట చెప్పకూడదు. అలాంటి మనిషి యివూళ్ళో కన పడ్డది; అందాన్ని పంచుకు ఆశించడ వెందుకని మనసు మళ్ళించుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నానుగాని మనస్సు లొంగకుండావుంది. భగవంతుడేం చేస్తాడో! మనస్సుతో యేవంటున్నానంటే, "ఓ వెఱ్ఱిమనసా! నువ్వు వల చిన చిన్నది ఆణిముత్యవేగాని యిన్నాళ్ళూ పెళ్ళి మానేసి యిప్పుడు

"పెళ్ళాడదాం, పెళ్ళాడదాం" అని యెందుకు సందడిపడతావు? "సంసార సాగరం దుఃఖం, తస్మాజ్జాగ్రత జాగ్రత" అన్నాడు. సంసారంలో పడిపోతేవున్నీ నీకు లోకోపకారం చెయ్యడానికి అవకాశం వుంటుందా?" అని మనస్సుకి బోధ పరుస్తున్నాను పెళ్ళాడితే లోకోపకారానికి అవకాశం యంతమాత్రం వుండదు చూశారా వదినా! మాటవరసకి మనం పెళ్ళాడతాం అనుకుందాం. సంసారం గడుపుకోవడానికి డబ్బు సంపాదించుకోవాలా? యిదివరకల్లా అంటే బ్రహ్మ చర్యం ఆచరిస్తున్నాను. గనక "సత్రాభోజనం, మఠానిద్ర" సరిపోయింది. మాటవరసకి మిమ్మల్ని పెళ్ళాడింతరవాత, అలా సరిపోదే! మనంగాని మావగారి మూఖానికి లక్ష్యపెట్టక, యెవరితోనూ చెప్పకుండా రామవరం వెళ్ళిపోయి అక్కడ శాస్త్రోక్తంగా పెళ్ళాడావఁంటే, ప్రస్తుతంపట్టుకు విడోమారియేజి సభ వారు మనకి నెలకి నూరూపాయిలు యిస్తారు ఓ నాలుగయిదు మాసాలు అలా కాలక్షేపంచేసి, హైదరాబాదాలోగాని, బరోదాలోగాని ఓ వెయ్యిరూపాయల వుద్యోగం సులభంగా సంపాదించుకుంటాను. హైదరాబాదు నవాబు నెల రోజులకిందట పెద్ద ఉద్యోగ మిస్తానన్నాడు "నేను ఒకడిదగ్గిర నౌఖరీ చేస్తానా?" లని విజ్జవీగి తోసిపారేశాను మీరు వివాహం చేసుకోమని సలహాయిస్తారని అప్పుడే యెరిగివుంటే ఆ ఉద్యోగం మించిపోనియ్యకపోదును.

బుచ్చ—మీరు ఉద్యోగం చెయ్యరన్నాడే, తమ్ముడు?

గిరీ—అవును బ్రహ్మచారిగావుండి లోకోపకారం చేస్తూ వున్నంతకాలం పెళ్ళిచేసుకోనని శపథం పట్టాను. గాని యిప్పుడు నా అదృష్టంవల్ల లోకం అంతటికన్నా విలవైన వజ్రంలాంటి భార్య దొరికితే పెళ్ళాడక తీరుతుందా? లోకంయొక్క విలవ వెండి అనుకోండి. లోకం వెండైతే మీలాంటి సువర్ణచ్ఛాయగల కుందనపు బొమ్మ, పఞ్చండోవన్నె బంగారం అవునంటారా కాదంటారా? బంగారం విలవ యెక్కువా వెండి విలవ యెక్కువా? చెప్పండి.

బుచ్చ—బంగారవేఁ యెక్కువ.

గిరీ—సరే, మీలాంటి బంగారంబొమ్మ లభించినప్పుడు లోకం గీకం అవతలపెట్టి పెళ్ళాడక తీరదుగదా. మాటవరసకి మనం పెళ్ళాడతాం అనుకోండి. పెళ్ళాడింతరవాత సంసారం సుఖంగా జరుపుకోవాలంటే లావుగా డబ్బుండాలిగదా! ఉద్యోగం చేస్తేగాని డబ్బులావుగారాదే?

...ప్ప—అవును.

...—అట్టే డబ్బెందుకని అడుగుతారు ఒకవేళ, చెబుతాను వినండి. సంసారానికి యిల్లన్నది ఒకటుండాలిగదా ? యేమంటారు ?

...ప్ప—అవును.

...—నాకు మేడలుంటేగాని కుదరదు. యిలాంటి చిన్న యిళ్లలో నాకు ఉక్కిరి బిక్కిరిగా వుంటుంది. ఆమేడచుట్టూ తోటవుండాలి. మామిడిచెట్లూ, అరటి చెట్లూ, జామిచెట్లూ, చెప్పన్ని వృక్షాలూ వేస్తాం. మన వెంకటేశం కోతిలాగ పళ్లుతింటూ యెప్పుడూ ఆ చెట్లమీదే వుంటాడు.

...—ఆచెట్లపళ్లన్నీ నేనే కోస్తాను.

...—అంతవాడివికావనా? మనం అలాగ యిల్లూ, వాకిలీ, తోటా, దొడ్డీ, యేర్పరుచుకునేటప్పటికి మనకి చిన్నపిల్లలు పుడతారు. వాళ్ళని సంరక్షణ సెయ్యాలా? వాళ్లు నేను కుర్చీమీద కూచుని రాసుకుంటూంటే వొచ్చి చెయ్యిబట్టుకులాగి నాన్నా యిది కావాలి అది కావాలంటారు. మీరు బీరపువ్వుల్లాగ వొంటి నిండా సరుకులు పెట్టుకుని, చక్కగా పసుపూ కుంకంపెట్టుకుని, మహాలక్ష్మిలాగ యింట్లో పెత్తనంచేస్తూవుంటే ఒక పిల్ల యిటివేపువొచ్చి మెడకాగలించుకుని, ఒక పిల్ల అటువేపువొచ్చి మెడకాగలించుకుని "అమ్మా యిది కావాలి, అమ్మా అది కావాలని" అడుగుతారు. వాళ్ళకి సరుకూ జప్పరాచేయించాలి, జరీదుస్తులు కుట్టించాలి. గిరీశంగారి పిల్లల్ని తీసుకురా అని ఒకప్పుడు నవాబుగారి శలవౌతుంది. మన పిల్లల్ని వెంకటేశంలాగ కాయగావంచా, తెల్లచొక్కాయితో పంపించడానికి వల్లకాదుగదా? వాళ్ళకి చిన్నబళ్లూ, గిళ్లూకావాలి. వాళ్ళకి చదువూసంధ్యాకి చెప్పించి ప్రయోజకుల్ని చెయ్యాలి? యిదంతా సంసార తాపత్రయం కాదా ? యిందులోపడిపోతే మరి లోకోపకారం చెయడానికి అవకాశం యేముంటుందా చెప్పడం మరిచిపోయినాను, అప్పుడుమన వెంకటేశం మనదగ్గిరే వుండి చదువుకుంటాడు.

...ప్ప—అలా అయితే మరి నాన్నకి. ఖర్చుండదు. నానా్న అమ్మా వాడిచదువు కోసం దెబ్బలాడ్డు.

...—నే వొద్దన్నానా?

వెంక—వాళ్లో చిన్న గుఱ్ఱబ్బండీ కొనాలి.

గిరీ—వేరే నీకు బండీ యెందుకు? మాపిల్లలబండీలో నువ్వు కూడా వెళ్ళుదువు గాని వాళ్ళు అల్లరచెయకుండానూ, కిందపడిపోకుండాను చూస్తూవుందువు గాని.

వెంక—అక్కయ్యని పెళ్లాడేస్తారా యేవిటి?

గిరీ—మాటవరసకి అని ఆంటూంటే, మతిపోయినట్లు మాట్లాడతావేవిటి?

బుచ్చ—అంతేకద?

గిరీ—అంతేగదంటే, అంతకంటె అదృష్టం నాకు పట్టడం యలాగ? ఆమాట మీరు అన్నా, నేను అన్నా, మీవాళ్లు నన్ను తన్ని తగిలేస్తారు. వెంకటేశంగానీ అన్నట్లాయనా, పెయ్యకట్ట తాడు వుణ్ణేవుంది.

వెంక—ఓయి నాయనో! (వీపుతడుముకొనును.) గుప్ చప్! నే అప్రాస్తాను

బుచ్చ—మానాస్తం, రాంభొట్లుగారి అచ్చమ్మ మీరు వొప్పుకుంటే మిమ్మల్ని పెళ్లాడతానంది.

గిరీ—పెళ్ళాడడవే వొస్తే, అచ్చమ్మనీ పిచ్చమ్మనీనా పెళ్ళాడతాను? యప్పటికైనా "ఒకళ్ళతో నాకు పనేవిటి? నా బతుకు సుఖవేదో నేను చూసుకుంటాను." అని మీలాంటి దివ్యసుందరవిగ్రహమూ, గుణవంతురాలూ, నామీద కనికరించి "గిరీశంగారూ నన్ను పెళ్ళాడండి" అంటే పెళ్ళాడతానుగాని అచ్చమ్మల్నీ పిచ్చమ్మల్నీ మెడకి కట్టుకుని ఉత్తమ బ్రహ్మచర్యం, లోకోపకారం మానుకుంటా ననుకున్నారా యేవిటి?

వెంక—మంచిపండు పడిపోయింది అందుకోండి.

గిరీ—(పండుతీసి) ఆహా యేమిచాయ! వొదినా మీవొంటి చాయనివుంది యీపండు యిందండి.

బుచ్చ—బిందెలోపడెయండి. తమ్ముడూ దిగొచ్చి బిందయెత్తు.

గిరీ—వాడక్కర్లేదు. నేనెత్తుతాన్లెండి (యెత్తి) ఆహా! యేమివయ్యారం!

(బుచ్చమ్మ నిష్క్రమించును.)

శిష్యా! రెండుపళ్ళురాల్చు

వెంక—నాన్నొస్తున్నాడండోయి దిడ్డీలోవ్వైపు. యేవిటి సాధనం?

గిరీ—ఆకులు ఠట్టంగా వున్నచోటుగా నేనున్నాను. తోట్లోద్దం ఆరంభిస్తాను.

[అగ్నిహోత్రావధాన్లు ప్రవేశించి.]

అగ్ని—గిరీశంగారూ, నీరుతోడుతున్నారండీ? అసిరిగాడు తోడుతాడే, యింగిలీషు చదువుకున్న వాళ్లు, మీ కెందుకా శ్రమ?

గి—పనివంటి వస్తువ లోకంలో లేదండి ఊరికే కూచుంటే నాకు వూసుపోదు. మొక్కలకా, మంచిది నాకా, కసరత్తూ. గవునరు తోట్లో గొప్పు తవ్వుతాడు. క్వీన్‌రాణీవారు బీదలూ సాదలకీ యివ్వడానికి బట్టలు కుడతారు. యింగిలీషువాడు సోమరితనం వొప్పడండి. వాళ్ళలో పెద్ద కవీశ్వరుడు షేక్స్పియరు యేవన్నాడో విన్నారా, "డిగ్నిటీ ఆఫ్ లేబర్" అన్నాడు—అనగా కలక్టరు గొప్పవాడు కాడు, జడ్జీ గొప్పవాడు కాడు; కాయక్లేశపడి కష్టపడే మనిషే గొప్పవాడన్నాడు. అంచాతనే యీ గొప్పదొర్లంతా మెప్పు పొందాలంటే తోటమాలీపని చేస్తారు. చెట్లూ చావిఁలూ యెక్కడం వొవటి వాళ్ళలో గొప్పవిద్య, లాభంలేని పని యేదీ దొర చెయ్యడండి మావఁగారూ. దొరగారు వూర్నించి వూరికి వెళుతూండగా దాహవేఁస్తుంది. చెట్లని పళ్ళుంటాయి. నడితోవలో చెట్టెక్కడం నేర్చుకోకపోతే దాహంతో చావవలిసిందేగదా? యేజన్సీ కమాన్ చేస్తూవుంటే పెద్దపులి వొస్తుందనుకోండి దొరకి చెట్టెక్కడం చాతయితే చపాల్న చెట్టెక్కి ప్రాణం కాపాడుకుంటాడు. అంచేత చదువుతోపాటు చెట్లెక్కడంకూడా నేరుస్తారు.

అగ్ని—దొర్ల తరీఖీదంతా ఆదో చిత్రం. వెంకడు రాసుకుంచున్నాడా, చదువుకుంచున్నాడా అండి?

గి—యింత సేపూ చదువుచెప్పి "చెట్లూ చావిఁలూయెక్కి ఆడుకో" అని తోలేశాను.

అగ్ని—మీకేం మతి పోయిందా యేవిఁటండి? కాలూ చెయ్యీ విరుచుకుంటే?

గి—రేపు మనవాడికి గుణుపురం తాసిల్దారీఅయి అడివిలో కమాను వెళ్లుతూవుండగా! పెద్దపులొస్తే చెట్టెక్కలేక, కాళ్లువొణికి చతికిల బడాలని మీ అభిప్రాయవాఁ యేవిఁటి?

అగ్ని—మనవాడికి తాసీల్దారీ అవుతుందండీ?

గి—యెందుక్కాకూడదు? గుఱ్ఱాలెక్కడం, చెట్లెక్కడం మనవాడు నేర్చుకోకపోతే, "నాయనా నువ్వు కమాన్లకి పనికిరావు. డెస్కు దగ్గిరకూచుని గుమస్తా పని చేసుకో. తాసిల్దారీ గీసిల్దారీ తలపెట్టుకు" అని దొర్లంటారు.

అగ్ని—అప్పైతే చిన్నచెట్లెక్కించండిగాని పెద్దచెట్లప్పుడే యెక్కనియ్యకండి.

గిరీ—అంచేతనే జామచెట్టు యెక్కమన్నాను. చూశారా ?

అగ్ని—ఓరి! కోతివెధవా!

గిరీ—అదుగో తిడుతున్నారూ? దొర్లచదువు చదువుకుంటే; దొర్లతరిఫీదు యివ్వక తప్పదు. మీరిలా తిడితే భయపడి కిందపడతాడు; యిలాంటిపనులు మీకిష్టం లేకపోతే, యింగిలీషుచదువు మానిపించి వేదం చెప్పండి.

అగ్ని—మరిచిపోయితిట్టాను. యీ యింగిలీషు వాళ్ళసంగతంతా అదో వెఱ్ఱిమొఱ్ఱి.

గిరీ—మీవంటి ప్రాజ్ఞులు అలా అండం నాకు ఆశ్చర్యంగా వుంది. వాళ్ళు దేవడిక మంచిదవడంచాతనే దేవుఁడు యింత రాజైశ్వర్యం వాళ్ళకిచ్చాడు. మనశాస్త్రాల్లో మాటలు మనం మరిచిపోయినావుఁ ఆమాటలే తెల్లవాళ్ళు దొంగతనంగా పట్టుకుపోయి, శాస్త్రం చెప్పినట్టల్లా ఆచరించి మనరాజ్యం లాగుకున్నారు. మీరు యెరిగినవారుగదా చెప్పండి. గురువులుదగ్గిర శిష్యులు యేంచేశేవారు? అడివికెళ్ళి చెట్లెక్కి సమిధలు తెచ్చేవారు. రండికీ మొండికి ఓర్చేవారు. యిప్పుడుయింత ప్రాజ్ఞులైన మీరేవఁంటున్నారూ? మావాడు యిల్లుకదిలివెళ్ళితే కందిపోతాడు. మావాడు జావఁచెట్టెక్కితే కాళ్లువిరుచుకుంటాడు అని భయపడతున్నారు. మీశిష్యులు బ్రహ్మాండమైఁన పట్టిచెట్టు కొనకక్కి ఆకులు కోసి తెస్తున్నారుకారా! మనపుస్తకాల్లో మర్మం కనుక్కొని దొర్లు బాగుపడుతున్నారు. మనపుస్తకాలు బూజెక్కించి మనం చెబుతున్నాం.

అగ్ని—మీకు చాలా తెలుసును. యీ తెల్లవాళ్లు చేసేవిద్యలన్నీ మనగ్రంథాల్లోంచి యెత్తుకెళ్ళినవే. యీ రెయిళ్లు గియిళ్ళూ యీపత్తు మనవేదంలో వున్నాయిమ. మీది మాపరిశీలనైనబుద్ధి మనకేసు గెలవడానికి మీరురాసిననవబులు మాశాగున్నాయి.

గిరీ—యింకాబాగుండును. రికార్డు పూర్తిగాలేదు. కొన్నికాగితాలు మీరే పారేశారో, మీవకీలు వుంచేసుకున్నాడో నాకు బోధపడకుండావుంది.

అగ్ని—నేను పారెయ్యలేదండీ. నాకు యింగిలీషు తెలియకపోవడం చాలాచిక్కొచ్చింది.

గిరీ—మీకే యింగ్లీషువొస్తె భాష్యం అయ్యాంగార్లా అయిపోరా? యీమడిలెడిపోవున్నకాగితాలు యీవత్తుగా [illegible] దయచెయ్యండి.

—మీరు సంసారం పనిపాట్లు యేం శ్రద్ధగా చేసుకుంటారు ! మావాడికీ మీలా యోజకత్వం అబ్బితే నాకోవాడి అవసరం వుండదు. దిగేటప్పుడు నిమ్మళంగా యంచేసి మరిదింపండేం? కీడించి మేలించమన్నాడు. (నిష్క్రమించును.)

—(నిమ్మళంగా) నాన్న యింట్లో కెళ్ళిపోయినాడు.

—నిమ్మళంగాదిగు.

—(పురికి) బతికించారు (వెళ్ళిపోబోవును)

—ఆగు ఆగు ఆవొళ్ళొపళ్ళు లాపట్రా.

—దొబ్బుతారా యేవిఁటి అన్నీని? అన్యాయం!

—"అన్యాయం పాపనాశనం" అన్నాడు. ఒక్క అన్యాయంతో పాపా న్నీ పోతాయి. అన్నిపళ్ళూ నువ్వొక్కతం తింటావాయేమిటి ? తింటే సైమకేక్. కడుపునొప్పొస్తుంది కడుపునొప్పొస్తే మీ అమ్మ నోరు పగల్దీసి సొలడు ఆముదం వసగుండా గొంతుకలో పోస్తుంది.

—నేనావఁదం తాగను.

—అలా అయితే పళ్ళట్టేతినకు (యాతాంవొడలి వెంకటేశంవొళ్ళోని కాయలు యెం చుకుడును.)

—(యేడుపు మొహంతో) పెద్దపళ్ళన్నీ దొబ్బుతారా యేవిఁటి?

—పెద్దవాళ్ళకి పెద్దపళ్ళూ, చిన్నవాళ్ళకి చిన్నపళ్ళూ. యింతసేపూ చెట్టెక్కి చీకలా కాపు చాల్దా? (నాలుగు పెద్దపళ్ళుతీసుకొని వెంకటేశం వీపుతట్టి) మైడియర్ డర్లింగ్ ! యిహ నీయిష్టవొచ్చినట్టు చెట్లూ చావఁలూయెక్కు. యింగిలీషువాడు నేచర్ స్టడీ చెయ్యమన్నాడు జామ చెట్టెక్కినప్పుడుమాత్రం పండూ, పరువు కాయా, పచ్చికాయా వీట్లభేదం బాగాస్టడిచేసి, పళ్ళేకొయ్యి. అందులో నాలుగు సంరక్షణకింద నాకియ్యి: లేకుంటే కడుపుబ్బుతుంది. నవ్వొహమాటు చెట్టె క్కింతరవాత, వలేసి చూసినా మరిపరుపుకాయ కనపడదు. "యేరకుమీ కసు గాయలు" అన్నాడు రసెవే!—(వెంకటేశం దాటువేసి పారిపోవును.)

పాటిక పారెటట్టే కనపడుతూంది వాః! యేమి సొగసు !

॥ పదమాపాక్కిలి, జాంబూ । పదమూమైచాయ, కోకపదమా పదమా ।

పదమాజడ, నడుమువిఖుత్ । పదమూ, నూగారుగూఢ పదమాచెలికిక్॥

(నిష్క్రమించును.)

# కన్యాశుల్కము—చతుర్థాంకము.



## ౧-వ స్థలము రామప్పంతులు యింటిసావిడి

-:o:-

[రామప్పంతులు కుర్చీమీదకూర్చుని వుండగా మధురవాణి నిలబడి తమలపాకులుచుట్టి యిచ్చుచుండును.]

రామ—నేనే చిన్నతనంలో యింగిలీషు చదివివుంటే జడ్జీలయదట ఫెళఫెళలాడింతును. నాకు వాక్స్థానమందు బృహస్పతివున్నాడు. అందుచాత నే యింగిలీషురాక పోయినా నాప్రభ యిలా వెలుగుతూంది.

మధు—మాటలు నేర్చిన శునకాన్ని వేటకిపంపితే ఉసుకోమంటే ఉసుకోమందిట.

రామ—నేనా శునకాన్ని?

మధు—హాస్యానికన్న మాటల్లా నిజవఁనుకుంటారేవిఁ?

రామ—హాస్యానికా అన్నావు?

మధు—మరి మీతో హాస్యవాఁడకపోతే, వూరంపరతోటీ హాస్యవాఁడమన్నారే వీఁటి?

రామ—అందరితో హాస్యవాడితేయరగవా?

మధు—అచేత నే కుక్కన్నా, పందన్నా. మిమ్మల్నే అనాలిగాని, మరొకర్ని అనకూడదే? మిమ్మల్ని యేవఁనడానికైనా నాకుహక్కువుంది. యిక మీమాటకొ తనక నాతో చెప్పేదేమిటి? మీమాటలకు భ్రమసేకదా మీ మాయలలోపడ్డాను!

రామ—నాకు యింగిలీషేవొస్తే, దొరసాన్లు నావెనకాతల పరిగెత్తరా?

మధు—మీ అందానికి మేము తెనుగువాళ్ళము చాలమో? యింగిలీషంటే జ్ఞాపకవొచ్చింది. గిరీశంగారు మాట్లాడితే దొరలుమాట్లాడినట్టు వుంటుందిట.

రామ—అటా, యిటా! నీకేం తెలుసును. వాడువొట్టి బొగ్గేరుముక్కలు పేల్తాడు. ఆమాటలుగానీ కోర్టులో పేల్తే చెప్పుచ్చుకు కొడతారు.

మధు—అదేమో మీకే తెలియాలి! గాని, గిరీశంగారు లుబ్ధావధాన్లుగారి తమ్ములటా! చెప్పారు కారు!

రామ—నీమనసువాడి మీదకి వెళుతూందేం? ఐతే నీకెందుకు, కాకపోతే నీకెందుకు?

మధు—మతిలేని మాటా, సుతిలేని పాటా, అని.

రామ—నాకామతి లేదం వు?

మధు—మీకుమతి లేక పోవడ మేం, సాకే.

రామ—యెం చేత?

మధు—ఉనట్ను వ్రాయడం చేత

రామ—యేమని రాసింది?

మధు—విచారం వ్రాసివుంది.

రామ—యెందుకు విచారం?

మధు—గిరీశంగారు లుబ్ధావధాన్లుగారి తమ్ములైతే, పెళ్లికివొస్తారు; పెళ్లికివొస్తే, యేదైనా విలిపి జట్టీ పెట్టి, మీమీద చేయిచేసుకుంటారేమో అని విచారం.

రామ—అవును. బాగా జ్ఞాపకం చేశావు గాని డబ్బు ఖర్చైపోతుందని అవుధాన్లు బంధువుల నెవళ్లనీ పిలవడు.

మధు—గిరీశంగారు పిలవకపోయినా వస్తారు.

రామ—నువుగానీ రమ్మన్నావా యేమిటి?

మధు—మీకంటే నీతిలేదుగాని నాకులేదా?

రామ—మరివాడొస్తాడని నీకేలా తెలిసింది?

మధు—పెళ్లికూతురు అన్నకి చదువు చెప్పడానికి కుదురుకు, వాళ్ళింట పెళ్లి సన్నాహం అంతా ఆయనే చేస్తున్నారట. అంచేత రాకతీరదని. తలుస్తాను.

రామ—వాడొస్తే యేమి సాధనం?

మధు—నన్నా ఆడుగుతారు?

రామ—పెళ్లేతప్పిపోతే?

మధు—యలాతప్పుతుంది?

రామ—తప్పిపోడానికి ఒకతంత్రం వున్నాను.

మధు—అయితే, మధుర మాట చెల్లించారే ?

రామ—చెల్లించక రావేప్ప యేచెరువునీళ్లు తాగుతాడు ?

మధు—యేదీముద్దు (ముద్దుపెట్టుకొనును.)

రామ—గాని మధురం, కీడించిమేలిద్దాం. ఒకవేళ దెబ్బచే జోటు అయినోయి వాడు రావడవే తటస్థిస్తే యేవిటి సాధనం ?

మధు—ఆడదాన్ని, నన్నా అడుగుతారు ?

రామ—ఆడదాని బుద్ధిసూక్ష్మం. కోటుకావ్యవహారం అంటే చెప్ప. యెత్తు యెత్తు యింద్రజాలం లాయెత్తుతారా? చెయిముట్టు సరసవంటేమాత్రం నాకు కరచరణాలు ఆడవు

మధు—పెళ్ళినాలుగురోజులూ, తలుపేసుకుని యింట్లో కూచోండి.

రామ—ఆడదానిబుద్ధి సూక్ష్మవని చెప్పానుకానూ? మామంచి ఆలోచన చెప్పావు.

మధు—గాని, నాకొకభయం కలుగుతూంది. నిశిరాత్రివేళ పైగొళ్లెం బిగించి, కొంపకి అగ్గిపెడతాడేమో?

రామ—చచ్చానే! వాడు కొంపలు ముట్టించే కొరివి జౌను. మరి యేవిగతి!

మధు—గతి చూపిస్తే యేమిటి మెప్పు ?

రామ—"నువ్వు సాక్షాత్తూ నన్ను కాపాడినపరదేవతివి" అంటాను.

మధు—(ముక్కుమీద వేలుంచి) అలాంటిమాట అనకూడదు. తప్పు!

రామ—మంచిసలహా అంటూ చెప్పావంటే, నాలుగు కాసులిస్తాను.

మధు—డబ్బడగలేదే? మెప్పడిగాను. నేను నా ప్రాణంతో సమానులైన మిమ్మల్ని కాపాడుకోవడం, యెవరికో ఉపకారం?

రామ—మెచ్చియిస్తానన్నా తప్పేనా?

మధు—తప్పుకాదో ? వేశ్యకగానే దయా దాక్షిణ్యాలు వుండవో?

రామ—తప్పొచ్చిది. లెంపలు వాయించుకుంటాను, చెప్పు.

మధు—పెళ్లినట్లలకి పూటకూళ్లమ్మది అపూర్వంటి.

గిరీ—శబాష్! యేమి విలవైన సలహా చెప్పావు! యేదీ చిన్న ముద్దు (ముద్దు పెట్టుకోబోయి, ఆగి) గాని గిరీశంగారు నన్నూ దాన్నీకూడ కలియగట్టి తంతాడేమో?

మధు—అభయం మీకక్కరలేదు. పూటకూళ్ళమ్మ కనపడ్డదంటే, గిరీశంగారు పుంజాలు తెంపుకు పరిగెతుతారు, ఆమె నోరు మహా చెడ్డది.

గిరీ—అవును. నోరేకాదు, చెయ్యికూడా చెడ్డదే. దాం దెబ్బనీకేం తెలుసును. గాని, మా దొడ్డసలహా చెప్పావు. యేదీ ముద్దు. (ముద్దుపెట్టుకొనును.)

ముద్దుబెట్టుకుంటుండగా, లుబ్ధావధాన్లు ఒక వుత్తరము చేతబట్టుకొని ప్రవేశించును)

లుబ్ధా—యేమిటీ అభావచేష్టలూ!

గిరీ—(గతుక్కుమని తిరిగిచూసి) మావాఁ పడుచువాళ్ళంగదా? అయినా, నా మధురవాణిని నేను నడివీధిలో ముద్దెట్టుకుంటే, నన్ను అనేవాడెవడు?

మధు—నడి కుర్చీమీదయెక్కి ముద్దుపెట్టుకోలేరో? పెకితనానికి హద్దుండాలి. బావగారికి దంటాలు, దయచెయ్యండి. (కుర్చీ తెచ్చి వేయును.)

గిరీ—నాకు మావగార్తైతే, నీకు బావగారెలా గేవిటి?

మధు—మాకులానికి అంతా బావలే. తమకు యలా మావఁలైనారో? (లుబ్ధావధాన్లతో) కూచోరేం? యేమి హేతువోగాని బావగారు కోపంగా కనపడుతున్నారు. రేపు పెళ్లైనతరవాత అక్కగారిని, వీధితలుపు గడియవేసి మరీ ముద్దెట్టుకుంటారేమో చూస్తానుగదా? అయినా మీఅల్లుడుగారికే చిన్నతనం యింకా వొదిలిందికాదు.

గిరీ—పైలా పచ్చీసీలో, చిన్నతనంకాక పెద్దతనం యలా వొస్తుంది? యేం, మావాఁ! కోపవాఁ?

లుబ్ధా—నాకు పెళ్లీవొద్దు పెడాకులూవొద్దు.

గిరీ—(మధురవాణి చెవిలో) చూశావా మధురం, నాయంత్రం అప్పుడే పారింది. (పైకి లుబ్ధావధాన్లుతో) అదేం. అలా అంటున్నారు? నిశ్చయం అయినతరవాత గునిసి యేం లాభం?

లుబ్ధా—నీ సామ్మేం పోయింది? గునియడం గినియడంకాదు. నాకీ పెళ్లి అక్కర్లేదు.

మధు—(రామప్పంతులు చెవిలో) యేమిటీ వుత్తరం ?

రామ—(మధురవాణి చెవిలో) అగ్నిహోత్రావధాన్లు చేయకట్టి నేనే బనాయించాను.

మధు—(రామప్పంతులు చెవిలో) యేమనని ?

రామ—(మధురవాణి చెవిలో) నువ్వు ముసలవాడివి గనుక నీ సంబంధం మాకు వొద్దని.

మధు—చిత్రం ! చెప్పేస్తాను.

రామ—(మధురవాణి చెవిలో) నీకు మతిపోయిందా యేమిటి ? పెళ్ళి తప్పించమని నువ్వే నాప్రాణాలు తోడితే, యీ యెత్తు యెత్తాను. నోరు మూసుకో.

మధు—(లుబ్ధావధాన్లు చెవిలో) యీ సంబంధం మీకు కట్టిపెట్టాలని పంతులు చూస్తున్నారు. వొప్పుకోకండి.

రామ—(మధురవాణితో) యేమి బేహద్బీ ! (లుబ్ధావధాన్లుతో) స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః అన్నాడు. దానిమాటలు నమ్మకండి కల్పనకి యింతమనిషి లేదు.

లుబ్ధా—(చేతిలోని వుత్తరము ఆడిస్తూ) యీ కుట్రంతా నీదే.

రామ—(తీక్ష్ణంగా మధురవాణి వైపు చూసి, లుబ్ధావధాన్లుతో) కోపం కోపంలా వుండాలిగాని, యేకవచన ప్రయోగం కూడదు

లుబ్ధా—యిందంతా మీకల్పనే. నాకొంప ముంచడానికి తలపెట్టారు. చపండి.

రామ—(వుత్తరం అందుకోక కుర్చీ వెనక్కి తీసుకుని) ఆవుత్తరం సంగతి నాకే తెలుసును ?

లుబ్ధా—చేసినవాడివి నీకు తెలియకపోతే, యెవరికి తెలుస్తుంది?

రామ—అదుగో మళ్ళీ యేకవచన ప్రయోగం ! మెత్తగా మాట్లాడుతున్నానని కాబోలు ఆనాడీ చేస్తున్నారు ? వుత్తరంగిత్తరం నేను కల్పించానని, మళ్ళీ అన్నారంటే కథ చాలా దూరం వెళుతుంది. ఆ సంగతిమట్టుకు కాని వుండండి. రామప్పంతులు తడాఖా అంటే యేమనుకున్నారో ?

లుబ్ధా—నువ్వు—

రామ—అదుగో మళ్ళీ

—మీ కల్పనైతే నేం, మనోహరి కల్పనైతే నేం, బుద్ధి పొరపాటునాది. మధ్య వస్థలతో నాకేంపని వెంటనే బయల్దేరిపోయి, ఆ అగ్నిహోత్రావధాన్లునే అడుగుతాను.

—మాటలు మాజోరుగా వొస్తున్నాయి. జాగ్రత (లుబ్ధావధాన్లు వెళ్లును) న్నేనా వెధవలు అంటున్నాడు ?

—నన్నుకూడా కలుపుకోవాలని వుందా యేమిటండి?

—నన్నుమట్టుకు వెధవని కింద కట్టావూ ?

—నేవుండగా వెధవలు మీ రెలా అవుతారు ?

—నన్ను సప్త వెధవని చేశావు మరి యింకా తరవాయి యేం వుంచావు?

మధు—అదేమిటి ఆమాటలు?

—ఆ వుత్తరం నేను బనాయించానని, ఆవెధవతో యెందుకు చెప్పావు?

—మీతోడు, నేను చెప్పలేదే?

—మరి నేను బనాయించానని, వాడి కెలా తెలిసింది?

—యెందుకీ ఆందోళన ?

—మరి, ఆవెధవ ఆవుత్తరం తీసికెళ్ళి అగ్నిహోత్రావుధాన్లుకి చూపిస్తే, నామీద వాడు వెంటనే ఫోర్జరీ కేసు బనాయిస్తాడే? పీక తెగిపోతుంది ? యేమిటి సాధనం ?

—యంత్రం యెదురు దిరిగిందో? ఐతే చక్రం అడ్డువేస్తాను. (మధురవాణి లోంద [illegible]గా వీధిలోకి వెళ్లును.) యిదెక్కడికి పారిపోతూంది? యిదే చెప్పేశింది. దొంగ [illegible] చేసినప్పుడు రెండోవారితో చెప్పకూడదు. వెధవని చెవులు నులుపు [illegible]టాను. మరి గెత్తి వెళ్లి చేతులో కాగితం నులుపుకొత్తునా ?—గాడిదకొడుకు [illegible]స్తే? పోయి మీనాక్షి కాళ్లుపట్టుకుంటాను.

(మధురవాణి వకచేతితో వుత్తరము, వకచేతితో లుబ్ధావధాన్లు చెయ్యిపట్టుకుని ప్రవేశించును.)

—(రామప్పంతులుతో) చాలు, చాలు, మీ ప్రయోజకత్వం. బావగారికి [illegible] తమ్ముడా, కొడుకా, కొమ్మా? మిమ్మలిని ఆప్తులని నమ్మకుని, సలహాకిపిస్తే [illegible] సాలోచనా చెప్పక, ఏకవచనం బహువచనం, అని కాష్టవాదం

పెట్టారు. బావా! కుర్చీమీదకూచోండి (కుర్చీమీదకూచోబెట్టి) (రామప్పంతులుతో) యీవుత్తరం యేవిఁటో నింపాదిగా చదివి చూచుకోండి (వుత్తరం రామప్పంతులు చేతికి యిచ్చును )

రామ—(వుత్తరం అందుకుని తనలో) బతికాఁవా దేవుఁడా. (చూచికుని) అరె నావుత్తరవేఁకాదే యిది. నాసీడచూచి నేనే బెదిరాను (పైకి) మావాఁ వొస్తూనే తిట్లతో ఆరంభిస్తే యెంతటి వాడికైనా కొంచం కోపం వొస్తుంది. నెమ్మదిగానూ, మర్యాదగానూ, నన్నొచ్చియేం సహాయం చెయమంటే అది చెయనూ ?

లుబ్ధా—మరైతే యీ పటాటోపం వొద్దని రాయండి. అతగాడికి పటాటోపం కావలిస్తే అఖర్చంతా అతగాడే పెట్టుకోవాలి.

మధు—(లుబ్ధావధాన్లు, జుత్తుముడివిప్పి దులిపి) యేం ధూళి! సంరక్షణ చేసేవాళ్లు లేకపోబట్టిగదా ? (గూటిలోనుంచి వానననూనె దువ్వెనా తెచ్చి తలదువ్వుచుండును.)

రామ—(ఉత్తరం తిప్పికొనచూసి చదువును.) "సేవకుడు తమ్ముట్లు గిరీశం"—వీడా

మధు—పైకి చదవండి.

రామ—సీగిరీశం, అనగా నేపై! చదవాలేం ?

మధు—అయితే, మీరే చదువుకు ఆనందించండి.

లుబ్ధా—"సీగిరీశం" అన్నారేం?

రామ—అది వేరేకథ.

లుబ్ధా—పైకి చదవండ

రామ—(చదువును)

"శేవకుడు, తమ అత్యంత ప్రియసోదరులు. గిరీశం ఆనేక నమస్కారములు చేసీ చాయంగల విన్నపములు, త॥ యీ నాటికి వృద్ధాప్యంలోనయినా మీరు తిరిగీ వివాహం చేసుకుని ఒక యింటివారు కావడమునకు నిశ్చయించిరన్నమాట విని య మందానందకందళిత హృదయారవిందుడ నైతిని"

లుబ్ధా—వెధవ, వృద్ధాప్యవఁట్రాదూ ? మొన్న గాక మొన్న వేగదా యాభైదాటాయి

—(దువ్వెన మొలను పెట్టి, లుబ్ధావధాన్లు జుత్తుముడివేసి) సంరక్షణలేక యిలా వున్నారుగాని, యవరు మిమ్మల్ని ముసలివాళ్ళనేవారు?

—(చదువును) "మీకు కాబోవు భార్య, నా ప్రియశిష్యుండగు వెంకటేశ్వర్లు భగినియగుటంజేసి నాకు బ్రహ్మానందమైనది. నేను అగ్నిహోత్రావధానులు వారి యింటనే యుండి పెళ్ళిపనులు చేయించుచున్నాడను. వారు నన్ను పుత్రి ప్రాయముగా సాదరించుచున్నారు. బహు దొడ్డవారేగాని చంద్రునకు కళంక మున్నటుల వారికి కించిత్తు ద్రవ్యాశా, కించిత్తు ప్రథమకోపముం గలవు."

వ్యాకరణం వెలిగిస్తున్నాడయ్యా గుంటడూ!

—ఆకోపం వొచ్చినప్పుడు మాత్రం యెదట పడకుండా దాగుంటే యెముకలు విరగవు. ప్రాణంబచాయిస్తుంది. మరేమీ ఫర్వావుండదు—ద్రవ్యాశ నగా, ఆ వారికిగాని మీకుగాని ఉపచరించేదికాదు. మీ వూరివారెవరోగాని ఒక కుంటని, మీరు విశేషధనవంతులనియు, పెళ్ళి దేవదుందభులు మ్రోయునటుల చేతురనియు, వర్తమానము చేయుటను, యేబది బండ్లమీద యీ వూరివారినందరిని తరలించుకు రానైయున్నారు. ఇంతియగాక, దివాంజీ సాహేబు వారినడిగి ఒక కుంజరంబునూ మూడు లొట్టియలనూ, యేనుగుబ్బంబులం గూడ తేనై యున్నారు. బంగారవుటడ్డలపల్లకీగూడ దెచ్చెదరు.

—దానిమీద సవారీ ఐ, ఆలండా లత్తులతో వూరేగి, మీరు పెళ్ళిచేసుకోవడం నాకు కన్నులపండువే గాని, యిపంతా వృధా వ్రయంగదా. అని నాబోటి ఆప్తులు విచారిస్తున్నారు. యెద్దుపుండు కాకికి రుచి. రామప్పంతులు సామ్మెం పోయింది? "

విధవ! నావూ సెందుకోయి పీడకి?

ఒక చరమరహస్యం. అది యెద్దియనిన, యీ రామప్పంతులు ...కులకు, బాశాల్; తెలివికి, బిగ్ యాస్."

యిదేవిటోయి, యీ బొట్లేరు యింగిలీషు!

...గా"

వ్యాఖ్యానంకూడా వెలిగిస్తున్నాడయ!

...గాల్, అనేది, గుంటనక్క—'

...విధవ!

‘‘శిగ్ యాస్, అనగా, పెద్ద—’.

వీసి సిగాదరగా! యేం వీసిపోయీకాలం! పీడిమీద తక్షణం డామేజీ దావా పడేస్తాను.

(మధురవాణికి నవ్వొచ్చి, ఆపుకోజాలక, విరగబడి నవ్వును.)

యెందుకలా నవ్వుతావు? నీ మొగుడు నన్ను తిడుతున్నాడనా ఆనందం?

మధు—(నవ్వుచేత మాట తెమలక, కొంతసేపటికి) కాదు—కాదు—మీతోడు—లోంటి—

రామ—నాతోడేవిఁటి! నేను చస్తే నీకు ఆనందవేఁ!

మధు—(ముక్కుమీద వేలువుంచి, రామప్పంతులు దగ్గరకువెళ్లి, సిరస్సు కౌగలించుకొని, ముద్దెట్టుకొనును) యేమి దుష్టమాటా!

రామ—మరెందుకు నవ్వుతావ్?

మధు—లొటి—లొటి—లొటి—

రామ—యేవిఁటా ‘‘లొటి’’?

మధు—లొటి—పిట—

రామ—అవును, లొటిపిట, అయితే?

మధు—(సమాళించుకుని) యెందుకో?

రామ—యెందుకో నాకేం తెలుసును?

బుచ్చ—ఉత్తరం వల్ల మీరే తెమ్మన్నట్టు అగుపడుతూందే?

రామ—నేనా? నేనా? నాకెందుకూ లొటిపిట?

మధు—(ఉప్పెనగా తిరిగీ నవ్వుతూ) యెక్కడానికి.

రామ—నేనా యెక్కడం?

మధు—యెందుకు కూడదూ? మీరొక లొటి—పిట—బావగారొక లొటిపిట—పో—పో—పోలిశెట్టి—పెళ్లి సప్లయిదారుడుగనక, అతడో లొటిపిట—యెక్క పోలాలంట—వూరేగండి—వెన్నుకప్పెక్కి—ఆవైభవం—కళ్ళారాచూస్తా—(మిక్కిలిగా నవ్వును నవ్వు సమాళించుకుని) బావగారూ, క్షమించండి—అదృష్టరాతకి నవ్వాను—మరేంగాదు.

—దుష్టంటే దుష్టా! గాడిద!

—మీకోనా, పెద్ద గాడిదనికూడా తెమ్మన్నారని కాబోలు. రాశాడండీ.

—లేదు, లేదు, గాడిదెమాట వుత్తరంలో యక్కడా లేదు.

—వుంది. నేను చదివానండీ గాడిదెనెందుకు తెమ్మన్నావయ్యా నానెత్తి కి?

—నీకు మతిపోతూందా యేమిటి? గాడిదెమాట లేకపంటూంటే నే? (మధుర వాణి తిరిగి నవ్వు చుండును) నీక్కూడా మతిపోయింది? యెందుకానవ్వు? న్న చూశా? అవుధాన్లును చూశా?

—యెందుకు—ఆ—అనుమానం?—సామెత—వుంది.

—యేమిటూ సామిత గీమితాను?

—గాడిద అందిట—పాటకి నేను—అందానికి—మా అప్పా—అందిట—

—అంటే?

—పెళ్ళికి గాడిద--లొట్టిపిటామాట--యిన్నాళ్ళకి--మళ్ళీ విన్నానుగదా అని.

—వింటే?

—నవ్వొచ్చింది. మీరు కూడా నవ్వ రాదూ? యెందుకే దెబ్బలాట?

—నీమీద డామేజి దావా వెంటనే పడేస్తాను.

—(అవుధాన్లుతో) బావా, యెందుకు మా పంతులుగారిమీద అన్యాయంగా అనుమానం పడతారు? ఆయన నిజంగా మిమ్మల్ని అన్నగార్లా భావించుకుం టున్నారు. గిరీశంగారు పంతులుమీద వ్రాయడానికి కారణాంతరం వున్నది. మీతో చెప్పవలసిన సంగతికాదు గాని, మీ ఉభయులకూ స్నేహం చెడడానికి కర్థంగా వున్నప్పుడు చెప్పక తీరదు. మీగిరీశంగారు నాకు కొన్నాళ్లు యింగ్లీషు చెప్పేవారు. కొద్దిరోజులు నన్ను వుంచుకున్నారు. మా పంతులుగారు ఆయన దగ్గరనుంచి నన్ను తీసుకువెళ్ళిపోయి వచ్చినారనే దుఃఖంచేత లేనిపోని మాటలు కల్పించి "నక్కాగిక్కా" అని వ్రాశారుగాని. ఆ బొల్లిమాటలు నమ్మకండి.

—"నక్కాగిక్కా" వొట్టిదే పోతుందనుకున్నావా మేమిటి? డామేజీ దావా పడ్డతరవాత దాని సంగతి తెలుస్తుంది.

మధు—బావా, మరొకమాట ఆలోచించండీ. వంతులకేం లాభం యేనుగులూ లొటిపిటలూ, గాడిదలూ—(నవ్వును)

రామ—మనిషివికావా యేమిటి? గాడిదెమాట లేపంటూంటేనే?

మధు—పోనియ్యండి. మీకెందుకు కోపం! గాడిదలు లేకపోతే కడంవ్వే ఆయినా యివన్నీ మీయింటిమీదపడి తింటే మాపంతులుగారికి యేంలాభం? చెప్పండీ. ఒకవేళ రాతబుచేరం జరుగుతుంది గనక పోలిశెట్టికి లాభించవచ్చును.

లుబ్ధా—బాగా చెప్పావు—పోలిశెట్టి చేసినపనే!

రామ—చవగ్గా చేస్తాడని ఖర్చువెచ్చం కోమటాడిమీద పెట్టావు. అనుభవించు.

మధు—యిప్పుడు వింబిపోయిందేమి? పెళ్లికూతుర్ని పంపిస్తే పదిరూపాయలు ఖర్చుతో యిక్కడ ముడిపెట్టేస్తాం. మీ రెవరూ రానక్కరని, మీమామగారికేర వుత్తరం వ్రాయండి.

లుబ్ధా—మా ప్రశస్తమైన ఆలోచన చెప్పావు మావఁగారూ, మధురం మాబుద్ధి మంతురాలు.

రామ—అదుగో! "మధురం ' గిధురం' అని మీరు అనకూడదు "మధురవాణి" అనాలి.

లుబ్ధా—పొరపాటు—గాని తీరామోసి వాళ్లు పెళ్ళికూతుర్ని ఒక్కర్తెనీపంపించేస్తే!

మధు—మరేం? మీతీపు దిగదీసిందీ? పెళ్లి చేసుకోండి.

లుబ్ధా—నా ప్రాణంపోతే యీ సంబంధం చేసుకోను. ఆవుత్తరం కొనకూ చదివితే అభావచేష్టలు మీకే బోధపడతాయి

మధు—చదవడం మానేసి యేమిటి ఆలోచిస్తున్నారు?

రామ—గిరీశం గాడిమీద పసువునష్టానికి డామేజీదావా తేకమాన్ను—వాడి మొహం లాగేవుంది వుత్తరం. చదివేదేవిఁటీ.

లుబ్ధా—మావెధవ. నాపరువుమత్రిం యేమైనా వుంచాడనా? అయిన తరవాయి చదవండీ.

రామ—(చదువుతు) తాజాకలం. చిన్నది బహులక్షణంగా వుంటుంది. గాని కొంచం పెయ్యనాసుమమాత్రింకద్దు. అద్దానిని మనవారు వైధవ్యహేతువ అంటురి. యిదివట్టి సూప—సూపర్—స్టి—షన్—అనగా, తెలివితక్కువ నమ్మ

గు. మనవంటి ప్రాజ్ఞులు లెక్కించవలసినది కాదు. వరా—దీనికి వక చిన్న బైరాగీ చికీవున్నది. చిమ్మిటతో పెయ్యి నాకుడు వెండుకలూడబీకి, ఒక పా—, షోషర్—అవగా, గుండ కద్దు; ఆగుండ ప్రామినచో మరల పెయ్యనాకుడు పుట్ట నేరదు. ఈలోగా దైవాత్తూ వైధవ్యంబే సంప్రాప్తించినచో, పదేపదే క్షౌరంబౌనుగావున పెయ్యనాకుడు బాధించ నేరదు. రెండవ నెంబరు వరా—ఒకవేళ వైధవ్యం తటస్థించినా, మావదెనగారు జుత్తు పెంచుకు నేయడల, మీరేం చెయ్యగలరు; నేనేం జెయ్యగలను?''

పు—చాల్చాలు; యీపాటి చాలించండి. గిరీశంగారు యేంతుంటరు?

సు—ఇప్పడైనా వాడి నైజం నీకు బోధపడ్డదా? (చదువును) మాడవవరా—యీకాలంలో స్త్రీ పునర్వివాహం గడబిడలావు గానున్నది. తమకు విశదమే. మీరు స్వర్గంబునకుంబోయి ఇంద్రభోగం బనుభవించుచుండ నామెకు పునర్వివాహము చేసికొన బుద్ధి పొడమ వచ్చును. అదిమాత్రిం నేను ఆపజాలనని స్పష్టముగా తెలియువది. ఏలననిన? వర్ణం మందళించుటకు ఎదట పడితినో, "మీయున్న స్వర్గంబున రంభతో పరమానందంబు నొందుచు నున్నారుకదా. నాగతేమి'' యని యడిగినచో నేమి యుత్తరమీయువాడ?

పు—మరి చాలించండి.

సు—నీయిష్టం వొచ్చినప్పుడు చదివి, నీయిష్టం వొచ్చినప్పుడు మానేస్తానను కున్నావా? (చదువును.)

"స్వవరా—కొదువ అన్ని హంశములూ బహు బాగావున్నవి. తప్పకుండా యీ సంబంధం మీరు చేసుకోవలసిందే. మీఅత్తగారు సాక్షాత్తూ ఆరుంధతివంటి వారు. మనలో మనమాట, ఆమెకు యీసంబంధం యెంతమాత్రిమూ యిష్టము లేదు. పుస్తెకట్టేసమయమందు, మీయింటి నూతులోపడి ప్రాణత్యాగం చేసుకుంటానని, యిరుగు పొరుగమ్మలతో అంటున్నారు, గాని ఫర్వాలేదు. పిరాలుగు గడియలూ, కాళ్ళూ చేతులూ కట్టేదాం. మూడు ముళ్ళూ పడ్డతర వాత నూతులోపడితే పడనియ్యండి. మనసొమ్మేం బోయింది ? పోలీసువాళ్ళ చిక్కులేకుండామాత్రిం, వాళ్ళకేమైనా పారేసి వాళ్ళని కట్టుకోవలసివస్తుంది. యీసంగతులు యావత్తూ మీ మేలుకోరి వ్రాసితిని. యిక్కడవారికి తెలియ రాదు. మరిచిపోయినాను, పిల్లజాతకం అత్యుత్కృష్టంగా వుండట. ఆ బనా యింపకూడా రామ—''

మధు—రామ?

రామ—అది ఆడవాళ్ళు వినవలసిన మాటకాదు.

లుబ్ధా—అది కూడా మీరే బనాయించారంటా డేవిఁటండీ?

రామ—వాడి నోటికి సుద్దీ, బద్ధంవుందీ? డామేజీ పడితేగాని కట్టడు.

లుబ్ధా—కొంచం అయినా నిజం వుండకపోతుందా, అని నాభయం. అత్తగా యిష్టంలేదని పోలిశెట్టికూడా చెప్పాడు. యీసంబంధానికి వెయివేలదణ్ణా నాకొద్దుబాబూ.

మధు—బాగా అన్నారు మీ సంబంధం మాకు యెంతమాత్రింవొద్దని, మీ మావఁగా పేర వ్రాయండి. కాకితం కలం కేనా?

లుబ్ధా—మావాఁ! మరి ముందూ వెనకా ఆలోచించక వెంటనే వుత్తరం రాసి పెట్టండీ. (నిలబడి మధురవాణి చెవిలో రహస్యము మాట్లాడును; మధురవాణి లుబ్ధావధాన్లు చెవిలో మాట్లాడును).

రామ—మొహంమీద మొహం పెట్టి, యేవిఁటా గుసగుసలు?

పైనుంచి పోస్టుజవాను—"లుబ్ధావుధానుగారువ్నారండీ. వుత్తరంవొచ్చింది"

(మధురవాణి పైకివెళ్లి వుత్తరము తెచ్చి లుబ్ధావధాన్లుచేతికి యిచ్చును.

లుబ్ధావధాన్లు రామప్పంతులు చేతికి యిచ్చును)

లుబ్ధా—సులోచనాలు తేలేదు. మీరే చదవండి.

రామ—(తనలో చదువుతూ) మరేవీఁ! చిక్కే వొదిలిపోయింది. మీ మావఁగా దగ్గిర్నించి.

లుబ్ధా—యేవఁని? యేనుగులూ, లొటిపిటలూ తెనంటాడా యేవిఁటండి?

రామ—మీ సంబంధవేఁ అక్కర్లేదట.

లుబ్ధా—యేవిఁటీ? యెంచేతనో? వాడికా అక్కర్లేదు? నాకా అక్కర్లేదు! తన పరువుకి నేంతగాను కానో?

మధు—నిమిషంకిందట పెళ్లి వొద్దన్నారే? యిప్పుడు పెళ్ళి తప్పిపోయిందనికోపవాఁ!

లుబ్ధా—యింకా యేం కూస్తాడో చెప్పండీ.

రామ—మీరు పీసిరిగొట్లని యెవళ్లో చెప్పారట.

—నేనా పీసిరి గొట్టుని? వొక్కపాటున పద్దెనిమిది వొందలు యే పీసిరి గొట్టు పోస్తాడు! యింత సొమ్ము యెన్నడైనా, ఒక్కసారి, అగ్నిహోత్రావుధాన్లు కళ్ళతో చూశాడూ? సంసారం పొందికగా చేసుకుంటే పీసిరి గొట్టా? వాడిసొమ్ము వాడికెత్తి కొట్టినతరవాత, నేనెలాంటివాణ్ణి అయితే వాడికేం కావాలి?

—యెలాంటివాళ్ళేం? బంగారంలావున్నారు?

—మీరు ముసలివాళ్ళనీ, మీకు క్షయరోగం వుందనీ కూడా, యెవరో చెప్పారట.

—నేను ముసలివాణ్ణా వీడి సిగతరగా! యాభైయేళ్ళకే ముసలిటండీ? కొంచం దగ్గు వుండడవేఁ కానట్టుంది (దగ్గును) నిలివెడు ధనంపోసి పిల్లని కొనుక్కున్న తరవాత, మరిదాని ఘోషా, నా ఘోషా వాడి కెందుకయ్యా? డబ్బుచ్చుకున్న తరవాత చచ్చిన శవానికైనా కట్టకతీరదు. మాటాడేం?

—అవును; నిజవేఁ. మీరు ముసలివాళ్ళైతేమాత్రం?

—అదుగో. 'ఐతేమాత్రం' అంటారేవిఁటి? నువ్వే పెట్టావు కాబోలు యీ పెంటంతాను.

—అన్ని పెంటలు పెట్టడానికీ, మీ తమ్ముడు గిరీశం అక్కడే వున్నాడుకదూ!

—వీడు, అక్కడెలా పోగయినాడయ్యా నాకు శనిలాగ?

—ఏమి! యీ మొగవారి చిత్రం! యింతసేపూ పెళ్ళి వొద్దని వగిస్తిరి; యిప్పుడు పెళ్ళి తేలిపోయిందని వగుస్తున్నారు. నిజంగా మీకు పెళ్ళాడాలని వుందండీ?

—వుంటే వుంది, లేకపోతే లేదు. గాని యీ దుర్భాషలు నేను పడి వూరుకుంటానా?

—మరేం జేస్తారు?

—యేంజేస్తారా? డామేజికి దావా తెస్తారు.

—దావావొద్దు, నీ పుణ్యం వుంటుంది. వూరుకో బాబూ.

—కాకపోతే, యింతకన్న చవకైనదీ, సాంప్రదాయవైనదీ, సంబంధం కుదిర్చి, చేసుకున్నావఁంటే అగ్నిహోత్రావుధాన్లుని చెప్పుచ్చుకు కొట్టినట్టు వుంటుంది.

—చవగ్గా కుదరడవేఁలాగ?

—నామాటవిని పెళ్ళిమానేసి వూరుకోండి.

లుభ్ధా—యేం? ముసలివాణ్ణని నీకూ తోచిందా? యేమిటి?
మధు—మీరా ముసలివాళ్ళు? యువరా అన్నవారు?
లుభ్ధా—నీకున్న బుద్ధి ఆ అగ్నిహోత్రావుధాన్లకి వుంటే బాగుండును.
మధు—ఓ పన్ను కదిలిందా? కన్నుకు దృష్టి తగ్గిందా? చూడండీ మీ దండలు కప్పెచ్చులు తీసినట్టు యలా వున్నాయో?

రామ—(తనదండలు చూసుకొని) మావఁ పెరట్లో గొప్ప తవ్వడంనుంచి దండలు మోటుగా వున్నాయి; గాని నాదండలు సన్నవైఁనా ఉక్కు ఖడ్డీలు.
మధు—(తనచీరకొంగుతో లుభ్ధావధాన్లు ఛాతీకొలిచి) యెతంఛాతీ!
రామ—యేమిటీ వాళకం?
మధు—వుత్తరం, మీలో మీరు చదువుకుంటారేం? పైకి చదువండి.
రామ—నువ్వు నన్ను ఆజ్ఞాపించే పాటిదానవా? మేం చదువుకుంటాం. యివి ఆడవాళ్లు వినవలసినమాటలు కావు. నువ్వు ఆవతలకి వెళ్లు.

మధు—నేను కదలను.
రామ—అమాంతంగా యెత్తుకెళ్ళి వెనకింట్లోకు దేస్తాను.
మధు—(కుర్చీ వెనకను నిలబడి లుభ్ధావధాన్లు దండలు చేతులతో గట్టిగా పట్టుకుని) మార్కండేయులు శివుణ్ణి చుట్టుకున్నట్లు, బావగార్ని చుట్టుకుంటాను. యెలా లాక్కువెళతారో చూస్తాను.

లుభ్ధా—(తనలో) యేమి మృదువు చేతులు! తల, తల దగ్గిర చేరిస్తే, యేమి ఘుమ ఘుమా! (పైకి) "బాలాదపి సుభాషితం" అన్నాడు మావఁగారూ - మధురవాణ్ణి వుణ్ణియ్యండి. మంచి బుద్ధిమంతురాలు. నిజం కనిపెడుతుంది.
రామ—అయితే మరివిను (చదువును) "మీకొమార్తె ప్రవర్తన బాగావుండక పోవడంచాత మిమ్మల్ని వెలేశారని లోకంలో వార్త గట్టిగావున్నది"
లుభ్ధా—(కొంతతడవు పూరుకుని) నువ్వే నాకొంపతీశావు.
మధు—పంతులేనా?
లుభ్ధా—ఓహార్చనవలసిన వనేవుంది?
మధు—(కొంతతడవు పూరుకొని) నేను మీ యింటికి వెళ్లిపో యొస్తాను. రండి. వెళ్లీగిళ్లీ మానెయ్యండి. మీకు పెళ్లాంకన్న యెక్కువగా సంరక్షణ చేస్తాను.

—ఆనందం కనపరుస్తూ) బీదవాణ్ణి నేను డబ్బివ్వలేనే? నీలాంటి విలవైన వస్తు మ పంతులుగారే భరించాలి.

—నాకు డబ్బక్కర్లేదు. అండే పెడతారా?

—ఆహా! అందుకులోపవాఁ!

—ఐతే వచ్చండి. మరి యీ పంతులుగారిమాయ మాటలు వినక వెళ్ళి, మ నేసే, సుఖంగా యింట్లో కూచుందురు గాని.

—(మధురవాణివైపు తీక్షణముగా చూసి) నువ్వు భోజనం చెయ్యలేదన్న మాట జ్ఞాపకంవుందా? వెళ్ళు.

—మీచర్య చూస్తేనే కడుపునిండుతుంది (ఛట్టుమని యింటిలోనికి పోవును.)

—యీ మధురవాణి. విన్నారా! మావాఁ! వేశ్య అయినా! చాలా తెలిసిన మనిషి. మన సంసార్లకి దానికివున్న బుద్ధివుంటే బతికిపోదుం

—అవునును. బుద్ధిమంతురాలే, గాని వొళ్ళెరగని కోపం. యేమైనా వొక్ష అనుమానం పుట్టితే. తమాషై కానదు. చూశారా మావాఁ, మీలాంటి శిష్టులు పానివాళ్ళ శరీరం తాకకూడదు. అది చిన్నతనంచేత మొఖంమీద మొఖం పెడితే, "పిల్లా, యెడంగా నిలబడి మాట్లాడు" అని చప్పాలి. ఒక్కటే చ్చింది దీనికి దుర్గుణం పరాయివాళ్ళతో మాట్లాడితేగాని దానికితోచదు. పట్టణవాసంలో వుండడంనించి ఆదురలవాటు అబ్బింది.

—చిన్నతనంగదా! మధురవాణి నాపిల్లలాంటిది. మట్టుగుంటే అదోతప్పుగా భావించకండి.

—నీ సామ్మేంబోయింది! అదికాదు. చూశారా మావాఁ. వుంచుకున్న ముండా కొడుకు యెదట మరో మొగాణ్ణి పట్టుకుని "వీడి దండలు కమ్మెచ్చులు తీసినట్టు న్నాయి. వీడి ఛాతీ భారీగావుంది"—అని చెవిలో నోరుపెట్టి గుసగుసలాడు కుంటే అగ్గెత్తుకొస్తుందారాదా?

—పొరపాటు. లెంపలు వాయించుకుంటాను. క్షమించండి.

—మీ లెంపలు వాయించుకుంటే కార్యంలేదు. దాని లెంపలు వాయించాలి. మీమీద దానికి కొంచం యిష్టం వున్నట్టుంది. గట్టిగా బుద్ధిచెప్పండి.

—నామీద యిష్టమేమిటి మావాఁ! యెక్కడైనా కద్దా?

రామ—మీయింటికి వెళ్ళిపోయెస్తానంటూందే ? మరి తీసికెళ్ళు.

(పైమాటలాడుచుండగా మధురవాణి పట్టుచీరకట్టుకుని ప్రవేశించి.)

మధు—అలాగే తీసికెళ్తారు మీకు భారనైతేను. ఆ మహానుభావుడికి చాకిరీ చేస్తే పరంఐనా వుంటుంది.

లుబ్ధా—మామగారు హాస్యానికంటున్నారుగాని, నిన్నొదుల్తారా ? నేతగను, కిగను.

రామ—అలాగడ్డి పెట్టండి !

మధు—ఆయన హాస్యానికి అంటున్నా, నేను నిజానికే అంటున్నాను. గడ్డి గాడిదలు తింటాయి ; మనుష్యులు తినరు.

రామ—అదుగో మళ్ళీ గాడిదలంటుంది ! (మధురవాణి నవ్వుదాచుటకు ముఖం తిప్పుకొని, లో గుమ్మముదాటి, విరగబడినవ్వును.)

లుబ్ధా—మధురవాణికి మీదగ్గిర భయంభక్తీకూడాకద్దు.

రామ—వుంది. కోపవొస్తే గడ్డి పరకంతఖాతరీ చెయ్యదు మరాయిమనిషి వున్నాడని అయినా కానదు.

లుబ్ధా—పెళ్ళిప్రయత్నం యిక మానుకోవడవే ఉత్తమం అని తోస్తుంది యేవిఁటి తమశలవు ?

రామ—నాశలవేం యెడిసింది ! పెళ్ళి చేసుకోవొద్దని మధురవాణి శలవైంది దాని బుద్ధికి ఆనందించి అలా నడుచుకుంటున్నారు. స్త్రీబుద్ధిః ప్రళయాంతకః అని చెప్పనే చెప్పాను.

లుబ్ధా—మీరు ఆప్తులనేగదా మీ సలహాకి వొచ్చాను. మధురవాణి చెప్పింవగా పెళ్ళివద్దంటున్నాను. తప్పిన పెళ్ళి తప్పిపోయింది ఖర్చులుకూడొచ్చాయి గదా అని సంతోషిస్తున్నాను.

రామ—రెడ్డొచ్చాడు మొదలాడన్నాడట. సాధకబాధకాలు యెన్ని పర్యాయములు చెప్పినా అవి అన్నీ పూర్వపక్షంఐ, ముక్తాయింపు మళ్ళీ డబ్బు ఖర్చుమీదికి వొస్తూవుంటుంది. పెళ్ళి చేసుకుని కడుపు ఫలిస్తే మీ యిల్లు పదియిళ్ళౌతుంది. పెళ్ళి చేసుకోక గుటుక్కుమంటే, యీ కష్టపడి ఆర్జించిన డబ్బంతా యెవడి పాలుకాను ?

శా—అదుగో యేమో యెక్కువ ధనం వున్నట్టు శెలవిస్తారు నాకేవుంది?

గు—వున్నంతవుంది. పరానికి యిన్ని నీళ్ళచుక్కలు వొదిలేవాడుండాలా?

శా—అలా అయితే, తమ రెందుకు పెళ్ళి చేసుకున్నారు కారూ?

గు—నేను పితార్జితం అంతా కరరావుడు చుట్టేశాను. యిక పరానికా? నేను శాస్త్రయుణ్ణి; యోగ సాధనం చేస్తాను. నాకు మరికర్మతో పనిలేదు. లోకంకోసం తద్దినాలు పెడుతున్నాను. అయితే సానిదాన్ని యెందుకు వుంచుకున్నావయ్యా! అని అడగగలరు.

“కామిగాక మోక్షకామికాడు'' అన్నాడు. యిక మీసంగతో? మీరు నిద్దరపోతూండగా చూసి యెప్పుడో ఒకనాడు మీనాక్షి ఆపాతు యెక్కడిదీసి రంకుమొగుణ్ణి తీసుకు పారిపోతుంది. ఆపైని దరిద్రదేవత మిమ్మల్ని పెళ్లాడుతుంది.

శా—అయితే యేం జెయమంటారు?

గు—మీరు పునః ప్రయత్నంచేసి పెళ్ళాడండి. పెళ్ళాంభయంచేత మీనాక్షి ఆటకట్టవుతుంది మీనాక్షి భయంచేత, మీ పెళ్ళాం కట్టుగావుంటుంది. అవునంటారా? కాదంటారా?

శా—నిజమైనమాటే.

గు—నిజమైతేనేం? మీకు బహుపరాకు. సాధకబాధకాలు అడుగడుక్కీ జ్ఞాపకం చేస్తూండాలి. మీకు జాతకరీత్యా, వివాహం జరక్కపోతే, మారకం వుందన్నమాట పరాకుపడ్డారా?

శా—పరాకులేదు. గాని యిన్నాళ్లాయి కొట్టుకుంటూంటే, యీ నాటికి పద్ధెనిమిది వొందలకి, వక సంబంధంకుదిరి, తీరా క్రియకాలానికి తేలిపోయిందిగదా? యిప్పుడు చవగ్గా మనకి సంబంధం కుదురుతుందా? కుదరదు. కుదరదు.

గు—నిన్న వొచ్చాడయ్యా, గుంటూరునించి వక బ్రాహ్మడూ. వున్నాడో వెళ్ళిపోయినాడో?

శా—సంబంధానికా?

గు—అవును. యెంతబుద్ధి తక్కువపనిచేశాను! నాయెరికని యెక్కడైనా సంబంధంవుందా అని అతగాడు అడిగితే, లేదని చెప్పాను. యీ సంబంధం మీకు తప్పిపోతుందని నేనేం కలగన్నానా యేమిటి? అతడు జటాంత స్వాధ్యాయిన్నీ

మంచి సాంప్రదాయమైన కుటుంబీకుడున్నూ. ఆ సంబంధంచేస్తే అగ్నిహో
త్రావధాన్లుని చెప్పుచ్చుకు కొట్టినట్టౌను.

లుబ్ధా—బేరం యేం చెప్పాడు?

రామ—బేరం మహాచవకయ్యా. అదే విచారిస్తున్నాను. అతగాడు గుంటూరు నుంచి వస్తున్నాడు. అక్కడివాళ్ళకి, మనదేశపు కొంపలమ్మకునే బేరాలతావు యింకా తెలియలేదు. అందుచేత నంబిపిల్లిలో పన్నెండు వందలకి సంబంధం కుదుర్చుకున్నాడు. వ్యవధిగాగాని పెళ్ళికొడుకువారు రూపాయిలు యివ్వరే మన్నారట, ఆబ్రాహ్మడికి రుణాలున్నాయి వాయిదానాటికి రూపాయిలు చెల్లకపోతే దావా పడిపోతుందని యెక్కడయినా పిల్లని అంటగట్టడానికి వ్యాపకంచేస్తున్నాడు. ఒకటి రెండు స్థలాల్లో వెయ్యేసి రూపాయలకి బేరం వొచ్చిందట. పన్నెండు వందలకిగాని యివ్వనని చెప్పాడు.

లుబ్ధా—మరొక్కవొంద వేదాంమనం?

రామ—అతగాడు వుంటేనా, నూరువెయడానికీ యాభైవెయడానికీనీ?

లుబ్ధా—కనుక్కుందురూ మీపుణ్యంవుంటుంది. యెక్కడబసో?

రామ—దాని సిగగోసినడబ్బు, డబ్బుమాట అలా వుణ్ణీండిగాని. ఆపిల్ల యేమియేళ్ళు! యేమి ఐశ్వర్యలక్షణాలు! ధనరేఖ జెట్టీపాతులావుంది. సంతానరేఖలు స్ఫుటగావున్నాయి. పిల్ల దివ్యసుందర విగ్రహం.

(మధురవాణి ప్రవేశించును.)

మధు—గ్రహవేఁవిఁటి?

రామ—గ్రహవేఁవిఁటా? అవుధాన్లుగారి గ్రహస్థితి చూస్తున్నాం. జాతకరీత్యా యీ సంవత్సరంలో వివాహం కాకతప్పదు.

మధు—మీమాట నేను నమ్మను. (అవుధాన్లు దగ్గిరకువెళ్ళి ముఖంయెదట ముఖం వుంచి) ఆమాటనిజమా?

లుబ్ధా—అంతా నిజం అంటున్నారు.

మధు—సిద్ధాంతిగారేవఁన్నారు?

లుబ్ధా—జాతకం చూసిన సిద్ధాంతల్లా ఆమాటే అంటున్నాడు. యిదివరకల్లా నా జాతకం మాగట్టి దాఖలా యిస్తూంది. ఒక్కటీ తప్పిపోలేదు.

—అయితే మీ ప్రార్థనం. ఆపెద్యు నాకుడు పిల్లనిమాత్రం యీ పంతులు యిమాటలువిని చేసుకోకండి.

—ఖోంచేస్తూ వొచ్చావు యేం పుట్టి మునిగిపోయిందని ?

—వెండిగిన్నె కోసం వొచ్చాను.

—తీసుకెళ్ళు. (మధురవాణి నిష్క్రమించును)

—పెళ్లి చేసుకోవొద్దంటుందేవఁండీ ?

—నిష్ఠురంగామాట్లాడండి. సానిది యక్కడైనా పెళ్లి చేసుకోమంటుందయ్యా? ...ద కన్నే సింది.

—నామీద కన్నెయ్యడవేఁవిటి మావఁగారూ ! యవరు విన్నా నవ్వుతారు.

—మీరుగానీ పెళ్లి చేసుకోవడం మానేస్తే, మీయింట్లోవొచ్చి బయితా ...స్తుంది. అది ఘంటాపధంగా చెబుతూవుంటే చెవుల్లేవా యేవిఁటి మీకు ? ...నితో మీరేవఁయినా వెఱ్ఱి వెఱ్ఱి చాష్టలు చేశారంటే మీకూనాకూ పడుతుంది ...స్తరింపి. జాగ్రత్తెరిగి మసులుకోండి.

—నేనా ? నేనా ? యేవిఁటి అలా కలవిస్తున్నారు. మావాఁ! నాపిల్ల ఒకటీ ...వొకటినా ? ఆ గుంటూరు శాస్త్రుల్లు వున్నాడో వెళ్లాడో, ఒక్కమాటు ...క్కో శేరో?

—యదటింట్లోనే బస చేశాడు కనుక్కుంటానుగాని, మధురవాణి భోజనం ...పాటి అయిందో చూసి మరీ వెళతాను (లోపలకి వెళ్లివచ్చి పైకి వెళ్లును.)

—మధురవాణ్ణి తీసుకుపోతా ననుకుంటున్నాడు యీపంతులు అహా ! హా ! (...దుముపీల్చి) మనిషికీ మనిషికీ తారతమ్యం సాందేకని పెట్టాలి. పంతుల్లాగ ...సంవుంచుకుని. రంగువేసుకుంటే, తిరిగీ యావ్వనం వొస్తుంది. యీ చనక ...బంధం కుదిరినట్టాయనా యేమి అదృష్టవంతుణ్ణి!

(రామప్పంతులు స్త్రీవేషముతోనున్న శిష్యుణ్ణి రెక్కపట్టుకు
తీసుకువచ్చును. అరచెయ్యి చూపించి)

—మావాఁ! యేం ఖోదాకొట్టు కొచ్చిందోయి నీకు! యిదిగో ధనరేఖ. చెయ్యి ...పట్టి రెండోపక్కకి యెగబాకిరినట్టుందోయి. యివిగో సంతానరేఖలు. ...దగ్గిర చూశావా పూర్వరేఖలు?

లుబ్ధా—అట్టే పరిశీలన అక్కర్లేదు చాల్లెండి.

(పై ప్రసంగము జరుగుచుండగా మధురవాణి వెనకపాటున వచ్చి పంతులు నెత్తిమీద చెంబులో నీళ్ళు దిమ్మరించును.)

రామ—యేమిటీ చేష్టా!

మధు—మంగళస్నానాలు (శిష్యుడి గెడ్డం చేత నొక్కి) నీకు సిగ్గులేదేలంజా?

(మధురవాణి నిష్క్రమించును.)

రామ—కోపవొస్తే మరి వొళ్లెరగదు యిక కొరకంచో చీపురుకట్టో పట్టుకు వెంట దరువుతుంది. యీ పిల్లని తీసుకు పారిపోదాంరండి.

(శిష్యుడి చెయ్యి పట్టుకుని పైకి నడుచును.)

లుబ్ధా—నడుస్తుంది. రెక్క వొదిలెయ్యండి.

రామ—(రెక్కవదిలి) ఓహో! కాబోయే యిల్లాలనా?

ముగ్గురూ నిష్క్రమించి, వీధిలో ప్రవేశింతురు.)

లుబ్ధా—యీ పిల్లని చేసుకోమని మీ అభిప్రాయవేనా?

రామ—నా అభిప్రాయంతో యేంకార్యం? మీ మనస్సమాధానం చేసుకోండి. పిల్ల యేపుగావుందా? రూపురేఖావిలాసాలు బాగున్నాయా? అది చూసుకోండి.

లుబ్ధా—సంసార్లకి సౌందర్యంతో యేంపని?

(సిద్ధాంతి తొందరగా యెదురుగుండా వస్తూ ప్రవేశించి.)

సిద్ధ—(లుబ్ధావధాన్లతో) యెవరు మావా యీపిల్ల? (లుబ్ధావధాన్లు జవాబుచెప్పక, రామప్పంతులువైపు బుజ్జతిప్పి సౌజ్ఞచేయును)

రామ—మావాళ్లే.

సిద్ధా—(నిదానించి) భాగ్య లక్షణాలేంబట్టాయీ యీ పిల్లకీ!

రామ—యేవిటండీ?

సిద్ధా—విశాలమైన నేత్రాలూ, ఆకర్ణాలు, అవుంగరాలజుత్తూ, విన్నారా! యేదమ్మా చెయ్యి (చెయ్యిచూసి) యే అదృష్టవంతుడు యీ పిల్లని పెళ్ళాడాడో గాని—

రామ—యింకా పెళ్ళికాలేదండి.

రా—మీరు పెళ్లి చేసుకోవాలని వుంటే' యింతకన్న అయిదోతనం, అయిశ్వర్యం, సంపదాగల పిల్ల దొరకదు. యిది సౌభాగ్యరేఖ, యిది ధనరేఖ, పంతులూ భోషాణపెట్టెలు వెంటనే పురమాయించండి. యేది తల్లీ చెయితిప్పు సంతానం ఒకటి, రెండు, మూడు, (చెయ్యివొదిలి లుబ్ధావధాన్లతో) యెదీ మావాం చెక్కిసను. (పొడుంపీల్చి) పొలిశెట్టి కూతురు పరిసవం అవుతూంది. జాతకం రాయాలి. మళ్ళీ దర్శనం చూస్తాను.

లు—వకట—మాట. (సిద్ధాంతితో రహస్యంగా మాట్లాడును. సిద్ధాంతి చంకలో పంచాంగంతీసి, చూచును. మరి నాలుగుమాటలాడి పంచాంగం చంకని పెట్టుకొని తొందరగా వెళ్ళిపోవును.)

రా—యేవంటాడు?

లు—నేనే యీపిల్లని పెళ్ళిచేసుకుంటాననుకుంటున్నాడు. రేపటి త్రయోదశీనాడు పెళ్ళికి మంచిది అన్నాడు.

రా—ఆరోజు వివాహముహూర్తం లేదే?

లు—శుభస్య శీఘ్రం అన్నాడు. ద్వితీయానికి అంతముహూర్తం చూడవలసిన అవసరంలేదు. తిథీ నక్షత్రం బాగుంటే చాలును. యిదుగో మీమావంగారు వొస్తున్నారు.

రా—పేరవాండి చూడండి.

(కరటక శాస్త్రుల్లు ప్రవేశించును.)

క—గంగాజలం సిరస్సున పోసుకున్నారా యేవింటి పంతులుగారూ? మాపిల్లని యెక్కడికి తీసికెళ్తున్నారు?

లు—(కరటక శాస్త్రితో) మాట.

(ఇద్దరూ రహస్యముగా మాటలాడుదురు.)

క—(లుబ్ధావధాన్లును యెడంగా తీసికెళ్ళి) పద్నాలుగువొందలు తెమ్మంటున్నాడు. యెవళ్లో పదమూడు యిస్తావంన్నారట.

లు—యిదా మీరు నాకు చేసిన సాయం? పోనియ్యండి, ఆపన్నొయిందుకైనా తగ పెట్టండి.

క—ఉపకారానికి పోతే నాదానిష్టూరం? కోరి అడిగితే కొమ్మెక్కుతారు, యేం చేతును. (కరటకశాస్త్రితో రహస్యంగా మాట్లాడి, తిరిగి వచ్చి లుబ్ధావధాన్లతో)

మావాఁ కృత్యాద్యవస్థమీద వొప్పించాను పిల్లదానికి సరుకు పెడితేగాని వల్లేదని భీష్మించుకుని కూచున్నాడు. యేవఁంటావు?

లుబ్ధా—అది నావల్ల కాదు.

రామ—పూరుకోవయ్యా, ఆలాగే అంమా, మధురవాణి తాలూకు కంటె తెచ్చి ఆవేళ పెట్టి, తరవాత తీసుకుపోతాను.

లుబ్ధా—అదేదో మీరే చూసుకోండి.

రామా—నేనే చూసుకుంటాను. ఖర్చు వెచ్చాలే వోమనవేఁ చేసుకుని, కొంచం లో డబడబలాడించేదాం. పోలిశెట్టిని సప్లయికి పెట్టకండి. పెద్దిపాలెం వెళ్ళి లౌక్యుల్ని యెవరు పిలవడం?

లుబ్ధా—మరి నా కెవరున్నారు. మీరే పిలవాలి.

రామ—లౌక్యుల్ని పిలవడానికి వెళ్ళినప్పుడు దుస్తుడాబుగా వుండాలి. దగలా, గీగలా తీయించి యెండవేయిస్తాను.

(నిష్క్రమింతురు)

---

## ౨-వ స్థలము. లుబ్ధావధాన్లుయిల్లు.

---

లుబ్ధా—అవును. మీరు చెప్పినమాట బాగుంది దివ్యస్థలాల్లో ఏకరాత్రి వివాహ చారంవుంది.

కరట—పెద్దపెద్ద ఉద్యోగస్థులుకూడా, యిప్పటిరోజులలో, వివాహాలు ఆలాగే చేస్తున్నారు. కోదండరామస్వామివారు స్వయంవ్యక్తవూఁ, హనుమత్ప్రతిష్ఠా, అయినప్పుడు, దివ్యస్థలంకాదని యెవడనగలడు?

లుబ్ధా—ఆమాట సత్యవేఁగాని, యిది దివ్యస్థలంగా ఆలోచించి ఇదివరకు యెవళ్లూ యిక్కడ, ఏకరాత్రివివాహం చేసివుండలేదు మావఁగారూ. మనం చేస్తే యేవఁం టారో?

కరట—దివ్యస్థలం అయినతరవాత యెవడేవఁంటే మనకేం పోయింది?

లుబ్ధా—అయితే పంతులుతో చెబుదాం.

కట—యేవిఁటి మీసత్యకాలం మావఁగారూ! యీపెళ్లిలో యేదోవొక వొంటు శెట్టి, నాలుగుడబ్బులు ఆర్జించు కుందావఁని చూస్తూవున్న పంతులూ, పోలిశెట్టీ, ఏకాశి) వివాహానికి ఆమోదిస్తారా? పుస్తెకట్టిందాకా ఆమాట వాళ్ళతో చెప్పకండి.

—పంతులుతో చెప్పకపోతే యేంజట్టీ పెడతాడో?

కట—యేవిఁటి విాభయం! అతగాడు మీకు యజమానా? జట్టీ, గిట్టీ పెడితే, పెణ కూడ గొడతాను

—మీరు కాదుగాని, సిద్ధాంతిగారి చేతిలో రెండు రూపాయలు ఐడేస్తే, అపూచీ అంతా ఆయన నెత్తిమీద వేసుకుంటాడు. ఆయన యెదట పంతులు కోరు యెగియదు.

కట—పావఁటిదానికి విరుగుడుంది. పంతులికుండదా?

(నిష్క్రమింతురు.)

---

3-వ స్థలము లుబ్ధావధాన్లు యింటివెరడు.

[కరటకశాస్త్రుల్లు, మీనాక్షి ప్రవేశింతురు.]

---

మీనాక్షి—మీపిల్లని నాకడుపులో పెట్టుకోనా తాతయ్యా?

కరట—కడుపుగదా అమ్మా? అంచేత పదేపదే చెబుతున్నాను. దానికి తల్లివైనా నువ్వే, తండ్రివైనా నువ్వే. (దుఃఖమును అభినయించును.)

మీనాక్షి—విచారించకండి, తాతయ్యా, దానికి యేలోపం రానియ్యను.

కరట—అమ్మా, నీకిమ్మని మా అమ్మిచేతికి ఓ పులిమొహం ఉంగరు యిచ్చాను. పుచ్చుకో.

మీనాక్షి—యిస్తుంది. తొందరేవిఁటి, తాతయ్యా? దాందగ్గిరవుంటేనేం? నాదగ్గిర వుంటేనేం?

(సిద్ధాంతి ప్రవేశించును.)

సిద్ధాంతి—యెంత సేవూ కూరలుతరగడం, భోజనాల సరంజాం జాగ్రత చెయ్యడంసందడే గాని, లగ్నానికి కావలసిన సరంజాం జాగ్రత చెయ్యడపు తొందరేవీఁ కానరాదు. సోమయ్యాజులు మునిగి పోతులాగ పడుకున్నాడు.

మీనా—నాలుగ్గడియల పొద్దుకిలగ్గవైతే. యిప్పట్నించీ సరంజాం తొందరేవిటి అచ్చన్న మావా?

సిద్ధాంతి—చదవేస్తేవున్న మతీ పోయిందన్నాట్ట నాలుగ్గడియల రాత్రిందవగా శుభముహూర్తం.

మీనా—మానాన్న యెప్పుడూ యిదేమన్చ. యేమాటా నిజం యిట్లో సంగతులతో చెప్పకపోతే యెలా యేమస్తారు? నాన్నా? నాన్నా!

(లుబ్ధావధాన్లు ప్రవేశించును.)

లుబ్ధా—యెందుకాగావు కేకలు?

మీనా—నాలుఘ్ఘడియల రాత్రిందవనగానట మూర్తం అచ్చన్న మావ అంటున్నారు.

లుబ్ధా—యిదేవిటండోయి, నాలుగ్గడియలపొద్దు కనుక్కున్నానే ముహూర్తం?

సిద్ధాంతి—యిప్పైమూడు విఘడియలపొద్దు కనుకున్నారుకారో? మీ వెఱ్ఱి చాలింది చప్పనకానియ్యండి మంగళాస్నానాలు ఊళ్ళో బ్రాహ్మలినందర్నీ పిలిచేశాను

లుబ్ధా—చంపారే! చలి!—అయితే రావప్పంతులుకూడా నాలుఘ్ఘడియలపొద్దుకి అనుకున్నాడే ముహూర్తం? అయనే వొచ్చి, పెద్దిపాలెంలో లౌక్యుల్ని నాలుగ్గడియలపొద్దుకి రమ్మని పిలుస్తారేమో?

సిద్ధాంతి—శతాంధాః కూపం ప్రవిశంతి. అమ్మా. పిల్లకి స్నానం చేయించూ,

మీనా—యిదుగో, నిమిషంలో చేయిస్తాను.

సిద్ధాంతి—ఆడవాళ్ళునయం. పెళ్లి పందిట్లో సరంజాం చూసుకుంటాను

లుబ్ధా—పంతులులేకుండా లగ్నం అయితే.

సిద్ధాంతి—పంతులుకా, మీకాపెళ్లి? జంకవోడక స్నానంకానీండి.

(నిష్క్రమింతురు.)

---

౯-వ స్థలము లుబ్ధావధాన్లు యింటి అరుగుమీద పసుపుబట్టలు కట్టుకుని, లుబ్ధావధాన్లు స్త్రీవేషముతో శిష్యుడు, కొందరు బాహ్మలు కూర్చుని వుందురు.

---

రామప్పంతులు, తాహాసుఫోర్, కానిస్టేబు, చాకర్లతో, ప్రవేశించి, అరుగు మీద వతికలబడి.

రా—అబ్బ! ఎంతశ్రమ పడ్డానండి (నౌఖర్లతో) తాహాసుర్పా వూరుకోమను. బోయీలావాళ్ళూ, బాజానాళ్ళోవాళ్ళూ, వూరుచేరేటప్పటికి కోలాహలంలావు చేస్తారు. కాళ్ళుపీక్కు వచ్చాయయ్యా, వెధవ పెద్దిపాలెం యంతదూరవుందీ! (తిరిగిచూసి) యిదేవిటి పసుబ్బట్టలూ, పెళ్ళికూతురుతో కతికికూచోడవూను? పెళ్ళికొడుకం చేయించుకున్నానటయ్యా? ముదిమికి ముచ్చట్లులావు.

గొ—లగ్నానికి మీరు లేకపోయినారుగదా! అని మహా విచారపడుతున్నాను.

రా—(ఉలికిపడి) యేవిటి! లగ్న వేవిటి?

రామగవధాన్లు—లగ్నంవేళకి తమరు లేకపోయినారుగదా అని, మేం యావ న్మందిమీ విచారించాం. తమరు యేదో వ్యవహారాటంకంచేత వేళకి రాజాలి నారుకా రనుకున్నాం. తాము లేకపోవడంచేత సభ సొగసే పోయింది.

"యోగిలేనిశాలివడి । అయ్యయ్యో పట్టిశోత్ర, అది యెట్లున్నన్ । వయ్యారి''—

రా—అట్టేపేలకు. ముహూర్తానికి ముందే పుస్తె యెలా ముడెట్టావయ్యా?

గొ—సిద్ధాంతి గారు నక్షత్రాలు చూసి ఘడియలుగట్టి సరిగ్గాముహూర్తంవేళ కేపుస్తె కట్టించారండి.

రా—నాలుగ్ఘడియల పొద్దుకాలేదే?

గొ—నాలుగుఘడియల రాత్రుందనగాకదండీ, శుభముహూర్తం?

రా—సిద్ధాంతి, ముహూర్తం తెల్లవారి నాలుగుఘడియలకని చెప్పాడే?

గొ—పంచాంగం చూడడానికి యవడికిశక్యం బాబూ? తెల్లవారగట్ల నాలుగు ఘడియలకని, సిద్ధాంతిగారు ... తాము పరాగ్గా వినివుందురు,

రామ—పంచాంగానికేం యీ వెధవ పల్లిటూర్లో? సిద్ధాంతి ఆడింది ఆటా, పాడింది పాటా. యంతద్రోహం చేశాడయ్యా సిద్ధాంతి!

పూజారి—సిద్ధాంతి యంతో నొచ్చుకున్నాడు, తమరు రాలేదని బాబూ. యేమి ఆటకంచాత వుండిపోయినారో? అని అవుధాన్లుగారు తల్లడిల్లారు. శా మర్నాఁ విన్నతరవాతగదా, ఆయనమనస్సు స్వస్థపడ్డది.

లుబ్ధా—నిజం మావఁగారు.

పూజారి—యిక మధురవాణో? అంటే, ఆపండిట్లో నిశ్చేష్టురాలై పుత్తడిబొమ్మలాగ నిలుచుంది గాని బ్రాహ్మణ్యం యావన్మందీ గెడ్డంపట్టుకు యెంత బతిమాలుకున్నా, పాడింది కాదు.

కొండిభొట్లు—అంతసేపూ హెడ్డు కనిష్టీబుగారితో మాట్లాడుతూ నిల్చుందిగాని, యేం? యింతమంది ప్రార్థించినప్పుడు, ఓకూనురాగం తియ్యకూడదో?

మరివక బ్రాహ్మడు—ఓరి కుంకాయా, పంతులుగారు సభలో లేందీయలా పాడు తుందిరా?

పూజా—హెడ్డుగారితో యేవిఁటి మాట్లాడుతూందనుకున్నావు? పంతులుగారు సకుకూజప్పరా, పెట్టుకు వెళ్ళేరు, యేంప్రమాదం వొచ్చిందో! ముహూర్తం వేళ! రాలేదు. జవాన్లనిపంపి వెతికించండి అని బతిమాలుకుంటూందిరా.

కొండిభొట్లు—యీ గవరయ్యాగారు గోతాలు కోస్తాడ్రా. హెడ్డూ, అదీ, ఒహ మీదొహకు విరగబడి నవ్వూతూంటే, పంతులుకోసం బెంగెట్టుకుందని కవిత్వం పన్నుతాడు.

రామ—వైదికం! వైదికం! మీయేడుపులు మీరు యేడవక, లోకంలో భోగట్టా అంతా మీకెందుకు?

పూజారి—వూరుకోరా కొండిభొట్లు. పెద్దాపిన్నా అక్కర్లేదూ?

రామ—నీపెద్దతనం యెక్కడ యేడిసింది? నివ్వే ముందు రేపెట్టావు.

పూజారి—వై, స, బు, పె, అని యందుకన్నాడు బాబూ?

రామ—అతడేడీ, అతడు? అతడిపేరేవిఁటీ?

పూజారి—యెవరండీ?



రామ—ఆగుంటూరి శాస్తుర్లేడయ్యా?

గౌరి—యేమంటూరి శాస్త్రుల్లండీ?

శ్యా—ఆయనా,—మరేవొచ్చి, ఆయనా—వూరికెళ్ళారు.

లు—యేమిటీ తెలివితక్కువమాట! కూతురికి పెళ్లౌతూంటే, వూరికెలావెళ్ళాడు?

శ్యా—పెళ్ళయిపోయిందిగదా?

లు—తెలివిహీనం! లగ్నవంటే నేను లేకుండా వెళ్లిగించావుగానీ, పెళ్ళి యిదు లో
జులు లేగలమతుందిగమా?—

గౌరి—ఏకరాత్రి వివాహం కదండీ? అంచేత ప్రధానహోమం, శేషహోమంతో
సమాప్తి అయిపోయింది.

లు—(నిశ్చేష్టుడై లుబ్ధావధాన్లుతో) ఓరి, సామిద్రోహపు వెధవా!

గౌరి—నోరుమూసి, బాబ్బాబూ. శాంతించండి! శాంతించండి! (లుబ్ధావ
ధాన్లుతో) పంతులుగారి కాళ్ళమీద పడవయ్యా. (పంతులుతో) తమరు
చేయించిన శుభం. అశుభంమాటలు శలవియ్యకండి. సిద్ధాంతిగారూ, వారి
మావఁగారూ, శాస్త్రచర్చ చేసి, లగ్నం పదినిమిషాలుండదనగా, ఏకరాత్రవివాహం
స్థిరపర్చారు.

లు—యేంకటప్ప! వాడికి రూపాయలివ్వ లేదుగద?

శ్యా—యెల్లుండి యేవాళకైనా రూపాయలు చెల్లించకపోతే దావా పడుతుందని,
తొందరపడి పట్టుకు వెళ్ళిపోయినారు. మళ్ళీ వారంనాటికి వొస్తావఁన్నారు.

లు—నన్ను మధ్యవర్తినిచేసి, నేను లేనిదీ, యీ వ్యవహారం యలా పైసలుచేశావు?
నేను యంత యడ్వాన్సు వాడికెయిచ్చానో నీకు తెలుసునూ? అప్పుడే మావఁ
గారితో కలిసిపోయి నాకు టోపీ అల్లావూ?

శ్యా—మీరుచేసిన నిర్ణయప్రకారవేఁ, రూపాయలు చేతులో పడితేనేగాని, పుస్తె
కట్ట నివ్వనన్నాడు. యేంజెయ్యను?

లు—పుస్తెకట్టకపోతే నీపుట్టె ములిగిందిగాబోలు! నేవొచ్చేలోగా యేం వుప్పె
నొచ్చింది? వీడేదో పెద్దదగాచేసి, నేనొస్తే, పట్టుగుంటానని రూపాయలు
చేతులో పడేసుకుని వుడాయించాడు. వాడిపేరేవిఁటి?

గౌరి—ఆయనపేరు—మరేవచ్చి—అవుధాన్లుగారు శలవిస్తారు.

శ్యా—నాకు తెలియదు

రామ—అయ్యో అభాజనుడా! యిహ, వాడు, పంచాలీమనిషి అనడానికి సందేహ వేఁవిఁటి?

లుబ్ధా—అతగాణ్ణి మీరే తీసుకొచ్చి దొడ్డవాడని చెప్పారు? అంచేతనే ఆతణ్ణి నేను నమ్మాను.

రామ—నువ్వు నమ్మితే యెవడికి కావాలి? నమ్మకపోతే యెవడికి కావాలి? అతనికి నేను పెళ్ళిఖర్చులకోసం బదులిచ్చిన నూరు రూపాయిలూ, అక్కడపెట్టు.

లుబ్ధా—యెవరికిచ్చారో ఆతణ్ణే అడగండి, నాతో చెప్పకండి.

రామ—సరే, నీతో చెప్పను—నీతో యిక మాటేఅణ్ణు—మరినీయింట్లో వక్కనిమిషం వుండను. (లేచినిలుచుని) అంతావినండయ్యా! యీ గుంటూరుశాస్త్రుల్లు వచ్చిపదొంగ. లేకుంటే ఈ తెలివిహీనుడు యిచ్చినరూపాయిలు సంధించుకుని, పేరైనా చెప్పకుండా పరారీ అవుతాడా? నాతాలూకు సొమ్ముకూడా పట్టుకుపోయించాడు. వీడివైఖరీ చూడగా, రెండోపెళ్ళి పిల్లనో, మూడ్రప్పిలనో, యీ తెలివిహీనుడికి అమ్మి, యెగేసినట్టు కనపడుతుంది. గనక, ఒరే! బాకీ ఒరే! మంగలీ, హెడ్డుగారి దగ్గిరికెళ్ళి, యిద్దరు జవాన్లను తీసుకురా. వాడి వెంట డౌడాయిస్తాను

(పైమాటలు అంటూ వుండగా, సిద్ధాంతి ప్రవేశించి, రామప్పంతులు మాటలు ముగించి వెళ్ళిపోబోతూవుండగా రెక్కబట్టి నిలబెట్టును.)

సిద్ధాంతి—యెక్కడికి వెళతారు? కొంచం నిలబడండి

రామ—యేమిటి నీ నిర్బంధం?

సిద్ధాంతి—గుంటూరి శాస్త్రుల్లుగారి పేరేవిఁటో మీకాక్కావాలా?

రామ—యేమిటా పేరు?

సిద్ధాంతి—పేరి రామశాస్త్రుల్లుగారు. ఆయనపేరుతో మీకేం పనుంది?

రామ—వాడు నాకు బాకీ.

సిద్ధాం—మీకు ఒక దమ్మిడీ బాకీలేదు. ఆనిజం నాకు తెలుసును.

రామ—చెయ్యి నొక్కేస్తున్నావేవిఁటి!

సిద్ధాం—వైదీకపాళ్ళ చెయ్యి మృదువుగా యలా వుంటుంది? అవధాన్లుగారు యిచ్చిన సొమ్ము తాలూకు విలువ యెంతుందో చెప్పండి.

లు—నువ్వెవరివి అడగడానికి? అన్న! చెయ్యి నొక్కుతున్నావు! తంతావా యేవిఁటి?

స్వా—శుభమల్లె, పెళ్ళికూతుర్ని ముండా ముతకా, అంటే యెవరయినా వూరుకుంటారా?

లు—ముండకాదు, పునిస్త్రీయే, అంటాను; చెయ్యొదిలెయ్యి.

(లుబ్ధావధాన్లు శిష్యుడికి కొంతయెడంగా జరుగును.)

స్వా—కోపంవొచ్చినప్పుడు, లౌక్యం మరిచిపోకూడదు. మీరు ప్రభువులూ; మేం ఆశ్రితులం. తమకిలాభించేమాట చెబుతాను, యిలా దయచెయ్యండి.

లు—మర్యాదగా మాట్లాడితే, నా అంతమంచివాడు లేడు.

స్వా—అవధాన్లుగారూ మీరు కూడా యిలారండి.

(అవధాన్లు, సిద్ధాంతి, రామప్పంతులూ రహస్యముగా మాట్లాడుదురు.)

రామ—(ప్రకాశముతో) సిద్ధాంతీ యేదీ పాడిశేసరు. నియ్యోగపాడన్నవాడు, సముఖ కట్టుబడతాడు. యవరయ్యా వంటబ్రాహ్మలు! మాయింటికి ఫలహారాలు వెళ్ళాయా? యేవోఁయి, కొండిభొట్లూ! మాట, యిలారా.

(కొండిభొట్లు వచ్చును)

కొండి—యేం శెలవు?

రామ—మాయింటిదాకా నాతోరా.

కొండి—చిత్తం.

రామ—మాతోట్లో, మంచి పనసకాయలున్నాయి. రెండుకాయలకి బరాతవిఁస్తాను. తెచ్చుకో మీ అయ్యకి పనసకాయ కూరంటే, మాయిష్టం.

కొండి—చిత్తం!

రామ—పెళ్ళిలో యేవిఁటోయి గమ్మత్తు.

కొండి—యేవీఁ గమ్మత్తు లేదండి.

రామ—మధురవాణి పాడిందికాదేం?

కొండి—పాడింది—

రామ—ఆఁ!

కొండి—కావదండి.

రామ—అలాచెప్పు. అంతసేపూ హెడ్డు కనిష్టీబుతో మట్లాడుతూంది కాబోలు!

కొండి—లేదండి. ఒక్కమాటా ళ్ళేదు.

రామ—మరెందుకన్నావూ, మాట్లాడిందని యిందాకానూ? విరగబడి నవ్వింద న్నావే?

కొండి—మరీ—మరీ—మరేవొచ్చి—లింగన్నగారి కాంభొట్లు అలా అనమన్నాడు.

రామ—వాడిపని పట్టిస్తాను. నాతో వెకాస్యాలా! నువ్వుమాత్రం వాడిఒట్టు కూడకు చిన్నపట్నుంచీ నిన్ను యెరుగుదును. నువ్వు నిజాయితీ మనిషివి.

కొండు—అవునండి యెప్పుడూ నేను నిజవేఁ చెబుతాను.

రామ—అవునుగాని, హెడ్డు కనీష్టీబుమాటమట్టుకు నిజం చెప్పావుకావు. పట్టభిరామస్వావిఁమీద ప్రమాణంచేసి, చెప్పు! మధురవాణి యవరెవరితో మాట్లాడింది?

కొండి—మరేవచ్చి—నిజం చెప్పమన్నారూ?

రామ—నిజాయితీ మనిషివనేగదా నిన్ను అడుగుతున్నానూ?

కొండు—అయితే,—అందరితోటీ మాట్లాడింది.

రామ—అందరితోటీ అంటే యవరెవరితోటి?

కొండు—యవరెవరా అండి? పెళ్లి వొదిలేసి, అంతా మధురవాణి చుట్టామూగాం. భుక్తగారితో మాట్లాడింది. మరేవచ్చి.

రామ—యింకా యవరితో మాట్లాడింది?

కొండు—సిద్ధాంతి మంత్రం చప్పడం మానేసి మధురవాణి చెవులో యేకాంతం మాట్లాడాడు.

రామ—మరింకా యవరితోటి?

కొండు—మరేవచ్చి—హెడ్డు కనిష్టీబుతోటి.

రామ—ఓరి ఛండాలుడా! హెడ్డుతో మాట్లాడ లేదన్నావే?

కొండు—అవును మాట్లాళ్లేదు.

రామ—ఫుండాకోర్! మాట్లాడిందా మాట్లాళ్ళేదా?

గొండు—వచ్చా (స్రా దేవుఁడా!

రామ—అసత్యం అంటే, నాకు వెఱ్ఱికోపం. ప్రమాణపూర్తిగా. నిజంచెప్పు, అబద్ధ వాఁడితే, తల పేలిపోతుంది. మాట్లాడిందాలేదా?

గొండు—లేదు.

రామ—ప్రమాణ పూర్తిగా?

గొండు—ప్రమాణ పూర్తిగానే.

రామ—యిప్పుడు నిజంచెప్పావు, విన్నావా? నీకు చిన్నతనం; ఆడవాళ్ళమీద, ఒహరు అనమన్నా, అన్యాయంమాటలు ఆడకూడదు. తెలిసిందా?

గొండు—మధురవాణి మా దొడ్డమనిషి.

రామ—వూళ్ళో అలా అనుకుంటారేం?

గొండు—అంతా అనుకుంటారు.

(రామప్పంతులు యింటియెదుట.)

రామ—నేను తలుపుకొడతాను. నివ్వో చిన్నగమ్మత్తుచెయ్యి.

గొండు—చిత్తం.

రామ—యీ విచ్చబేడ మొలనిపెట్టుకో. మా పెరటిగోడ అవతల, ఒక అరఘడియ నిలుచుడు. దడ్డితోవంట కనప్డేబుగాని, మరెవరుగాని. పైకి వొచ్చినట్టాయెనా రెక్కపట్టుకుని, కేకెయ్యి నేవొస్తాను. లేకుంటే వుడాయించెయి. (కొండు భొట్లు నిష్క్రమించును.) తలుపు తలుపు (తనలో) ఒకచేట తలుపుతియ్యదు. అనుమానా నిక్కాణించాం. వీడు నిజంచెప్పాడా? అబద్ధం చెప్పాడా? నేను పాలెంనించి వొచ్చి కబురు పంపించిన తరవాత రాక, యిది తుఱ్ఱుమని యలాపరిగెత్తి వెళ్లిందీ పెళ్లిలోకి? తలుపు తలుపు! యప్పటికీరాదేం!

(మధురవాణి తలుపుతీయును) యేం జేస్తున్నావు యింతసేపు?

మధు—ఉదయంనుంచి రాత్రివరకూ చేసేపనులన్నీ, రేపటినుంచి వ్రాసివుంచుతాను రండి.

(ఉభయులూ నిష్క్రమింతురు.)

(కొండు భొట్లు ప్రవేశించి.)

గొండు—పంతులుగారూ, పంతులుగారూ,

(రామప్పంతులు, మధురవాణీ ప్రవేశింతురు.)

రామ—(మధురవాణితో) నువ్వు లోపలకివెళ్ళు (కొండిభొట్లుతో) యేవిఁటి ?

కొండు—మరేవచ్చి,—పట్టుకోలేదు.

రామ—(తీక్షణంగా) యెందుకు పట్టుకున్నావుకావు?

కొండు—చెప్పరానిదాన్ని యలా పట్టుకోవడం?

మధు—చెప్పరానిదాన్ని యెందుకు పట్టుకోవడం?

కొండు—దిడ్డీతోవంట యెవరొచ్చినా పట్టుకొని కాకియ్యమని పంతులు చెప్పారు.

మధు—యేవిఁచిత్రం! యేం అప్రతిష్ట! బ్రాహ్మడికి వెఱ్ఱెత్తుతూంది కాబోలు!

రామ—(మధురవాణి వెనకనిలచి చేతితో వెళ్ళిపొమ్మని కొండిభట్లుకు సౌజ్ఞ చేసి) పేలుడుగాయ వైదీకప గుంటడి వెకాళ్యాలు నిజం అనుకుంటావేవిఁటి ?

(లోపలికి వెళ్లును.)

(రామప్పంతులు యింటిలోనికి వెళ్ళగానే మాధురవాణి సావిడివెనక తలుపుకై నుంచివేసి, కొండిభొట్లును లోపలికిరమ్మని సౌజ్ఞచేసి. ముద్దెట్టుకొనును.)

మధు—(నిమ్మళంగా) బాగా, కాపాడావు !

కొండి—మధురవాణీ, యిడిగో పంతులిచ్చిన బేడ. యిదిగో హెడ్డుగారిచ్చినపావలా. యింద వెండితో. పొడికాయ (యిచ్చును.)

మధు—(పుచ్చుకొని) నువ్వు మంచివాడివి. యీవేళనుంచి, నీకూ నాకూ నేస్తం తెలిసిందా ? (మరివకసారి ముద్దుపెట్టుకొని) యిక వెళ్ళు.

(కొండిభొట్లు చెంగున వీధిలోకి యెగిరి వీధినడుమ గెంతులువేయును)

(కాంభొట్లు ప్రవేశించి.)

కాంభొ—యెందుకురా యీ గెంతులు ?

కొండి—ముద్దెట్టుకుందిరా !

కాంభొ—వెఱ్ఱి వెఱ్ఱి వేషాలువెయ్యకు. యీ కోతి మొహాన్నే ?

కొండి—పోన్సి, వెఱ్ఱికుట్టా! నేం జట్టుకట్టాం !

(నిష్క్రమింతురు.)

౫-వ స్థలము. కృష్ణారాయపురం అగ్రహారంలో.

(అగ్నిహోత్రావధాన్లు యింటి పెరటిలో గిరీశం పనివాళ్ళచేత పందిరి వేయించుచుండును.)

[వెంకటేశం ప్రవేశించును.]

...షేమివాయ్ బావా, యెడంపవడ యెట్టబారింది?

...నాన్న గూబగిదలేతాను.

...కేశావు?

...ంధివార్చలేవని.

...ళాం వార్చినట్లు వేషం వెయ్యలేకపోతివా?

...హాడ్డనుకున్నాను.

...కోడానువనికి రావోయి, బావా. మనం యేదైనా, వేషం వేశావంటే, ...మాస్తున్నాడని అనుకున్నప్పుడూ, ఒకడు చూస్తావుండలేదనుకున్నప్పుడూ ...కొక్కమోస్తరుగా వేషం నడిపిస్తే సేఫ్ సైడ్. చూస్తున్నావుకావా, ...నేను యెంతసేపు ఒక ధ్యానంచేస్తాన్?

...పేవని ధ్యానం చాస్తారు?

...ధ్యానవా? యీ చాదస్త బ్రాహ్మడు యింతట్లో దేవతార్చన చాస్తాడు. ...ప్లో విస్తట్లో మెతుకులు పడతాయి అని తదేకధ్యానం చేస్తాను.

...శాస్త్రాలు చదివి దేవుణ్ణి ధానం చెయ్యాలిగాని, అన్నంకోసం ధానంచేస్తే ...గాదా?

...రెన్స్! మతసంబంధమైన సంగతులు నీకేమీ తెలియవు యీ పెళ్ళి ...యిన తరవాత నిన్ను మతంలో తరిఫీదు చెయ్యాలి. అన్నిమతాలూ పరి ...వాటితాలూకు యెసెన్స్, నిగ్గుతీసి ఓ కొత్తమతం యేర్పర్చాను. అది ...గా వెళ్ళి ప్రిజ్వలింపచేస్తాను. యిప్పుడుమట్టుకు నీ సంశయం తీరుస్తాను. ...న్నావ్? అన్నాన్నా ధ్యానించడం, అని కదూ? యేవఁంవోయి నీ ఉప ... "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్'' అన్నవే, బ్రహ్మ, అని తెలుసుకో

వోయి, వెధవాయా, అంది. తెల్లవాడు యేమని ధ్యానం చేస్తాడోయి రోజూనూ? "ఫాదర్, గివ్, అస్ అవర్, డెయిలీ, బ్రెడ్" అనగా "నన్ను కన్నతండ్రీ రోజూ ఒక రొట్టెముక్క ఇయ్యవోయి అని"—ఇక, మనమేమనాలి? "తండ్రీ రోజూ, కందిపప్పు, ధప్పళం ఇయ్యవయ్యా" అని ధ్యానించాలి. మన చమకంలో యేమన్నాడూ? "శ్యామకాశ్చమే" "చామల అన్నం మామజాగా వుంటుంది, నాక్కావాలి, ఓ దేవుఁడా! అన్నాడు" ఆ చమకంలో యవడికి యిష్టమైన వస్తువులు వాడు కలపవచ్చును—"కందిగుండాచమే, యింగువనూ నాచమే" దీనినే రిలిజియస్ రిఫార్మ్ అంటారు.

వెంక—గేదెపెరుగూచమే, చేగోడీచమే.

గిరీ—శబాష్! అదే ఒరిజినాలిటీ. అడిగితేగాని అమ్మ అయినా పెట్టదు. దేవుఁడు మాత్రం ముద్దిస్తాడనుకున్నావా యేమిటి? నీకు యెప్పుడు యేమి కావలిస్తే అప్పుడు ఆవస్తువులు సంపుటీచేసి చమకపారాయణ ఆరంభించేది.

వెంక—అయితే రేపణ్ణించి నేను రోజూ చమకపారాయణ చేస్తాను.

గిరీ—మనస్సులో చెయ్యి. పైకి పారాయణ చేశావంటే, నీతండ్రి ఎడ్యుకేషన్ లేకపోవడంచేతా, రీజన్ తెలియకా యిదేమిటి చమకం పాడు చేస్తున్నావని పెణతెక్కగొట్టి, తొమ్మిదో అష్టం ఘనం పారాయణచేస్తాడు.

వెంక—మొన్న బుగతగారి యింట్లోంచి మీరు పొగాకట్ట యెత్తుకొచ్చారుగదా పాపం చేశారని దేవుఁడు కోప్పడ్డా?

గిరీ—చిన్నతనంలో మాకింతండ్రి (నీ తండ్రిలాగే అగ్గిరావుఁడోయి) చెవినులిపి నాచేత ఉపనిషత్తులు చదివించాడు. దాం తస్సా గొయ్యా, పేరు మరిచిపోయినానుగాని, ఒక వుపనిషత్తులోను, శిష్యుడుప్రశ్న అడుగుతూవుంటే, గురువు సమాధానం చెబుతూంటాడు. ఆ వుపనిషత్తులో చెప్పిన శిష్యుళ్ళాంటి శిష్యుడివి నువ్వు; అలాంటి గురువుని నేను, మన ప్రశ్నోత్తరాలు యవడైనా తాటాకు మీదరాసి పారేశాడంటే, ఒక రెండువొందలేళ్లు అయినతరవాత 'టొబాకోపనిషత్తు' అవుతుంది. పొగాకు కట్టకి పాప మేఁవిటోయి, కాల్చి పారేసేదానికి అందులో పాడుంచేసే బుద్ధిహీనులదగ్గిర పొగాకు యెత్తుకురావడం లోకోపకారమని నమ్ము.

వెంక—యలాగండీ లోకోపకారం?

—యలాగా. యిదుగో, యిలా చుట్టకాలిస్తే, స్టీము యంజన్‌లాగ, భగ్, భగ్‌మని పొగ ఆకాశానికి పరిగెత్తి మేఘమై వర్షం కురిపిస్తుంది. పొషంగాని పీరుస్తే ఆఘాటుకి, ఆకాశం ఆప్పుకుపోతుంది. ముక్కంటమాత్రం ఛిరివర్షం కురిసి యిల్లా వొళ్ళ్యాకూడా డర్టీ అవుతుంది. గనక పొడుంచేసే మూఖుల యింట్లోవుండే పొగాకంతా దొంగిలించి చుట్టలుగట్టి, తగలెట్టవలిసినదే. ఒకవేళ గాశంగాయా, తమరు దొంగతనంచేశారు, కొద్దిరోజులు నరకానికి విజయం చెయ్యండి, అని దేవుఁడుగానీ, అన్నట్టాయెనా, ఒక చిన్న లెక్చరుకొట్టి, గభరా యింపజేస్తాను.

—యేవఁని లెక్చరు కొడతారు?

—యేవఁనా? ఓ దేవుఁడా! నామనస్సు యిండిపెండెండుకా సృజించావా? లేక డిపెండెంటుగా సృజించావా? యిండిపెండెంటుగా అయితే, నా యిష్ట మొచ్చినపనల్లా నేను చేశాను. నువ్వెవరు, అడగడానికి? యిలాంటు చిక్కులు పెట్టావంటే హేవెన్‌లో చిన్న నేషనల్ కాంగ్రెస్ వొకటి లేవదీస్తాను. లేక నన్ను డిపెండెంటుగా చేశావూ? అల్లాగయితే నువ్వే నాచేత పాపంచేయించావు గనక నీకే ఆశిక్ష కావలిసింది దేర్‌ఫోర్ చలో, నరకానికి, చలో! అక్కణ్ణించి మళ్ళీ తిరిగి వొచ్చేలోగా, ఆరుఘడియలు స్వర్గంలో నీ అధికారం, నాకిస్తి వట్టాయనా, కొన్ని సృష్టిలో లోపాలు సవరణ చేస్తానంటాను.

—యేవిఁటండి లోపాలు?

—లోపాలన్నలోపాలా! నీచేత వొప్పిస్తాను. నెంబర్‌వన్ - నీ మేష్టరులాంటి అభాజనుణ్ణి పుట్టించడం లోపం అంటావా అనవా?

—లోపవే.

—నీసిస్టర్‌లాంటి బ్యూటిఫుల్ యంగ్ గర్లుని, విడోని చెయ్యడం తప్పండావా, ఒప్పంటావా?

—తప్పే.

—యిలాంటి లోపాలు కోటానకోట్లు. యిక రద్దుసృష్టి యంతుండనుకున్నావు? సన్ స్టైన్స్, యెన్నినముదాలిలు వున్నాయి?

—యేడు.

గిరీ—యేడూ, యేడీసినట్టేవున్నాయి. పాలసముద్రం వుంటూవుండగా పెరుగుసముద్రం, నేతిసముద్రం యెందుకోయి? యిది ప్లియోనిజమ్, ప్రపంచ మరో తెలివితక్కువ చూశావా? యెందుకూ పనికిమాలిన ఉప్పుసముద్రం నెత్తి కొనికొట్టి, పెరుగు, పాలు, నెయ్యి, చెరుకుపానకం, యీ సముద్రాలు యవడికీ అందుకు రాకుండా దూరంగా విసిరేశాడోయి. ఒక సంవత్సరం నాకు దేవుఁడు దివాన్గిరీ యిస్తే, భీముని పట్నానికి పాలసముద్రం, విశాఖపట్న మంచినీళ్ళసముద్రం కళింగపట్నానికి, చెరుకుసముద్రం తెస్తాను. యీ యిస్త ఘాట్సు అంతా పాగాకు అరణ్యం చేస్తాను. యీ లెక్చరు నేను కొట్టే దేవుఁడు యేమంటాడో తెలిసిందా? వీడు అసాధ్యుళ్ళావున్నాడు. వెన "పాతయముడివా కొత్తయముడివా" అని అడిగిన పెద్దమనిషి కంటె ఒక యెక్కువ చదువున్నట్టు కనపడతాడు. గనక వీడికో జోడు గుర్రాలు యిచ్చి, స్వర్గంలో వున్న యావత్తు మహలులు, బగీ చాలా చూపించి, కావాలంటే అది యివ్వండని దేవదూతలతో చెబుతాడు. నా శిష్యుడు, పేకాన్ని కూడా తీసుకొస్తే గాని, నాకేం తోచదని నే చెబుతాను. అప్పుడు వి విమానమ్మీద తీసుకొస్తారు. మన విద్దరం స్వర్గంలో మజావుడాయి యీవేళకి మతంమీద యింతవరకు లెక్చరు చాలును. యిక వెళ్ళి దేవాల తోటలో కోతిపిల్లి నికట్టి ఆడుకో. సాయంత్రానికి నీతండ్రి వొచ్చేసరికి దీపంయెదట కూచుని పుస్తకం తిరగేస్తూ పులుసటుకులు ధ్యానంచెయ్యి, వేసి బలేసాగుసుగా తయారుచేస్తాను (వెంకటేశం వెళ్ళును.) రనవే.

(బుచ్చమ్మ ప్రవేశించి.)

బుచ్చమ్మ—యీ రుబ్బురోలునిండా తాటాకుముక్కలు పడుతన్నాయి యిలా గేసిపెడతారూ.

గిరీ—అదెంతపని,

(గిరీశం రుబ్బురోలు పందిరి అవతలకులాగును. బుచ్చమ్మ రుబ్బురోలు కడిగి మినపపప్పు రుబ్బును.)

గిరీ—(పాడును) "భజగోవిందం. భజగోవిందం. గోవిందం భజమూఢమతే యేం, వదినా, కంటనీరు పెడుతున్నారూ?

బుచ్చ—లేదే లేదు.

గి—మీరు కంటనీరు పెడితే నామనసు కలిగిపోతూంది.

బుచ్చ—మీకేం-మహరాజులు-మాకష్టాలు మమ్మల్నే బాధిస్తాయి.

గి—యేమి కనికరం లేనిమాట అన్నారూ! మీరు అలా దుఃఖంలో ముణిగివుంటే, యెందుకు నాకీ వెధవ బతుకు? మీకోసం యేం చెయ్యమంటే అది చాస్తానే? ప్రాణం యిచ్చెయ్యమంటే యిచ్చేస్తానే? దాఖలా చూడండి యిదుగో కత్తిపీట!

బుచ్చ—(కత్తిపీట దగ్గిరతీసుకుని) చెల్లికి యీ సమ్మంధం తప్పించారు కారుగదా?

గి—అవొక్కటిమట్టుకు నాకు సాధ్యమైంది కాదు

బుచ్చ—అయితే మీతో నాకేం పని? యింత సందడిగా పెళ్ళిపనులు చేయిస్తున్నారు, మా నాన్నకి తోచకపోతే, మీకైనా తోచకూడదా, యీ సమ్మంధం కూడదని? మీకుకూడా దానిమీద యింత కనికరం లేకపోవాలా? లుబ్ధావుధాన్లు మీకు అన్నగారని కాబోలు మీకు సంతోషం.

గి—నాకాసంతోషం? యెంత కూరమైనమాట అన్నారు? యీ సంబంధం పొసుగదని, నా మనస్సులో యెంత ఖేదిస్తున్నానో, ఆ భగవంతుడికి తెలుసును. యీ సంబంధం తప్పించాలని చెడదివాట్లు పెడుతూ మా అన్నపేర రెండు టావులు వుత్తరం రాశాను. చెవినిపెట్టాడు కాడు. నేను యేంచేతును? వాడిని స్మరిస్తేనే పాపంవొస్తుంది. ఊరికే కూచుంటే, మీతండ్రి యేవనుకుంటాడో అని, మీయింట అరవ చాకిరీ చేస్తూ నీకు యేనాటికైనా కనికరం వొస్తుందేమో అని ఒక్కమనిషిని నూరుమంది చేసేపని చేస్తున్నాను. అంతేగాని, యీ నమ్మిన నౌఖరుమీద నీమనసు భారంగావుంటే, యెవరికీ చెప్పకుండా యీరాత్రిలేచి మా దేశానికి వెళ్ళిపోతాను.

బుచ్చ—వెళ్ళిపోకండి.

గి—నేనుమాత్రిం పోయే సాధనం యలాగ? యెన్నోమాట్లు యేవనుకుంటాను? యీ పెళ్ళి తప్పించ లేకపోయినానుగదా? నాప్రాణంకంటే యెక్కువైన యీ బంగారపు బొమ్మలాంటిబుచ్చమ్మని పునస్త్రీని చెయ్య లేకపోయినానుగదా? అని విరక్తిపుట్టి, పోదాం అని నిశ్చయించే సరికి-కాలు ముందుకువేసినా, మనస్సు వెనక్కిలాగి యేమితోచేదీ? "పైకి పోతానని సందడి పడుతున్నాను. నా బుచ్చమ్మ క[illegible] దానికి యింత కనికరం లేక

పోయినా, యిక్కడేవుండి, చూశైనా సంతోషిద్దాం'' అని వుండి పోతూ వొచ్చాను.

బుచ్చ—మీరు చెబితే, లుబ్ధావుధాన్లుగారు పెళ్ళిమానుకుంటాడని, తమ్ముడు చెప్పాడు?

గిరీ—నే చెప్పినమాట, యీ భూప్రపచములో యవడూ కొట్టివెయ్యలేడు. అందుచేత, వెంకటేశం అలా అని వుంటాడు గాని, మీతండ్రి ఒకడు, మా అన్న వకడు లోకాతీతులు వాళ్లు బ్రహ్మ చెగితే వినరు. ఈయనకి వెఱ్ఱికోపం. ఆతగాడు శుద్ధ కీసిగొట్టు. మాఅన్న సుఖపడ్డానికా యీపెళ్ళి తలపెట్టాడు? నీ మొగుడు నిన్ను పెళ్ళాడి యంతసుఖపెట్టాడో, మాఅన్న నీచెల్లెల్ని పెళ్ళాడి, అంతేసుఖపెడతాడు. ఆఫ్రికాదేశంలో స్లేవరీఅనివుంది. అనగా మనుష్యుల్ని పట్టి పశువుల్లాగ బజార్లలో అమ్ముతారు యవరుకొనుక్కుంటే వాళ్ళయింట్లో ఆయామనిషి బతికినన్నాళ్లూ చాకిరీ చెయ్యాలి. అలాగ్గానే మా అన్న, మీచెల్లెలిని పెళ్ళఅనే మిషపెట్టి, కొంటున్నాడు. వాడింట యిది జీతంలేని బాపనక్కలాగ పనీపాటూ చేస్తుందవి, వాడిఆశ. నేనుకూడవని యంతగడ్డిపెట్టినా విన్నాడుకాడు. యీకష్టాలన్నీ యిలా వుండగా నాకు మరోభయం వేస్తుంది. చెబితే కోపంతెచ్చుకోవుగద?

బుచ్చ—మీరేం చెప్పినా నాకు కోపంలేదు.

గిరీ—అమాత్రం ధైర్యమిస్తే, నాకాక్కవలిసిందేవిటి? రామచంద్రపురం అగ్రహారీకులు బహుదుర్మార్గులు- మాఅన్న చచ్చిపోయినతరవాత నీ చెల్లెల్ని తిన్నగా ఉండనియ్యరు. అదికూడా మా మీనాక్షి మోస్తరౌతుంది.

బుచ్చ—మీనాక్షీకేం లోపంవొచ్చింది?

గిరీ—యేమనిచెప్పను. కడుపుచించుకుంటే కాళ్ళమీద పడుతూంది. అయినా నీదగ్గిర నాకు దాపరికం యేవిటి? దానిమొగుడు పోయినతరవాత యేటేటా కడుపు, అవుతూవుండడం. అయినప్పుడల్లా వొల్లమాలిన అల్లరిన్నీ. ఒకప్పుడు అది ప్రాణభయంకూడా చేస్తుంది. ఆవూళ్ళో రామప్పంతులని వొక పరమదుర్మార్గుడు నియోగపు పంతులు వున్నాడు. వాడు ఒక సానిదాన్ని వుంచుకున్నాడు. యెందరినో సంసార్లని చెడగొట్టాడు. మా అన్న వ్యవహారాలన్నీ ఆపంతులే చూస్తాడు మా అన్న చచ్చిన ఉత్తరక్షణం, నీ చెల్లెలికి వొల్లమాలిన ధనం చేతిలోకి వొస్తుంది. స్వాతంత్ర్యం కలుగుతుంది ''యేమి ఇది''? అని అడిగేవాడుండడు. ''నేను కట్టు యిమ్మ? చెడిపోవడానికి అభ్యంతరమేమిటి?

గావున్నానుకానా''? అని నువ్వు అనగలవు. నీ మొగుడితోటూకు ఆస్తి నీ చెయ్యి చిక్కలేదు. మొగుడి యింటికైనా నువ్వు వెళ్ళలేదు.

వ్వు—అవును

—తల్లిదండ్రుల చాటున ఖాయిదాగావున్నావు పరాయివాడుయింట్లో అడుగు పెట్టలేదు. గాని యిలా యెంతకాలం వెళ్లుతుంది? నిన్ను తల్లితండ్రులు కలకాలు కాపాడలేరుగదా? వాళ్లు పోయినతరవాత నీకూ స్వాతంత్ర్యం వొస్తుంది. యేఖాలానికి మనసు యెలా వుండునో? అప్పుడు కాలుజారిన తరవాత, నువ్వు యేవనుకుంటావు? ''అయ్యో నాకు గిరీశాన్ని శాస్త్రోక్తంగా పెళ్ళాడి పుణ్యస్త్రీ నయిపోతే, పిల్లా పేకాగలిగి, అష్టయిశ్వర్యంతో తులతూగుదునుగదా? యీ దుర వస్థ నాకు రాకపోవునుగదా''? అని విచారిస్తావు. అప్పుడునే యెక్కడవుంటాను? స్వర్గంలో మీకోసం యెదురుచూస్తూ వుంటాను. యీ పెళ్ళి అయి పోయినతరవాత వెంకటేశమూ, నేనూ, పట్నానికి వెళ్ళిపోతాం. నిన్ను, తలుచుకుంటూ నిద్రాహారం మానేసి, కొన్నిరోజులు వుంటాను. యెంతకాలవని మనిషన్నవాడు, నిద్రాహారంమాని వుండగలడు? నిన్ను తలుచుకుని తలుచుకుని నిద్దర పట్టక, రెండుఝాముల రాత్రిప్పుడు నాగదిలో యీజీచెయిరుమీద కూచుని వుండగా - యెదట బల్లమీద మెరుపుదీపం, గోడని నిలువుటద్దం వున్నాయి - ఆ అద్దంలో నాముఖం చూసుకుని, యేమంటానూ? ''యీ సొగసైనముఖం. యీ తామరరేకులవంటి నేత్రాలు, యీ సోగమీసాలు. యివన్నీవృధాగదా? యెవరు మానీ ఆనందించునూ? నాబుచ్చమ్మ, నన్ను పెళ్ళాడక పోయినతరవాత నాబతుకు యెందుకు'' అని, నిస్పృహకలిగి ఛట్టున టేబిలు సొరుగుతీసి, అందులోవున్న తోటుగుళ్ళపిస్తోలు యెక్కుబెట్టి గుండె దూసిపోయేటట్టు కొట్టేసుకుంటాను.

మ్మ—కొట్టుకోకండి మీరు అలా అంటే నాకు యేడుపొస్తుంది.

—తక్షణం దేవతలు విమానం పంపించి నన్ను స్వర్గానికి తీసుకువెళతారు. స్వర్గానికి వెళ్ళనని నాకు అక్కడమాత్రం సుఖవుంటుందనుకున్నావా? వొదినా? నవాభరణ భూషితురాలయి రంభతక్కుతూ తారుతూవొచ్చి.

''హా! ప్రియ! గిరీశ! నీలాటి సుందరుణ్ణి యెన్నడూ నేను చూడలేదు రమ్మీ' నన్ను చేకొమ్మ,'' అని రెక్కబట్టుకు లాగుతుంది. నేనేవంటానూ?

''ఛీ! అవతలికిపో— నేను ఏంటీనాచ్చి! సానిది తాకితే, పరమ అపవిత్రంగా

తలుస్తాను. పియుస్స సబ్బురాసి కడిగితేనేగాని యీచేతికి కళ్మలంపోదు, నువ్వారంభవి? మాబుచ్చమ్మ సొగసుకి నువ్వు వొడ్డీకి పసికిరావు. గోయెవే. డామ్, డర్టీ గూస్'' అని అంటాను. అలాగే, మేనకా, ఊర్వసీ, తిలోత్తమా మొదలైన యావన్మంది అప్సరస్త్రీలనీ తన్ని తగిలేస్తాను. తగిలేసి, కాషాయ వస్త్రాలు ధరించి కల్పవృక్షచ్ఛాయని ''హా! బుచ్చమ్మా, బుచ్చమ్మా'' అని నీపేరు జపంచేస్తూ అనేక సంవత్సరాలు పద్మాసనంమీద వుండిపోతాను. అంతట కొన్నాళ్ళకి నాతపస్సు ఫలించి, నువ్వు నందనవనంలోకి చంద్రోదయంలాగ బయలుదేరి వస్తావు. నేను ''ప్రియురాలా! యెన్నాళ్ళకి వొచ్చావు! అని, అమాంతంగా వెళ్లి నిన్ను కౌగలించుకుంటాను. అప్పుడు నీ మొదటి మొగుడు, ముసిలివెధవ, గావంచా గుడ్డకట్టుకుని, పొడుంముక్కుతో, ''బుచ్చమ్మ నాపెళ్ళాం'' అని అడ్డు రాబోతాడు, ''వెధవాయీ, నువ్వు బుచ్చమ్మకి తగవు. నీ రూపాయలు నువ్వు పట్టుకుపో'' అని, వొక్కతాపు తన్ని తగిలేస్తాను. మనం యిద్దరం సుఖంగా స్వర్గంలో శాశ్వతంగా వుండిపోతాం.

బుచ్చ—యేడుస్తూన్న దాన్ని నవ్విస్తారు.

గిరీ—నువ్వు నన్ను పెళ్ళాడితే, మనం బతికున్నంతకాలం నవ్వుకుంటూ, ఆనందిస్తూ కాలం వెళ్ళబుచ్చుతాం. అప్పుడు నిన్ను యీలాగ పస్తుపడనిస్తానా? మనకి యెంతమంది నౌఖర్లువుంటారు! యెంతమంది చాకర్లు వుంటారు! తోటలు దొడ్లు, గుర్రాలు, బళ్ళు! నిన్ను నడవనిస్తానా? పుష్పంలాగ నెత్తిమీద పెట్టుకుంటాను. అప్పుడు నీకు కలిగే ఆనందం ఆలోచించుకో.

బుచ్చమ్మ—నా జన్మానికి మరి ఆనంద మెక్కడిది?

గిరీ—నేను, నీకు దాసుడనై ''యిదుగో నన్ను స్వీకరించు. నన్ను పెళ్ళాడి, ఆజన్మం ఆనందం అనుభవించు. నన్ను ఆనందంలో ముంచు'' అని బతిమాలుకుంటూంటే, నువ్వు అట్టి సులభసాధ్యమైన సుఖమును కాలువ తన్నుకు వెళ్ళిపోయి, నాబతుకు కూడా బుగ్గిని కలిపితే, నేనేమి చెయ్యగలను?

బుచ్చ—మీ బతుక్కి లోటేవిఁ? మీరు మహారాజులు.

గిరీ—నువ్వు నన్ను పెళ్ళాడితే నేను మహారాజునే అవుతాను. నీ నోటంట వచ్చిన మాట అమోఘం-వొట్టినే పోకూడదు. గనక నాతో వెళ్లిపోయిరా.

బుచ్చ—అమ్మ నాయనా! నే మీతో రాను.

కీ—సరే. రాకపోతే నేనేగదా ప్రాణత్యాగం చేస్తాను? పీడానాడాకూడా పాయె.

బచ్చ—అలాంటి మాటలు అనకండి.

కీ—చేసేమాట, చెబితే తప్పేమిటి? నేనేమైతే నేంగాని, నీ చెల్లెలిమీదైనా నీకు కనికరం కద్దా?

బచ్చ—అదేం, అలా అడుగుతున్నారు?

కీ—నిజంగా కనికరంవుందా?

బచ్చ—వుండకుండా వుంటుందా?

కీ—వుంటే యీ పెళ్ళి తప్పించే సాధనం నీ చేతులోనేవుంది.

బచ్చ—నా చేతులోనా?

కీ—అక్షరాలా.

బచ్చ—యేమి చిత్రమైన మాటలు చెబుతారు!

కీ—యీ భూప్రపంచంమీదవుండుచున్న యావన్మంది స్త్రీలలోనూ, నిన్నొక్కర్తెనూ వలిసి, నేను నీకు సుతలామూ లొంగిపోబట్టిగదా, నాబతుకు హాస్యాలకింద అయిపోయింది?

బచ్చ—మీతోడు—అలా అనకండి.

కీ—పోనియి-ఆమాత్రం భరవసాయిచ్చావు. ఒకమాట నాకు ప్రమాణ పూర్తిగాచెప్పు. నీ చెల్లెలు పెళ్ళి తప్పించడం, నీచేత అయితే, చేస్తావా?

బచ్చ—చెయ్యనా?

కీ—యేమో, చేస్తావో చెయ్యవో! చేస్తానని ప్రమాణంచేస్తేనే, ఆమాట నేను చెబుతాను.

బచ్చ—యేమని ప్రమాణం చెయ్యమన్నారు?

కీ—నామీద ప్రమాణం చెయ్యి.

బచ్చ—మీమీద ప్రమాణమే; చెప్పండి.

కీ—అయితే విను. వొంటరిగా చూసి, యీమాటనీతో రహస్యంగా చెప్పదామని కాచి, కాచివుండగా, యీవేళ, మీతండ్రి వూరికి వెళ్ళడం, మీతల్లి వాకట్లో వుండ

డంనుంచి, సమయం చిక్కింది. చెవివొగ్గివిను. నీచెల్లెలి పెళ్ళి తప్పడానికి ఒక్కటే సాధనంవుంది. అది యేవిఁటంటే. నువ్వు ముందూవెనకా ఆలోచించక, నాతో లేచివచ్చి నన్ను పెళ్ళిచేసుకోవడవేఁ - లేకుంటే నీచెల్లెలి పెళ్ళితప్పదు.

బుచ్చ—(ముసిముసి నవ్వుతో) నేను మీతో లేచివొస్తే మాచెల్లెలు పెళ్ళి ఆగిపోతుందీ? యేవిఁచిత్రాలు!

గిరీ—ఆమాట నీచేతనే వొప్పిస్తానుకదూ - విను - పెళ్ళికి తల్లి వెళ్ళుతూన్నప్పుడు రెండోనాడు రాత్రి బండీవాడి చేతులో నాలుగు రూపాయలుపెట్టి, నీబండీ తోవతప్పించి అనకాపిల్లి రోడ్డులో పెట్టిస్తాను. అక్కడనుంచి రామవరం దాకా మాస్నేహితులు అంచీబళ్ళు ఖణాయిస్తారు ఆడుతూ, పాడుతూ, మనం వుడాయించి రామవరంలో పెళ్ళాడేసుకుని సుఖంగావుందాం. యిక మీవాళ్ళ సంగతి యేవౌఁతుందీ? మనం వుడాయించినమన్నాడు తెల్లవారగట్ల, నీబండీ కనపడక, కలవిలపడి, మీవాళ్ళు నెత్తీ నోరూ కొట్టుకుంటూారు. నీచెల్లెలు పెళ్ళి ఆగిపోతుంది. మరి రెండు రోజులికి మనం పెళ్ళాడావఁని తెలుస్తుంది. నిన్ను ముసలివాడికి కట్టిబెట్టినందువల్ల కలిగిన చిక్కులుచూస్తూ, నీతండ్రి నీచెల్లెలికి మళ్ళీ ముసలిసంబంధం చెయ్యడు. నీతండ్రి ఒకవేళ మూర్ఖించి పెళ్ళి చేస్తనన్నా, మన తమాషా విన్నతరవాత, నాఅన్న నీ చెల్లెల్ని మరి పెళ్ళి చేసుకోడు. యిది సిద్ధాంతం. అవునా కాదా?

బుచ్చ—అవును కాబోలు.

గిరీ—అయితే మరి అందుకు సమ్మతేనా?

బుచ్చ—యెందుకు?

గిరీ—నాతో వెళ్ళిపోయి రావడానికి.

బుచ్చ—అమ్మ నాయనా, నా ప్రాణంపోతే నేను మీతోరాను.

గిరీ—రాకపోతే, మీచెల్లెలికి యీపెళ్ళి తప్పదూ, నాకు చావూ తప్పదూ.

బుచ్చ—అలా అనకండి.

గిరీ—అనకపోతేమాత్రం, చావు తప్పేదుందిగనకనా? నిన్ను వొదిలి బతకలేను, అది వకచావు. నువ్వు నామీద వొట్టువేసుకుని ఆమాట తప్పిపోతే, నన్ను దేవుఁడే చంపేస్తాడు. అది రెండో చావు. మరి నాక్కి చావు యేలా తప్పుతుంది?

బుచ్చ—నానించి మీరు చచ్చిపోతే, నేనూ చచ్చిపోతాను. చచ్చిపోకండి.

గి—నావల్లా? అదుగో నీతమ్ముడు వొస్తున్నాడు. మరి మనం యీ కష్టసుఖాలు మాట్లాడుకోడానికి వీలు చిక్కదు. ఒక్కమాట చెప్పు. బతకమన్నావా? చావమన్నావా?

బుచ్చ—వెయ్యేళ్ళు బతకండి.

గి—అలాగైతే, నాతో రావడం ఖాయవేఁనా?

బుచ్చ—యేంజెయమంటే అది చాస్తాను.

(వెంకటేశం మిడతనుపట్టుకు ప్రవేశించును.)

వెంక—యిదుగోనండోయి, గొల్లభావఁని పట్టుకున్నాను.

గి—చూశావూ, వొదినా! నీతమ్ముడు చిన్నగుంటడయినా, అప్పుడే గొల్లభావఁల్ని పట్టుగుంటున్నాడు.

బుచ్చ—(ముసిముసినవ్వు నవ్వుచు) మిడత!

గి—(బుచ్చమ్మతో) యిన్నాళ్ళకి మిడతంభొట్లు చేతులో చిక్కాడు. (వెంకటేశంతో) యిలాతే - మిడతల్ని పట్టుకోవడం మంచి ఎడ్యుకేషన్. యిదే, నాచురల్ హిస్టరీ, ప్రకృతిశాస్త్రం అంటారు.

వెంక—అక్కయ్యా - కొంచం ఊరుబిండి!

బుచ్చ—అమ్మ చూస్తే తంతుంది.

వెంక—అమ్మచూడదులే. (ఊరుబిండి చేతులో వేసుకుని నాలుకతోనాక నెంచును.)

(తెరదించవలెను.)

# కన్యాశుల్కము — పంచమాంకము.



## ౧-వ స్థలము. లుబ్ధావధాన్లు పడకగది.

---

లుబ్ధావధాన్లు మంచముమీఁద పరుండివుండును. నిద్రలో అరచి, కాళ్ళూ చేతులూ కొట్టుకుని, లేచికూర్చుని వణక నారంభించును.

లుబ్ధా — అసిరిగా! అసిరిగా! అమ్మో! చంపేశాడన్నోయి. రామనామతారకం। రామనామతారకం। రామనామతారకం। రామనామతారకం॥ యిది రెండో పెళ్ళి ముండే. దీని మొగుడు పిశాచ మైనాడు-నా పీక పిసికి చంపేస్తాడు. యేవిఁటి సాధనం? రామనామతారకం। రామనామతారకం॥

(తలుపుఅవతలనుంచి) అసిరిగాడు - యేటిబాబూ? యేటిబాబూ? (తలుపుతట్టును)

మీనా — యేవిఁటి నాన్నా, తలుపుతియ్యి.

లుబ్ధా — (తనలో) కాళ్లు ఆడవు. చేతులు వొణుకుతున్నాయి. (తలుపుతీయును; అసిరిగాడితో) వెధవా నువ్వు లోపలకి రాకు.

అసిరి — నాను పిలుస్తాస్సినాను. (నిష్క్రమించును.)

(మీనాక్షి - శిష్యుడు ప్రవేశింతురు.)

లుబ్ధా — (మీనాక్షితో) ఆముండని అవతలుండమను.

మీనా — నువ్వు మనగదిలోకి వెళ్ళిలో అమ్మా (శిష్యుడు గది అవతలకివెళ్లును) యేవిఁటినాన్నా!

లుబ్ధా — యిహ, నేబతకను.

మీనా — యేవొచ్చింది నాన్నా, కడుపునొప్పా కాలునొప్పా?

లుబ్ధా — కడుపునొప్పీకాదు, కాలునొప్పీకాదు. వెధవముండని పెళ్ళాడిన కుంక పీడుగ బత్కడం యులాగ?

—యేవిఁటా వోగాయిత్యం మాటలు, నాన్నా ? మీకు యీలేనిపోని అనుమానం యెవరు పెట్టారు ?

—అనుమానవేఁవిటి ? నిజం, నిజం, నిజం - వూరంతా అదేమాట.

—యీరావఁవృంతులే యిలాంటి అపవాదలన్నీ వేస్తూవుంటారు. కనపడ్డ వాడితో అల్లావూసు పేడితే, వూరంతా అనుకోరు ? బంగారంలాంటి పిల్లని యిలాంటిమాటలని బెంబేలు పెట్టకండి. తండ్రి వెళ్ళిపోయినాడని అది రాత్రీ పొగలూ యేడుస్తూంది

—వెధవతండ్రీ, బోడితండ్రీని! గాడిదకొడుకు రెండో పెళ్ళిముండని నా పీకకి ముడేసి అమాంతంగా నాకొంప ముంచాడు. యిహ బతకను యిహ బతకను

—"రెండో పెళ్ళిముండ, రెండో పెళ్ళిముండ," అని శుభమల్లే అనకండి. మీరే యిలా చాటుతూవుంటే వూరంతా అనడం ఆశ్చర్యవాఁ ? మాట్లాడక వూరుకోండి.

—వూరుకోవడ వెలాగే ? మనవూరా, మనదేశవాఁ ? రెండో పెళ్ళి ముండ కాకపోతే ఆతండ్రి వెధవ, పేరయినా చెప్పకుండా పారిపోవడవేఁవిఁ ?

—సిద్ధాంతితో చెప్పాల్టే, పేరు ?

—వాడి శ్రాద్ధం చెప్పాడు. సిద్ధాంతి గడియకో పేరు చెబుతున్నాడు.

—అతగాడికి మాత్రం కొత్తవాడి పేరు జ్ఞాపకంవుంటుందా యేవిఁటి ? మన పిల్ల మనయింట్లో వున్నతరవాత, అతగాడి పేరుతో మీకేంపని ?

—యీ పెళ్ళాం ముండ నాయింట్లో వుంటే నేను చచ్చిపోతాను; మరిబతకను.

—వెర్రి కేకలెయ్యక నోరు మూసుకుని వూరుకోండి యిరుగుపొరుగు వారు నవ్వుతారు. మీ మావఁగారు యంతవంశీకుడు, యంతవొడ్డమనిషి ! లేనిపోని అనుమానాలు పెట్టుకోకండి. పసిపిల్ల బెంగెట్టుకోగల్దు.

—ఓసి భ్రష్టా ! వాడు నీకేవఁయినా యిచ్చాడా యేవిఁటే, వాణ్ణి వెనకేసుకు మాట్లాడుతున్నావు ? నీకు నేను చచ్చిపోవాలని వుందికాబోలు !

—యేవిఁటా మతిపోయిన మాటలు! అతగాడు రేపో నేడో వొచ్చి, యిలాంటి మాట్లన్నందుకు మన నోట్లో గడ్డిపెడతాడు.

లుబ్ధా—అతగాడెవడు. వొల్లకాట్లో రావఁనాధాయ? మరెక్కడొస్తాడు వాడు! యిహ, నాకు చావుసిద్ధం.

మీనా—మీకు చావేం వొచ్చింది యిప్పుడు? ఒకవేళ రెండోపెళ్ళి కిల్ల అయితే మాత్రిం, గుప్‌చిప్ అని వూరుకోవాలిగాని, అల్లరి చేసుకుంటారా? యీ జిల్లో యంతమంది రెండోపెళ్ళి చేసుకుని సుఖంగా వున్నారుకారు? కిల్ల బుద్ధిమంతురాలు. మీ ఆదృష్టంవల్ల దొరికింది. మాట్లాడక వూరుకోండి.

లుబ్ధా—నా అదృష్టం తగలబడ్డట్టేవుంది. నీకేం పోయీకాలం వొచ్చిందే! నువ్వు కూడా యీ కుటిలిలో చేరి, నీతండ్రికి కళ్ళుగప్పి వెధవ పెళ్ళి చేశావే? అయ్యో వెధవని పెళ్ళి చేసుకున్న కుంకవెధవా నీ బుద్ధెక్కడికి పోయిందిరా? నీ చదువెక్కడికి పోయిందిరా? నీవే దంతగలబడనూ - యిహ బతకను!

(మీనాక్షినవ్వును.)

లుబ్ధా—నవ్వుతావేఁవే భ్రష్టాకారముండా? నువ్వూ, నీసవితల్లీ నన్ను చంపేసి రాజమహేంద్రిం పారిపోయి, వెధవపెళ్ళి చేసుకుంటారు. నాకు తెలుసును. నీ శింగాడు అన్నమాట నిజం. వెధవని చెవిపెట్టానుకాను. నా సొమ్మంతా ఘటాశ్రాద్ధప వెధవల పాలవుతుంది. నువ్వుపో, నేను పడుకుంటాను (పక్కమీద పడుకుంటూ) మళ్ళీవొస్తాడు. గాబోలాఁ దేవుఁడా!

మీనా—యవడు నాన్నా?

లుబ్ధా—నువుపో, నీకెందుకు! ఆవెధవ నాపీక పిసికేస్తాడు. నీకోరిక తీరుతుంది.

మీనా—మీరలా అంటే నాకు యేడుపొస్తుంది. నేనిక్కణ్ణించి కదలను. యవడా పీకపిసికేవాడు?

లుబ్ధా—అయితే యిక్కడ పక్కేసుకుపడుకో.

మీనా—పడుకుంటాను యవడు మీపీకపిసుకుతాడు?

లుబ్ధా—ఆముండ మొదటిమొగుడే. యిందాకా నువురాకముందు, నాగుండెలమీదెక్కి, పీకపిసికేటప్పటికి ప్రాణం పోయిందనుకున్నాను.

మీనా—నిజంగానూ!—కలగన్నారుకాబోలు - నాన్నా.

లుబ్ధా—కలెక్కడికలే! పీక నులిచుకుపోతేనూ!

మీనా—మొదటి మొగుణ్ణి మీకేం తెలుసును?

—వాడే, చెప్పాడే! "వెధవా! నా పెళ్ళాన్ని పెళ్ళాడావు; నిన్ను చంపే స్తాన్నాడే.

—యలా వుంటాము ?

—శ్రీశంగాడి మూడు మూర్తులూ నే.

—కలగాబోలు నాన్నా, అదే తెలుచుకు పడుకుంటే, చిన్నబాబు కల్లో గొచ్చాడు కాబోలు.

—నేను చస్తే యవరికి విచారం !

—ఆపిల్లని వెళ్లి అడుగుదునా ?

—వొద్దు, వొద్దు, తొందరపడకు.

—నన్ను తిట్టేస్తున్నారు, దాని చచ్చిన మొగుడు మిమ్మలిని చంపేస్తాడని భయపడుతున్నారు. యెందుకింతంబళే అనుమానం ? ఓమాటు దాన్నేడిగేస్తే న్ననిజం తెలిసిపోతుంది.

—నిజం నీతో చెబుతుందీ ?

—నాతో నిజం చెబుతుంది. అది వొట్టి సత్యకాలప్పిల్ల నాకు యంతో వుప కారం చేసింది.

—దాన్ని పాడుచేస్తున్నావూ ?

—యిలాంటి మాటలంటేనే నాకు అసయ్యం. మీరు యక్కడో దడుసు న్నారు కాబోలు, అంచేత దుష్టుకల వొచ్చింది. అంతేగాని, రెండోపెళ్ళి, మూడోపెళ్ళి, అని, వెఱ్ఱులు వోడకండి. పూజారి గవరయ్యని పిలుస్తాను; వాడు యింత మంత్రించి వీబూదియిస్తాడు రాసుకుపడుకోండి.

—తొందరతీస్తావా యేవిటి? వాడొస్తే, వాడితో యేవని చెప్పడం ? దాన్నే టి అడుగుదూ.

—నే నడగను, నాన్నా, నన్ను అడ్డమైన మాటలూ అంటూంటే, నే నెందుకి అడుగుతానూ ? నేం దాంతో యిగమాట్లే అణ్ణా.

—ఆపిల్లనికాదు, అడుగమ్మా.

(మీనాక్షి పైకివెళ్లును.)

ఓపన్నం యాకర బెట్టేదా ? గాయత్రి స్మరణ చేసేదా ?

వేదాలూ, మహామంత్రాలూ, యీ దెయ్యాలకి పేలపిండి వొడియాలు, శాప మంత్రాలు ఉపదేశం అవుదాహంటే, బెడిసి గొడతా యేమో అని భయం. యేవిఁసాధనం ? "రామనామతారకం" స్మరణ చేస్తాను. "రామనామ తారకం । భక్తి ముక్తి దాయకం । జానకీమనోహరం । సర్వలోకనాయకం । రామనామతారకం । రామనామతారకం" యీగుండ యింట్లోవుంటే, పె... కను. "రామనామతారకం । రామనామతారకం" । రుద్రాక్షరతావళంయేదీ! (మంచము అంచునకూ మరి పరుపుకింద తడివిఁ, రుద్రాక్షరతావళం తీయుచుండగా మీనాక్షిప్రవేశించి.)

మీనాక్షి—మీమాట నిజవేఁ నాన్నా.

లుబ్ధా—నిజవేఁ !

(మంచముమీదినుంచి కింద కూలబడును.)

మీనాక్షి—(లేవదీసి) నాన్నా ! నాన్నా ! పడిపోయినా వేఁవి ?

లుబ్ధా—యేమీఁలేదూ. నిజవేఁ । నిజవేఁ !

మీనా—నిజవేఁను. ఆమొగుడు యిప్పుడే దానికియ్యాడా కనపడి, "ముండా, మళ్లీ పెళ్ళాడావే ? నీకొత్తమొగుణ్ణి పీకపిసికేస్తాను చూడు" అన్నాట్ట.

లుబ్ధా—అయ్యో ! అయ్యో ! రామప్పంతులు యిల్లు వొల్లకాడు కానూ ! యెవ్వడే కల్పించాడే యీమాయపెళ్ళి నాకోసం ! వీడి పిండాలు పిల్లులికి పెట్టా ! అయ్యో ! అయ్యో ! ఆమొగుడు వెధవయలా వున్నాడందే ?

మీనా—వాడు రోజూ దానికి కనపడతాట్టనాన్నా. వాడికి మీసాలూ, గిరజాలూ వున్నాయట, చావం చాయట.

లుబ్ధా—వాడే నే ! వాడే నే ! యేవిఁటే సాధనం ? యిహ నేం దక్కనూ.

మీనా—పూజారి గవరయ్యకి కబురు పెడతాను.

లుబ్ధా—వొద్దు, వొద్దు, నామాటవిను. వాడొచ్చాడంటే, యిల్లు తినేస్తాడు.

మీనా—[illegible] యేంచెయ్యాలి ?

—నాకొద్దంటూంటే వినవుగదా. నువ్వు నామంచం దగ్గిర పక్కేసుకు ; నువ్వు చదువుకునే భాగవతం పుస్తకం పట్రా; తలకింద పెట్టుకు పడు కుంటాను.

(మీనాక్షి వెళ్ళును.)

యీముండ నాయింట్లోంచి వెరగడైపోతేనేగాని, యీ పిశాచం వొదిలి పోదు. వేదం చదువుకున్న ముండాకొడుకని, నామీదే పడ్డతరవాత, వీడు బ్రహ్మరాక్షసిగాని, వొట్టిదెయ్యంకాదు. పోనీ, అతడికే ప్రార్థనచేస్తాను— "నాపెళ్ళాం మొదటిమొగుడా!" ఆఁ! నాపెళ్ళాం కాదు లెంపలు వాయించు కుంటాను "యీపిల్ల మొగుడా! నువ్వే నిజమైన మొగుడివి - నేనుకాను. దాన్ని ముట్టను—తాకను—దాంచేత చాకిరీ అయినా చేయించను. నన్ను రక్షించి, పీకపిసికెయ్యకు; పీకపిసికెయ్యకు; యేపాపం చేశానట్టో దెయ్యానివైనావు. నన్ను చంపావంటె బ్రహ్మహత్య చుట్టుకుంటుంది. మరిజన్మం వుండదు బాబూ! నాయనా! తండ్రీ! నాజోలికి రాకు. నీమావఁగారి పీకనులివెయ్యి! ఆరావఁ ప్పంతులుగారి పీకనులివెయ్యి! లేకపోతే, (కేకలు, యేడ్పు వినబడును) ఓరి దేవుడా, మళ్ళీ వొచ్చాడు కాబోలు (శిష్యుడు యేడుస్తూ పరిగెత్తివచ్చి లుబ్ధా వధాన్లును గట్టిగా కౌగలించుకొనును మీనాక్షి శిష్యుణ్ణి చీపురుగట్టతో కొట్ట బోవును. శిష్యుడు తప్పించుకోగా, దెబ్బలు లుబ్ధావధాన్లకు తగులును.)

—ముండా! నామోపటుకు అక్కడపడేస్తావా పడెయ్యవా! నాతాళం యేదేలంజా?

—నన్ను కొట్టేశావేవిఁటే? (శిష్యుడితో) వొద్దులు, వొద్దులు. నన్ను ముట్టు కోకే తల్లీ (మీనాక్షితో) దీని అపవిత్రపు వొళ్ళుతగిల్తే చచ్చిపోతాను. నన్ను వొదిలించెయ్యి.

(మీనాక్షి శిష్యుడి రెక్కలుపట్టిలాగి, బుగ్గగిల్లును. శిష్యుడు మీనాక్షీ చెయ్యికరిచి పారిపోవును.)

—దానమ్మ కడుపుకాల్చా, చెయ్యికరిచేసింది నాన్నా - రక్తం బొటబొట కారుతూంది - దీన్ని వాతవాఁరుస్తాను.

—యింత దారుణప్పని చేసిందీ, ముండ! యేదమ్మా చెయ్యి (గుడ్డపీలికతో రక్తం తుడిచి) మొహంలరడి రావుగదా యిక్కడికేవిటి?

మీనాక్షీ—అతండి(?)వెధవ నాకిమ్మని యీముండ చేతికే యిచ్చాడు. దీనినక్క వినయాలు చూసి నా పెట్టాబాడా దానికే వప్పజెప్పి, ఆమోహంలో దాన్నే దాచుకున్నాను. అను మానవేసి యిప్పుడు నాసొరు తెమ్మంటే, "బట్టల పెట్లో పెట్టాను తాళంపోయింది'' అంది. తాళం తాకపోతే రోకలితో బుఱ్ఱ చితకబొడుస్తాను.

లుబ్ధా—చెయిజేసుకోకు. నీది వెఱ్ఱికోపం చావగొట్టగలవు జాగ్రత!

మీనా—చస్తే యీడిచిపారేస్తాను. ముండముఖలా కరిచిందో చూడండీ. యింకా రక్తంకారుతూందీ. మనిషి కాటుకి మందులేదన్నాడు.

లుబ్ధా—కుంకం పెట్టమ్మా.

మీనా—దానిబుఱ్ఱ చితకిబొడిచి మరీ పెడతాను (మీనాక్షీ వెళ్ళును.)

లుబ్ధా—గుండుగొమ్మల అనుమానం తీరిపోయింది—పీకనులివీ, వాడైన చంపేస్తాడు, కరిచి అదైనా చంపేస్తుంది. పీడిచేతో, దానిచేతో, చావుతప్పదు యెంతడబ్బెట్టి కొనుక్కున్నాన్రా, యీచావుపెళ్ళి! అయ్యో! అయ్యో! దీన్ని పైకి తగిలేస్తే వాడుకూడా విరగడైపోతాడు. అదేసాధనం—యెక్కడికిలో లెయ్యను? బండీమీద యెక్కించి పట్నంలో లేస్తాను—అక్కడగానీ తండ్రివెధవ కనపడకపోతే మళ్ళీ దెయ్యాన్ని నెత్తినిపెట్టుకుని ప్రత్యక్షం అవుతుందే! బండి అద్దెయిచ్చుకోవడవేఁమిగుల్తుంది— యేమిసాధనం?—యేమిసాధనం?—రామప్పంతుల్ని సలహా అడుగుదునా? ఆఁ! మంచి ఆలోచన తోచింది—రామప్పంతులు నాకు కట్టిపెట్టిన యీముండని, వాడిదగ్గిరికే పంపించేస్తాను—సానిదాంతో పాటు దీన్ని కూడా వుంచుకుంటాడు—కావలిస్తే పదిరూపాయలు పత్తుణలో కూడా యిచ్చేస్తాను.

(మీనాక్షీ ప్రవేశించి.)

మీనా—యెక్కడా కనబడదు నాన్నా గుంట

లుబ్ధా—నూతులోపడ్డైదుగద?

మీనా—యేమో!

లుబ్ధా—పరిగెత్తెళ్లి గవరైని పిలవమను. దాన్ని నువ్వు చావగొట్టలేదుగద?

మీనా—కనపడితేనా?

లుబ్ధా—యేవింటినాయనా, యీకొత్త ఉపద్రవం!

(నిష్క్రమింతురు)

## ౨-వ స్థలము. రామప్పంతులు యింట్లో కొట్టుగది.

---

భుక్త, పోలిశెట్టి, సిద్ధాంతి, మధురవాణి పేకాడుచుందురు.

పూజారి గవరయ్య ఆట చూచుచుండును.

పోలిశెట్టి—యేంభ్రష్టాకారి ముక్కలు యేశావయ్యా! యెప్పుడూనువ్వింతేను.

భుక్త—మాసివేశానా యేవిఁటి? నీదరిద్రిదేవతని తిట్టు.

పోలి—గవరయ్యా, నీమూణుకు నాదగ్గిర యిలా యెట్టకు. లేచిపో, నీపుణ్యముంటుంది

గవ—నేను మా మధురవాణిదగ్గిర కూచుంటాను.

భుక్త—చూడూ, ముక్కలు తప్పు పడ్డట్టుంది.

పోలి—ఆఁ! బాపనయ్యా పంచాలని తప్పు పంచుతున్నావు. తప్పు పంచితే బేస్తు మీదకు దేలెట్టిస్తాను.

భుక్త—ముక్కలు బాగా పడలేదన్నావే?

పోలి—రెండో యేతనాలు గాసులడకూడదా?

భుక్త—పోలిశెట్టికి ముక్కలువేస్తూ, యిదుగో నాలుగాసులేస్తున్నాను. జుట్టు.

పోలి—నీయిమష చేత్తో యేస్తే, పొల్లుముక్కలే పడతాయి; మంచిముక్కలడతాయా?

భుక్త—తథాస్తు!

పోలి—అలా అనకు. యెంతశెడ్డా బాపనాడి శాపనాకారం మాశెడ్డది. (చూచుకొని) శి! భ్రష్టాకారి ముక్కలు!

సిద్ధాంతి—ఒకటీ, రెండు.

పోలి—అదుగో, అలాశెప్పితే నే వొప్పను, ఒక్కొకటి శెప్పాలి.

సిద్ధాం—అయితేవకటి

పోలి—ఒకటీ.

మధురవాణీ—ఒక్కటీ.

భుక్త—వకటి.

(సిద్ధాంతి ఆలోచించును.)

పోలి—యేఁ టాలోసిస్తావు చేతరన! యెత్తవయ్యా.

సిద్ధాం—నీదేంపోయింది! రెండు.

పోలి—లాంతరేశావు. యే పెత్తను? రొండు.

మధు—రెండు.

భుక్త—రొండు.

(సిద్ధాంతి ఆలోచించును.)

పోలి—యేఁ టాలోసిస్తావు? చేతరన; యెత్తి బేస్తుగెలుసుకో.

సిద్ధాం—నువు చెప్పావుగనక యెత్తుతాను.

పోలి—ఆఁ! డబ్బక్క డెట్టి మరీయెత్తు. మూడో యెత్తడపుబేస్తు; గ్యాపకవుందా? బేస్తుమీదకుదేలెట్టేఁ బాకీ లెట్టి, యెగెయడానికా?

సిద్ధాం—(తనముక్కలుయెత్తు ముక్కలమీదవేసి) కోవఁటాడి పిలకనిగుడుతూంది!

పోలి—తంతావాయేటి?

సిద్ధాం—తన్నడవఁంటే, ఒహలాగనా?

పోలి—నా ఆట శెడగొట్టేశావు, బాపనయ్యా!

భుక్త—ముక్కలు పడలేదని యేడుస్తూ, మళ్ళీ యేవిఁటి, ఆడ చెడగొట్టాడని యేడుస్తావు?

పోలి—యీ ఆట బేస్తుచేయిందకపోతే నా పేరు—

సిద్ధాం—కోవఁటానా, నోరు మూసుకుంటావా మూసుకోవా?

పోలి—తెల్లాడిబావుటా యెగురుతుండగా, నీజులువేఁటి? ముల్తిక్క్యాడం యింతో సేపైతే, మరాఁటేటి?

సిద్ధాం—నువ్వుగానీ మళ్ళీ మాట్లాడావంటే, ముక్కలు కలిపేస్తాను.

(పోలిశెట్టి "నేను మాటాడను; నువ్వు ఆడు" అని ప్రొజ్ఞ చేయును. సిద్ధాంతి ఆడును.)

పోలి—మూడే తురుపులుపడ్డాయిబాపనాడా: "తమాసాదేఖో, లంకకేరాజా!"

సిద్ధాం—ఆటపారెయనా?

పోలి—బుద్ధోంచిది; బుద్ధొచ్చింది. లెంపల్లో యింఛుకుంటాను. ఘురి మాటాడితోట్టు.

పూజారి—మా మధురవాణిమీద ఆశుకవిత్వం చెబుతాను.

రాణా, డైమనురాణీ ? ।

రాణా, యిస్పేటు రాణి ? రాణికళావ ।

క్లావా, ఆఠీన్రాణీ ? ।

రాణి యనవమ్మధురవాణె, రాజులరాణీ ॥

సిద్ధాం—గవరయ్యా ! యేంవిలవైన పద్యం చెప్పావోయి! నీమీద నేను పద్యంచెబుతాను - విను.

"గవరయ్యా ! నీసరి మరి ।
యెవరయ్యా ? "

పూజారి—"యెవరులేరు, యిచ్చోనయ్యా !

సిద్ధాం—యిదుగో రాజా.

పోలి—యిదుగో పాల్తు.

(మధురవాణి తరఫురాణీ వేయును.)

పోలి—అదుగో, అదుగో, యీ బాపనాడు కపీశం శెప్పి, మధురవాణిదగ్గిర రాణీ వుందని శెప్పేశాడు. గోరం, గోరం. గవరయగానీ మాటాడితే నే ఆటాణ్ణు.

పూజారి—పోలిశెట్టిమీద కవిత్వంచెప్పి చాలారోజులైంది. (పాడుంపేల్చి.)
"పోలిశెట్టిముఖము—పోలిశా క్లైనుబోలు ! పోలిశెట్టిముక్కు పాడుముడోకుక్క—॥"

పోలి—వొద్దు ! వొద్దు ! వొద్దు ! నామాటిను. పానం పెట్టి సంపేస్తావాయేటి! ఊరుకుంటె వొట్టాయినా, యిన్నావా ? యీ ఆట సిద్ధాంతి బేస్తైట్టి, నేను గెలిస్తే, నీకాఁండబ్బిస్తాను. మహూరుకో.

సిద్ధాం—నీసావతగలడా - తురుప్పు మిగిలిపోయిందె; బేస్తు. (ముక్కలు చూపించి పారవేయును.)

పోలి—ఆఁ ! మూడో యెత్తడబ్బేస్తు. గాచకాలుంచుకోం డయ్యా, చేతివారస, మంచిముక్కలెయి, బాపనాడా అంతసేపు కలపడవాఁ? గోరం, గోరం.

సిద్ధాం—బులబులాగ్గాకలిపి, బేస్తు నీకిస్తాననుకున్నావా ?

పోలి—తోలుసేత్తో, ముక్క—లేసిసావు! "నరిసింవ్వ, నీదివ్వె నామమంతరముకాక! నరిసింవ్వ నీదివ్వె—"

సిద్ధాం—దివ్వే లేదు, దీపంలేదు ముక్క—ల్తియ్యి.

పోలి—గవరయ్య ముక్క—లమీాప కన్నేసి సిల్లంగెట్టేస్తున్నాడు. నరిశింవ్వ నీదివ్వె—(ముక్క—లు యెత్తిచూసి) సీ! భష్టాకారి ముక్క—లేగావు.

సిద్ధాంతి—(పంపకంముగించి తనముక్క—లుతీసి చూమాకొని) వృత్తికాచమే!

పూజారి—పోలిశెట్టికి అంత అలకైతే, నే నింటికిపోయి పరుంటాను.

(గవరయ్య నిష్క్ర—మించును. మధురవాణి వెంటవెళ్ళి తిరిగివచ్చును)

పోలి—శని విరగడైపోయిందిరా, దేవుఁడా!—ఒట్టి భష్టాకారిముక్క—లు. ఒహటి.

మధు—ఒకటి.

భుక్త—ఒహటి.

సిద్ధాం—ఒహటి.

పోలి—రెండు.

మధు—రెండు.

భుక్త—రెండు.

(సిద్ధాంతి ఆలోచించును.)

పోలి—యెందుకాయెత్తాలోశన? నామాటిను. మూడో బేస్తెట్టకు.

(వీధి తలుపు తట్టబడును.)

మధు—పంతులు!

పోలి—యీావాళరాడని సెప్పితివే?

మధు—రారనుకున్నాను వొచ్చారు. యేం చేదాం?

సిద్ధాం—ఆటతీసెయ్యండి. (ముక్క—లుపడవేయును.)

పోలి—బేస్తెగెయడానికా? నే నొప్పను. మధురోణి, ఆటాడి మరీ తలుపు తియ్యి.

మధు—ముక్క—లుకిందబెట్టి, లేచి (సన్నని గొంతకతో) గోడగెంతి పారిపోండి.

భుక్త—దిడ్డితోవంట వెళ్ళిపోతాం.

—నేను పట్టనే ? యేటి సాధనం ?

—మేం దిడ్డీతో వంటపోతాం. నువ్వు అటకెక్కు.

—నన్నెక్కించి మరీ యెళ్ళండి. కాలుజారితే యేటిసాధనం ?

—నీకొడుకుని, అదృష్టం.

(పెరటిలోకి వెళ్లను.)

—గోరం ! గోరం ! గోరం ! యవడిముక్కాలో ఆశిపగ్గిరే ! అట కలపకండి.

(తలుపు తిరిగీ తట్టబడును.)

—పరిశింవ్వ, నీదివ్వె - -

(మధురవాణి ఉనుకొమ్మని కోపరసంగా సౌజ్ఞ చేయును.)

(సిద్ధాంతి ప్రవేశించును.)

—దిడ్డీతలుపు కప్పతాళం వేసుంది. మన్ని పట్టుగుంటావంనే, పంతులు దిడ్డీ తలుపు తాళవేశాడు.

—పరిశింవ్వ, నీదివ్వె——

—(పోలిశెట్టి ఉద్దేశించి) చప్ ! (సన్ననిగొంతుకతో) ఉలక్కుండా, పలక్కుండా గదిలో కూచోండి; ఆయన పరున్నతరవాత వచ్చి తలుపుతీసి వొదిలేస్తాను.

(మధురవాణి దీపములు ఆర్పి, పైకివెళ్ళి, గదితలుపువేసి గొళ్లెము బిగించును.)

(తలుపు తిరిగీ తట్టబడును.

—యేవీ గవరయ్య చావస్తం ! ఆజే తట్టడవా ? (సిద్ధితలుపుదగ్గిరకువెళ్ళి) యెవరు !

సకలమనిషి —యింత సేపేం ?

—నిద్దరబోతున్నాను.

—పేక ! పేక ! పేక ! నిన్నొదిలేస్తాను. నీసంగతి నాకు తెలిసింది.

—మరి, మీ మావాన్న మీరు పోయి, నిశిరాత్రివేళ వొక్కర్తైనీ నన్ను వొదిలేస్తే మా అడివి వూళ్ళో నాకు భయంకాదా ? అంచేత పల్లిగ్గా నలుగుర్నీ పిలిచి కాచుకున్నాను. తప్పేవుంది? మంచు పడుతూంది లోపలికిరండి (తలుపు తీసి) రండి. నా ఆట విరామండి నేను పరుంటాను.

మనిషి—సాందాన్ని యవడు నమ్మమన్నాడు? నీకిద్దామని సంతోషంతో వక సరుకు తెచ్చాను నీచర్య చూసేటప్పటికి నామనస్సు చివుక్కుమని పోయింది.

మధు—యెంత న్యాయంగా సంచరించినా, మీ హృదయంలో కాసింత కనికరం లేదు. గదా? యీ నాటినుంచి మీరు యెక్కడికి కమాను వెళుతూవుంటే, అక్కడ కల్లా నేనుకూడా మీతో వొస్తూవుంటాను.

మనిషి—మెడపైకివుంచు (మధురవాణి అటులచేయును అమనిషి మధురవాణి మెడలో కంటె వుంచును.)

మధు—ఔరా ! యిందిజాలి ! పంతులు గొంతుక యెలా పట్టావు ? నన్నే మోస పుచ్చితివే ? (రెక్కపట్టుకొని) గదులోకిరా. (గదులోనికి తీసుకువెళ్లను) యీచిల్లంగి కళ్ళు నీకే దేవుడిచ్చాడు? (ముద్దెట్టుకొనును) వాళ్ళింట యేవేవిం చిత్రాలు చేశావో చెప్పు.

శిష్యు—ముద్దెట్టుకోనంటే, చెబుతాను ?

మధు—నీకు తగనో ?

శిష్యు—ముద్దెట్టుకుంటే యెంగిలౌతుంది.

మధు—నిజం. నీకున్నబుద్ధి నీ పెద్దలికిలేదు. నన్ను నిష్కారణంగా భయపెట్టావు అందుకు నీ కేవింటిసిక్ష ? బుగ్గకొరికేతునా ?

శిష్యు—పాలూ పంచదారావుంటే ఇయ్యి.

మధు—తరవాత మేపుతాను, ముందు నీకు దాసరివేషం వేస్తాను. కొత్త అగ్రహారంపోయి నీగురువును చేయకుందుగాని. (తెరదించవలెను.)

(చీకటిగదిలో పోలిశెట్టి, భుక్త, సిద్ధాంతి వుందురు- తెర అవతలనుంచి రామప్పంతులు గొంతుకతో, శిష్యుడు "యీగదులో యవణ్ణో దాచావు".)

మధు—రామ ! రామ ! యవ్వడూ లేడు.

(పోలిశెట్టి నిచ్చెనయెక్కును. భుక్తికూడా యెక్కబోవును. నాలుగుమెట్లెక్కి యిద్దరూ కింద బడుదురు.)

పోలి—సంపేశివావు, బాపనాడా!

భుక్త—నామీద నువ్వుపడి, నేను వుక్కిరిబిక్కిరిఔతూంటే, నువ్వు నచ్చానంటావేవిఁటి? లేస్తావా కరిచేదా ?

శిష్యు—(రామప్పంతులుగొంతుకతో) అదుగో లోపల యెవళ్లోమాట్లాడుతున్నారు రంజా! ఆదికోపంటాడి గొంతుకలావుంది. కప్పతాళంవేసి వూరందరినీ లేవదీసు కొస్తాను.

మధు—కప్పతాళ వెందుకు? లోపల యెవళ్ళూలేరు దెయ్యాలకొంప - దెయ్యాలు పెబ్బలాడుతున్నాయి.

(మధురవాణి తలుపుతీసి గదిలో ప్రవేశించి అగ్గిపుల్ల వెలిగించును.

శిష్యుడు పక్కకి తొలగిపోవును.)

మధు—పోలిశెట్టియేమి, పడుకునిలేవడు - మేలుకొలుపులు పాడనా?

పూక్త—రామప్పంతు లేడీ?

మధు—రామప్పంతులూ లేడు, గీమప్పంతులూ లేడు యింట్లో పనిచేసేవాడు తలుపుకొట్టాడు. బెంగెట్టుకోకండీ.

పూక్త—అతగాడిమాటలు వింటే నే?

మధు—నేనే ఆయనగొంతుక పెట్టిమాట్లాడాను. యేమిధైర్యం! యేమి మగతనం!

పూ—"సరిశింప్వ, నీ దివ్వె" (లేచి) "నాపుమంతరము సేత"—యవడిముక్కలాడి దగ్గిరున్నాయీ?

(అంతా పళ్ళ ఆటకుకూచుందురు.)

రాం—ఆటకలిపేశాను.

పూ—గోరం! గోరం! నాకు యిసి పేటు ఆసు దాడపవొచ్చిందిగదా, బేస్తులు గెలుసు కుపోదునే! గోరం! గోరం! మధురోణి, ఒట్టినే బెంబేలు పెట్టేశింద అటక పడిపడి నడుంవిరిగిపోయిందిరా దేవుడా.

పూక్త—నీకిందపడి నేను వలిగిపోయినాను. నీకేం తీపు దిగదీసింది?

పూ—కలిపిరెయ్యేయియ్య - ముక్కలు.

రాం—నేను కలపను - నానొంకు అయిపోయింది - నువుకలుపు.

పూ—యే లైపోయింది?

(రామప్పంతులు వీధి తలుపుతట్టును.)

రా—లక్ష్మి, లక్ష్మి, తలుపు.

మధు—యీ మాట వంతు లే;

పోలి—యేటిసాధనం ?

మధు—గోడ గెంతి వెళ్ళిపోండి.

పోలి—నేను గెంతలే నే ?

మధు—నిన్ను యీగదిలో పెట్టి తాళంవేస్తాను.

పోలి—దీపం ఆరిపెయ్యి. నాకు బయవేస్తుంది.

సిద్ధాం—గాజు పెంకులు గుచ్చుకుంటాయి; గోడదాటడం యెలాగ ?

భుక్త—నాకు కాళ్లు మేహవాతం నొప్పులు. నేను గెంతలే నే ?

మధురవాణి(దీపవార్పి)—యిలాగే వుండండి.

పోలి—నరశింవ్వ,—

మధు—చప్ !

పోలి—సచ్చాను.

మధురవాణి (గదిగొళ్ళెంవేసి, వీధితలుపు గడియతీసి తలుపు ఓరగావుంచి)మాయగుంటని యెక్కడదాచారు?

రామ—మాయగుంటయేమిటి?

మధు—యేం నంగనాచే? లుబ్ధావధాన్లు మాయపెళ్ళాన్ని వాళ్ళయింట్లోంచి లేవదీసుకు పోయి యెక్కడపెట్టారు ? యిదేకదూ, రాత్రిల్లా మీరు చేస్తూవున్న లౌక్య వ్యవహారం ?

రామ—నీమాట నాకేమీ అర్థం కాకుండావుంది. యింట్లోంచి లేవదీసుకు పోవడ మేవిటి? నేను దాచడమేవిటి ?

మధు—దాస్తే దాచారు. దాచకపోతే మానారు. నాకంటేయేదీ ?

రామ—నీకంటా? మరిచిపోయి నానుసుమా.

మధు—యేమిచిత్రం! నన్ను మరిచారు - నావస్తువని, మరిచారు. మరిచి, ఆగుంట, కిచ్చారు. దాన్ని లేవదీసుకుపోయి యెక్కడో దాచి, సశిరాత్రివేళ పెద్దమనిషిలా, యింటికి వొచ్చారు!

రామ—ఆగుంటెట కనపడదో యేవిటి ?

పద్మ—యేమిటినాటకం! మీకు కనపడకేం? మీరు పెట్టినచోటే వుంది.

రామ—మీ నాక్షీ తన్నితగిలేశిందా యేమిటి? కంటెతో తగిలే నేవచ్చానే?

పద్మ—యేమినాటకం! ఛావండి; బతకండి; ఆకంకెడాండీ, గడపలో కాలు పెట్టనివ్వను.

(తలుపు వేయును.)

రామ—నాలుగుకోసులు గుఱ్ఱపసవారీ అయి, యీ దుకోపుని యిల్లుచేరుకుని, సమ్మంలో అడుగు పెట్టేసరికి, మబ్బులేని పిడుగుపడ్డది, మీనాక్షి ఆగుంటని మన్ననిస్తుందని, నేను యెన్నడయినా అనుకున్నానా యేమిటి? ఆగుంట పోతేపోయింది, వుంటేవుంది, నాకంటె పోకుండావుంటే అదృష్టవంతుణ్ణి. కంటె ఆడగడానికి వెళితే, "నువ్వే యీ పెళ్ళి కుదిర్చావు" అనికట్టుచ్చుకుంటాడేమో!

(నిష్క్రమించును.)

---

## 3-వ స్థలము. లుబ్ధావధాన్లు యింటివాకలి.

——:)o(:——

లుబ్ధావధాన్లు—(పచాయచేస్తూ.)

కనపడకపోతే యేమైనట్టు? నూతులోగానీ పడిందా? పోలీసువాళ్లు యిల్లుదోచేస్తారు. నూతులో పడలేదా? పడకపోతే యేమైనట్టు?—రావప్పంతులు యింటికి పోయుంటుంది అంతే కావాలి—యంత అందమైన పిల్లా! నాదిగాక దురదృష్టం! యంతట్లో వెన్నెల చీకటైంది! రేపో యెల్లుండో యెదిగొచ్చే పిల్లగదా అని సంబరపడ్డాను—ఒహవేళ,—అప్పుడే పెద్దమనిషైందేమో?—అందుకు సందేహవేలా? లాకుంటే యింత యేపైన పిల్ల పెద్దపడుచు కాకుండావుంటుందా? యిలాంటివి యెన్నిపెళ్ళిళ్ళు చేసుకుని యందరు మొగుళ్ళని కడితేర్చిందో! ఓరి కుంకపీనుగా, నీకళ్లు యేమైపోయినాయిరా? రజస్వలాముండని చూస్తూ, చూస్తూ యలా పెళ్ళాడావురా? మరి నీకు గతులు లేవు. రాజమహేంద్రివరంలో వెధవ ముండల్ని పెళ్ళాడినవాళ్ళ సామాజికంలో చేరావురా? ఆయ్యో! అయ్యో! దీనికి మరి ప్రాయశ్చిత్తం యకడిది? ఒహవేళ చేయించుకుందా వంటే, శంకరాచార్యులు పాదకట్నం పెట్టమంటాడు శాస్త్రులు యిల్లు తినేస్తారు. అంతకంటె పోలీసువాళ్లునయం. అల్లరికా

కుండా హెడ్డు చేతులో పాతిక రూపాయలు పెట్టి, రేపు రాత్రి బయల్దేరి కాశీ పోయి, గంగలో మునిగానంటే అన్ని పాపాలూ పోతాయి. కాశీవాసవే చేసుకుంటాను. భగవంతుడు బుద్ధొచ్చేటట్టు చేశాడు. లేకుంటే, ముసలివెధవకి పెళ్ళి చేసుకోవడపు పోయీ కాలవేవిఁ? అన్నివిధాలా యీ రామప్పంతులు నాకొంపతీశాడు.

(రామప్పంతులు ప్రవేశించి)

రామ—యేవిఁటీ మావాఁ రావఁప్పంతులంటున్నారు?

లుబ్ధా—యేవీఁ లేదూ.

రామ—యింత రాత్రివేళ పచారు చేస్తున్నారేవిఁ?

లుబ్ధా—యేవిూ లేదు—నిద్దరపట్టక.

రామ—మావఁగారూ, ఆకంటె యిప్పుడు తెస్మని మధురవాణి భీష్మించుకు కూచుంది? శ్రమ అని ఆలోచించక యిప్పించాలి.

లుబ్ధా—కంటేవిఁటి?

రామ—మీభార్యాకి పెట్టిన కంటెండీ

లుబ్ధా—నాభార్యాకి నేను పెట్టలేదు.

రామ—మీరు పెట్టమంటే, నేను యెరువు తెచ్చాను కానా?

లుబ్ధా—నేను పెట్టమన్లేదు.

రామ—అయితే దొబ్బేస్తావా యేవిఁటి? మీభార్యా మెళ్ళో యిప్పుడా కంటె లేదూ

లుబ్ధా—నాభార్యా యెవరు? నాభార్యా నాడేచచ్చింది.

రామ—మొన్న మీరు పెళ్ళిచేసుకున్న పిల్ల మీభార్యా కావటయ్యా?

లుబ్ధా—రెండో పెళ్ళిముండ నాకుభార్యా యేవిఁటి?

రామా—రెండో పెళ్ళిముండేవిఁటి?

లుబ్ధా—రెండో పెళ్ళిముండ అని నువ్వే అన్నావు?

రామ—మాటమీద మాటొచ్చి, వొట్టినే అంటే, అదో దెప్పా?

లుబ్ధా—వొట్టినే అనలేదు అట్టే అన్నావు. యిదంతా, అగుంటూరు శాస్తుల్లూ నువ్వూ చేసిన కుట్ర; నాకు నిజం తెలిసిపోయింది. ఆముండ నీ యింటికే వెళ్ళింది.

మధురవాణిని వుంచుకున్నట్టు దాన్నికూడా నువ్వే వుంచుకో. నాజోలికిం కు.
నీకు పదివేల నమస్కారాలు.

—నాకంట నాకేమ్యమంటే, యీవెఱ్ఱి వెఱ్ఱిమాట లేవిటయ్యా?

—నీమాయగుంటా, నీకంటూ, నీయింట్లో నే వున్నాయి.

—యీవేసాలు నాకు పనికిరావు. నిలబెట్టి నాకంటె పుచ్చుకుంటాను.

(తడిసినభాగవతపుస్తకంపట్టుకుని మీనాక్షీ, చేతులోకఱ్ఱా, నెత్తిమీద పసుపు రాసినకుండా, అంమమీద అఖండంతో ఆసిరిగాడూ, చేతిలో సీసాపట్టుకుని. తడిబట్టలతో పూజారి గవరయ్యా ప్రవేశింతురు.)

—హ్రాం! హ్రీం! హ్రూం! ఓంకార భైరవీ!

(రామప్పంతులు భయమును కనపర్చును)

క్షి—యక్కడా కనపల్లేదు నాన్నా, యీపుస్తకం నూతులోపడేశింది

(లుబ్ధావధాన్లు భయమును కనపర్చును.)

—కనపడకపోవడం యవరు?

—నాన్న విత్తల్లి—గవరయ బాబు నూతులోదిగి అంతటా గాలించాడు. నూతులోను కేవీం కనపడ లేదు.

(లుబ్ధావధాన్లు భయం తగ్గును.)

బ్రిహ్మరాక్షసిని గవరయ బాబు యీసీసాలో బిగించాడు నాన్నా.

(రామప్పంతులు సీసాకి యడంగా నిలబడును.)

—బ్రిహ్మ రాక్షసి యేవిటి?

—నేరే—ఓ బ్రిహ్మరాక్షసి వొచ్చి—మా అమ్మిని భయపెట్టింది.

—నన్ను కాదు - మా నాన్న పీకేపిసికింది.

—గవరయగారూ, పిల్ల యావైనట్టు?

-దాని మొగుడు యగరేసుకు పోయినాడు.

—యక్కడికి యగరేసుకు పోయినాడు? వాడు యీ సీసాలో నే వున్నాడన్నారే?

గవర—(కొంచం ఆలోచించి - చిరునవ్వునవ్వి) అదీ యీసీసాల్లో నే వుంది.

మీనా—మనిషి సీసాలోకి యలా వొచ్చింది?

గవర—అయ్యో సత్యకాలవాఁ! అది మనిషా అనుకున్నావు? అది కామినీ పిశాచం అంచేత నే నేను మీయింటికొచ్చి నప్పుడల్లా దూరంగా వెళ్ళిపోయేది, యేమి చెప్తాం, అనుకునే వాణ్ణి.

మీనా—యిద్దర్నీ ఓ సీసాలో పెడితే దెయ్యప్పిల్లల్ని పెడతారేమో?

గవర—పంతులుగారూ చిత్తగించండీ, రెండుమనుషుల బలువుందో లేదో చూడండీ.

రామ—మొర్రో! నాదగ్గిరకి తేకయ్యా.

గవర—అసిరిగా నువ్వు పట్టుకో.

అసిరి—నాకు బయవేఁటి? పైడితల్లి చల్లగుండాలి - (సీసాపట్టుకుని) ఓలమ్మ! యెంత బలువుందో స్సి!

గవర—సీసా, అఖండం, తులిసికోట దగ్గిరదించు

లుబ్ధా—బాబ్బాబు! సీసా నాయింట్లో పెట్టకు. మీయింట్లో పెట్టించండి.

గవర—మాపిల్లలు తేనెసీసా అని బిరడా తీసినట్టాయనా, రెండు దెయ్యాలూ వొచ్చి మళ్ళీ మీయింట్లోనే వుంటాయి.

లుబ్ధా—అయితే, సీసా భూస్థాపితం చెయ్యండి

గవ—భూస్థాపనం మజాకాలనుకున్నారా యేమిటి? భూస్థాపితం చెయ్యడానికి యెంత తంతుంది! పునశ్చరణచెయ్యాలి, హోమంచెయ్యాలి, సంతర్పణచెయ్యాలి.

లుబ్ధా—నాయిల్లు గుల్లచెయ్యాలి!

గవ—మీకలా తోస్తే నాకేంపోయింది? యీ మూతతీసేసి, నామానాన్న నేను వెళ్ళిపోతాను.

లుబ్ధా—మూతెందుకు తీసెయ్యడం. నాకుకలిగినది తృణమో ఫణమో యిస్తాను. ఆమూత తియ్యకుండా ఆసీసా అలావుంచివెళ్ళండి.

పూజారి—యేవిఁ అవధాన్లుగారి గడుస్తనం! నేపోగానే పాతిపెట్టడానికా యెత్తు! ఆసీసా తగిన శాంతిచెయ్యందీ భూస్థాపితం చేశారంటే, నేను రౌరవాది నరకాలకి పోనా? యిప్పుడె బిరడా తీసేస్తాను.

లు. భ్దా—తియ్యకు, తియ్యకు, రేపు [illegible]

—అష్టాగై తే, యీ రాత్రిల్లా యీసీసా దగ్గిర పెట్టుకు పెరట్లో పడుకుంటాను.
...వెళ్ళి నిర్భయంగా పడుకుని నిద్రపోండి

(నిష్క్రమించును.)

—మావాఁ! ఓ మాట.

(రామప్పంతులూ, లుబ్ధావధాన్లూ పక్కను వెళ్ళి మాట్లాడుదురు.)

—నాకంటె మాటేవిఁటి, మావాఁ?
—మీకంటె మీయింట్లో నేవుంది.
—మీ పెళ్ళాం మాయింటికి వెళ్ళిందని మీరంటున్నారుగాని, అక్కడికి ఆపిల్ల రాలేదు కంటా తాలేదు.
—అయితే యేవైఁందో! నాకేం తెలుసును?
—వొద్దు సుమండీ - నాకంటె నాకిచ్చెయ్యండి—నేను మాకానివాణ్ణి.
—కంటె, గింటె, నాకు తెలియదు.
—నీకు తెలియకపోతే మరెవరికి తెలుసును? గవరయ్య, నీపెళ్ళాం దెయ్యావైఁందన్నాడుగదా? నువ్వూ నీకూతురూ కలిసి దాన్ని చంపేశారుకాబోలు.
—ఓరి! గాడిదకొడుకా (కఱ్ఱతో కొట్టబోవును.)
—నాకంటె అపహరించావుగదా? నీపని పట్టిస్తాను వుండు. (నిష్క్రమించును.)
—(తనలో) కంటె యావైనట్టు చెప్మా? (పైకి) అమ్మా!
—యేం నాన్నా?
—కంటె యేంజేసింజే?
—యేంజేసిందో? పెట్లో దాచిందేవోఁ? దాని వొంటినే వుందిగాబోలు నాన్నా?

—వొంటినుంటే—దెయ్యానికి కంటెందుకూ?
—యేం? తీపుదిగడిసిందా యేవిఁటి? పెట్టుగుంటుంది.
—మాతులోజెగి గవరయ్య నుయ్యంతా గాలించాడూ?
—గడియసేపు గాలించాడు.
—నువు చూశావూ?

మీనా—చూశాను.

లుబ్ధా—అది రామప్పంతులు యింటికే వెళ్ళిందేమో నే?

మీనా—సవరయి బాబు, సీసాలో బిగించాముగదా యలా వెళుతుంది?

లుబ్ధా—యేమో నాకేంపాలు పోకుండా వుంది. రా వెతుకుదాం - మనపాల్రిద్ధం యిలావుంది.

(నిష్క్రమింతురు.)

---

# 4వ స్థలము. రామచంద్రపురం అగ్రహారంలో సారాదుకాణం వెనకతోట.

---:o:---

[ఆతోటలో కాళీమందిరం యెదటి మంటపం. మంటపంలో కాళీ విగ్రహానికి యెదురుగుండా ఒక పెద్దపీటమీద మూడు సీసాలతో సారాయి; చుట్టూ గళాసులు, పీటనిండా పువ్వులదండలు, మంటపంలో వకనైపు పులిచర్మంమీద యోగదండమును ఆనుకొని సమాధిలో వున్న వొక బైరాగి; యోగిని యొకతె సారాయి అందరికీ అందిచ్చును. గ్రామమునసబు సోమినాయుడు చిలుం పీల్చుచుండును. పోతాని మనవాళ్ళయ్య, జంగం వీరేశ, దుకాణదారు రామందాసు చెదిరికూర్చుందురు ]

మునసబు—ఆకాశం ముందుపుట్టిందా? బూమి ముందుపుట్టిందా?

మనవాళ్ళయ్య—సుత్తిముందా కారుముందా?

మునసబు—పంగనామాలుముందా వట్టెవాదలనామాలుముందా? నామాలోడా నానవాలేటి? నీబుర్రాబేటి? ఆకాశానికి మట్టాబూమి? బూమికి కప్పా ఆకాశం? సదువుకున్నోడెవడో సెప్పండొస్సే.—

మనవాళ్ళయ్య—ఆకాశంబు సూన్యంబు అనగా యేమీ లేదన్నమాట.

మునస—యేటీలేదా? గుడ్డోళ్ళకి యేటీలేదు. తెల్లోడు యెర్రోడా? పట్టంలో, గొట్టావెట్టి అదేసూస్తాడే ఆకాశం కాసి?

మనవాళ్ళయ్య—శాస్త్రంబులలోని రహస్యంబులు మ్లేచ్ఛులకెట్లు తెలియును?

—అల్లాండం, బెల్లాండం, శక్కరపొంగలి తినడవనుకున్నావా, సాపులోడా? తెల్లోడి మహిమ నీకేటి తెలుసును! తెల్లోడిసారాయికి తెనుగోడిసారాయికి యెంత భేదంవుంతో, తెల్లోడికి నీకూ అంత భేదంవుంది.

—గణితశాస్త్రంబునం దాకాశంబనసున్న-సున్నయనశూన్యంబు-యేమిటి వన్న మాట.

—చాతిరింలో మన్ను, మిన్ను, అని అన్నాడుకాడా? మన్ను లేదా? మన్నుంటే మిన్నుండదా?

—యీరేచ మా మేలయిన పలుకు పలికినాడు.

—"ఆకాశం బొక్కపడ్డది!" అంటునుగదా, ఆకాశం లేకుంటే బొక్కపడ్డవెలాగ?

—శభాసు యీరేచ! నామాలోడు పలకడేం? నోరుకట్టడ్డది.

—(శంఖం పూరించును.)

—(దుకాణదారునితో) యేవిటి అల్లరిభాయి?

—యీరేచం గెల్చుకున్నాడుగదా, చంకం వాగించడా?

దుకాణదారు—యోగీగారు సవాడికి బంగంవొస్తే శపించిపోతారు?

—(కళ్ళు తెరచి) శివబ్రహ్మం! శివబ్రహ్మం! శివోహం!

—మా చావు నేస్తం, చిపబెస్తం అన్నారు.

—రామబ్రహ్మం! రామబ్రహ్మం! రామోహం!

—మొదటిమాటను రెండవమాట రద్దుచేయును. రామానుజ! రామానుజ!

—చివచివా! చివచివా!

దుకాణదారు—యెందుకు కొట్లాడతారు. నీశివుడూ నిజవేఁ. అడుగో ఆశీసాలో మెరుగుతున్నాడు. నీరాముడూ నిజవేఁ. అడుగో ఆశీసాలో యెలుగుతున్నాడు. లేదా తత్తం?

గాజుకుప్పెలోన గడగుచుదీపంబు ।
యెట్టులుండు గ్యానమట్టులుండు ।
తెలిశినట్టివారి దేహంబులందును ।
యిశ్వదాభిరామ యినవె వేమా ॥

బైరాగీ—సత్యం, సత్యం.

దుకాణదారు—గురోఁడీ! తమకి అంతాయిళదవేఁ! దేహం గాజుకుప్పె, దేహంలో వుండేది పరమాత్మ! గాజుకుప్పెలో వుండేది అన్నసారం. యీ అన్నసారం దేహంలో పడితేగాని పరమాత్మ పెజ్జిలించదు. యేం శెలవు?

బైరాగి—యీ పరమరహశ్యం నీకు యెలా తెలిశింది తమ్ముడా? .

దుకా—తమవంటివారి దయివల్లగురూ! (నలుగురివైపూ చూసి) చూశారాబాబూ నేను యెప్పుడూ యీమాటేగదా చెపుతూవుంటాను? అఖాడాకి వొస్తేగాని పరబెహ్మం పట్టుపడ్డం యేలాగు?

బైరాగి—అమృతమనేది యేమిటి? సారాయే! నాడు యిదేగదా తాగడానికి దేవాసురులు తన్నుకుచచ్చారు?

వీరేశ—చివచివా! చివచివా!

మనవాళ్ళు—రామానుజ - రామానుజ!

మునస—కాట్లాటమాని ఘానం యినండొస్సె, యెత్తిగోల్లోళ్ళు.

హెడ్డు—గురూ, మరివొక రసలింగం చేయించి, శిష్యుడికి దయచెయ్యాలి.

బైరా—అలాగే.

మునస—గురూ! బంగారం సేస్తారుగదా, అదెట్టి హరిద్వారంలో మటం కట్టించక మాలాటోళ్ళని డబ్బెందుకడుగుతారు?

బైరా—మేం చేశే స్వర్ణం మేమే వాడుకచేస్తే తప్పగిలిపోతుంది.

హెడ్—అవివేరే రహస్యాలు వూరుకోండి మావా! గురోఁడీ! హరిద్వారంలో చలి లావుగాబోలు?

బైరాగి—నాకులక్కద్దు—మాబోటి సిద్ధులకు, చలీ, వేడీ, సుఖం, దుఃఖం, యెక్కడివి—

హెడ్—ఆహా! అవృష్టవంతులె సిద్దులద్దె అదృష్టం.

మునస—గురు, హరిద్వారంనించి యెప్పుడు బైలెళ్ళోరు?

బైరా—రెండుఘోజులయింది. మొన్న ఉదయం ప్రయాగ, నిన్న వుదయం జగన్నాథం శేవించాం. ఖేచరీగమనమ్మీదఆకాశమార్గాన్న పోతూవుండగా మీవూరి అమ్మవారి పనదగ్గిర గమనం నిలిచిపోయింది. యేమిచెప్మా? అని యోగదృష్టిని చూచేసరికి అమ్మవారి విగ్రహంకింద ఆరు నిలువులలోతున, మహాయంత్రం

కొకటి స్థాపితమై కనపడ్డది. అంతట భూమికి దిగి, అమ్మవారిని సేవించుకొని ప్రదక్షిణంగా పోదామంటూంటే యీభక్తుడు నన్నుల్నిపోల్చి నిలిపేశాడు.

ఫకీ—చూడగానే, నేను సిద్ధుల్ని పోలుస్తాగురూ—

నవాబు—సుక్కే—నేనోళ్ళని మాబాగా పోలుస్తావు. మాపూరమ్మోరు జగజ్జనని! మా కన్నతల్లి.

గోసా—బలిహ్మాహం! బలిహ్మాహం!

హరి—ఆహా! యోగమహత్యం! స్థానాల్చేసి, ముక్కుబిగించే బ్రాహ్మలకి లేవుగదా యీ సిద్ధులూ?

గో—వేషానికీ—జ్ఞానానికీ, దూరంకాదా తమ్ముడా? మాతాతగారు చెప్పలేదా? "ఆత్మశుద్ధిలేని యాచారమదియేల'' అని?

హరి—వేమన్న—తమతాతా, గురూ?

గో—అవును—వారు పరంపదించి ఆరువొందల సంవత్సరాలుకావొచ్చింది.

హరి—తమవయస్సెంతగురూ?

గో—అదీ అంతూలేనివానికి లెఖ్ఖేమిటి తమ్ముడా? పరమాత్మకెన్నేళ్ళో అన్నేళ్ళు.

నవా—యేం యిలవైన మాటలింటున్నాం!

(ఫ. రేశ శంఖం పూరించును.)

హరి—(శంఖంలాక్కొని పక్కనువుంచి) అట్టేపట్టెయ్యకండి భాయి.

ఫకీ—అట్టే యెక్కడభాయీ? పరవశవైందాకా తాక్కుంటే తాగడమేటి? వేమన్న చెప్పలేదా?

"తాగి, తాగి; తాగి, ధరణిపైబడుదాక।
తాగనేని తన్ను, తాను తెలియు।
తాగలేనివాడె, తాగుబోతరయంగ।
యిశ్వదాభిరామ యినరవేమ॥—

గోసా—కాశీలో రెండువందల యాభై సంవత్సరములక్రిందట అలంగీర్ పాదుషావారి హయాంలో, ఒకసేటు మాబోటి సిద్ధులనందరిని కూటానికి పిలిచాడు. గంగనడిమిని పడవమీద పీపాలలో సారాయి భరాయించి, బంగారపుగిన్నెలతో అందిచ్చాడు. రెండుఝాముల రాత్రి అయేసరికి పీపాలు కాలీ అయిపోయినాయి. అంతా పడిపోయినారు.

హెడ్డు—యేమి ఆశ్చర్యం?

బైరా—మేమూఁ ఒక్క నేపాళపు బ్రాహ్మడూ మిగిలాం. "తే! తే!" అన్నాడు ఆబ్రాహ్మడు. "తెస్తావాశకించేదా" అన్నాడు. శెట్టి యెక్కడ తెస్తాడూ! వాడు మాకాళ్లు పట్టుకునేటప్పటికి సర్వా లేదు నిలవమని చెప్పి, మేము ఒక పుణిక మంతించి, గంగభరాయించినకొద్దీ ఆగంగ సారా అయిపోయింది. ఆ బ్రాహ్మడు సహస్రపుణికలుతాగి జిఱ్ఱున తేన్చాడు. బ్రాహ్మల్లోకూడా మహాత్ములుంటారు. కనుక్కోగలిగినజ్ఞానికి గంగానది అంతా సారాయికాదా?

మునస—రామందాసోహాడు, గంగ బరాయించడానికి గురువు; ఒకదరావృకి పద్దరావుఁలు సేనుస్తాడు

(హవల్దారు అచ్చన్న ప్రవేశించును.)

దుకా—గురూ వీరు హవల్దార్ అచ్చన్నగారు. మంచిగ్యాని. మునసబుగారికి మేనల్లుడు.

హవల్దారు—రామ్! రామ్!

బైరాగి—రామ్! రామ్!

హవల్దారు—(యోగినితో) పిల్లాహాలు క్యాలావ్. (హెడ్‌తో) భాయీ గుంటూరు శాస్తుల్లుగారి పత్తాయేమైనా తెలిశిందా?

హెడ్—లేదుభాయి.

దుకా—రామప్పంతులంటాడు—పెళ్ళికూతురు రెండోపెళ్ళి పిల్ల—దాన్ని అన్నిడబ్బు చెయ్యిచిక్కించుకుని—

హెడ్—ఆమాటలు మనకెందుకు భాయి?

మునస—పోలీసోళ్ళకీ అక్కర్లేక, బాపనోళ్లకీ అక్కర్లేక! యెదవముండని బాపనాడు పెళ్ళిశేసుకుంటే లోకంఅకతా వూరుకోవడవేఁనా?

హెడ్—డబ్బు యిచ్చినవాడికీ, పెళ్ళి ఆడినవాడికీ లేనిచింత మనకేలమావాఁ? కాక, యీరోజుల్లో బ్రాహ్మణ్యం యెక్కడుంది యెక్కడచూశినా పిల్లల్ని మునలాళ్ళకి అమ్ముకోడాలు—రండాగర్భాలేకదా?

హవ—కలికాలంగదాభాయీ? యెంతచెడ్డా బ్రాహ్మలు మనకి పూజ్యులు

హెడ్—అన్నా, యనకంతవారు, వారు జ్ఞానం, నీతీపరిధానంగాని, జాతిలో యేవుంది? వేమన్న యేవన్నాడు?

మునస—యెవఁన్నాడేవిఁటి? పాలోణ్ణి, ఘానుక్కి పారోణ్ణి అడగమన్నాడు.

హెడ్—మావాఁ! వెక్కిరించండిగాని, నేను యెన్నితాలూకాల్లో నౌఖరీచేశానో అన్ని తాలూకాల్లో నూరండాగర్భాలు యెన్నని చెప్పను? నన్నడిగితే వెధవలు పెళ్ళిచేసుకోవడవేఁ ఉత్తమం అంటాను మానూపరెంటు పిల్లలతో వున్న రెండో పెళ్ళి దొరసాన్ని పెళ్ళాడి సుఖంగా వుండలేదా?

మధుర—మావఁగారి అభిప్రాయం, పెయ్యతోటొచ్చిన ఆవు మేలుకాదా అని? అంతకనే; ముసలిబాపనోడు యెధవగుంటని పెళ్ళాడితే. మీ నేస్తం కరణపోణ్ణి, ఆ ముసలాడి యెధవకూతుర్ని పెళ్ళాడమని బోదసెయ్యరాదా?

హవ—మనకేలమావాఁ? గవునర్ మెంటూ, దేవుళ్ళూ, (బాహ్మలూ-వారి నేరాలువారివి-వాటితో మ కిచని లేదు. మనభక్తి మనకుండాలి (హెడ్‌తో) భాయీ, తెల్లానల్లా వొకటా?—తెల్లవాడికి క్రీస్తు వొకపద్ధతి పెట్టాడు ముసల్‌మాన్‌కి పైగంబరు వొకపద్ధతి పెట్టాడు. నల్లవాడికి రాముడు వొకపద్ధతి పెట్టాడు. భగవంతుడు తెల్లవాడితో యేవఁన్నాడూ? వెధవని పెళ్ళాడు అన్నాడు. రాముడు తెనుగువాడితో యేవఁన్నాడూ? వెధవని పెళ్ళాడొద్దన్నాడు. చెప్పన్న దేశాలూ చూశాను భాయీ. పరిపరివిధాలు ఆచారాలు, వ్యవహారాలు వున్నాయిగాని నీతివకటే, భగవంతుడొకడూ, అంతటా వక్కటే.

మధుర—రాముడు యెధవ ముండల్ని కానిపనులు సెయమన్నాడూ? మన్లో మాటపను వుండేవి కావా?

హవ—ఛీల్లా, చిలుం భరాయించి, తే

మధుర—నామాలోడు మూలకి తీసికెళ్ళి పిల్లని ముద్దెట్టుకుంటున్నాడు.

యోగిని—(చెయ్యి విడిపించుకొని సిగ్గుతో) ఏకాంత ఉపదేశం చేస్తున్నారు.

మధుర—యేటో ఆవుప్పదేశం? తనేంట వాయియే గంగారమ్మనా?

హకా—యేవిఁటిభాయీ, అనరానిమాట్లు అంటున్నారు. మనయోగిని పరమభక్తురాలు.

మధుర—లెంపలోయించుకుంటాను. పిల్లా! ఆనామాలోడు సెప్పిన ఉప్పదేశవేటో, నా సెవ్వులో కొంచం సెప్పరాదా?

(యోగిని సారాగళాసు హవల్దార్ యెదటవుంచును.)

మధుర—నామాలోడి వుప్పదేశంతో పిల్లకి మతోయింది.

యోగి—హవల్దారుగారు అమృతం సేవించరా?

హ—(చిరునవ్వు నవ్వి) తాకక సోజరువాడు చెడ్డాడు. తాగిసిపాయివాడు చెడ్డాడు, జ్ఞానికి జ్ఞానపత్రి), తాగుబోతుకు సారాయి

మునస—పించను పుచ్చుకుంటివిగదా, యింకా సిపాయీనా సెయ్యాల్నుంటా అట్లు డోడా ?

హవ—కుంపిణీ నమ్మక్ తిన్నతరువాత, పాిణంవున్నంతకాలం కుంపిణీ బావుటాకి కొలువుచెయ్యాలి. రేపు రుషియాతో యుద్ధంవొస్తే పించను ఫిరకాయావస్తు బుజాన్ని తుపాకీ వెయ్యమా ?

మునస—రుస్సానోళ్లువోడ నీళ్లోములిగి నడస్తారిగదా, నువ్వు తుపాకుతో యవణ్ణి కొడతావు ?

హవ—మొన్నగాక మొన్న యింగిరీజ్ రుషియాదేశానికి పండెత్తిపోయి, రుషియాని తన్ని తగలలేదా? అప్పుడేమైందో, యిప్పుడూ అదే అవుతుంది. మారాణీ చల్లగావుండాలి.

దుకా—సీమరాణీ ఆకాళీమాయి అవుతారంకాదా ?

హవ—కాళీ, గీళీ, జాంతేనై-ఆరాముడి అవతారం.

దుకా—గురూ—హవల్దారుగారు తత్తకీర్తనలు మాయింపుగా పాడతారు, (యోగినీతో) తల్లీ, నా తంబూరా తెచ్చి భాయిగారికి ఇయ్యి.

మునస—యీతూరి, యీరేచ వుప్పదేశం చేస్తున్నాడు.

దుకా—గొప్పవారున్నప్పుడు ఆస్యాలేటి భాయీ ?

మునస—వున్నమాటాడితే ఆసాలా ? నాకెవరూ సెయడేం వుప్పదేశం ? యీరేచ వుప్పదేశం గట్టిగాబిగిసింది, మరిసెయ్యొద్దల్లు—

(యోగిని కష్టంమీద చెయ్యి వొదిలించుకొని తంబురా తెచ్చియిచ్చును)

దుకా—అవన్నీ గ్యానరహస్యాలు. బ్రెమ్మానందమంటే యేటి ? కడుపునిండాసారా; ముక్కునిండా పొగ; పక్కని పడుచుపిల్లాకదా ?

మునస—ఘానం యినండొస్సి—

హవ—పామరం ! పామరం ! రాముడుపరం కాళీ నెత్తిమీద పెట్టకపోతే కుంపిణీ సిపాయన్నవాడు యిక్కడికి వొచ్చునా ?

హెడ్—భాయి! ఓకీర్తన శలవియ్యండి.

(హవల్దారు పాడును)

పింజర్కెరహకర్ ఛుప్నై రహ్నా

క్యారేబుల్బుల్ కహా ముల్కుసునా ॥ క్యారె॥.

యొక్కడికెళ్లావు! యేమి చెప్పను, [illegible]!

(వీ కేళ శంఖం మనవాళ్ళయ్య తీసి పూరించును.)

హెడ్—(పాటమాని, తంబూరా క్రిందబెట్టి) గద్దా!

హెడ్—(శంఖంలాక్కొని) శంఖం అగ్గిలో పడేస్తాను యెందుకు తెనిస్తావు భాయి

ఫకీ—వొద్దంటే వినదు.

హెడ్—వినకపోతే దుకాణానికి రానియ్యకండి. అల్లరైతే మాకు మాటకదా?

ఫకీ—పదిశంకాలు దాచేశాను; మళ్ళీమళ్ళీ తెస్తాడు. యేంజెయ్యను. జేరంగదా భాయీ?

మునస—దిట్టంగా పట్టెయి. తత్త్వఘ్నానంతల కెక్కాలి!

ఫకీ—(తంబురా తీసిపాడును)

నాగాదిగురా । నాతండ్రిదిగురా ॥
దిగుదిగు నాగన్న । దివ్యసుందరనాగ ।
ముదముతో రేపల్లె । ముద్దులనాగ ॥
ఊరికిఉత్తరాన । ఊడలమఱ్ఱికింద ।
కోమపుట్టలోని । కోడెనాగన్నా ॥—

(పాడుచుండగా రామప్పంతులు ప్రవేశించి యెడంగా నిలిచి యోగినికి సౌజ్ఞ చేయును. యోగిని రామప్పంతులితో మాటలాడివచ్చి హెడ్ చెవిలో రహస్యం చెప్పును)

మునస—పిల్ల, హెడ్డుగారికి వుప్పదేశం చేస్తూంది. మునసబ్బనా—

యోగిని—(మునసబు చెవిదగ్గిర నోరుపెట్టి చెకిగిల్లును)

మునస—పిల్లా! సాంబ్రాజ్యమైంది మునిసిబు నాయుడికి యీపాటి వుప్పదేశంతగిలి—

(హెడ్డుకనిష్టీబు రామప్పంతులు దగ్గిరకువెళ్ళియడంగా యిద్దరూ మాటలాడుదురు)

హెడ్—కొత్తవారు యవరూలేరే! బావాజీ గారు వుంటే మీకు భయవేఁవిటీ?

రామ—కొత్తా, పాతా, ఆలోచించుకోలేదు కొంపమునిగింది. మీసాయంకావాలి.—

హెడ్—డబ్బైవైఁనా పేల్తుందా?

రామ—మీ చాతైతే, పేల్తుంది.

హెడ్—యేమిటొచ్చిఁదో చెప్పు.

రామ—లుబ్ధావుధాన్లు పెళ్ళాడినగుంట మధురవాణి తలూకుకంటె తీసుకుని యెక్కడో పారిపోయింది.

హెడ్—యెందుకు పారిపోయిందో ?

రామ—మీనాక్షి చావగొడితే పారిపోయింది. యెక్కడవెతికినా కనపడలేదు. ముందు మీజవాన్లని దౌడాయించండి.

హెడ్—యీరాత్రివేళ మాజవాన్లుమాత్రం పట్టుకోగలారి? పోలీసు జవానంటే పదికళ్ళూ పదికాళ్ళూ వుంటాయనుకున్నావా యేమిటి ?

రామ—దానిసిగ్గోసిరి; దాన్ని పట్టుకోవడం నాకెందుకు, నాకంటె సాక్ష్యం చెప్పించండి!

హెడ్—యేమిటి నీమాటలూ! అకంటెపెట్టుకు ఆపిల్ల పరారీ అయిందని చెప్తివి, నేనుకంటె యెలా యిప్పిస్తాను ?

రామ—ముసలాణ్ణి అడిగితే, అది పట్టుకుపోయిందంటాడు; గాని నిజంగావాడు పెట్టెలో దాచేశి యివ్వకుండా వున్నాడు.

హెడ్—నన్నేంచెయ్యమంటావు?

రామ—కూనీకేసని ముసలాణ్ణి బెదిరిస్తే, నాకంటే నాకిచ్చేస్తాడు; మీచెయ్యీకూడా తడౌతుంది.

హెడ్—అలాగనా - గాని నువ్వన్నట్టు ఆపిల్లగానీ, కంటెపెట్టుకు పరారీఅయి పోయివుంటే —

రామ—పోనీండి—దానిఖరీదు యిప్పించెయ్యండి.

హెడ్—వాడిస్తాడా ?

రామ—మరి మీసాయం యెందుకు కోరాను ?

హెడ్—యిస్తాడని నాకునమ్మకంలేదు. ఐనా చూస్తాను, కేసనియెత్తు యెత్తడానికి యిద్దరు ముగ్గురు సాక్షులుండాలి ?

రామ—మందిరంలో వున్నవాళ్ళో ?

హెడ్—పిరేశం, మనవాళ్ళయ్యా, మూడోకాలంలో వున్నారు. హావల్దారు అబద్ధం ఆడమంటే తంతాడు. మునసబునాయుడు యింతరాత్రివేళ అంతదూరం నడిచి రాలేడు, యిహ ఆడనూ పాడనూ రామందాసు వొక్కడేగదా ?

రామ—ఆబైరాగాడు సాక్ష్యం పలకడేం ?

హెడ్—వేసంవేసుకు ముష్టెత్తుకునే బైరాగాడనుకున్నావా యేమిటి? ఆయన గొప్పసిద్ధుడు, నిలువెత్తు ధనంపోస్తే అబద్ధమాడడు.

ను—సాక్ష్యం వలకావొద్దు, యేవీఁవొద్దు, దగ్గిరనిలబడితే చాలును. పిలుచ్చుకురండి!

(కనిష్టీబువెళ్ళి దుకాణదారునూ బైరాగినీ తీసుకువచ్చును.)

గి—సాక్ష్యంఅంటే మావంటివాళ్లే చెప్పాలి. యోగదృష్టివల్ల చూశావంటే। యెక్క—డజరిగినదీ యెప్పుడుజరిగినదీ కళ్ళకి కట్టినట్టు అప్పుడు కనపడుతుంది. గనక మేంకూ సాక్స్తాం యెవైఁనా దొరికితే హరిద్వారంలో మఠానికి పనికొస్తుంది.

ను—జరిగినదాని ముందా మాశిరి. కొంచం కల్పనంటేగాని కథనడవదు. అంచేత హెడ్డుగారు ముసలాడితో చెప్పేమాటలు నిజంఅని మీరు ఠలవివ్వాలి.

గి—వెఱ్ఱి! వెఱ్ఱి! నిజవేఁవిటి, అబద్ధవేఁవిటి। మేం సిద్ధులం అబద్ధం నిజంచేస్తాం. ం అబద్ధం చేస్తాం - లోకవేఁ పెద్ద అబద్ధం. పదండి— (నిష్క్రమింతురు.)

---

## ౫-వ స్థలము. దేవాలయం గుమ్మందగ్గిర.

——:)o(:——

[హెడ్డుకనిష్టీబు, రామప్పంతులూ మాట్లాడుతుందురు. మఱిక కనిష్టీబు. బైరాగి, దుకాణదారు కొంతే యడముగా నిలుచుందురు.]

—నా నౌఖరీ పోగొట్టుకుంటానా భాయీ?

—కొంచం బెదిరిస్తే నౌఖరీ పోతుఁదా అన్నా? పోలీసుడూటీ అంటే బెదిరింపే దా? మీరు అలా తప్పించుకుంటే నే నేం అనుకోను?

—(చేతిలో నలుపుతున్న కాకితపుముక్కలు విసిరేసి) భాయీ, లుబ్ధావుధాన్లు పడిశ్లి డాః దుక్కి—ముచ్చా? బెదిరించడానికి - కూనీ కేసనినాకేవైఁనా ఆశ టే, పోలీసువాణ్ణి, నేను వూరుకుంటానా? పట్టుకుంటే నాకు యెంతకారక్ట రు? యీ జవాన్ని యీ చీకటిరాత్రిలో నూతిలోదింపానుకానా? కూనీ గీనీ టే యెవ్వరైనా నవ్వుతారు. మీనాక్షి చేతికి వెరచి, ఆపిల్ల యిరుగింట్లోనో రుగింట్లోనో పడుంది. మీయింట్లోనే వుందేమో ముసలాడు అన్నట్టు?

—దేవుఁడుతోడు మాయింటికి రాలేదు. యిరుగింటో, పొరుగింటో అని మీరు కుంటే యలాగ? మీధైర్యవేఁవిటో నాకు బోధపడదు. వెతికించవయ్యా టే, వెతికించారూకారు. ఆ యిరుగింటివాళ్ళూ పొరుగింటివాళ్ళూ, పిల్ల నిద్ర తూవుండగా కం[illegible]

పో తే మధురవాణి గుమ్మంలోంచి గెంటుతుంది—అనగా, గెంటుతుందనికాదు. యేడుస్తుంది, ప్రాణం తీ నేస్తుంది. విన్నారా?

హెడ్డు—నాసలహా విన్నారా?

రామ—యేదో చెప్పండి మరి.

హెడ్డు—ఆకంటే యిచ్చిందాకా, కదలకుండా, లుబ్ధావధాన్లు యింటిమీద కూర్చోండి.

రామ—యిదా సలహా? పీకమీద కూచున్నదాకా నాకేంపట్టింది? యింటికెళ్ళి సుఖంగాపడుకుంటాను.

హెడ్డు—మధురవాణి బాధ పెడుతుందనికదూ?

రామ—ఆని మీకు కనికారం కాబోలు? రేపుగానీ వాడు కంటెయివ్వకపోతే, అవుధాన్లుమీద సివిల్ దావాపడేస్తాను. మీదగ్గిర, కంటె మాట వొప్పుకున్నాడు గదా, మిమ్మల్ని సాక్ష్యంవేస్తాను.

హెడ్డు—ఓహో యిదా వేషం? పోలీసు ఆఫీసర్ని నేను, సాక్ష్యాలకీ సంపన్నాలకీ తిరిగితే నానౌఖరీ నిలుస్తుందా? కావలిస్తే లుబ్ధావుధాన్లుకంటె హరించాడని నాదగ్గిర ఫిరియాద్ చెయ్యండి. కేసుచేసి నాతమాషా చూపిస్తాను

రామ—కంటెమాట మీదగ్గిర అతడు వొప్పుకున్నతరవాత, మీరు బోనెక్కి యలా అబద్ధం ఆడగలారో చూస్తానుగదా.

హెడ్డు—పంతులూ, అక్కరమాలిన లౌక్యాలు చెయ్యకు. వాడు కంటెమాట తనకేం తెలియదన్నాడు. కావలిస్తే ఆమాట సాక్ష్యం పలుకుతాను.

రామ—యిదా మీరు చేసినసాయం?

హెడ్డు—యెందుకు అక్కరమాలిన ఆందోళన పడతావయ్యా - రేపు నీకంటె నీయింట్లోవుండకపోతే నన్ను అను.

రామ—మధురవాణితో యిప్పుడు యేంజెప్పను?

హెడ్డు—అయితే నన్నేం జేయమంటారు?

రామ—కళ్ళీ లుబ్ధావధాన్లు యింటికిరండి. యీమాటు మనవిద్దరం వెళ్ళి పీడిద్దాం.

హెడ్డు—రెడ్డొచ్చాడు, మొదలాడు అన్నాట్ట. నిరర్థకంగా రాత్రిల్లా నిద్రలేకుండా చంపావు [illegible] అని

చెప్పానుకానా? నామాటవిని అలా చెయ్యండి. అడేసలహా. పీసిరిగొట్టు ముండా కొడుకు మూనలుగురికీ నాలుగుమూళ్ళు పక్యేండు రాళ్ళు పారేశాడు. యివి పెగిరే టప్పటికి నాతల(ప్రాణం తోకకివొచ్చింది. నావొంతు మూడూ మీకిచ్చేస్తాను.

గాసు—కం టెపోయి యేశుస్తూవుంటే, యీ వెధవ మూడురూపాయిలా నాకెం దుకూ?

హెడ్డు—మీకు అక్కర్లేకపోతే పోనివ్వండి. గురోజీగారికి యిద్దాం.

గాసు—కొంచం చిల్లరఖర్చుంది. యేంజెయ్యను? యిలా పారెయ్యండి. (పుచ్చు కొనును.)

హెడ్డు—గురోజీ తమకో తులసిదళం.

బైరాగి—తృణం, కణం యేవొచ్చినా మఠానికే అర్పణం.

హెడ్డు—(దుకాణదారుతోనూ, కనిష్టీబుతోనూ) మీకోమూడు, నీకోమూడూ - (చేతులుదులిపి) సాఫ్ఝూడా - నాకు తిప్పలే మిగిలింది.

దుకాణదారు—(బైరాగిని పక్కకిపిలిచి) యీవేళ చెన్నాపట్టంనించి ఫస్టురకం బ్రాందీ వొచ్చింది. చిత్తగించి మరీ కాశీ వెళుదురుగాని.

హెడ్డు—గురోజీ రాం! రాం! పంతులూ, ముసలాణ్ణివెళ్ళి పట్టుకోండి. భాయీ, స్టేషనుకుపోవాలి. (జవానుతో) రావోయి కావయ్యా. (హెడ్డూ, జవానూ, ఒకవైపున్నూ, దుకాణదారూ, బైరాగీ మరి వకవైపున్నూ వెళ్లుదురు.)

గాసు—కంటెపోయిందంటే మూడురూపాయలా చేతులో బెడతాడు! (విరసంగా నవ్వును) పీడితాళం పడతాను. (హెడ్ పారేసిన కాకితపుముక్కలుయేరి) యినస్ పెకటరుకి వొకటి, తాసిల్దారుకి వొకటి, ఆకాశరామన్న అర్జీలు పంపుతాను. వెధవ, మధురవాణి దగ్గిరికి వెళతాడేమో? నేను యింటికిపోతే అరుగుమీద పడు కోవాలిగాని ఆతిక్కలంజ తలుపుతియ్యదు. లుబ్ధావధాన్లు యింటికివెళ్ళితే వాడు కట్టుచ్చుకుంటాడు. యీ దేవాలయంలో పరుందునా?—పురుగూ బుట్రా కరిస్తే—కరిస్తే—ఛీ! యీ సానిముండని వొదలేస్తాను—ఆ గుంటయావై నట్టు? నా అదృష్టంవల్ల యవళ్ళింట్లోనైనా దాగి రేవుగాని కళ్ళబడితే, కంటెపోకూడదు— ఒకవేళ చస్తే?—చచ్చుండదు—నూతులోపడలేదు. గవరయ్యా, కావయ్యాకూడా గాలించారు—ఒకవేళ అది రెండోపెళ్ళిపిల్ల అయి, దాని అత్తండి కానికీగావొచ్చి

బండీ యెక్కించుక దొడాయించాడేమో? అలా ఐతే కంటెపడా వుడాయి చడా?—మీనాక్షిని పట్టుకుంటే కొంత ఆచోకీ తెలుస్తుంది—అది కనపడ వేలాగ?—తలుపుకట్టి తేమునలాడే వొస్తాడేమో?—(రోడ్డుదాటి లుబ్ధావధాన్ల యింటిగుమ్మంయెసట నిలుచుని) ఆకలి దహించేస్తూంది—మీనాక్షి దొంకతే యేవైనా ఫలహారం యిచ్చును—యవడు చెప్మా! రావిచెట్టుకింద చుట్ట కాలు స్తున్నాడూ? (నాలుగు అడుగులు ముందుకువెళ్ళి) అసిరీ, నువ్వా?

అసిరిగాడు—నాను బాబు (చుట్టపారవైచును.)

రామ—నిమ్మళంగా వున్నావురా?

అసిరి—యేట్నిమ్మళంబాబూ సాన మొక్కిచ్చింది - ఈయమ్మ కాసినూడం మానేసినాదు డబ్బిచ్చేదా తేడిబాబూ?

రామ—అసిరి, అడక్కపోతే, అమ్మైనా పెడుతుందిరా?

అసిరి—ఆసానమ్మ మా సెడ్డమనిషి బాబూ.

రామ—యేవిటి? యేవిటి? చెప్పారే. చాలా రోజులైంది నీకు డబ్బిచ్చి - యిదు యీ పాయి పుచ్చుకో.

అసిరి—నూరు దండాలుబాబూ?

రామ—మధురవాణి మాటయేవిటా? చెప్పబోయినావు?

అసిరి—మా సెడ్డమనిషి బాబూ.

రామ—యవడెళ్తాడా? దాందగ్గిరకి? అసిరి—యవడెళ్తాడా?

అసిరి—యవడెళ్నా, యీపు పెట్లగొడతాది బాబూ.

రామ—చెడ్డమనిషన్నావు?

అసిరి—కాదా? మొన్న హెడ్డుగారెళ్తే, యేపికూన్ని ఉసు గలిపిందికాదా?

రామ—నిజం చెప్పావు. నీమీద యెప్పుడైనా కోప్పడ్డదిటా?

అసిరి—మాలాటోళ్ళమీద యెంద కోప్పడతాదీ? బాపనాళ్లొస్తే తిడతాది.

రామ—నువ్వు యెప్పుడూ నిజవేఁ చెబుతావురా అసిరిగా.

అసిరి—నీ! అబద్దవాడితే బగమంతుడు ఒల్లకుంటాడా బాబూ?

రామ—నీబాబుగత యేం జేస్తున్నాడా?

అసిరి—తొంగున్నాడు బాబూ.

రామ—నీకు మరో రూపాయి యిస్తాను - మీనాక్షిని సావిట్లోకి పిలుస్తావురా?

అసిరి—నాశక్కవా, బాబూ? ఆ ముష్ట అయ్యగదులో పక్కనుకు తొంగున్నాడు.

రామ—నువ్వు చిటికేస్తే, యక్కడున్నా లేచొస్తుంది. నే నెరగనట్రా?

అసిరి—తెండి బాబూ. సూస్తాను. (రామప్పంతులు రూపాయి యిచ్చును. ఉభయులూ యింట్లో ప్రవేశింతురు.)

---

## ౬-వ స్థలము. లుబ్ధావధాన్లు యింటివసారా.

—:(o):—

[తలుపు జారవేసివుండును.]

(మీనాక్షి ప్రమిదతో దీపం తెచ్చి గూటిలోవుంచును.

రామప్పంతులు వొత్తితగ్గించి, మీనాక్షిని ముద్దు బెట్టుకొనును.)

మీనాక్షి—తోవ తప్పొచ్చారో?

రామ—బుద్ధితక్కువ చేత, గడ్డితిని యిన్నాళ్ళు తోవమరచాను

మీనా—మధురవాణి యలా రానిచ్చింది?

రామ—మధురవాణి శిగ్గోశిరి, దాన్ని వొదిలేస్తాను. ఆకలి దహించుకుపోతూంది. ఫలారం యేమైనా వుందీ?

మీనా—యేవుందీ?—వొడపప్పూ, కొబ్బరిముక్కా కావాలా?

రామ—యేదో ఒకటి తెస్తూ. (మీనాక్షి మూకుడుతో వడపప్పూ, కొబ్బరిముక్కలూ తెచ్చును. రామప్పంతులు తినుచుండును)

మీనా—మధురవాణిని వొదిలేస్తారో?

రామ—వొదిలెయ్యడం నిశ్చయమైపోయింది.

మీనా—కనిష్ఠీబుమాట తెలిసిందో?

రామ—తెలిసింది.

మీనా—యవరు చెప్పారు?

రామ—అసిరిగాడు.

మీనా—మా అసిరిగాడా ?

రామ—మీ అసిరిగాడే.

(అసిరిగాడు వీధితలుపు కొంచంతీసి తొంగిచూసి.)

అసిరి—దెయ్యానికెట్టింది తింతున్నావయ్యా ?

రామ—దెయ్యానికా పెట్టావు ?

మీనా—(అసిరిగాడితో) పూరుకో వెధవా

రామ—నీకు న్యాయవేఁనా, దిగదుడుపు కూడు పెట్టడం ?

(వీధులోకివెళ్ళి వమనము చేసికొనుటకు ప్రియత్నముచేసి తిరిగీ ప్రివేశించి)

వమన మైందికాదు. యేం సాధనం ?

మీనా—దిగదుడుపుకాదంటే నమ్మరుకదా ?

రామ—మూకుళ్ళో తగలేశావు ?

మీనా—దెయ్యంతినిపచ్చిందా, యేవిఁటి ?

రామ—ఆడవాళ్ళు దారుణం మనుషులు !

మీనా—అసిరిగాడేంచెప్పాడు మధురవాణిమాట ?

అసిరిగాడు—(తిరిగీ తొంగిచూచి) ఆ పారేసింపట్టుకు పోదునా బాబు ?

రామ—పట్టుకుపో.

(అసిరిగాడు పట్టుకుపోవును.)

మీనా—వాడికి మీకంటె ధైర్యవుంది.

రామ—అపవిత్రిం ముండాకొడుకు యేమైనాతింటాడు. బ్రాహ్మలంపవిత్రమైన వాళ్ళంగదా ?

మీనా—పవిత్రిం అంటే, మీదీ, నాదే !

రామ—ఆదేం అలా అంటున్నావు ?

మీనా—నేను వెధవముండనీ, మీరు సరసులున్నూ, మనకంటే మరిపవిత్రిం అయిన వారు యవరుంటారు ?

రామ—ఆకళంకం తీసెయ్యడానికే యీవేళొచ్చాను.

మీనా—యలా తీసేస్తారు ?

రామ—మనయిద్దరం పెళ్ళాడితే మరి అపవిత్రత యెక్కడుంటుంది ?

హనా—యేమిటీ !

రామ—మనం పెళ్ళాడదాం ?

హనా—నిజంగాను ?

రామ—యేం వొట్టు వేసుకోమ్మన్నావు ?

హనా—ఆవేశం ఆర్పెయ్యండి.

రామ—యీకాగితం ముక్కలు చదివి మరీ ఆర్పేస్తాను. (కాగితంముక్కలు జేబు లోంచితీసి చదివి) గాడిద కొడుకు తనబాకీ తాలూకు నోటులాగి, నన్ను దగా చేశాడు; వీడితాళం పడతాను.

హనా—యెవడు ?

రామ—అది వేరేకథ.

హనా—అసిరిగాడు కనిష్టీబుమాట యేం జెప్పాడు ?

రామ—మధురవాణి పెరట్లోమీద కుక్కని వుసిగలిపిందని చెప్పాడు.

హనా—యెందుకూ ?

రామ—నేను లేనప్పుడు వాడు యింట్లో చొరబడబోతేను.

హనా—అయ్యో తెలివా ! అసిరిగా !

అసిరిగాడు—(ప్రవేశించి) యేటమ్మా ?

హనా—వెధవా, నిజం చెప్పూ. పంతులు యింట్లోలేనప్పుడల్లా కనిష్టీబు మధుర వాణితో వుంటాడని, నువ్వు నాతో చెప్పలేదూ ?

అసి—(బుఱ్ఱగోకుకుంటూ) సెప్పినాను.

రామ—దొంగవెధవా! కుక్కని వుసిగలిపిందన్నావు ?

అసి—బాబు - నాకకోడు నోరుమూసుకోవొద్దా బాబు ? సానమ్మడిగితే, మీమాట సెప్పతానబాబు ?

హనా—వెధవా, నువుచెబితే నాకు భయమనుకున్నావా, యేమిటి ?

రామ—ఓరి అబద్ధపు వెధవా! యివరితోనూ మామాటమాత్రం చెప్పకు. రూపాయి యిచ్చానుకానూ ?

మీనా—యందుకిచ్చారూ, రూపాయి?

అసిరి—పిల్లలోణ్ణిగిందా? (పైకివెళ్లును.)

రామ—దొంగముండ ద్రోహం చేస్తూందేం?

మీనా—తెలుసునన్నారు?

రామ—యింతని యెరగను.

మీనా—ఆడది నీతితప్పినతరవాత అంతేవిఁటి? యింతేవిఁటి? తెగించినదానికి సగుడు మోకాలుబంటి - అందులో సాంది ఖాయిదాగా వుండాలనుకోవడం మీదీ బుద్ధితక్కువ.

రామ—బుద్ధితక్కువంటే బుద్ధితక్కువా! ముండనిబుజ్జి చితకపొడిచెయ్యాలనివుంది. దీనికింద యంత సొమ్ము తగలెట్టానూ!

మీనా—యెప్పుడుతోలేస్తారు?

రామ—యెప్పుడో నా? రేపే. లంజ యంత పతివ్రితవేషం వేసిందీ!

మీనా—మనవెఁప్పుడు వెళ్ళిపోవడం?

రామ—యక్కడికి?

మీనా—మతి పోతూందా యేవిఁటి? రాజమేండ్రిం?

రామ—అవును. రేపు దాన్నితోలేస్తానా? యెల్లుండి మానం వుడాయిద్దాం గాని నీనసుకులు తెచ్చుకుంటావా, ముసలాడికి వొదిలేస్తావా?

మీనా—నాకున్నదల్లా నానసుకులే, యెలా వొదలేస్తాను? నానసరకులపెట్టె తాళం మానాన్నదగ్గిరుందిగదా యేవిఁగతి?

రామ—నాప్రియోజకత్వం నీకేం తెలుసును? యిదుగో యీరింగునవున్న యినవ ములికీతో నీచిత్తవొఁచ్చిన పెట్టెతాళం తీసేస్తాను. గాని నాకంటె యక్కడుంది?

మీనా—గుంటకిపెట్టిందా? రాత్రివేళ, నాబట్టలపెట్లోపెట్టేది.

రామ—నీపుణ్యవుంటుంది ఆ బట్టలపెట్టె వొమాటుతీసిచూతూ. రేపు దానికంటె మధురవాణికిచ్చి, ముండని తగిలేస్తాను.

మీనా—ఆగుంట, బట్టలపెట్టె తాళం పారేశింది?

రామ—ములికతో తీసేస్తాను.

—నా సరుకుల పెట్టె తాళంకూడా తీసేసిపెడతారూ?

—అద్దే!

—నన్ను పెళ్లాడతానని ప్రమాణం చేశారు కారే?

—దీపం ఆర్పేస్తే పెట్టె తియ్యడం యలాగ?

—అగ్గిపుల్ల వుంది.

—ఐతే యిదిగో, నిన్ను తప్పకుండా పెళ్లాడతానని యీదీపం ఆర్పేస్తున్నాను

(రామప్పంతులు దీపం ఆర్పి మీనాక్షిని కౌగలించుకొని యెత్తును.)

—యిలా యెత్తుకు తీసుకుపోతాను రాజమహేంద్రవరం.

(అగ్నిహోత్రావధాన్లు చీకటిలోవచ్చి కఱ్ఱతో రామప్పంతులు కాళ్లమీదకొట్టును.

మీనాక్షి కిందపడును )

—బందిపోటు గాడిదకొడకా!

—నచ్చాన్రా (వీధిలోకి కుంటుకుంటూపోవును )

—పో, ముండా నువుకూడా నాయింట్లోంచి. (మీనాక్షిని వైకితోసి తలుపు వేయును )

—అసిరిగా. చంపేశాన్రా - కాలెవిరిగిపోయిందిరా.

—(నిమ్మళంగా) దెయ్యానికట్టింది తంతే యేతొతదిబాబూ ? (గట్టిగా) కానేళ జోకబడితే, బుగత తన్నడా?

—(మీనాక్షితో) నువ్వు యింట్లోకి వెళ్ళిపో.

—మరి యింట్లో అడుగుపెట్టను. నాసరుకులు లేకపోతేపాయను రండి రాజమేంద్రంపోదాం.

—తలిచినప్పుడే నా తాతకి పెళ్ళి ?

—మీయిష్ట వొచ్చినప్పుడు పెళ్ళాడుదురగాని, యింట్లోంచి లేవదీసుకొచ్చాడు కదా? యిహ నేను మీతో వుండవలసినదాన్నే; పదండి.

—వెళ్లి కుదిరింది రోకలి తలకి చుట్టుకోమ్మన్నాట్ట! బతిమాలుకుంటాను యిప్పటికి యింట్లోకి వెళ్ళిపో.

—మరి యీజన్మంతో యీ యింట్లో అడుగుపెట్టను.

—అసిరిగా, మీనాక్షి వొక్కత్తొవుంటుంది. కాపాడి, బుగత తలుపుతియ్యగానే లోపలికి తీసికెళ్లు. (వెళ్లిపోవును. మీనాక్షి వెడలును.)

(రామప్పంతులు యింటియెదట.)

రామ—(తలుపుతట్టి) వేగిరం, వేగిరంతియ్యి.
మధురవాణి—(తలుపుఆవతలనించి) యేవిఁటాతొందర ?
రామ—ఆకుచిట్టెడ వెంట తరువుతూంది.
మధు—చిట్టెడ కనపడగానే తలుపుతీస్తాను.
రామ—తలుపేసుకు, కూచుంటే నీక్కనపడ్డం యలాగ ? నువ్వు తలుపుతీసేలోగా నన్ను కాజేస్తుంది.
మధు—నాకంటేదీ ?

రామ—కంటె, కంటె, అని తపిస్తున్నావేవిఁటి ? నిలబడ్డపాటున నూరుకంటెలు కురిపిస్తాను.
మధు—మీనూరుకంటెలూ మీరు వుంచుకుని, నావొక్క కంటె నాకిచ్చి, మరీయింట్లో అడుగుబెట్టండి.
రామ—రేపు సొగలుగాని కంటె యివ్వనన్నాడు లుబ్ధావధాన్లు ?
మధు—రేపే యింట్లో కొత్తురుగాని, మించిపోయిందేవీఁలేదు.
రామ—యింతట్లో చిట్టెడ మీదపడితే.
మధు—సకేశా ? అకేశా ?
రామ—పిల్లికి చెలగాటం, యలక్కి ప్రాణపోకటా !

(మీనాక్షి ప్రవేశించి, రామప్పంతులు రెక్కపట్టుకొనును.)

మీనా—దీపం ఆర్పి ప్రమాణంచేశావు-తప్పితే తలపగిలిపోతుంది.
రామ—పోముండా !
మీనా—మీ కాగల పెళ్ళాన్నిగదా యెక్కడికిపోతాను ?
మధు—కాగల పెళ్ళావేఁటి ?
మీనా—నిన్ను వొదిలేసి, నన్ను రాజమేంద్రిం తీసుకుపోయి పెళ్ళాడతానన్నాడు దీపవార్పి ప్రమాణంచేశాడు- మరెలా తప్పుతాడు ?

మధు—యీవిడేనా ఆకుచిట్టెడ ?
రామ—ముండా, నా చెయ్యొదిలెయ్- నిన్నునే పెళ్లాడతానన్నానే ? కలగన్నావా యేవిఁటి ? (మీనాక్షిని విడిపించుకొనగా మీనాక్షి కిందపడును.)

మధు—ఆడదానిమీదా చెయిజేసుకుంటారు ? యేమి పౌరుషం! అబద్ధమాడక అన్న మాట నిలబెట్టుకోండి. యేం ? కులంతక్కువా ? రూపంతక్కువా ? ఆ మెబతుకు భ్రష్టుచెయ్యనే చేశారు ; పెళ్ళాడి తప్పదిద్దుకోండి- అవిణ్ణి పెళ్ళాడివొస్తేనే నేను తలుపు తీస్తాను.

మీనా—పంతులునన్ను కాగలించుకుని యెత్తుకుంటే మానాన్న చూసి, తన్ని, యిద్దర్నీ యింట్లోంచి తగిలేశాడు. నువ్వు హెడ్డు కనిష్టీబుతో పోతున్నావు, నిన్నొదిలేసి నన్ను పెళ్లాడతానని వొట్టేసుకున్నాడు. నన్ను లేవదీసుకొచ్చి, నన్నుపెళ్ళాడక తప్పుతుందాయేమిటి ?

మధు—అవశ్యం పెళ్లాడవలిసిందే - పెళ్లాడకపోతే నువ్వుమాత్రం వూరుకుంటావూ ? దావాతెస్తావు - పంతులుగారికి దావాలంటే సరదావే

రామ—మధురవాణీ- నీకు మతిపోతూంది-నాయింటికి నువ్వా యజమానివి ? తలుపు తియ్యి.

మధు—నిలబడండి. కర్పూరంవెలిగించి మంగళహారతి పళ్ళెంతెస్తాను. (తలుపుదగ్గిర నుంచి లోనికివెళ్ళును.)

రామ—(తలుపుసందులోనుంచి చూసి, తరవాతమీనాక్షిని ముద్దెట్టుకుని) యెంతపని చేశావూ ! దాంతో చెప్పేశావు ! రహస్యంగా లేచిపోయి పెళ్ళిచేసుకోవాలిగాని అల్లరిచేసుకుంటే యలాగ ?

మీనా—యెప్పుడైనా అందరికీ తెలిసేదేగదా ?

రామ—నామాటవిని యిప్పుడు యింటికి వెళ్ళిపో.

మీనా—యిహ మాయింటికి వెళ్ళను. యిదేమాయిల్లు ; మధురవాణి తలుపుతీస్తుంది; లోపలికి వెళదాం.

రామ—అయితే యిక్కడవుండు యిప్పుడే | వొస్తాను (కొన్ని అడుగులు వీధంట నడచి, నిలచి [నిజంగా మంగళహార్తి తెస్తుంది కాబోలు పెంకెలంజ? అది తలుపు తియ్యకపోయెనా, మీనాక్షి నన్ను వెతకడానికి బయల్దేరుతుంది.] తెల్లవారవచ్చింది - చెరువ్వేపుపోయి కాలకృత్యాలు తీర్చుకుని ఆపైచర్య ఆలోచిద్దాం. రెండ్రోజులు పైకి వుడాయించానంటే, మళ్ళీ వొచ్చేసరికి కొంత అల్లరి సద్దుకుంటుంది. తలుపుతీసినట్టు కానరాదు. యీవడిల్లు ? యవర్తె యిది నన్ను అడ్డదానికి ? ఆశ్చర్యం ! (కొంతదూరంగా వీధిలో నిలబడి, దాసరివేషంతో శిష్యుడు చిత్రావిూటి పాడును.)

చరణం॥ "యిల్లుయిల్లనియేవు । యిల్లు నాదనియేవు ।
నీయిల్లుయెక్కడే చిలుకా ?

రామ—యిది నాయిల్లుకాదా ?"

శిష్యుడు—"ఊరికిఉత్తరాన । నమాదిపురములో । కల్లెయిల్లున్నదే చిలుకా॥"

రామ—వొల్లకాట్లోనా ?

శిష్యుడు—పల్లవి॥ "యెన్నాళ్ళుబ్రతికినా । యేమిసామ్రాజ్యమే ।
కొన్నాళ్ళకోరామ చిలుకా ?"॥

అనుపల్లవి॥ "మూణ్ణాళ్ళబతుకునకు । మురిసేవు త్రుళ్లేవు ।
ముందుగతికానవే చిలుకా"

రామ—యేవిఁటీ అపశగునం పాటా !

శిష్యుడు—"కట్టెలేచుట్టాలు । కట్టెలేబంధువులు ।
కన్నతల్లెవ్వరే చిలుకా ?"

రామ—చుట్టాలా? వొక్క అప్పవుంది, అదియెప్పుడూ నాగుమ్మంలో అడుగుబెట్ట లేదు. యిప్పుడు యింటికి యజమాని యెవరూ? తిరుపవతల సానిలంజా । తిరుపవతల సంసారి విధవలంజానూ; యిద్దరూ కలిసి యిల్లుచేరకుండా నన్ను తగులుతున్నారు.

శిష్యుడు—"నిన్నుమోసేను నలుగురు । వెంబడిని పదిమంది।:"

రామ—వెఱ్ఱి ముండాపాటా । పోదాం. (గబగబ కొంతదూరమునడచి, నిలుచుని) యీలోపనే వొస్తున్నాడుకాబోలు. అదుగో పాటవినబడుతూంది?

పాట "నువ్వుకాలిపోయేదాక ।
కావలుందురుగాని ।
కడకుతొలగొత్తురు ।
వెంటనెవరూరారు చిలుకా॥

రామ—వెఱ్ఱి ముండాపాటా!

శిష్యుడు—పంతులుగారూ ! యక్కడున్నారు?

రామ—నడుగుమూకలేపోతే పట్టుగుంటుంది. (పరిగెత్తును.)

# కన్యాశుల్కము—షష్ఠాంకము.



౧-వ స్థలము. రామచంద్రపురం అగ్రహారంలో.

(చెఱువుగట్టునవున్న తోటలోనికి పెళ్ళివారి బళ్ళువచ్చును. గట్టుమీద ఒక వైపు అగ్నిహోత్రావధాన్లు, రెండవవైపు పళ్ళుతోముకొనుచు రామప్పంతులును.)

అగ్ని—బళ్లుదింపండి. బళ్లుదింపండి. సాయేబూ యేనుక్కి కావలసినంత రోడ్డు. చెఱువు స్నానానికి బహుబాగావుంది. యెవరయ్యా చెఱువుగట్టుమీద?

రామప్పంతులు—(తనలో) అరే! మరిచితిని. యీవేళేకదా పెళ్ళివారు రావలసిన రోజు? (పైకి) నా పేరు రామప్పంతులంటారు.

అగ్ని—లుబ్ధావధాన్లుగారు మిమ్మల్ని పంపించారా యేమిషి?

రామ—యెందుకండీ?

అగ్ని—మేవొస్తున్నావని యెదురుగా యవర్నీ పంపలేదా? నా పేరు అగ్నిహోత్రావధాన్లు అంటారు.

రామ—మీరేనా అగ్నిహోత్రావధాన్లు గారు? యేంవచ్చారేవిటి?

అగ్ని—పెళ్ళిమాట మీకు తెలియదా యేమిషి?

రామ—పెళ్ళెవరికండీ?

అగ్ని—మీదీవూరు కాదా యేమిషండి? మాపిల్లని లుబ్ధావధాన్లుగారి కిస్తాను.

రామ—లుబ్ధావధాన్లుగారికి పెళ్లై పోయిందే?

అగ్ని—తమరు హాస్యాలాడుతున్నారు - హాస్యాలకేంగాని, వ్రియత్నాలు యలా జరుగుతున్నాయి యేమిషండి?

రామ—మీరే హాస్యాలాడుతున్నట్టుంది. పెళ్ళిఅయి పదిరోజులైంది. లుబ్ధావధాన్లుగారి సంబంధం అక్కర్లేదని మీరు రాశారట అందుపైని యవడో గుంటూరునుంచి వొచ్చిన శేషావధాన్లు కొమార్తెని వస్నెండువొందలిచ్చి పెళ్ళాడాడు.

అగ్ని—అన్నగారూ - హాస్యం ఆడుకున్నారు. న్యాయంకాదు. మనకి బావగారి వరసా యేమిటండి?

రామ—యేమిటి మీమాటలూ? నేను యెన్నడూ అబద్ధవాఁడి యెరగను. నామాట నమ్మకపోవడం ధర్మవేఁనా?

అగ్ని—ప్రమాణం చెయ్యండి?

రామ—గాయత్రీసాక్షి.

అగ్ని—అయ్యో! అయ్యో! యేమీఁదురంతం! రండీ, వెళ్ళిగాడిదకొడుకు యెముఁకలు విరగ్గొడతాను.

రామ—నేనురానండి. అగుంటూరు సంబంధం చెయ్యవొద్దన్నానని నాతో మాట్లాడడం మానేశాడు. మీరు వెళ్ళిరండి - మీరు తిరిగి వొచ్చేందాకా యిక్కడే కూచుంటాను.

అగ్ని—ఆగాడిదకొడుకు యింటికి నాకు తోవ తెలియదే?

శిష్యుడు (చెంపుగట్టు యెక్కుతూపాడును.)

"తా నెవ్వగో తనవారెవ్వరో? | మాయజీవికి తనువుకు తగులాయగాహా"॥

(రామప్పంతులు నిలబడి భయము కనపర్చును.)

అగ్ని—యేవిఁ ఆలా చూస్తున్నారు?

రామ—శవాన్ని మోసుకుపోయే పాట!

శిష్యుడు—"దినమూ, మరణమని తెలియాడీ"

రామ—(శిష్యునితో) వూరుకో (అగ్నిహోత్రావధాన్లుతో) అన్నా ఓకానీ వుందా?

శిష్యుడు—మిమ్మల్ని తీసుకురమ్మంది.

రామ—చచ్చానే - వొస్తూందాయేవిఁటి?

శిష్యుడు—కంటెపో తేపోయింది, రమ్మంది.

రామ—బతికాను.

అగ్ని—చావడం యెందుకు; బతకడం యెందుకు?

రామ—అది లోకజ్ఞ

శిష్యు—చిట్టపులి పిల్లని తండ్రొచ్చి వంకకి తీసుకుపోయినాడట.

అగ్ని—యీవూళ్ళోకి పుల్లొస్తాయా యేమిషి?

రామ—విరగడైపోయింది. (శిష్యునితో) యింద రూపాయి (శిష్యుడు తీసుకుని) దాసుణ్ణి బాబూ!

(పాడును) "చిత్తాస్వాతివాన, జోడించికురియగ"

అగ్ని—యేవిఁటే వెధవపాట? వూరుకుంటావా వూరుకోవా? నీకు రూపాయి చాలదురా గుంటకక్కగట్టా?

శిష్యుడు—తమరు దయచెయ్యరా బాబూ?

అగ్ని—నేనివ్వను - అన్నా: తోవ యవరు చూపిస్తారు.

రామ—(శిష్యునితో) నీకు ఉద్ధావధాన్లు యిల్లు తెలుసునూ.

శిష్యుడు—తెలుసును - తండ్రీ.

రామ—అవుధాన్లుగారు ఓకానిడబ్బిస్తారు. యిల్లు చూపించు.

శిష్యుడు—ముందిస్తేగాని చూపించను.

అగ్ని—యిందు - యేడువు.

(శిష్యుడు ముందూ, అగ్నిహోత్రావధాన్లు వెనకా కొన్ని అడుగులు వెళ్ళిన తరవాత, శిష్యుడుపాడును.)

శిష్యుడు—"సీలాలకా యేలనీయలుకా"?

అగ్ని—యలకేవిఁటి నీశార్ధం?

శిష్యుడు—యలకాక్కాదు, పిల్లి.

(పాడును) "పిల్లన్న తెయి తక్కలాడంగనూ। యలక శేమాగట్టి దున్నంగనూ"

అగ్ని—యేవిఁటీ?

శిష్యు—"మేకపిల్ల లెల్లిండు మేళాంగట్టుకుని। మేరంగిలీథా౽ని కెళ్ళంగనూ"॥

అగ్ని—యేవిఁటి నీశార్ధంపాట!

శిష్యు—"తొండాయ నేస్తాడు, దొనిగట్టుబట్టుకుని। తోటమల్లీ పువ్వు శేరంగను!!

అగ్ని—షాడావంటే తంతాను.

శిష్యు—అయితే నీకు మరి యిల్లు చూపించను.

అగ్ని—పాడగట్టా - (కొట్టబోవును.)

శిష్యుడు—(తప్పించుకు పారిపోతూ) "గట్టుకిందానున్న | పందాయనేస్తాడు. పరిగబుకూ | మరిగబుకూ"॥

(నిష్క్రమించును.)

అగ్ని—వీడిశ్రార్ధం చెట్టుకింద బెట్టా | తోవయిటా? అటా?

(తెరదించవలెను.)

---

## ౨-వ స్థలము. చెఱువుగట్టుతోట.

—:)o(:—

[అగ్నిహోత్రావధాన్లు, రామప్పంతులు, వెంకమ్మ, యితరులూ]

అగ్ని—గాడిదకొడుకుని మాచెడ్డదెబ్బలు కొట్టేశాను; యేనుగులూ గుఱ్ఱాలూ తెచ్చాను వీడిశ్రార్ధం. వీడికి! తోవఖర్చయినా వొకదమ్మిడీ ఇయ్యడప.

వెంకమ్మ—మనప్రారబ్ధం - నేనోచిన నోవుఁలు యిలా వుండగా, మరోలాయిలా అవుతుంది? యీ సమ్మంధం వొద్దనిపోరితే విన్నారూ? నేను భయపడుతూనే వున్నాను. బయల్దేరేటప్పుడు పిల్లి యెదురుగుండా వొచ్చింది.

అగ్ని—పింజారీ! వూరుకో - ఆడముండల కేంతెలుసును? అన్నగారూ, క్రిమినల్ కేసు తావడానికి అవకాశంవుంటుందా? మాదగ్గిర అయ్యవారూ ఒకాయన వున్నాడు. ఆయనకి లాబోగట్టా మా బాగాతెలుసును. ఆయన్నికూడా సలహాచేదాం.

రామ—కోటువ్యవహారాల్లో ఆరితేరిన మీకు ఒహడు సలహాయివ్వాలండీ? స్థలజ్ఞుణ్ణి గనక సాక్ష్యం గీక్ష్యం తేవడానికి నేను సాయంచేస్తానన్నానుగానీ, అయ్యవాళ్లూ గియ్యవాళ్లూ మీకూ నాకూ సలహా చెప్పేపాటివాళ్ళా? గుంటకక్కగట్లు రెండు యింగిలీషుముక్కలు చదువుకున్నారు గనక ముక్కస్యముకార్థః అని తర్జుమాలుమట్టుకు చేస్తారు; గాని యేపయినా యెత్తుయెత్తావంటే, తమలాంటి యోధులు యెత్తాలి, నాలాంటి నియ్యోగపాడు నడిపించాలి. క్రిమినలుకి అవకాశంవుందా అని అడుగుతారేవిఁటి? మీకు తెలియదా యేవిఁటి! - అటుపైని సులభసాధ్యంగా మూడు నాలుగువేలు డామేజీకూడా సివిల్లో లాగేస్తారు.

అగ్ని—అదే, సా...

అ—శ్రీకిహాయె; మళ్ళీ యిహా సంహాకేవుంది. వెంటనే వెళ్ళి మకర్ణా [illegible]
వా. ఖర్చులికి సొమ్ముపట్టుకుని బయలుదేరండి.

నా—నాదగ్గిర దమ్మిడీ లేదు; యేమి సాధనం? యీ గాడిదకొడుకు రూపాయి [illegible]స్తాడని నమ్మి. వేనే మీ తే లేదు.

భీ—యింటికివెళ్ళి లెక్కపట్టుకు నొచ్చేటప్పటికి పుణ్యకాల మించిపోతుంది "శుభస్య శీఘ్రం" అన్నారు - మీఆలోచనేవిటి?

అ—యిదేదో అయితేనే గాని యింటిమొహం చూసేదిలేదు. మా అమ్మి మెళ్ళో దయినా యీ వూళ్ళో తాకట్టు పెడదాం.

భీ—అయితే పట్టుకురండి; పోలిశెట్టి దగ్గిరతాకట్టు పెడదాం; పోలిశెట్టిని మనం కొంచం మంచి చేసుకోవడం అవశ్యకం. మీరు లుబ్ధావధాన్లుని కొట్టినప్పుడు పోలిశెట్టి వున్నాడు గనక, లుబ్ధావధాన్లు మీమీద ఛార్జి చేసినప్పుడు, పోలి-శెట్టిని తప్పకుండా సాక్ష్యం వేస్తాడు. శెట్టిని మనం విడతియ్యడం జరూరు-షేవంటారు ?

అ—మీసలహా మా బాగావుంది నాకూ అదే భయవేస్తూంది

భీ—చూశారా, ప్రతివాడికీ సలహా చెప్పడం చాతౌతుందండీ? అందులో యీ యింగిలీషు చదువుకున్న అయ్యవార్లని సలహా అడిగితే, కేసులే తేవొద్దంటారు. దొంగసాక్ష్యాలు తావొద్దంటారు. వాళ్ళసొమ్మేం పోయింది ? యేమాత్రం కూడా లేకపోతే కేసులు గెలవడం యలా ?

అ—మా అయ్యవారు మట్టుకు మంచి బుద్ధిమంతుడూ, తెలివైనవాడూ నండి-కోర్టు వ్యవహారాలలో అతనికి తెలియని సంగతిలేదండి అంతబుద్ధిమంతుణ్ణి నేను యక్కడా చూడలేదు. ఆయన్ని చూస్తే మీలాగా అలాగే అంటారు.

భీ—యెంతబుద్ధిమంతుడైనా మీకొడుకు సలహా చెప్పేవాడున్నాడండీ? చెవులో-మాట - మీ అయ్యవారు గిరీశంగారు కాదండీ? వాడు లుబ్ధావధాన్ల పెళ్ళికొడుకుగదా? మీకావాలను, యీ కేసుల్లో సరైన సలహా చెబుతాడు ?

అ—అవునండోయి !

భీ—నిర్మోహ్యాగపాణ్ణి - నామాట కొంచం ఖాతర్ చెయ్యండి. గనక, ఆ అయ్యవార్నితోడిచ్చి, పిల్లన్ని [illegible] యెకాయెకిని మనం తక్షణం

వళ్ళిపోయి. ఉఛ్ఛ్వాసధాన్లుకన్న మందు ముక్క తగిలించెయ్యాలి, యేవో ఓసరుకు వేగిరం పట్టుకురండి.

అగ్ని—యేదీ, అమ్మిని యిలా పిలువు.

వెంకమ్మ—అమ్మో చెప్మా? ఐద్ధకించి బండిలో పడుకుంది కాబోలు. పిలువమ్మా.

అగ్ని—మనకి డామేజీ డిట్టంగా వొస్తుందా?

రామ—వొస్తుందంటే; అలాగ యిలా గానా?

ఒకడు—అప్పన్నగారిబండీ యక్కడా కనపడదు; బండీవెనకపడిపోయింది కాబోలు.

వెంకమ్మ—అడుగో అబ్బివున్నాడే? వీడెలా వొచ్చాడు? అబ్బీ నువ్వు అక్కయ్య బండిలో కూచోలేదురా?

వెంకటేశం లేదు. నేను యేను గెక్కాను.

అగ్ని—దొంగగాడిపకొడకా అయ్యవారేరా?

వెంకటేశం—యెక్కడా కనపడ్డు.

అగ్ని—గుఱ్ఱం వొచ్చిందా? గుఱ్ఱపాడేడీ?

వెంకటేశం—గుఱ్ఱపాడు చెప్పాడు—

అగ్ని—యేవి(టా), వెనవా, చెప్పాడూ?

వెంకటేశం—మాష్టరూ—రాత్రి—

అగ్ని—నోటంటమాట పెగల్దేం?

వెంకటేశం—గుఱ్ఱందిగి—బండీయెక్కాట్ట.

వెంకమ్మ—అయ్యో దాన్ని లేవదీవుకు పోలేదుగద?

దగ్గిరనున్నవారు—ఆ! ఆ!

వెంకమ్మ—కొంప మునిగిపోయింది, మరేవిటి!

(చతికిలబడును)

అగ్ని—(కోపముచేతవణుకుచు) అయ్యవారు పకీరుమండని లేవతీసుకు పోయాడూ? నగలపెట్టె? నాకోర్టుకాగితాలో!



వెంకటేశం— అక్కయ్యపెట్లో నాపుస్తకాలుకూడా పెట్టాను.

అగ్ని—దొంగగాడిదె కొడకా! నువ్వే వాణ్ణి యింట్లో పెట్టావు. రవంత ఆచోకీ తెలిసిందికాదు, దొంగవెధవని చంపేసిపోదును. గాడిదెకొడుకును అమాంతంగా పాతిపెట్టేదును.

రామ—(దగ్గిరకువచ్చి) అయ్యవారు మహా దొడ్డవాడని చెప్పారే? యేమి యెత్తుకు పోయినాడేమిటండి?

అగ్ని—యేమి యెత్తుకుపోయినాడా? నీశ్రాద్ధంయెత్తుకు పోయినాడు. పకీరుముండని యెత్తుకు పోయినాడు, యీ గాడిదెకొడుకు యింగిలీషు చదువు కొంపముంచింది (వెంకటేశం జుత్తుపట్టుకుని కొట్టబోవుచుండగా తెరదించవలెను.)

---

౫. వ స్థలము విశాఖపట్టణములో మధురవాణి బస యెదటివీధి.

——:)o(:——

[రామప్పంతులు, అగ్నిహోత్రావధాన్లు, ప్రవేశింతురు)

అగ్నిహో—మనం పోలిశెట్టిదగ్గిర బదులుతెచ్చిన రూపాయలన్నీ అయిపోయినాయి యిప్పటికీ ఖర్చులు ఖర్చులే అంచావు; నాదగ్గిర పకదమ్మిడీలేదు.

రామప్ప—ఖర్చుకానిదీ కార్యాలవుతాయిటయ్యా? మీకడియం యెక్కడైనా తాకట్టుపెట్టండి.

అగ్నిహో—యీవూళ్ళో మనం యెరిగినవాళ్ళెవరున్నారు?

రామప్ప—రండి మధురవాణిదగ్గిర తాకట్టు పెడదాం.

అగ్నిహో—చేసేవి మాఘస్నానాలూ, దూరేవి దొమ్మరి కొంపలూ అని, జటాంతస్వాధ్యాయిని నన్ను ముండలిళ్ళకి తీసికువెళతావుటయ్యా?

రామప్ప—మరి యేకొంపలూ తిరక్కపోతే కేసులుగెలవడం యలాగ? అది అందరు ముండల్లాంటిదీ అనుకున్నారా యేమిటి? సంసారివంటిది. ఐనా మీకు రావడం యిష్టంలేకపోతే నా చేతికివ్వండి, నేనే తాకట్టుపెట్టి సొమ్ము తీసుకొస్తాను.

అగ్నిహో—అలాక్కాదు; నేనుకూడావస్తాను.

రామప్ప—యేదీ కడియం ఇలాగివ్వండి.

అగ్నిహో—యిది మా తాతగార్నాటిది. యిది యివ్వడమంటే నాకేమీ యిష్టం లేకుండావుంది. డబ్బు వూరికే ఖర్చుపెట్టించేస్తున్నారు; మీరు కుదిర్చినవకీలు తగిన వాడుకాడవ ; యింగ్లీషూరాదు దేసీమీలేదూ.

రామప్ప—ఆయన్లాంటి చెయ్యి యీ జిల్లాలోలేదు ఆయన్ని చూస్తే డిస్ట్రిక్టు కలక్టరుగారికి ప్రాణం. ఇంతకీ మీరేదో పట్టుదల మనుష్యులనుకున్నానుగాని, మొదటున్న వుత్సాహమిమ్మాకు యిప్పుడులేదు మీకు డబ్బుఖర్చుపెట్టడం యిష్టంలేకపోతే మానేపాయెను. "యావత్తైలం, తావద్వ్యాఖ్యానం" అన్నాడు. మరి నాకు శలవిప్పించెయ్యండి.

అగ్నిహో—(ఆలోచించి) అయితే తాకట్టుపెట్టండి. (అని నిష్ఠురముగా కడియము తీసియిచ్చును.)

రామప్ప—(తనచేతి నెక్కించుచు) యీ కేసుల్లో యిలాగా శ్రమపడుచున్నానుకదా? నాకొకపమ్మిడీ అయినా యిచ్చావుకాదుగదా?

అగ్నిహో—అయితే నాకడియం వుడాయిస్తావాయేమిషి ?

రామప్ప—నేను మీకు యెలాంటి వకీల్ని కుదిర్చాను ! ఆయన మీవిషయమై యంత శ్రమపడుతున్నాడు ! ఇదుగో ఆయనవస్తున్నాడు,

(నాయడు ప్రవేశించును)

రామప్ప—(తనలో) యేమిటిచెప్మా వీడు మధురవాణి బసపెరటి దడ్డీవేపునుంచి వస్తున్నాడు? వీడుకూడా మధురవాణిని మరిగాడాయేమిటి? వీణ్ణియీ కేసులోనుంచి తప్పించెయ్యాలి.

నాయుడు—యేమండీ రామప్పంతులన్నా మిగతాఖీజు యిప్పించారు కారుగదా?

అగ్నిహో—మీరు రాసిన డిఫెన్సు బాగుండదికాదని భుక్తగారన్నారవ.

నాయుడు—ఎవడా అన్నవాడు? గుడ్లు పీకించేస్తాను. రామప్పంతులన్నగారూ చూశారండీ - డిఫెన్సు యెంతజాగ్రితగా తయార్ చేశానో. నాదగ్గిర హైకోర్టువకీళ్ళుకూడా ప్లయింట్లు రాసుకువెళ్ళిపోతారు. యీకుర్లు కేసనగా యేపాటి ? నేచెప్పినట్లల్లా సాక్షినడిస్తే నేపట్టినకేసు పోవడమన్నమాట యెన్నడూలేదు. యీ డిఫెన్సు చిత్తగించండి, (చంకలోని రుమాల్ కట్టతీసివిప్పి అందులో ఒక కాగితముతీసి చదువును)

"ఫిర్యాదీచెప్పిన సంగతులు యావత్తూ అబద్ధంకాని యెంతమాత్రం నిజం కావు." చూశారూ ఆవక్కమాటతోటే ఫిర్యాదీవాదం అంతా పడిపోయింది. "ఫిర్యాదీ నామీదసగిట్టక దురుద్దేశంతో కూహకంచేసి కేసు తెచ్చినాడు గాని యిందులో యెంతమాత్రం నిజంలేదు."

రామప్ప—డీఫెన్సు మాటకేమండిగాని అవధాన్లుగారు పైసాలేదంటున్నారు.

నాయుడు—పైసా లేకపోతే పనెలాజరుగుతుంది?

రామప్ప—ఒకసంగతి మనవిచేస్తాను యిలా రండి. (రామప్పంతులు, నాయుడు, వేరుగా మాటలాడుదురు)

రామప్ప—నాయుడుగారూ మీవకాల్తీ యీయనకేమీ సమాధానంలేదు. నేనెంత చెప్పినా వినక భీమారావుపంతులుగారికి వకాల్తీయిచ్చాడు. మీకు యింగ్లీషురాదనీ, లారాదనీ, యెవడో దుర్బోధ చేశాడు.

నాయుడు—స్కార్లెట్ దొరగార్ని మెప్పించిన ముండాకొడుకని నాకులా రాకపోతే యీగుంటవెధవలకు ట్రోయ్ లావస్తుంది. పాస్పీసని రెండు యింగ్లీషుముక్కలు మాట్లాడడంతోటేసరా యేమిటి? అందులో మన డిస్ట్రిక్టుకలక్టరుగారికి యింగ్లీషు వకీలంటేకోపం. అందులో బాహ్మడంటే మరీని. ఆమాట ఆలందరికి బోధ పర్చండి.

రామప్ప—మరి కార్యంలేదండి. నే యెంతో దూరం చెప్పాను; తిక్కముండాకొడుకు విన్నాడుకాడు.

నాయుడు—అయితే నన్నిలాగు అమర్యాదాచేస్తారూ? యీ బాహ్మడియోగ్యత యిప్పుడే కలక్టరుగారి బసకువెళ్ళి మనవిచేస్తాను.

(తెరదించవలెను.)

---

ర-వ స్థలము. లుబ్ధావధాన్లుబస.

—:(o):—

లుబ్ధావధాన్లు—(ప్రవేశించి) ఏమి దురవస్థ వచ్చిందీ! నా అంత దురదృష్టవంతుడు లోకంలో యికమరీ లేడు. యేల్నాడి శనిరాగానే కాశీకి జయల్దేరి పోవలిసింది. బుద్ధితక్కువపని చేశాను యిలా రాసివుండగా యెలా తప్పుతుంది,

సౌజన్యరావుపంతులు దేవుఁడు. ఆయనలాంటివాళ్లు వుండబట్టే వర్షాలు కురుస్తున్నాయి. ఆయన శెలవిచ్చినట్టు తప్పంతా వాయందు వుంచుకుని విధిని నిందించడవెఁందుకు? ఇంతడబ్బుండికీన్నీ, డబ్బుకి లోభపడి ఒక్కగా నొక్క కూతుర్ని ముసలివాడికి అమ్మాను. నాజీవానికి ఉసురుమంటూ అది కానిపనులు తిరిగిందంటే దానితప్పా? బుద్ధితక్కువ వెధవని, ముసలితనంలో నాకు పెళ్లేఁ? దొంగముండా కొడుకని తెలిసిన్నీ ఆరావఁప్పంతుల్ని నేన్నమ్మడవేఁవిఁ? ఆ మాయ గుంట పారిపోవడవేంవిఁ? కంటెకి, ఆ అల్లరేమి? ఆయినసికిటరగ కూనీ చేశావఁని మమ్మల్ని సలపెట్టడ వేవిఁటి? అంతా ఘోరకలి; కలి నిండిపోతూంది. ఒక్క సౌజన్యారావుపంతులు సత్యసంధుడు నాకు కనపడుతున్నాడు. కడవఁంతా వకీళ్ళూ, పోలీసులూ, పచ్చిపదొంగలు—ఆయనచక్రిం అడ్డువేసి మమ్మల్ని యీ ఆపదలోంచి తప్పించారంటే కాసీవాసంపోతాం.—యేమిచిత్రాలు! వెధవలకి మతం కట్టారట! యన్నదూ వినలేదు. అమ్మినివెళ్ళి ఆమఠం చూడమంటాను. దానికి యిష్టం కలిగిందా, దానికి కావలసిన డబ్బు యిస్తాను. ఆ వఠంలో వుంటుంది. లేకుంటే, నాతోపాటు కాసీవాసం.

(రామప్పంతులు ప్రవేశించును.)

లుబ్ధా—కంటె, గింటె అని నాతో మీరు ప్రశంసించి కార్యంలేదు

రామ—ఆకంటెమాట ప్రశంసించడానికి రాలేదు మావాఁ. ఆకంటె మధురవాణిది, మీరెరగరా? అదీ, మీరూ యేం జేసుకుంటారో నాకేం కావాలి? కంటెసిగ కోసిరిగాని, మీకు ఓ గొప్ప సాయంచెయ్యడానికి వొచ్చాను. మీ అవస్థ చూస్తే నాగుండె నీరైపోతూంది.

లుబ్ధా—మహాప్రభో! నీకు పదివేల నమస్కారాలు. యిక, యీ పకీరువెధవని వదివెయ్యి.

"రామనామ తారకం।
భక్తిముక్తిదాయకం। జానకీమ"—

రామ—రామ! రామ! యంతమాట అంటివయ్యా! మీరు ఆపదలోవుండి విరక్తి చేత యేమి మాటలన్నా అవి వక్షి, పనిచెయ్యడం నాకువిధి. చెప్పేమాట చెవిని బెట్టండి. ముందూ వెనకా చూడడానికి యిహ టైము లేదు. వ్యవహారం అంతా సూక్ష్మంగా పొను వనుచుకు వొచ్చాను. రెండు సంచులతో, ఖూనీకే

సంతో మంచు విడిపోయినట్టు విడిపోతుంది. ఒక్క యినస్పెక్టరుతో కుదరలేదు. డిప్టీకలక్టరికికూడా చెయ్యి తడిచెయ్యాలి - మీవద్దిర యిప్పుడు సొమ్ము లేదంటిరా, వకచోట వ్యవహారంకూడా పొస్తుపర్చాను. పాలింసరె నోటుమీద యెన్ని రూపాయలు కావలిస్తే అన్నిరూపాయిలిస్తారు

గౌ—నేను వకసమ్మిడీ యివ్వను "రామనామతారకం భక్తిముక్తిదాయకం! జానకీమనోహరం! సర్వలోకనాయకం"॥

రామ—నామాటవినుం. యంతో పరిశ్రమంమీద యీఘట్టం కుదిర్చాను. తాసిల్దారు మీవద్దిర లంచం పుచ్చుకుని కూనీకేసు కామాపు చేశాడని, యినస్పెకటరు, డిప్టీకలక్టరికి గట్టిగా బోధపర్చాను కలక్టరు తలపామీద యినస్పెక్టరు చాలా పట్టుదలగా పనిచేసి, సాక్ష్యం అంతా రడీచేశాడు. కేసు రుజువైనట్టాయనా యేమౌతుందో ఆలోచించుకోండి

గౌ—నీకెందుకు నాయేడుపు?

రామ—డిప్టీకలక్టరు బ్రిహ్మాద్వేషి - తాసిల్దారు తాడు ముందు తెగుతుంది. తరవాత మిమ్మల్నీ, మీ నాత్కీనీ కమ్మెంటు కట్టేస్తారు - పురిసిద్ధం. నాకూ యినస్పెక్టరికీ వుండే స్నేహంచేత యీఘట్టానికి వొప్పించాను గనక నామాటకి చెవొగ్గి యీ ఆపద తప్పించుకోండి.

గౌ—నన్ను బాధపెట్టక నీ మానాన్న నువ్వుపోమా. "రామనామతారకం! భక్తిముక్తిదాయకం"॥

రామ—నీ అంత కర్కోటకుణ్ణి యక్కడా నేను చూడలేదు. నీమాటకేం పెద్ద వాడివి - పసిపిల్ల, కడుపునకన్న మీనాక్షీకి పురిసిద్ధం అయితే, ముండా డబ్బుకి ముందూ వెనకా చూస్తావు! తలుచుకుంటే నాహృదయం కరిగిపోతూంది.

(సౌజన్యారావు పంతులు ప్రవేశించును.)

రామ—తమరు ధర్మస్వరూపులు. లుబ్ధావధాన్లుగారియందు అకారణమైన దయచేత యీకేసులో పనిచేస్తున్నారు. కేసంతా వట్టి అన్యాయమండి. ఒక్కపిసరైనా నిజంలేదు. శలవైతే గట్టి డిఫెన్సుసాక్ష్యం—

సౌజ—నీసంగతి నాకు తెలుసును అవతలికి నడువు.

రామ—తమరు యోగ్యులూ, గొప్పవారూ అయినా, ఏకవచనప్రయోగం—

సౌజ—నమస్తే!

(ఆ మప్పులకులు నిష్క్రమించును.)

సౌజ—ఈ జొల్పాజీని తిరిగీ యెందుకు రానిచ్చావూ?

లుబ్ధా—పొమ్మంటే పోడు బాబూ

సౌజ—యేమొచ్చాడు?

లుబ్ధా—యినస్పెక్టరికీ డిప్టీకలకటరికి లంచం యిమ్మంటాడు.

సౌజ—డిప్టీకలక్టరుగారు లంచం పుచ్చుకోరు. ఆయన నాకు స్నేహితులు; నాకు తెలుసును. లంచాలూ పంచాలూ మీరు యిచ్చినట్టయితే, మీకేసులో నేను పనిచెయ్యను.

లుబ్ధా—తమశలవు తప్పినడుస్తే చెప్పుచ్చుకు కొట్టండి. నాకు భగవంతుడిలాగ తమరు దొరికారు- "పాలనుముంచినా మీరే నీళ్ళనుముంచినా మీరే" అని మిమ్మల్నే నమ్మివున్నాను.

సౌజ—మీరు నేరంచెయ్యలేదని నాకు పూర్తి అయిన నమ్మకంవుంది నిజం కనుక్కోడానికి చాలాప్రయత్నం చేస్తున్నానుగాని ఆగుంటూరుశాస్తుల్లు యవడో భేదించలేకుండా వున్నాను మీరు జ్ఞాపకం మీద చెప్పినచహరా గుంటూరు వ్రాసి పంపించాను. అక్కడ అలాటిమనిషి యవడూలేడని జవాబువొచ్చింది.

లుబ్ధా—అదేంమాయో బాబూ! మీసాయంవల్ల యీగండంగడిచి, నాపిల్లా నేనూ యీ అపదలోంచి తేలితే, నాడబ్బంతా, మీపాదాలదగ్గిర దాఖలుచేసి కాసీపోతాను.

సౌజ—మీడబ్బు నాకక్కరలేదని మీతో మొదటే చెప్పాను. నే చెప్పినమాటలు మీకు నచ్చి; ముసలివాళ్లు పెళ్ళాడకూడదనీ, కన్యాశుల్కం తప్పనీ, యిప్పటికైనా మీకు నమ్మకంకలిగితే, యిలాంటి దురాచారాలు మాన్పడానికి రాజమహేంద్రవరంలో వక సభవుంది, ఆసభకి కొంచవో గొప్పో మీకు తోచినడబ్బుయివ్వండి. హితంపులమాటాలకి మీపిల్లని పంపడం నాసలహా.

లుబ్ధా—తమచిత్తం, తమశలవు. చేసినతప్పలు, తప్పలని శల్యాల్నిపట్టిపోయింది. బుద్ధివొచ్చింది బాబూ.

సౌజ—ఆగుంటూరు శాస్తుల్లుకి పరవంట దేశపు యాసవుండేదా? బాగా జ్ఞాపకం చేసుకు చెప్పండి.

బ్ధా—(ఆలోచించి) లేదండి.
పూజ—బాగా జ్ఞాపకం తెచ్చుకోండి.
బ్ధా—లేదండి.

(తెరదించవలెను.)

---

## ౫-వ స్థలము. విశాఖపట్టణంలో.

—:(౦):—

[మధురవాణి యింటి యెదటివీధిలో కరటకశాస్త్రి, శిష్యుడూ ప్రవేశింతురు]

టట—నువ్వు ఆకంటె వాళ్ళనెత్తిని కొట్టకుండా లేచిరావడంనుంచి, యీముప్పంతా వొచ్చినట్టు కనబడుతుంది.
ష్యుడు—మధురవాణికంటె మధురవాణికి యివ్వడంతప్పాఅండి ?
టట—తప్పకాదా? నువ్వు యిచ్చావని, మరి అదివొప్పకుందా? "తే, ధగిడీకె కంటె తెస్తావా, చస్తావా?" అని రామప్పంతుల్ని పీకపిండేట్టిది. దానిబాధపడలేక, ఆ రామప్పంతులు కూనీ కేసని యెత్తు యెత్తాడు. ఆముసలాడికి సిక్ష అయిపోయిందంటే, బ్రహ్మహత్య నా మెడకిచుట్టుకుంటుంది. నువ్వు అంటూ ఆకంటె వాళ్ళయింట వొదిలేస్తే, నాకు యీ దిక్కూలేకపోవునుగదా?
ష్యుడు—విధవముండ గూబగదలేస్తుంటే కంటె గింటె యవడికి జ్ఞాపకం వొస్తువండి? చెయికరచి, పెట్టెతీసి, మెహురు అంకించుకుని, చెంగునగోడ గెంతాను. విజ్యండువొందలు మీరుపటారిగా, నాకు పెళ్ళిలోపెట్టిన కంటె నేను తెచ్చననా, తప్పుపట్టుతున్నారు ? ఆకంటె అయినా దక్కిందా? చూస్తునే మధురవాణి లాక్కుంది.
కట—నేను హాస్యగాణ్ణేగాని, యీకూనీ గడబిడతో నాహాస్య మంతా అణిగిపోయింది. గనక యిక హాస్యంమాను - నేను తీసుకున్న రూపాయలు, లుబ్ధావధాన్లుకి యిప్పటికైనా పంపించడానికే తలచాను! అంతేగాని అపహరిద్దామని అనుకోలేదు - మధురవాణిని యలాగైనా లయలేసి, కంటె యరువుపుచ్చుకుని, ఆకంటా, యీ రూపాయలూ, బంగీకట్టి అవుధాన్లుకి పంపించేస్తే, కూనీ, నిజంగాదని పోల్చుకుంటారు నాకు యీ బ్రహ్మహత్య తప్పిపోతుంది.

శిష్యుడు—మీనాస్తులు సౌజన్యారావు పంతులుగారితో నిజంచెప్పెయ్యరాదాఅండి

కరట—వెఱ్ఱి కుదిరింది, రోకలి తలకి చుట్టమన్నాట్ట! వెనకటికి యవరో పోలీసు, తల్లి కూరగాయలు పుచ్చుకుంటే, జుల్మానా వేశాట్ట; సౌజన్యారావు పంతులు అలాటి వాడు. ఆయనతో మనం వున్నమాట చెప్పావంటే, ఆయన నిజం కోర్టులో చెప్పేస్తాడు. ఆపైని లుబ్ధావధాన్లు పీకవుకి, మన పీకకి తగులుకుంటుంది.

శిష్యుడు—"మన" అంటున్నారేవిఁటి?

కరట—మాట పొరపాటురా. రామప్పంతులు వూరికి వెళ్ళినమాట నిజవేఁనా?

శిష్యుడు—నిజవేఁ.

కరట—వాడికంట పడ్డావంటే—

శిష్యుడు—పడితే?

కరట—మరేంలేదు. మధురవాణిగాని కంటె మనకి యెరువుయివ్వడానికి వొప్పుకుంటే ఆంజనేయస్వామికి పదిశేర్లనెయ్యి దీపారాధనచేస్తాను.

శిష్యుడు—కడుపులోకి వెళ్ళవలసిన నెయ్యి కాల్చెయ్యడం నాకేమీ యిష్టంలేదు. అప్పు తగుండీ మొక్కుకోండి.

కరట—హాస్యంచాలించు తెలిసిసిగోడుతుంది.

(నిష్క్రమింతురు.)

---

## ౨-వ స్థలము, మధురవాణి బసలోగది.

—:0:—

[మధురవాణి కుర్చీమీద కూచునియుండును. కరటకశాస్త్రుల్లు, శిష్యుడూ, ప్రవేశింతురు. మధురవాణి నిలబడును.]

మధు—గురువుగారికి పదివేలదండాలు; శిష్యుడికొక చిన్నముద్దు (శిష్యుని ముద్దు బెట్టుకొనును.)

కరట—నీపుణ్యం వుంటుంది. నా అల్లుణ్ణి చెడగొట్టకు.

మధు—అల్లుడెవరు?



కరట—మాపిల్లని యితగాడికి యిచ్చి, కన్యాదానం చేస్తాను.

మధు—జెయిలునుంచి వొచ్చినతరవాతప పెళ్ళా? లేక, పెళ్ళిచేసుకుని, మఠప్రవేశవా?

శిష్యు—జయిలేవిఁటండోయి?

కరట—వొట్టినే హాస్యానికంటూంది.

మధు—పాపం ఆపసిపిల్లవాడికి వున్న నిజస్థితి చెప్పండి తనవాళ్ళని వెళ్ళిచూశైనా వస్తాను.

శిష్యు—(కరటకశాస్త్రితో) కొంపముంచారో?

మధు—ముంచడం అంటే ఆలాగా యిలాగానా?

కరట—నీపుణ్యంవుంటుంది. హాస్యంచాలించు. లేకపోతే కుఱ్ఱవాళ్ళకి పెద్దల గురించు భక్తి చెడుతుంది.

శిష్యు—నేనేంతప్పుచేశాను? గురువుగారు చెప్పినపనిచేశాను. ఆతప్పూ వొప్పూ ఆయందే.

మధు—మరేమిచేసితిరో, నాకు తెలియదుగాని' మీాయిద్దరికోసం హెడ్ కనిస్టీబు గాలిస్తున్నాడు దొరకగానే మఠప్రవేశం చేస్తాడట యీామాటమట్టుకు నాకు రూఢీగా తెలుసును

శిష్యు—యిదేనా మీారు నాకు చేస్తానన్న పెళ్ళి?

కరట—యేమైనా జట్టీవస్తే, నీప్రాణానికి నాప్రాణం అడ్డువెయ్యనటా?

మధు—వొస్తే జట్టీ గురుశిష్యులకు యిద్దరికీ వొక్కమారే వస్తుందిగాని, ఒకరికి రావడం ఒకరు అడ్డుపడడం అన్నమాట వుండబోదు. యెప్పుడైనా మీాయిద్దరి ప్రాణాలకీ నేను కనికరించి, అడ్డుపడాలిగాని, మరియవడికీ సాధ్యంకాదనుకుంటాను.

శిష్యు—మాగురువుగారి మాటకేం; ఆయనపెద్దవారు; యేవొచ్చినా సద్దుకోగలరు. నేను పాపం పుణ్యం యెరగని పసిపిల్లవాణ్ణి, నాప్రాణానికి నీప్రాణం అడ్డువేశా వంటే, కీర్తి వుండిపోతుంది.

మధు—నీగురువుని వొదిలేసి నాదగ్గిర శిష్యరికం చేస్తావా?

శిష్యు—యిదిగో— యీానిమిషం వొదిలేస్తాను. (బుగ్గలుగాలితో పూరించిపిడికిళ్ళతో తట్టి గురువుతో) మీానేస్తం యీావేళతోసరి. మరి ఆడవేషం యీాజన్మంలో వెయ్యను.

మధు—నాటకంలోకూడా వెయ్యవా ?

శిష్యు—మరి నాటకం గీటకం నాకొద్దు.

మధు—నాదగ్గిర శిష్యరిక అంటే యేవేంజెయ్యాలో తెలుసునా ?

శిష్యు—నీళ్ళుతోడుతాను, వంటచేస్తాను. బట్టలుతుకుతాను. గాని బ్రాహ్మణ్ణిగదా కాళ్ళుపట్టమనవుగదా?

మధు—(విరగబడినవ్వి) యిదా నీగురువుదగ్గిర చేసే శిష్యరికం ?

శిష్యు—మరిచిపోయినాను. చిడప్పాక్కులుకూడా గోకుతాను.

మధు—(నవ్వి) పెంకా ?

శిష్యు—యేనాఖరీ చెయ్యమంటే ఆనాఖరీ చేస్తాను.

మధు—నన్ను ముద్దెట్టుకొమ్మన్నప్పుడల్లా ముద్దెట్టుకోవాలి.

శిష్యు—ముద్దెట్టుకుంటాను.

కరట—వాడు కుఱ్ఱవాడు - వాణ్ణెందుకు చెడగొడతావు? ఆశిష్యరికం యేదో వాడితరప్పునా, నాతరప్పునాకూడా నేనే చేస్తాను. చాతనైతే చక్కింఅక్కడయి.

మధు—"గురువూ శిష్యుడాయె శిష్యుడూ గురువాయె"
మీరు శిష్యులు కావాలంటే యిస్కూలు జీతం యిచ్చుకోవాలి.

కరట—పిల్లికి చెలగాటం; యలక్కి ప్రాణపోకటా !

మధు—మీరాయలక?

కరట—అవును.

మధు—మీరు యలకకారు. పందికొక్కులు. మీశిష్యుడు యలక.

కరట—పోనీ—వాణ్ణయినా కాపాడు

మధు—అదే ఆలోచిస్తున్నాను.

కరట—బుద్ధీ బుద్ధీ కలిస్తే రాపాడుతుంది నీ ఆలోచన యేదో కొంచం చెవినపట్టయనా నా ఆలోచనకూడా చెబుతాను. కలబోసుకుందాం.

మధు—మీ ఆలోచన ముందుచెప్పండి.

కరట—మరేమీలేదు. నేపుచ్చుకున్న పజ్యెందువొందల రూపాయల నోట్లూ, అకంటా, [illegible] ఉద్ధావధాన్లకి పంపి

స్తాను. దాంతోటి కూనీకేసు నిజంకాదని సౌజన్యారావు పంతులుగారు పోల్చుకుంటారు. ఆపైని దైవాధీనం!

మధు—మీకుకంటె యలా వొస్తుంది?

కరట—నువ్వు అనుగ్రహిస్తేను.

మధు—(ముక్కుమీద వేలువుంచుకుని) చిత్రం! బ్రాహ్మలు యంతకైనా తగుదురు.

కరట—యేవిఁ అలా అంటున్నావు?

మధు—నాకంటె తిరిగీ నేను కళ్ళమాడడం యెలాగ?

కరట—సౌజన్యారావు పంతులుగారు నీవస్తువ నీకు యిచ్చేస్తారు. ఆయన బహున్యాయమైనమనిషి.

మధు—అంతమంచివాడా?

కరట—అందుకు సందేహావేఁవిటి?

మధు—యెంతమంచివాడు?

కరట—అంత మంచిమనిషి మరి లోకంలో లేడు.

మధు—ఆయన్ని నాకు చూడాలనుంది. తీసికెళ్తారా?

కరట—నా ఆబోరుంటుందా? ఆయన సానివాళ్ళని చూడరు.

మధు—అంటే నాచ్చి కాబోలు?

కరట—యింగిలీషు చదుక్కున్నవాళ్ళకి కొందరికి పట్టుకుంది యీచాదస్తం! అయినా అందులోనూ దేశకాలాలనుబట్టి, రకరకాలు లేకపోవడంలేదు.

మధు—సౌజన్యారావుపంతులుగారిది యేరకం? గిరీశంగారిది యేరకం?

కరట—యేమి సాపత్యం తెచ్చావు? కుక్కకి గంగగోవుకూ యెంతవారో, వాడికీ ఆయనకు అంతవార, సౌజన్యారావుపంతులుగారు కర్మణా, మనసా, వాచా, యాంటీనాచి "వేశ్య" అనేమాట, యేమరి ఆయనయదట పలికితివఁట్టాయనా, "అనందర్భం!" అంటారు. ఆయనలాంటి అచ్చాణీలు అరుదు. మిగిలినవారు యథాశక్తి యాంటీనాచులు. ఫాఁజు ఫొజంతా, మాటల్లో మహావీరులే. అందులో గిరీశం అగ్రగణ్యుడు. కొందరు బంట్లు పొగలు యాంటీనాచి, రాత్రిప్రోనాచి; కొందరు పున్నవూళ్లో యాంటీనాచి, పరాయివూళ్లో ప్రోనాచి; కొందరు శరీరదాఢ్యౖం వున్నంతకాలం ప్రోనాచి, శరీరం చెడ్డతరవాత యాంటీనాచి; కొందరు

ఒతికివున్నంతకాలం పోషినాచి, చచ్చిపోయినతరవాత యాంటీనాచి; కొందరు అదృష్టవంతులు చచ్చినతరవాతకూడా ప్రోనాచే. అనగా యజ్ఞంచేసి పరలోకంలో భోగాలికి టిక్కట్లు కొనుక్కుంటారు. నాబోటి అల్పప్రజ్ఞకలవాళ్ళు, లభ్యం కానప్పుడల్లా యాంటీనాచె

మధు—మీయోగ్యతచెప్పేదేమిటి! గాని, హెడ్డుగారిమాటలుచూస్తే, సౌజన్యారావు పంతులుగారు లుబ్ధావధాన్లుగారిని కాపాడడానికి, విశ్వప్రయత్నం చేస్తూ వున్నట్టు కనబడుతుంది. యేమికారణమో?

కరట—చాపలు యీదడానికి, పిట్టలు యెగరడానికి, యేంకారణమో అదేకారణం.

మధు—పరోపకారం ఆయనకు సహజగుణమనా?

కరట—కాకేవిఁ?

మధుర—మీరెందుకు, కొంచెం ఆయీదడం, యెగరడం నేర్చుకోకూడదు?

కరట—నీమాట అర్థంకాలేదు.

మధుర—యీ కేసులో నిజమేదో సౌజన్యారావు పంతులుగారితో చెప్పి మీరు కూడా - కొంచం లోకోపకారం చెయ్యరాదా?

కరట—మామంచి సలహా చెప్పావు! తనకుమాలిన ధర్మమా? "స్వయంతీర్ణః పరాం స్తారయతి" అన్నాడు నిజంచెబితే పంతులు యేవంటాడో నీకు తెలుసునా? "శాస్తుల్లుగారూ మీరు నేరంచేశారు, నే నేఁమిచెయ్యగలను? మిమ్మల్నిగురించి నాకుచాలా విచారంగావున్నది" అని వగుస్తూ, పోలీసువాళ్ళతో చెప్పి, జైయిలులోకి వప్పచెప్తాడు. జైయిలునుంచి తిరిగీ వచ్చిందాకా మాత్రిం నెలకో పాతికో, పరకో కనికరించి నాభార్యాకు యిస్తూవుంటాడు. ఆలాంటి ప్రమాదం లేకుండా కార్యసానుకూలం కావడంకోసమే యీయెత్తు యెత్తాను.

మధుర—సరె, సౌజన్యారావు పంతులుగారు మంచివారు గనక ఆయనదాకావస్తే నాకంటె నాకు యిప్పించేస్తారు గాని, లుబ్ధావధాన్లు ఆమూపాయలూ కంటా పెట్లో పెట్టుకుని ముంగిలా మాట్లాడకుండా వూరుకుంటేనో?

కరట—దానిఖరీదు నేనిచ్చుకుంటాను.

మధు—తమరు ఒకవేళ మఠంలో ప్రవేశిస్తే మరి నాకు కంటె ఖరీదుయిచ్చేవారెవరు? అందుచేత అర్థంలో ... నాదగ్గిర తాకట్టువుంచండి.

—అలాగనే,

—ఘోసాంక్షేమంబోయింది. నాపెళ్లో?

—నాలికా తాటిపట్టెం?

—మీరోవేళ—జయిల్లోకివెళితే,—

—గురువుకు తగిన శిష్యుడివౌదువు!

—అంత ఉపకరించావాస్తే, నీపెళ్ళిమాట నాపెళ్ళాంతో యరేంజిమెంటుచేసి మరీ వెళతాను.

—యేమో! ఘోరవైనప్రమాణం చేశారుగదా?

—మధురవాణీ. కొంచంశ్రమచేసి కంటెతేవా?

—యేవొచ్చిందితొందర?

—హెడ్డుగాని, రామప్పంతులుగాని, వొచ్చాడంటే నాకొంప మునుగుతుంది.

—మునిగితే తేలుస్తాను.

—అంత చాకచక్యం నీకులేదనికాదు.

(మధురవాణి లోనికివెళ్లును)

—అది చెప్పినట్లల్లా చెయ్యక, కొంచంపై ఒచ్చేదికాని, మరీ నడుస్తావుంటే మేవైనావుంటే, నాచెవిని పడేస్తూంటుం.

—యవరిదగ్గిర వున్నప్పుడు వారు చెప్పిందల్లా చెయ్యడవే, నా నిర్ణయం. మీరు యేంపైకాని, నాచేత ఆడవేషంవేయించి పెళ్ళిచేశారో?

—ప్రమాదోధీమతామపి. యంతటివాడికైనా ఒకప్పుడు కాలుజారుతుందిరా!

(మధురవాణి కంటెపట్టుకు ప్రవేశించి)

—తాకట్టువస్తువ తప్పించుకు పారిపోతేనో? కుక్కా, నక్కా, కాదుగదా గొలుసులువేసి కట్టడానికి?

—నీ వలల్లో పడ్డప్రాణి మరి తప్పించుకుపోవడం యలాగ? వాటికి వున్న పటుత్వం యేవుక్కుగొలుసులకూ వుండదు.

—వలలో ముత్యపు చిప్పలుపడితే లాభంగాని, నత్తగుల్లలుపడితే మోతచేటు.

—యింతనేర్పూ డబ్బూ, డబ్బూనా! [illegible] అవేవి వుంటాయా?

,మధు—స్నేహం మీలాటివారిచోట; అందుచేతనే, కష్టపడి ఆర్జించిన కంటె మీపాలు చేస్తున్నాను. మాతల్లి చూస్తే, భవిష్యంవుంచునా ? యిక వలపా ? బతుకనేది వుంటే, వలపువస్నె తెస్తుంది. అంగడివాడికి మిఠాయిమీది ఆశా, సానిదానికి వలపూ, మనస్సులోనే మణగాలి; కొద్దికాలంవుండే యవ్వనాన్ని జీవనాధారంగా చేసుకున్న కులానికి వలపు ఒక్కచోటే.

కరట—యక్కడో?

మధు—బంగారంమీద శృంగారం వస్నె చెడిన దగ్గిరనుంచీ, బంగారంగదా తేటు తేవాలి? ఆబంగారం మీకు ధారపోస్తూవున్నప్పుడు నా స్నేహం యెన్ననేల?

కరట—నీస్నేహం చెప్పేదేమిటి! గాని నీ యౌవ్వనం, నీశృంగారం దేవశాస్త్రులకు వలె శాశ్వతంగా వుంటాయి.

మధు—మాతల్లి ధర్మమా అని, ఆమె నా చెవిలో గూడుకట్టుకుని బుద్ధులు చెప్పబట్టి గాని, లేకుంటే మీలాంటి విద్వాంసుల యిచ్చకాలకి మైమరచి, యీపాటి వూళ్లోసానులవలె చెడివుండనా?

కరట—మీతల్లి అనగా యెంత బుద్ధిమంతురాలు! దానితరిఫీదుచేతనే నువ్వు విద్యా సౌందర్యాలు రెండూ దోహాతంచేసి పెంచుతున్నావు?

మధు—అంతకన్న కాపుమనిషినై పుట్టి, ముంగిటిపాలంలో వంగమొక్కలకూ, మిరపమొక్కలకూ దోహదంచేస్తే, యావజ్జీవం కాపాడే తనవాళ్ళన్నవాళ్ళు వుందురేమో?

కరట—యేమి చిన్నమాట అన్నావు! మధురవాణి అంటూ ఒక వేశ్యాశిఖామణి యీ కళింగరాజ్యంలో వుండకపోతే, భగవంతుడిసృష్టికి యెంతలోపం, వచ్చివుండును!

మధు—సృష్టికి లోపం వచ్చినా రాకపోయినా, యిప్పటి చిక్కులలో మీకుమట్టుకు కించిత్ లోపం వచ్చివుండును.

కరట—మమ్మల్ని తేల్చడానికి నీ ఆలోచన యేదో కొంచం చెప్పావుకావుగదా?

మధు—నన్ను సౌజన్యారావు పంతులుగారి దగ్గిరకు తీసుకువెళ్ళడానికి వొప్పావు కాదుగదా?

కరట—ఆయన నిన్నూ, నన్నూ యింట్లోంచి కఱ్ఱపుచ్చుకు తరుముతాడు.

మధు—కోపిస్తా?

కరట— ఆయనకి కోపవన్న మాటేలేదు.

మధు—ఐతే భయమేల?

కరట—చెడ్డవారివల్ల చెప్పుదెబ్బలు తినవచ్చునుగాని, మంచివారివల్ల మాటకాయడం కష్టం.

మధు—కొత్త సంగతి వకటి యీనాటికి నాకు తెలిసింది. సృష్టికల్లా వన్నె తెచ్చిన మధురవాణి అనే వేశ్యాశిఖామణి గిరీశంగారివంటి కుక్కలపాత్తుకే తగివున్నది గాని, సౌజన్యారావు పంతులుగారివంటి సత్పురుషులను చూడడమునకైనా అర్హత కలిగివుండలేదు. గిరీశంగారు దానియింట అడుగుపెట్టగానే, మీ చెల్లెలుగారి యింట, అడుగు పెట్టడానికి ఆయనకు యోగ్యత తప్పింపని మీ నిర్ణయం తమలాంటి పండితోత్తములుమాత్రం కార్యావసరం కలిగినప్పుడు వూరావాడా వెతికి, మధురవాణిదగ్గర లాచారీపడవచ్చును. అయితే డిప్టీకలక్టరూ కుక్కేనా?

కరట—లంచం తినడుగాని ఆయనకు స్త్రీవ్యసనం కద్దు. పెద్ద వుద్యోగస్థుడు గనక, సీమకుక్క అని అందాం, ఆయన్నిగానీ వలలో వేశావా యేమిటి?

మధు—వేస్తే?

కరట—ఇది కానన్నమాట! ఆయన సాయంవుంటే, కేసు మంచులావిడిపోతుంది. తెలిసింది. యిదా, నువ్వుచేసిన ఆలోచన? యెంత గొప్పదానివి!

మధు—ఆయన నాయుడుచేత రాయభారాలు పంపుతున్నారు.

కరట—వెళ్ళు, వెళ్ళు, వెళ్ళు, వెళ్ళు, యింకా ఆలోచిస్తావేమిటి? నీ అదృష్టం నా అదృష్టం యేమని చెప్పను!

మధు—వెళ్ళ తలచుకోలేదు.

కరట—చంపిపోతివే! ఆయన ఒక్కడే మమ్మల్ని కాపాడగలిగినవాడు.

మధు—యిటుపైని వూరకుక్కలనూ, సీమకుక్కలనూ దూరంగావుంచడానికి ఆలోచిస్తున్నాను.

కరట—ఆయనని హాస్యానికి సీమకుక్క అని అన్నానుగాని, యెంత రసికుడనుకున్నావు? చేతికి యెముకలేదు! హెడ్డుకనిష్టీబుపాటి చేశాడుకాడా?

మధు—పట్నంవొదిలి పల్లెటూరు రాగానే, మీదృష్టిలో, పలచనైతినో? హెడ్డును శాఖులా తిప్పుతున్నాను [illegible] నాలుగు [illegible] సర్కారు

28

కొలువుమాని ఆతడు నాకొలువు చేశాడు. అతడిసాయం లేకపోతే, మీరు ఆవూరి పొలిమేరదాటుదురా? యీదాసరి దాటునా? లోకంఅంతా యేమి స్వప్రయోజక పరులూ!

కరట—అపరాధం! అపరాధం! కలక్టరుని చూడనంటే, మనస్సు చివుక్కుమని అలా అన్నాను. నువ్వు ఆగ్రామం గ్రామం సమూలం రాణీలాగ యేలడం నేను యీ కళ్ళతో చూడలేదా?

మధు—నేను కలక్టరును చూడనంటే, మీమనస్సు చివుక్కుమనడం యెట్టిది? యేమి చిత్రం! సౌజన్యారావు పంతులుగారు యీమాటవింటే సంతోషిస్తారు కాబోలు?

కరట—పీకవుత్తరిస్తారు.

మధు—అదేదో చూస్తాను.

కరట—బ్రహ్మహత్య కట్టుకుంటావా యేమిటి?

మధు—ఆహా! యేమి బ్రాహ్మలూ!—అయినా పోలిశెట్టి చెప్పినట్టు, యెంత చెడ్డా బ్రాహ్మలు గదా? యిందండి; (కంటెయిచ్చును) తిలోదకాలేనా?

కరట—యెంతమాట! పువ్వులలో పెట్టి మళ్ళీరాదా? నీయెదట అనవలిసిన మాట కాదు. నీలాంటి మనిషి మరిలేదు. కించిత్ తిక్కలేకుంటేనా!

మధు—ఆతిక్కేగదా యిప్పుడు మీకు వుపచరిస్తూంది?

కరట—యేం వుపచరించడం? చంపేశావు! ఆ డిస్ట్రిక్టకలక్టర్ని ఒక్కమాటు చూసి యీ బీదప్రాణిని కాపాడితే—

మధు—చాలించండి. యిక విజయంచెయ్యండి (వెళ్ళిపొమ్మని చేతితో ఆజ్ఞ చేయును. కరటకశాస్త్రుల్లు, శిష్యుడు నిష్క్రమించుచుండగా) శాస్త్రుల్లుగారూ!

(కరటకశాస్త్రుల్లు తిరిగీ ప్రవేశించును.)

మధు—మీపిల్లని మహేశానికి యిస్తారా?

కరట—యిస్తాను.

మధు—అయితే నాకో ఖరారు చేస్తారా?

కరట—చేస్తాను.



మధు—యిక అతణ్ణి నాటకశాలాడించి, ముండపిళ్ళతిప్పి చెడగొట్టకండి.

కరట—యిటుపైని చెడగొట్టను- వాకుమాత్రం అక్కర్లేదా? (పాదంపట్టి) నీది గురూపదేశం మధురవాణీ!

మధు—బ్రాహ్మలలో ఉపదేశంలావు, ఆచరణతక్కువా. ఖరారేనా?

కరట—ఖరారే.

మధు—బ్రాహ్మలు కాగానే, దేవుడికళ్లల్లో బుగ్గిపొయ్యలేరు అనుకుంటాను.

కరట—చివాట్లకిదిగా వేఁవిటి?

మధు—చిత్రగుప్తుడికి లంచం యివ్వగలరా? అతడిదగ్గిరకి మధురవాణిని పంపి, చేసిన పాపాలు అన్నీ తుడుపుపెట్టించడానికి వీలువుండదు కాబోలు?

కరట—మధురవాణీ! జరూరు పని ఒకటుంది. మరిచిపోయినాను - వెళ్ళి రేపు మళ్ళీ వస్తాను.

మధురవాణి—(నవ్వుచేత కుర్చీమీద విరగబడి, తరవాత నవ్వు సమాళించుకొని) ఒక్కనిమిషం ఆగండి. శిష్యుడా! (శిష్యుడు ప్రవేశించును) యేదీ, నాకు నువ్వు రామచంద్రపురంఅగ్రహారంలో, రామప్పంతులు యింటి బైటనూ, నేనూ మీనాక్షమ్మా తలుపు యివతలా అవతలా ఖైదాయించి వుండగా, తెల్లవారఝామున నిశ్శబ్దంలో ఆకాశవాణిలా పాడిన చిలక పాటపాడి నీమావఁగారికి బుద్ధిచెప్పు. శమమూలంగా ఒక ముసలిబ్రాహ్మడికి ముప్పవస్తూవుంటే తమశరీరం దాచుకుంటున్నారు.

శిష్యుడు—(పాడును) యెఱ్ఱనిముక్కుగలది రామచిలుక | దాని.

మధు—(బెత్తముతో కొట్టబోయినట్టు నటించి) చెప్పినపని చెయ్యకపోతే జులుసిద్ధం.

(శిష్యుడు—"యెన్నాళ్లు బ్రతికినా" అను పాటపాడును రెండు చరణములు పాడిన తరువాత.)

కరట—అతిజరూరు పనివుంది మధురవాణీ మరోమాటువస్తాను (నిష్క్రమించుచూ) తలవాయగొట్టింది. తెల్లవెంట్రుకలు లావయినాయి - మనసు కొంచం మళ్ళించుకుందాం.

## ౨-వ స్థలము సౌజన్యారావు పంతులుగారి యింట్లో కచేరీగది.

——:)o(:——

[సౌజన్యారావు పంతులుగారు, అగ్నిహోత్రావధాన్లు ప్రవేశింతురు.]

సౌజన్యా—ఇక మిమ్మల్ని జయించినవాడు లేడు. పిల్లల్ని అమ్ముకోవడం శిష్టాచారం అంటారండీ?

అగ్ని—ఆహా. మా మేనత్తల్ని అందరినీకూడా అమ్మారండి. వాళ్ళంతా పునిస్త్రీ చావే చచ్చారు. మాతంగిరి మేనత్తల్నికూడా అమ్మడమే జరిగిందను. యిప్పుడు యీ వెధవ యింగిలీషు చదువురుంచి ఆ పకీరువెధవ దాన్ని లేవదీసుకుపోయినాడుగాని, వైధవ్యం అనుభవించినవాళ్ళంతా పూర్వకాలంలో యెంతప్రతిష్ఠగా బతికారు కారు?

సౌజ—పసిపిల్లల్ని కాలంగడిచినవాళ్ళకి పెళ్ళిచేస్తే వైధవ్యంరాక తప్పుతుందా? నింపాదిచేసి కొంచెం యోచించండీ.

అగ్ని—ప్రాలుబ్ధం చాలకపోతే ప్రతివాళ్ళకీ వస్తుందండి - చిన్నవాళ్ళకిచ్చినా, పెద్దవాళ్ళకిచ్చినా, రాసినరాత యెవడైనా తప్పించగలడా?

సౌజ—మీరు చదువుకున్నవారుగదా, ప్రారబ్ధమని పురుషప్రయత్నం యే వ్యవహారంలో మానేశారు? లేదు, "విధికృతం; యలావుంటే అలా అవుతుందని" పకీర్ని పెట్టటం మానేశారా? కన్యలని అమ్ముకోవడం శాస్త్రనిషిద్ధంకాదా? డబ్బుకిలోభించి పిల్లల్ని ముసలవాళ్ళకి కట్టబెట్టి విధికృతం అనడం న్యాయమేనా? శెలవియ్యండి.

అగ్ని—యిప్పుడు మీ లౌక్యుల్లో వెయ్యేసి, రెండేసివేలు, వరకట్నాలు పుచ్చుకుంటున్నారుకారండీ? గిరీశంగారు చెప్పినట్టు—వాడిపిండం పిల్లలికిపెట్టా!— మీలో ఆడపిల్లలికి యిన్నితులాలు బంగారంపెట్టాలి యిన్నితులాలు వెండిపెట్టాలి అని నిర్ణయించుకోవడంలేదా? అదిమాత్రం కాదేం కన్యాశుల్కం?

సౌజ—అలా చెయ్యడం నేను మంచిదన్నానా? యేమిటండి? "గిరీశంగారు చెప్పినట్టు" అని అన్నారేమిటి?

అగ్ని—ఆ వెధవ [illegible] చెప్పాకండి.

సౌజ—క్షమించండి గాని- మీ రెండో పిల్లకి తగినవరుణ్ణి చూసి పెళ్లిచెయ్యండి. యేం సుఖపడుతుందని ముసలివాళ్లకి యివ్వడం? శలవియ్యండి.

అగ్ని—అదంతా మీ కెందుకయ్యా? ఓహో యిందుకా నన్ను పిలిపించారు? మీ గృహకృత్యాలవూసుకి నేనొచ్చానా యేమిటి? నా గృహకృత్యాలవూసు మీ కెందుకూ?

సౌజ—తొందరపడకండి అవుధాన్లుగారూ. మీరంతాలోచించండి మీ కడుపున పుట్టిన పిల్లయొక్క సౌఖ్యంతాలోచించి సంగతి చెప్పాను గాని నా స్వలాభంతాలోచించి చెప్పలేదు గదా- పెద్దపిల్లకి సంభవించిన అవస్థ మీ కళ్లతో చూడనే చూశారు. యికపైనా వృద్ధులకు పిల్లని కట్టబెట్టడపు ప్రయత్నము చాలించండి

అగ్ని—నా పిల్లవ్యవహారం అంతా మీదైనట్లు మాట్లాడుతున్నారేమిటి? అసలంత మీ కెందుకూ?

సౌజ—నన్ను తమాప్తవర్గంలో చేర్చుకోండి- పరాయివాణ్ణిగా భావించకండి- దయచేసి నా సలహా వినండి- మర్యాదగలయింట పుట్టిన బుద్ధిమంతుడైన కుర్రవాణ్ణి చూసి మీ చిన్నపిల్లని పెళ్లిచెయ్యండి. యిక పెద్దపిల్లమాట- ఆమెను వితంతువు మఠంలో, సంఘసంస్కారసభవారు విద్యాబుద్ధులు చెప్పించుతారు. మీ కడుపున పుట్టినందుకు యెక్కడవున్నా ఆమె సుఖంగా వుండడం గదా తండ్రైనవారు కోరవలసినది. ఆమె తాలూకు కొంత ఆస్తి తమవద్ద వున్నది. మా స్నేహితులున్నూ, స్త్రీపునర్వివాహ సభ కార్యాధ్యక్షులున్నూ అయిన రామయ్యపంతులు గారు నా పేర వ్రాసినారు. ఆ ఆస్తి, చిక్కులు పెట్టక, తాము ఆపిల్లకి పంపించి వెయ్యడం మంచిది.

అగ్ని—యేమిటీముండా యేసుపుసంత! వాడెవడు? వీడెవడు? మీరెవరు? ఆది వర్తి? నా పిల్లేమిటి, పకీరుముండ! రేపు యింటికి వెళుతూనే ఘటశ్రాద్ధం పెట్టేస్తాను.

సౌజ—యిప్పటి ఆగ్రహంమీద మీరు అలా శలవిచ్చినా, నిడివిమీద మీకే కనికరం పుడుతుంది. యిప్పట్లోనే మీరు కనికరిస్తే కొంత మీకు నేను ఉపకారం చెయ్యగలను.

అగ్ని—కనికరంగాకేం. కడుపులో యేడుస్తున్నాననుకొన్నారా? ఆస్తీగీస్తీ యిమ్మంటే మాత్రం యిచ్చేవాణ్ణి కాను ఆ వెధవని పెళ్లిచేసుకోకుండా యిల్లుజేరితే, యింట్లో పెట్టుకుంటాను. అంతే.

కాదు. మేం చిత్తగించాం. సిద్ధులభాషలో దానిమీద బంగారం చేసే యోగం ఒకటి కలకాలంబతికే యోగం ఒకటి వ్రాసివున్నాయి.

రామ—యేవాశ్చర్యం! గురూ భోజనం యేటారగిస్తారు ?

బైరాగి—పాలూ, పంచదారా, అరటిపళ్లములూ, యీప్రకారం ఒకపక్షం ఫలహారం చేస్తాము. మరి పదిహేనురోజులు వాయుభక్షణ చేస్తాము.

రామ—ఒక్క సిట్టకాయితో ఫలారం జాగర్త చేస్తాం గురూ. మా రాంమందిరానికి దయచెయ్యాలి.

బైరాగి—వద- యీవూరి వింతలేవిఁటి ?

లక్ష్మన్న—యేటీలేవ్ - రావఁశంద్రపురం అగ్రహారంలో ముసలబాపనోడు అల్లీ సంపేసినాట్ట. ఆడికీ దొంగసాచ్చీకం పలికి నోళ్ళకీ తాసీలుగోరికీ సిచ్చపోతాదట.

బైరాగి—యీవూరు పాపంతో నిండి వున్నట్టు కనపడుతూంది. యీ వూళ్ళో మేము నిలవము.

రామా—లచ్చన్నుఁడు వెఱ్ఱోడు గురూ. ఆడిమాట నమ్మకండి. మీరెళ్ళిపోతే మాలాటోళ్ళు తరించడం యాలాగ్గురూ? ఆళ్ళీ వూరోళ్లుకారు.

బుచ్చన్న—ఆవూరి దుకాణదారుగారు అదుగో వొస్తున్నారు.

బైరాగి—యీవూళ్ళో తాగడం లావుగావున్నట్టు కనపడుతుంది. మేము తాగుబోతులతో మాట్లాడం- ఆదుకాణదారు వచ్చేలోగా యీసందులోకి మళ్ళిపోదాం రండి (దుకాణదారు పరుగునవచ్చి కలిసి బైరాగి రెంటలలో చెయివేసి పట్టుకొనును)

దుకా—రూపాయలుకక్కి మరీ కదలాలి!

బైరాగి—యేమిటీవాళకం! నీవు తప్పతాగి పేలుతున్నావు - నేను మొదటేచెప్పలేదా. యీవూరి సంగతి? అంతా పాపంతో నిండివుంది! వేమన్న యేమన్నాడు.

“తాగుబోతుతోడ! తగదెందు నేస్తంబు”

రామ—(దుకాణదారుతో) భాయీ! మీకేటి, మతోయిందా? గురువుగోరికి దణ్ణవెట్టి లెంపలోయించుకోండి.

దుకా—గురువూలేదు, గిటాగ్రీలేదు పూసుకోస్సి - యీడెక్కడ గురువు? నాదుకాణంలో సారా అంతా చెడతాగి డబ్బియ్యకుండా యెగిసినాడు.

రామ—మీకు మతోయిందా భాయి? ఆరేటి మీదుకాణంలో తాగడవేఁటి. కాశీ నించి యిప్పుడే ఒచ్చినారుగదా?

దుకా—ఆకాశం బొక్క చేసుకుని వొచ్చాడుకాదూ? (బైరాగితో) డబ్బిచ్చి మరీ కదులు.

బైరాగి—మావంటి సాధులతో నీకు వాదెందుకు అబ్బీ? యవర్నిచూసి యేవను కున్నావో! మమ్మల్ని పోలిన దాసరివాడొకడు, బైరాగి వేషంవేసుకుని యీ దేశంలో తిరుగుతున్నాడు. కిందటిమాటు మేం దేశసంచారం చేసినప్పుడు చూసి చివాట్లుపెట్టాం. నీకు డబ్బుమీద అంత కాపీనంవుంటే తులం రాగి తెచ్చుకో బంగారం చేసియిస్తాం. సంగోరు ధర్మఖర్చుచేసి సంగోరుతీసు. లేకుంటే తల పగిలిపోతుంది.

రామ—యేం యెత్తిసుండాపని చేసినావు భాయీ! బంగారం చేసేసిద్దులికి డబ్బు లచ్చంటాోయి? ఆకికాళ్ళమీదపడి అలకతీసుకోండి.

దుకా—వుండోస్సి- యేడిసినట్టేవుంది. నీ సొమ్మేంపోయింది?

(హెడ్ కనిష్టీబు ప్రవేశించును.)

హెడ్—యేమండోయి గురోజీ! మీరు దొరకడం నాకు దేవుడు దొరికినట్టుంది. ఇక బతికాను. మీతోకొన్ని జరూరు సంగతులు మాట్లాడాలి, రండి.

బైరాగి—భాయీ-మీరు వెనక్కుండండి. (దుకాణదారు తప్పతక్కినవారు దూరముగా వెళ్లుదురు).

దుకా—నాడబ్బిచ్చి మరీ మాట్లాడండి.

బైరాగి—చలుగుకిలోహ మర్యాదతియ్యడం ధర్మవేఁ నాతమ్ముడా? యోగరహస్యాలు పామరుల దగ్గిరా వెల్లడిచెయ్యడం?

దుకా—డబ్బు యెగెయ్యడంపుయోగం వాడగ్గిరపారదు. రహస్యవేఁటి? అవిద్యకి అంతా గుట్టుతే!

బైరాగి—వెఱ్ఱినాయడా! బైరాగివాళ్లకి మాకు డబ్బుమీద పను వుంటుందటోయి? ఒకళ్ళకి యిచ్చేదీకానం - పుచ్చుకున్నదీకానం.

హెడ్డు—భాయీ! నీసూపాయలు నేనిస్తాను. తెలివిమాలిన మాటలాడకు. గురువుగారికి కళ్లమొయ్యా ఆగ్రహావొఁస్తే మనం మండిపోతాం. మీరటుండా, వెళ్ళండి. (బైరాగితో) గురోజీ! ఖూనీకేసు పీకలమీదికొచ్చింది కేసూ, యేబుగ్గిలేనిదే, ఆరాత్రి వాళ్లుచెప్పిందానికి మనం ఆ ముసలాణ్ణి అల్లరి

పెట్టావా? ఆతరవాత, తాసిల్దారొచ్చి "హాల్ హుకూత్" అని బెదిరించి వది రాళ్ళు లాగాడు. తన తాలూకుకంటె పెగిలిందికాదని రావఁప్పంతులుగాడు, యినస్పెక్టరికీ పోలీసు సూపరెంటుకీ అర్జీలుకొట్టాడు. నిజంగా కూనీకేసు జరిగి వుండగా, మేవుఁ కామాపు చేశావఁని తాసిల్దారుమీాదా, నామీాదా యిప్పుడు పితూరీ చేస్తున్నారు.

బైరాగి—మేవుఁండగా మీాకేం భయం, భాయి?

హెడ్డు—అందు నేగదా, నాపాలిటి దేవుఁళ్ళా మీారు దొరికారన్నాను.

బైరాగి—మీాశత్రువులకు వాగ్బంధం చేస్తాను. వాళ్ళ పేర్లు వ్రాసియివ్వండి. యినస్పెక్టరుకి మీామీాద యిష్టవఁని చెప్పేవారేరీ?

హెడ్డు—యీాపెద్ద వుద్యోగస్థులకి దయలూ దాక్షిణ్యాలూ యేవిఁటి గురూ? వాళ్ళకి యెంత మేపినా, వాళ్ళకి కారక్టరు వొస్తుందనిగాని, ప్రమోషను వొస్తుందనిగాని, ఆశపుట్టినప్పుడు, తెగనికత్తితో పీకలు తెగగోస్తారు. మా యినస్పెక్టరికి సూపరెంటుపని కావాలని ఆశుంది. తసీల్దారికీ వాడికి బలవద్విరోధం వుంది. ఆవిరోధం మధ్యనన్ను కొట్టేస్తూంది.

బైరాగి—చూస్తూవుండండి రేపటినుంచి పతకం తిరిగి పోతుంది.

హెడ్డు—మీాదయ, గురూ - సౌజన్యారావు పంతులుగారని ఓ గొప్పవకీలుగారున్నారు ఆయన నాకు చాలాసాయం చేస్తున్నారు. కేసు తేలిపోయేసాధనం ఆయన వొకటి చెప్పారుగాని, అది కుదరక తల్లడిల్లుతున్నాం.

బైరాగి—యేమిటండి, ఆసాధనం?

హెడ్డు—పరారీ అయిపోయిన ఆపిల్లదాని తండ్రి - గుంటూరు శాస్తుల్లని ఒకడు వున్నాడు. అతగాడు దొరికితే, కేసుపోతుంది. వాడు యక్కడా కనపడ్డు.

బైరాగి—యిదెంతపని. రాత్రి అంజనంవేసి ఒక్కక్షణంలో కనుక్కుంటాను.

హెడ్డు—ఆలారక్షించు గురూ. ఆ కుఱ్ఱాడు—అనగా ఆచిన్నది—యిప్పుడు యెక్కడుందో కనుక్కోగలరూ, గురూ?

బైరాగి—అదీ అంజనంలో నే కనబడుతుంది.

హెడ్డు—అది మొగాడయినా, ఆడదయినా కూడా కనపడుతుందా గురూ?

బైరాగి—ఆడది [illegible] అవుతుంది భాయీ?

హెడ్డు—(తనలో) చెబితే యేం ప్రమాదవో! (పైకి) యీచిక్కుల్నించి మరిపో తూంది గురూ. దయచేసండి, యింటికెళదాం.

వైరాగి—యీశిష్యులకి కొంచం జ్ఞానోపదేశంచేసి మరీవస్తాను. మీరు ముందు నడవండి.

హెడ్డు—యీకార్యం అయిందాకా మీపాదాలు వొదలను - కార్యవైతే తమరు హరిద్వారంలో కట్టిస్తూన్న మతానికి నూటపదహార్లు దాఖలుచేస్తాను.

(అందరూ నిష్క్రమింతురు.)

---

## ౨వ స్థలము, డెప్యూటీకలెక్టర్ కచేరీ.

——:)o(:——

[డిప్టీకలక్టరు, వకీళ్ళు, బంట్రౌతులు, మొదలైనవారు ప్రవేశింతురు.]

భీమారావు—నాకు మునసబుకోర్టులో కేసున్నది, వొక అర్జీ దాఖలుచేసి శలవు పుచ్చుకుంటాను.

కలెక్టర్—కోర్టువారికి అవకాశం అయేవరకూ వుండలేని వకీళ్ళు కేసు యెందుకు దాఖలుచేయవలె? ఇది చెప్పినట్లల్లావచ్చే కోర్టనా మీయభిప్రాయం.

భీమా—చిత్తం, చిత్తం, తమ ప్రిడిశెసర్లు అలాగు గడుపుతూవచ్చేవారు.

కలె—ఆఫీస్‌పని చూసుకుని పిల్చేవరకూ ఉండండి.

అగ్నిహో—(రామప్పంతులుతో) యేమండోయ్ మన కొత్తవకీల్ని కోప్పడు తున్నారే?

రామప్ప—(అగ్నిహోత్రావధానులుతో) యీ అధికార్ల నైజం యేమిటంటే యెవళ్ళ మీద దయవుండి యెవళ్ళపక్షం కేస్‌చెయ్యాలంటే వాళ్ళని కరవ్వొచ్చినట్టు కన పడతారు, మీరు కోరట్లసంగతంతా తెలుసునంటారే? యిదేనా మీఅనుభవం?

అగ్నిహో—(గట్టిగా) అవునవు న్నాకు తెలుసును.

కలె—యెవరా మాట్లాడుతున్న మనిషి?

నాయుడు—(లేచి) తక్‌షీర్ మాఫ్ చేస్తే మనవిచేస్తాను. యీయన కృష్ణారాయ పురం అగ్రహారీకులు, అగ్నిహోత్రావధాన్లుగారు; మహా

(అ)యోగ్యమైన బ్రాహ్మణుడు, జటాంతస్వాధ్యాయి, యీయనే లుబ్ధావధాన్లుగారికి తనకొమార్తెను వర్ధని మిదివందల రూపాయలకు, కన్యాదానం చేయడానికి బేరమాడుకుని, కాబోయే అల్లుడికి. దేహశుద్ధి చేశారు; అందుకే యీమధ్య లుబ్ధావధాన్లుగారు యేలినవారి కోర్టులో ఛార్జి దాఖలు చేశారు. అందులో ముద్దాయీ యీ మహానుభావుడే! మల్లవరంలో సహస్రమానజీవైన వక బ్రాహ్మణశ్రేష్ఠుడుంటే ఆయనకు తన పెద్దకుమార్తెను కన్యాదానం చేసి, రెండుపిల్లికూనలు స్వీకరించేటప్పటికి పెళ్లిలోనే ఆ బ్రాహ్మడిపుణ్యం అంతా మూడి పరంపదం చేశాడు. ఆపిల్లదాని తరఫున భూములకొరకు దావా తెచ్చారు. మీరు తమవంటి గవర్నమెంట్ ఆఫీసర్లకి తరుచుగా పనిగలుగచేసి ప్లీడర్లని పోషిస్తావుంటారు, వీరి యోగ్యత, లేమి, వీరిదయాంతఃకరణ, లేమి, వీరిసరసత లేమి, మరియెన్నడము వకు శేషుడికైనా అలవికాదు. వారితరఫున కేసు దాఖలుచెయ్యడంకోసమే భీమారావు పంతులుగారు కోర్టుకు దయచేశారు. (విరసముగానవ్వి కూరుచొనును.)

కలె—బలేశాబాష్ (గుమాస్తాతో) ఏదీ భీమారావు పంతులుగార్ని ప్రియాదు అర్జీ దాఖలు చేయమను. (గుమస్తా పుచ్చుకొని దాఖలు చేయును)

కలె—(కాగితమందుకొని) యేమిటయ్యా కేసుస్వభావం?

భీమా—చిత్తం, యీయన వెధవకొమార్తెని, యీయన కొమారుడికి చదువుచెప్పే గిరీశం అనేఆయన అలంకారాలూ, ఆస్తీతో కూడా లేవతీసుకు వెళ్లిపోయినాడు.

అగ్నిహో—దస్తావేజులూ, కోర్టుకాయితాలూ కూడానండి.

కలె—యేమిటి! ఆ, హా, హా, హా, హా, (నవ్వుచు బూట్సు నేలపైతట్టును) బలే శాభాష్ (అర్జీచూచుకొని) యిన్నాళ్లేమి చేస్తున్నారు?

భీమా—తహశ్సీల్దార్ గారివద్దర నేరంజరిగిన మూడోరోజునే మున్సబుకోర్టు వకీలు వెంకట్రావుపంతులుగారు, ఛార్జీ దాఖలుచేస్తే ఆ తహశ్సీల్దారుగారు కేస్ స్వభావం యేమిటని అడిగినారు. ఎబ్ డక్ షన్ .అని వెంకట్రావు పంతులుగారు చెప్పేసరికి యింగ్లీషు రాకపోవడంచాత, తహశ్సీల్దారుగారు ఆమాటయెప్పుడూ వినలేదనిచెప్పారు. తరవాత కేస్ స్వభావం తెలుగునచెప్తే యీలాటి నేరం మా జూరిస్ డిక్షన్‌లో జరగదు. తోవలో రోడ్డుమీద యేతాలూకా సరిహద్దులో

యెత్తు పోయివాడో అని అర్జీ దాఖలు చేసుకున్నారుకారు. ఉద్ధావధాన్లగారి ఖూనీకేసు కామాపు చేసిన హన్సీల్దారుగారే యీయనండి.

నాయుడు—ఇంగ్లీషు రాకపోతే నేమండి? తహసీల్దారుగారు యెంతప్రాజ్ఞులు. పూర్వపు యూరోపియన్ అధికార్లని యెంతమందిని మెప్పించారు! ఆయన ఉద్ధావధాన్లగారి కేసు కామాపు చేశారని భీమారావు పంతులుగారు అంటున్నారు. యింకా యిన్వెస్టిగేషన్ అవుతూవున్న కేసుగా! అలా అన్నందుకు యీయనపైని తహసీల్దారుగారు తమకువున్నష్టం ఛార్జి తేవడమునకు వీలువున్నది.

కరె—(భీమారావువైపు జూచి) పిల్లకు పదహారు సంవత్సరములకు లోపుయీడని రుజువున్నదా?

భీమా—జాతకంవుందండి.

నాయుడు—కోర్టువారు ఆజాతకం దాఖలు చేసుకోవాలి.

భీమా—యీ కేసులో ఆయన మాట్లాడుతూవుంటే నే ఎంతమాత్రం వొప్పేదిలేదు.

నాయుడు—యీ కేసులో నాకున్నూడా వకాల్తినామా వుందండి (అని దాఖలు చేయును.)

భీమా—(అగ్నిహోత్రావధాన్లుగారితో) ఏమయ్యా యీయనక్కూడా వకాల్తీ యిచ్చావయ్యా.

అగ్నిహో—మొదటా, రామప్పంతులు యీయన కిప్పించారు.

భీమా—(అగ్నిహోత్రావధాన్లుగారితో) అయితే యేడువు.

(అగ్నిహోత్రావధాన్లు తెల్లపోయి చూచును.)

కరె—యేదీ జాతకం దాఖలు చెయ్యండీ

(భీమారావుపంతులు దాఖలు చేయును.)

నాయుడు—కోర్టువారితో వకసంగతి మనవి చేసుకుంటాను. యీజాతకం విశ్వామిత్రుడంత యోగ్యుడైన బాలిష్మాడిచేత తయారు చెయ్యబడ్డది. అదుగో ఆమూల నిలబడ్డ రామప్పంతులుగారికి యీ జాతకంలో మంచిప్రవేశం వుందండి.

భీమా—నేను పేన్డ్ వకీల్ని. కేసు హీరింగు నేనే చేయవలెనుగాని, నాయుడుగారు చేస్తే నే నెంతమాత్రం వొప్పేదిలేదు.

నాయు—ష్టాలెట్ దొరగారిదగ్గిరున్నించీ యేజన్సీ కోర్టులలో వకాల్తీ చేస్తున్నాను. డబ్బుచ్చుకున్నందుకు నమ్మకముగా మాటలు చెప్పితీరుతానుగాని యింగ్లీష్

చదువుకున్న కొందరువకీళ్ళలాగ నోటంట మాటొస్తేకుండా కొయ్యలాగ నిల బడనండి.

కలె—(అగ్నిహోత్రావధానులవైపుజూచి) మీ కొమార్తె, యేసంవత్సరమందు పుట్టిం దయ్యా?

అగ్ని—అంగీరస.

కలె—జాతకంలో భావవుందే? బ్రాహ్మణ్యం పరువంతా తీసేస్తి రే. గడ్డితిని పిల్లనమ్ము కున్నావు సరే కాని, యీలాటి ఫోర్జరీలుకూడా చేయిస్తావూ? బ్రాహ్మల్లో వున్నంత, ఖంగాళీ, మాలకూడూ మరెక్కడా లేదు. నీదుర్మార్గతవల్ల నీకుమార్తెను యీ అవస్థలోకి తెచ్చి మళ్ళీ ఎబ్డక్షన్ కేసుకూడానా? నీపాట్ట కరిగించేస్తా నుండు. (గుమస్తాతో) కేసులో నోటీస్లు చెయ్యి.

గుమా—(ఛార్జీకాగితముజూచి) యిందులో ముద్దాయీ యింటిపేరూ సాకీనూ లేదండి.

నాయు—(లేచి) యీ ఆర్జీ వల్లకాట్లో రామనాధాయ వ్యవహారం లాగుంది. ఇంగ్లీషు వకీళ్ళు దాఖలుచేసే కాకితాలు యీరీతినే వుంటాయండి.

భీమా—(గుమస్తాతో రహస్యముగా) తరవాయీలు నింపించలేదటయ్యా? (పైకి) యీలా నాయుడుగారు నన్ను తూలనాడుతూంటే కోటువారు ఊరుకోడం న్యాయంకాదు.

కలె—నాయుడుగారు మిమ్మల్నేమీ అన్లేదే?

భీమా—(తనలో) యిక్కడికి నేనురావడం బుద్ధిపొరపాటు.

క్లార్కు—(భీమారావు పంతులుగారితో) ఇంటి పేరూ, సాకీనూ యేమిటండీ?

భీమా—(అగ్నిహోత్రావధాన్లుగారితో) ఏమిటయ్యా?

అగ్ని—ఆయనపేరు గిరీశం, మరంతకంట నాకు తెలియదు.

కలె—చాబాష్; బాగావుంది! అవధాన్లుగారి కొమార్తెని యెవడో తీసుకుపోయి నాడు. కనక వాడి పూరా పేరూ యెరిగినవాళ్ళు తెలియచెయ్యవలసినదని, దండోరాకొట్టించి గేజట్లో వేయించండి. పోలీసువారికి యెందుకు నోటీసివ్వ లేదూ! సాకీనూ మొదలైనవి లేనిదీ కేసు యడ్మిట్ చెయడానికి వీలులేదు. టిఫిన్కి వేళయింది లేదాము (అనిలేచి వెళ్ళిపోవును.)

అగ్నిహో—(భీమారావు పంతులుగారితో) ఏమండోయ్ కేసు అడ్డంగా తిరిగిందే ?
(భీమారావు పంతులుగారు మాట్లాడరు.)
అగ్నిహో—యేమండోయి మీతోటి, మాట్లాడుతున్నాను.
భీమా—ఇచ్చినఫీజూను పనైపోయింది; మళ్ళీ ఫీజిస్తే నేకాని మాట్లాడేదిలేదు.
అగ్నిహో—యేంపనైంది అఘోరంపని ? కలక్టరు చివాట్లు పెడుతూంటే ముంగిలా మాట్లాడక వూరుకున్నావు !
భీమా—బంటోత్ ! యితన్ని నాదగ్గిరికి రాకుండా గెంటేయ్.
అగ్ని—ఓహో బాగుంది వ్యవహారం ! రామప్పంతులేడీ ?
నాయుడు—(మెల్లగా వెనుకనుండివచ్చి) పోర్జరీమాటరాగానే సన్నసన్నంగాజారారు యీపాటికి వారివూరికి సగందోవలోవుంటారు.
అగ్ని—అయ్యో కొంపతీశాడే!
నాయుడు—ఇంగ్లీషువకీలు సరదాతీరిందా ? పోర్జరీకి తమకూడా మతప్రవేశం అవుతుంది.

అగ్ని—అయ్యో నీయింట కోడికాల్చా.
నాయుడు—గోజా కాలుస్తూనేవుంటారు.

(తెరదించవలెను.)

---

## 3-వ స్థలము. సౌజన్యారావు పంతులుగారి కచేరీగది.

—:0:—

[సౌజన్యారావు పంతులుగారూ, పోలిశెట్టి ప్రవేశింతురు.]

సౌజ—చూశారా శెట్టిగారూ యిప్పటిరోజుల్లో దేవబ్రాహ్మణభక్తి కోమట్లలోనే వున్నది, లుబ్ధావధాన్లుగారు బ్రాహ్మలు, వృద్ధులున్నూ - ఆయనను కాపాడితే మీకు చాలా సుకృతం వుంటుంది.
పోలిశెట్టి—బాబు- తమశెలవు కబ్బెంతరవేఁటి ?
సౌజ—చూశారా, మీరు సాక్ష్యంచెప్పి ఆయన్ని యీ ఆపదలోనుంచి తప్పించక పోతే, నిజం దాచినందువల్ల ఆయనకి యేమి ప్రమాదం వచ్చినా, ఆపాపం మిమ్మల్ని చుట్టుకుంటుంది.

పోలి—అబ్బెంతరవేఁటి ? బాబూ!

సౌజ—నిజంగా కూనీ జరగలేదని మీనమ్మకవేఁకదూ?

పోలి—అబ్బెంతరవేఁటి ? బాబూ!

సౌజ—ఆపిల్ల గోడదాటి పారిపోవడం మీరు చూశారుగదూ?

పోలి—అబ్బెంతర వేఁటిబాబూ ?

సౌజ—మీరు అప్పుడు గుడ్డెమీదికి బాహ్యానికి వెళ్ళివున్నారా ?

పోలి—అబ్బెంతరవేఁటి బాబూ ?

సౌజ—మీరు బాహ్యానికి వెళ్ళినప్పుడు, సహాయానికి మీ నౌఖరునుకూడా తీసుకు వెళ్ళారు?

పోలి—అబ్బెంతరవేఁటి బాబూ?

సౌజ—(కలంకాగితంతీసి) యీసంగతులే వ్రాస్తాను. చెప్పండి.

పోలి—యేటిబాబూ ?

సౌజ—మీరు చెప్పబోయే సాక్ష్యానికి స్టేటుమెంటు కట్టుగుంటాను, జరిగినది అంతా చెప్పండి - వ్రాస్తాను.

పోలి—మా యింట్లోళ్ళకి ఉడ్డోలవైన జబ్బుగావుందని కబురెట్టారు. బాబూ. నాకు సేతులు కాళ్ళు ఆడకుండున్నాయి. బండీ కుదుర్చుకొచ్చాను - శలవిప్పించండి- యీ సాచ్చీకాల్లో తిరిగితే పిల్లాపేకా బతుకుతారా బాబూ?

సౌజ—యింతసేపూ చెప్పారుకారేమి? రుగ్మతనిజమే ఐతే చాలవిచారమైన సంగతి- మీకు సాక్ష్యం యలాగా తప్పదు. చెప్పేమాటలు ముందు వ్రాసుకుంటే మంచిది. లేకుంటే బోనెక్కినతరవాత తత్తరపడిపోతారు, పదినిమిషములు పట్టదు. చెప్పండి వ్రాస్తాను.

పోలి—సాచ్చీకం తప్పదు బాబూ ?

సౌజ—యలా తప్పుతుంది ? నిజం తెలిసినవారు సాక్ష్యం పలకకపోతే మరియెవరు పలుకుతారు?

పోలి—బాబూ- తమరు పెద్దవారికిలూ, కోవఁటోడి మాటని కొట్టెయలే, యింటారా?

సౌజ—వినకేమి

లి—నిజవేఁటిబాబూ? అబద్దవేఁటిబాబూ? శేచు చూసి నిజవాఁ చెప్పేనాను ? సట్టిమీదికేటి నిశిరాత్రేళ నేను సైటకెల్దవేఁటి? జువ్వి చెట్టుమీద పిశాచం అమాంతంగా సంపేసిపోదా! బాబూ? యేటిబాబూ సాచ్చీకానికి ముండ పోలి శెట్టి పోలిశెట్టే సెప్పాలా సాచ్చీకం బాబూ? తమంటి అధికార్లనిచూస్తే, పాణం యెగిరిపోతుందిగదా ? తమరు తలిస్తే సాచ్చీకానికొఁదవా ? బాపనోళ్లు నచ్చాపనచ్చులు. కొంసం సెయితడిజేస్తే సాచ్చీకం చెప్పేసిపోతారు బాబూ—

జ—యీపాటి చాలించండి. దొంగసాక్ష్యాలు నాదగ్గిర పనికిరావు. నిజంతెలి సిన సాక్షులే నాకు కావాలి.

లి—ఆపాటిమాట యెవరు సెప్పినారుకారు బాబూ, నిజం నాకేమీతెల్దు, యేదే వుఁడు నెత్తికొట్టమంటే ఆ దేవుఁడు నెత్తికొడతాను బాబూ.

జ—మరి యెరుగుదునఁని యెందుకు చెప్పారూ?

లి—బాబూ, సెప్పనంటే కనిష్టీబోళ్లు ఊరుకున్నారా?

జ—యిప్పుడుమాత్రం వూరుకుంటారా?

లి—చెప్పితే, యిన్నీ సిపికటరు పీకపిసికెయ్దు బాబూ !

జ—చెప్పకపోతే హెడ్డుకనిష్టీబు పీకపిసికడా?

లి—అధికార్లేటి చెయ్మంటే, పాలాటోళ్లు అపల్లా సెయ్యాలిగదా బాబూ - లేకుంటే పీక్కుఁరిగదా? "పోలిశెట్టి, సాచ్చీకం సెప్పాలి" అని హేడ్డుగారంటే, సిత్తం బాబూ అనాలి ; "పోలిసెట్టి, కబడదారు, సాచ్చీకం చెప్పితే సంపేస్తాను," అని యిన్నీసిపికటరుగారు అంటే, సిత్తం బాబూ అనాలి. "హేట్టు గారిని బదిలీ చేస్తాం, మరి భయపడకు," అంటే, సిత్తం బాబూ అనాలి. ఆరాత్రి నే నూళ్లోవున్నానా బాబూ? లింగోరం సంతకి పోలేదా?

శా—మీసాక్ష్యాన్ని, నమ్ముకుని, లుబ్ధావధాన్లు గారికి నేను ధైర్యం చెప్పానే ?

లి—గొప్పధికార్లు ! తమరు తలుస్తే ఆరికి నోటేటి బాబూ? కొవిఁటాడి మాటకో టెయ్యఁండి బాబూ, తమవంటోరుతలిస్తే బాపన సాచ్చీకాలు నచ్చాప నచ్చులు,

జ—మీయోగ్యత తెలిసింది. చాలు, యీపాటి వెళ్లండి.

లి—(లేచినిలబడి) కోపవాఁబాబూ? మేం బతగ్గలవాఁ? అవుసెయ్యి బాబూ గుసగుసలాడేది పరితోరం పంపించుతున్నా బాబూ?

సౌజ—మీాయిన స్పెక్టరికి పంపండి.

బొలి—(వెళ్ళిపోతూ) ఆరంతోరుఆరూ; తమంతోరు తమరూ. మాకిద్దరొహటిగాదా!

సౌజ—చాలును వెళ్ళండి, వెళ్ళండి.

పోలి—తమకోపవొస్తే, బతగ్గలవాఁ బాబూ. (గుమ్మందాటి) బతికా్రనా దేవుఁమ! పెందరకాళె యింటికిపోయి యెంక టేళ్ళర్లుకి, అరళటాకు నెయ్యి దివ్వెలిగిస్తాను.

(నిష్క్రమించును.)

---

## ౪_వ స్థలము, వీధి.

[అగ్నిహోత్రావధాన్లు, నాయడు ప్రవేశింతురు.]

అగ్ని—అయితే కేసు మానుకొమ్మంఛారూ?

నాయడు—లేకపోతే మీకు చాలా వుపద్రవం సంభవిస్తుంది. ఆయింగిలీషు వకీలు అంతా పాడుచేశాడు.

అగ్ని—అయితే రావఁప్పంతులు వుడాయించేసినట్టేనా?

నాయడు—అందుకు సందేహావేఁవిటి?

అగ్ని—నాకడియం, పట్టుకుపోయి తాకట్టుపెట్టాడు?

నాయడు—దానికి నీళ్ళధారే.

అగ్ని—అయ్యో! ఆకడియం మాతాతనాటిది. మీరు మొన్నదిడ్డీలోవంట వొచ్చారే ఆసొందానియింట్లో తాకట్టుపెట్టాడు.

నాయ—రామ! రామ! ఆసరుకు దానిదగ్గిర వుంచేలేదు. మీాది మిక్కిలి దాని తొలూకుకంటె వకటి వాడే తీసుకుపోయి యక్కడో తాకట్టు పెట్టాడు. ఆ తొగుబోతు మీకేలా దొరికాడు?

అగ్ని—రావఁప్పంతులు తాగుఛాడా?

నాయు—మరి కడియం, కంటెకూడా తాగేశాడుకాడా?

అగ్ని—పీడిసిగతర

